## సి.ఐ.ఐ.యల్ వారి జాతీయ సదస్సు





# వివిధ భాషా సాహిత్యాలు - సాంస్కృతిక పరివర్తన

## భావ వీణ ప్రత్యేక సంచిక

అంతర్జాతీయ తెలుగు సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక భాషాధ్యయన మాస పత్రిక

Vol. 13 ISSUE NO. 8 MONTHLY AUG 2017

ISSN NO. : 2456 - 4702





# వివిధ భాషా సాహిత్యాలు సాంస్కృతిక పరివర్తన

## భావ వీణ ప్రత్యేక సంచిక

గౌరవ సంపాదకులు :

**రెవ.బ్రదర్ టి. బాలశౌరి**

ప్రిన్సిపాల్ :

వి.యస్. సెయింట్ జాన్స్ మాధ్యమిక ఉన్నత పాఠశాల, గన్నవరం

**డా॥ గుమ్మా సాంబశివరావు,**

వైస్ ప్రిన్సిపాల్, ఆంధ్రలయోలా కళాశాల, విజయవాడ

**డా॥ కొడాలి రాజేశ్వరి,**

అడ్మినిస్టేటివ్ డైరెక్టర్, వి.కె.ఆర్. కళాశాల, గన్నవరం

ప్రధాన సంపాదకులు :

**టి.వి. రమణ మూర్తి, కంకట సుబ్బారావు**

**డా॥ పి.వి.బి. సంజీవరావు**

సంపాదక మండలి :

**డా॥ యన్.వి. కృష్ణారావు**
**డా॥ఏ.వి. రమణ మూర్తి**
**డా॥ టి. సత్యనారాయణ**
**శ్రీ గొడవర్తి గోవిందయ్య**
**డా॥ బి. వెంకట స్వామి**
**డా॥ రూబి శశికళ**
**శ్రీ డి. శ్రీనివాసరావు**



సహాయ సంపాదకులు :

శ్రీ కె.యస్.యన్. రామానుజులు
శ్రీమతి డి. రమాదేవి, శ్రీమతి వాణి,
శ్రీమతి ఆది లక్ష్మి, శ్రీమతి రోజ్‌మేరి గోల్డ్,
శ్రీ ఎ.తిరుపతి రెడ్డి, శ్రీ పివియస్ కిషోర్
శ్రీ మతి విజయ కుమారి,
శ్రీమతి సుమలత

తెలుగు ఉపాధ్యాయులు, వి.యస్. సెయింట్ జాన్స్ మాధ్యమికోన్నత, పాఠశాల

# ఆదికవి నన్నయ్య విశ్వవిద్యాలయం

రాజ రాజ నరేంద్రనగర్, యన్. హెచ్. 16(5), రాజమహేంద్రవరం - 533 296.

తూర్పుగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా



తేది : 05-08-2017

## అభినందనలు

ప్రపంచ దేశల్లో భారతీయ సంస్కృతి సర్వోన్నతమైన సంస్కృతిగా విరాజిల్లుతుంది. అలాగే భారతీయ భాషలు కూడా తమ ప్రత్యేకతను, ప్రాధాన్యతను కాపాడుకుంటూ అపారమైన సాహిత్య సంపదతో సమాజ వికాసానికి సారధిగా ఉంటు ప్రవాహగమనంతో వికాస దశలోనే పయనిస్తున్నాయి. శతాబ్ధాల చరిత్రగల మనసాహిత్యాన్ని ఒక్కసారి పరిశీలిస్తే అపారమైన అన్యభాషాపదాలు ఆదానప్రదానాలుగా ఎన్ని వచ్చి చేరినా మన భాషా సంప్రదాయాలు సుస్థిరంగానే ఉన్నాయి. కాలగమనంలో ఎన్ని మార్పులు వచ్చినా భిన్నప్రక్రియలతో అసలుభాషాస్థితి అలాగే కొనసాగం మన భారతీయ భాషల ప్రత్యేకత.

భాష పరిణామ శీలం గలదని భాషా శాస్త్రవేత్తల అభిప్రాయం. సాంస్కృతిక సామాజిక పరివర్తనల వల్ల భాషల్లో మార్పులు రావడం సహజం. అటువంటి మార్పులు అన్య భాషల్లో ఎలావచ్చాయో, వాటి ప్రాధాన్యత ఏమిటో తెలుసుకొనే ప్రయత్నంలో భాగంగా "అన్యభాషలలో సాంస్కృతిక పరివర్తన- ప్రాముఖ్యత" అనే అంశం మీద ఏర్పాటు చేసిన రెండు రోజుల జాతీయ సదస్సును నిర్వహించిన యాజమాన్యాన్ని అభినందిస్తున్నాను. అలాగే సాహిత్య సాంస్కృతిక జీవన విధానంలో వచ్చిన మార్పులు, దానికనుగుణం వచ్చిన భాషా పరివర్తన వంటి అంశాలపై పరిశోధకులు సమర్పించిన వ్యాసాలను ఒక సంకలనంగా అందించిన మీ కృషిని శ్లాఘిస్తూ ఇంకా ఇటువంటి సదస్సులను నిర్వహించిన యాజమాన్యాన్ని అభినందిస్తున్నాను. అలాగే సాహిత్య సాంస్కృతిక జీవన విధానంలో వచ్చిన మార్పులు, దానికనుగూణంగా వచ్చిన భాషా పరివర్తన వంటి అంశాలపై పరిశోధకులు సమర్పించిన వ్యాసాలను ఒక సంకలనంగా అందించిన మీ కృషిని శ్లాఘిస్తూ ఇంకా ఇటువంటి సదస్సులను నిర్వహించి మన సాహిత్య సాంస్కృతిక పరి రక్షణకు కృషి చేస్తారని మనసారా ఆశిస్తున్నాను.

Dr. N. V. KRISHNA RAO,
M.A., M.Phil., Ph.D.,
Asst. Professor Dept. of Telugu & O.S.
Acharya Nagarjuna University
GUNTUR (DIST) A.P.

ఇట్లు

[signature]

# అపూర్వం

జాతీయ సదస్సులు చాలా జరుగుతూ ఉంటాయి. సాధారణంగా విశ్వ విద్యాలయాలు, కళాశాలలు, ప్రత్యేక సంస్థలు ఈ సదస్సులు నిర్వహిస్తూ ఉంటాయి. కాని నాకు తెలిసి సాహిత్యపరంగా ఒక మాధ్యమికోన్నత పాఠశాల జాతీయ స్థాయి సదస్సును నిర్వహించడం ఇదే ప్రధమం. ఈ కీర్తి వి.యస్. సెయింట్ జాన్స్ మాధ్యమికోన్నత పాఠశాలకు దక్కడం అభినందనీయం. సాహిత్య సదస్సు నిర్వాహణ అంటే ఒక యజ్ఞం నిర్వహించడమే. ఒక చక్కటి ప్రణాళికతో ఆయా అంశాల మీద సాహిత్యపరమైన అధికారం కలిగిన ఆచార్యులను, పరిశోధకులను, ఉన్నత పదవులలో ఉన్న వ్యక్తులను ఆహ్వానించి ఈ సదస్సును నిర్వహిస్తున్న వారిని ప్రసంశిస్తున్నాము. ముఖ్యముగా నా విద్యార్ధి కంకట సుబ్బారావు, అతని సహోపాధ్యాయులు నా సాహితి మిత్రులు టి.వి. రమణ మూర్తిగారు ఈ సదస్సు రధానికి రెండు చక్రాలుగా ఉండి ఈ కార్యక్రమాన్ని నిర్వహించడం మెచ్చుకోదగిన విషయం. ఆయా ఉపన్యాసాలు వాగ్రూపంలో ఉండిపోకుండా, గ్రంధరూపం అందించడం ఎంతో సంతోషం, ఈ కార్యక్రమానికి అన్ని విధాల వెన్నుదన్నుగా ఉండి, స్వేచ్ఛగా నిర్వహించే అవకాశాన్ని ప్రసాదించిన పాఠశాల ప్రిన్సిపాల్ రెవ.బ్ర. టి. బాల శౌరి గారికి, వైస్ ప్రిన్సిపాల్ రెవ.బ్ర. జేసురాజు గారికి మరియు రెవ.బ్ర. జిమ్మి కురియో కోసే గారికి సాహిత్య లోకం పక్షాన కృతజ్ఞతలు తెలుపుచున్నాను. ఈ జాతీయ సదస్సు విజయవంతంగా ఆకాంక్షిస్తూ ......

గుమ్మా సాంబశివరావు



డా॥ తరపట్ల సత్యనారాయణ,
సహాయాచార్యులు, తెలుగుశాఖ,
రాజరాజనరేంద్ర నగర్,
ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం
రాజమహేంద్రవరం 533 296, ఆంధ్రప్రదేశ్.
Cell : 9290630752, E-mail : dr.tsnarayana@gmail.com



తేది : 05-08-2017

# మీ కృషి ప్రశంసనీయం

శాస్త్ర సాంకేతిక రంగాల్లో పురోభివృద్ధిని సాధిస్తూ ప్రతీదేశం తన ప్రత్యేకతను చాటుకోవడానికి చేస్తున్న ప్రయత్నాలు, ప్రయోగాలు మనం చూస్తున్నాం. కాలానుగుణమైన మార్పులను కూడా మనం గమనిస్తూ ముందుకు సాగిపోతున్నాము. పైగా ఇది ప్రపంచీకరణ యుగమంటూ ప్రచారాన్ని విస్తృతం చేస్తూ నేను, నాదీ అంటూ వ్యక్తిగత శ్రేయస్సును యశస్సుగా భావించి సమాజ శ్రేయస్సును, సమాజ హితాన్ని పట్టించుకోకుండా శరవేగంగా దూసుకుపోతున్నాం. ఇది అభివృద్ధి చెందిన దేశంలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశంలోను మనం గమనిస్తున్న పరిస్థితి.

ఈ సందర్భంలో బహుళ ప్రయోజనాలను ప్రక్కనపెట్టి బహుభాషల స్థితిని గురించి, మన సంస్కృతీ సంప్రదాయాల్లో వస్తున్న మార్పులను గురించి ఒకసారి ఆలోచించే ప్రయత్నం చేద్దాం. ప్రపంచ దేశాల్లోని ప్రధాన భాషలను గమనిస్తే ఆయా దేశాలు తమ సంస్కృతీ సాంప్రదాయాలతోపాటు భాషా సాంప్రదాయాలను పరిరక్షించుకుంటూ, వస్తున్న మార్పులకు తగ్గట్టుగా కాలానుగుణంగా తీర్చిదిద్దుకుంటూ వినియోగ భాషగా నిలబెట్టుకుంటున్న తీరు కడుప్రశంసనీయం. భావితరాన్ని దృష్టిలో పెట్టుకుని వారు రచిస్తున్న ప్రణాళికలు ఆభాషాసంస్కృతిని కాపాడుకోవడానికి ఉపయోగపడుతున్నాయని మనం విశ్వసించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆయా దేశాలు వారసత్వ సంపదగా భాషా సంస్కృతిని కాపాడుకుంటున్న తీరు మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఇప్పుడు మన భారతీయ భాషల పరిరక్షణ తీరును గమనిస్తే కొన్ని భాషా సంస్కృతులు ప్రమాద రేఖకు దిగువన ఉన్నాయని యెనెస్కో ప్రకటించే వరకు మనకు మెలుకువ లేదంటే ఎంత ఆశ్చర్యం కలుగుతుంది. అందులో తెలుగు భాషకూడా చేరడం దురదృష్టకరం. నవ్యాంధ్ర ఏర్పడి ఇప్పటివరకు మన అధికార భాషా సంఘం పునఃనిర్మాణం జరగకపోవడం దురదృష్టకరం. ఇటువంటి సమస్యలు రేకెత్తిస్తున్న తరుణంలో చల్లని ఉపశంలా **"అన్యభాషల్లో సాంస్కృతిక పరివర్తన - ప్రాధాన్యత"** అనే అంశం మీద జాతీయ సదస్సు నిర్వహించడం దానికి దాక్షిణాత్య భారతీయ భాషా సంస్థ సహకారాన్ని అందించడం ఆనందించదగ్గ విషయం. ఈ సందర్భంలో మిత్రులు కె. సుబ్బారావు గారు, టి.వి. రమణమూర్తి గారు, ఈ వ్యాస సంకలనాన్ని తీసుకురావడంవల్ల అనేక పరిశోధకులకు ఇది ఎంతగానో ఉపయోగపడుతుందని ఆశిస్తూ ఇక ముందుకూడా ఇటువంటి అనేక సదస్సులు నిర్వహించాలని మనసారా కోరుతున్నాను.

ఇట్లు

(డా॥ తరపట్ల సత్యనారాయణ)

# తొలి పలుకులు

ఆంధ్ర రాష్ట్రంలోనే అత్యంత ప్రశస్తిగన్న వి.యస్. సెయింట్ జాన్స్ మాధ్యమికోన్నత పాఠశాల మరియు శ్రీ వేములపల్లి కోదండరామయ్య విద్యా సంస్థల స్వర్ణోత్సవ సంబరాలలో భాగంగా, నేటి బాలలను రాబోయే తరం ఉత్తమ పరిశోధకులుగా తీర్చిదిద్దాలనే తలంపుతో " భారతీయ భాషాధ్యయన సంస్థ " తో సంయుక్తంగా "అన్య భాషలలో సాంస్కృతిక పరివర్తన - ప్రాముఖ్యం" అనే అశంపై రెండు రోజుల జాతీయ సదస్సు నిర్వహించాలని వివిధ విశ్వ విద్యాలయ, కళాశాల అధ్యాపకులను ఆహ్వానించాము. నిజానికి మేము 100లోపు వ్యాసాలు వస్తాయని బావించాము. కాని, మా ఊహకు మించి అధిక సంఖ్యలో వ్యాసాలు రావడం మాకొక్కింత సంతోషదాయకమే అయిన, ఇన్ని వ్యాసాలను ఇంత తక్కువ వ్యవధిలో పుస్తకరూపంలో తీసుకురావడం. సాధ్యమేన? అనే సదేహం కలిగింది. కాని మా ఎల్లవేళలా వెన్నుదన్నుగా నిలిచి మమ్ములను ప్రోత్సహించి మా పాఠశాల ప్రిన్సిపాల్ రెవ.బ్ర. టి. బాల శౌరి , వైస్ ప్రిన్సిపాల్ రెవ.బ్ర. జేసురాజు మరియు రెవ.బ్ర.జిమ్మి కురియో కోస్‌ల తోడ్పాటు, మాకు అత్యంత ఆత్మీయులు అయిన డా॥ గుమ్మా సాంబశివరావు గార్ల ప్రోత్సాహం మా ఆలోచన కార్యరూపం దాల్చడానికి సహకరించిన వి.కె.ఆర్. కళాశాల ప్రిన్సిపాల్ డి. శ్రీనివాసరావుగారు, డా॥ కొడాలి రాజేశ్వరిగారు మరియు అధ్యాపకుల ప్రోత్సాహం వెరసి అధ్భుతమైన "వివిధ భాషాసాహిత్యాలు- సాంస్కృతిక పరివర్తన అనే వ్యాస సంకలనం.

సమయభావం కారణంగా ఈ వ్యాసాలను వర్గీకరించి ఒక క్రమ పద్ధతిలో పెట్టడానికి మాకు అవకాశం లేకుండా పోయింది. పరిశోధకవ్యాసాలను పంపిన వాళ్ళు చాలా మంది పుటల పరిమితిని పాటించలేదు. వారి పంపిన వ్యాసాలను యధాతథంగా ప్రచురించాలని ఆకాంక్ష మాకున్నప్పటికీ గ్రంధవిస్తార బీతి కారణముగా పుటల పరిమితికి పైబడిన వ్యాసాలను కుదించడం జరిగింది. నిజానికి వ్యాసకర్తల ప్రతి అక్షరం విలువైనది. అయినప్పటికీ మా నిస్సహాయ పరిస్థితిని అర్థం చేసుకోవాలని కోరుతున్నాము. వ్యాస రచయితలు చాలా మంది అచ్చు తప్పలను కూడా సవరించకనే పంపించారు. వాటిని గుర్తించినప్పటికి సమయభావం వలన చేయలేకపోయినాము. సహృదయ పాఠకులు మా పరిస్థితిని అవగతం చేసుకుంటారని విశ్వసిస్తున్నాము.

ఈ గ్రంధాన్ని డి.టి.పి. లే అవుట్ చేసి, ముఖపత్రాన్ని అందంగా తీర్చిదిద్ది, సకాలంలో అందంగా ముద్రించి ఇచ్చిన భావన ప్రింటర్స్, విజయవాడ యజమాన్యం వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

సంపాదక వర్గం

**తెలుగు ఉపాధ్యాయులు**

వి.యస్. సెయింట్ జాన్స్ మాధ్యమికోన్నత పాఠశాల

గన్నవరం, విజయవాడ.

గ్రంధములోని వ్యాసాలకు సంబంధించిన ఏ విషయమైనా సంబంధిత వ్యాసకర్తలను సంప్రదించగలరు.

## విషయ సూచిక

# తెలుగు కవిత్వం - సామాజిక పరివర్తన

-ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న
తెలుగు విభాగం(విశ్రాంత ఆచార్యులు)
స్కూల్ ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్
ఆంధ్ర విశ్వకళా పరిషత్
విశాఖపట్నం-530003
ఫోన్ నెం: 9440641617, 0891-2538528

"కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ"

-గురజాడ(పుత్తడిబొమ్మ పూర్ణమ్మ)

సంస్కృతియే సామాజిక పరివర్తనకు మార్గం వేస్తుంది. ఎందరో మహనీయులు సమాజంలో వున్న లోపాల్ని గ్రహించి సామాజిక మార్పు కోసం నడుము కట్టారు. అలాగే మన కవులు తమ రచనల ద్వారా సామాజిక పరివర్తనకు కృషి చేశారు.

ఒకప్పుడు రాజులకూ, జమిందార్లకూ, భోగవస్తువుగా, విలాసవస్తువుగా, వున్నకవిత్వం, నేడు ప్రజల నిత్యజీవితావసరాల్లో ఒకటిగా మారిపోయింది. కళ కళకోసం కాదు ప్రజలకోసం అని తేటతెల్లమయింది.

కవి వాక్కు గొప్పది. కవి అనధికార శాసనకర్త. కవి సంఘానికి మార్గదర్శకుడు. కవి నిత్యమూ సమాజాన్ని నిశితంగా పరిశీలిస్తూ వుంటాడు. సమాజంలో మనిషి సుఖంగా, సంతోషంగా బ్రతకాలని అభిలాషిస్తాడు కవి.

మనమందరం సంఘజీవులం. సమాజం బాగుపడడానికీ మనమే కారణం. చెడిపోవడానికీ మనమే కారణం. కాబట్టి ఈ సమాజాభివృద్ధికి మనమందరం తోడ్పడాలి. మనదేశ చరిత్రలో ఎంతోమంది సమాజ పరివర్తనకు నడుంబిగించారు. రాజా రామ మోహన్ రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, స్వామి దయానంద సరస్వతి, శ్రీ నారాయణ, కందుకూరి వీరేశలింగం, రఘుపతి వేంకటరత్నంనాయుడు, గురజాడ అప్పారావు, ఉన్నవ లక్ష్మీ నారాయణ, పలనాటి బ్రహ్మనాయుడు, పోతులూరి వీరబ్రహ్మం, వేమన మొదలైన వారిని మనం స్మరించుకోవాలి. అందుకే పెద్దలు "మానవ సేవే మాధవ సేవ" అన్నారు.

కవులు సామాజిక దృక్పథంతో సమాజం పట్ల బాధ్యతతో రచనలు చేశారు. వాల్మీకి నుండి నేటి వరకు కవులందరూ ప్రజాశ్రేయస్సు కోసమే రచనలు చేశారు. మానవుడు తనకు తాను సంస్కరించుకుంటూ, సమాజాన్ని సంస్కరించి, జీవించవలసి వుంటుంది. ఇలాంటి సంస్కార భావమే వ్యక్తి నుండి ప్రారంభమై, సమష్టిగా మారితే, సంఘసంస్కరణకు దారి తీస్తుంది. అప్పుడే వ్యక్తి, సంఘం, దేశం, బాగుపడినట్లు.

సామాజిక పరివర్తన ఆధునిక కాలంలో మొదలైందని చాలా మంది అభిప్రాయ పడుతున్నారు. ఆ అభిప్రాయం తప్పు. సృష్టి పుట్టినప్పటి నుంచి రోజురోజుకూ పరివర్తన జరుగుతూనే వుంది. పరివర్తన అంటే చెడును తొలగించి మంచిని స్వీకరించే మార్పు. ఆదికవి వాల్మీకి సమాజంలో పరివర్తనను కోరుకున్నాడు. ముఖ్యంగా కుటుంబ వ్యవస్థలో పరివర్తన తేవడానికి తన ప్రతిభా పాటవాల్ని, శక్తి యుక్తుల్ని వినియోగించి రామాయణ కావ్యాన్ని తీర్చిదిద్దాడు అద్భుతంగా.

సామాజిక పరివర్తన కోసం కృషి చేసిన వారు ఎందరో వున్నారు. అందులో ముఖ్యంగా మనకు గుర్తుకొచ్చే వారు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు గార్లు. ఈ ఇద్దరూ సాహిత్యం ద్వారా సమాజాన్ని సంస్కరించడానికి పూనుకున్న సాహితీమూర్తులు. వీరేశలింగం గారు కవితా సంస్కర్తగా, గిడుగు రామమూర్తిగారు భాషా సంస్కర్తగా పేరు ప్రఖ్యాతలు గడించారు. సాహిత్యం ద్వారా సామాజిక పరివర్తనను కోరుకున్నారు.

అస్పృశ్యత, కన్యాశుల్కం, బాల్య వివాహాలు, వితంతు వివాహాలు, మూఢ విశ్వాసాలు, కుల తత్వనిరసన, స్త్రీ జనోద్ధరణ, స్త్రీ విద్యాప్రాముఖ్యం, వేశ్య వృత్తి నిర్మూలన, వరకట్న దురాచారం, మద్యపాన నిషేదం, నిరక్షరాస్యత నిర్మూలన, అవినీతి నిర్మూలన, రాజకీయ నాయకుల అక్రమాలు మొదలగు అంశాలపై కవులు స్పందించి సామాజిక పరివర్తన కోసం రచనలు చేశారు. విజయం సాధించారు. శభాష్ అన్పించుకున్నారు.

**అస్పృశ్యత:-** భారతదేశంలో చాతుర్వర్ణ వ్యవస్థ చిర కాలంగా వుంది. ఈ వ్యవస్థలోనికి రాని, నిమ్నజాతులు వారు ఒక దశలో గ్రామాల వెలుపలా, కోటల వెలుపలా జీవించేవారు. ఇలాంటి వారు వృత్తి పరంగా నిర్లక్ష్యానికి గురై, ఆర్థిక వ్యవస్థలో అట్టడుగున వుండిపోయారు. వారికి సాంఘిక వ్యవహారాల్లో దూరంగా వుంచడం మొదలు పెట్టారు. క్రమంగా అది అస్పృశ్యతకు దారి తీసింది

"అస్పృశ్యత" అంటే అంటరానితనం. అస్పృశులకూ,వారి ఉద్ధరణకూ, అంబేద్కర్ కృషి మరువరానిది. గాంధీజీ ప్రారంభించిన "అస్పృశ్యతా నివారణ ఉద్యమంలో" ఎందరో చేరారు.

అస్పృశుల స్థితిని గూర్చి.......

"అందారు పుట్టిరి హిందమ్మ తల్లికి
అందారు ఒక్కరై ఉండాలి సక్కంగ
..................................."

అనే పాట మన అందరికీ తెలిసిందే.

అంటరాని తనాన్ని కల్పించిన వర్ణ ధర్మం, గూర్చి గురజాడ వారు............

"మలిన దేహులు మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మమధర్మ ధర్మంబే" అని అంటారు. మలిన దేహాలు మాలలైతే, మలిన చిత్తులకు అధిక కులం వర్ణధర్మం కట్టిబెట్టారని, కాబట్టే వర్ణ ధర్మాన్ని, అధర్మ ధర్మంగా గురజాడ వారు చూశారు.

జాషువాగారు "గబ్బిలం" కావ్యంలో........

"కసిరి బుసకొట్టు అతని గాలిసోక
నాల్గు పడగల హైందవ నాగరాజు"

హరిజనుని చూచి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, పాములుగా బుసలు కొట్టి అతనిని అంటకుండా దూరంగా ఉంచారని బాధ పడ్డారు.

తెలుగు సాహిత్యంలో ఎంతో మంది కవులు అస్పృశ్యతను నిరసిస్తూ రచనలు చేశారు.

**బసవరాజు అప్పారావు గారు "గాంధీ ప్రభ"లో............**

"దబ్బుగలోరు దరికిరానీరు
మాల మాదిగలం మనుసులంగామా"

అని అంటరాని తనాన్ని అస్పృశ్యులు ప్రశ్నించినట్లు రాశారు.

**కవి కొండల వేంకట రావు గారు..........**

"నేను భారతీయుండను సనాతనుండను
..........................................
సోకిన మాత్రాన సురుగునే యోగ్యత" అని ప్రశ్నించారు.

**వేమన అస్పృశ్యతను ఖండిస్తూ.........**

"మాలవాని నేల మహిమీద నిందింప
నొడల రక్తమాంస మొకటి గాదా
వానిలోన వెలుగు వాని కులంబేది"

అందరి రక్తం మాంసాలు ఒక్కటే అయినప్పుడు మాలవాడని ఎందుకు నిందిస్తారని నిలదీశాడు వేమన.

ఎంతో మంది కవులు గాంధీజీ అస్పృశ్యతా నిర్మూలన సిద్ధాంత ప్రభావంతోనూ, అంబేద్కర్, జాషువా మొదలైన వారి ఆలోచన విధానాలతోనూ, రచన చేశారు. ఆ రచనల ప్రభావమే అస్పృశ్యతా నివారణకు మార్గాన్ని చూపింది.

**కన్యాశుల్కం:**

తన అవసర నిమిత్తమై తన కుమార్తెను వరునికి ఇచ్చే సమయంలో వరుని నుంచి ఆశించే శుల్కాన్ని "కన్యాశుల్కం" అని అంటారు. ఒకప్పటి సమాజంలో ఇది రాను రాను ఒక సాంప్రదాయంగా పరిణమించింది. అదే ఇప్పటి వరకట్నంగా పరిణమించింది. ఈ రెండింటి మీద కవులు తీవ్రమైన వ్యతిరేకత ప్రదర్శించారు.

**దేవి కృష్ణ మూర్తి గారు** "భావ మందారాలు- అనుభూతి"లో

"కడుపులోని బిడ్డకు బయానా ఇచుట
నాటి కన్యాశుల్క ప్రతిష్ట
గడపలో పురుషుని వేలం పాడుట
నేటి వరకట్నం పరాకాష్ఠ"

అని వరకట్న పద్ధతి, కన్యాశుల్క పద్ధతి రెండూ అనుచితమైనవిగా చెప్పారు కవులు. కన్యాశుల్కంపై గురజాడ అప్పారావుగారు, వరకట్నం పై కాళ్ళకూరి నారాయణరావుగారు సమాజంలో పెద్ద సంచలనం కలిగించారు. వారి మార్గాన్ని ఎందరో కవులు అనుసరించారు.

**బాల్యవివాహాలు** :

బాల్యవివాహాలకు, వితంతు వివాహాలకూ, దగ్గర సంబంధం ఉంది. బాల్యవివాహాలు ఎక్కువగా జరిగిన రోజుల్లో, బాల్య వితంతువుల సంఖ్య ఎక్కువగా వుండేది.

వితంతువుల్లో ముఖ్యంగా వయస్సులో వున్న వితంతువుల వల్ల సమాజంలో వ్యభిచారం, గర్భధారణలు, గర్భస్రావాలు మొదలైన సమస్యలుండేవి. వితంతువులైన వారు బొట్టు, కాటుక, పూలు మొదలైన అలంకారాలకు దూరమై శిరోముండనం చేసుకొని, సమాజంలోని అన్ని శుభకార్యాలకు దూరమై కఠినమైన జీవితాన్ని అనుభవించారు.

ఈ సమస్య నివారణకు మన కవులు పాటుపడ్డారు. ఈ విషయంలో కందుకూరి పాత్ర ఎన్నటికీ మరవరానిది. బలవంతమైన వైధవ్యం సమాజాన్ని నీచ స్థితికి దిగజారుస్తుంది. ఇది గుర్తించిన సమాజం ,ఈనాడు వితంతు వివాహాలను ప్రోత్సహిస్తున్నది. ఇది మంచి పరిణామం.

**మూఢవిశ్వాసాలు :**

మూఢవిశ్వాసం అంటే వివేకంలేని నమ్మకమని అర్థం. ప్రాచీన కాలంలో మూఢవిశ్వాసాలు ఎక్కువగా వుండేవి. నేడు తగ్గాయి. ఇంకా తగ్గాలి. స్త్రీ, పురుషులు ఇద్దరూ విద్య నేర్చుకుంటున్నారు. విద్య ఎప్పుడైతే నేర్చుకున్నారో అప్పుడే చైతన్యం వచ్చినట్లు. జ్ఞానం వల్ల సంస్కారం, సంస్కారం వల్ల సమాజం బాగుపడుతుంది. ఉదాహరణకు నేడు పూర్తిగా " సతీసహగమనం " పోయింది. ఈ మూఢవిశ్వాసం ఎంత భయంకరమైందో మన అందరికీ తెలిసిందే. యజ్ఞాలు, జంతుబలులు కూడా మూఢవిశ్వాసాలే. మానవుడు ప్రతీదాన్ని శాస్త్రీయంగా ఆలోచించాలి. అప్పుడే సమాజం బాగుపడుతుంది.

వేమన, త్రిపురనేని రామస్వామిచౌదరి ఇలా ఎందరో కవులు తమ రచనల్లో మూఢవిశ్వాసాన్ని నిరసించారు. శాస్త్రీయ దృష్టిని అందరూ అలవర్చుకుంటే మూఢ నమ్మకాలు పోయి, సమాజ పురోభివృద్ధి జరుగుతుంది.

**కులతత్త్వ నిరసన :**

కులతత్త్వం వల్ల మానవ సమాజంలో అనైక్యత వస్తుంది. కులతత్త్వాన్ని కవులు నిరసించారు. కులతత్త్వ నివారణ గూర్చి, కులాంతర వివాహాలు ప్రాధాన్యత గూర్చి నాటి నుండి నేటి వరకు మన కవులు కవిత్వం రాస్తూనేవున్నారు.

వేద కాలంలో కులాలు లేవు. వర్ణాలు వున్నాయి. వైదిక వాఙ్మయంలో వర్ణాంతర వివాహాలు కనబడుతున్నాయి. కులాంతర, వర్ణాంతర, మతాంతర వివాహాల వల్ల కులతత్త్వం పోయి సమైక్య సమాజ మేర్పడాలని శాంతి నిలయంగా సమాజం మారాలని కవుల ఆశయం.

ఏ వర్ణానికి చెందినవారు ఆ వర్ణంలోనే వివాహమాడాలి. ఏ శాఖలోని వారు ఆ శాఖలోని వారినే వివాహమాడాలి అనే సంప్రదాయం కాలక్రమేణా ఏర్పడడంతో సమస్యలు తలెత్తాయి.

మన ప్రభుత్వం 1948లో భిన్నమతాల, కులాల, వర్ణాలకు చెందిన వివాహం చట్టసమ్మతం చేసింది.

**గురజాడ అప్పారావు గారు " ముత్యాల స్వరాలు " లో**

" మొన్న పట్టణము నందు ప్రాజ్ఞులు

..................

మరులు కొనరాదో " అని కుల సమైక్యతకు, సహపంక్తి భోజనాల కన్నా కులాంతర వివాహాలు మంచిదని 1910 లోనే గురజాడ వారు తెలియజేశారు.

**స్త్రీ జనోద్ధరణ :**

ఈ సృష్టిలో పురుషులతో సమానంగా స్త్రీలు అభివృద్ధి చెందలేదు. దీనికి అనేక కారణాలువున్నాయి. తరతరాల మూఢాచారం, మతతత్త్వ ప్రాబల్యం, దారిద్ర్యం, అవిద్య, అజ్ఞానం, పురుష దుహంకారం మొదలైనవి ముఖ్యంగా చెప్పుకోవచ్చు.

ప్రాచీన కాలం నుంచీ పురుషుడు స్త్రీని సంతాన సాధన యంత్రంగానే చూశాడు. వితంతువయిన తర్వాత ఆమెను వికారిని చేసింది మన మత సంస్కృతి. మొత్తం మీద సమాజంలో స్త్రీకి అన్యాయమే జరిగిందన్న విషయం సుస్పష్టం.

మనువు కాలంలో స్త్రీలకు స్వాతంత్ర్యం లేదు. వర్ణాంతర వివాహాలు నిషేధం, బహుభార్యత్వానికి ప్రోత్సాహం. ఒక్క మాటలో చెప్పాలంటే పితృస్వామ్య వ్యవస్థ. మనుస్మృతి కాలం నాటికి బలపడింది. సమాజంలో పురుషులు ఆధిపత్యం పెరిగింది.

కందుకూరి వారు స్త్రీ అభివృద్ధికి ఎనలేని కృషిచేశారు. " ఆ రోజుల్లో సంఘ సంస్కర్తలకు ఒక అడుగు కూడా ముందుకు వేయడం కష్టతరమైన కాలంలో కేవలం స్త్రీ జనాభ్యుదయానికే కృషి చేసిన మహానుభావుడు". కందుకూరి వారిని శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ గారు ప్రశంశించారు." నిరాదరణకు, నిరాశ్రయానికీ గురి అయిన విధవలను వారి పరిస్థితిని మెరుగుపరచడం ద్వారా అనన్య సహాయ సహకారాల్ని అందించిన వీరేశలింగం గారికి భారతదేశంలోని స్త్రీ లందరమూ సర్వదా కృతజత కలిగివుంటామని నివాళుర్పించారు " దుర్గాభాయి గారు.

**గురజాడ వారు స్త్రీ ప్రాముఖ్యాన్ని గూర్చి చెప్తుతూ**

" పురుషుల అహంకారానికి లోబడి, పురుషులు పెత్తందారీతనానికి బలియై స్త్రీలు బానిసలుగా ఎలా బాధపడుతున్నారో నేను ఊహించగలను " అని అన్నారు. స్త్రీ అబల కాదని, పురుషుని కన్నా స్త్రీకి మానవతాభావాలు ఎక్కువని, స్త్రీ పురుషుని కన్నా ఏవిధంగా తక్కువ కాదని గురజాడ వారు నొక్కివక్కాణించారు.

స్త్రీ ఔన్నత్యాన్ని గూర్చి చెప్తుతూ షేక్ ఖాసిం గారు " గాలిగోపురం - జాతి వైభవం " లో..

" ఆడది ఆడదై ఒకరింటి కోడలై ..........

మగని కోరికలన్నీ మరీమరీ తీర్చే" దని అభివర్ణించారు.

" కన్యక " కావ్య ఖాండిక కవి గురజాడవారు

" పట్టమేలేరాజు అయితే, రాజునేలే దైవ ముందదో

పరువు నిలుపును పౌరుషము, మీకేల కలుగదొకో "

ఇక్కడ గురజాడ కన్యక చేత పురవీరులకు ఉపదేశం ఇప్పిస్తారు. పరస్త్రీల మనోభావాలు దోచే రాజులు జార, చోరుల కంటె నీచులని కన్యక చేత నిందింపచేశారు.

స్త్రీల జీవితాన్ని అనేక కోణాలు నుండి దర్శించారు చలంగారు. స్త్రీని బానిసగా చేసిన పురుషాధిక్యతను చలంగారు ప్రశ్నించారు. స్త్రీ పురుషులు మధ్య సమానత్వం సంపూర్ణ స్వేచ్ఛ ఆశించారు.

" స్త్రీకి కూడా శరీరం వుంది, దానికి వ్యాయామం ఇవ్వాలి. మెదడు వుంది, దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకి హృదయం వుంది, దానికి అనుభవం ఇవ్వాలి " పలికారు చలంగారు. స్త్రీ జనత్వాన్ని ప్రాధాన్యతను సమాజం , పురుషుడు సరిగా అర్థం చేసుకోలేదని బాధపడతాడు చలంగారు. సాహిత్యం ద్వారా ఫెమినిస్టు ఉద్యమానికి శ్రీకారం చుట్టిన వారు చలమే అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

డాక్టర్ వాసాప్రభావతి గారు " కాటుక కంటినీరు " లో ఆడపిల్ల గొప్పదనం, ఆడపిల్ల విలువను వర్ణిస్తుంది.

" అసలు ఆడపిల్ల అంటే ఎవరని? ..............................

చివరకు మరణించిన నాడు మీదపడి ఏడ్చేది ఆడపిల్లే

" అని అంటుంది రచయిత్రి.

ప్రముఖ రచయిత్రి శీలా సుభద్రాదేవి " ఆకలి కృత్యం" కవితా సంపుటిలో........................

" మా గుండెలు మూగవే కాని యిప్పుడు కాదు ఎన్నో
ఏళ్ళుగా నిద్రించిన మా వ్యక్తిత్వం తుళ్ళిపడిలేచింది
ఆవులించి ఒళ్ళు విదిల్చింది స్వేచ్ఛకోసం పెనుగులాటలో
సంప్రదాయపు తాళ్ళు తెగిపడ్డాయి కట్టుబాట్లు కట్టుకొయ్య మొదలంటూ పూడిపడింది నివురు గప్పిన నిప్పుల్లా ఉన్నాయిన్నాళ్ళూ
చైతన్యోత్సాహంతో ఎగసిపడే మా గుండె ఊపిరుల ప్రభంజనంతో నివురు నిగర గొట్టేస్తాం ఈ అగ్ని ఇంతలో చల్లారదు. అడ్డు పడితే నిన్ను దహించకామానదు "

అంటూ ఈనాటి స్త్రీ పూర్వకాల స్త్రీలులా కాదు. ఈనాటి స్త్రీలను చిన్నచూపు చూడడానికి వీలుకాదు. వారి వ్యక్తిత్వానికి భంగం కలిగితే పురుషుడు కష్టాలు పడతాడని వివరించింది రచయిత్రి.

డాక్టర్ వాసాప్రభావతి గారు " కాటుక కంటి నీరు " లో స్త్రీ ప్రాధాన్యతను గూర్చి.......................

" పురుషునకు అంగబలం అర్థబలం వంశ బలం నేనేనని
నేను లేనిదే, పురుషుడేడని అసలు సృష్టిలేదని
పునర్జన్మలంటూ వుంటే మళ్ళీ మళ్ళీపుడతా ఆడదానిగా
యీ లోకంలో మళ్ళీ మళ్ళీ పుడతా ఆడదానిగా " చక్కగా వివరించారు.

శ్రీమతి తేరేసా దేవదానం " అస్పృశ్యులెవరు ? తప్పెవరిది ? " లో

" ఆస్తిపాస్తులున్న అంతస్తులున్న
.................... సంఘానికి జీవము పోయుమా
సబలగ స్త్రీని నిరూపించుమా "

అంటూ బాధలు ఎరిగి, వాటిని తొలగించి జీవితాన్ని ఒడిదుడుగులు లేకుండా నడిపించేది స్త్రీయని, ఆ స్త్రీని ఉద్ధరించమని బోధిస్తుంది రచయిత్రి.

స్త్రీల విషయంలో ఇంకా పరివర్తన రావాలి. ముఖ్యంగా పురుషునితో స్త్రీలు అన్ని రంగాల్లో బాగా రాణిస్తున్నారు. ఆహ్వానించ దగ్గ విషయం హర్షించ దగ్గ విషయం. స్త్రీ అభివృద్ధి జరిగినప్పుడే సమాజం అభివృద్ధి చెందినట్లు.

**స్త్రీ విద్యా ప్రాముఖ్యం :**

విద్యా విషయంలో స్త్రీకి పురుషునకు తేడాలు వుండకూడదని కవులు కలం పట్టుకున్నారు. స్త్రీకి విద్య అవసరమని అందరూ గుర్తించారు. ప్రాచీన కాలంలోని స్త్రీ కన్నా నేటి స్త్రీ అన్నిరంగాల్లో ముందంజ వేసింది. కందుకూరి వారు స్త్రీ విద్య కోసం పాటుపడ్డారు.

**వేశ్యావృత్తి నిర్మూలన :**

పురాణాల్లోనూ, కావ్యాల్లోనూ ప్రబంధాల్లోనూ, వేశ్య ప్రసక్తి వుంది. ప్రాచీన కాలంలో వేశ్యావృత్తి శాసన సమ్మతం. పట్టణాల్లో ప్రత్యేకంగా వేశ్యా వాటిక లుండేవి.

కందుకూరి వారు వివాహాది సమయాల్లో ఏర్పాటు చేసే భోగంమేళాల వల్ల ఎంతటి అనర్థాలు జరుగుచున్నాయో వివరించి వాటిని బహిష్కరించాలని పదేపదే ఉపదేశించారు.

ప్రజాకవి వేమన వేశ్యలతో తిరిగే వారిని

" ఇంటి యాలి విడిచి యిల జార కాంతల వెంట తిరుగువాడు వెర్రివాడు పంట చేను విడిచి పరిగ ఏరినయట్లు భార్యను వదిలి జార కాంతల వెంట వెళ్ళువాడు వెర్రివాని క్రింద జమకట్టాడు వేమన. భార్య పంట, చేను లాంటిది. జారకాంత పంట కోసుకొని పోయిన తర్వాత అక్కడక్కడా రాలిపోయిన ధాన్యపు వెన్నులతో సమానంగా చెప్పి, నక్కకు నాగలోకానికి ఉన్నంత తేడాను జారకాంతకు భార్యకు వుందని తెలియచేశాడు వేమన.

' వేశ్యా వృత్తిని ఖండించాడు వేమన "

**వరకట్న దురాచారం :**

ఋగ్వేద కాలంలో కట్నం అంటే తల్లిదండ్రులు కుమార్తెకు ఇచ్చే ధన, కనక, వస్తు వాహనాదులు. అంతేకాని వరునికి ఇచ్చేదికాదు. వరకట్న సమస్య తీవ్రరూపం దాల్చి ఈనాడు వరకట్నపు ఛాయలు అధికమయ్యాయి. కొన్ని సర్వేలు " గ్రామాల్లో కంటే నగరాల్లోనే ఈ వరకట్నపు చావులు ఎక్కువగా వున్నాయని నిర్ధారించాయి." అది నిజం కూడా.

వరకట్నపు చావు గూర్చి రాయప్రోలు సుబ్బారావు గారు 1912లో స్నేహలత కావ్యం రాశారు. ఈ కావ్యంలో వరకట్న సమస్యను కావ్య వస్తువుగా స్వీకరించారు. పేదవారైన తల్లిదండ్రులు వరకట్నం ఇవ్వలేక పోవడం చూసి, వాళ్ళ బాధలు కష్టాలు చూసి అగ్నికి ఆహుతి అయిన కన్యక చరిత్ర ఇది.

అడిదం సాపారావు " అంతరాంతరాల్లో మనిషి " లో వరకట్నదావు గూర్చి తన ఆర్తిని ఇలా వ్యక్తం చేశారు.

" ఒక చిన్నది అందాల చిన్నది అతగాడి మెడలో తాళికట్టించుకున్నపాపానికి ............................

...... ఆ వీధినిపోయే మరో చిన్నారి పెండ్లి భాజంత్రీలు మ్రింగివేశాయి "

నక్షత్రా కిరణాలు ( సంకలనం - జి.శ్రీశైలం ) లో ఒక కవయిత్రి ఈనాటి కళ్యాణాలు గూర్చి రాస్తూ

" కన్నెకు కళ్యాణమట కట్నకొనే వాడిని కాసులిచ్చి కొనుక్కునే దౌర్భాగ్యమట..................

కాసు కోసం బేరాలు ఆడుతున్న వ్యాపార సంస్థ ? "

అని ఒక స్త్రీ కళ్యాణానంతరం ఎన్నెన్ని కష్టాలు పడుతుందో ఈ కష్టాలే ఒక్కొక్కసారి ఆమె చావుకు కారణాలు అవుతాయని వివాహ వ్యవస్థను వ్యాపార వ్యవస్థగా మార్చిన సమాజాన్ని ప్రశ్నించారు. కాబట్టి ప్రభుత్వం, ప్రజలు జాగృతం అయితే ఈ సమస్య నివారించబడుతుంది.

**మద్యపాన నిషేధం :**

వేదాల్లోనూ, పురాణాల్లోనూ, కావ్య నాటకాల్లోనూ మద్యపాన ఘట్టాలు, వర్ణనలు ఉన్నాయి. దేశమంతటా మద్యపాన వ్యతిరేకతా ఉద్యమాలు వచ్చాయి. ఎందరో కవులు మద్యపాన వ్యతిరేక రచనలు చేశారు. అయినా లాభం లేకపోయింది. ముఖ్యంగా ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు.

కందుకూరి వారు " సమాజ క్షేమం " కోరే వారందరూ మద్యపాన దురాచారాన్ని తొలగించడానికి సంఘటిత చర్యలు చేపట్టాలని కోరుకున్నారు.

1921 లో వెలువడిన గరిమెళ్ళ సత్యనారాయణ గారి స్వరాజ్య గీతములు సంపుటిలో " కల్లు" శీర్షికతో 21 చరణాలు సుదీర్ఘ గీతం రాశారు.

" కల్లు తాగి నీయిల్లు నెల్ల గుల్లచేయకు.......................

బత్తెమున్ను కూలియున్ను పారబోయకు "

గరిమెళ్ళ మద్యపాన నష్టాల్ని వర్ణించి ఇవి స్వరాజ్య సాధనకు ఆటంకాలు అనే భావన కూడా చెప్పి ప్రజల్ని స్వరాజ్య ఉద్యమానికి పురికొల్పారు. మద్యపాన దురాచార నిరసనంపై రచనలు చేసిన వారిలో ఆచార్య సినారె గారు ఒకరు

" వద్దంటి యినదేమి మొగడో తాగ వద్దంటేయినదేమి మొగడో..........................

దేవునసువంటోడు దయ్యమై తోలుతదు వద్దంటె " అని అంటారు. సమాజంలో ఎన్నో రకాలుగా తాగుబోతులలు వుంటారు. ఏదో పేరు చెప్పుకొని ఏదో నెపం మీద ఎప్పుడో త్రాగుతుంటారు ప్రజలు. దీన్ని శీలా వీర్రాజు గారు " మళ్ళీ వెలుగు " లో" వెల్తురు కరిగి చలిగాలి తిరగడంతోటే ఇంకా ఎన్నెన్నో రకాలవారు "అంటూ ఎన్ని రకాలుగా మద్యపాన సేవనం జరుగుతూ వుందో వర్ణించారు.

మద్యపాన దురాచారం సామాజికంగా నేరాల సంఖ్యను పెంచుతుంది. తాగేవాళ్ళ ఆరోగ్యం పాడు చేస్తుంది. ఇది సమాజంలో పేదరికాన్ని పెంచుతుంది. అందుకే మన కవులు

" కల్లమ్మోరా - సారాయమ్మా ! మీ నెల్లి పొండి సాలునమ్మ సాగరంలోనికి " అని మద్యపానాన్ని నిరసిస్తూ కల్లు, సారాయి లాంటి మద్యాలను లేకుండా చేయాలని కోరుతున్నారు.

మద్యపానమనేది ధూమపానం, జూదం, వ్యభిచారం, చౌర్యం లాంటి ఇతర వ్యసనాలకు విత్తనం లాంటిది. అందువల్లనే మద్యపానం లేకుండా చేస్తే సమాజంలో ఎన్నో ఇతర వ్యసనాలు దూరమవుతాయి.

మద్యపానాన్ని నిరసిస్తూ ఎన్నో గేయాలు, కవితలు, ప్రసంగాలు, నినాదాలు, పద్యాలు, బుర్రకథలు, మొదలైన ఎన్నో సాహితీ ప్రకియలు వచ్చాయి. ఆకాశవాణిలో ప్రసంగాలు, నాటకాలు, గేయాలు, దూరదర్శన్ లో కూడా నాటికలు, గేయనాటికలు, బుర్రకథలు, ఒగ్గు కథలు ఎన్నో వస్తూవున్నాయి.

కవులు, రచయితలు, పత్రికలు, ప్రభుత్వం, సేవాసమాజాలు, మహిళా సంఘాలు ప్రయత్నిస్తే మద్యపాన దుష్ఫలితాలు పూర్తిగా నిర్మూలించబడి సమాజం ఉద్ధరించబడు తుందనడంలో సందేహం లేదు.

**కుటుంబ నియంత్రణ :**

జనాభా సమస్య ఈనాడు ప్రపంచ సమస్య. బిడ్డల భవిష్యత్తు కోసం, సమాజ శ్రేయస్సు కోసం, కుటుంబ నియంత్రణ తప్పనిసరి. ఈ విషయాన్ని ప్రజలందరూ గుర్తించాలి.

కుటుంబ సంక్షేమాన్ని , సమాజ శ్రేయస్సును కాంక్షించారు. జె.రాజగోపాల్ గారు. అందుకే " ఆకలి కేక " కవితలో.................." కుటుంబ నియంత్రణ పాటించడం మనవిధి ..........................................................

పాటిద్దాం పరిమిత కుటుంబాన్ని "

అంటూ కుల, మత, వర్గ, జాతి వృద్ధి కోసం కుటుంబ సంక్షేమం కోసం పరిమిత కుటుంబాన్ని కలిగి వుండడం మనవిధి అని కవి అభిప్రాయ పడ్డారు.

సమాజంలో ప్రజలు మితిలేని సంతానంతో పడే బాధలు చూచి, సమాజం, దేశం సుభిక్షాన్ని కోరుకున్నారు. ఊట్ల కొండయ్య .వీరు " నిర్వేదం " లో " నిద్దుర రాదు కన్నులకు నేలయె ఈనినట్లు పుట్టియిల్లిద్దరి ..................

ముద్దు సయాట బొమ్మలను ముందును మాడెద విట్టువీశ్వరా ! "

అంటూ దైవ ప్రార్ధన చేసి, మమ్ములను జనాభా సమస్య కాకుండా చేసి, రక్షించమని కోరుకుంటారు

తిలక్...

" అమెరికా లో డాలర్లు పండును
ఇండియాలో సంతానం పండును " అని అంటారు.

మన పురుణాల్లో కన్పించే దేవతలకు కూడా ఎక్కువమంది సంతానం లేదు. ఇదే విషయాన్ని ఎస్.సి శేషాచార్య గారు " కలుపు మొక్కలు " కవితలో ............
"అరయ విష్ణుమూర్తి కిరువురేపుత్రులు ............
వారిదారివిడువ"

అంటూ త్రిమూర్తుల దారిలో నడిచి కేవలం ఒక్కరు లేక ఇద్దరితో సంతానానికి

అడ్డువేయాలి అని, సంతాన నిరోదాన్ని పాటించాలని కోరుకున్నాడు. ఎస్.ఆర్ వెంకటేశం గారు

" కందాల మకరందాలు " లో సంతానం పెరిగితే సమాజం అభివృద్ధికి నోచుకోదని వాపోతారు.

" ఇద్దరు పిల్లలు చాలును .................. విరిబాటౌ ప్రగతి పధము వినరా సుమవా !"

అంటూ ఒకరిద్దరి కన్నా సంతానం పెరిగితే ప్రగతి కుంటు పడుతుంది, సంసారం ముద్దు మురిపాలతో, సుఖసంతోషాలతో వుండాలంటే పరిమితంగానే సంతానం వుండాలని నొక్కివక్కానించారు వెంకటేశం గారు.

జె.బాపురెడ్డి గారు " నా దేశం నవ్వుతుంది " కవితలో
" కుహు కుహు మనికూసే ... కోకిల ఏమంటున్నది ............
ప్రణయ దంపతుల కడుపు పంట ఇద్దరేనంట – ఝుం–ఝుం
" మిల మిల గగనం లోన ..................................
తనయులు రవిచంద్రులట – చక–చక " అంటూ ప్రకృతిలో పరిమితి వున్నదంటూ, వర్ణించి ఇద్దరిని మించి పిల్లలను కనకూడదంటూ చమత్కారంగా చెప్పారు బాపిరెడ్డి గారు.

ఇంకా రెడ్డి గారు " తల్లికి ఒకరో ఇద్దరో పిల్లలే వరాలు భారతీయులందరపుడు భరతుని రూపాలు" అని అన్నారు.

ప్రభుత్వం, కొన్ని స్వచ్ఛంద సంస్థలు జనాభా తగ్గడానికి ప్రయత్నం చేశాయి. భారతదేశ జనాభా ఇంకా తగ్గితే సామాన్య మానవుడితో పాటు అందరూ సుఖంగా వుంటారు.

<u>నిరక్ష్యరాస్యత :</u>

" విద్య నిగూఢ గుప్తమగు విత్తము, రూపము పూరుషాళికిన్ ..................................
విద్య నృపాల పూజితము, విద్య నెరుంగనివాడు మర్త్యుడే "

అని భర్తృహరి సుభాషితం. విద్యనేర్వనివాడు మనిషి కాడని తేల్చి చెప్పాడు. సమాజంలో పుట్టిన ప్రతీ వ్యక్తి చదువుకోవాలి. అదే ప్రభుత్వం విధానంగా వుండాలి. అప్పుడే దేశం అభివృద్ధి చెందుతుంది. నిరక్షరాస్యత వుంటే ఆదేశం అభివృద్ధి లేనట్లే. కాబట్టి అందరూ చదువుకోవాలి.

**వెలగల సుబ్బారెడ్డి** " ఆదియాంధ్ర " అనే కావ్యంలో
" ముందు మీ సంఘ ముందుండె మూర్ఖవిడువ .............................. వేరు సాధన మికలేదు వెదకి జూడ " విద్యార్జనకై శ్రద్ధజూపి మిమ్మల్ని మీరే ఉద్ధరించుకోవాల? రెడ్డి గారు తెలియజేశారు.

"నా దేశం నవ్వుతుంది" లో జె.బాపురెడ్డి గారు వయోజనుడు విద్యాభ్యాసం ప్రారంభించిన తర్వాత..........
" ఓనమాలు దిద్దుతుంటే ..............................
రాతనేర్చుకుంటే తలరాత మారిపోవురా "

అంటూ విద్యాప్రయోజనాన్ని కీర్తించారు బాపురెడ్డిగారు.

**రాధేయ** " ఈ కన్నీటికి తడిలేదు " లో విద్య యొక్క గొప్పతనాన్ని గూర్చిచెపుతూ " అవినీతి, మోసం, దగా ..................
మదర్ థెరిస్సాను చూస్తాను "

అంటూ విద్య ఎంతో విజ్ఞానాన్ని ప్రసాదించే నిధియని, ఆ నిధిని మానవుడు సాధిస్తే ప్రపంచాన్ని జయించినట్లేనని తెలియజేస్తారు.

స్వాతంత్ర్యం వచ్చి ఇన్ని సంవత్సరాలు అయినా ఇంకా మన దేశంలో నిరక్ష్యరాస్యుల శాతం ఎక్కువగానే వుంది. సమాజంలో అందరికీ విద్య అందుబాటులో వున్న నాడే దేశం సుసంపన్నమౌతుంది. ఇప్పుడున్న సామాజిక అసమానతలకు ప్రధాన కారణం విద్య లేకపోవడమే.

**అవినీతి నిర్మూలన :** సమాజంలో విచ్చలవిడిగా పెరిగిపోతున్న లంచగొండితనానికి, అవినీతికి వ్యతిరేకంగా కవులు గళం విప్పారు.

డాక్టర్ అంతటి నరసింహం గారు " అంతటి వచన కవితలు " లో అవినీతికి అంతు లేకుండా పోతుందని వాపోతారు." ఏడాది ఒకనాడు ..............................
అంతటా ఈనాడు "

గజ్జెల మల్లారెడ్డి " మల్లారెడ్డి గేయం" లో తహశీల్దార్‌ల అవినీతిని గూర్చి వివరించారు. " అరై తాసీల్దారు లల్లదేదారుల గాచీ..........................తీరిననే నెరవేరును లక్ష్యం "

అంటూ ప్రభుత్వం వారు ప్రజలకు ఇచ్చే డబ్బు సహాయం 'సబ్సిడీ' రూపంలో ఇవ్వడానికి తహశీల్దారులు ఏవిధంగా లంచాలు తీసుకొనేది. లంచాలు ఇవ్వకపోతే ప్రభుత్వ సహాయం అందకుండా పోయే విధానాన్ని వివరించారు గజ్జెల మల్లారెడ్డి గారు .

మల్లారెడ్డి గారు సమాజంలో అవినీతి సర్వత్రా వ్యాపించిందని వాపోతారు.

" ఇందు గల దండులేదని
సందేహంలేని దెద్ది
లంచగొండి తనమేనని
ఎంచవచ్చు గురువరా " అని అంటారు

**బోయి భీమన్న** గారు " భీమన్న ఉగాదాలు " లో
" పైరవీల పంచలలో ........... లక్ష్మికి సేవ చేస్తూ సరస్వతి "

ధనం ముందు అందరూ లొంగిపోతున్నారని, లంచగొండితనానికి విద్యా వివేకులు దాసోహం అయిపోతున్నారని భీమన్న గారు వాపోయారు.
ప్రభుత్వ ఆసుపత్రుల్లో అవినీతి,లంచగొండితనం ఎలా ఉందో **శీలా వీర్రాజుగారు "మళ్ళీ వెలుగు"**లో వివరించారు.

"ప్రభుత్వ ఆసుపత్రుల్లో అడ్మిషన్లకు తొలిమెట్లు
.................................................
మళ్ళీ దక్షిణ పడేయడం అవసరం"

సమాజంలో అవినీతి విలయతాండవం చేస్తుందని ఉద్యోగాలు పొందాలంటే ఎన్ని అడ్డదారులు తొక్కాలో వర్ణించారు వీర్రాజు గారు. "లంచాలు చెల్లించకపోతే ...................... ఉద్యోగానికి అర్హులు కారు ఎంత గింజుకున్న వాళ్ళకి ఉద్యోగం రాదు" ఇంకా వీర్రాజుగారు దొంగసరుకుల రవాణాగూర్చి, స్మగుల్డు సరుకుల గూర్చి పేర్కొన్నారు.

**రాజకీయ నాయకుల అక్రమాలు:**

రాజకీయ నాయకుల అక్రమాల గూర్చి ప్రతీ రోజు పత్రికల్లో, టి.విల్లో చూనస్తూనేవున్నాం. ఈ వ్యవస్థ చెడిపోవడానికి వాళ్ళే కారణం. ఈనాటి దుర్నీతిని, దుర్గంధ భూయిష్టమైన రాజకీయాల్ని కవులు తమ రచనల్లో దుయ్యబట్టారు.

**గిడ్డి వెంకటరమణ గారు**
**"దేశం తీరు"** లో రాజకీయాలు ఎలా ఉన్నాయో వివరించారు.

"ప్రజాధనాన్ని మేస్తున్నారు
.................................
చెప్పు చేతల్లో వుంటుంది" అని తెలియ జేశారు.

**శ్రీశ్రీ "మూడు యాభైల"** లో.........
"పొడి చేస్తామని చెప్పిన మన కాంగ్రెసు వారు
తడి రాష్ట్రాలన్నిటిని పొడి చేస్తున్నారు"

అంటూ రాజకీయ నాయకులు దేశాన్ని ఎలా పీల్చిపిప్పి చేస్తున్నారో పదాల గారడీతో వివరించారు.

**"అందెల సందడి"లో అందెశ్రీ గారు** కులమత ద్వేషాలు, కులమత కక్షలు, కులమత హత్యలు, అన్నీ రాజకీయ నాయకుల సృష్టిగా వర్ణించారు.

"మతం మంటలు భగ్గుమంటూ ................
నరమేధ యాగమా" అని వర్ణించారు.

**కాళోజి నారాయణరావుగారు** రాయకీయ నాయకులు చేసే అవినీతి పనుల గూర్చి తెలియజేశారు.

"ప్రజాసేవను పేర బ్రతకండి తిన్నంగ మీరు.............
చల్లగ బ్రతికేటి మార్గం"

అంటూ నేటి రాజకీయ నాయకుల స్థితి గతుల్ని వ్యంగ్యంగా వివరించారు. **ఏటుకూరి ప్రసాద్‌గారు "నందామయా గరుడ నందామయా ఆనంద దేవికి నందామయా"** అనే గేయంలో....... "బంజర్లు పేదలకు .................. పంచవర్ష ప్లాను వేస్తారయా......."

అని రాజకీయ నాయకులు ఎలాంటి మాటలు చెప్పి ప్రజల్ని మోసగిస్తారో, ఎలా కాలం గడుపుతారో వివరించారు.

కవులు తమ శక్తి కొలదీ రాజకీయ నాయకుల అక్రమాల్ని నిర్మొహమాటంగా వర్ణిస్తూ రాజకీయ నాయకుల కనువిప్పుకై ప్రయత్నిస్తున్నారు. అయినా కొంచమయినా రాజకీయ నాయకుల్లోనూ అనుకున్నంత పరివర్తన (మార్పు) రావడం లేదు.

సామాజిక బాధ్యతతో కవులు రచనలు చేసి సామాజిక పరివర్తన కోసం పాటు పడ్డారు. పడుతున్నారు కూడా

"కల్లు త్రాగ వద్దన్న.............మహోన్నత భారత జాతి"

**.....డాక్టర్ ఉందేలమాల కొండారెడ్డి (విలపించే ఉత్తరం)**

**ఆధార గ్రంథాలు:**


1. స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత్వంలో సంఘ సంస్కరణ - డాక్టర్ పోతిరెడ్డి చెన్నకేశవులు.
2. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు - (సం) - ఆచార్య పేర్వం జగన్నాథం.
3. ఆధునికాంధ్ర గేయ కవిత్వం - డాక్టర్ జి.చెన్నకేశవ రెడ్డి.
4. ఆధునిక కవిత్వంలో మానవతావాదం -విభిన్న ధోరణులు - డాక్టర్ జి.అరుణ కుమారి.
5. ఉద్యమ దర్శనం - డాక్టర్ ముదిగొండ శివప్రసాద్.
6. తెలుగు నాడులో సంస్కరణోద్యమం - శ్రీ తారకం.
7. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం - డాక్టర్ మద్దూరి సుబ్బారెడ్డి.
8. నూరేండ్ల సాహిత్యంలో కొన్ని ధోరణులు, దృక్పధాలు - శ్రీ వదలి మందేశ్వరరావు.
9. సమస్యలు-సంస్కరణలు - మల్లాది సుబ్బమ్మ.
10. తెలుగు సాహిత్య చరిత్ర- ఆచార్య వెలమల సిమ్మన్న.
11. తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు - ఆచార్య వెలమల సిమ్మన్న.
12. సాహిత్యం-సమాజం - ఆచార్య వెలమల సిమ్మన్న.

# సినారె 'విశ్వంభర'లో సాంస్కృతిక పరివర్తన

డా. గుమ్మా సాంబశివరావు
తెలుగు శాఖాధ్యక్షులు
ఆంధ్ర లొయోలా కళాశాల
విజయవాడ-8,
చరవాణి : 9849265025

"విత్తుపోటమరించనిదే
కొత్తమొక్క మొలవలేదు
ప్రసవ వ్యధమించనిదే
శిశువు వెలుగుచూడలేదు...
మొన్నచిగురు
ఇవాళమొక్కైపైకిలేస్తుంది
నిన్నటిమొగ్గ
ఈపూటపువ్వై విప్పారుతుంది"-అంటూ ప్రకృతి పరిణామక్రమాన్ని

కవిత్వీకరించిన డా॥ సింగిరెడ్డి నారాయణరెడ్డి – మల్లారెడ్డి, బుచ్చమ్మదంపతులకు 1931జులై29వ తేదీన కరీంనగర్ జిల్లాలోని మారుమూల గ్రామం హనుమాజీపేటలో జన్మించారు. వీధిబడిలో చదువును ప్రారంభించిన సి.నా.రె. విశ్వవిద్యాలయ ఆచార్యునిగానే కాకుండా, కులపతులుగా కూడా భాధ్యతలు నిర్వర్తించారు. రాజ్యసభ సభ్యునిగా తనదైన ముద్రను ప్రకటించారు. సాహిత్య సృజనను నిత్యకృత్యంగా చేసుకొని, సభాకార్యక్రమాల్లో పాల్గొనటం దినచర్యగా పాటిస్తూ జీవితాన్ని గడిపిన పుంభావ సరస్వతి సి.నా.రె. పద్యం, గేయం, వచనకవిత, పాట, గజల్, ద్విపద, పంచపదులు,బుర్రకథ,గేయనాటికలు, యాత్రాచరిత్ర, దీర్ఘకథాత్మకగేయ కావ్యాలు మొదలైన ప్రక్రియల్లో రచనలు గావించిన నిరంతర సాహితీమూర్తి సి.నా.రె. ప్రతి పుట్టినరోజునాడు ఒక కవితా సంపుటిని ఆవిష్కరించే సాంప్రదాయానికి శ్రీకారంచుట్టిన సాహితీ తపస్వి.సి.నా.రె. 'రాసన్తూరాసన్తూపోతాను సిరా ఇంకేవరకూ–పోతూపోతూ రాస్తాను వపువు వాడే వరకు' అని చెప్పినమాటను నిలబెట్టుకున్న కవివరేణ్యులు సి.నా.రె. తెలుగు వారికి రెండవ సారి జ్ఞానపీఠాన్ని అందించిన 'విశ్వంభర' కావ్యకర్త సి.నా.రె. విశ్వంభరలోని సాంస్కృతిక పరివర్తనను వివరించే ప్రయత్నమే ఈ వ్యాసం.

విశ్వంభర కావ్యానికి ప్రస్తావన రాస్తూ సి.నా.రె"ఈ కావ్యానికి నాయకుడు మానవుడు. రంగస్థలం విశాల విశ్వంభర. ఇతివృత్తం తేదీలతో నిమిత్తంలేని, పేర్లతో అగత్యంలేని మనిషికథ. ఈ కథకు నేపథ్యం ప్రకృతి. మనిషి ధరించే వివిధ భూమికలకు మూలధాతువులు మనశ్శక్తులు. అలెగ్జాండర్, క్రీస్తు,అశోకుడు,సోక్రటీస్, బుద్ధుడు,లింకన్,లెనిన్, మార్క్స్, గాంధీ–ఇలా ఎన్నెన్ని రూపాలో మనిషికి! కామం, క్రోధం, లోభం, మదం,ఆత్మశోధనం, ప్రకృతిశక్తుల వశీకరణం, – ఇలాఇలా ఎన్నెన్ని విభిన్న ప్రవృత్తులో మనిషికి. ఆదిమ దశనుంచి ఆధునిక దశ వరకు మనిషి చేసిన ప్రస్థానాలు ఈ కావ్యంలోని ప్రకరణాలు".

"మనిషి చేసిన సాధన త్రిముఖం –కళాత్మకం, వైజ్ఞానికం,ఆధ్యాత్మికం. ఈ సాధనలో అడుగడుగున ఎదురు దెబ్బలు. క్షతుడైనా మనిషి తిరోగతుడు కాలేదు. 'విశ్వంభర' కావ్యరచనకు పూర్వం నాలో గీసుకున్న రేఖ చిత్రమిది" అని తన మనసులోని మాటను వెల్లడించారు.

మానవ జీవితం నిత్యచైతన్య స్రవంతి. అది అనంతంగా సాగుతూనే ఉంటుంది. అనంత జీవన ప్రయాణంలో ఉత్థాన పతనాలున్నా లెక్క చేయకుండా మానవుడు పురోగమిస్తాడు. పురోగామియైన మానవుని విశిష్ట జీవన పరిణామ క్రమాన్ని ఆవిష్కరించటమే ధ్యేయంగా సాగిన కావ్యం విశ్వంభర. విశ్వానికి ఆధారమైందే విశ్వంభర. విశ్వంభర అంటే భూమి. పంచభూతాలలో మొట్టమొదటిది భూమి.
సమస్త ప్రాణికోటికీ ఆధారమైంది భూమి. భూమి ఒక గ్రహమేకాదు. జడ, చైతన్య పదార్థాలకు భద్రతనిచ్చే గృహం. అందుకే వేదం భూమిని తల్లిగా సంభావించింది.

సి నా రె విశ్వంభర ప్రత్యేక విశిష్టలతో కూడిన కావ్యం. ఈ కావ్యంలో వ్యక్తులు కనిపించరు గాని వారి వ్యక్తిత్వాలు ప్రతిబింబిస్తాయి. ఆలోచనామృతంగా సాగే ఈ కావ్యంలో తేదీలు కనిపించవు. అనేక సన్నివేశాలు తటస్థ పడతాయి. మానవుడు జన్మించకముందే ప్రకృతి

తన విశ్వరూపాన్ని ప్రదర్శించిందని కవి ధ్వనింప చేస్తారు. ఈ కావ్యంలో నేను అనే పదం మానవునికి సంకేతం. తాను పుట్టకముందు తన కోసమే నక్షత్రాల నిరీక్షణ,ఉషస్సుల ఉద్వేగం,వెన్నెలలసొగసు,వెదురు బొంగులనాదం,శిలల ఆకృతులు, నెమళ్ళ నృత్యాలు, కోకిలల గానాలు ఉన్నాయని కవి వర్ణించిన తీరు సహృదయరంజకం.

విశ్వంభర కావ్యం ఐదు ఖండాలుగా సాగింది.పంచభూతాత్మకమైన ప్రపంచానికి అంటే ప్రకృతికి ప్రతీకగా ఐదు ఖండాలను సినారె ఏర్పాటు చేశారని భావించవచ్చు. కవిత్వం ఆలోచనామృతమనే పలుకులకనుగుణంగా సినారె ఈ కావ్యంలో ఏ విషయాన్ని సూటిగాచెప్పలేదు. భూమి తన మూలాల్ని అన్వేషించటం వెనుక సృష్టికర్తహస్తం ఉన్నదన్న విషయాన్ని ప్రకటిస్తూ "వెర్రెత్తిన ఏ శక్తి విసిరేసినకందుకాన్ని" అని రచించారు.

ఆధునిక మహాకావ్యమైన విశ్వంభర కావ్యం ద్వారా తెలిసిన విషయాల్నే సుబోధకంగా సుందరంగా చెప్పటానికి సినారె ప్రయత్నించారు. ఈ కావ్యంలో మానవేతి హాసానికి అంకురార్పణ గావిస్తూ సినారె ఆడం,ఈవ్‌లను ప్రతీకలుగా గ్రహించారు. బైబిల్‌లోని ఆడమ్‌ఈవ్‌ల కథకు మూలం ఋగ్వేదమేనని మన పండితుల భావం.

"ద్వాసు వర్ణా సయుజాసఖాయా
సమానం వృక్షం సరిష్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్య
త్యనశ్నన్నన్యో అభిచాకశీతి"–అని ఋగ్వేదం

–ఒకచెట్టు (ప్రకృతి),రెండు పక్షులు(ఆత్మ పరమాత్మలు)ఒక పక్షి(జీవుడు) పండు తింటున్నాడు. మరో పక్షి(దేవుడు),చూస్తూ అంతటా ప్రకాశిస్తున్నాడు.

ఆలంకారికంగా చెప్పిన సృష్టితత్త్వాన్ని ఆయా మతగ్రంథాలు తమ సంప్రదాయాలకు అనుగుణంగా అన్వయం చేసుకున్నాయి. చెట్టు పండును ఆడమ్ తినవద్దని ఈవ్‌ను ఆదేశించినా ఆమె గుండెలో కోరిక సర్పంలా తిరిగిందని చెప్పి "ఎంత రుచి ఆనిషిద్ధ ఫలానికి–ఎంత వడి ఈవిముక్త హృదయానికి "అంటాడు సి.నా.రె. జీవుడు ప్రకృతి ఆకర్షణకు లోనవుతున్నాడు. ఈవ్ కూడా ప్రకృతి ఆకర్షణకు లోనై పండు తింటానికి సాహసించింది. ఇక్కడ ఒకరి ఆంక్షతోపాటు మరొకరి కాంక్షను మనం గుర్తించ వలసి ఉంది. ఆదిమ సహచరుల్లో వివేకం వేయిరేకులుగా విచ్చుకుంది.

మనిషికంటే ముందు సృష్టిఉంది. మనిషిని ఉదయించే సూర్యుని కిరణాలు వెచ్చగా తాకాయి. ఈ సూర్యుడు మనిషి లాగే ఎదిగి వస్తున్నాడని సి.నా.రె.వ్యాఖ్యానించారు. 'చరాచర జగత్తుకు ఆత్మ సూర్యుడే' అనే వేదోక్తి ఇక్కడ స్ఫురిస్తుంది. సూర్యునికి మానవునికి కవి అభేదం చెప్పారు.

'విశ్వంభర'లో సినారె సృష్టి వైచిత్రిని అద్భుతంగా చిత్రించారు. ప్రకృతి ఎంత భయపెట్టినా,మానవుడు ప్రకృతిని జయించి పురోగామిగా వృద్ధిచెందాడని, తన నాభిపాదులో పుట్టిన నాదాన్ని సంగీతంగా వినిపించాడని చెప్పారు. తర్వాత నృత్యం,కవిత్వం,చిత్రలేఖనం,శిల్పం అనే కళల్ని వివరించి మానవుని కళాత్మక వికాసాన్ని తెలిపారు. సినారె మనిషిని వృక్షంతో పోల్చారు. మనసును మహాసాగరంగా భావించారు. మానవుని మనసే జీవితం సాఫీగా సాగటానికి కట్టుబాట్లను ఏర్పాటు చేసుకుని వెంటనే వాటిని ఉల్లంగిస్తుందని మానవ స్వభావాన్ని వివరిస్తూ

"తాను కట్టుకున్న చెలియలి కట్టను
తానే కబళించాలని చూస్తుంది"అని చెప్పి

అంతటా తానే అధికారం చెలాయించాలనుకోవటానికి కారణం మనస్సేనని నిర్ధారించారు.

మనిషి పరిణామాన్ని వివరిస్తూ "కాలాన్ని తొడుక్కున్నాడు మనిషి–కత్తిరించి కుట్లువేసి–పృథ్విని తివ్వాకున్నాడు మనిషి–నాలుగు దిక్కులను నాటేసి"అనిచెప్పి ప్రకృతిని తనకు అనుకూలంగా మార్చుకుంటూ "విస్తరించాడు మనిషి–విశ్వాన్ని ఆత్మీకరించుకుని–ఆవరించాడు మనిషి–అంబరాన్ని పిడికిలించుకుని" అని రచించాడు.

ప్రకృతిలోని చలనశీలానికి పరిణామం మనిషి. "జగతిలోని భ్రమణగుణానికి–ప్రతిరూపం మనిషి పాటలాసాగినమనసు–ఆటలా ఊగిన మనసు–మాటలను కప్పుకొని అర్థాలను అల్లుకొని–పలికింది అనంత ముఖాలుగా–ఒలికింది విభిన్న గళాలుగా" అని మనిషి ఆటపాటల పరివర్తనను తెలిపారు. అలాగే "మనిషి మనసుచూసుకుంది–తన నీడను అగణ్యరూపాలుగా –రసాహంకృతి కూర్చుకుంది–రక్తిని చైతన్యకోశాలుగా" అని మానవుని కళాత్మక పరిణామాన్ని ప్రకటించారు. కాలం మారుతోంది. మనసు గమ్యాన్ని అన్వేషిస్తోంది. అందుకే "పెరుగుతున్నది ఆ తపస్సు
శిరసు మీది పుట్టలను ఛేదించుకుంటూ స్థిర సంకల్పం
నాదంగా ప్రభోదించుకుంటూ
నక్షత్ర మండలాలను పెల్లడించుకుంటూ అక్షీణకాంతి

గోళాలను
అతిక్రమించుకుంటూ
అనాహతంగా అశరీరంగా ప్రస్థానిస్తూ
పెత్తనం మరిగిన వైభవ మత్తుల
ఎత్తు గద్దెను ప్రతిఘటిస్తూ" అని మానవ ప్రస్థానాన్ని వివరించారు. మానవునిలో అధికారదాహం పెరిగిన తీరును ప్రశ్నిస్తూ

"విజేతగా వెలగాలంటే-విశ్వాన్నే భస్మం చేయాలా?
ధరాలోభం తీరాలంటే-నరరుధిరమే కావాలా?
వేయి తోటలను నరికినచేయి-పూయిస్తుందా ఒక్కపువ్వును?
మారణ హుంకృతులు మరిగిననోరు-చేరబిలుస్తుందా ఒక్క శిశువును" అని రచించారు. రణోన్మాదం మానవ ప్రపంచానికి హానికరమని, నమస్సులు నరోత్తములకే అందుతాయని, శిరస్సులు కారుణ్యానికే వంగుతాయని చెప్పారు. "లక్షప్రాణాలను ఆర్పేసినకత్తి-ఒక్క ఊపిరిని వెలిగిస్తుందా?

ఉర్వీతలాన్ని వణికించిన శక్తి-ఒక్క హృదయాన్ని జయిస్తుందా?" అని మానవతాదృక్పథాన్ని ప్రకటించారు. కుత్తుకల్ని నరకటం వల్ల గెలుపురాదని, గుండెల్ని కదిపితే గెలుపువస్తుందని చెప్పారు. ఇంకా వినాశనం జరిగితే గెలుపుకాదని- వివేకం పెరిగితేనే గెలుపు లభిస్తుందని చెప్పారు. సమరం భీతిని రగిలిస్తుందని, సహనం ప్రీతిని వర్షిస్తుందని,అనురాగంచేసే శాసనమే అసలైన రాజనీతి అని అధికార దాహాన్ని నిరసించారు.

విశ్వంభరలోని నాల్గవ ఖండం సినారె తాత్త్వికచింతనకు నిలువెత్తునిదర్శనంగా నిలుస్తుంది. ఏ అధికారమూ శాశ్వతం కాదని,దాన్ని ఎదిరించే శక్తులు అవతరిస్తూనే ఉంటాయని,సోక్రటీస్,జీసస్‌ల పేర్లు ప్రస్తావించకుండా వారి వృత్తాంతాల్ని తెలిపారు. అధికారం అణగ ద్రొక్కుతూఉంటే పీడితులు నోరుమూసుకొని ఉండరని ప్రశ్నించేతత్వం ఎప్పటికైనా పెల్లుబుకుతుందని వివరిస్తూ

"అరుణోదయం ఊరుకోదు- కిరణాలను సారించనిదే వసంతోదయం ఊరుకోదు-పరిమణాలను పారించనిదే ప్రసరించే నీరు ఊరుకోదు-పల్లం అంతుముట్టనిదే ప్రతిఘటించే మనసు ఊరుకోదు -ప్రశ్నలను ఎక్కుపెట్టనిదే" అని రచించారు. ప్రశ్నల్ని సంధించకపోతే పరిణామమే ఉండదు. ప్రశ్నించే వారిని అణచటానికి ప్రయత్నిస్తే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని సోక్రటీస్ వృత్తాంతంలో తెలుపుతూ

"ప్రశ్నను బంధిస్తే ఉదయిస్తాయి-ప్రవచనాలు
గాలిని బంధిస్తే ఉబికివస్తాయి-కల్లోలాలు.....
ఆలోచనల పొద్దు పొడుపును-ఆపలేవు ఏ చీకట్లు"
అని హెచ్చరించారు. సృష్టి పరిణామం చెందాలంటే జ్ఞానబీజం మొలకెత్తాలి. చైతన్య తేజం వెలుగొందాలి. మానసిక మథనం జరగాలి. అందుకే

"అగుపించనిది నిత్యమా?-అగుపించేది మర్త్యమా?
ఎవడు చేసిన సృష్టి ఇది?-చివరికి మృత్యువే సత్యమా?
నిరంతర జీవయాత్ర-మరణానికి నేపథ్యమా?"
అని ప్రశ్నించారు. మానవుడు ఎన్ని విజయాలు సాధించినా, చివరికి అతనిలో కలిగే అసంతృప్తి అతణ్ణి జీవిత పరమార్థం వైపు తీసుకువెళుతుంది అనటానికి ఈ కవితా పంక్తులు ప్రత్యక్ష సాక్ష్యాలు.

మనిషిలోని జిజ్ఞాస పురోగమించిందని, ఎన్ని సత్యాల్ని ఆస్వాదిస్తున్నా ఆ పిపాస తీరటం లేదని, నిరంతర పరిశీలనాశక్తితో పరిశోధనాప్రతిభతో సాంస్కృతిక పరివర్తన చెందాడని కవి వివరించారు.

"ఎగిరే పక్షులను చూస్తూ-ఏళ్లతరబడి నిట్టూర్చినతాను
ఎగిసి పోతున్నాడు గగన వాటికి-ఏ రెక్కాహారలేని గూటికి
ఏటిని దాటి పోవాలంటే-మాటిమాటికి జడుసుకునేవాడు
కడలి కెరటాల లోగిళ్లను-పడక గదులుగా తీర్చుకున్నాడు
గాలిలోని పరుగును హరించి-కదిలే చక్రాలకు అంటించి
కాలుమీద కాలు వేసుకొని-లీలగా పయనిస్తున్నాడు"
మానవుని అన్వేషణా దృష్టి పరిణామం చెందినతీరును కష్టాల నుంచి సౌకర్యాల పథంలోనికి ప్రయాణించిన తీరును కవి ఇక్కడ స్పష్టం చేశారు. ఇంకా మానవ సంస్కృతీ వికాసాన్ని వివరిస్తూ కవి "తెరవెనుక బొమ్మలాడిస్తూ దరువులు వేసుకున్నతాను పలికే మనుషులను తెరమీద వెలుగు నీడలుగా ఆడిస్తున్నాడని చెప్పారు. దూరాన్ని దృశ్యంగా మార్చి, దృశ్యానికి నాదాన్ని కూర్చి కంటి ఇంటిలోకి చేర్చి కాపురం చేయిస్తున్నాడని అద్భుతంగా భావించారు. ఇంకా

"మరనే మలిగా మలచి-మనిషికి ప్రతిగా నిలిపి
ఆలోచనలకే సరికొత్త-ఆకృతులు గీస్తున్నాడు" అని మరమనిషి సృష్టిని గావించిన మనిషి ప్రతిభను ప్రశంసించారు.

అంతరిక్షపరిశోధనలు గావిస్తున్న మానవుని మేధను మెచ్చుకుంటూ

"అవనిపై ఉంటూనే కళ్లను-అంతరిక్షంలోకి పంపించి



నక్షత్రాల నాడుల జాడను-వీక్షిస్తూ ఉన్నాడు
అగుపించని జీవాణువుల-అనలురహాను
బయటపెట్టి
చూపులకు ఊహించలేని-సూక్ష్మత కలిగిస్తున్నాడు"
అని చెప్పారు.

వైద్య రంగంలో మానవుడు గావించిన పరిశోధనల పరిణామాన్ని వివరిస్తూ

"మృత్యువుకూ వ్యాధికీ ఉన్న-పొత్తును విచ్ఛేదించి
ఆరెంటికీ మధ్య మరింతగా-అఖాతం
పెంచుతున్నాడు" అని రచించారు.

అక్షరాలకు శాశ్వతత్వాన్ని సమకూర్చిన మానవుని ప్రచురణారంగ ప్రతిభను వివరిస్తూ

"గాలిగూటిలో గళ పేటికలో-మూలిగే అక్షర
నిధులను
ప్రత్యక్ష నిక్షేపాలుగా-పదిల పరచుకున్నాడు" అని
పేర్కొన్నారు.

నదీ గమనాలను నిరోధిస్తూ, వ్యవసాయరంగంలో మానవుడు సాధించిన ప్రగతిని అక్షరీకరిస్తూ సినారె

"పిచ్చిగా ఉరక లెత్తేనదులను-మచ్చిక చేసి పెరట్లో కట్టేసి
పైరు పాపలకు పాలిచ్చే-పాడియావులుగా
మలచుకున్నాడు" అని చెప్పారు. ఇంకా అణు గర్భంలో పొదిగి ఉన్న విశ్వతత్వాన్ని గుప్పిట్లో బిగించి అశ్వక్రీడలాడుతున్నాడని మానవుని పరిశోధనాత్మక ప్రతిభను ప్రశంసించారు.

మానవుడు తన జిజ్ఞాసతో ఎన్నో విజయాల్ని సాధించాడు. సృష్టికి ప్రతిసృష్టి చేయ గలిగే శక్తిని సాధించాడు. చివరకు అన్నీ తానై అహంకారానికి ప్రతిరూపమయ్యాడు. అందనంత ఎత్తుకు ఎదిగిన తానే ఆ ఎత్తునుండి పడిపోవటానికి సిద్ధమయ్యాడు.

"అణువులోని అవ్యక్త మూర్తిని-అజాండంగా
చూసినతాను
గ్రహాలలో సుప్తంగా పడి ఉన్న-గాలి ఉనికిని చూసినతాను
చూసుకున్నాడా తనలోని రూపం-తెలుసుకున్నాడా తన
మనసుతూకం"-అని ప్రశ్నించారు.

మనిషి ఎంతో ఎత్తుకు ఎదగవచ్చు. తోటి మనిషిని దిగువకు తొక్కి వేయటం మంచిది కాదు. కానీ లోకంలో కనిపిస్తున్న దృశ్యం ఇదే. మనిషికి జ్ఞానా జ్ఞానాలున్నాయి. జయాప జయాలున్నాయి. తన మనసును సరిగ్గా తూకం వేసుకోలేకపోతే "ఏ అడుగో తన పక్కను తాకితే ఎంత విషం కక్కుతాడు" అన్న మాటలు అక్షరసత్యాలు.

లోకంలో ఎన్నో విషయాల్ని గమనిస్తున్నాం. చేనిగట్టు కొద్దిగా తరిగితే తలకాయలు పగులుతున్నాయి. ఆటవట్టు కొన్న చెదిరితే అనుబంధాలు తెగుతున్నాయి. వయసంలో విలున్నున్న మైలురాళ్ళు పాదాలకు ప్రశ్నార్థకాలవుతున్నాయి. ఎక్కిన శిఖరాలను లోయల్లా మార్చుకున్నది, ఎగిసిన గగనాలను ఇరుకు గదులుగా చేసుకున్నది మనిషి అహంకారమేనని గుర్తించాలి.

శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంత అభివృద్ధిని సాధించినా మానవుడు అతీంద్రియ శక్తులపట్ల విశ్వాసాన్ని పెంచుకుంటున్నాడని సినారె వివరిస్తూ

"అలంకరించుకున్నాడు మెడలో- అభయ
చిహ్నాలను
అద్దుకున్నాడు నుదిటిపై-ఆత్మీయ విశ్వాసాలను
పై మెట్టు ఎక్కిపోవాలన్నా-పగవాణ్ణి
తొక్కిపోవాలన్నా
కట్టుకున్న రహస్యాల మూటలు-పట్టు పడకుండా
ఉండాలన్నా...
ఆ మనసుకు ఏకైక శరణం-అతిలోక శక్తుల సంస్మరణం"
అని మానవ సమాజంలోని వాస్తవికతను కళ్ళకుగట్టినట్లు వర్ణించారు.

సమాజంలో భిన్న మతాలు,కులాలు,ఆరాధనా విధానాలు అవతరించాయి. వాటిలో అభిప్రాయభేదాలు పొటమరించాయి. అందుకే

"కలరూపు ఒక్కటైతే-కలతలెందుకిన్ని?
మూలతత్త్వం ఒక్కటైతే -ముసుగులెందుకిన్ని?
-అని ప్రశ్నించి 'మానవతను అనుగమించే
ధ్యేయం-మనుషులనే వేరుచేస్తుందా?" అని వాపోయారు.
'ఇదిమనోనాదం కాదు- మైకం పట్టినరొద' అని
మతతత్వాన్ని, మూఢత్వాన్ని నిరసించారు.

మానవ సంస్కృతి పరిణామాన్ని విశ్వంభర నాల్గవ ఖండం చివరలో సినారె అద్భుతంగా వర్ణించారు.

"గుహనుంచి మహలు దాకా-నడక నుంచి రోదసీ
నౌకదాకా దివిటీల నుంచి విద్యుద్దీపాలదాకా-అమ్ముల
నుంచి అణ్వస్త్రాలదాకా ప్రవహించిన సంస్కృతికి
హేతువు-మనిషిలో వికసించిన విజ్ఞాన ధాతువు"-అని
మనిషిలో చైతన్య రూపానికి ప్రతీకంగా ఉన్న మానవుని జ్ఞానం వల్లనే ప్రకృతిలో మానవుని జీవనంలో ఎంతో వికాసం కలిగిందని చెప్పారు. అంతేకాదు

"చుక్కలను లెక్కిస్తూకూర్చుంటే-ముక్కారులు పండేవికా
అంతానుదుట రాసి ఉందంటే-యంత్రాలు నడిచేవి కా
విధిపరిధిలో సంక్రమిస్తుంటే-వివేకం పెరిగే



కాదు సంకల్పం నడుము కట్టకుంటే-చరిత్ర తిరిగేది కాదు. కాదు సంకల్పం నడుము కట్టకుంటే-చరిత్ర తిరిగేది కాదు. మనిషి జీవితం-అనుభవాంకితం"-అని చెప్పారు.

మనిషి జీవితం-అనుభవాంకితం"-అని చెప్పారు. మానవ ప్రయత్నమూ,శ్రమాలేకపోతే ఏ పరిణామమూ సాధ్యం కాదనే వాస్తవాన్ని కవి ఇక్కడ స్పష్టంచేశారు. మానవుడు తానుసాధించినదానితో తృప్తి పడకుండ నిరంతరం అన్వేషణ సాగిస్తూ సరికొత్త జీవితానికి, సంస్కృతికి రూపులు దిద్దుతూ ఉంటాడు. అందుకే సినారె "సాగిపోతాడు కాంతిలహరిలా-చైతన్యకేతనుడు మానవుడు" అని మానవుని నిత్య చైతన్య ప్రస్థానాన్ని గుర్తుచేశాడు.

సత్వరజస్తమో గుణాలతో కూడిన ఈ ప్రపంచంలో ఒక మనిషి ఇంకొక మనిషిని అణగద్రొక్కే ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. అందుకే "అయ్యో మనిషీ-అహంకారాల రంగద్దాలను-అంతరంగానికి తొడుక్కున్న మసీ-తెలుపు నలుపుల కొలమానాలతో విలువ కడుతున్నావా?" అని ప్రశ్నించాడు. మానవులంతా ఒక్కటేనని చెప్పటానికి "ఏవన్నె గోవైతేనేమి -ఇచ్చేపాలు తెలుపే

ఏ రంగు తనువైతేనేమి-ఆ రక్తం ఎరుపే-అనే వంక్తుల్ని రచించారు. ప్రపంచాధి పత్యాన్ని చేజిక్కించుకోవాలని, ప్రగతిని కబళించాలని ప్రయత్నించే శ్వేత వర్ణాహంకారాన్ని కవి ప్రశ్నించారు. "మనిషి అంటే వలలతోపట్టేసే మత్స్యం కాదని, గొలుసులతో కట్టేసే మృగం కాదని, నిత్యం సిలువకు మెక్కుకునే మనిషివై ఉండి, సాటి మనిషిపై స్వారి చేస్తూనే ప్రేమశాసనాన్ని చాటుతున్నావా?" అని శ్వేతవర్ణ అధికారాన్ని ప్రశ్నించారు. బ్రిటీష్‌వారి వర్ణ అహంకారాన్ని భారతీయుల్ని అణచివేయటానికి వాళ్ళుచేసిన ప్రయత్నాల్ని భాహ్యాంభ్యంతరంగా వర్ణించిన సినారె భారతీయుల చైతన్యాన్ని భావస్ఫోరకంగ "గోమాతల గిట్టల్లో-కొడవలి అంచులు నడుస్తున్నాయి, తెగిపోతున్న కండలు-ఎగురుతున్నాయి జెండాలుగా" అని వర్ణించారు.

ఆంగ్లేయుల దురహంకారాన్ని, పెత్తనాన్ని "మౌనమే నినాదంగా మందహాసమే మహాస్త్రంగా, సమానమే కవచంగా, శాంతమే ప్రవచనంగా నిరాడంబరంగా సాగే ఆ అడుగు గిరీంద్రాల తలలు వంచింది" అని జాతిపిత మహాత్మాగాంధీని గూర్చి చెప్పిన మాటలు స్ఫూర్తిదాయకాలు. అంతేకాదు "ఇన్ని పాతరల తుపాకి ముందు-ఎగిరిపోయిందే-ఒక్క బక్కపలచని నిశ్వాసం ముందు -ఇన్ని అంతస్తుల పునాదిరాళ్ళు-ఎగిరి పడ్డాయే-ఒక్క చెక్కుచెదరని విశ్వాసం ముందు" అని గాంధీ వైశిష్ట్యాన్ని ప్రకటించారు.

మానవుని లక్ష్యం వినూత్నచైతన్య సృజనమా? విశ్వగోళ విధ్వంసనమా?" అని ప్రశ్నించారు జీవనయానంలో ఎన్నో ఆటు పోట్లు జయాపజయాలు. అందుకే "ఇది నిత్య ప్రస్థానం-ఎగుడుదిగుళ్ళు తప్పవు-ఇదినిత్య ప్రయోగం-ఎదురు దెబ్బలు తప్పవు" అని చెప్పారు.

మానవుడు తనను ఆవరించిన తమస్సు నుంచి దానికి లోబడే మనస్సు నుంచి,ఆత్మ విశ్వాసంతో ముందుకు సాగాలి. అందుకే సినారె "తపస్సు వల పన్నినప్పుడు-మనస్సు పట్టు తప్పినప్పుడు ఆలోచన ఆయుధంగా-అంతశ్చేతన ఆలంబనంగా

పురోగమిస్తాడు మనిషి-పరిసరాల పైకెగసి"-అని రచించారు. అంతశ్చేతనం అంటే ఆత్మజ్ఞానమేనని గుర్తించి దాన్ని ఆలంబనంగా చేసుకొని మానవుడు పురోగమిస్తున్నాడనటం యధార్థం, అన్నిటికీ మనసే మూలమని గుర్తించాలి.

అందుకే సినారె

"ఋషిత్వానికీ పశుత్వానికీ-సంస్కృతికీ దుష్కృతికీ
స్వచ్ఛందతకూ నిర్బంధతకూ-సమార్ద్రతకూ
రౌద్రతకూ తొలిబీజం మనసు- తులారూపం మనసు
మనసుకు తొడుగు మనిషి-మనిషికి ఉడుపు జగతి
ఇదే విశ్వంభరా తత్త్వం-ఇదే అనంతజీవిత సత్యం"

-అని సినారె 'విశ్వంభర'కావ్యాన్ని ముగించారు. ప్రకృతికీ మానవునికీ ఉన్న సంబంధాన్ని మానవ జీవన సంస్కృతీ పరివర్తనను విశ్వంభరలో వర్ణించిన సినారె ఇటీవల 12-6-2017న ఈ విశ్వంభరను వీడి వెళ్లటం తెలుగు సాహిత్యానికి తీరనిలోటు. అయినా "సుకవి జీవించు ప్రజల నాలుకలయందు" అన్న జాషువా పలుకులు సినారె పట్ల ప్రత్యక్షర సత్యాలు.

# యువత సాంస్కృతిక జీవన విధానం - పరివర్తన

**శ్రీపాద సీతామహాలక్ష్మీ సత్యవతీ పేరమాంబ**

తెలుగు లెక్చరర్ (డెప్యుటేషన్)

శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ ప్రభుత్వ

అత్యున్నత విద్యాధ్యయన సంస్థ

రాజమహేంద్రవరం.

చరవాణి : 9440152037

suryam.madugula@gmail.com

ఆలోచనలు, ధర్మాలు ఒక వైపు; తెలివితేటలు, కల్పనాచాతుర్యం సౌందర్యారాధన మరొకవైపు: ఆచరణ, బాహ్యప్రవృత్తి ఇంకొవైపు - ఈ మూడు అంశాల త్రివేణి సంగమమే సంస్కృతి - అరవింద్ ఘోష్.

మన భారతదేశ సంస్కృతి విశ్వజనీనమైన విలువలు కలిగినటువంటిది. దేశం గొప్పది, విలువలు కలిగినది అంటే దేశప్రజలు గొప్ప సంస్కారవంతులని అర్థం. నిజానికి దేశం అంటే దేశప్రజల సంస్కృతి అని అర్థం. పాశ్చాత్యదేశాలు కళ్ళు తెరవకముందే మనదేశంలో సమస్తజ్ఞానానికి మూలమైన వేదాలు వెలిశాయి. ఒకరకంగా 'విశ్వగురువు' అని పేరు సంపాదించుకున్న మన దేశం అన్నిరంగాలలోను ఎన్నో దేశాలకంటె అగ్రగామిగా ఉండేది.

మన దేశం యొక్క పూర్వవైభవాన్ని మూడు రంగాల్లో ఇప్పుడు ముచ్చటించుకుందాం. మొట్టమొదటిది విద్యారంగం. ప్రపంచ ప్రఖ్యాతమైన మన విశ్వవిద్యాలయాలయిన నలంద, తక్షశిల, విక్రమశిల మొదలైన విశ్వవిద్యాలయాలలో మన దేశప్రజలతోబాటుగా ఎందరో విదేశీయులు విద్యనభ్యసించారు. మన సాంప్రదాయం, నాగరికత, సంస్కృతి మొదలయిన వాటికి తలవంచి లెక్కకుమించిన విదేశీయులు ఇక్కడే స్థిరపడిపోయారని చరిత్ర చెబుతోంది. అయితే నేడు విద్యకోసం మనం విదేశాలకు వెళ్ళి అక్కడే స్థిరపడిపోతున్నాం!

రెండవది వ్యాపారరంగం :- ఈ విషయం చూస్తే పూర్వం మనదేశం నుండి ఎంతో సరుకు విదేశాలకు వెళ్ళేది. విదేశీమారకద్రవ్యం లభించేది. ఇప్పుడు మనం స్వదేశీ వస్తువులు మాని విదేశీ వస్తువులనే విలాసంగా కొని తెచ్చుకొని తద్వారా విదేశీ మారక ద్రవ్యాన్ని వెచ్చిస్తున్నాం...!

ముచ్చటగా మూడవ విషయం, నైతివ విలువలు :- పూర్వం ఇంట్లో నుండి బయటకు వెళ్ళేటప్పుడు తాళాలు వేసుకునే పనిలేదు. ఏవిషయానికి సంబంధించిన ఒప్పందమయినా వ్రాత పూర్వకంగా చేసుకోవడమనేది లేదు. నోటి మాటలే తప్ప నోటు మాటలానాడులేవు. అంత నిజాయితీ! మరి నేడు బ్యాంకుల్లో పెన్ను రక్షణ కోసం 10 రూపాయల దారం, చలివేంద్రాల్లో మంచినీళ్ళ గ్లాసు రక్షణ కోసం 25 రూపాయల గొలుసు కడుతున్నాం.!

మన దేశంలో పూర్వం ఉన్న నదులు, పర్వతాలు, పర్యాటక స్థలాలు ఇప్పుడూఉన్నాయి. గొప్ప దేశం అన్న పేరు రావాలంటే దేశానికి ఏమేమి ఉండాలి?

"సరిహిం నసరేహిం నసరవరేహిం నవి ఉజ్జాణవణేహిం।
దేశ రవణ్ణోహోంతి వధ నివసన్తేహిం సు అణేహిం॥"

హేమచంద్రుడు వ్రాసిన ప్రాకృతశ్లోకమిది. ఏదేశమైనా, నదులవలన, సరస్సుల వలన, పెద్ద పెద్ద తటాకముల వలన, ఉద్యానవనముల వలన గొప్పది అవదు. ఆదేశంలో నివసించే సంస్కారవంతమయిన ప్రజలవల్లనే గొప్పదౌతుంది అని శ్లోకార్థం. 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అన్న గురజాడ వారికిది స్ఫూర్తి.

మనం సమాజంలో ఉన్నాం. మనం వేరు, సమాజం వేరు కాదు. మనం లేనిదే సమాజం లేదు. సమాజం లేనిదే మనకూ మనుగడలేదు.

"నువ్వూ నేను కలిస్తే మనం
మనం మనం కలిస్తే జనం
జనం జనం కలిస్తే సమాజం
సమాజం సమాజం కలిస్తే సుహృద్భావమ్"

మానవ సమాజం జీవనవిధానంలో ప్రముఖమైన విషయాలను అనగా జీవనం, ఆహారం, వ్యవహారాలు, ప్రమాణాలు, మతం, మానవ సంబంధాలు, పాలన మొదలుగా గల అనేక విషయాలను మన సంస్కృతి వివరిస్తుంది. భిన్నత్వంలో ఏకత్వం గల భారతదేశ సంస్కృతి అత్యంత ప్రాచీనమైనది. ప్రాచీన సంస్కృతిని మనకు అందించే సాహిత్య గ్రంథాల్లో బృహత్కథ, గాథా సప్తశతి ముఖ్యమైనవి. ఇవి రెండూ శాతవాహనుల కాలంనాటి ప్రాకృత భాషా గ్రంథాలు. గౌతమబుద్ధుని కాలానికే మనదేశంలో సుస్థిరమైన దేశీయ సంస్కృతి, సంప్రదాయం ఏర్పడ్డాయి. దేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రాంతీయమైన స్వల్ప భేదాలున్నప్పటికీ వాటికి అతీతంగా భారతీయసంస్కృతి ఆసేతు హిమాచల పర్యంతము ప్రజలందరి సంస్కృతిగా మారింది.

సంస్కృతి అనేది సమాజగతమయితే సంస్కారమనేది వ్యక్తిగతం. జనజీవనయానం ప్రశాంతంగా జరగాలంటే మన సంస్కృతి ఇచ్చే సంస్కారబలమే మూలాధారం. ఆత్మసంస్కారాన్ని నేర్పి, మానవుడు సంఘజీవి అని, మానవసేవే మాధవసేవ అని బోధించేది సంస్కృతి. ఇటువంటి బోధలు విశ్వానికి అందించిన ఘనత భారతీయ సంస్కృతికి ఉంది. శంకరాచార్యులు, రామకృష్ణపరమహంస, వివేకానందుడు, అరవిందులు, ఠాగూర్ మొదలగుగాగల అనేకమంది భారతీయ సంస్కృతీ వైభవాన్ని, ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పారు.

యువతీ యువకులు సంస్కారవంతులై, చక్కని జీవన విధానం అవలంబించినప్పుడే దేశ సంస్కృతి ఉన్నత శిఖరాలను అధిరోహిస్తుంది. ప్రపంచంలోనే మొట్టమొదటి గ్రంథమైన ఋగ్వేదం ఆధారంగా నేటి యువత ఆచరించవలసిన వైదిక సంస్కృతిలోని కొన్ని ముఖ్యమైన విషయాలను తెలుసుకుందాం...!

1) ఆశ్రమధర్మ వ్యవస్థ :-

ఇది మన సంస్కృతికి చాలా ముఖ్యమైన విషయం మానవజీవితం సుమారుగా 100 సంవత్సరాలు అనుకుంటే దానిని నాలుగు ఆశ్రమాలుగా విభజించారు. 0-25 సంవత్సరాలు విద్యాభ్యాసానికి, 26 నుండి 50 సంవత్సరాలు గృహస్థాశ్రమానికి, 51-75 సంవత్సరాలు వానప్రస్థానానికి, 76-100 సంవత్సరాలు సన్యాసాశ్రమానికి విభాగం చేయబడింది.

ఈ అంశాన్ని ఆధారంగా చేసుకుని కాళిదాస మహాకవి రఘువంశకావ్యంలో రఘువంశజుల జీవనవిధానం ఎలా ఉండేదో ఒక శ్లోకంలో వివరించాడు.

"శైశవే భ్యస్థ విద్యానాం
యౌవనే విషయైషిణాం
వార్థకే మునివృత్తీనాం
యోగేనాంతే తను త్యజామ్"॥

ప్రతి వ్యక్తి 25 సంవత్సరాల వరకు బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ విద్యను అభ్యసించాలి. ఆపైన 50 సంవత్సరాల వరకు గృహస్థాశ్రమంలో ఉండి సుఖాలననుభవించాలి. 50 సంవత్సరాలు పైబడినప్పుడు కుటుంబ బాధ్యతను పిల్లలకు అప్పగించి, ముని వృత్తిలో విశ్రాంతి తీసుకోవాలి. 75 సంవత్సరాల తర్వాత సన్యాసాశ్రమాన్ని స్వీకరించి ఆధ్యాత్మిక సాధనాలతో మోక్షం పొందాలి. ఇది మన సంస్కృతిలో భాగం. దీనిని విస్మరించకూడదు. ఈ ధర్మాలను మనం పూర్తిగా ఆచరింపకపోవడం వల్ల ప్రస్తుతం.

2) పరస్త్రీలయెడల మాతృభావన :-

ఇది చాలా ముఖ్యమైన విషయం దీనికి పోతన గారు భాగవతంలోని ప్రహ్లాదుడి వ్యక్తిత్వం వివరిస్తూ
"కన్నుదోయికి అన్యకాంతలడ్డంబయిన
మాతృభావన చేసి మరలువాడు"! అన్నాడు.

స్త్రీలను తల్లివలె గౌరవించడం భారతీయ సంస్కృతిలోని ప్రధాన విషయం. ఇది నేటి యువత ఆచరించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

3) నిరాడంబర జీవనం :-

ఎటువంటి ఆడంబరాలు లేకుండా జీవనం గడపడం మన సంస్కృతిలో భాగమైపోయింది.

"నిద్రాలస్యం దేహయుత్నం కేశవిన్యాస మేవచ
ఆసక్తిమశనే వస్త్రే నాతిరిక్తం సమాచరేత్॥ అని ఒక సంస్కృత శ్లోకం.

ఆహార వస్త్రాదులలో, శరీర పోషణలో, తలదువ్వుకోవడంలో ఎక్కువ ఆసక్తి ఉండకూడదని పైశ్లోకం చెబుతోంది.

"లడ్డూ జిలేబి హల్వాలె యక్కరలేదు
బియ్యపుండ్రాళ్ళకే చెయ్యిచాచు!
పలిపంపు పట్టు దువ్వలువలే పనిలేదు
పసుపు గోచికి సంబ్రాలు పడును!
ముడుపు మూటల పెట్టుబడి పట్టుదల లేదు
పొట్టి గుండిళ్ళకే పొంగిపోవు!
కర్పూరరాయిలకై తగాదా లేదు
గరిక పూజకె తలకాయనొగ్గు!
పంచకల్యాణికై యుబ్బసమ్ములేదు;
యెలుక తత్తడికే భుజాలెగురవైచు!
పంచ భక్ష్యాలకై మొండిపట్టులేదు,
పచ్చివడపప్పుతిను పట్టి పిచ్చి తండ్రి"!

జంధ్యాల పాపయ్యశాస్త్రి గారు వినాయకుడిని నిరాడంబరత్వానికి ప్రతినిధిగా పై పద్యంలో చెప్పారు. అందువల్ల జ్ఞానసముపార్జనే ధ్యేయంగా ఉండాలి తప్ప అప్రధానమైన అనవసరపు ఆడంబరాలకు, దాంబికాలకు నేటి యువతరం దూరంగా ఉండాలి.

4) వృత్తిపట్ల గౌరవం :-

వృత్తి అనేది మానవుని జీవనోపాధి. ఇందులో ఉచ్చనీచాలు లేవు. ఏ వృత్తి అయినా చేసే వృత్తి పట్ల పరిపూర్ణ విశ్వాసం, గౌరవం ఉండాలి. సహజమైన వృత్తి ఏదయినా దానిని గౌరవించాలి.

"కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా"! అని ఉన్నా నేడు కొన్ని వృత్తులు కనుమరుగయ్యాయి.

"కొత్తామాసకి నాగలిచెక్కి దీవనలిచ్చిన కుమ్మరియేడి?
సంకురాత్రికి కొత్తకుండలు చేసి పంపిన కుమ్మరి యేడి?
పంచెలుగా మంచాలు నేసిన ఇక్కడి దేవాంగుల వీధెక్కడ?
గరిసెల ధాన్యం గాదులు అల్లిన ఎఱకల గుడిసెలు ఏవీ ఇక్కడ?
ఆగరిసాల కుమ్మరి ఆవం రంపం మగ్గం ఉలి బాడిస
సమస్తవృత్తుల సరుకులు ఏవీ మచ్చుకైన కనిపించవేమరి"
పచ్చిమిరప పామాయిలు అరటి చెరకు వ్యాపార పంటలెవరివి
చోళ్ళు గంటెలు జొన్నలు ఊదలు ఉలవ జనప వరిచేలేమాయె
నాగలి పట్టి దున్నే నారైతన్నలేరీ వారేమయినారు?" అని

శ్రీ గంటేడ గౌరినాయుడు గారి ఆవేదనలో ఎంతో అర్థముంది. నేటి యువత ఇవన్నీ తెలుసుకుని ఏవృత్తిని స్వీకరించినా దానిపట్ల గౌరవభావాన్ని పెంచుకోవాలి.

5) పాపభీతి :-

పాపపు పనులు చేస్తే భగవంతుడు మనల్ని శిక్షిస్తాడనే భయం ఉండాలి. సాధారణంగా మనం స్వార్థంతోగాని, పెద్దవాళ్ళు చెబితే గాని, తప్పుచేస్తాం. ఫలితం అనుభవించేది మాత్రం కర్తా కారయితా చైవ ప్రేరకశ్చను మోదక : చత్వారో పాపభాగినః అని చెప్పబడింది. పాపపు పని చేసినవాడు, చేయించినవాడు, ఆపని చేయమని ప్రేరేపించినవాడు, అనుమతించినవాడు పాపాన్ని సమంగా పంచుకుంటారు. పుణ్యకార్యమైనా అంతే...!

6) సమస్త ప్రాణుల యెడ దైవభావన :-

శివాలయానికి వెళ్ళినపుడు నంది యొక్క కొమ్ముల నుంచి శివలింగాన్ని చూస్తాము. ఇందులో గొప్ప అంతరార్థం ఉంది. నంది పశువు, శివుడు పశుపతి. ప్రతి పశువులోను పశుపతిని చూడాలి. అంటే ప్రతి జీవిలోను భగవంతుని చూడాలన్న గొప్ప అంతరార్థం ఇందులో ఉంది. అది మనం గమనించకపోవడంవల్ల దాని ఫలితాన్ని మనం పూర్తిగా పొందలేకపోతున్నాము. ప్రతిమల పెండ్లి చేయుటకు పందలు వేలు వ్యయింత్రుగాని దుః
తమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పరీ భరతమేదిని ముప్పది మూడుకోట్ల దే
వతలెగబడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులారునే?
సాటిజీవిని జీవిగా చూడాలి. సాటి వ్యక్తి ప్రతిభక్తుడు ప్రతిజీవిలో భగవంతుని చూడగలిగితే, సమస్త ప్రాణికోటిలో దైవాన్ని దర్శించగలగడం భారతీయ సంస్కృతిలో ఒక భాగం దీనిని యువత ఆచరణలో పెట్టినపుడు దేశం పూర్వవైభవాన్ని సంతరించుకుంటుంది.

భారతీయ సంస్కృతిపై రామాయణ భారతాల ప్రభావం ఎక్కువగా ఉంది. వాటిలోని ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, సత్యం, అభిరుచులు, యువత జీవనవిధానంపై ప్రభావాన్ని చూపిస్తాయి. అందువల్ల యువతరం వీటిని విధిగా చదవాలి. జైన సంస్కృతిలోని పంచవ్రతాలు, త్రిరత్నములు, సమ్యక్ దర్శనం (=అస్త్రప్త్రీ ఖీఖఫ్త్ర), సమ్యక్ జ్ఞానం (=అస్త్రప్త్రీ ఖఅశీఎశ్రీవఎస్త్రవ), సమ్యక్ చారిత్రము (=అస్త్రప్త్రీ జశీఅఎబమ్) అనేవి నేటి యువతరానికి తెలియాలి. బౌద్ధ సంస్కృతిలోని అష్టాంగ మార్గాలు, ఇస్లాం రాజుల ప్రభావం వల్ల వచ్చిన త్యాగగుణం, బ్రిటీష్ పాలన నుండి వచ్చిన క్రైస్తవ సంస్కృతి భారతీయ సంస్కృతిని సుసంపన్నం చేశాయి. వీటన్నింటి ద్వారా నేటి యువత అవలంబించవలసిన ముఖ్యమైన లక్షణములను చూద్దాం...

1) ఏ పని చేసినా త్రికరణ శుద్ధిగా చెయ్యాలి.

2) హక్కులే కాకుండా బాధ్యతలను చక్కగా ఆచరించాలి.

3) సత్యం వద, ధర్మంచర అనేవి భారతీయ సంస్కృతికి ప్రాణంతో సమానం.

4) ప్రేమ, శాంతి, అహింస తప్పనిసరిగా అలవరచుకోవాలి.

5) చాంచల్యం, సంశయం, నిరుత్సాహం, దోషదూషణ ఉండకూడదు.

6) అకుంఠిత దీక్ష ఉండాలి.

ఆధునిక యువతరానికి వివేకానందులే విశ్వజనీన ఆదర్శం. ఆయన స్వల్ప జీవితకాలం 32 సంవత్సరాలులోనే ఎన్నో మహత్కార్యాలు చేశారు. ఆయన మానవాళి సంక్షేమానికి, అభ్యున్నతికి, ఆధ్యాత్మికోన్నతికి కృషిచేశారు. వారి బోధనలలో కొన్నింటినైనా నేటి యువతరం ఆదర్శంగా తీసుకుంటే దేశ సంస్కృతి వేనోళ్ళ కొనియాడబడుతుంది. వివేకానందుని బోధనలలో కొన్ని స్ఫూర్తిదాయక వాక్యాలు

1) సార్వజనీన ప్రేమ, బాధాతప్తులయెడ దయ అనేవి సేవాభావాన్ని పెంపొందిస్తాయి. అవి నైతిక జీవితాన్ని, ఆధ్యాత్మిక జీవితాన్ని గడపడానికి దోహదపడి వారు జీవితంలో సార్థకతను, శాంతిని పొందటానికి ఉపకరిస్తాయి.

2) నాయకత్వం వహించేటప్పుడు సేవకుడిగా ఉండాలి. నిస్వార్థంగా ఉండాలి. అనంత సహనం కలిగియుండాలి.

3) ప్రేమ, మంచితనం, పవిత్రత మనలో వృద్ధిచెందితే బయట ప్రపంచమంతా అవే మనకు కనబడతాయి.

4) అఖండమైన ఉత్సాహం, అపరిమితమైన ధైర్యం, అప్రతిహతమైన శక్తి అన్నింటినీ మించి పరిపూర్ణమైన విధేయత

అనే లక్షణాలు ఒక వ్యక్తిని గాని, దేశాన్ని గాని పునరుజ్జీవింపజేయగలవు.

5) విశ్వాసం, నిజాయితీ, శ్రద్ధాభక్తులు ఉన్నంతవరకు సర్వం వికాసాన్ని పొందుతుంది.

6) స్వలాభాన్ని, వర్గ కీచులాటలను, అసూయను విడిచిపెట్టాలి. భూమాతవలె ఓర్పు కలిగియుండాలి.

7) నిస్వార్థంగా పనిచేయాలి. మరొకరిని చాటున దూషిస్తున్న మిత్రుని మాటలను ఎన్నడూ వినవద్దు.

8) ఘనకార్యాలేవీ మోసంతో సాధించబడలేదు. అకుంఠిత దీక్ష, శక్తి ద్వారానే సాధ్యం. ధీరత్వాన్ని ప్రదర్శించాలి.

9) సోమరులుగా కాలం గడపవద్దు, దీక్షాపరులు కావాలి!

10) వ్యర్థకాలయాపన పనికిరాదు.

11) అసూయ, అహంకారం విడిచిపెట్టాలి. సత్ప్రవర్తనే మన ఊపిరి!

లేవండి! మేల్కొండి! గమ్యం చేరేవరకు విశ్రమించండి! వెయ్యిసార్లు విఫలమైనా మరోసారి ప్రయత్నం చెయ్యండి! ఈ విధమైన ఉత్తేజకరమైన వాక్యాల ద్వారా నేటి యువత సంస్కార భరితమౌతుంది. అత్యాధునికంగా శ్రీ ఉప్పులూరి మురళీకృష్ణగారు యువత ఉత్తమ సంస్కృతలోక జీవనానికి అత్యాధునికంగా శ్రీ ఉప్పులూరి మురళీకృష్ణ గారు యువత ఉత్తమ సంస్కృతిక జీవనానికి పది సోపానాలు అవసరమన్నారు. పది చిన్న చిన్న ఆంగ్లేయ పదాల్లో పది సోపానాలు అందించారు.

1) I (నేను): నేను అనే అహంకారాన్ని, స్వార్థాన్ని విడనాడి, సర్వ ప్రాణులలో దైవాన్ని చూడాలి. అప్పుడే మనిషి దేవుడు.

2) We (మనం) : ఐకమత్యంగా ఉండి అభివృద్ధి ఫలాన్ని అందుకుని పదిమందికి పంచి, అనుభూతిని అనుభవిద్దాం...!

3) Love (ప్రేమ) : ప్రేమ అంటే విశ్వప్రేమ. నిన్ను నువ్వు ఎలా ప్రేమించుకుంటున్నావో సర్వప్రాణులనూ ఆవిధంగా ప్రేమించగలగాలి. ప్రపంచమంతా ఒకే కులం. ప్రేమకులం. ప్రేమకు ఇవ్వడమే తెలుసు తీసుకోవడం తెలీదు.

4) Smile (చిరునవ్వు) : చిరునవ్వు అనేది ఎదుటివ్యక్తికి ఒకటానిక్ వలె పనిచేస్తుంది. అయితే మన చిరునవ్వు వంకర భావంతో కాని, వెక్కిరింత ధోరణిలో గాని, ఎదుటి వారి ఆత్మాభిమానాన్ని దెబ్బతీసే విధంగా గాని ఉండకూడదు.

5) Rumour (గాలివార్త) : ప్రపంచంలో అత్యంత వేగవంతమైనది గాలి. దానికంటె వేగవంతమయినది గాలివార్త. ఇదీ ఒక రకం అబద్ధం లాంటిదే! నిజం గడపదాటేలోగా అబద్ధం ప్రపంచాన్ని చుట్టివస్తుందట! ఇది భయంకరమైన పాపాల్లో ఒకటిగా చెప్తోంది ధర్మం.

6) Success (విజయం): కష్టపడేతత్వాన్ని అలవరచుకుని, విజయాన్ని కరతలామలకం చేసుకోవాలి. పట్టుదలని విక్రమార్కునిలా ప్రయత్నిస్తే విజయం దాసోహమంటుంది. మన లక్ష్యం విజయసాధనే!

7) Jealousy (అసూయ) : దీనికి మనం లొంగకుండా ఉంటే ఇది మనల్ని ఏమీ చెయ్యలేదు. మనలో ప్రవేశించిందా, మన పతనం ఖాయం! అసూయగ్రస్తుడు ఏ పనీ చేయలేడు. దేనినీ పొందలేడు. ఒక్క పతనాన్ని తప్ప!

8) Knowledge (విజ్ఞానం) :మనిషి ప్రతిభావంతుడు కావాలి. విజ్ఞానవంతుడు కావాలి.

స్వగృహే పుజ్యతే మూర్ఖః
స్వగ్రామే పూజ్యతే ధనీ
స్వదేశే పూజ్యతే రాజా
విద్యాన్ సర్వత్ర పూజ్యతే॥

విజ్ఞాని అన్ని చోట్లా గౌరవింపబడతాడు.

9) Confidence (నమ్మకం) : ఇది ఉంటే ప్రపంచాన్నే గెలవచ్చు. నేను ఏపనినైనా చేయగలను, దేనినైనా సాధించలను అనే గట్టి నమ్మకం ఉండాలి.

చివరిగా నాలుగురకాల వ్యక్తిత్వమున్న మనుషులను గురించి చెప్పుకోవాలి.

(1) He who knows not, knows not that he knows not is a fool, shunt him.

(2) He who knows and knows not that he knows is asleep, wake him.

(3) He who knows not and knows that he knows not can be taught, Teach him.

(4) He who knows and knows that he knows is a prophet, follow him.

ఈ విధంగా నడుం బిగించిన యువత భవిష్యత్తులో చక్కని సంస్కారంతో సాంస్కృతిక జీవన విధానంతో భారతీయ సంస్కృతిని అన్ని దేశాలోను అగ్రామిగా నిలబెడుతుందని ఆశిద్దాం!

ఉపయుక్త గ్రంథసూచి :


1) స్వామి వివేకానంద ఉపన్యాసాలు, రామకృష్ణమఠం, హైదరాబాద్ వారి ప్రచురణ

2) స్వామి వివేకానంద జీవితం - సందేశం, రామకృష్ణమఠం, హైదరాబాద్ వారి ప్రచురణ

3) హాపీలైఫ్‌కి సోపానాలు, రచయిత ఉప్పులూరి మురళీకృష్ణ

4) అన్నవి-అనుకొన్నవి, రచయిత అవధానుల మణిబాబు

5) ఉదయశ్రీ రచయిత డా॥ జంధ్యాల పాపయ్య శాస్త్రి

6) డా॥ చిలకమర్తి దుర్గా ప్రసాదరావు గారి అంతర్జాల ఉపన్యాసాలు

7) శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారి అంతర్జాల ఉపన్యాసాలు

# భవభూతి నాటకాలలో ప్రకృతి చిత్రణ - ప్రయోజనం

డా. దోనేపూడి రామాంజనేయ శర్మ, డైరెక్టర్
ఇగ్నో ప్రాంతీయ కేంద్రం, విజయవాడ

"కావ్యేషు నాటకం రమ్యం" అన్నారు. ఈ రమ్యత ఎలా కలుగుతుంది? అది కేవలం కథా బలమా? లేక రసపోషణ వల్ల కలుగుతుందా? లేక మరేమైనా కారణాలున్నాయా? అని ప్రశ్నించుకుంటే దానికి కారణం నాటకీయత అనే సమాధానం వస్తుంది. మరి నాటకీయత అంటే ఏమిటి? కావ్యాలలో లేనిదేమిటి? నాటకాలలో ఉన్నదేమిటి? కేవలం నాటకీయత వల్లనే నాటకాలకు ఈ రకమైన ఆధిక్యత కలిగేట్లయితే ఆ నాటకీయతను నాటక రచయితలు ఎలా సాధిస్తారు? అనే ప్రశ్నకు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు ఇలా చెప్తున్నారు. నాటకీయత రచనలో ఆరు అంశాల వల్ల సాధించబడుతుంది. అవి:

- రంగ పరికల్పనం
- సంభాషణ శిల్పం
- చతుర్విధ అభినయ ప్రదర్శన చాతుర్యం
- వర్ణనాంశాలను రూపక మర్యాదలుగా మలచటం
- రసపోషణం
- శిల్ప వైచిత్రి

సమర్థులైన నాటకకర్తలు ఈ అంశాల నన్నింటిని మేళవించి తమదైన ప్రత్యేకమైన శిల్పాన్ని ప్రదర్శిస్తూ నాటకాలను రచించారు. అటువంటి సంస్కృత నాటక రచయితలలో భవభూతి స్థానం చిరస్థాయి. విలక్షణం. నాటక రచనలో ఒక్క అంశం కుడా వ్యర్థంగా ఉండకూడదు. చివరికది ప్రకృతి వర్ణనమైనా సరే. కనుక భవ భూతి వంటి మహా కవి తన నాటకాలలో ప్రకృతి వరన చేస్తే అది - కేవలం నాటకం నిడివి పెంచటానికో- లేక తన పాండితీ ప్రకర్షను చాటటానికో చేసి ఉంటాడని భావించగలమా? కనుక భవభూతి తన నాటకాలలో ఎక్కడ ప్రకృతి వరన చేసినా అది పైన పేర్కొన్న ఆరు అంశాలలో మొదటిదైన " రంగ పరికల్పన" లో భాగమై ఉంటుంది. రంగ పరికల్పనలో భాగమంటే అక్కడ నటించబోయే నటీ నటుల మనోభావాలకు అనుగుణమై ఉండేది, కథాంలకు ఉపబలకంగా ఉండేది, అప్పుడప్పుడు భవిష్యత్ కథాసూచకంగా ఉండేదని అర్థం.

ప్రకృతి కవులందరికీ లలిత మనోహరంగా కనిపిస్తే భవభూతి మాత్రం దానికి అదనంగా ప్రకృతి రెండవ పార్శ్వమైన ఉగ్రరూపాన్ని కుడా దర్శించాడు, వర్ణించాడు. నిజానికి ఆయన నాటకాలలో ప్రకృతి లలితమైన రూపం కంటే ఉగ్రరూపంలోనే ఎక్కువ దర్శనమిస్తుంది. చివరకు శృంగార రస ప్రధానమైన మాలతీ మాధవం నాటకంలోను శ్మశానాన్ని అత్యంత భీతావహంగా వరి?ంచాడు. అందుకు కారణం కథాంశాల అవసరమనటం కన్నా, భవభూతి స్వభావ గాంభీర్యమంటే బాగుంటుంది. అలాంటి ప్రకృతి ఉగ్రరూపాన్ని ఆయన సహజాతి సహజం గా చిత్రించాడు. ఇది ఆయన వైశిష్ట్యం. భవభూతి బహుశా దుర్గమారణ్యాలను స్వయంగా దర్శించి ఉంటాడు. కనుకనే అతడు తన నాటకాలలో ప్రకృతిని అంత సహజంగా కనులకు కట్టినట్లు వర్ణించగలిగాడు. గమనింప దగిన అంశమేమంటే భవభూతి రాసిన రామ కథా ప్రధానమైన నాటకాలు రెండు. మొదటిది ఉత్తరరామచరిత్ర కాగా రెండవది మహావీర చరిత్ర.. వీటిలో కరుణ, వీరరసాలు ప్రధానమైన రసాలు కాగా ఆయన రాసిన శృంగారరస ప్రధానమైన మాలతీ మాధవం మూడవ నాటకం. మూడింటిలోనూ ప్రకృతి చిత్రణం చేయటం అతని శిల్ప వైశిష్ట్యాన్ని పట్టి ఇస్తుంది. ఇందుకు ఆయన ఎన్నుకొన్న ఇతివృత్తం, అందులోని సన్నివేశాలు సహకరించటం విశేషం.

దట్టమైన అరణ్యాలు, అందులోగల క్రూర మృగాలు, పక్షులు వాటి ప్రవర్తన - తత్కాల నాయకీ నాయకుల మనో భావాలకు ఆ ప్రవర్తనను లంకె పెడుతూ భవభూతిచేసిన ప్రకృతివర్ణన అనిదంపూర్వం. ఉత్తరరామ చరిత్రలోని కొన్ని సన్నివేశాలలో చేసిన ప్రకృతి వర్ణనను ఈ దృష్టితో పరిశీలిద్దాం.

ఉత్తరరామచరిత్ర లోని ప్రథమాంకంలో సీతను చూడటానికి వచ్చిన జనక మహారాజు వెళ్లి పోయాక సీత దుఃఖ పడుతూన్నప్పుడు లక్ష్మణుడు ప్రవేశించి, సీతా రాముల చరిత్ర చిత్రంగా లిఖించబడిందని, సీతా రాములకు వచ్చి దానిని చూడమనీ చెప్తాడు. సీత అగ్ని ప్రవేశం వరకు ఉన్న ఆచిత్ర పటాలలో అక్కడక్కడ ప్రకృతిచిత్రణ ఉంది. అది సీతకు మనోవినోదాన్ని కల్గించటంతో పాటు ఆమె మరల అరణ్య ప్రకృతిని చూడాలని కోరుకున్న దన్న మిషతో అరణ్యాలకు పంపటానికి కుడా అక్కడి ప్రకృతి చిత్రణ ఉపకరించింది. అంటే కథా గమనానికి అక్కిడి ప్రకృతి చిత్రణ ఉపయుక్త మైనదన్నమాట.

చిత్రాలను చూస్తూ శ్రీ రాముడు సెలయేళ్ల పక్కనున్న మునీశ్వరుల ఆశ్రమాలను వర్ణిస్తే, లక్ష్మణుడు ప్రస్రవణ పర్వతాన్నిలా వర్ణించాడు.

" అయమవిరళానోకహా నివహా నిరంతర స్నిగ్ధ నీల పరిసరారణ్య పరిశుద్ధ గోదావరీ ముఖర కందరః, సంతత

మభిష్యందమాన మేఘ మేదురిత నీలిమా, జనస్థాన మధ్యగో గిరిః ప్రస్రవణోనామ"

అటుపై శ్రీ రాముడు సీతా! నీకా రోజులు గుర్తున్నాయా? అప్పుడు ఆ ప్రస్రవణ పర్వతం దగ్గరలోనే మనం ఉండేవాళ్ళం. లక్ష్మణుడు మనకు సకల సేవలుచేస్తూ ఉండేవాడు. ఆ చక్కని గోదావరి నీటి ప్రవాహాలు గుర్తున్నాయా? ఆ నదీ ప్రవాహం పరిసరాల్లో మనం సుఖంగా గడపిన రోజులు గుర్తున్నాయా? అంటూ ఆమెకు తమ పాతరోజులను గుర్తుచేసి మళ్ళీ వాటిని చూడాలన్న సీతకోర్కెను ఒక రకంగా శ్రీ రాముడే ప్రేరేపించినట్లయింది. అప్పుడు లక్ష్మణుడు కుంజవాన్ అనే పేరుగల దండకారణ్యభాగాన్ని, అందులోని మతంగాశ్రమాన్ని, పంప అనే పేరుగల పద్మ సరోవరం గురించి చెప్పగా శ్రీ రాముడు:

ఏతస్మిన్ మదకల మల్లికాక్ష పక్ష
వ్యాధూత స్ఫురదురుదండ పుండరీకాః
బాష్పాంభః పరిపతనోద్గమన్తరాళే
సందృష్టా కువలయినో భువో విభాగాః

అప్పుడు శ్రీరాముడు కూడా ఆ పద్మ సరోవర సౌందర్యాన్ని ఈ శ్లోకంలో వర్ణించాడు. ఈ పంపా సరస్సులో నల్లని ముక్కు నల్లని పాదాలు గల మల్లికాక్షములనే పక్షులు ఆనందంతో తుళ్ళుతూ, కలరవాలు చేస్తూ, తమ రెక్కలతో కొట్టి లావైన కాండములుగల తెల్లతామరలను అటు ఇటు చెదరగొట్టాయి. అప్పుడు ఆ నందులలో గల కలువల సమూహాలు కనిపించాయి. అట్టి ఈ సరోవర సౌందర్యాన్ని నిరంతరాయంగా చూడనీక నా కన్నీరు ఆటంకపరచింది. ఒక కన్నీటి బొట్టురాలి మరొక కన్నీటి బొట్టు ఉబికి వచ్చే లోపు కొంచం కొంచంగా దీని అందాల్ని చూశాను.

అయితే శ్రోతలకు ఇక్కడొక అనుమానం రావచ్చు. అదేమంటే శ్రీరాముడు సరోవరం అందాల్ని వర్ణించాడా? లేక తన దుఃఖాన్ని సీతతో పంచుకొన్నడా? అన్నదే ఆ అనుమానం. అదే భవభూతి ప్రత్యేకత. ముందే చెప్పినట్లు ఏ వర్ణనా కేవలం వర్ణన కాదుబీ ఆ మిష తో పాత్రల మనోభావాలను వ్యక్తం చేశాడు భవభూతి. సీతా! నీవు లేనప్పుడు నీ విరహంతో నేను దుఃఖించానని రాముడంటే – అది కేవలం ఒక గంభీరభావశూన్యమైన వాక్యం అవుతుంది. అదే – నీవియోగ దుఃఖం వల్ల వచ్చిన కన్నీటితో ఈ సరోవరం అందాల్ని సరిగా చూడలేకపోయానంటే అది రస భరితమైన కవిత్వమౌతుంది. అదీ తేడా. దానిని భవభూతి శిల్పమనవచ్చు.

చివరికిలా గత జీవన స్మృతులను చిత్రపటాలలో చూసి చూసి సీత ఆ ప్రదేశాలను మళ్ళీ చూడాలని ముచ్చట పడింది. ఆ కోర్కెయే ఆమెను మళ్ళీ అరణ్యాలపాలు చేసింది. ఇలా ఈ సన్నివేశంలో గల ప్రకృతి చిత్రణ భవిష్యత్ కథ జరగటానికి హేతువయింది.

రెండవ అంకంలో వనదేవతను ఒక పాత్రగా ప్రవేశ పెట్టి ఆమె తాపసితో మాట్లాడినట్లు చిత్రించడం ఒక వినూత్న కల్పన. రెండవ అంకం ప్రారంభంలో ఒక శ్లోకం ఉంది. అందులో గ్రీష్మ తాపాన్ని భరించలేని జంతువుల ప్రవర్తన వర్ణించబడింది. ఆశ్లోకమిది.

కందూల ద్విపగండ పిండ కష ణో త్కంపేన సమ్పాతిభిః
ఘర్మ సంశ్రిత బంధనైస్స్వకుసుమై రర్చంతి గోదావరీమ్
ఛాయా పస్కిరమాణ విష్కర ముఖ వ్యాకృష్ట కీట త్వచః
కూజత్క్లాంత కపోత కుక్కుట కులాః కూలే కులాయద్రుమాః

అంటే – ఈ మధ్యాహ్న సమయంలో ఎండకు తట్టుకోలేక ఏనుగులు నదీతీరాన ఉన్న వృక్షాల నీడలలో నిలిచి చెక్కిళ్ళ దురద తీరేలగా చెట్లకు రుద్దుకుంటున్నాయి. ఆ అదురుపాటుకు, ఎండ వేడికి తొడిమలు వూడిన పూలు రాలి కింద గోదావరి నదిలో పడుతున్నాయి. ఆ దృశ్యం చూస్తే చెట్లు తమ పూలతో గోదావరిని అర్చిస్తున్నాయా అన్నటులుంది. వాటి పక్కనే గుంపులు గుంపులుగా చేరిన పక్షులు చెట్ల బెరడు కింద దాగిన పురుగులను వెదకి వెదకి తింటున్నాయి. పావురాళ్ళు, కోళ్ళు మొదలయినవన్నీ ఎండ వేడికి అలసి పోయి, భరించలేక గూళ్ళల్లో చేరి బాధతో అరుస్తున్నాయి.

ఇంతకంటే సహజమైన వేసవి వర్ణన మరెక్కడయినా కన్పిస్తుందా? అందుకనే –భవభూతి దుర్గమారణ్యాలు స్వయంగా దర్శించి ఉంటాడని అనిపిస్తుంది. ఇందులో మొదటి రెండు పంక్తులలో సహజోక్తి తో కూడిన ఉత్ప్రేక్ష అలంకారం ఉంది. కవిత్వం ఉంది. చివరి రెండు పంక్తులను భవభూతి తప్ప మరెవరు రాయలేరని అనిపిస్తుంది. ఆ సమయం లో పక్షుల ప్రవర్తన సహజంగా చిత్రితమైంది. ఎండ వేడికి పక్షులు నీడలోకి వెళ్ళాయి గానీ, ఆకలి ఆగదకదా! కనుకనే చెట్ల బెరడులకింద దాగిన పురుగులను వెదకి వెదకి తింటున్నాయట. అయినా ఒక ప్రక్క భరించలేని చండభానుడి ప్రతాపంటీ కనుకనే తట్టుకోలేక అరుస్తున్నాయట. ఎంత సహజమైన వర్ణన! ఇది ప్రకృతి ఉగ్ర రూపం. ఇక్కడ నెమళ్ళనాట్యాలు లేవు. కోకిలల పాటలు లేవు. రంగు రంగుల పూల ఇంద్రధనుస్సులు లేవు. – కఠోర వాస్తవాల సంకలనం మాత్రమే ఉంది.

ఇది రాముని జీవితానికి దర్పణం. కఠోరమయిన సీతా విరహం రామునికి దురరేంగా ఉంది. కథ ప్రకారం ఈ సన్నివేశం తరువాత శ్రీరాముడు ప్రవేశించి శంబూక వధ చేయాల్సి ఉంది. మరొక ప్రక్క ఆయన వైయక్తిక దుఃఖం ఆయనకు ఉండనే ఉంది. కనుక ఈ సన్నివేశంలో ఈ వర్ణన శ్రీరామునికి చాల చక్కగా అనువర్తిస్తుంది. ఆ వన్య జీవుల లాగే శ్రీరాముడు

దుస్సహమైన రెండు రకాల దుఃఖాలను అనుభవిస్తున్నాడని చెప్పటం తాత్పర్యం. కనుక ఇది సార్థకమైన ప్రకృతి చిత్రణ. శంబూక వధానంతరం ఈ దండకారణ్యానికి వచ్చి నాకు శ్రేయస్సు కలిగించారని చెప్పే వరకు రామునికి అది దండకారణ్యమన్న గమనిక లేదు. అప్పుడు చుట్టూ పరికించి అడవులు, కొండలు, సెలయేళ్ళు, పుణ్య తీర్థాలు, ఆశ్రమాలు గమనించి అప్పునిది దండకారణ్యమేనని నిశ్చయించుకొంటాడు. అందులో జనస్థాన ప్రాంతాన్ని గుర్తు పడతాడు. దానిని ధృవపరుస్తూ శంబూకుడు ఇలా అంటున్నాడు.

నిష్కూజ స్తిమితాః క్వచిద్ క్వచిదపి ప్రోచ్చండ సత్వ స్వనాః
స్వేచ్ఛా సుప్త గభీర భోగ భుజగ శ్వాస ప్రదీప్తాగ్నయః
సీమానః ప్రదరోదరేషు విలసత్ స్వల్పామ్భసో యా స్వయం
తృష్యద్భిః ప్రతిసూర్యకై రజగర స్వేద ద్రవః పీయతే

అంటే ఈ అడవిలో కొంత భాగంలో మృగాలు ఎలాంటి శబ్దాలు చేయక ప్రశాంతంగా ఉన్నాయి. మరికొన్ని చోట్ల ఘాతుక మృగాలు భయంకరంగా గర్జిస్తున్నాయి. కొన్ని చోట్ల బాగా బలిసిన కొండచిలువలు నిద్రిస్తూ వదిలే తీవ్రమైన నిట్టూర్పు గాలులకు మంటలు తీవ్రంగా మండుతున్నాయి. ఈ వేసవి తీవ్రతకు అన్ని చోట్ల నీరెండి పోయాయి. అక్కడక్కడ లోతైన గుంటల్లో నీటిలా కన్పించేది అజగరాల దీర దేహాలనుండి కారిన స్వేద జలం మాత్రమే. వాటిని దప్పిగొన్న తొండలు నీరని భావించి త్రాగుతున్నాయి- అంటూ శంబూకుడు అరణ్యాల భయానక స్థితిని వర్ణిస్తే శ్రీ రాముడు ఆ తరువాత ఒక్క ముక్కలో దాన్ని కొట్టి పారవేస్తాడు. నా సహచరి, నాప్రాణానికి ప్రాణమైన సీతతో కలసి సంచరించిన ఈ ప్రదేశంలో నేను ఒంటరిగా ఉండటం కన్నా భయానకమైన విషయం మరొకటి ఏముంది? ఈ ఒక్క వాక్యంతో శంబూకుడు వరించిన అరణ్యాల స్థితి మాయం కాలేదు గానీ తన దుఃఖం దానిని మించినదని శ్రీ రాముడు తన కరుణాపూర్ణమైన స్థితికి ఆ భయానక దృశ్యాన్ని అంగభూతం చేస్తాడు. నిజానికిది కవి వర్ణనా వైచిత్రి. శ్రీ రాముడు చెప్పిన ఈ ఒక్కవాక్యం తో అతని ఒంటరితనం, సీతా వియోగ దుఃఖం ఎంత భయానకంగా ఉన్నాయో శ్రోతలకర్థమై ఉంటుంది. ఇది మహాకవుల రచనా విధానం.

రస పరంగా ఆలోచిస్తే రామునిది విరహజనిత దుఃఖం. కేవల విరహమైతే పునస్సమాగమ ఆశ ఉంటుంది గనుక అది కరుణం కాదుటీ కానీ శ్రీ రామునికి ఇక్కడ సీత బ్రతికి ఉంటుందన్న ఆశ లేదు- రామునికిది కరుణ రసమే. అరణ్యాలలో వేసవి వర్ణన భయానకమైన విషయం. దానినిక్కడ తన కరుణాపూర? మైన స్థితికి అంగ భూతం చేసి - ఆ భయానకద ృశ్యాన్ని మించినది నా వియోగ దుఃఖ మని చెప్పటం వల్ల వేరువేరు రసాలను పోషించినా ప్రధాన రసమైన కరుణ రసానికి దానిని అంగ భూతం చేసి కవి తన రసపోషణ నేర్పును ప్రదర్శించాడుటీ దానికి ప్రకృతి చిత్రణ ఆలంబన మైనది. కనుక ఇక్కడి ఈ ప్రకృతి వర్ణన అత్యంత సహజమూ, సార్థకము అయిందని చెప్పవచ్చు.

అయితే భవభూతికి ప్రకృతిలోని భయానక దృశ్యాలు తప్ప సుందర సుకుమార మనోహర దృశ్యాలు కన్పించవా? అనే సందేహం కలగవచ్చు. అలాంటిదేమీ లేదని భవభూతి ఆ వెంటనే శంబూకునిచే రమణీయ ప్రకృతి దృశ్యాలను వర్ణింప జేశాడు.

“ సరే! మహారాజ! శ్రీ రామా! ఈ దుర్గమ దక్షిణ దండకారణ్యాలనలా ఉండనీండి. ఇప్పుడు ప్రశాంత గంభీరాలయిన మధ్యమారణ్యాలను వీక్షించండి. ఇక్కడ చెట్లు దట్టంగా ఉండి, వాటి ముదురాకుపచ్చ ఆకులపై సూర్య కాంతి ప్రతిఫలించి, ఆ కాంతి నెమలి కంఠం రంగులో కనిపిస్తూ ఉంది. ఇలాంటి వృక్ష సముదాయాల చుట్టూ కొండలు వ్యాపించి ఉన్నాయి. ఎప్పుడూ చీకటులు కమ్ముకొనేంతగా నీడనిచ్చే రకరకాల వృక్ష సముదాయాలుండటం ఈ అరణ్యాల ప్రత్యేకత. ఇక్కడ సెలయేళ్ళు ప్రవహిస్తున్నాయి. వాటి తీర భూములలో ప్రబ్బలి తీగలు దట్టంగా అల్లుకున్నాయి. అవి విరబూసి ఉన్నాయి. వాటిపై పక్షులు వాలటం వల్ల ఆ పూలు రాలి సెలయేళ్ళలో పడుతున్నాయి. అందువల్ల ఆనీటికి చల్లదనం, తేటదనం తో పాటు సుగంధమూ అబ్బింది. ఇంకాస్త ముందుకు చూస్తే సెలయేటి ప్రవాహ మార్గంలో దట్టంగా ఉన్న నేరేడు వృక్ష సమూహాలు, వాటినిండా నల్లని నేరేడు పండ్లు ఉన్నాయి. ఆ పండ్లు చాల అధికంగా ఉండటం వల్ల ఆకులు మరుగున పడి మొత్తం నల్ల నేరేడు పండ్లే కనిపిస్తున్నాయి. సెలయేళ్ల మీదుగా ప్రవహించటం వల్ల నీరు శబ్దంచేస్తూ ఉంది. శ్రీరామా! ఇదెంత రమణీయ దృశ్యమో గమనించు - అంటాడు. అదివిన్న శ్రీ రాముడు శంబూకుని వీడ్కొల్పి - అక్కడి అరణ్యాల శోభను స్వయంగాను ఎంతో మెచ్చుకొని “ అయ్యయ్యో! ఇదివరకు సీతతో గడపిన ఆ రమణీయ ప్రదేశాలకా నేనిప్పుడు వచ్చింది? ఈ రమణీయ దృశ్యాలన్నీ ప్రస్తుతం సీత నాతో లేదన్న విషయం గుర్తుకు తెస్తూ నన్ను బాధిస్తున్నాయి గదా! - అంటాడు.

అంటే ఇక్కడి ఈ వనవర్ణన నాయకుడైన శ్రీ రాముని దుఃఖాన్ని అతిశయింప జేయటానికి- తద్వారా వారిరువురి అన్యోన్యానురాగం ఎంత బలమైనదో శ్రోతలు గమనించటానికి ఉపయుక్తమైనదన్నమాట.

ప్రకృతి ఉగ్ర రూపమే కాదు- లలితమనోహరరూపం కూడా రామునికి ప్రశాంతత నివ్వలేక పోయింది. కారణం - ఆ

ప్రశాంత రామణీయకతాన్ని. శ్రీ రాముడిదివరకు సీతతో కలసి అనుభవించాడు. ప్రస్తుతమాయన ఏకాకి. కనుక అది సుఖ దాయకం కాక దుఃఖ దాయకమైంది.
సుఖ దాయకం కాక దుఃఖ దాయకమైంది. అనుభవించే సమయంలో ఎంత విచిత్రం? ఎంత కష్టపడినా అనుభవించే సమయంలో కష్టంగా అనిపించినా కష్టం కాలాంతరంలో గుర్తు చేసుకుంటే అది ఒక జ్ఞాపకమే గాని దానివల్ల మళ్ళీ దుఃఖం కలుగదు. కానీ శ్రీరాముడిక్కడ ఇదివరకు అనుభవించిన సుఖాలను తలచుకొని, వన రామణీయకతను దర్శించి, ఆ సుఖానికి కారణమైన సీత ప్రస్తుతం తనతో లేదుగదా! అని దుఃఖిస్తున్నాడు. అంటే ఇక్కడ సుఖం కూడా దుఃఖానికి కారణమైందన్నమాట. ఇది భవభూతి సన్నివేశ కల్పనా వైచిత్రి. దానికి కూడా ప్రకృతి చిత్రణం ఉపకరణం కావడం యాదృచ్ఛికం మాత్రం కాదు. కవి ప్రతిభే అందుకు కారణం.

ఈ సన్నివేశంలో అక్కడి స్థితిని వరి?ంచే మరొక చక్కని శ్లోకం వినండి:-

పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితామ్
విపర్యాసం యాతో ఘన విరల భావః క్షితిరుహామ్
బహోర్దృష్టం కాలాదపరమివ మన్యే వనమిదమ్
నివేశశ్శైలానాం తదితమితి బుద్ధిం ద్రఢయతి

ఈ నదులలో ఇదివరకు ప్రవాహాలున్నచోట ఇప్పుడు ఇసుక మేటలున్నాయి. ఇదివరకు ఇసుక తిప్పలున్నచోట ఇప్పుడు ప్రవాహాలున్నాయి. చెట్లు కూడా అప్పుడు పల్చగా ఉన్నచోట ఇప్పుడు దట్టంగాను, అప్పుడు దట్టంగా ఉన్నచోట ఇప్పుడు పల్చగాను ఉన్నాయి. కానీ చాలాకాలం తరువాత చూసినప్పుడు (12 సంవత్సరాలు గడిచాయికదా) ఇలాంటి మార్పులు కనిపించినా, కదలక స్థిరంగా ఉండే కొండలవల్ల ఈ ప్రదేశాన్ని నేను సరిగానే గుర్తిస్తున్నాను. - అని అంటాడు. ఇది చక్కని వర్ణన. కాలపరిణామం లో జరిగే మార్పు . భవభూతి కొండ కోనలు పట్టి తిరగనిదే ఇంత చక్కని వర్ణన చేయగలడా? అన్న అంశాన్ని అటుంచితే ఈ శ్లోకం - వ్యంగ్యార్థం గ్రహిస్తే శ్రీ రామునికి చాల చక్కగావర్తిస్తుంది. ఎలాగంటే బి అప్పటి ప్రవాహం సీతమీది ప్రేమ. కానీ ఇప్పుడు దాని దిశమారింది ( జనాపవాదం దృష్ట్వా ) కనుకనే సీతను అడవికి పంపాడు. ఇప్పుడున్న ప్రవాహం (శ్రీ రాముని బుద్ధి ) ధర్మం పక్షాన ఉంది. అతని మనస్సు ధర్మం విషయంలో కొండలా స్థిరంగా ఉంది. అది ఎన్నటికీ మారదు. కనుక సీతపట్ల అమితమైన ప్రేమ ప్రదర్శించిన ఆ శ్రీ రాముడే - సీతనరణ్యాలకు పంపిన ఈ రాముడని గ్రహించండి. ఈ రకమైన అర్థం చెప్పటానికి శ్లోకంలో ఉన్న ఘన, విరళ, భావః అనే పదబంధం ఆస్కారం కల్పిస్తోంది. భావః అంటే శ్రీ రామునికి సీతపట్ల ఉన్న ప్రేమ. అది ఒకప్పుడు సీత పట్ల, ఘన అంటే ఎక్కువగాను మరొకప్పుడు ( జనపవాదం దృష్ట్వా - లోకం దృష్టిలో ) విరళ తక్కువయినట్లు గాను ఉందని అర్థం.

శ్రీ రామునికి సీతపై ఎప్పుడూ ఎడతెగని మమకారమే, ప్రేమనే అయినా జరిగిన సంఘటనల దృష్ట్వా (సీతను అడవులకు పంపటం వల్ల ) లోకులకు ఈ రకమైన భావం కలిగేందుకు ఆస్కారం ఉంది గదా! నిజానికి శ్రీ రాముడిక్కడ బంధానికి బాధ్యతకు మధ్య బలియైనాడు. సీత, శ్రీ రాముడు ఇద్దరూ ధర్మ నిర్వహణ రూప యజ్ఞంలో సమిధలయినారు. ఇద్దరూ కష్టాలు పడ్డారు. సీత అడవులలో, రాముడయోధ్యలో ఉన్నారు. సీతకు సౌకర్యాలు లేవు. రామునికి సౌఖ్యం లేదు. ఆమెకు శ్రీ రాముడు తనను అడవులకు ఎందుకు పంపాడో తెలియదన్న దుఃఖం. తనకత్యంత ప్రేమాస్పదురాలు, ప్రాణానికి ప్రాణమైన సీతను, నిండు గర్భిణిని నిర్దాక్షిణ్యం గా - కారణం చెప్పకుండా అడవులకు పంపవలసి వచ్చింది గదా! అన్న అంతర్మథనమాయనది. కనుక రాముని దుఃఖమే అధికం. కనుకనే పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః - అంటాడు భవభూతి. కనుకనే ఈ శ్లోకం శ్రీ రామునికి ధ్వని గర్భితంగా వర్తిస్తుందని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇక్కడి ప్రకృతి చిత్రణ శ్రీ రాముని ప్రకృతి అంటే స్వభావ చిత్రణమే. కనుక ప్రకృతి అందచందాల్ని వర్ణించిన శ్రీ రాముడు వెంటనే - సీతను అరణ్యాల పాలు జేసి వచ్చిన నేను ఒంటరిగా ఈ ప్రదేశాలను ఎలా చూడగలను? చూడకుండా ఎలా ఉండగలను? అంటాడు. ఇదిఎంతో చక్కని వాక్యం. ఎలా చూడగలను? అనే వాక్యం ఎవరయినా రాయగలరు. సీత తన వెంట లేదుగదా అనే రాముని దుఃఖాన్ని ఆ వాక్యం చక్కగా వ్యక్తం చేస్తుంది. చూడకుండా ఎలా ఉండగలను? అనే వాక్యాన్ని ఒక్క భవభూతి మాత్రమే రాయగలడు. అంటే శ్రీ రాముడు కేవలం ఆ దండకారణ్య ప్రాంతాల రామణీయకతకు ముగ్ధుడై చూడకుండా ఎలా ఉండగలను? అని అన్నాడా? కానే కాదు. శ్రీ రాముని దృష్టిలో సీత ప్రస్తుతం బ్రతికిలేనే లేదు. ఆమెతో కలసి బ్రతికిన మధుర క్షణాలను, ఆ తీపి జ్ఞాపకాలను (అవి హృదయాన్ని బాకుల్లా గుచ్చుతున్నా సరే) జ్ఞప్తికి తెచ్చే ఆ ప్రదేశాలను చూడకుండా ఉండలేనని మాత్రమే ఇక్కడ శ్రీ రాముని భావం. ఇలా ఉత్తర రామ చరిత్రలో ప్రకృతి చిత్రణ అడుగడుగునా - సన్నివేశ కల్పనలో-పాత్ర చిత్రణలో-సంభాషణా శిల్పంలో ఒక అనివార్య అంగం గా ఉపకరణంగా మారి భవభూతి "శిల్పాన్ని" కల్పనా వైచిత్రిని పట్టి ఇస్తున్నది. ఇది వర్ణనల -ముఖ్యంగా ప్రకృతి వర్ణనల ప్రయోజనానికి పరాకాష్ఠ భవభూతి కవితా కళకు నిలువెత్తు నిదర్శనం. కనుకనే ఆయన రచనలు కాలాన్ని జయించి నేటికీ స్థిరం గా నిలిచాయి.

# తెలుగు, సవర, రెల్లి భాషల్లో జానపద సంస్కృతి – పరివర్తన ప్రాధాన్యత

డా॥ తరపట్ల సత్యనారాయణ,
సహాయాచార్యులు, తెలుగుశాఖ,
ఆదికవి నన్నయ విశ్వవిద్యాలయం.
Cell : 9290630752

మౌఖిక ప్రచారంలో ఉన్న ప్రజా సాహిత్యమే జానపద సాహిత్యం. జనజీవన సంస్కృతికి ప్రతిబింబం జానపదం. తరతరాల తరగని వారసత్వ సంపదగా నిలిచిన జానపదం ఆధునిక కాలంలో అత్యాధునిక యంత్రవినియోగ వాతావరణానికి తట్టుకోలేక తన ఉనికిని కోల్పోతూ కొన ఊపిరితో బ్రతుకుతున్నాయి. రహదారులు ఏర్పడడంతో రవాణా సదుపాయలు పెరగడంతో ప్రజా జీవన విధానంలో అనేక మార్పులు వచ్చాయి. ఈ మార్పులు జనజీవన గమనాన్ని సమూలంగా మార్చివేసాయి. ఈ సమయంలో పచ్చదనానికి బదులు వెచ్చదనం ఏడింతలు పెరిగి పర్యావరణానికి విఘాతం ఏర్పడింది. కొండ కోనలు ఉప్పుడు మండే ఎండలతో, వ్యాధి బాధలతో, కరువు కాటకాలతో కొట్టిమిట్టాడుతున్నాయి. పచ్చదనం ఎక్కడుటుందో అక్కడే పాడిపంటలు, వాటితో పాటు పనిపాటలు కూడా ఉంటాయి. సాధారణంగా పనిలేకుండా పాట, పాట లేకుండా పని ఉండదు. ఈ రెండు కలిస్తేనే జానపదం చూపానినంతమేర పచ్చగానే కనిపిస్తుంది.

ఇది అత్యంత ఆధునిక నాగరిక యుగం అనుకుంటూ ప్రపంచీకరణ బాటలో నడుస్తున్నాం. పై పై మెరుగుల రంగుల వాతావరణంలో నడుస్తూ ప్రకృతిని పర్యావరణాన్ని పట్టించుకునే స్థితిలో లేం. ఒకప్పటి సంస్కృతి ఇప్పుడు కన్పించడం లేదు. ఒకవేళ సంస్కృతీ పరిరక్షణలో భాగంగా సంప్రదాయ పద్ధతులను అవలంభిస్తుంటే పాతకాలపు మనిషిగా, చాదస్తపు మనిషిగా తేలికగా కొట్టిపారేస్తూ గాలి కబురులు చెప్పుకుంటూనే ఉన్నాం. శాస్త్రీయ అధ్యయనం పేరుతో అసలు శాస్త్ర రహస్యాలను చేధించలేకపోతున్నాం. ప్రకృతి మనకు అందించిన ఆకులను, కాయలను, వేరులను, పసరులను, మూలికలను, బెరడులను... ఇలా ఎన్నో ప్రకృతి వైద్య ఫలాలను అందుకోలేకపోతున్నాం. కాని ఒక సారి విశ్లేషిస్తే ఆనాటి జానపద వైద్యం వాటి విశిష్టత ఏమిటో మనకు అర్థమౌతుంది. ఇదంతా మన జానపద సంస్కృతిలో భాగమే. ఎవరి సంస్కృతి వారికి గొప్పగా ఉండవచ్చు. కాని జానపద సంస్కృతి మాత్రం జనసంస్కృతిగానే నిలిచింది. అందుకే మన ప్రాచీన మానవ జీవన మనుగడను, వారి ఆచార సాంప్రదాయాలను పరిశీలిస్తే మనం ఏవిధంగా, అంచెలంచెలుగా ఆధునికంగా మారామో తెలుస్తుంది. ఈ క్రమంలో మానవ మస్తిస్కంలో వచ్చిన ఆలోచనలతో జన సంస్కృతి పరిధవిల్లి పట్టణాలుగా, నగరాలుగా, మహానగరాలుగా మారడం వల్ల జానపదం కూడా నగర జానపదం, పట్టణ జానపదం, పల్లె జానపదం, మండల జానపదం, కుల జానపదం, దేశ జానపదంగా వివిధ శాఖలుగా విస్తరించి నూతన పరిశోధనలకు నాంది పలికింది. ఈ పరిశోధనలు అంతర్జాతీయ స్థాయికి చేరిందంటే జానపద సంస్కృతి ఎంత విశిష్టమైనదో అర్థం చేసుకోవచ్చు.

బహుభాషల్లో విస్తారంగా ఉన్న జానపదాన్ని పరిశీలిస్తే ఆయా భాషల్లో ఉన్న స్వచ్ఛమైన పదజాలం, సాహిత్యం ఎంత ప్రాచీనమైందో దాని ప్రధాన్యత ఏమిటో అర్థం చేసుకోవచ్చు. లిఖిత రూప సాంప్రదాయంలో ఉన్న జానపదం కన్నా అలిఖిత రూపంలో ఉన్న జానపదంలో అచ్చమైన జానపద శైలి, నుడికారంలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. అందులో అలిఖిత రూప భాషా వ్యవహర్తల జానపదంలో ప్రధానంగా రెల్లి, సవర భాషాజానపదంలోని సంస్కృతిని, పరివర్తనను పరిశీలిద్దాం.

**సవరలు :** శ్రీకాకుళం జిల్లాలోని తూర్పు కనుమల్లోను, ఒరిస్సాలోని కోరాపుట్, కలహాంది, మయూర్‌బంజ్, బాలసోర్, కటక్, గంజాం జిల్లాల్లో సవరలు ఎక్కువగా కనిపిస్తారు. అలాగే మధ్యప్రదేశ్, పశ్చిమ బెంగాల్, అస్సాం రాష్ట్రాల్లో కూడా సవర్లు జీవిస్తున్నారు. ఆంధ్రదేశంలో ఉన్న శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో వీరి సంఖ్య గణనీయంగా ఉంది. ఈ భాషల్లో గేయ సంపదతో పాటు కథా సంపద పుష్కలంగా ఉంది. ఈ భాషపై గిడుగువారు చేసిన కృషి మర్చిపోరానిది. ఆయన సేకరించి 1913లో ప్రచురించిన "సవర సాంగ్స్" చెప్పుకోదగ్గవి.

**రెల్లీలు :** ఉత్తరాంధ్రాలో వీరు ఎక్కువగా కనిపిస్తారు. వీరి ప్రధాన వృత్తి పండ్లు అమ్మడం, తోటలకు కాపుకాయడం. వీరికి ప్రత్యేకమైన భాష ఉంది, కాని లిపి లేదు. ఇది ఒరియా భాషతో కొంత పోలిక కలిగి ఉంది. ప్రస్తుతం రెల్లి ప్రజలు తూర్పు, పశ్చిమ, కృష్ణా, గోదావరి జిల్లాలలో కూడా ఎక్కువగానే ఉన్నారు. వీరి ఆచార సాంప్రదాయాలు ఒక ప్రత్యేకమైనవిగా కనిస్తాయి. కొన్ని చోట్ల వీరు పారిశుద్య పనుల్లో

నిమగ్నమై ఉన్నారు. వీరి భాషలో గేయాలు, కథలు ఎక్కువగానే ఉన్నాయి. వీటిని సేకరించి ప్రచురించిన వారిలో చెన్నా సన్యాసిరావు ప్రముఖమైన వారు.

ప్రస్తుతం సవర, రెల్లి, తెలుగు జానపద గేయ సాహిత్యంలో గొన్ని గేయాలను పరిశీలిస్తే ఒకే భావనతో కూడి వెలువడిన గేయాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. వాటిలో జోలపాటలు, లాలిపాటలు, హాస్య గేయాలు ప్రధానంగా చెప్పుకోదగ్గవి. వాటిని ఒకసారి పరిశీలిద్దాం...

తెలుగు నేలపై ఇప్పటికీ గుర్తుండే గేయం

చందమామరావె - జాబిల్లి రావె
కొండెక్కిరావె- గోగిపూలు తేవె
బండెక్కిరావె - బంతిపూలు తేవె
అన్నిటిని తెచ్చి - మా అబ్బాయికి ఇయ్యవే...

ఈ గేయం అబాల గోపాలాన్ని ఆకట్టుకుంటుంది. ఇదే రకమైన గేయం సవర జానపదంలో కూడా కనిపిస్తుంది...

డై డై మామాలె - అదాతోరన్ ఎఞ్‌తియ్యె
డై డై మామాలె - తర్జాజాపు ఎఞ్‌తియ్యె
డై డై మామాలె - కింతే గురున్ ఎఞ్‌తియ్యె
డై డై మామాలె - గోతోర్ గోతోర్ ...

ఈ గేయంలో సవర తల్లులు పిల్లల్ని చంకనపెట్టుకుని, చిన్నగిన్నెలో పెరుగన్నం కలిపి చంద్రుడువైపు చూపిస్తూ, అన్నం తినిపిస్తూ పిల్లల్ని ఆడించే సన్నివేశం కనిపిస్తుంది. దీనిలో చందమామను చూపిస్తూ తేనె తేవె, అన్నం ముద్ద తేవె, అరటి పళ్ళు తేవె, అన్నిటిని తెచ్చి పిల్లలకిచ్చి వాళ్ళను నవ్వించవే అనే భావనతో ఈ గేయం కొనసాగుతుంది.

అలాగే తెలుగు భాషలో

సీతారాముడు పెళ్ళి - చూసొద్దాం రండి
భోజనాలన్నీ - చేసొద్దాం రండి
కట్నాలన్నీ - ఇచ్చొద్దాం రండి ...

అనే ఈ పాట మాదిరిగానే సవర జానపదంలో కూడా ఒక గేయం ఉంది...

కిత్ తుజన్ సెర్ రుజన్
రాజాసిర్ రుజన్
సోరాసెర్ రుజన్
బాబా జోజాబ్‌జి
బాబా తానాజి

అనే ఈ గేయం ప్రచారంలో ఉంది. దీనిలో దేవుని పెళ్ళికి వెళ్ళొద్దాం రండి, రాజుల పెళ్ళికెళ్దాం రండి అమ్మలార రండి, వెళ్దాం రండి అనే భావనతో కూడిన ఈ గేయం విశేషంగా ఆకట్టుకుంటుంది. అలాగే తెలుగులో బహుళ ప్రచారంలో ఉన్న

ఏడవకు ఏడవకు - వెర్రి పాపాయి
ఏడిస్తే నీకళ్ళు - నీలాలు కారు...

అనే ఈ గేయం లాంటిదే సవర జానపదంలో కూడా కనిపిస్తుంది

జాజా ఒఓన్ కుల్‌బాన్ ఎరాఇతే
జాజా నానాకిన్‌సోర్ ఎరాఇతే
కడబానా సాన్‌నారీ, జోశీత్ ఎరాఇతే
పగోత్, లబగారీ జాడాన్ ఎరాఇతే ...

అనే ఈ గేయంలో జోజో నాన్న జోజో నాన్న ఏడవకు ఏడిస్తే దెయ్యం వస్తాది, ఏడిస్తే కుక్క వస్తాది, ఏడవకు ఏడవకు ఏడిస్తే పాము వస్తాది అని భయపెట్టి ఏడుపును ఆపించే ప్రయత్నంలో తల్లులు ఈ గేయాన్ని పాడుతారు. ఇలాంటి లాలి జోల పాటలు సవర భాషలో ఎన్నో కనిపిస్తాయి.

ఈ విధంగా సవర, తెలుగు, రెల్లి భాషా జానపదంలో సమాంతరమైన భావనతో కూడుకున్న గేయాలు వాటి విశిష్టత ఇంకా తెలియాలంటే తులనాత్మక భాషా అధ్యయనం ఎంతైనా అవసరం.

**పరివర్తన ప్రాముఖ్యత :** ప్రస్తుతం ఏభాషలోనైనా, ఏ సంస్కృతిలోనైనా మార్పులు చేర్పులు రావటం సహజమే భాష పరిణామ వికాస స్వభావం కలిగినది. కాలానుగుణంగా వచ్చిన మార్పులు అనుసరిస్తూ పరిసరాలను అనుసరిస్తూ పదజాలంలో, నుడికారంలో నూతన కల్పనలలో అనేకమైన కొత్త కొత్త భాషా పద, వాక్య నిర్మాణాలు జరగడం సహజమే. అందులో భాగంగా జానపద భాషా, సంస్కృతిలో పిల్లల గేయాలు, పారమార్థిక గేయాలు, హాస్య గేయాలు మొదలైన వాటిలో అన్య భాషలతో సత్సంబంధాలు ఉన్నట్లుగాను, భావవ్యక్తీకరణలోను పోలికలు కనిపిస్తాయి. ప్రస్తుతం ప్రపంచీకరణ ప్రభావంతో భాషలోను పదజాలంలోను నూతన పద కల్పనలలోను కొత్త దృక్పథం కనిపిస్తుంది. ఇది అన్యభాషా సంస్కృతిలో వచ్చిన మార్పులుగా గమనించవచ్చు.

**ఆధార గ్రంథాలు :**


1) గిడుగు రామ్మూర్తి పంతులు - సవర సాంగ్స్
2) భద్రి కూర్మారావు - కళింగాంధ్ర జానపద గేయాలు
3) డా॥ తరపట్ల సత్యనారాయణ - రెల్లి భాషవ్యవహర్తలు - పుట్టుపూర్వోత్తరాలు (వ్యాసం)

# జానపద జీవన విధానం- పరివర్తన

పాత అశోక్
పరిశోధక విద్యార్థి,
తెలుగు అధ్యయన శాఖ,
తెలంగాణ విశ్వ విద్యాలయం,
డిచ్ పెల్లి , నిజామాబాద్.
సెల్.నెం. 9703042628
విద్యుల్లేఖ : ashokteluguiiit@gmail.com

గ్రామాల్లో నివసించే ప్రజలను జానపదులుగా చెప్పవచ్చు. జానపద సంస్కృతికి నిలయాలు పల్లెటూళ్ళు. పల్లె జీవుల జీవిత విధానమంతా కూడా జానపద విజ్ఞానం అనవచ్చు. జన పదులు అనగా తక్కువ జనాభా గల గ్రామాలు లేదా పల్లెలు. జనపదాల్లో నివచించే వారిని జానపదులు అంటారు. "పుస్తకాలు చదివి సంపాదించిన విజ్ఞానం లేక, ఆధునిక నాగరికతతో సంపర్కం లేక, పల్లె పట్టులల్లో నివసించే ప్రజానికాన్ని మనం జానపదులని పిలువవచ్చును అని దేవులపల్లి రామానుజరావు 'జ్ఞానపదులు-జానపదులు' అనే గ్రంథం లో తెలిపారు. (పుట 106). జానపదులకు సంబంధించిన విజ్ఞానాన్ని ఆంగ్లంలో పోక్ లోర్ అని పిలుస్తారు. ఏ జాతికైనా, ఏ భాషాకైనా, ఏ దేశానికైనా, ఏ ప్రాంతానికైనా జానపద వ్మాయం అనేది సహజ సంపదగా ఉంటుంది.

జానపద సంస్కృతిని మతప్రసక్తి లేకుండా వారు జరుపుకునే పండుగలు, వారి సహజీవన విధానాలు, మానవ మనుగడ, కొనసాగింపుకు నిదర్శనమైన మార్గదర్శకాలు, స్వచ్ఛమైన ఆధారాలు. వీటిని ఆధునికులు మరిచిపోవడం ఒక ఎత్తైతే తమను నాగరికులుగా భావించుకునే కొందరు ఎగతాలి చేయడం జరుగుతుంది. జానపద సమాజంలో పండుగలు, ఉత్సవాలు, జాతరలు, నోములు, వ్రతాలు కొన్ని వందల సంవత్సరాల నుండి వ్యక్తులందరిని ఒక దగ్గరకు చేర్చి వారు పరస్పరం ఆనందానుభూతులను పంచుకునేలా చేస్తాయి. దీని మూలంగా జానపదుల్లో సంఘటనాభావం పెరిగి సామాజిక ఆచారాలు స్థిరపడ్డాయి.

పల్లె పట్టుల్లోని మౌఖిక, వస్తు సంస్కృతులను ఫోక్ లిటరేచర్ అండ్ కల్చర్ అని పలకడం స్థిరపడిపోయింది. ఫోక్ ని జానపదంగా మనం తెలుగులో అనువదిస్తున్నాము. ఫోక్ అనేది ఇంగ్లీషులో ఒక ప్రజాసమూహాన్ని నిందార్థంలో పిలవడానికి ఉద్దేశించే పదం. క్లాసుకు వ్యతిరేకమైందన్న అర్థంలో ఈ ఫోకును వాడతారు. 1940 లో ఈ ఫోక్ ను జానపదం అని ఇక్కడి పండితులు స్థిరపరిచారు. పాండిత్యంకు వ్యతిరేకమైన నిమ్నతా సూచకమైన పదమిది. అక్షర జ్ఞానంలేని, ఆధునిక నాగరికత ప్రభావం సోకనివారు. పల్లెల్లో ఉన్న పట్టణాల్లో ఉన్నా జానపదులే. మానవుడు చేస్తున్న పనులు రెండు రకాలు. 1. శారీరకం, 2. మానసికం. జానపదులకు సంబంధించినంత వరకు శారీరక శ్రమయే శ్రమ.

గృహ జీవనమైన, వ్యవసాయ జీవనమైనా, కూలీ జీవనమైనా, వృత్తి జీవనమైనా వీటన్నింటిలోను ఉన్నది శ్రమ. తాము పడుతున్నటువంటి కాయ కష్టాలను వ్యక్తిగా, సామూహికంగా పాడుతున్న పాటల్లో వారి సంఘజీవనమేమిటో పరిశీలించవచ్చు.

జానపద విజ్ఞానంలో జానపదులకు సంబంధించిన జీవన విధానంలో ఉండే అన్ని విషయాలను జానపద విజ్ఞానం అనవచ్చు. ఇందులో స్థూలంగా చూసినట్టయితే మౌఖికసాహిత్యం, సాంఘికాచారాలు, భౌతిక వస్తు సంస్కృతి, ప్రదర్శన కళలు, జానపదుల భాష ఉంటాయి. వీటిలో పూర్వం నుంచి నేటి వరకు ఇవి ఎన్నో మార్పులకులోనైనవి. ఆధునిక కాలంలో వచ్చిన సాంకేతిక మార్పులు జానపదుల జీవన విధానం శీఘ్రంగా పరివర్తన చెందడానికి కారణమైందిగా చెప్పవచ్చు. మార్పు అనేది ఎవరూ పనికట్టుకొని చేసేది కాదు. చాపకిందనీరులా మనకు తెలియకుండానే దానంతట అదే జరిగిపోతుంది. గోరేటి ఎంకన్న రాసిన "పల్లే కన్నీరు పెడుతుందో ...." అనే పాటలో పల్లీయుల జీవనం నేటి ఆధునిక జీవన విధానంవల్ల ఎంత మార్పుకు లోనైందో కళ్ళకు కట్టినట్లు చూపిస్తారు.

ఆధునిక జీవనవిధానంతోనే అభివృద్ధి సాధ్యమనే భావన జానపదులకు కూడా ఒంటపట్టినట్లు అనిపిస్తుంది. మానవుని జీవన శైలిలో ఏ నగరికతతో ఐనా మౌళిక జీవన

విధానంలో పెద్దమార్పులేమి జరిగక పోయినా వాటి అనుబంధ జీవనాలతో ముడి పడిన విషయాలు చాలా వరకు మార్పులకు లోనైనాయి. ఉదాహరణకు జానపదులు మౌళికంగా ఆహారం తీసుకునే విషయంలో మార్పులేకున్నా ఆహారాన్ని సమకూర్చుకునే విషయంలో మార్పు జరిగిందని చెప్పవచ్చు. పూర్వం అటవి సంపద మీద ఆధారపడిన వారు ఇప్పుడు తనే తనకిష్టమైన ఆహారాన్ని స ృష్టించుకునే దశకు చేరుకున్నాడు. అలాగే పూర్వం రోకళ్లో దంచిన వడ్లను బియ్యంగా మలచుకొనేవారు నేడు ఆధునిక యంత్రాల సహాయంతో బియ్యంగా మార్చి తింటున్నారు. పూర్వం కట్టెల పొయ్యి మీద వండుకునే దశ నుంచి మీథేన్, బ్యూటేన్ వాయువులతో తయారైన సిలిండర్ పొయ్యి ద్వారా తయారైన ఆహారాన్ని స్వీకరిస్తున్నాడు. ధాన్యం దాచిపెట్టుకోవడానికి పూర్వం గాగులు, మట్టి పాత్రలు వాడినవారు నేడు గిడ్డంగులలో దాచిపెట్టుకుంటున్నారు. పూర్వం రాళ్ళతో తయారు చేయబడిన, మనుషుల శ్రమద్వారా ఉత్పత్తి అయ్యే రోలు, దుబ్బ రోలు, విసుర్రాయిలపై ఆధారపడినవారు నేడు ప్రపంచ స్థాయిలో ఉత్పత్తవుతున్న మిక్సీ గ్రాండర్ లను వినియోగిస్తున్నారు. పూర్వం తినడానికి గుండుపళ్ళెం, మట్టిపాత్రలు, సత్తుపళ్ళెం, రాగి కంచం, విస్తరు ఆకులలో తినేటువంటి వారు నేడు పింగాని, స్టీలు, ప్లాస్టిక్, పేపర్ ప్లేట్లలో తినడానికి అలవాటు పడుతున్నారు. పూర్వం ఈత సాప, తుంగ సాపల్లో కూర్చునేవారు నేడు సోఫాసెట్లు, కుర్చీలు వినియోగిస్తున్నారు. పూర్వం మట్టితో కట్టిన గోడలు, వెదురుతో అల్లినతడకలు, పైకప్పుగా సహజవనరులైన తుంగనుగాని, తాటికమ్మలుగాని, వరిగడ్డిని గాని, కొబ్బరిమట్టలు గాని కప్పేవారు. నేడు ఖనిజ సంపద నుండి వెలికి తీసిన సిమెంటుతో కట్టిన గోడలు, పాలరాతి బండలు, కాంక్రిట్ తో నిర్మించిన భవంతుల్లో నివసించడం కానవస్తుంది.

పూర్వం వ్యవసాయ ఆధారిత పొలాలను దున్నటానికి ఎడ్లను కట్టి నాగళ్ళతో దున్నేవారు కానీ నేడు ఆధునిక యంత్రాలైనటువంటి ట్రాక్టర్లను, యంత్రనాగళ్లు, క్రషర్, వరికోత మిషిన్లను, నాట్లమిషన్లను వాడుతున్నారు.

కట్టుబొట్ల సాంప్రదాయాన్ని మనం చూసుకున్నట్లయితే పూర్వం పురుషులు పంచలు ధరించేవారు నేడు జీన్స్ పాయింట్స్, షర్ట్స్ కూడా వేసుకుంటున్నారు. ఇక స్త్రీలు లంగావోణీలు , చీరెలు ధరించేవారు నేడు పంజాబీ డ్రెసులు, పురుషులు ధరించేటువంటి జీన్స్ పాయింట్స్, షర్ట్స్ కూడా వేసుకుంటున్నారు. తినే ఆహారపుటలవాట్లలో కూడా చాలా మార్పులు వచ్చాయనే చెప్పవచ్చు. పూర్వం అంబలి, గట్క లాంటి పదార్థాలు తీసుకునే వారు నేడు రకరకాల వంటకాలు తినడం మనకు కానవస్తుంది.

పూర్వం జానపదులు ఉపయోగించిన దమరుకం, తోలుచెప్పులు మాయమైపోయి వాటి స్థానంలో ప్లాస్టిక్ చెప్పులు, కంజరలు ఆక్రమించాయి. పూర్వం జానపదులు తోలు చెప్పులు మాత్రమే ధరించే వారు నేడు రకరకాల కంపెనీల చెప్పులు వాడడం మనం గమనించవచ్చు. పూర్వం నాట్లు వేసేప్పుడు, ఇతరపనులు చేసేప్పుడు పాడుకునే గ్రామిక సంబంధ గేయాలు పోయి వాటి స్థానంలో సినిమా పాటలు, ప్రవేటు ఆల్బమ్ పాటలు వచ్చాయి.

ముగింపు:

జానపదులు తమ జీవన విధానంలో వాడే వస్తువులు, ఆచరించే ఆచారాలు, కట్టు బొట్టు, తినే తిండి మొదలగు వాటిలో నేడు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని విస్త ృతంగా వ్యాప్తి చెందిందని చెప్పవచ్చు. అలాగే జానపదులు వాడే భాష కూడా పరివర్తన చెందడం మనం గమనించవచ్చు. ఉదాహరణకు సెల్ ఫోన్, హాలో, సినిమా, ఓకె, ఫంక్షన్, రిసెప్షన్ మొదలగు పదాలను విరివిగా వాడుతున్నారు. ఇలా జానపదుల జీవన విధానం ఆధునిక పోకడలకు అనుకూలంగా మార్పు చెందుతూ వస్తుందని చెప్పవచ్చు. ఈ పరివర్తన ఎంత వరకు న బబ నేది అటుంచితే మారుతున్న కాలానికనుగునంగా వ్యక్తి జీవన శైలి మారనట్లైతే అతను నివసించే సమాజంలో నిమ్న ఉన్నతాభావాలు తీవ్ర స్థాయిలో ఉత్పన్నమౌతాయి. వాటి కారణంగా సమాజంలో అశాంతి నెలకొంటుంది. అలాంటిది ఉండకూడదంటే నిరంతరం పరివర్తనను స్వాగతించడం అవసరమే.




ఉపయుక్త గ్రంథ సూచి:

1. ఉత్తర తెలంగాణ పల్లె సంస్కృతి
-సంపాదకులు ముత్యం

2. ఉత్తర తెలంగాణ సంస్కృతి
-చరిత్ర- సంపాదకులు ముత్యం




# డా॥ గుఱ్ఱం ధర్మోజీరావు రచనల్లో దళితుల సాంస్కృతిక పరివర్తన

పర్యవేక్షణ

**డా॥ గుమ్మా సాంబశివరావు,**

M.A., Ph.D.,

తెలుగు శాఖాధిపతి, లయోల డిగ్రీ కళాశాల,

విజయవాడ.

పరిశోధకుడు

**చిల్లే దుర్గాప్రసాద్,**

M.A.,M.A.,T.P.T.,

తెలుగు అధ్యాపకుడు,

విద్యానిధి డిగ్రీ కళాశాల,

తాటిపాక, రాజోలు మండలం,

తూ॥గో॥జిల్లా - 533 249

**కవి పరిచయం :**

శ్రీ డా॥ బి.ఆర్.అంబేడ్కర్ ప్రసాదించిన రాజ్యాంగ హక్కులలో ఒక్కటైన చదువుకునే హక్కును పొంది, అందునా దళితులకు అందని సంస్కృత భాషను ప్రాథ్యో ఉన్నత పాఠశాలలో ప్రత్యేకంగా 200 మార్కుల సంస్కృత భాషను 10వ తరగతి వరకు చదివి విద్యాప్రవీణను పూర్తి చేసి కేంద్రియ సంస్కృత విద్యా పీఠంలో శిక్షాశాస్త్రిగా సుశిక్షితులైన తరువాత శ్రీ గుఱ్ఱం ధర్మోజీరావు గారు ఎమ్.ఎ. తెలుగు, సంస్కృతం, పి. హెచ్.డి. లను పొంది టి.టి.డి. విద్యాసంస్థలో ప్రభుత్వ ఉద్యోగిగా సంస్క ృత పండితునిగా దశాబ్ది కాలం పనిచేసి ప్రభుత్వ జూనియర్ మరియు డిగ్రీ కళాశాలల్లో ఆంధ్రోపన్యాసకులుగా 24 సం॥రాలు పనిచేసి ఎంతో కష్ట సాధ్యమైన పద్యకవిత్వాన్ని ఎంచుకొని తనదైన ప్రత్యేకతతో రచనలు చేసిన కీర్తిశేషులు శ్రీ గుఱ్ఱం ధర్మోజీరావు తన ఆకస్మిక మరణానికి కవితాలోకం చింతిస్తూ, నా ప్రగఢ సానుభూతితో ఆయన రచించిన ఆణిముత్యం తన మొదటి కావ్యం ' ఆనంద మోహిని ' పద్య పరిస్థితులను ఎంతో వివరణాత్మకంగా తెలియజేశారు. డా॥ ధర్మోజీరావు గారు. వీరు సంస్కృతము మరియు ఆంధ్రములో నిష్ణాతులై "ఉదాహరణ కవి వల్లభ" అనే బిరుదు పొందుకున్నారు.

డా॥ ధర్మోజీరావు గారి రచనలు సమాజంలో ఎంతో ప్రభావాన్ని చూపాయి. అంతరించి పోతుంది అనుకున్న కులమనే రాక్షసి ఇంకా సమాజంలో ముఖ్యంగా అగ్రవర్ణాల చేతుల్లో నలిగిపోతూవుంది. కీ॥శే॥ డా॥ శ్రీ గుఱ్ఱం ధర్మోజీరావు గారే దళితుల సాంస్కృతిక పరివర్తనకు నిలువెత్తు దర్పణం, నిరాక్షను లైన దళిత వ్యవసాయ కార్మిక కుటుంబం నుండి వచ్చి తాను దళిత కుటుంబములో నుండి పుట్టి సంస్కృతాంధ్ర భాషాద్వయంలో పండితులుగా, మహాకవిగా ఎదిగిన వారు శ్రీ డా॥ ధర్మోజీరావు గారు ఈ అంశము వారి ప్రథమ రచన అయిన " ఆనంద మోహిని " అనే పద్య కావ్యంలోనిది.

**'ఆనంద మోహిని' పద్య కావ్యంలో దళితుల సాంస్కృతిక పరివర్తన**

నేటికి భారతదేశంలో ప్రతీ చోటా, పరువు హత్యల పేరిట జరుగుతున్న మతోన్మాద, కులోన్మాదాలకు ఈనాడు మన భారతదేశం విజ్ఞాన శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఒకేసారి ఒకే రాకెట్‌తో 24 ఉపగ్రహాలను వినువీధులకి పంపించే విశ్వ విఖ్యాతిని పొందుతున్నా.. కులం విషయంలో విఫలమై కుప్పకూలిన రాకెట్టులా అంతర్జాతీయ వేదికలపై అవనతానన జాట సిగ్గుచేటైన విషయం. నేటికీ భారతదేశంలో అతి క్రూరంగా, కర్కశంగా, అతి దారుణంగా వారి తల్లిదండ్రులే, బంధువులే చంపడం నీచాతి నీచము, హేయమైన విషయం " కవయ: క్రాంత దర్శిన: " అన్న ఆర్యోక్తిలో 1990 లోనే తిరుపతిలో జరిగిన యదార్థగాథకు కావ్యరూపం ఇవ్వడం కవిగారు క్రాంత దర్శునులనుటలో సందేహం లేదు. డా॥ ధర్మోజీరావు గారి సంకల్పం ధృఢమైనది. వర్ణాంతర వివాహ యథార్థగాథకు కావ్య రూపం ఇవ్వడమే కాదు, కావ్యం అంకితంగొన్న వారు కూడా వర్ణాంతర వివాహం చేసుకున్న వారే.

అంతే కాదు ఈ కథకు మూలమైన దంపతులు మామిడికుదురు గ్రామంలో పుస్తకావిష్కరణలో పాల్గొనటం గొప్ప విశేషం. " నభూతో నభవిష్యతి " అనుట యథార్థము కావ్యావిష్కరణలో పాల్గొనటం గొప్ప చరిత్రాత్మక సంఘటన. ఈ సంఘటనయే దళితుల సాంస్కృతిక పరివర్తకు ప్రబల నిదర్శనము. " ఆనంద మోహిని " కావ్యంపై 2005 లోనే పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయంలో ఎమ్.ఫిల్ డిగ్రీ చేయబడింది.

" ఆనంద మోహిని " కావ్యం విషయానికి వస్తే డా॥ ధర్మోజీరావుగారు కావ్యాదిలోనే నన్నయ గారి సాంప్రదాయాన్ననుసరిస్తూ " శ్రీశ్రీ, వేమన, తిక్కనాది కవిభి:శ్రీ కాళిదాసాదిభి: " అన్న సంస్కృత శార్దూల వృత్త శ్లోకాన్ని ఎత్తుకోవడం గొప్పఎత్తుగడ అనడం తప్పదు, తప్పేది కాదు. శ్రీతో శ్రీకారం చుట్టడం. శ్రీశ్రీ అనడంలో విప్లవ కవిత్వ భావనకు శ్రీకారం చుట్టిన శ్రీశ్రీని స్ఫురింపచేయడం, కథాకథనంలో విప్లవాత్మక పరిణామ వాదాన్ని ధ్వనింప చేయడం, సామాజి

మార్పును వ్యంజింప చేయడం కవి గారి ప్రారంభ శ్లోకం లోనే

" నిత్యం వర్ధతు శ్రామిక శ్రిత గణై:
శ్రీ యోనిధీశ్రీప్రదై: "............. అనడం వారు కార్మిక పక్షపాతులనడంలోను వారు సాంస్కృతిక పరివర్తన కోరుకొనే వారనడంలోను సందేహం లేదు.

భారతదేశం వ్యవసాయిక దేశం, భూమి **90** శాతం అగ్రవర్ణ భూస్వాములచేతిలోనే ఉంది. భూస్వాములు కార్మికుల శ్రమ శక్తి లేకుండా సేద్యం చేయలేదు. భూస్వాములు-కార్మికులు పరస్పరం ఒకరిపై ఒకరు ఆధార పడడం సహజం, కాని వారి మధ్య వియ్యమందుకోవడం మాత్రం అసహజమైపోయింది. దానికి కారణం కులం.

" మడుగు నడుగు నందు మలినంబదెంతున్న
అందు పుట్టిన యట్టి అంబుజంబు "....

అనుటలో కవి కులం అనే బురదను కాక అందులో పుట్టిన పద్మం వంటి వాని గుణమనే పరిమళాలను చూడాలని దృష్టాంతాన్ని చూపిస్తారు.

" చెమ్మటోడ్చి, దున్ని చేను పండించుచున్
పంట కోసి నూర్చి యింట జేర్చి
గాదె నింపినపుడు కానరాదే యంటు
గడప చేరినంత గడియ పడునె?...

అంటూ పంట పండించే ప్రక్రియతో పాటు శ్రమ-సిరిగా మారిన పరిణామం, గాదెలు నింపినపుడు లేని అంటు గడప చేరితే లోనికి ప్రవేశం లేని అంటు రోగాన్ని గూర్చి దెప్పడంలో వారి చతురతను తెలియజేస్తుంది పై పద్యం. నాయకుని వర్ణనలో ధర్మోజీ పోతనతో పోటీపడినట్లుంటుంది.

" నల్లని వాడు పద్మనయనమ్ములవాడు "

అని పోతన కృష్ణుని ఉత్పలమాల వృత్తంలో వర్ణిస్తే డా॥ ధర్మోజీరావు గారు సీస పద్యంలో చక్కగా వర్ణించారు.

" నల్ల నల్లని వాడు నగు మోము కలవాడు
దరహాస చంద్రికల్ కురియు వాడు.
గళమెత్త సెలయేటి గలగలలే ప్రసరించు
నవ్వినన్ పువ్వులే నటన మాడు....

నర్మ గర్భ శృంగారాన్ని, శ్లేషలతో ధ్వనింపజేయడం వీరి ప్రత్యేకతను చాటుతుందీ పద్యం. అనగా ఈ కావ్యంలో ఒక దళిత కథానాయకుడిని వర్ణించారు కవి. చక్కని మనోహరమైన వర్ణనలతో పాటు ఆలోచనలు రేకెత్తించే ప్రశ్నలు పురాణ పురుషులపై సంధిస్తారు. దుష్యంతుడు, నలుడు, హరిశ్చంద్రుడు, ధర్మరాజు, రాముడు, బలరాముడు, కచుడు. ఈ పురాణ పురుషులు నెరపిన దోషాలను వేలెత్తి చూపుతూ, తన నాయకుని గొప్ప వ్యక్తిగా చిత్రీకరిస్తారు కవి.

" ద్రోహంబు చేయ నే దుష్యంత దనుకొను "

అంటూ దుష్యంతుడు చేసిన తప్పును కప్పి పుచ్చడాన్ని కాళిదాసు కసరత్తులు చేసి దుర్వాసుని శాపాన్ని ప్రవేశపెట్టాల్సివచ్చింది. కాని " ఆనందమోహిని " కావ్యంలో ఆనందుడు మోహినికి ఎంత భరోసా ఇస్తాడో చూడండి.

" పద్ద వారలెపుడు చెడ్డవారలు కారు " అనే సామెతను తీసుకొని.... మనస్సు పద్దవారు మరి చెడ్డ వారెట్లు? అని మార్చి ప్రేమికులకు సామెతను ఊచితంగా మార్చడం ఒక్క ధర్మోజీరావు గారికే చెల్లుతుంది. " ప్రేగు తెంచు నాడు ప్రేమివ్వ బిడ్డంచు ఏమి త్రెంచనట్టి ప్రేమికులను అన్ని తెంచి రంపు ఎన్నెన్నో తిట్టుచు కులపు బంధనాలు కూర్చు టేమి. అని అనురాగ బంధం, ఆత్మీయతకు దారి తీస్తుంటే కులపు బంధనం క్షోభకు గురిచేయడం దుర్మార్గమని ఎండ గడతారు కవి. " కండ్లు కానరాక కటిక యాకటి చేత తానె బిడ్డల దిను త్రాచు పాము హెచ్చు కలుమటించు పిచ్చినెత్తికి నెక్కి చంపజూచు బిడ్డ జాలిలేక " అంటూనే మరల " కన్న బిడ్డనైన కనికరించదు కదా వర్ణ జాడ్య కవిత భరత భూమి " అంటూ బాధను వ్యక్తం చేస్తారు ఈ కావ్యంలో ఒక మహాకావ్యంలో ఉండదగిన చక్కని వర్ణనలెన్నో ఉన్నాయి.

**21** సం॥రాల క్రితం రచింపబడిన ఈ కావ్యం నేటి సమాజానికి దిక్సూచిలా సందేశమందిస్తూనే ఉంది.

నేడు అగ్రవర్ణ మేధావులు అంటరానితనాన్ని తొలగించే ప్రయత్నం చేయకుండా ఉదాసీనంగా చూడటం ముదావహ పరిణామం కాదు. మాకు అంటరాని తనమనే భావం లేదంటూ పైపై కబుర్లు చెప్పుతు నటించే కృయక మనో వ్యాపార ప్రవృత్తి తొలగనంతకాలం ఈ దేశం కులకల్లోలాలతో మారణ కాండలతో మరుభూమిగా మారిపోక ముందే మేధావులంతా మేల్కోనాలి. మేల్కోలపాలి.

**ముగింపు** : పది మంది గౌరవింపబడటం కోసం 10 వేల మందిని అవమానించే ఈ సాంఘిక దురాచారం నశించాలనేదే కవి గారి ఆకాంక్ష అశౌచం స్నానంతో పోతుంది, పురిటిమైల, మృతినొందిన వారి ద్వారా ఏర్పడే మైల వంటివి స్వల్ప కాల పరిమితితో తొలగిపోతాయి. కొన్ని వేల సంవత్సరాలుగా ఏలుబడి చేస్తున్న కుల దురహంకారం నేరమే కాదు, మహాపాపం కూడా. కాలం మారినా వ్యవస్థలో మార్పు లేదు అందుకే కవిగారు ఈ విధంగా ఒడలు రక్త మాంస మొక్కటైన మనిషి నంటినంత మైలంచు తొలగెడి జబ్బుకన్న వేరే జాడ్యమేది? అని ప్రశ్నించారు డా॥ గుల్లం ధర్మోజీగారు ఈ కావ్యం దళితుల సామాజిక పరివర్తనకు దోహద పడగలదని ఆకాంక్షిస్తారు కవి. ధర్మోజీరావు గారు సమాజంలో మనిషి పరివర్తన చెందటం అంటే కుల మత భేదాలు లేని సమసమాజం నిర్మాణమే.

# ఆధునిక సాహిత్యంలో సామాజిక పరివర్తన తీసికొచ్చిన నాటకాలు

- డాక్టర్.ఎం.రామనాథంనాయుడు, గాదిరాజు రంగరాజు

సాహిత్యంలో నాటకానికి అత్యున్నత స్థానం ఉంది. అన్ని సాహిత్య ప్రక్రియల కంటే నాటకం రమ్యమైందని అంటారు. నాటకం సర్వ కళా సమాహార రూపం. నాటకంలో కనిపించని కళలేదు. చిత్రలేఖనం, శిల్పం, సంగీతం, సాహిత్యం, నాట్యం మొదలైన అన్ని కళల సమ్మేళనం నాటకం. తెలుగులోని వివిధ సాహిత్య ప్రక్రియల కంటే భిన్నంగా నాటకానికి కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. వాటివల్లనే నాటకానికి అంత గౌరవం ఆపాదించబడింది.

మనదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవన ఫలితంగా, సంఘ సంస్కరణ ప్రభావం కారణంగా వివిధ రంగాల్లో నూతన చైతన్యం వెల్లివిరిసింది. ఆ చైతన్యం తెలుగు సాహిత్యంలో కూడా అనేక నూతన ప్రక్రియలకు దారి చూపింది. తెలుగు సాహితీ ప్రపంచంలో ఎన్నో కొత్త రీతులైన నవల, నాటకం, వ్యాసం, ఖండకావ్యం ఆత్మకథ వంటి ప్రక్రియలు వచ్చాయి. ఆ ప్రేరణతోనే తెలుగు సాహిత్య రంగంలో తెలుగు నాటకం కూడా వెలుగు చూసింది.

కోరాడ రామచంద్రశాస్త్రి గారు మంజరీ మధుకరీయం (1860) నాటక రచనతో ఆ ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. అది 1908లో ప్రచురించబడింది. నాటక, నాటిక సమాజాలు లేకపోవడంతో ఈ నాటకం ఎక్కడా ప్రదర్శన కాలేదు. 1880లో కందుకూరి వీరేశలింగం గారు 'వ్యవహార ధర్మబోధిని' పేరుతో ప్రహసనాన్ని రచించారు. అది విద్యార్థుల చేత విజయనగరం మహారాజా వారి బాలికల పాఠశాలలో ప్రదర్శింపజేశారు. తెలుగు నాటకాన్ని రంగస్థలానికి ఎక్కించిన ఘనత వారికే దక్కుతుంది. అదే సమయంలో మహారాష్ట్ర ధార్వాడ నాటక సమాజం వారు ఆంధ్ర ప్రాంతంలో నాటకాలు ప్రదర్శించారు. ఆకర్షణీయమైన ఆ ప్రదర్శనలకు కవులు, కళాకారులు ఆకర్షితులై తామూ ప్రదర్శించాలనే ప్రేరణ పొందారు.

సమాజంలో దురాచారాలను, మూఢ నమ్మకాలను, అసహజమైన సంప్రదాయాలను హాస్య చతురత కనబరచి ప్రజల్లో పరివర్తన తెచ్చేందుకు కందుకూరి వారుతమ రూపకాలలో ప్రయత్నించారు. రాజమహేంద్రిలో నాటకోద్యమానికి 'వేణి సంహారం' (1883) నాటకం వసురాయ కవి గారు ప్రాణ ప్రతిష్ట గావించారు. బళ్ళారి ప్రాంతంలో ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు 'చిత్రనళీయం' (1887) ద్వారా పరివర్తన కలిగించారు.

నాటక కళకు ఎంతో సేవ చేసిన వారిలో కోలాచలం శ్రీనివాసరావు గారు ముఖ్యులు. వీరి చారిత్రక నాటకాలు విశేషాదణ పొందాయి. దానిలో చారిత్రక నాటక పితామహునిగా ఖ్యాతి పొందారు. గురజాడ వారి కన్యాశుల్కం (1897) సాంఘీక నాటకం తెలుగు నాటక రంగంలో ఒక మైలురాయి. నాటకరంగంలో ఒక కొత్త మలుపు. వేదం వెంకటరాయశాస్త్రి గారి 'ప్రతాపరుద్రీయం' (1897) పాత్రోచిత భాషా ప్రయోగం చేసి విజయవంతమయ్యారు.

చిలకమర్తి గారి 'గయోపాఖ్యానం', పానుగంటి వారి 'కంఠాభరణం', కాళ్ళకూరి నారాయణరావు గారి 'వరవిక్రయం', 'చింతామణి', తిరుపతి వేంకట కవుల'పాండవోద్యోగం', శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి 'బొబ్బిలియుద్ధం', బలిజేపల్లి లక్ష్మీకాంతం గారి 'హరిశ్చంద్ర', దువ్వూరి రామిరెడ్డి గారి 'కుంభరాణా', దామరాజు పుండరీకాక్షుడు గారి 'గాంధీ విజయం' మొదలైన నాటకాలు ప్రేక్షక లోకాన్ని అలరింపజేశాయి.

సమాజంలో చాలా విషయాలకి పరిష్కార మార్గాన్ని సూచించాయి. సంఘ సంస్కరణ, మనోవికాసం, మూఢనమ్మకాలను వదలడం, స్త్రీ విద్య, దేశభక్తి వంటి విషయాల్ని ఈ నాటకాలు ప్రజల ఆలోచనల్లోకి చొచ్చుకొనిపోయి సామాజిక పరివర్తనకు దోహదపడ్డాయి.

1920 నాటికి భారతదేశమంతా జాతీయోద్యమ ప్రభావం ఉంది. గాంధీజీ ప్రవేశంతో అది తీవ్రతరమైంది. భారతీయ సంస్కృతి, వీరోచితగాథలు, స్వాతంత్ర్యకాంక్ష ప్రజల్లో తీవ్రతరం చేయడానికి నాటకాలు దోహదపడ్డాయి. ముద్దుకృష్ణ గారి 'అశోకం' సంప్రదాయాలపై తిరుగుబాటు చేసి పురాణ పురుషుల్ని కొత్త వెలుగులో చూపించింది.

1930 తర్వాత నాటిక ప్రదర్శన విజయవంతమైంది. విశ్వనాథ కవిరాజు, పి.వి. రాజమన్నారు, నార్ల వెంకటేశ్వరరావు, భమిడిపాటి కామేశ్వరరావు, జి.వి.కృష్ణారావు తదితరులు చక్కటి నాటికలు రచించి ప్రజలలో పరివర్తనకు కారకులయ్యారు.

1940-49 ఒక దశాబ్ద కాలంలో ప్రజలకు రాజకీయ పరిస్థితులు తెలియజెప్పడానికి, దేశభక్తిని ప్రేరేపించడానికి ప్రజలను కర్తవ్యోన్ముఖుల్ని చేయడానికి శక్తివంతమైన 130 నాటకాలు, 80 నాటికలు రచించి ప్రదర్శించారు.

వేదాంత కవిగారి తెలుగుతల్లి (1940), వాసిరెడ్డి భాస్కరరావు గారి ముందడుగు (1945), మాభూమి (1947), నార్ల వారి కొత్తగడ్డ, తెలుగుతనంతో, తెలుగు వాతావరణంలో తెలుగు ప్రజల జీవన సరళికి అతి దగ్గరగా ఉండేటట్టు పాత్రల చిత్రీకరణ నాటకాల్లో చిత్రించారు.

నాటక రంగానికి వెలుగుబాటలు పరిచింది ఆచార్య ఆత్రేయ 'ఎన్.జి.ఓ, కప్పలు, పరివర్తన, భయం' నాటకాలు. తెలుగునాటక వికాసానికి (1940-54) ఆత్రేయ గారు అందించిన కృషి అనంతమైనది. సమాజంలోని అన్ని కోణాల్ని తమ నాటకాలలో ప్రదర్శింపజేశారు. సమాజాన్ని ఆలోచింపజేశారు. వీరి ప్రభావంతో సమాజంలోకొంత పరివర్తన వచ్చిందని చెబుతారు.

ప్రజల్లో చైతన్యం, ప్రభుత్వానికి కనువిప్పు కలిగించాలనే సంకల్పంతో ముందుకు వచ్చి శక్తివంతమైన నాటకాలు కొందరు రాశారు. వారిలో కరుణశ్రీ, బోయి భీమన్న, సుంకర వాసిరెడ్డి, పడాల రామారావు, షేక్ నాజర్, పినిశెట్టి శ్రీరామమూర్తి, సీతంరాజు వెంకటేశ్వరరావు, బి.యన్.సూరి లను పేర్కొనవచ్చు. స్వాతంత్ర్యానికి ముందు సంఘ సంస్కరణ, బాల్య వివాహాలు, స్త్రీ విద్య, వితంతు వివాహం, మూఢ నమ్మకాలు, నిరక్షరాస్యత, వరకట్నం, రైతు సమస్యలు పై వచ్చిన నాటక సాహిత్యం సమాజాన్ని జాగృతపరచి సరికొత్త పరివర్తనకు నాంది పలికింది. ప్రజల ఆలోచనలో మార్పు తీసుకొచ్చాయి. సమాజాన్ని ఆలోచింపజేశాయి.

నాటక ప్రదర్శనకు నేడు బుల్లితెర, వెండితెర ఆక్రమించుకోవడంతో కేవలం పరిషత్తులకే నాటకం మనుగడ సాగిస్తుంది. నంది నాటకాలతో ప్రభుత్వం కొంత జీవం నాటకాలకు పోస్తున్నప్పటికి విదేశాలు, ఇతర రాష్ట్రాలలో వున్న ఆదరణ నాటక కళకు లేకుండాపోతుంది. ఔత్సాహిక కళాకారులను ఈ కళలోకి రప్పించకపోతే తెలుగు నాటకాలు అంతరించిపోయే ప్రమాదం ఉంది. కళాకారులను ప్రోత్సహించాలి. నాటక కళను బ్రతికించాలి.

- - -


<u>చిరునామా :</u>

**గాదిరాజు రంగరాజు,**
M.A.; M.A.; M.A.; M.A.; M.Ed. (Ph.D.)
3-21, రాజులపేట,
చెరుకువాడ-534 199
ఉండి మండలం, ప.గో.జిల్లా, ఆంధ్రప్రదేశ్.
+918790122275
+919491555703
rangaraju.g3@gmail.com

# 'అలజడి కథ' - కార్మిక జీవన పరివర్తనం

**వింజమూరి పూర్ణ చంద్రశేఖరరావు**
పరిశోధక విద్యార్థి
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం
చరవాణి : 9849652183.

ఉపోద్ఘాతం :

ప్రజాస్వామ్య సామ్రాజ్యంలో కష్టించిన వాడికి తగినంత ఆదాయం లభిస్తుంది. చాలా మంది వ్యాపారులు కొద్దిపాటి పెట్టుబడులతో, శ్రామికుల శ్రమనుపయోగించుకుని ధనవంతులవుతున్నారు. కాని కార్మికుల జీవనం మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఇంకా పేదరికంలోనే ఉంటున్నారు. జీవితంలో ఎన్నో వ్యధలు, కష్టాలు అనుభవిస్తుంటారు. శ్రామికులు రక్తంతో ధనవంతుల బీరువాలు నింపుతారు. ఇలాంటి వారి జీవితాలను ఇతివృత్తంగా స్వీకరించారు రచయిత కాట్రగడ్డ దయానంద్. వీరు రచించిన 'గుండ్లకమ్మ తీరాన' సంపుటిలోని 'అలజడి' అనే కథ కార్మికుల జీవితాలు నాడు, నేడు ఎలా ఉంటున్నాయో? కార్మికులలో ఐక్యత ఏ విధంగా లోపిస్తుందో దీనిలో చిత్రించారు.

అలజడి - ఇతివృత్తం :

రాతి క్వారీలలో నారాయణ ఒక ప్రొక్లెయిన్ ఆపరేటర్‌గా పనిచేస్తున్నాడు. ఆ గనులకు యజమాని రవీంద్రరెడ్డి. అటు మద్రాసు నుండి ఇటు చీమకుర్తి దాకా ఆయనకు లేని వ్యాపారం లేదు. నారాయణ తండ్రి మాలకొండయ్య అనారోగ్యం కారణంగా తండ్రిని చూసేందుకు అనుమతి తీసుకుని, భార్యాపిల్లలతో వెళతాడు. యాభైయేళ్ళ క్రితం తండ్రి మాలకొండయ్య మైకా గనుల్లో పనిచేసేవాడు. ఇతని హయాంలో కార్మికుల పక్షాన నిలబడి యాజమాన్యాలతో పోరాడి, గొడవలు పడైనా, బెదిరించైనా కార్మికులకు కావలసిన వసతులు, సౌకర్యాలు వంటి గని కార్మికులకు కావలసిన ప్రాథమిక వసతుల కల్పనకు కృషిచేశాడు. మాలకొండయ్య ఇతర కార్మికులలో గనుల్లో పనిచేస్తున్న సమయంలో గని పైకప్పు కూలి ప్రాణాపాయ పరిస్థితుల్లో ఉన్నప్పుడు, యజమానుల నిర్లక్ష్యవైఖరిని నిరసిస్తూ మాలకొండయ్య భార్య లక్ష్మమ్మ పెద్ద రభస చేసి, ప్రభుత్వాధికారులను ప్రతిఘటించి మరీ వారిని బయటకు తెచ్చే ప్రయత్నం చేసింది. అలాంటి తల్లి మరణించినా, తండ్రి ఈనాడు సరైన వైద్యసదుపాయాలు లేక అనారోగ్యంతో పోరాడటం, గని యజమానులు చేసిన మోసాలకు ప్రభుత్వం అక్కడి సదుపాయాలు తొలగించడం వంటివి చూసి ఆశ్చర్యపోతాడు. అయినా అక్కడి కార్మికులు ప్రశ్నించకపోవడం అతనికి బాధ కలిగిస్తుంది.

సమకాలీన కార్మికుల జీవన చిత్రణ :

'గుండ్లకమ్మ తీరాన...' కథల సంపుటిలోని 'అలజడి' కథ కార్మికుల జీవితాలలోని అలజడులను చిత్రించింది. వాస్తవిక జీవితాలకు చేరువగా ఉంటూ నిజజీవితంలో గని కార్మికులు ఎదుర్కొనే సమస్యలను రచయిత చక్కని కథనంతో చిత్రించారు. ఒకనాటి సమాజంలో కార్మికులంటే పరిశ్రమలలో ముఖ్యభూమిక ఉండేది. సమర్ధవంతమైన యూనియన్ల నాయకులు మిగతా కార్మికులను సమిష్టిగా కలుపుకుని ఆయా కర్మాగారాల్లో పనిచేసే కార్మికులకు ప్రయోజనం చేకూరేలా ప్రాణాలకు తెగించి పోరాడేవారు. విజయం సాధించేవారు. కాని ఈనాటి కాలంలో కార్మిక సంఘాలు ప్రాధాన్యత చాలా వరకు తగ్గిపోయినది. అంతేకాదు నేటి యువకులు 'పుట్టుకతోనే వృద్ధులు' అని శ్రీశ్రీ చెప్పినట్లు ఎవరికి వారు తాము బాగుంటే చాలు మిగతా వారితో మనకేంటి అని అనుకుంటున్నారు. నెల జీతం కోసం ఆరాటపడే కార్మికులు యజమానులు ఏం చెబితే వాటికి అనుకూలంగా సంతకాలు పెట్టి తమను తాము ఇరకాటంలోకి తోసేసుకుంటున్నారు. అవే తరువాత వారికి చిక్కులు తెచ్చి పెడుతున్నాయి.

ఈ 'అలజడి' కథలో కూడా ఇలాంటి సమకాలీన అంశాలు యజమానులు చేసే మోసాలు కనిపిస్తాయి. దీనిలో ప్రధానంగా ఈ క్రింది అంశాలు మనం గమనించవచ్చు.

1. గని యజమానుల వైఖరి :

స్వార్ధపరులైన కంపెనీ యజమానులు కార్మికుల అవసరాలను అవకాశంగా తీసుకుంటారు. ఎక్కువ పనిచేయించుకుని తక్కువ వేతనం ఇవ్వడం అనేది తరతరాలుగా కొనసాగుతూనే ఉంటుంది. ఈ కథలో ఈ స్వభావం చాలా ఎక్కువగా కనిపిస్తుంది.

నారాయణ పనిచేస్తున్న క్వారి యజమాని నారాయణ పట్ల ప్రవర్తించిన తీరులో అర్థమవుతుంది. 'పన్లోకి దిగినాక ఇంకో ధ్యాసేందిరా? ఏ లంజముండ గుర్తొచ్చిందిరా? మీ జీవాలు ఎప్పుడన్నా చస్తే వేలకువేలు నేనేడ దెంకొచ్చి పొయ్యాల్రా? సంపాదిచ్చిందంతా మీ ఎదాల్న పొయ్యడానికి సరిపోతుంది"[1] అంటూ దుర్భాషలాడటం సాటి మనిషి పట్ల కనీసం మనిషిగా కూడా ప్రవర్తించని వైఖరి కనిపిస్తుంది. ఒకనాడు గని కార్మికులంతా కష్టపడి సంపాదించుకున్న ఎన్నో వసతులు ఈనాటి తరానికి అందకపోవడం గనుల యజమానుల స్వార్థానికి ప్రతీక. ప్రభుత్వానికి తప్పుడు లెక్కలు చూపించడం, కొన్ని గనులు మూసేసినట్లు, కార్మికుల సంఖ్య తప్పుగా చూపించడం, సరుకుని బ్లాక్ మార్కెట్‌లో అమ్ముకోవడం వంటివి చేయడం వల్ల, ప్రభుత్వం అక్కడి సదుపాయాలన్ని తొలగించడం వల్ల నిజంగా పనిచేస్తున్న వారికి అన్యాయం జరగడం మనం గమనించవచ్చు.

2. మాలకొండయ్య తిరుగుబాటు :

సమర్థవంతమైన కార్మికశక్తికి ప్రతీకగా నిలిచేవాడు మాలకొండయ్య. తను ఒక కార్మిక నాయకుడిగా ఎంతవరకు కార్మికులకు చేయగలడో అంత చేసేందుకు ప్రయత్నించాడు. భయమన్నది ఏ మాత్రం లేనివాడు. అందరూ అతడిని పహిల్వాన్ అని పిలిచేవారు. గనుల్లోని కార్మికులందర్నీ ఏకం చేసి, ఒకరికోసం ఒకరు అన్నట్లుగా చేశాడు. కార్మికుల సంక్షేమం కోసం యజమానులతో మాట్లాడడం, వినకపోతే పెద్దగంగా మాట్లాడడం, కుదరకపోతే ఎదురునిల్చి పన్లోకెళ్ళకుండా అడ్డుకోవడం, ఇలా ఎన్నో విధాలుగా కార్మికుల కోసం చేశాడు. అలా ఎన్నో పోరాటాలు చేసి కార్మికులకు ఇనుపటోపీలు, లైట్లు, షోస్లు, కార్మికులకు ఆసుపత్రులు, పిల్లలకు బడులు, వంటివి సాధించాడు. ఒకనాటి కార్మికులలో ఇలాంటి సంఘటిత శక్తి ఉండేది. ఒక్కరికి సమస్య వచ్చినా అందరూ స్పందిచేవారు. కాని నేటి కాలంలో కార్మికులు ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా ఉంటున్నారు. దానికి తోడు కార్మిక సంఘాలలో పార్టీల జోక్యం వల్ల పార్టీల అవసరాలకు తగిన విధంగా కార్మికులలో గ్రూపులు వచ్చేసి, సంక్షేమం సంగతి మరచిపోతున్నారు. అంతర్గత కక్షలు పెంచుకుంటున్నారు. మరికొందరు నాయకులు ధనాపేక్షతో యజమానుల కొమ్ముకాస్తున్నారు.

4. నేటి కార్మిక సంఘాల స్థితిగతులు :

ప్రస్తుత కాలంలో వివిధ పరిశ్రమల్లో పనిచేస్తున్న కార్మికులకు ఆయా పరిశ్రమల్లో ప్రజాస్వామ్య పద్ధతిలో నాయకులను ఎన్నుకుంటున్నారు. కాని నాయకులు అనంతరం వారి శ్రేయస్సును మరచిపోతున్నారు. ఎన్నికల ముందు కార్మికులను వశం చేసుకొనేందుకు కొన్ని యాజమాన్యాలు తామే అభ్యర్థులను బరిలో దింపి కార్మికులకు మందు పోయించడం, లంచం ఇవ్వడం వంటివి చేస్తున్నాయి. అలా గెలిచిన వారు యాజమాన్య పక్షం వహిస్తున్నారే కాని కార్మికుల పక్షాన నిలవలేక పోతున్నారు.

ఈ కథలో అదే కనిపిస్తుంది. మాలకొండయ్య వంటి వారు పోరాడి సాధించినవి వారి అనంతరం వచ్చిన నాయకులు నిలుపుకోలేకపోయారు. నాడు పర్మినెంట్ ఎంప్లాయిస్‌గా పనిచేసిన వారు యజమానుల మోసం వల్ల ప్రభుత్వ చర్యలవల్ల ఉద్యోగాలు కోల్పోయి రోజువారీ కూలీలుగా అదే గనుల్లో పనిచేస్తున్నా నేటి యువ నాయకులు పట్టించుకోకపోవడం శోచనీయం. నెమ్మదినెమ్మదిగా వీధిలైట్లు, ఆసుపత్రి, బడులు, అన్నింటినీ మూసేస్తున్నా ఇదేంటని ఎదురు తిరిగి ప్రశ్నించలేని తరం వల్ల కార్మికులకు నష్టం వాటిల్లుతుంది.

ఉపసంహారం :

నేటి సమాజంలో లోపిస్తున్న మానవ సంబంధాలు, మనిషికి మనిషికీ మధ్య పెరుగుతున్న అంతరాల వల్ల ఒకరికి ఇంకొకరు సంబంధం లేకుండా జీవిస్తున్నారు. చివరకు కార్మికులు కూడా రోజు గడిస్తే చాలనుకుని పనిచేస్తున్నారు తప్పించి సమిష్టి ప్రయోజనాల కోసం పోరాడలేకపోతున్నారు. దానికి తోడు పార్టీల రాజకీయాలు పరిశ్రమల్లోని కార్మికుల మధ్య విభేదాలు సృష్టిస్తున్నాయి. నేటితరం యువకులు యువకుల్లా ప్రవర్తించాలి. కార్మికులు వారి ప్రయోజనం కోసం కృషిచేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

---

1. అలజడి - గుండ్లకమ్మ తీరాన - కాట్రగడ్డ దయానంద్, పుట.56

# ఆధునిక దళిత కవిత్వంలో శ్రమ జీవన తత్వం

**బిశెట్టి ఉపేంద్ర,** ఎం.ఎ., బి.ఇడి.
పరిశోధక విద్యార్థి, తెలుగుశాఖ,
యోగి వేమన విశ్వవిద్యాలయం,
వై.ఎస్.ఆర్. కడప జిల్లా.
సెల్ నెం. 8978703493

దళిత శబ్దం 'దళ్' అనే ధాతువు నుండి పుట్టిన పదం. దళిత శబ్దానికి అనేక నిఘంటువులు వివిధ అర్థాలను ఇచ్చాయి. శబ్ద రత్నాకరము 'దళితము, దళము, దళవాయిష అనే పదాలకు ఖండించబడినది, ఛేదించబడినది అనే అర్థాలను ఇస్తున్నది.

ప్రాచీన తెలుగు సాహిత్యంలో బమ్మెర పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతంలోని అష్టమ స్కంధములోని గజేంద్ర మోక్ష ఘట్టంలో దళిత పద ప్రయోగం కనిపిస్తుంది.

**దళిత పాపుడగుచుఁ దన లోకమున కేగ**
**నపుడు శౌరికేల నంటి తడవ**
**వాస్తిలోకనాథుడు జ్ఞానరహితుడై**
**విష్ణురూపుడగుచు వెలుగు చుండె**

హూహువు అనే గంధర్వుడు దేవముని వలన మొసలిగా మారిపొమ్మని శాపం పొందాడు. పశ్చాత్తాపపడి మునిని శరణు వేడగా శ్రీమహావిష్ణువు వల్ల శాప విమోచనం పొందుతావని చెప్పాడు. ఈపద్యంలోని దళిత పదానికి విడువ బడినది అనే అర్థం తీసికోబడింది. అటు తరువాత చాలా మంది కవులు దళిత శబ్దాన్ని ప్రయోగించారు. వారందరూ కూడా దూరంగా నెట్టి వేయబడింది, అణచి వేయబడ్డది, విడువ బడినది అనే అర్థంలోనే ప్రయోగించారు. దళితులే ఆది భారతీయులని విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. భారత జాతి మూలాలు దళితుల్లోనే దొరుకుతాయని చరిత్ర కారులు అంటున్నారు. దళితులకు ఒక ప్రత్యేకమైన సంస్కృతి కళలు, ఆచారం, సంప్రదాయం ఉందని వారి జీవన విధానం ద్వారా తెలుస్తున్నది. దళితులు తమ జీవన మూలాల నుంచి కవిత్వ సృజనకు పూనుకున్నపుడు దళిత జీవనం లోని కళ, సౌందర్యం, వారి రచనల్లో వ్యక్తం అవుతుంది. దానిని దాదాపు అందరు దళిత కవులు అభివ్యక్తం చేశారు. శివ సాగర్ దళిత కవిత్వంలో దళిత కళా తత్వాన్ని ఇలా తెలిపారు.

**ఎద్దు కొమ్ముల్లో మిగ్ పాపను**
**ముని కాళ్లతో ముద్దాడి**
**పంజరాల చీకటి చరిత్రను**
లందెల్లో బంధిస్తున్నాను
పరికిళ్లు తిని
మండే మాదిగ డప్పులా
ఉదయిస్తున్న సూరీడుపై
చిర్రా చిటికెన పుల్లా తీసుకొని
చినుకుల్లో చిందేస్తున్నాను - అంటాడు.

అంతవరకు సాహిత్యంలో నమోదు కాని దళిత వస్తు పదజాలంతో పైకవిత సాగుతుంది. దళిత జీవితంతో ముడి పడి ఉన్న చిర్రా చిటికెన పుల్లా మిగ్ పాప, లందె, పరికిళ్లు వంటి పదాలను ప్రయోగించడం ద్వారా దళిత జీవితం ఆవిష్కృతమైంది. దళితులు వాద్యాలు ప్రయోగించునపుడు, కుల వృత్తుల మూలాల వస్తువులు అనగా చెప్పులు తయారు చేయునపుడు వాటిని ఉపయోగిస్తారు.

ఎండ్లూరి సుధాకర్ రాసిన 'నీలిక' కవితలో దళితకళాతత్వం స్పష్టంగా ప్రతిఫలించింది. ఈ కింది పంక్తులను పరిశీలిస్తే మనకు వారి జీవనతత్వం బోధ పడుతుంది.

ఓ నా చండాలికా
నీవెండి కడియాల కాళ్ళ ముందు
వెయ్యేళ్ల కావ్య నాయికలు వెలవెలబోతున్నారు
అలంకార శాస్త్రాలన్నీ
నీపాటి మట్టి మెరుపు ముందు బలాదూరే!
నా నల్ల సుందరీ
నీలాలంకార సౌందర్య శాస్త్ర సింహాసనం మీద
నిన్ను కావ్య గౌరవంతో అభిషేకిస్తున్నాను
నా నల్ల కావ్యానికి నిన్ను

నాయికగా ప్రకటిస్తున్నాను - అంటాడు.

ప్రాచీన ఆలంకారికులు, లక్షణ కర్తలు నాయికల విషయంలో ప్రతిపాదించిన లక్షణాలను తిరస్కరించి చండాలికను కావ్య నాయికగా ప్రతిష్ఠించాడు. ప్రాచీన సౌందర్య శాస్త్రానికి భిన్నంగా ప్రత్యామ్నాయ దళిత సౌందర్యాన్ని కవి చిత్రించాడు. వేముల ఎల్లయ్య రాసిన 'బద్దులు తిరుక్కుంటూ' కవిత దళిత కళా తత్వాన్ని అద్భుతంగా చిత్రించిన కవిత.

నీనూగు కాళ్లకు నానరాల వారు అల్లికచేసి
నేను ముస్తాబు చేసిన నీ చెప్పుల కూడలపై
ఎండిన ఎద్దు కన్నులు పువ్వులై ఏడిస్తే
ఏడుపు కలిపినోన్ని" - అంటాడు.

చెప్పుల గూడలపై అలంకరించిన పువ్వులను ఎండిన ఎద్దు కన్నులు పువ్వులై ఏడిస్తే' అన్న పదచిత్రం గొప్ప కళాభివ్యక్తిలో కూడు కున్నది. ఆ జీవితం తెలిసిన కవి మాత్రమే రాయగలిగింది.

ఈ దేశంలో దళిత బాల్యం అంతా భూస్వాముల పశువుల కొట్టంలో కట్టు గర్రలకు బానిస అయిపోతోంది. అటువంటి దళిత బాల్యం గురించి సుద్దాల హనుమంతు 'పల్లెటూరీ పిలగాడా' పాటలో కరుణరస పూరితంగా కంటతడి పెట్టించే విధంగా వర్ణించాడు. దీనికి ఈ కింది చరణాలే నిదర్శనాలు.

పల్లెటూరీ పిల్లగాడ
పసుల గాసె మొనగాడా
పాలు మరిచి ఎన్నాళ్ళయిందో - ఓ
పాలబుగ్గల జీత గాడా
కొలువు దీరి ఎన్నాళ్లయిందో
చాలి చాలని చింపులంగి
చల్ల గాలికి సగము కాలి
గోనెచింపు కొప్పెర బెట్టావా -
పాల బుగ్గల జీతగాడా
దానికి చిల్లులెన్నో లెక్క బెట్టావా?

- అంటూ పాల బుగ్గల పాలెగాళ్ళ దయనీయ జీవితాన్ని మన ముందు నిలుపుతాడు. ఈ గేయం తెలంగాణ సాయుధ పోరాట కాలంలో సంచలనం సృష్టించింది.

లక్షలాది మంది పేదలను చైతన్యవంతం చేసింది. ఈ గేయ ప్రభావానికి భూస్వాములు హడలిపోయారు.

రిజర్వేషన్ విధానంలో మండల్ సిఫార్సులకు వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా అగ్రకులాలు 1983లో ఉద్యమించాయి. దళితులను ప్రతిభ లేని వారుగా, రిజర్వేషన్ గాళ్లుగా గేలి చేశారు. ఎన్నో విధాలుగా అవమానించారు. ఈ ఇతివృత్తం నేపథ్యంగా ఊటెల్లాంటి దళిత పాటలు అనేకం వచ్చాయి. దళితుల జీవన విధానంలోనూ సంస్కృతి, కళల్లోనూ గొప్ప ప్రతిభ ఉందని దాన్ని అగ్రకులాల వారు దోచుకున్నారని మాష్టారు 'మాదిగోళ్ళ మాలోళ్ళ' అనే గీతంలో ఇలా వివరించాడు.

మాతంగుడు మాతాత - తల బుర్రను తావు జేసి
మొల కాళ్లు బారు చేసి - మేళ్ల కాళ్ల స్వరాలకు
స్థాయికి స్థానాలిచ్చి - నవనాడుసు నవరించి
నవనాడులు నవరించి - మ్రోగ తీగలు జేసి
సర్వజనులు మెచ్చేటి - వీణను సృష్టించి ఇచ్చె
పంతులోళ్ల సంతానం - సొంతుం చేసు కుండ్ర
- అంటాడు కవి.

దళిత కళారూపాలు పరిసరాలు ఎలా బ్రాహ్మణ వర్గం సొంతం చేసుకుందో వివరించాడు. వీణను దళితులు తయారు చేస్తే బ్రాహ్మణులు సొంతం చేసుకున్నారని కవి ఒక చారిత్రక సత్యాన్ని చెప్పాడు.

విప్లవ గీతాలకు తాత్విక దృక్పథం ఇచ్చిన గూడ అంజయ్య దళిత బహుజనులు తర తరాలుగా అగ్రకుల భూస్వాముల చేతుల్లో ఎలా దోచుకోబడుతున్నారో 'ఊరుమనదిరా' పాటలో చిత్రించాడు. దళిత విప్లవ గీతాలలో ఈ పాట దోపిడీ వున్నంత వరకూ నిలిచి ఉండే పాట.

ఊరు మనదిరా! ఈవాడ మనదిరా
పల్లె మనదిరా - ప్రతి పనికి మనం రా
దొర ఏందిరో - దొర పీకు డేందిరో

అరక దున్నేది మనం – ఈ మంచె కాడ మనం
ఆకంచెకాడ మనం – ఈ మంచె కాడ మనం
ఈ పాడి కాడ మనం – అపసుల కాడ మనం
దొడ్డి కాడ మనమే – గడ్డాము కాడ మనమే
మట్టి కాడ మనం – ఆ ఎట్టి కాడ మనం
ఆనాటు కాడ మనం – ఆ మోటకాడ మనం
కోత కాడమనం – వరిమోతకాడ మనం
సాకిరేవు కాడ మనం – సారెలుదింపేది మనం
సావు కాడ మనమే – సన్నాయి కాడ మనమే
దొర ఏందిరో – దొర పీకుదేందిరో – అంటాడు.

సకలం దళితుల శ్రమశక్తితో రూపు దాలుస్తున్నాయంటాడు కవి. దళితులు సంపద సృష్టిస్తూ, ఆసంపదను అనుభవించే హక్కులేక, దొరలచే బానిసలుగా చూడబడుతున్న స్థితిని రూపు గట్టించాడు. అటువంటి దొరల పెత్తనం పోవాలంటే –

కూలినాలి పేదోళ్లం కలిసి మెలసి యుండాలి
సంఘపోళ్ల జండ కింద – సంఘ మొకటి పెట్టాలి
మనల దోచె దొరల మక్కెలిరగదన్నాలి

– అంటూ తన ఆవేశాన్ని ఆక్రోశాన్ని ప్రకటిస్తాడు.

ఈ గీతం విప్లవ సంస్థలకు ఇంధనంగా పనిచేసింది. తెలంగాణలో దొరల పెత్తనం ఎలాంటిదో ఒక పక్క చెబుతూనే ఆ దొరల కింద దళిత బహుజనులు ఎలా అణచివేయ బడ్డారో కవి తెలిపాడు. ఇంకా పేద దళిత అణగారిన వర్గాల వారు చేసే పనుల జాబితా కూడా ఇచ్చాడు. వీటిని బట్టి దళితులు చేస్తున్న వృత్తులు, వారి జీవన విధానం ఎలాంటిదో నేటి తరానికి అవగాహన కలుగుతున్నది.

ఈ వ్యాస రచనకు ఉపకరించిన గ్రంథాలు :-


1. ఆధునిక సాహిత్య విమర్శ ఇనాక్ సూత్రం
– ఆచార్య కొలకలూరి ఇనాక్
2. ఆధునిక సాహిత్యంలో ప్రక్రియలు
– ధోరణులు – ఆవుల మంజులత
3. దళిత సాహిత్య వాద వివాదాలు
– ఆచార్య ఎస్వీ సత్యనారాయణ
4. ఆధునిక సాహిత్యం
– దళిత స్పృహ – కె.కె. రంగనాథాచార్యులు
5. దళిత సాహిత్యం – కలేకూరి ప్రసాద్
6. దళిత సాహిత్యోద్యమం – డా॥ శిఖామణి

# తెలంగాణ భూపోరాట నాటక సాహిత్యం

## TELANGANA BHUPORATA NATAKA SAHITHYAM

Dr. T. Chakradhar Swamy
Dept. of Telugu
Satavahana University
Karimnagar.
Cell:+919849336718

డా॥ టి. చక్రధర స్వామి
తెలుగు విభాగం
శాతవాహన విశ్వవిద్యాలయం
కరీంనగర్.
సెల్:9849336718

తెలంగాణలో మొత్తం వ్యవసాయ భూమిలో 30% జాగీర్దారీ విధానం కింద ఉంటే, 10% నిజాం స్వంత కమతంగా ఉండేది. 60% భూమి ప్రభుత్వ భూమి శిస్తుకింద ఉండేది. జాగీర్దార్లు అగ్రహారీకులు, ఈనాందార్లు మొదలైన పేర్లతో రెవెన్యూ అధికారాలు కలిగి ఉండి, పన్నులు వసూలు చేసేవారు. ఈ విధంగా పన్నులు వసూలు చేసే కాలంలో సాగులో ఉన్న సారవంతమైన భూములను రకరకాల మార్గాలద్వారా వారు స్వంతం చేసుకున్నారు.

చివరికి నిజాం ప్రభుత్వ పరంగా, స్వంతంగా పన్నులు వసూలు చేయడం ప్రారంభించాడు. ఆ సమయంలో భూస్వాములకు కొంత భూమి నష్టపరిహారంగా ఇచ్చాడు. ఆ భూస్వాములే దేశ్‌ముఖ్‌లుగా ప్రసిద్ధులై, కొన్నివేల ఎకరాల భూమికి స్వంతదారులై తెలంగాణ గ్రామాల మీద నిరాటంకంగా అధికారం చెలాయించారు. రైతులు కేవలం కౌలుదార్లుగా మారారు.

అప్పులు, దాని మీద పెరిగే చక్రవడ్డీల కారణంగా రైతు భూమిని కోల్పోయాడు. అదనులో దొర పొలంలో వెట్టిచేయాల్సిన కారణంగా పంట సరిగా పండించుకోలేకపోయేవాడు. పెళ్ళి, పేరంటాల కోసం చేసే కొత్త అప్పులు అన్నీ కలిసి రైతు ఆలస్యంగానైనా భూమిని కోల్పోయేలా చేసాయి. ఈ పొలాలన్ని దొరల పొలాల్లో కలిసిపోయేవి. రైతులు పటేల్ పట్వారీలకు తమ భూములు దఖలు పరిచేవారు.

ఆ విధంగా పెద్ద మొత్తంలో భూములు స్వంతం చేసుకొన్న దొరలలో జన్నారెడ్డి ప్రతాపరెడ్డి, విసునూరి రామచంద్రారెడ్డి మొదలైన వాళ్ళు ఉన్నారు. చిన్న చిన్న తగాదాల విషయంలో తీర్పు పేరుమీద దొర లాభ పడటం, శిక్షల పేరు మీద జనం పీడనకు గురికావడం సామాన్యమైంది. వెట్టిచాకిరి నాటి ప్రధాన సమస్య. దానికి తోడు నిర్బంధ వసూళ్ళు, సర్కారు లెవి – ప్రజల బానిస బ్రతుకులను మరింత జటిలం చేశాయి. పేద ముస్లింలు కూడా దీనినుండి మినహాయింపబడలేదు. గ్రంధాలయం స్థాపించాలన్నా పాలకులు అడ్డుకునేవారు.

జాతీయోద్యమ ప్రభావంతో ఇక్కడ కూడా ప్రజలు సంఘటితం కావడం మొదలుపెట్టారు. తెలంగాణ ప్రాంతంలో 'ఆంధ్రమహాసభ'గా సంఘటితమయ్యారు. ప్రభుత్వానికి మహజర్లు, విన్నపాలతో మొదలైన ఆంధ్రమహాసభ క్రమంగా 12వ సభ నాటికి భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు చేసే స్థాయికి ప్రజలు ఏకమై ఎదిగారు. ఆంధ్రమహాసభ శాఖలు గ్రామగ్రామాన 'సంగం'గా వెలిశాయి. కుటుంబాలకు కుటుంబాలు 'సంగం'లో సభ్యత్వం తీసుకున్నాయి. పాలకుర్తి అయిలమ్మ కుటుంబం కూడా అందులో ఒకటి.

అక్రమ వసూళ్ళకు, వెట్టికి, భూమి నుండి బేదఖళ్ళకు వ్యతిరేకంగా జనం ఉద్యమాలు చేయడం ప్రారంభించారు. దొడ్డి కొమురయ్య మరణంతో పోరాటం 'సాయుధ పోరాటం'గా మారింది. రజాకార్ల ఆగడాలను కూడ ప్రజలు తిప్పికొట్టారు. ఇంట్లో నిత్యం ఉపయోగించే 'కారం', రోకలిబండలే వారి ఆయుధాలయ్యాయి. కర్ర, వడిశెల్ని ఆయుధాలుగా వాడారు. గుతువలు ఆయుధాలుగా గల సంగం – 'గుతపల సంగం' అయింది.

ప్రజలు దళాలుగా, గెరిల్లా దళాలుగా ఏర్పడి మారణాయుధాల సేకరణ ప్రారంభించారు. వీరి పోరాట

ఫలితంగా గ్రామ రాజ్యాలు నెలకొల్పబడ్డాయి. 12 నుండి 18 మాసాల పరిపాలన అంతా గ్రామ కమిటీలే నిర్వహించాయి. దొరలు గ్రామాలనుండి వెళ్ళగొట్టబడ్డారు. పేద ప్రజలు రెండు పూటలా కడుపు నిండ భోజనం చేయగలిగారు. అనేక మంది కమ్యూనిష్టు కార్యకర్తలు, నాయకులు ప్రాణాలు కోల్పోయారు.

1948 సెప్టెంబర్ 13న పోలీసు చర్య ప్రారంభమైనది. నిజాంను గద్దె దించటంతో పాటు, కమ్యూనిష్టుల అధికారాన్ని అంతమొందించడాన్ని లక్ష్యంగా పెట్టుకొని ఈ చర్య జరిగింది. దీర్ఘకాలంపోరాడిన రైతాంగం తమ సాయుధపోరాటాన్ని 21-10-1951 న ఉపసంహరించుకుంది. ఏ భూమి హక్కు కోసమైతే పోరాటం సాగిందో అది ఆచరణలోకి రాకుండానే పోయింది. ఆ పోరాటానికి వివిధ రకాలలో కొనసాగింపు కనబడుతోంది. ఇది స్థూలంగా తెలంగాణ పోరాట నేపథ్యం.

కమ్యూనిష్టు పార్టీ బలపడుతూ పోరాటం స్పష్టమైన రూపం తీసుకుంటున్న కాలంలో కార్మిక, కర్షక, పేద బడుగు ప్రజల జీవన చిత్రాలు ఇతివృత్తంగా అనేకానేక నాటకాలు, నాటికలు వచ్చాయి. అవన్నికూడా ముఖ్యంగా సానుభూతి పరులు, పార్టీ భావజాలం అంది పుచ్చుకున్నవాళ్ళు వ్రాసినవి కవాటంతో పోరాటాన్ని, ప్రజల జీవితాన్ని వాస్తవంగా చిత్రించడం జరిగింది. చూసిన నిజాన్ని సజీవంగా చిత్రించారు.

సాహిత్య ప్రక్రియలన్నింటిలోను నాటకానికి ప్రముఖస్థానం. అది దృశ్యకావ్యం. దేశ జనాభాలో అధికశాతం నిరక్షరాస్యులుగా ఉన్న మన భారతదేశంలో నాటకం ప్రజాజీవితాన్ని ఎక్కువగా ప్రభావితం చేయగలదు. ప్రజా చైతన్యాన్ని కలిగించగలదు. ఒక వైపు గాంధీజీ స్వాతంత్రోద్యమం, మరోవైపు ఆంధ్రరాష్ట్ర ఉద్యమం, ఇంకోవైపు తెలంగాణ పోరాటం వీటి నేపథ్యంతో నాటి నాటకాలు వచ్చాయి. తెలంగాణ పోరాటం గొప్పస్ఫూర్తిగల ఉద్యమం. ఆ ప్రజా ఉద్యమం నాటకాన్ని అనేక రకాలుగా చైతన్యవంతం చేసి ప్రజా వాహినిని ముందుకు నడిపింది.

వర్గ వైషమ్య విపత్తునుండి జాతికి నూతన జీవితాన్ని ప్రసాదించటానికి 1945-50 మధ్య తెనుగునాట ఉద్యమాలు వెలిసాయి. దోపిడీకి సమాధి కట్టి, మత మౌఢ్యాన్ని బద్దలు కొట్టి వర్గరహిత సమాజ స్వర్గాన్ని నెలకొల్పటానికి ఉద్యమకారులు ప్రయత్నించారు. ఆర్థిక, సాంఘిక స్థితిగతుల దుర్భరత్వం నుండే ప్రగతి భావం తలెత్తుతుంది. సాంఘిక ప్రగతి వర్గ రహిత సమాజం ధ్యేయంగా భూస్వామ్య వ్యవస్థపై పోరాటం జరిపేవారికి ఆ సమయంలో అవే భావాల్తో వచ్చిన రచనలు పెన్నిధులుగా దర్శనమిస్తాయి. తెలంగాణ ప్రాంతంలో జరిగిన భావ వికాసం, నాటక రచనా వికాసం కూడ అటువంటిదే.

'దున్నేవానికి భూమి' అన్న సత్యాన్ని హృదయానికి హత్తుకునేలా అత్యంత వాస్తవికంగా చిత్రించిన నాటకం 'మా భూమి' రచయితలు సుంకర సత్యనారాయణ - వాసిరెడ్డి భాస్కరరావు.

దేశముఖ్‌ల పీడనలో ప్రతిఘటనా శక్తిలేక దుర్భర అవస్థల పాలైన రైతుల, దీనుల గూర్చి వ్రాయబడిన నాటకం ఇది. దేశముఖులు వారి తాబేదార్ల దౌర్జన్యాలను, దోపిడీలను అరికట్టాలని ఒక ఉద్యమంగా ఏర్పడ్డ ప్రజావాహిణి పోరాట పటిమను, దీక్షాతత్పరతను ఈ నాటకం వెల్లడిస్తుంది. జీవన్మరణ సమస్యగా తెలంగాణ ప్రజలు సాగిస్తున్న సంగానికి దర్పణం పట్టిందీ నాటకం. దేశముఖుల విలాసమైన జీవితం, క్రూర మనస్తత్వం, వీరి దళారీలు రైతుల్ని, కూలీలను పెట్టే కిరాతక చర్యలు వీటన్నింటినీ ఈ నాటకంలో ప్రస్తావించారు. నాటకంలో ప్రజలంతా సంఘంగా ఏర్పడ్డారు. అడుగడుగునా విషాదమే ఎదురవుతున్నా మొక్కవోని ధైర్యస్థైర్యాలను ప్రదర్శించి తమ విజయాన్ని చాటుకున్నారు.

నల్లగొండ జిల్లాలో జరిగిన ప్రజాపోరాటాన్ని గూర్చి ఈ నాటకం రాయమడింది. ఆ పోరాటంలో 240 గ్రామాలపై పోలీసుదాడులు జరిగాయి. 15,390 మంది నైజాం ప్రభుత్వ హింసాకాండకు గురియైనారు. 52 మంది

స్మృతి చెందారు. నైజాం కిరాతకుల చేతుల్లో 64మంది మహిళలకు మానభంగం జరిగింది. ఈ మహోజ్వల పోరాటమే మమ్మల్ని ఈ నాటకం వ్రాయటానికి ప్రోత్సహించింది అంటూ మనవిలో తెలియజేశారు రచయితలు.

జగన్నాథరెడ్డి దేశ్‌ముఖ్, వెంకట్రావు పట్వారి, వీరారెడ్డి రైతు నాయకుడు, సీతమ్మ వీరారెడ్డి భార్య, కమల చెల్లెలు, దేశ్‌ముఖ్‌ను ఎదురించి పోరాడిన 'బందగి' సమాధి వద్ద నుండి నాటకం ప్రారంభమై సీతమ్మ దాదాసాహెబ్‌ల సమాధితో అంతమవుతుంది. పోరాటానికి, ఆత్మ బలిదానానికి ఉన్న బంధమిది. పోరాడుతున్నది క్రూరుడైన దేశ్‌ముఖ్‌తో, అతని వెంట ఉండే పోలీసులతో. అవసరమైతే ఇంటికొకడు బలియైపోవాలి. ఈ హక్కు కోసమే సీత తన ప్రాణాన్నిచ్చింది. మళ్ళీ మన పొలాల్ని వదిలి పెట్టటమంటే దాదాకి, సీతకి ద్రోహం చేసినట్లే (93వ పుట) అన్న వీరారెడ్డి మాటలతో దున్నేవారికే హక్కు భూమిపై అన్న గతాలాపనతో నాటకం ముగుస్తుంది. ఈ మహోజ్వల పోరాటంలో స్త్రీలు కూడా తమ ప్రాణాలనొడ్డి పోరాడటం ఉద్యమం యొక్క మహోన్నత లక్ష్యాన్ని, స్ఫూర్తిని తెలియచేస్తుంది. ఈ నాటక రచనాకాలం 1947.

1946లోనే సుంకర-వాసి రెడ్డి రాసిన నాటకం 'ముందడుగు' వేళ్ళూనుకున్న జమీందారీ వ్యవస్థలో నలిగిపోయే రైతుల సముద్ధరణకు సాగిన జమీన్‌రైతుల పోరాటానికి దోహదమిచ్చిన నాటకం ముందడుగు. ముందడుగు నాటక ఇతివృత్తంలో జమీందారుల కుటిల పన్నాగాలు, ఆ పన్నాగాలను ధైర్యంగా ఎదుర్కొన్న రైతు బిడ్డల మనస్తత్వాలను యధాతథంగా చిత్రించి చూపారు.

1953లో వాసిరెడ్డి భాస్కరరావు 'పోతుగడ్డ' నాటకం రాసారు. పల్లెలు వదిలి పట్నాలకు పారిపోయిన దేశ్‌ముఖ్‌లు తిరిగి పోలీసుల సహకారంతో గ్రామాలకు చేరడం ఈ నాటకంలో ఇతివృత్తం. ప్రజారాజ్యాన్ని నిర్మించుకునే దశ చూపించే నాటకం ఇది. నాయకులకు స్వంత జీవితం లేనికాలం. స్త్రీలపై అత్యాచారాలు పెరిగాయి. వయోజన పాఠశాల రాత్రిబడిగా చెప్పబడింది. నాయకులను కాపాడుకోవడం కూడా సంఘ సైనికుల భాగమే. నాయకులు తమపై ప్రజలు చూపిన విశ్వాసాన్ని వమ్ము చేయలేదు. వీరయ్య, నారాయణ పాత్రలు నాయకుడు ప్రసాదుని కాపాడేవి.

పీడనకు దోపిడికి ప్రతీకగా దిబ్బరాజు. దిబ్బరాజ్యాన్ని సృష్టించడం జరిగింది. సరోజిని పాత్ర నాయిక పాత్ర. ఆమె అన్న శేషగిరి దొరపైన ఉండే ప్రజలచేత నిందింపబడ్డ పాత్ర. కుట్రకేసులు, నాయకుల జాడ చెప్పమని నిర్బంధాలు, స్త్రీలపై సామూహిక మానభంగాలు మొదలైనవెన్నో సమస్యలు ప్రజలకు వా జీవన్మరణ సమస్యలకు తోడయ్యాయి.

'ఛలో హైదరాబాద్' నాటకాన్ని వేదాంతకవి 1948లో రచించాడు. దీనిలో ప్రధానంగా రజాకార్ మూవెంట్ చిత్రీకరించబడింది. దీనిలో రజ్వీ నరహంతకుడుగా చిత్రీకరింపబడ్డాడు. చివరికి నవాబ్ కూడా ఉద్యమంలో చేరిపోయినట్లు చెప్పబడింది. దేశభక్తిభరితమైన భావాలు చాలా చోట్ల కనిపిస్తాయి. కోటారెడ్డి భార్య రుద్రమ్మ దేవీ పూజ చేస్తూ...

'దేశము దుఃఖములో దేవి - తేలేను దిక్కెవరో'

అని పాడిన పాటలో పరాయి పాలనలో భారత దేశ దయనీయ స్థితి చెప్పబడింది. దుర్గమ్మే 'ఈ నైజాం రాజ్యం నరబలుల్ని కోరుతున్న కాళికాశక్తి రూపం ధరించింది' అని చెప్పటంలో నైజాం పాలనలో సాగుతున్న హింసాకాండను గురించి చెప్పటం జరిగింది. దుర్గమ్మకు నచ్చచెప్పటానికి కాంగ్రెస్ వ్యక్తి, కమ్యూనిస్టు వ్యక్తి, ఆంధ్ర మహాసభ వ్యక్తి ప్రయత్నిస్తారు. ఇందులో ఆయా పార్టీల స్వార్థ ప్రయోజన దృష్టి, అనైక్యత స్పష్టంగా తెలుస్తాయి.

"ఛలో ఛలో నిజాముకీ - మహా తెలంగకీ సరే
ఇత్తెహాదులింక మత్తేభంబులాయెరా"

మహారాజశ్రీ శిష్యులతో వీరగేయం

పాడుకుంటూవస్తాడు. ఇది ఉద్యమవీరుల ఉత్సాహాన్ని ద్యోతకం చేసి ప్రజల్లో ఉత్సాహాన్ని కలిగించేదిగా ఉంది. మహారాజశ్రీ భాషణం రెండు పూటలను మించిపోయింది. ప్రజల్లో ఉత్సాహం నింపే ప్రయత్నమిది.

'కాంగ్రెస్ కమ్యూనిస్టు ఏక్ హెూ - హిందూ ముస్లిం ఏక్ హెూ' అనే పాట సమైక్యతా ప్రతిపాదికంగా ఉంది. ఈ రంగం ఎన్నో ఆవేశ పూరిత గీతాలతో సాగింది. 'నిజాం కోటపై ధ్వజం కట్టాలోయ్' అనే పెద్ద దేశభక్తి గేయం ఈ నాటకంలో ఉంది.

'గెరిల్లా' నాటకం 'మా భూమి' నాటకానికి కొనసాగింపు, సుంకర సత్యనారాయణ గారి రచన. 1973లో వ్రాయబడింది. పాత్రలన్నీ మా భూమిలోనివే. గెరిల్లా దళాలు ఏర్పడి తిరిగి గ్రామాలకు వచ్చిన దొరలను ఎదిరించడం ఈ నాటకంలో కనిపిస్తుంది. తీవ్రస్థాయి పోరాటాన్ని చూపే నాటకం కనుక మా భూమిలో చూపబడిన జీవన్మరణ సమస్యలన్నీ పాత్రల సంభాషణలోనే కనిపిస్తాయి. పొలాలన్నీ బీడుపడ్డాయి కనుక లెవీ సమస్య ఇందులో చర్చించబడలేదు.

ప్రజలందరిపై సాగే పీడన, దౌర్జన్యాలలో భాగంగా స్త్రీలపై లైంగిక పరంగా జరిగే అత్యాచారాలు ఏ విధంగా జరుగుతూ వచ్చాయో ఈ నాటకంలో చెప్పబడింది. గెరిల్లా జీవితం వారి మధ్య మానవ సంబంధాలను మరింత ఉదాత్తీకరించగలిగింది.

రమేశ్ అనే ఒక డాక్టర్ పాత్ర, కొండలు, లక్ష్మీ అనే రెండు కోయ పాత్రలు – ఈ విధంగా కొన్ని పాత్రలు మా భూమి కన్న ఎక్కువగా ఇందులో కనిపిస్తాయి. గెరిల్లా దళాలు దొరలను ఏ విధంగా ఎదిరించిది ఈ నాటకంలో చూపబడింది. యల్లమంద సమాధికి సెల్యూట్ చేసి 'దున్నే వాడిదే భూమి' అన్న నినాదంతో ముందుకు సాగిపోవడంతో నాటకం ముగుస్తుంది.

పాటలన్నీ నాటక క్రమాన్ని ముందుకు సమర్థంగా నడిపిస్తాయి. రచయితపై కాలానుగుణంగా చోటు చేసుకున్న సినిమా వాతావరణం నాటకంలోని సన్నివేశ కల్పనలో కనిపిస్తుంది.

నాటికలు

విషయాన్ని హృదయానికి హత్తుకొనేలా చేసే నాటిక, నాటికలన్నీ పోరాటం జరుగుతున్న కాలంలోనే వచ్చాయి. కాబట్టి ప్రజా చైతన్యాన్ని అధికం చేయగలిగాయి. అక్రమ వసూళ్ళు, వెట్టిని చిత్రించిన మూడు నాటికలు పొట్లపల్లి రామారావు గారివి.

1. పగ:

ఉద్యమ కార్యకర్తలను, నాయకులను వెంటాడి, వేటాడి ఎలా హింసించారో 'పగ' నాటిక ప్రతిఫలించింది. ప్రజలు నాయకులను కడుపులో పెట్టుకుని కాపాడుకున్నారు.

సామాన్య ప్రజలకు తమ మీద అధికారం చేస్తున్న అధికారుల మీద 'పగ', తమ అధికారాన్ని సజావుగా సాగనీయని ప్రజల మీద 'పగ', వారి నాయకుల మీద 'పగ'. వీరి సంఘర్షణ నుండి మలచబడ్డ నాటిక 'పగ'. ఈ నాటికలో ప్రతి ఘటన వ్యక్తిగత ప్రతిఘటనగానే చూపబడింది. సంఘ చైతన్యం నుండి కాదు. ఇందులో నాయకుడు నరసింహారెడ్డి తనను బంధించిన పోలీసుల కళ్ళలో కూర కోసం నూరిన కారం కొట్టి పారిపోతాడు. నాయకుడి మీద పగతో ఉన్న పోలీసుల కథ అడ్డం తిరిగింది.

2. సరబరాహి:

అక్రమ వసూళ్ళను వస్తువుగా మలచిన నాటిక సర బరాహి (సరఫరా). ఊరికి అధికారి రాని రోజు లేదు. ఊర్లో కానుకలు, నజరానాలు, సరబరాహీలు లేని రోజు లేదు.

బర్రె సరబరాహి నుండి తప్పించుకు తిరిగే పేరమ్మ పాత్ర చుట్టూ ఈ నాటిక నడుస్తుంది. ప్రజా చైతన్యం కారణంగా, పేరమ్మ వెనుక ఉన్న జనాన్ని రచయిత చూపాడు. అందుకే అధికారులలో జంకు. పేరమ్మకు బర్రెపోతే బతకలేని పరిస్థితి. దొరకు ఎదురు తిరిగినా

బతకలేని పరిస్థితి. ఒకవేళ ఎదురు తిరిగి తప్పించుకుని బతకగలనేమోనని ఆశ. అందుకే ఎదురు తిరిగింది. దొరలోని జంతు ఈ నాటికలో కనిపిస్తుంది.

3. న్యాయం:

కోడి దొంగతనానికి న్యాయం చెప్పడానికి వచ్చిన అమీను కోసం కోడి అన్యాయంగా తెగబడింది. పాలితులకొక న్యాయం, పాలకులకొక న్యాయం. ఇతరులు చేస్తే దొంగతనం. అమీను కోసం చేస్తే, దానికి వేరే పేరు. న్యాయం అన్న మాట ఇక్కడ వ్యంగ్యంగా చెప్పబడింది. అన్యాయం న్యాయమైంది అమీను విషయంలో.

వీరకుంకుమ:

ఇది సుంకర సత్యనారాయణ రచన. సాయుధ గెరిల్లా దళ జీవితంలోని కొన్ని సంఘటనలు ఇతివృత్తంగా వచ్చిన నాటిక వీర కుంకుమ.

దొర గ్రామానికి తిరిగివచ్చాక నాయకుల మీద కక్ష సాధించే క్రమంలో నాయకుడు మోహన్‌రావు మరణించడం జరుగుతుంది. మోహన్‌రావు రక్తంతో తడిసిన మట్టిని వీర కుంకుమగ తెలుగువాళ్ళందరికి అందించి పోరాటాన్ని కొనసాగించాలని సిద్ధపడటంతో నాటిక ముగుస్తుంది. ఈ నాటికలో భూమి సమస్యలు, వాటి చుట్టూ ఉన్న అనేక సమస్యలు కనిపిస్తాయి. ఇది కొంత పెద్ద నాటిక. అక్క పాత్ర చాలా ఉదాత్తమైంది.

వీరనారి:

ఇది గరికపాటి రాజారావు రచన. పోలీసులకు పట్టుబడ్డ గెరిల్లాలు బందీలుగ ఎంతటి ప్రభుత్వ హింసను, దౌర్జన్యాన్ని ఎదుర్కోవలసి వస్తుందో ప్రాణాలనెట్లా కోల్పోవలసి వస్తుందో 'వీరనారి' నాటిక చిత్రిస్తుంది.

పోలీసుల క్యాంపులు దొరల బంగళాలలో ఉండేవి. అందుకే దళాలు దొరల బంగళాలు కూల్చివేశారు. గెరిల్లా దళంలోని ఒక 'వీరనారి' అమీను స్త్రీ బలహీనతను ఆధారంగా చేసుకొని అతనిని చంపి గెరిల్లా యోధులను విడిపిస్తుంది.

తెలంగాణ:

ఇది తిరునగరి రామాంజనేయులు రచన. సాయుధ పోరాటానికి ముందు సంగం స్థాపన, సర్కారు దౌర్జన్యాన్ని జనం చైతన్యవంతంగా ఎదుర్కోవడం ఇతి వృత్తం.

ఈ విధంగా తెలంగాణ పోరాట స్ఫూర్తితో నాటక సాహిత్యం వెలుగులోకి వచ్చి తెలంగాణ జన జీవితాన్ని ప్రభావితం చేసింది. తెలంగాణ పోరాట చైతన్యాన్ని రగిలించి స్ఫూర్తినిచ్చిన ఆ నాటి నాటక సాహిత్యం అజరామరమైనది.

ఇంకా సుంకర, మహీధర రామ్మోహనరావు, తిరునగరిల నాటికలు కొన్ని ఉన్నాయి. నా పత్ర సమర్పణ ఉద్దేశ్యం పూర్తయినందువల్ల ఈ వ్యాసాన్ని ఇంతటితో ముగిస్తున్నాను.

---

**ఉపకరించిన పుస్తకాలు**


1. ఆధునిక తెలుగు నాటకం – గండవరపు సుబ్బరామిరెడ్డి
(మొదటి భాగం)
ప్రవీణ్ పబ్లికేషన్స్, భౌద్ధనగర్, సికిందరాబాద్.

2. ప్రజల్లో విప్లవ జ్వాలలు రేకెత్తించిన అలనాటి ప్రజానాట్యమండలి.
కళాప్రపూర్ణ డా॥మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తి
సీతారత్నం గ్రంధమాల, మొగల్ రాజపురం
విజయవాడ–2006.

3. తెలుగు నాటక సాహిత్యం ప్రసంగ వ్యాస సంకలనం
తెలుగులో సామాజిక నాటకాలు (వ్యాసం)
డా॥కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి
ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైదరాబాద్.
మార్చి 1986.

4. తెలుగు సాంఘిక నాటకం
(మొదటి భాగం)
డా॥ పి.వి.రమణ, బయ్యారం, ఖమ్మం, 1988.

5. తెలంగాణ నాటక వికాసం
(పిహెచ్.డి. సిద్ధాంత గ్రంధము)
డా॥ తిరుణహరి చక్రధరస్వామి,
గోపాలపురం, హన్మకొండ, వరంగల్, 2010.

# కన్నడ దళిత జీవన విధానం - సాంస్కృతిక పరివర్తన

**ఎలిగొండ రాములు**

'ఇండియా'గా పిలుస్తున్న మన దేశానికి ఒకప్పుడు 'జంబూ ద్వీపం' అనే పేరు ఉండేదని చెప్పేటందుకు మనకు ఎన్నో చారిత్రక, సాహిత్య సాంస్కృతిక, భాషా సంబంధం గల ఆధారాలు ఉన్నాయి. కుల, మత, మూఢత్వ జాఢ్యాలు ఆ కాలంలో లేవని, అది మాత్ర సామాన్య ద్రావిడ సంస్కృతి దేశమంతటా విస్తరించి యున్న గొప్ప కాలమని నిరూపిస్తున్న ఆధారాలు కూడా మనకు ఉన్నాయి. ఇందుకు నిలువెత్తు నిదర్శనంగా నిలుస్తున్నది సింధు నదీ లోయ నాగరికత. మానవత, నైతికత, సమానత మొదలగు సుగుణాల పునాదులపై నిర్మింతమైంది నాగరికత. వ్యవసాయం మరుగు నీటి కాలువల అంతర్నిర్మాణ విధానం, మహాస్నాన వాటిక మొదలగునవి ఎంతో గొప్పగా వర్ధిల్లిన కాలమది. అటువంటి గొప్పతనం గల ఈ దేశంలో నేడు అనేక రకాల సామాజిక రుగ్మతలు ప్రజలను పట్టి పీడిస్తున్న విషయం మనం గమనిస్తున్నదే. కుల వ్యవస్థ కారణంగా దేశం సామాజికంగా అప్రతిష్ఠ పాలవుతున్నది. ఇటువంటి నేపథ్యంలో దేశంలోని అనేక భాషల్లో వెలువడిన దళిత సాహిత్యంలో వెల్లువెత్తిన సాంస్కృతిక చైతన్యాన్ని విశ్లేషించేదే ఈ వ్యాసం.

"అన్య భాషలలో సాంస్కృతిక పరివర్తన - ప్రాముఖ్యం' అనే పేరుతో జరుగుతున్న గన్నవరం జాతీయ సదస్సులో పత్ర సమర్పణకై నేను తీసుకున్న అంశం "దళిత జీవన విధానం - సాంస్కృతిక పరివర్తన", దళితులు సాంస్కృతికంగా అనుభవించిన అవమానాలు, అగడాట్లు, అనేక కష్టాలు ఏ విధంగా ఉన్నాయో! వాటిని ఎదిరించి ఎట్లా ముందుకు సాగిండ్లో తెలిపే ప్రయత్నం చేస్తున్నదీ వ్యాసం.

అస్పృశ్యులుగా, అంటరానివారుగా, నిమ్న వర్గాలుగా చండాలురుగా, పంచములుగా, హరిజనులుగా, పెద్దొల్లు కులాలుగా, దళితులుగా పిలువబడుతున్న జనాల హితం కోరి రచించబడేదే దళిత సాహిత్యం.

సెనార్ట్, నెస్ఫీల్డ్, సర్ హెర్బర్ట్, డాక్టర్ కాట్కర్ లాంటి ప్రపంచ మేధావులు కులాన్ని ఒక దుర్మార్గమైన వ్యవస్థగా చెప్పినట్లు డా. బి.ఆర్. అంబేద్కర్ ఒక పరిశోధనలో తెలిపారు. గెయిల్ ఆమ్వెట్ లాంటి వారు జీవిత పరిశోధనల్లో కుల దేశ్యాన్ని సామాజిక జాడ్యంగాను విశ్లేషించారు. ఇట్టి సామాజిక జాడ్యం తొలగింపజేసేటందుకు వచ్చిందే దళిత సాహిత్యం. 'ఇండియాలో మరాఠీ, కన్నడ, తమిళ, గుజరాతీ, బెంగాలీ, హిందీ, మలయాళీ తదితర భాషల్లో వచ్చిన సాహిత్యం పరిశీలిద్దాం.

జాతీయ స్థాయిలో నడిచిన, నడుస్తున్న దళిత ఉద్యమాలకు, దళిత సాహిత్యోద్యమాలకూ, మార్గదర్శులుగా, దార్శనికులుగా పర్యాయనామం పొందినవారు ఇద్దరు. వీరు 1) మహాత్మా జ్యోతిబా పూలే 2) డా॥ బి.ఆర్. అంబేద్కరు. వీరిద్దరి స్ఫూర్తితోనే మన దేశంలో దళితోద్యమం, దళిత సాహిత్యోద్యమం, రూపు దిద్దుకున్నది. "గులాంగిరీ" అనే గ్రంథాన్ని పూలే, "అస్పృశ్యులెవరు?" అనే గ్రంథాన్ని డా॥ అంబేద్కర్ రాశారు. ఈ గ్రంథాలే దళిత కవులకు, రచయితలకు ఉద్యమోత్సాహాన్నిచ్చాయి.

1956లో అనారోగ్యంతో డా॥ అంబేద్కర్ మరణించగా, 1958లో దళిత రచయితల మహాసభ ఏర్పాటై, మహారాష్ట్రలో దళిత సాహిత్య ఆవిర్భావానికి పునాది ఏర్పడింది. ఇండియాలో ఇట్టి సాహిత్య కృషిలో ఇదే మొదటి ప్రయత్నంగా చెప్తారు. 1972లో "దళిత పాంథర్స్ రూపంలో బొంబాయిలో దళితోద్యమ సాహిత్యం విస్తృతంగా తీసుక వచ్చారు. వీరిలో ప్రముఖులు - నామ్దేవ్ దసాల్, అర్జున్ డాంగ్లే, జె.వి. పవార్, నామ్దేవ్ ప్రహ్లాద్ బెండ్ వాంకర్, అరుణ్ కాంబ్లే మొదలగువారు.

**కన్నడ దళిత సాహిత్యం :**

కన్నడ భాషలో దళిత కథా సాహిత్యం విస్తృతంగా వస్తున్నది. కన్నడ కథానిక దళిత చైతన్యానికి ఒక సంకేతంగా నిలుస్తున్నది. ఈ వ్యాసకర్త ఈ వ్యాసరచన కొరకు పరిశీలించిన కన్నడ దళిత కథానికలు 15. వీటిని 14 మంది కన్నడ రచయితలు రాశారు. ఈ కథల తెలుగు అనువాదకుడు రంగనాథ రామచంద్రరావు గారు. జూలై 2016లో తెలుగీకరించబడ్డ ఈ దళిత కథలు, కన్నడ భాషలో 1968-2015 మధ్య 48 ఏండ్ల కాలంలో రాయబడినవి. వీటిలో మొదటి పది కథలు 20వ శతాబ్దానికి చెందినవి. మిగతా కథలు 21వ శతాబ్దంలో గడిచిన పదేండ్లలో రాయబడ్డాయి. మొదటి దశలో దళిత జీవిత చిత్రణ స్పష్టాస్పష్టం. రెండో దశలోని కథల్లో దళిత దృక్పథం స్పష్టం.

దళిత జనాల జీవితాల్లోని ఆవేదనలు, పీడనలు, హింస మొదలగు అంశాలు మొదటి దశ కథలలో చిత్రితమయినాయి. ప్రశ్నించటం, ఎదురించటం, ప్రతిఘటించటం లాంటివి కొంత వరకు ఈ కన్నడ దళిత కథల్లో కనిపిస్తాయి. ఫిర్యాదు లక్షణం కూడా ఈ దశలో కనిపిస్తుంది. అంతే కాకుండా ఈ కథలలో నెమ్మదితనం తొణికిసలాడుతుంది.

దళితుల తిరుగుబాట్ల వాస్తవికంగా ఆవిష్కరింపబడిన రెండవ దశ కథలలో సమస్యల పరిష్కార దృష్టి వ్యక్తమౌతుంది. క్రియాశీలత ప్రదర్శితమౌతుంది.

అన్ని కథలలో కూడా దళితుల జీవితంలోని వెలుగు చీకట్లు ఆవిష్కరించబడినాయి.

డా॥ దేవనూరు మహదేవ గారు రచించిన కథ "అమ్ముడు పోయిన వాళ్ళు" ఈ కథలో గౌడ కొడుకు కిట్టప్ప దళిత మహిళల్ని లొంగదీసుకొని అనుభవించడానికి అలవాటు పడ్డాడు. బీరడి భార్య లక్ష్మీ ఆత్మగౌరవంతో ఆకలి దహించి వేస్తున్నా కిట్టప్పను ధిక్కరించినా, చివరికి అతనికి లొంగి పోక తప్పలేదు. ఆర్థిక దారిద్ర్యం, దళిత మహిళ ఆత్మగౌరవాన్ని వ్యక్తిత్వాన్ని పరాయిరీకరించిన తీరును ఈ కథ చిత్రించింది.

మహదేవ గారు రచించిన మరో కథ పేరు "తూర్పు సీమలో హత్య గిత్య" ఇది గ్రామణ భూస్వామ్య దుర్మార్గాన్ని వాస్తవికంగా ఆవిష్కరించింది. రెక్కాడినా డొక్కాడని కుటుంబ పరిస్థితిని 'రంగప్ప పాత్ర ద్వారా దీనగాథను వివరించిన కథ ఇది.

డా॥ బి.టి. లలితా నాయక్ గారి రచించబడిన కథ 'పండుగ – బలి"దళితులూ మనుషులే. వాళ్ళకూ పండుగలూ, పబ్బాలూ ఉంటాయి. వాటిని ఉన్నంతలోనే భాగా జరుపుకోవాలే, అని అనుకుంటారు. అందుకొరకు కులతత్వవాదపు సంపన్నుల దగ్గర అప్పు చెయ్యక తప్పదు. ఇదే విషయాన్ని "పండుగ – బలి" కథలో చెప్పారు. ఈ కథలో కుటుంబ యజమాని "సణజ్జ సాంస్కృతిక ఉత్సవం కొరకు ఒక భూస్వామి దగ్గర అప్పుచేసి, తీర్చ లేక కష్టాల్లో ఇరుక్కుంటాడు.

డా॥ బరుగూరు రామచంద్రప్ప రచన "కరువు" అనే కథానిక 'అమ్ముడు పోయిన వాళ్ళు కథలో లాగా 'కరువు' కథలో కూడా రాముని భార్య చన్నిని, కులతత్వవాది పెత్తందారు "రంగప్ప లొంగతీసుకుంటాడు. కరువు కాలంలో కూడా ... మహిళలు భూ కామాందులచే చెరచబడటం ఈ కథలో ... బడినది.

డా॥ అరవింద మలగత్తి గారు రచించిన కథ ... నాణ్యం – నీళ్ళు బావిలో నీళ్ళు తోడుకున్నందుకు సైరి? ... వ్యక్తి శిక్ష అనుభవించవలసిన పరిస్థితి వచ్చింది. నీటి కొర ... దళితులు పడే కష్టాలు, కులం వల్ల కలిగే అణిచివేత మొద ... బాధలు ఈ కథలో వివరించబడ్డాయి.

డా॥ బి.టి. జాహ్నవి గారు చేసిన రచన "... సంబంధం" అనే కథానికి, ధనిక స్వామ్య వ్యవస్థలో డబ్బు ... మానవ సంబంధాలు ఎలా విచ్ఛిన్నం అవుతాయో, ద ... రక్తసంబంధాలు కూడా ఎలా విలువ లేకుండా పోతా ... ఈ కథలో చక్కగా ఆవిష్కరించడం జరిగింది.

డా॥ మాడ్నాకూడు చిన్న స్వామి గా ... రచించిన కథ 'మూగడి బాధ. ఇది ఒక అర్థమైన క ... వ్యవసాయ కుటుంబంలో ఎదు చనిపోతే రైతుకు బాధ. ... దళితులకు పండుగ. ఇదొక పార్శ్వం. ఈ కథలో గౌడ ... ఎదు చనిపోయిందన్న బాధకన్నా దాని ద్వారా చెయ్యా ... అని అనుకున్న వ్యాపారం దెబ్బతినది కదా! అనేది బా ... కాని దళిత జీతగాడు మూగడికి మాత్రం, గౌడ ఎద్దు "కా ... చచ్చిపోయిందన్న బాధ మిగిలింది. మనిషికి పశువకు మ ... ఉండే సజీవ సంబంధం మూగడి పాత్ర ద్వారా ఈ క ... అదుతేంగా చిత్రించబడినది.

డా॥ ఈరజ్జ కోసగి గారి రచన "సంజీ ... – వాడి ఇల్లు' అనే కథానిక "రక్త సంబంధం? అనే కథ ... డబ్బు ముందు రక్తసంబంధాలు ఓడిపోయినట్లే, సంజీవ ... వాడి ఇల్లు కథలో కూడా అవి ఓడి పోయాయి. తల్లి దబ్బ ... కొరకు సర్వ మానవ లక్షణాలను ఈ కథలో విసిరి పారేస్తుం ... ఇద్దరినీ ఆర్థిక సూత్రమే నడిపించినట్లు ఈ కథ సూచిస్తుంది

డా॥ మోగళ్ళి గణేష్ గారు రచించిన క ... 'మా తాతకొక కోరిక ఉండేది. ఇది చాలా పెద్ద క ... కులతత్వవాదుల పెత్తందార్ల బతుకుల కొరకు దళితుల జీవిత ... బుగ్గయిపోయిన తీరును ఒక 'తట్టు(ప్లేటు)ను ప్రతీకగా తీసుకొ ... ఈ కథ రచించబడినది. ఒక అతి పెద్ద దళిత కుటుంబంలో ... తాత తన వాళ్ళంతా డా. బి.ఆర్. అంబేద్కర్లాగా బా ... చదువుకొని గొప్పవాళ్ళు కావాలని కోరుకుంటాడు. కాని అయిన ...

కొడుకులు అందుకు భిన్నంగా తయారౌతారు. వ్యవస్థ అలా చేస్తుంది. ఈ కథలో ఇంకా అనేక సామాజిక వ్యక్తిగత రుగ్మతల్ని కూడా చిత్రించారు రచయిత.

మోదారు తేజ గారు చేసిన రచన 'తిరుగుబాటు కథానిక, సాంస్కృతిక వివక్ష మీద ఒక యువకుని నాయకత్వంలో దళిత జనాలు తిరుగుబాటు చేసి విజయం సాధించిన కథ "తిరుగుబాటు". తిరుగబడినప్పుడే రావలసిన మార్పు వస్తుందని తెలిపిన కథ ఇది. అంబేద్కర్ సంఘం ఏర్పాటుతో సమాజంలోని దుర్నీతి అంతమై, సమానత్వ సాధన దిశగా కృషి సాగిన తీరుకు నిదర్శనం ఈ కథ.

డా॥ అననూయ కాంబళే గారిచే రచించబడిన కథ "ఊరేగింపు" దళితులను రాజ్యాధికారం దిశగా అడుగులు వేయించిన కథ ఇది. దళితుల క్రియాశీల రాజకీయ చైతన్యాన్ని ఈ కథ ప్రతిపాదించింది. దళితులకు కలిగిన ఆనందం, దళితేతరులకు కంటగింపు కలిగించేదిగా ఉండటం, దళితుల్ని పోలీసు స్టేషన్కు పంపటం. మొదలగు సంఘటనల్ని చిత్రించిన కథ ఇది.

మంజునాథ వి.ఎం. గారు రాసిన కథ "అస్పృశ్య గులాబి" దళితుల శ్రమ కావాలి. వాళ్ళ స్పర్శ మాత్రం నిషేధింపబడాలి. ఈ దుర్మార్గాన్ని ఎత్తి చూపిన కథ "అస్పృశ్య గులాబి". "మాదిగ కులాన్ని ఆ కులం వారి ఆహారమైన పశు మాంసాన్ని అసహ్యించుకోవటం, అవమానించటం మొదలగు వాస్తవాల్ని ఈ కథ చిత్రించింది. అలాగే ప్రేమ చుటూ ఆవరించిన "అస్పృశ్యతను" కూడా ఈ కథలో ఆవిష్కరించటం జరిగింది.

టి.కె. దయానంద గారు చేసిన రచన " ఓ యర్రన్న కథ. పీడిత కులాలలోనే పీడకులు పుట్టుకొచ్చి స్వజాతి పీడనకు పూనుకునే వాస్తవాన్ని చెప్పింది " ఓ యర్రన్న కథ. రాజకీయ నాయకుడిగా చలామణి అవుతున్న వాలే రాముడు దళితుడైనప్పటికీ, దళితులకు చెయ్యాల్సిన సేవ, చెయ్యకపోగా, వారిని మోసం చేయ్యటం జరుగుతుంది. దగా, అన్యాయం లాంటి పదాలకు పర్యాయపదం వాలె రాముడు. అంతేకాక, పశువుల్ని దొంగిలించి, దగ్గరలో గల సంతలో అమ్మి హమాలీ పనుల్ని చేసుకునే దళితులకు వడ్డీకి ఇచ్చిన పరమ నీచుడు, నికృష?డు. ఇతడి చేష్టలన్నీ తెలిసి కూడా నమ్మిన యెర్రన్న ఇతడి మోసానికి బలికావడం సమకాలీన దళిత సమాజంలోని వాస్తవిక జీవన విధానానికి ఈ కథ అల్లబడింది.

పి. మంజునాథ గారి కలం నుండి జాలువారిన కథానిక "ఓ పలక ముక్క కథ". ఈ కథ విద్య ద్వారా దళితులు తమ జీవితాలను బాగు చేసుకున్న క్రమాన్ని ఆవిష్కరించింది. బానిసత్వంలోంచి స్వేచ్ఛా జీవితంలోకి ప్రవేశించేతందుకు ఆధారమైన పలక' చుటూ ఈ కథ అల్లబడింది.

సంతోష గుడ్డియంగడి గారు రాసిన కథ "గొడ్డు కాఫీ". హెటలులో రెండు గ్లాసుల పద్ధతి మీద తిరుగుబాటు చేసిన కేశవుని కథ 'గొడ్డు కాఫి. నేటికి కూడా దేశంలోఅనేక చోట్ల దళితులకు, దళితేతరులకు వేర్వేరుగా హెటళ్ళలో రెండు గ్లాసులు పెట్టే విధానం కొనసాగుతూ ఉన్నది. ఇట్టి దౌరాగ్య స్థితిని వాస్తవికంగా చిత్రించిన కథ "గొడ్డు కాఫి".

అమ్ముడు పోయిన వాళ్లు, పండుగ - బలి, తూర్పు సీమలో హత్య గిత్య, కరువు, చిల్ల నాణ్యం-నీళ్ళు, రక్త సంబంధం, మూగడి బాధ, సంజీవ -వాడి ఇల్లు, మాతాత కొక కోరిక ఉండేది - కథలన్నీ

1968-1992 మధ్య కాలంలో రచించబడినవి. వీటిని మొదటి దశ కథలు అంటున్నారు. ఈ కథలన్నిట్లో విమర్శనాత్మక వాస్తవికత ప్రధాన సూత్రంగా ఉన్నది. వీటిలో కొన్నింట్లో ప్రతిఘటనలు ఉన్నా అవి విఫలమయ్యాయి. ఆ తర్వాత రాబోయే కథల్లో క్రియాశీల వాస్తవికత ప్రధాన సూత్రమైంది.

కన్నడ దళిత కథల్లో రెండవ దశకు చెందినవి తిరుగుబాటు, ఊరేగింపు, అస్పృశ్య గులాబి, ఓ యర్రన్న కథ, ఓ పలక ముక్క కథ, గొడ్డు కాఫీ. ఇవి 2005%--%2015 మధ్య కాలంలో రాయబడినాయి. ఈ కథల్లో దళితుల తిరుగుబాట్లు సఫలమయ్యే దిశగా పయణించాయి. దళితుల ఉద్యమ చైతన్యం ఈ కథల్లో వెల్లివెరిసింది. రాజకీయ స్వభావం సుపుగా కనిపిస్తుంది.

ఈ విధంగా కన్నడ దళిత కథలు ఇండియా దేశపు సామాజిక అప్రజాస్వామికతను ఆవిష్కరిస్తూ, ఆలోచనలు రేకెతిస్తున్నాయి. మన దేశం నిజమైన ప్రజాస్వామిక దేశంగా మారవలసిన అవసరాన్ని ఈ కథలు గుర్తు చేస్తున్నాయి.

మహారాష్ట్ర నుంచి స్ఫూర్తిని అందిపుచ్చుకొని కర్నాటకలో అదుతేమైన దళిత సాహిత్యం పుట్టింది. 1970లలో కర్నాటకలో దళిత సంఘర్షణ సమితి మొదలైంది. గ్రామ గ్రామాన ఈ సమితి శాఖలు ఏర్పడ్డాయి. ఈ సమితి నాయకులు, కార్యకర్తలు ఎక్కువగా కవులు అయి వుండటం విశేషం. వీరు హెరతాద

హెూటుగళు (ఉద్యమ గీతాలు) అనే పాటల సంకలనాన్ని తీసుకవచ్చారు.

పురాణాలనీ, ఇతిహాసాలనీ, ప్రశ్నిస్తూ కన్నడ దళిత సాహిత్యంలో ఎంతో కవిత్వం వచ్చింది. నాటికలు, దృశ్యరూపకాలు, నవలలు వచ్చాయి. ప్రముఖ కన్నడ దళిత రచయిత, కవి, నాటక కర్త, డాక్టర్ చెన్నన్న వాలీకర్ రాసిన 'ధావేహకువరు'. అనే నాటికలో లచ్చయ్య, తిప్పన్న అనే రెండు పాత్రల సంభాషణ ద్వారా దళితుల రాజకీయ చైతన్యాన్నిధ్వనింపచేశారు. మరో ప్రముఖ కన్నడ దళిత కవి డాక్టర అరవింద మాల గాటి రాసిన 'మ్యాగిన వారు' (అగ్రకులు) యిలా సాగింది.

"రామాయణంలోని కాలుష్యాలన్నింటికీ సీతే కారణం.
హిందూ మతంలోని కాలుష్యాలలన్నింటికీ
అగ్రకులాలే కారణం
శకునే లేక పోతే
భారతమే లేదు.
కైకే లేక పోతే
రామాయణమే లేదు" – అంటూ అగ్ర కులాల వారి కారణంగానే కాలుష్యం అంతా వచ్చిందని అభియోగం చేస్తున్నారు కవి. ఇదే విధంగా మరో ప్రముఖ కన్నడ దళిత కవి సిద్ద లింగయ్య తన 'సానిరారు నదిగలు (వేలాది నదులు) అనే కవితలో ఇలా అంటారు.

"వేదాలు, శాస్త్రాలూ, పురాణాలూ అన్నీ
వేలాది నదుల మీద ఎండుటాకుల తెట్టులాగా
పోరాటాల సముద్రం వైపు ప్రవహిస్తున్నాయి".

కన్నడ దళిత కవులు జమీందారీ వ్యవస్థకూ, భూస్వామ్య వ్యవస్థకూ వ్యతిరేకంగా కవిత్వం రాశారు. గంగారామ్ చండాల అనే కవి "వెట్టి కార్మికుడు' అనే కవితలో –

'రామ జపంలో పడి
నన్నూ నా వాళ్ళనీ మర్చి పోయాను
చీకటినంతా దిగమింగి
వాళ్ళకు వెలుతురు పంచుతున్నాను.
చివరకు నా కన్నీళ్ళలో
ఆకాశ నక్షత్రాన్ని చూశాను.
నేనొక తారకను కావాలనుకున్నాను' – అంటారు.

సిద్ద లింగయ్య, రామనిజ్జ లాంటి మరెందరో కన్నడ దళిత కవులు, అత్యాచారాలనూ, సామాజిక, ఆర్థిక దురన్యాయాలనూ దుయ్యబడుతూ గొప్ప కవిత్వం రాశారు. ఎంతో ఆగ్రహంతో రాశారు. దళిత భాషలో, దళిత పదచిత్రాలలో రాశారు. ఎంతో కసితో రాస్తూ కూడా ప్రే[illegible] కవిత్వం కూడా రాశారు. డాక్టర్ చెన్నన్న వాలీకర్ 'నా ప్రే[illegible] అదుతేలు' "ఏనుమనిబుత్రాలో నన్నేతేయ జొన్న సిద్ద లింగ[illegible] 'నీకంటి పాట" "వెండి కరణాలు (సత్తువ బల్ల కిరణ) యిం[illegible] మంచి ఉదాహరణలు

"ప్రియా!
ఆ కొండల మీద వెన్నెలలో
అలా స్వర్గం వైపు దారిలో తిరుగాడమాకు
నీ మల్లెపూవు దేహాన్ని
ఆ వెండి కిరణాలు
కాల్చేస్తాయో యేమో!" ఇది ప్రేమ కవిత్వం.

మల్లూరు నాగరాజు రచించిన కన్నడ దళిత రచన[illegible] అదుతేం. వారు దళిత జీవితంలోని వైవిధ్యాన్ని దళితు[illegible] ఆకాంక్షల్ని చాలా చక్కగా చిత్రించారు. ఆయన రాసిన "మర[illegible] మండల మధ్య దొడగె' (మరణంలోని జీవితం) ఎంత[illegible] ప్రాచుర్యాన్ని పొందిన నవల. దేవనూర మహాదేవ రాసి[illegible] 'ఒదలాల', 'అనూస కథలు ఎంతగానో పేరు పొందాయి[illegible] కన్నడంలో దళిత నవల, దళిత కథ ప్రక్రియల్ని అదుతేం[illegible] తీర్చిదిద్దిన రచయితల్లో ప్రముఖులు దేవనూరు, మహాదే[illegible] ములూరు నాగరాజు గారలు.

ఈ విధంగా కన్నడ సాహిత్యం దళిత చైతన్యానికి తన వంతు చేయూతను అందిస్తున్నది.


<u>పరిశోధకుడి చిరునామా :</u>

1-67 తొగర్రాయి, మం॥దుగ్గొండి,
జి॥ వరంగల్ (రూరల్),
తెలంగాణ రాష్ట్రం–506331,
సెల్ : 9618598847.
Email : ramulualagonda@gmail.com

# గద్వాల సంస్థానం - సాహిత్య పోషణ

**టంగుటూరి జానకి రాములు**
ఉస్మానియా విశ్వవిద్యాలయం
చరవాణి: 9703532413

తెలంగాణ సంస్థానాలలో పేరెన్నికలగన్నది "గద్వాల సంస్థానం". గద్వాల సంస్థానం చరిత్రపరంగానే కాకుండా సాహిత్యపరమైన ఉనికిని కూడా కలిగి ఉంది.

గద్వాల సంస్థానంగా ప్రస్థానం క్రీ.శ. 1150లో ప్రారంభమయింది. ముష్టిపల్లి వీరారెడ్డి నాదగౌడుగా ఉంటూ అయిజ, దరూరూ మరికొన్ని పరగణాలు ఏలుతున్నాడు. ఇతనికి పుత్ర సంతానం లేనందున అల్లుడు పెద్దారెడ్డి ఇల్లరికం తెచ్చుకున్నాడు. వీరారెడ్డి తర్వాత పెద్దారెడ్డి నాదగౌడ అయ్యాడు. ఇతని హయంలో మరికొన్ని పరిగణాలు దఖలుపడ్డాయి. ఇతనికి ఇద్దరు కొడుకులు. ఆనందగిరి, సోమగిరి అనే పేరు గల పెదసోమ భూపాలుడు, నాదగౌడగా అధికారం చేస్తూ క్రీ.శ. 1704 తర్వాత కృష్ణానది దక్షిణ తీరాన గద్వాల కోటను నిర్మించాడు. తుంగభద్రకు చాలా దక్షిణంగా రాజ్యాన్ని విస్తరింపచేశాడు. ఇతని ఆధీనంలో ఉన్న పరగణాలను ఒక కవి ఇలా పేర్కొన్నాడు.

'ఐజదరూరుల కధిపుడై విలసిల్లి బన్గానిపల్లె దోర్బలత చెంది శిరువళ్ళనందేల సిద్దాపురం బులుభండాత్మకూర హోబలపు సీమ సాధించి తురకల సంహార మొనరించి కందనూల్ ముట్టడిగా నమర్చి దుర్గంబు సాధించి తొలగంగ నాదవేన్ పుర మాత్మవశత బెంపొందజేసి

విక్రమంబున సకల భూచక్ర మెల్ల
నాక్రమించి దిగంతంబులందు కీర్తి
నించి గాద్వలపుర మధిష్టించి వెలసె
నృపతి మాత్రుండె సోమావని విభుండు'

పై పద్యంలో గద్యాల సోమన్న పాలించిన ఊళ్ల పేర్లన్నీ తెలుస్తున్నాయి. సోమన కీర్తి ఢిల్లీ దాకా విస్తరించిందని తెలుస్తోంది.

కవులు సోమన దర్శనం చేసుకొని సత్కారాలు పొందాలని గద్వాలకు వస్తూండేవారు. ఈయనకు నూతన సోమయాజి అనే బిరుదును ఇచ్చాడు గద్వాల సోమన్న.

పెదసోమన్న తర్వాత చెప్పుకోదగ్గ ప్రభువు చిన్నసోమన్న. ఈయన తండ్రి రామారాయుడు. 17 మహళ్ళకు ప్రభువుగా నియమింపబడి నాదగౌడు నర్నాడగౌడు అయ్యాడు. ఈ పదవికి రాజలాంఛాలయిన ఛత్రచామరాలు ఉండేవి. తర్వాత చిన్న సోమన తెలివిగా రాజ్యాన్ని ఏలుతున్నాడు.

చిన్న సోమనకాలంలోనే గద్వాల సంస్థానంలో విశేషంగా సాహిత్య పోషణ జరిగింది. చిన్నసోమన్న తర్వాత ఇతని తమ్ముడు రాజా చిన్న రామభూపాలుడు 1794-1800 వరకు పాలించాడు. ఇతనికి పుత్ర సంతానం లేనందున కూతురులింగమ్మకు పెళ్లి చేసి అల్లుడు సీతారామ భూపాలుడుకి రాజ్యం ఇచ్చాడు. ఈయన 1806-1849 వరకు పాలించాడు. ఈ ప్రభువునకు ఆస్థాన విద్యాంసుడు కృష్ణమాచార్యులు. ఈయన బ్రౌన్ దొరకు సుపరిచితులే. దాదాపు ఈయన కాలంలోనే గద్వాలలో "సాహిత్య విద్యాముకురము" అనే

ముద్రక్షరశాలను స్థాపించారు. దీని ద్వారా పండితుల గ్రంథాలు అచ్చు అయ్యేవి.

సీతారామ భూపాలునికి సంతతి లేనందున ఆయన తర్వాత లింగమ్మ గారు రాజ్యభారం వహించారు. రామన్నను దత్తత తీసుకుని "సోమభూపాలుడు" అని పేరు పెట్టి రాజ్యం దారాదత్తం చేశారు. ఇతని పరిపాలన అస్తవ్యస్తంగా సాగింది. అతని దుర్మార్గాలను ప్రజలు సహించలేదు. సైనికులే కాల్చి చంపారు. మళ్లీ రాజ్యభారం రాణి లింగమ్మ వహించారు. తర్వాత ఆమె సపత్ని వెంకటలక్ష్మమ్మ రాజ్యాన్ని 32 ఏళ్ళు పాలించారు. ఆ తర్వాత ఆమె తన అన్న కుమారుడ్ని రామన్నను దత్తత తీసుకుని నిజాంచే ఆమోదింపచేసుకుంది. 1905లో ఈయన రాజ్యాధికారం చేపట్టాడు అతని పేరు "రాజరాంభూపాలుడు"

1853 నుండి గద్వాల సంస్థానం నామ మాత్రపు స్వతంత్ర సంస్థానం, గద్వాల 214 గ్రామాలు, 804 చదరపు మైళ్ళు విస్తీర్ణం గల రాజ్యం. పేష్కాను కడుతూ వున్నా సివిల్, క్రిమినల్ అధికారాలు మాత్రమే పూర్వంలాగే చెల్లుతూ వచ్చాయి.

గద్వాల సంస్థానం తొలి ఏడుగురి పాలనలోనూ సాహిత్య పోషణ నిరాటంకంగా జరిగింది. ప్రతీ కార్తీక మాసంలో పండితులను, మాఘమాసంలో కవి గాయకులను సన్మానించే చక్కని సంప్రదాయాన్ని ఈ సంస్థానం కలిగి ఉంది.

పైగా రాజా చిన సోమభూపాలుడు స్వయంగాకవి కూడా చక్కని పోషకుడు. ఇతనికి "సారస్వత వైభవాభినవ భోజరాజు" అనే బిరుదు కూడా కలదు.

గద్వాల సంస్థానం కవులలో ప్రముఖులు మొదటి వారు కాణాదం పెద్దన సోమయాజి

కాణాదం పెద్దన సోమాయాజి తనకు తాను తన 'నిస్సహాయ సాహితీ నిహరుణ్ణిని" గద్యలో చెప్పుకొన్నాడు. ఇతనికి "భూసుర కవితా విలాస పాండిత్యం"తో "ఆంధ్రవశ్ఛమత్ృతులు" కూడా తెలుసు. ఈయన ఇతర సంస్థానాలలో కూడా కృతులు రచించి మన్ననలు పొందాడు. సురపురం సంస్థానంలో బహరీపామన్నపాలకు కొలువులో 'మత్స్యపురాణం' రచించాడు. "విప్రవంశం అనే పేరుతో నందవరాత బ్రాహ్మణుల చరిత్రను చిన్న గ్రంథంగా రాశాడు. భోజుడు సంస్కృతంలో రచించిన చంపూ రామాయణానికి సంస్కృతంలోనే వ్యాఖ్యానం లాంటి టీకను సమకూర్చాడు. తన చతుర్విధ కవిత్వ ప్రావిణ్యం కనపడేలా ముకుంద విలాసం' అనే భద్ర పరిణయాన్ని రచించాడు. ఈయన తన సమకాలీకులచే గౌరవింపబడ్డాడు. వెన్నెల కంటి వెంకటపతి ఇలా ప్రస్తుతించాడు ఒక పద్యంలో

"ఇద్దరు జోడునన్న కవి యెర్రన తిక్కన సోమాయజిదా
నుద్దగు వారికిన్ ముగ్గురి కొక్కడె దీటగు నల్లసాని మ
పెద్దన వారితోడు తన బేరు వహించియున్న శ్రీకణాదముం
బెద్దన సోమయాజి వినుపెద్దన బొల్చు కవిత్వ సంపదన్"

రామాయణంలోని బాలకాండను ఈ కవి తెనిగించారు. యధాశ్లోక తాత్పర్య రామాయణాన్నే కాక పెద్దన ఆధ్యాత్మిక రామాయణాన్ని సంపూర్ణంగా అనువదించాడు. కాణాదం పెద్దన రచనలు గద్వాల సంస్థానంలోని ముద్రాక్షరశాలలోనే 1875 నాటికి అచ్చుయిందని 1943 మే నెల 26 నాటి గోలకొండ పత్రిక సాక్ష్యాలతో తెలియచేశారు. ఏది ఏమైనా గద్వాల సంస్థానంలో కాణాదం పెద్దన ఒక 'కవిరత్నం' కొత్తపల్లి రామాచార్యులు: ఈయన యధాశ్లోక తాత్పర్య రామయణంలోని ఆయోధ్యకాండను 5 అశ్వాసాలలో అనువదించాడు. తాను శౌర్య ధైర్య గంభీర్య చాతుర్యధుర్యుడైన సోమభూపాలుని ఆస్థానంలోని విద్వన్మహా కవినని చెప్పుకొన్నాడు. ఇతనిది సరసరచన అని స్వయంగా చినభూపాలుడే మెచ్చుకున్నాడు. అయితే ఇప్పటి వరకు ఈ కవి యొక్క ఇతర రచనలేవి లభించలేదు.

గార్గేయపురం సుబ్బిశాస్త్రి : ఈయన యధాశ్లోక తాత్పర్య

రామాయణంలోని అరణ్యకాండను మూడు ఆశ్వాసాల్లో తెనిగించాడు. ఈయన కూడా "ఉభయ కవితా నిస్సహాయ సాహితీ ధురీణుడు" ఆయన చేసిన ఇతర కృతులేమిటో వాటి వివరాలు, పేర్లయినా నేడు తెలియరావట్లేదు.

కామసముద్రం అప్పలాచార్యులు : గద్వాల సంస్థానానకు చెందిన కవులలో ఈయన ప్రముఖుడు. ఇతన్నే పిలిచి చిన సోమన్న రామాయణ రచనా సంకల్పం చెప్పి రచియింపచేశాడు. ఇతడు రామాయణ అవతారికతో పాటు కిష్కింధకాండను కూడా రచించాడు. ఇతడు "విద్వత్సభికుంజర" బిరుదాంకితుడు.

కిష్కింధకాండను 3 ఆశ్వాసాల్లో రచించాడు. జయదేవుని అష్టపదులను కూడా తెనిగించాడు. ఇతని తండ్రి కృష్ణమాచార్యులు అష్టభాషాకవి. కానీ ఆయన ఏ గ్రంథాలు రాశాడో తెలీలేదు.

తిరుమల కృష్ణమాచార్యులు : ఇతడు తన గద్యలో అష్టభాషా కవితా సమానవైభవ ధురంధరుడని చెప్పుకున్నాడు. ఇతడు బ్రౌన్ దొరకు పరిచితుడు. సీతారాం భూపాలుని ఆస్థానంలో కూడా ఉండేవారు. మడులు మాన్యాలతో పాటు ఇతడు జీతం కూడా తీసుకునేవాడని బ్రౌన్ దొర నోట్ చేసుకున్నారట. ఈయన కవిత్వం వేగంగా చెప్పగలడని రాజుగారి ఉద్దేశం. ఇతడు యథాశ్లోక రామాయణంలోని సుందరకాండను 3 ఆశ్వాసాలుగా అనువాదం చేశాడు. ఇతని రచనలు ఏమిటో తెలియవు.

బోరవెల్లి శేషాచార్యులు :

గద్వాల సంస్థానంలోని చాలా మంది కవులలోనే ఈయనకూడా ఉభయకవితా నిస్సహాయ కవితా విహారులమని చెప్పుకున్నారు. యుద్ధకాండను 4 ఆశ్వాసాల్లో తెనిగించారు. ఇతని గురించి ఇంతకన్నా ఎక్కువ వివరాలు తెలియలేదు.

చిన్నసోమన్న :

ఈయన గద్వాల ప్రభువు. కవి కూడా సంస్కృతంలో హరిభట్టు రచించిన "రతిరహస్యం" ను పద్య కావ్యంగా అనువదించాడు. జయదేవుని గీతగోవిందంలోని అష్టపదులకు విపులమైన గేయానువాదాన్ని కూడా చేశాడు. మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఒక పల్లవి, చరణాల, శ్లోకం, మార్జిక, దరువులు కలిసిన ప్రతి మాత్రం లభించింది.

గద్వాల సంస్థానంలో సంగీతం సాహిత్యం రెండూ విరివిగా వికసించాయని చెప్పవచ్చు. వెంకట భూపాలుడు కూడా దాదాపు 4000 కీర్తనలు రచించాడు. అన్నింటికీ రాగతాళ నిర్దేశాలున్నాయి. కీర్తనల మధ్య గాన యోగ్యాలయిన ద్విపదలు కూడా ఉన్నాయి. గద్వాల సంస్థానం వారు వారి దగ్గర గల అమూల్యమైన తాళపత్ర గ్రంథాలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమికి అందచేశారు. పైన పేర్కొన్న కవులు మాత్రమే కాకుండా గద్వాల సంస్థానంలో చాలా మంది కవులుండేవారని చెప్పవచ్చు. కాని వారి గురించి సరియైన వివరాలు తెలియాలంటే మాత్రం గద్వాల సంస్థానం, గ్రామాలలో ఉన్న తాళపత్ర గ్రంథాలు, రచనలు దొరికితే ఆనాటి సాహిత్యం గూర్చి రూపురేఖలు బయటపడే అవకాశం, మరికొంతమంది కవులు వెలుగులోకి రావటమూ జరుగుతుంది.

ఆధారగ్రంథాలు :

1) గద్వాల సంస్థానం సాహిత్యసేవ
- మహమ్మద్ ఉస్సేన్
2) తెలుగు సంస్థానం - సాహిత్య పోషణ
- తూమాటి దోణప్ప
3) తెలుగు సంస్థానం - సాహిత్య పోషణ
- కేశవపంతుల లక్ష్మీనర్సింహశాస్త్రి
4) మహబూబ్‌నగర్ జిల్లా మండల సర్వస్వం
- బి.ఎన్. శాస్త్రి
5) పాలమూరు సంస్థానం - సాహిత్య సేవ
- ఆచార్య ఎస్.వి. రామారావు.

# అంశం:- జానపద సాహిత్యం - నగరీకరణ



ఆర్. సత్యంరెడ్డి
M.A., M.Phil

## జానపద సాహిత్యం - పరిచయం:-

జానపద సాహిత్యాన్ని Folk literature అంటారు. జానపద విజ్ఞానాన్ని Folk lore అంటారు. ఇది తరతరాలుగా మానవుడు సంపాదించిన అనుభవించిన సాంప్రదాయికనిధి. తెలుగులో జానపద సాహిత్యాన్ని గేయ వాఙ్మయం, వీరగాథావాఙ్మయం, స్త్రీలపాటలు, బాలబాలికల గేయాలు, గద్యరూపాత్మకం, సామెతలు పొడుపు కథలు, ఐతిహ్యాలు, పురాణాలు వ్రత, నోముల కథలు మొదలైన విధములుగా వర్గీకరించారు.

జానపద సాహిత్యం అజ్ఞాన కర్తృత్వ లక్షణం కలిగి ఉంటుంది. మౌఖిక ప్రచారం మరోలక్షణం రచనాకాలం కూడా అజ్ఞాతమే అశురచన కావటం, గానయోగ్యత, పునరావృత్తి, సార్వజనీనత రసప్రధానం అనేవి జానపద కవిత్వ లక్షణాలు, నిత్యజీవితంలో నుండి వెలువడిన ఈ దేశి కవిత్వం సంప్రదాయ కవిత్వం కన్న ప్రాచీనమైనది. అందుకే "జానపద గీతిక జాతిజీవనాళిక" అని అంటారు.

ఈ జానపద సాహిత్యాన్ని ఉత్తర భారతీయులు గ్రామ సాహిత్, లోక సాహిత్‌గా వ్యవహరిస్తారు. ఆచార్య బిరుదు రాజారామరాజు గారు తెలుగులో జానపద సాహిత్యంపై "జానపద గేయసాహిత్యం" అనే తొలి సిద్ధాంత గ్రంథాన్ని వెలువరించి ఒరువడిదిద్దారు. నాయిని కృష్ణకుమారి గారు "తెలుగు జానపదగేయ కథలు" పరిశోధనా గ్రంథంలో జానపదుల గూర్చి వివరించారు. ఈ జానపదం అనేది మౌఖిక ప్రసారంను కల్గియున్నది. జానపద కథాములాలపై గ్రిమ్ సోదరులు, జి.యస్. మోహన్ తెలుగు జానపద కథలు స్త్రీల పాటలను నందిరాజు చలపతిరావు, కపిల పాటలు, విసురురాతి పాటలు (రాయలసీమ) జానపదుల కళారూపాలు, నృత్యాలు, జాతరలు, సాంఘీ కాచారాలు, జానపదుల తిట్లు రసప్రధానమైన గేయాలు, గ్రామదేవతల నృత్యంతో కూడిన పాటలు, వదినా మరదళ్ళ సంవాదం ఒకటేమిటి అద్భుతమైన ఈ కళారూపాలు ఎన్నటికీ తరగనివీ, చెరగనిదీ. కానీ పెరుగుతున్న జనాభా, మారుతున్న జీవనశైలి ప్రవాహంలో ఈ సాహిత్య రూపాలు చిరుమార్పులు పొందుతూ చివరకు పెనుమార్పుకు లోనయ్యే ప్రమాదం పొంచివుందని మనం గ్రహించాలి.

తరతరాల నుండి తరగని గనిలా ఉన్న జానపద సాహిత్యం నాగరిక మానవుని చేతిలో కొత్త పుంతలు తొక్కుతుంది. పెరుగుతున్న ప్రసారసాధనాల వినియోగ, మానవ ముంగిలిలోకి వచ్చిన సాంకేతిక విప్లవంతో ఆధునికమానవుడు నవీన పంథాను అనుసరిస్తున్నాడు. జానపద విజ్ఞానంలోని ప్రతి అంశం నాగరిక ప్రభావానికిలోనవుతూ నవ్యత్వాన్ని సృజించుకుటుంది.

జానపద సాహిత్యం నగరీకరణకు గురవుతుందంటే అందుకు అనేక కారణాలున్నాయి. ప్రధానంగా జానపదులకు నాగరిక జీవంపట్ల మోజు పెరగటమే. ఆ ఆకర్షణయే జానపద సాహిత్యం - నవీనీకరణకు కొత్త సొబగులు దిద్దుకోవటానికి ప్రేరణ అవుతుంది. మారుతున్న సమకాలీన పరిస్థితులు పశ్చిమ దేశాల సాహిత్య పోకడలు, పదప్రయోగాలు, అన్యదేశాలపట్ల ఆకర్షణ సంగీత ఉపకరణ సౌలభ్యం సగటు మానవునికి పెరిగిన ఆత్రుత భౌతిక సంస్కృతి మొదలమైనవి. జానపద నగరీకరణకు దోహదపడుతున్నాయి. "మనుషుల బాహ్య జీవితము పల్లెలందు పట్నాలయందు కొంచెం భిన్నంగాయున్ననూ లోపలి జీవితంనందు ప్రకృతి అంతయూ ఒకేరీతిగా నడుచును సహజ ప్రకృతికి కోమలత్వం అను ముసుగు వేయుటే నాగరికత" అని ఖండవల్లి (రక్షీరంజనం) గారి అభిప్రాయం. నగరీకరణకు ప్రధాన కారణం ఆలోచనా దృక్పథం అవతలి వారి జీవనశైలిని అనుకరిస్తే మనమూ వారితో సమానంగా గౌరవించబడతమేమో అనుకోవడటమే, అది నాగరిక జీవనానికి, నగరీకరణకు మార్గమైనది. ఈ నగరీకరణ జానపద విజ్ఞానంలోని అన్ని అంశాలపై ప్రభావం చూపి మానవునికి విశాల దృక్పథాన్ని నేర్పినా మాతృ సంస్కృతికి మాత్రం "గొడ్డలిపెట్టు"గా మారుతుందనుటలో అతిశయోక్తిలేదు.

ఆంగ్లభాషా సంస్కృతుల ప్రభావం వల్ల మన సంస్కృతి కొంత క్రొత్త సామాజిక వ్యవస్థగా రూపుదిద్దుకుంటుంది. అనవచ్చు పట్నాల చూట్టూ ఫ్యాక్టరీలు నెలకొల్పబడ్డాయి. ఫలితంగా భుక్తికోసం ఉపాధి వెతుక్కుంటూ గ్రామవాసులు నగరాలకు వలసలు రావటం ప్రారంభమైంది. వారితోబాటు జానపద విజ్ఞానాంశాలు నగరానికి ప్రవేశించాయి. చుట్టూ గల గ్రామాలు పట్నాల్లో కలిసిపోవటం వల్ల పల్లెల్లోని జానపదత్వం నగర జానపద విజ్ఞానంగా మారింది.

#### జీవన విధానం - నగరీకరణ:-

నగరాన్ని తిలకించటం, అనుసరించటం, అనుకరించటం నగరీకరణ. దీన్ని ఋజువు చేయటానికి మనదైవనందిన కార్యక్రమాలను కొన్నింటిని తరచిచూస్తే...

జానపదులు ప్రొద్దున్నేలేచిన దగ్గర నుంచీ వారి కార్యక్రమాల్లో సహజత్వం, ప్రకృతికి దగ్గరగా ఉన్నట్లు మనకు అగుపిస్తుంది. జానపదులు కల్లాపి చల్లి, ముగ్గులు పెడితే నగర వాసులు మాత్రం ఒకేసారి వేయించిన పెయింటింగ్ (ముద్ర) అక్కడ ఉంటుంది. వారు నీళ్ళు చల్లనవసరంలేదు. ముగ్గులు పెట్టనవసరం లేదూ. జానపదులు దంత ధావనానికి వేపపుల్ల వాడితే, నగరవాసులు బ్రష్‌లు వాడుతున్నారు. చద్దన్నం జానపదులు తింటే నగరవాసులు ఫాస్ట్‌ఫుడ్‌లు, బర్గర్‌లు పిజ్జాలు తింటున్నారు. స్త్రీలు ముఖానికి పసుపురాసుకుంటే నగరంలో ఫెయిర్ అండ్ లవ్‌లీ యితరత్రాలేహ్యాలు వాడుతున్నారు జానపదులు సహజమైన భాషలో మాట్లాడితే నగర వాసులు వచ్చిన భాషని మార్చి కొత్తపుంతలు తొక్కిస్తారు, అప్పుడే తెలుగు నేర్చుకున్నట్లుంటుంది వారి మాటతీరు. రెండు సంస్కృతుల మధ్య అవినాభావ సంబంధం ఉండి ఆచారవ్యవహారాలు కొనసాగుతున్నాయి.

జానపద విజ్ఞానంలో ఒకభాగం జానపదసాహిత్యం ఈ సాహిత్యంలో కూడా నగరీకరణం బాగా చోటు చేసుకుని ప్రజల్లో నాగరికత పెనవేసుకుపోతోంది. సాహిత్య చరిత్రలో మార్గ, దేశి, అనే వ్యత్యాసం ఉంది. నన్నయాది ప్రాచీన కవుల్లో శిష్టులు, జానపదుల విషయంలో నిర్దిష్ట అభిప్రాయం ఉన్నట్లు మనం గమనించవచ్చు. అయితే ఈ అభిప్రాయం కేవలం సాహిత్యానికి సంబంధించినదే కానీ జనుల జీవన విధానానికి సంబంధించినది మాత్రం కాదనేది స్పష్టం. జానపద గీతం ఎప్పటికప్పుడు కొత్తదనంను కల్గి ఉంటుంది. ఇది సహజ ప్రవాహం వలె ప్రత్యేకమైన సృష్టి ఈ కొత్తదనమే జానపద - సాహిత్యాన్ని నగరీకరణ వైపు త్రిప్పుచున్నది.

జానపద సాహిత్యం శ్రమను దూరం చేయటానికి, కాలక్షేపానికి పుట్టిన లయాన్విత వాక్ప్రవాహం ఒకరి నుండి మరొకరికి సంక్రమించే దశలో అనేక కల్పనలు, చమత్కారాలు, మార్పు చేర్పులతో విలసిల్లుతున్నది. జానపదుల భావాలు, పర్వాలు, పండుగలు, సంస్కృతి, కష్టసుఖాలు అన్నీ జానపద సాహిత్యంలో ప్రతిబింబిస్తూనే ఉంటాయి. సూక్ష్మంగా చెప్పాలంటే జానపదుల జీవ సంస్కృతి మొత్తంను సాహిత్యం ప్రతిబింబిస్తుంది. అనవచ్చు.

నాటి సంఘ చరిత్రను, చారిత్రక విశేషాలను భాషా పరిణామాన్ని తనలో సునాయాసంగా ఇముడ్చుకున్న చైతన్య స్రవంతియే జానపద సరస్వతి. సంగీత సాహిత్యాలతో మేళవించిన "కవితా ప్రకృతి"యే జానపద సాహిత్య చమత్కృతి అనవచ్చు. "ఉవ్వెత్తున లేచే గోదావరీ తరంగిణిలా డెందంలో చిందులు తొక్కే నాట్యమయూరి జానపద సాహితీ కళామతల్లి" అని జి.యస్. మోహన్ గారి మాటలు అక్షర సత్యాలు.

ప్రతి ఒక్కరూ తమ పిల్లలను ఆంగ్లమాధ్యమంలో చదివించాలని వారు మమ్మి, డాడి అంటే మురిసి పోవాలనీ నా కొడుకు ఇంగిలీసులో మాట్లాడుతున్నాడని తల్లి దండ్రులు ఆనందించే యుగం ఇది. అంతేకాకుండా జానపదగేయాల్లో సైతం పట్టుచీర కట్టుకొని కిర్రు చెప్పులేసుకుని గట్టెంటా నీవెళు తుంటే.. అనే పాట ఆధునిక పద ప్రయోగాలతో మిళితమై సిల్కుచీర కోట్టుని, సిటిరైకతోడుక్కుని, రంగు రంగు సైండిల్లేసి వీదెంటా నువ్వు పోతుంటే --- పట్టు స్థానంలో సిల్కు చెప్పుల స్థానంలో సెండిల్లు నెలకొన్నాయి.

#### విలాస జీవితం - నగర వ్యామోహం:-

మమూలు ప్రజలు కూడా విలాస జీవితం కోసం తమ నిత్యావసరాల నిమిత్తం పట్నం వచ్చి అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలను శైలినీ అనుకరించే ప్రయత్నం చేస్తారు. అబ్బో వీరు నగరవాసులే, వీరు పట్నం వాసులే ఆనే ఆలోచన కలగటానికి గుర్తింపు పొందటానికి పల్లెలను వదలి పట్నంవైపు పరుగులు తీస్తున్నారు, ప్రజలు పట్నం పోతున్నారని అందరూ పట్నంవెళ్ళి తమ స్థితిగతుల మార్చుకుంటున్నారని, కానీ తన స్థితి మారటంలేదని బాధలో పాడే యువతి పాట

అత్తరు సాయెబ్బోరారా నా అందగాడా రారా
అందరి మొగుళ్ళు బొంబాయెల్లీ బంగ్లలుగడ్తుంటే
నా మొగుడు బొంబాయెల్లీ బూట్లను తుడిచాడే
అత్తరు అందరి మొగుళ్ళు పట్నంపోయి పట్టుచీర తెస్తుంటే
నా మొగుడు పట్నంవోయీ ప్యాకాటాడాడే -- అత్తరు

ఇలా పట్నం మోజులో జానపదం పట్నం పాలైపోతుంది.

చలన చిత్రాల్లో జానపద గేయాలు - నగరీకరణ పాటలు

మూలంలో ఉన్న పాటలను సినిమాల్లో ఏవిధంగా మార్పు చేసి పాడుతున్నారో కొన్ని పాటల ద్వారా మనం ఆ భేధాన్ని గమనించవచ్చు. అది భాష తీరుకానీ, వేషధారణ కానీ సంగీతం పదాలు, కొన్ని మాండలికాలు ఉపయోగించటం, ఉచ్ఛారణ, సన్నివేశ వివరణ ఇవన్నింటితో మనము తేడాను గమనించవచ్చు. అచ్చుల్లో హల్లుల్లో కుదింపు, పెంచటం హ్రస్వాలు, దీర్ఘాలు మొదలైనవన్ని గమనించవచ్చు.

కలవారి కోడలు కంచి మహాలక్ష్మి
కడుగుతున్నది పప్పు కడవలో పోసి
అప్పుడే వచ్చెను ఆమె పెద్దన్న
కాళ్ళకూ నీళ్ళిచ్చి కన్నీళ్ళు నింపె
ఎందుకీ కన్నీళ్ళు ఏలకన్నీరూ
చేరి మీ వారితో చెప్పి రావమ్మా...
భారతం చదివేటి ఓ పెద్ద బావగారూ
మా అన్నలొచ్చారు మము పంపుతారా?
నేనెరుగ నేనెరుగ మీ అత్త నడుగు
చావిటిలో కూర్చున్న ఓ అత్తగారూ
మా అన్నలొచ్చారు మము పంపుతారా?
నేనెరుగ నేనెరుగ మీ భర్త నడుగు
రచ్చలో కూర్చున్న రాజేంద్రభోగి
మీ అన్నలొచ్చారు మము పంపుతారా
తుడుచుకో కన్నీళ్ళు ముడుచుకోకురులు
ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము
పోయిరా సుఖముగా పుట్టినింటికిని.

గయాన్ని వివరణ పరిశీలిస్తే కొన్ని లోతైన విషయాలు గోచరిస్తాయి.

చెల్లెలిపై అన్న ఆదరం, ఉమ్మడి కుటుంబం, అత్తగారి అధికారం మామగారి అమాయకత్వం, భర్త రాజసం అన్నీ పాత్రలు తరువాత పాదంలో అన్న రాగానే కాళ్ళకు నీళ్ళివ్వటం, పెద్దల పట్ల భక్తి, ఆచారాన్ని గౌరవించే తీరును ఉమ్మడి కుటుంబంలో ఒదిగిపోవటం విశేషాలుగా కనిపిస్తాయి. ఈవిధంగా అత్తగారింట్లోని సంభాషణ పూర్వక మాటను పాటల రూపంలో వెలువడినవి. పై పాటకు నగరీకరణ పాట.

కలికి చిలకల కొలికి మాకు మేనత్త
కలవారికోడలు కనక మహాలక్ష్మి
అత్తామామల కొలుచు అందాల అతివ
మేనాలు తేలేని మేనకోడలిని
అడగవచ్చామిమ్ము అడకూతురుని
మా ఇంటి కంపించవయ్యా మామయ్యా...
పుష్పల్లో దారమై పూజలేచేసి
మా ఇంటి పాపను మన్నించి పంపూ
ఏడు జన్మల పంట మా అత్త చాలు
పుట్టుగానే పువ్వు పరిమళిస్తుంది
పుట్టింటికీ మనసు దారితీసుంది.
తెలుసుకో తెలుసుకో మనసున్నమామా
నయోధ్య నేలేటి సాకేత రామా!

అత్తింటి నుండి పుట్టింటికి మేనత్తను తీసుకొని వెళ్లడానికి అంద ఒప్పించేతీరు. నేటికి ఆచారంలో ఉన్న మేనాలు ఈ పాట కన్పిస్తుంది. మీ ఇంటికి వస్తూ లాంఛనాలు, సారెలు మేనా ఏరి తేకుండానే మా అత్త నడగటానికి వచ్చానంటూ అంద విషయం తెలియజేయటం అద్భుతమే. కాని ఇక్కడ మామ అనేదే జానపదుల ప్రయోగం.

పాలక దేవుళ్ళపై జానపదం:

ఒకటేమిటి తుమ్మెదల పాటలు, జాబిల్లి పాట జోల పాటలు, కన్నెల పాటలు, జాతరల పాటలు, ప్రతాల నోములు, పూజల పాటలు ఎన్నో ఎన్నో రూపాల సంతరించుకున్నాయి.

అలాగే విప్లవంలో కూడా నేనున్నానంటూ జానప కోడైగూసింది. నాంపల్లి దగ్గరలో శివాలయంలో దేవుడి చల్లగా చూడమని కోరుకుంటూ పాడే పాట.

నాంపల్లి టేషను కాడి రాజాలింగో రాజాలింగా
మమ్మాదుకోవయ్యా రాజాలింగా...

పై పాటలకు నగరీకరణ

నాంపల్లి టేషనుకాడి రాజాలింగో రాజాలింగా
రామరాజ్యం తీరుచూడు శివాశంభులింగా...
ముందు ముప్పులు - వెనుక తప్పులు
ఉన్నవారికీ అన్నీ చెల్లును

ఉలకాలేమీ పలకాలేమీ బండరాయిగ మారినసామీ!
తిందామంటే తిండీలేదూ, ఉందామంటే ఇల్లూ లేదు.
చేద్దామంటే కొలువూ లేదు పోదామంటే సెలవులేదు...

ఈ పాటలో జానపదులు ప్రయోగించే టేపను అనే పదం లింగా అనే పదం నగరీరణలో కూడా అదేవిధంగా చేర్చుకుని సంగీతం మార్చి విప్లవగీతంగా రాసినపాట. అప్పుడు పాట దేవుడిని చల్లగా చూడమంటూ సాగితే ఇప్పుడు పాలక దేవ్ళ పనితీరును విమర్శిస్తూ సాగిన పాట ఇది. ఈ పాట సామాజిక చైతన్యం కాంక్షించే దృక్పథం కన్పిస్తుంది.

ఈ జానపద గేయాలను పలువురు పలువిధాలుగా విభజించి నప్పటికీ ప్రధానంగా ఇవి 2 రకాలు.

1. కథా రహిత గేయాలు
2. కథా సహిత గేయాలు. ఈ రెండు గేయాలన్నింటిలో రానురానూ నాగరిక ప్రభావం ఎక్కువ అవుతుంది.

సనాతన గేయాల శైలిలో ఉన్నప్పటికీ, పద ప్రయోగాలలో, ఆవృత్తిలో, అంశాల్లో వస్తున్న నాగరిక ధోరణియే నగరీకరణకు గురవుతుందని చెప్పవచ్చు.

జానపద గేయాలకు పరిమితి లేదు. ఆ పాటల నిండా అన్యయత్వమే దాగి ఉంటుంది. శ్రామిక గేయాలు ప్రజల మనోస్థితిని తెల్పుతాయి. సమకాలీన సంఘటనల ప్రభావం వీటిపై ఉంటుంది. తద్వారా నాగరిక జీవనం ఆ పాటల్లో ప్రతిబింబిస్తుంది. వస్తువులో శిల్పంలో, శైలిలో, నాగరిక జీవన సంస్కృతికి సమీపంగా మారుతున్నాయి. పారమార్థిక గేయాలు శ్రామిక గేయాలు జోలపాటలు, కౌటుంబిక గేయాలు, పిల్లల పాటలు పెండ్లి, సరసపు పాటలు ఒకటేమిటి అన్నీ అద్భుతమైన గేయాలే ఇవన్నీ సాహిత్య చరిత్రలో మణిపూసలుగా మిగిలిపోయాయి.

## పిల్లల పాటలపై పాశ్చాత్య ప్రభావం:-

ఆధునిక కాలంలో పిల్లలకు తెలుగు పాటల పట్ల కనీస అవగాహన లేకుండా పోతుంది. దీనికి పెద్దలే కారణం నిరంతరం టివిలయందు కూర్చుంటూ అవే చూస్తూ శారీరకంగా ఎటువంటి శ్రమలేకుండా కేవలం బుద్ధికి మాత్రమే పదును ఏర్పర్చుకుని సృజనాత్మకతను కోల్పోతున్నాము.

ఆంగ్ల మాధ్యమ రాకతో

"ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్..."
"జానీ జానీ ఎస్‌పాప ..."
"బాబా బ్లాక్ షీప్ ... వంటి ఆంగ్ల గేయాలే పిల్లలు పాడుకునేందుకు నోచుకుంటున్నాయి. పాత పాటలైన కాళ్ళాగజ్జా కంకాళమ్మ -- వేగూచుక్కావెలగాపండు అనే అందమైన గేయాలు కనుమరుగైపోయాయి. ఒకవేళ ఎవరైనా వాటిని పాడితే వింతగా చూడటం అలవాటైపోయింది. ఇటువంటి ఆంగ్ల పాటల ద్వారా భాష అలవడటానికి ద్యోతకమవుతుంది. తద్వారా మాతృభాషలోని మాధుర్యం, శైలి, సొగసులు, పరిపూర్ణంగా వారు పొందలేకపోతున్నారు.

## ఉపసంహారం:-

తరతరాలుగా మానవుని ఆస్తిగా సంక్రమించిన జానపద సాహిత్యం మానవుని నాగరిక మోజుతో సరికొత్త మార్పులను సంతరించుకుంటుంది. సాహిత్యం పాతదే అయినా అభివ్యక్తీకరణలో నవ్యత్వాన్ని సృజించుకుని జానపద సాహిత్యం శిష్టత్వాన్ని పొందింది అందుకు పల్లెల్లో విస్తరిస్తున్న పారిశ్రామిక విప్లవం ప్రసార మాధ్యమాలు ప్రపంచీకరణ అన్యదేశాల పట్ల ఆకర్షణ మొదలైన అంశాలు కారణ భూతమవుతున్నాయి తద్వారా జానపద సాహిత్యంలో నాగరికత ప్రతిబింబిస్తుంది. గతంలో తమకు అలసట పోగొట్టుకోవటానికి మాత్రమే పాడుకునే జానపద గాయకుడు నేడు ఏ కొత్త బాణీ తనకు వినిపించినా దానిని అనుకరించే ప్రయత్నం చేస్తున్నాడు. నరికొత్త వన్నువుతో వెలువడే సాహిత్యం వట్ల ఆకర్షితుడౌతున్నాడు. అంటే క్రమేణ నాగరిక జీవనానికి దగ్గర పడుతున్నాడు.

తెలుగు అధ్యాపకులు
**ఆర్. సత్యంరెడ్డి**
యస్.యమ్.స్కూల్
పటమట, విజయవాడ.
E-mail: satyamreddy3011@gmail.com

# ఆధునిక సాహిత్యంలో సామాజిక పరివర్తన - తెలుగు నవలలు (1980-90)

- డా: చింతనూరి కృష్ణ...
పోస్ట్ డాక్టోరల్ ఫెల్లో, (P...
తెలుగు వి...
కాకతీయ యూనివర్సిటీ - వరం...
ఇ-మెయిల్ : chkrishnamurthy2015@gmail.c...
సెల్ : 97050310...

ఆధునిక ప్రక్రియల్లో జీవితాన్ని విస్తారంగా చిత్రించడానికి నవలయే సరియైన ప్రక్రియ. ఇది జీవితమంత విశాల పరిధి కలిగింది. ఆనందాలు-విషాదాలు, వివాహం-విడాకులు, యుద్ధం-శాంతి, సంస్కరణ, సాంఘిక చిత్రణ, తిరుగుబాట్లు, విప్లవాలు, ఉద్యమాల చిత్రణకు అనువైన వాహిక నవల, సాంఘిక జీవితివృత్తంతో ప్రారంభమైన తెలుగు నవల అనేక ఇతివృత్తాలతో పరిఢవిల్లింది. తెలుగు వారి జీవితంపై ప్రభావాన్ని చూపిన ప్రతి సంఘటనను నవల వస్తువుగా తీసుకుని భవిష్యత్ తరాలకు సామాజిక చరిత్రను అందిస్తుంది. ఈ క్రమంలో 1980-90 మధ్య కాలంలో చెప్పుకోదగిన పరిణామాలు చోటు చేసుకున్నాయి. చిరకాలంగా పరిపాలిస్తున్న రాజకీయ పార్టీ తన ప్రాభవాన్ని కోల్పోయి, అప్పుడే స్థాపించబడిన రాజకేయ పార్టీ అధికారంలోకి రావడం, ప్రజాసంక్షేమ కార్యక్రమాలు ప్రవేశ పెడుతూ, ప్రజలకు సన్నిహితంగా మెలుగుతూనే, వారిపై నిర్బంధాన్ని పెంచడం ఒక విధమైన విచిత్రమైన పరిస్థితి ఈ కాలంలో కన్పిస్తుంది. విప్లవోద్యమ కాలంలో గ్రామాలు భూస్వామ్య వ్యవస్థ, భూముల ఆక్రమణ , తిరుగుబాటు, సాంఘిక దాస్యం, ఆగ్రహం, ఆవేశం, సైద్ధాంతిక పునాదుల్లో మా... ప్రజాస్వామ్యంపై విశ్వాసం సన్నగిల్లడం, నిత్య నిర్బ... మధ్య ప్రజాస్వామ్యనికి సరియైనదనే పూర్వ భావ... తలకెత్తుకోవడం కన్పిస్తుంది. దేశంలో కొత్తగా ... సంస్కరణలు ప్రవేశపెట్టడం, లిబరలిజైష... గ్లోబలైజేషన్, ప్రవేటైజేషన్, లాంటి సరి... వాతావరణం భారతీయ మార్కెట్ ను ఆవరి... సామాజిక వ్యవస్థపై చెరగని ముద్ర వేయ... కన్పిస్తుంది.

ఆంధ్ర దేశంలో మారుమూల పల్లెల్లో... పట్టాణాల్లోకి వస్తుజాలం చొచ్చుకుపోయి గ్రామా... కొత్త పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. తద్వా... గ్రామాల్లో కుతర్కం మొదలై వికాసానికి అడు... నిలుస్తున్నాయి. విద్యావిధానాల్లో మార్పు, మాన... సంబంధాల్లో వ్యాపారాత్మక ధోరణి, కుటుంబాల్లో... వైయుక్తిక ధోరణి, సంఘంలో సామజిక ఆలోచన శ... నశించడం కన్పిస్తోంది. స్త్రీలు, దళితులు, దళి... బహుజనులు, క్రింది, మధ్యతరగతి ప్రజల్లో నిరాయు... శక్తి కోల్పోవడం, అవసరాలు ఏవో, విలాసాలు ఏవో తేల్చుకోలేని విచిత్ర పరిస్థితుల్లో ఇరుక్కోవడం

కన్పిస్తుంది. పెట్టుబడులు, నకిలీ మందులు, విత్తనాలు, అప్పులు వర్షాభావం వంటి తదితర సమస్యలతో సమస్యలతో సతమతవ్వడం కన్పిస్తుంది.

తద్వారా అన్నదాతల ఆత్మహత్యలు కన్పిస్తాయి. చేతి వృత్తుల వారి దయనీయ పరిస్థితి వారి కుటుంబంలో రెండో తరంవారిని వృత్తిలోకి రాకుండా జాగ్రత్త పడడం, విద్యపైన దృష్టి పెట్టడం కన్పిస్తుంది. కొన్నిసార్లు చేనేత వృత్తి వారి ఆత్మహత్యలు ఈ కాలపు నవలల్లో కన్పిస్తాయి. ప్రజల్లో మూఢవిశ్వాసాలు పొడనూపడం లాంటి పరిస్తుతులు కన్పిస్తాయి. విద్యనభ్యసించడం, చరిత్రను స్మరించుకుని స్ఫూర్తి పొందడం, కార్మిక జీవనంలోని విషాదాన్ని గుర్తెరగడం, స్త్రీల సామాజిక స్థితిలోని మార్పులు, ఆర్థిక స్థితిగతులు ఈ కాలం రచనల్లో చూడవచ్చు. మానసిక సంఘర్షణ, వేగంగా మారుతున్న పరిస్థితులు, విలక్షణమైన రాజకీయ స్థితిగతుల చిత్రణ, కారంచేడు, తిమ్మ సముద్రం లాంటి దురెటనలు, దళితులపై జరుగుతున్న హత్యాచారాలు తెల్పుతున్నాయి. ఒకే వర్గానికున్న రాజకీయ ప్రాబల్యం రాబోయేకాలంలో దళితులపై విరుత స్వరూపాలు ప్రదర్శించబోయ పరిస్థితులు కన్పిస్తాయి.

ఈ నవలల్లో గల సామాజిక పరివర్తనతో సామాజిక చరిత్ర నిర్మాణం, ఆర్థిక, రాజకీయ, జీవిత పరిణామాలు ప్రజాజీవితంపై ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలు ఎలా ఉంటాయో తెలుస్తుంది. సామాజిక పరివర్తన సామాజిక చరిత్రకు దోహదపడేలా ఉండాలి.

ఈ నవలల్లో వస్తు, శిల్పవైవిధ్యం, సామజిక పరిణామాలు ఇందులో చిత్రించబడ్డాయి. కుటుంబ జీవిత చిత్రణ, ఉద్యమాల చిత్రణ, ఉమ్మడి కుటుంబాలు శిథిలమవుతూ వైయుక్తిక కుటుంబాలుగా మారుతున్న క్రమం, ఆధునిక విద్య, ఉద్యోగాలు అందకుంటూ ఎదిగే క్రమంలో ఎదుర్కొటున్న కషాలు, నమస్యలు, మధ్యతరగతిగా స్థిరపడుతున్న తీరు చిత్రించబడ్డాయి. ఈ నవలల్లో సామాజిక విలువలు, సంస్కృతి, జీవన విధానాన్ని చిత్రించి రచయితలు తమ తమ ప్రత్యేకతను చాటుకున్నారు.

విప్లవోద్యమ చిత్రణతోనే కాకుండా, తెలంగాణ సమాజ చిత్రణతో అనేక నవలను వెలువడ్డాయి. దాశరథి రంగాచార్య ఉద్యమ నవలలు, నవీన్, బోయ జంగయ్య, సరిపల్లి కృష్ణారెడ్డి, చెరబండ రాజు, జ్వాలా ముఖి, మొదలైన వారి నవలను వచ్చాయి.

1980 తరువాత బతుకుపోరు (1982), బి.ఎస్. రాములు, కొమరం భీమ్, సాహు, అల్లం రాజయ్య, బోయ జంగయ్య- జాతర (1985), ఊరు (1981), అగ్నికణం (1982), వసంత గీతం(1986), అల్లం రాజయ్య-అడవి(1988), వసంత రావ్ దేశ్ పాండే - "అతడు అడవిని జయించాడు' (1988), కేశవ రావు -"వెలుగు రేఖలు'(1985), సుద్దల అశోక్ తేజ 'ఉమెన్స్ కాలేజీ (1990), అంపశయ్య నవీన్ 'వంశధార' నవలలు, బలివాడ కాంతారావు - "శ్రీపదార్చన, కేశవరావు గార్ల నవలల్లో సామాజిక పరివర్తను అక్షర బద్ధం చేశారు.



# రాయలసీమ వచన కవిత్వం - సామాజిక పరివర్తన

జి. నాగేష
పరిశోధక విద్యార్థి, తెలుగు
హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయ
సెల్.నం. 97030 93
Email : gknagababu786@gmail.co

సాహిత్యం సామాజిక జీవితానికి ప్రతిబింబం. సమాజానికి సాహిత్యానికి మధ్య అవినాభావ సంబంధం ఉంది. సమాజంలో మార్పులు వచ్చినప్పుడల్లా సాహిత్యంలో మార్పులు వస్తాయి. సమాజానికి సాహిత్యం ప్రతినిధి వంటిది. ఒక కాలంలో ఉండే సామాజిక వ్యవస్థను ఆ కాలంలో వచ్చే సాహిత్యం ప్రతిబింబిస్తుంది. సమాజంలో జరిగే విభిన్న సంఘటనలను, మార్పులను గమనిస్తూ కవులు, రచయితలు ప్రతిస్పందిస్తారు. కవులు, రచయితలు తమ రచనల ద్వారా సమాజాన్ని చైతన్యపరుస్తూ సమాజాన్ని మేల్కొల్పుతారు. సాహిత్యం ప్రజల ఆలోచనలను బహిర్గతం చేస్తూ ప్రజలను ఉద్యమబాట పట్టిస్తుంది.

తెలుగు కవిత్వం - సామాజికత

తెలుగు సాహిత్యంలో ఆధునిక కవిత్వానికి విశిష్టమైన ప్రాధాన్యత ఉంది. సమాజంలో సంభవించే ఏ మార్పు అయినా, సాహిత్యంలో వచ్చే ఏ వాదమైనా, ధోరణి అయినా ముందుగా కవిత్వంలో ప్రతిఫలిస్తుంది. సాహిత్యంలో మిగతా ప్రక్రియల కన్నా కవిత్వం శక్తిమంతమైన పాత్ర పోషిస్తుంది. కవులు, రచయితలు తాము నివసిస్తున్న సామాజిక వాతావరణంలో తమ చుట్టూ జరుగుతున్న సంఘటనలపట్ల, విషయాల పట్ల సామాజిక స్పృహను కలిగి ఉంటూ తమ రచనల్ని సమాజానికి అందిస్తారు. తెలుగు సాహిత్యంలో నాటి నుండి నేటి వరకు ఎన్నో విభిన్నమైన సామాజికాంశాలు చోటు చేసుకున్నాయి. "సమాజాన్ని గురించి చెప్పడమే సామాజికత. ప్రతి వ్యక్తీ ఎప్పుడూ, తనలో తాను జీవిస్తూ, సమాజంతో సన్నికర్ష పొందుతూ ఉంటాడు. వ్యక్తి సమాజాన్ని ప్రభావితం చేస్తాడు. సమాజం వ్యక్తికి కావలసిన విధంగా తయారు చేస్తుంది."[1] అందువల్ల సమాజం ఎప్పుడూ నిత్యం పరిణామశీలంగా ఉంటుంది. సామాజికతలోని అంశాలు కూడా నిరంతరం మార్పుకు లోనవుతూ సాహిత్యాన్ని ప్రభావితం చేస్తాయి.

రాయలసీమ వచన కవిత్వం - సామాజిక పరివర్తన

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి దక్షిణాన ఉన్న రాయలసీమ ప్రాంతానికి విశిష్టమైన సాహిత్య చరిత్ర, సంస్కృతులు ఉన్నాయి. పూర్వం 'దత్తమండలాలు'గా పిలువబడిన ఈ ప్రాంతం 1928 నాటికి 'రాయలసీమ'గా పేరు పొందింది. ప్రాచీన సాహిత్యం నుంచి నేటి ఆధునిక సాహిత్యం వరకు ఈ ప్రాంతం అనేక మంది కవులకు, రచయితలకు నిలయంగా ఉం చారిత్రకంగా ఈ ప్రాంతం పేరు ప్రఖ్యాతులు పొందినప్ప భౌగోళికంగా రాయలసీమ కరువు ప్రాంతంగా గుర్తిం పొందింది. ఈ ప్రాంతంలో తరచుగా కరువు సంభవించడంతో విభిన్న సామాజికాంశాలు కనిపిస్తా రాజకీయంగాను, ఆర్థికంగానూ, సామాజిక, సాంస్కృ రంగాలలో ఈ ప్రాంతం అభివృద్ధి చెందవలసి ఉంది.

తెలుగు సాహిత్యానికి ఈ రాయలసీమ తన పాత్రను పోషించింది. ప్రబంధాలు, శతకాలు, ఖండ, గే ఆధ్యాత్మిక కావ్యాలు, అవధాన కవిత్వం, కథ, నవల, నాటక విమర్శ, జానపదం లాంటి ప్రక్రియలెన్నో వెలసిల్లా 1970-80 దశకాల మధ్య వచన కవిత్వం కూడా విస్తృతం వెలువడుతోంది. రాయలసీమలోని విభిన్న సామాజికాంశాలను ప్రస్తావించాల్సిన ఆవశ్యకత ఉం కరువు, ఆకలీ, పేదరికమూ, కరువు వల్ల ఎండిపో పొలాలు, చెరువులు, రైతుల ఆత్మహత్యలు, ప్రజల వలస ఫ్యాక్షన్ హత్యలు, ముఠాలు, వర్గాల దోపిడీలు, ప్రపంచీక ప్రభావం, రాజకీయ నాయకులు, ప్రభుత్వ సేవల వైఫల్యా చేనేత కార్మికుల అవస్థలు, ఇంకిపోతున్న బోర్లు, బావు దళిత, స్త్రీ సమస్యలు లాంటి ఎన్నో అంశాలు ఈ ప్రాంతం కనబడతాయి.

రాయలసీమ కవులు ఈ ప్రాంతంలోని సమస్య మీద కవిత్వం రాస్తూ అక్షరయుద్ధం చేస్తున్నారు. ఈ ప్రాం కవులు కవిత్వం రాసినా, కథ, నవల, నాటకం రాసి ప్రధానంగా కరువుకు సంబంధించిన సమస్యల ప్రస్తావిస్తుంటారు. రాయలసీమ ప్రాంతంలోని ప్రజలను కరువు ఎలా చిన్నాభిన్నం చేస్తుందో గమనించవచ్చు.

వేంపల్లి అబ్దుల్ ఖాదర్ 'ఎన్ని వానాదులొచ్చినా' అ కవితలో ఇలా అంటున్నాడు-

"సెనిక్కాయ్ సేద్దిం చేస్తి
మోటబాయిలో నీళ్ళున్నా
ఈ అడపాదడపా కరెంటుతో సొగం ఎండిపాయ
సొగంలో సొగం అగ్గి తెగులు నాకేస్తే
మిగిలిందేమో ఎలకల పాలైపాయ
ఉన్నోన్నీ లేనోన్నీ ఒకటి చెయ్యాలని

సట్టమొగటి పెట్రి
ఆ లెక్కన సీలింగులో బూమొచ్చ
సదునూ సదునూ చేస్తి
ఆరిద్దల కారితి అదునులో ఇత్తన మేసినా
ఆ సట్టు సవిట్నేల్లో ఏసిన గింజ
ఒగటైనా మొలకెత్తలా!
కొండ న్యాలిక్కి మొందేస్తే
ఉండే న్యాలికే ఊడిపాయ!
అడ్డంగా పణుకుంటి అడ్డమైనోడి కాళ్ళూ పడితి
సివర్కి సబ్సిడి మింద లోనచ్చ
'త్యేనె దీసెటోడు సెయ్యి నాకడా' అంట్రి
యాడ బొయ్యేది ఆడ కారిపోగా
పారుడు రోగంతో గోవు మాలచ్చి ఇంటికొచ్చ
ఒచ్చిన్రోజు తిరక్కనే కట్టుగుంజకు పగ్గం మిగల"[2]
కవి సీమ మాండలికంలో వ్యక్తపరిచిన కవిత ఇది. వేరుశెనగ పండించే రైతు జీవనవ్యథను, ప్రభుత్వ పథకాల వల్ల లబ్ది పొంది నష్టపోయిన ఒక రైతు ఆవేదనను యాసలో చిత్రించిన దృశ్యం కనపడుతుంది.
గోపిని కరుణాకర్ 'పొద్దున్నే వచ్చిన వాన' కవితలో చెబుతూ–
"సేద్దం జూదమై పోయిందిరా
మీ అమ్మ మెడలోని తాళిబొట్టు
పసుపు కొమ్మయింది
నీ చెల్లెలి చెవుల్లోని కమ్మలు జొన్నబెండులైనాయి
నీ తమ్ముడు బడి మాని
బట్టీలో కాలే ఇటికైపాయ
నువ్వేమో హోటల్లో ఎంగిలి కంచమైపోతివి
దేశానికి పట్టెడన్నం పెట్టిన మీ తాత
తుంటబీడీలు అడుక్కుంటా
బస్టాండులో బిచ్చగాడైపాయ
అన్నింటిని ఒడ్డి
నేను జూదంలో ఓడిన ధర్మరాజునై పోతిని"[3]
వ్యవసాయం చేసే రైతు కుటుంబ విషాద గాథ మనకు కనిపిస్తుంది. పంటలు పండించే సీమ రైతు ఆ పంటలు పండక, అప్పులు ఎక్కువై, తమకు ఉపాధి, తిండి లేక అప్పుల్లో కూరుకుపోయి కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమైన దృశ్యం కవి చిత్రించాడు. సీమలో ఇలాంటి కష్టాలను రైతులెందరో అనుభవిస్తున్నారు.
జూపల్లి ప్రేంచంద్ 'కాయ్యకాళ్ళు చిగిర్చేదాకా' కవితలో ఇలా అంటున్నాడు.
"నిజమే
మేము అపరిశుభ్రులం
మీ మురికి మూటలు మోసీ మోసీ గాడిదలమయ్యాం
మురికి వీధులు వాడలు ఊడ్చీ ఊడ్చీ చండాలురమయ్యాం
మీ సకల కశ్మలాన్నీ శుభ్రం చేసీ చేసీ అంటరానితనాన్ని నీటికుండగా మోస్తున్నాం
మా చమట చుక్కలతో తడచిన మీ పొలాలు పుష్పించి ఫలించాయే!
మీ పాదసేవకై మా చర్మాలను ఒలిచి మీ పాదాలను అలంకరించామే"[4]
అంటూ దళితుల జీవనం, వారి కులసమస్యను చిత్రించాడు. ఈ సమాజంలో దళితులను అంటరాని జాతులుగా వెలివేసి, వారిని బానిసలుగా చూసి, వారిచేత వెట్టిచాకిరి చేయించుకున్న అగ్రకుల విష సంస్కృతిని కవి ప్రశ్నిస్తున్నాడు.
టి.రాజారాం 'అతడే' దీర్ఘ కావ్యంలో గ్రామీణ ప్రాంతాల్లో కులవృత్తులతో జీవనోపాధిని పొందేవారి జీవిత గాథల్ని చిత్రించారు.
"మన పాదాలకు అద్భుత అందాల్ని
ఆవిష్కరించే అతడి స్వీయ ప్రతిభ
ప్రపంచీకరణ సమ్మెట దెబ్బకు
వొంగి పోయిన మేకు అయ్యింది
ఆధునికా పాదుకా ప్రపంచంలో
అతడికి అతడే వొక మూలనపడ్డ పనిముట్టు"[5]
ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, ప్రపంచీకరణ ప్రభావం వల్ల పల్లె నుంచి పట్నాల దాకా ఫుట్‌వేర్ షాపులు వచ్చి, చెప్పులు కుట్టేవారు తమ ఉపాధిని కోల్పోవలసి వచ్చిందని కవి చిత్రణ.
జూపల్లి ప్రేంచంద్ 'కడాకు' అనే కవితలో ఈ విధంగా చెబుతున్నాడు–
"తీగ చెనిక్కాయ అనిరి
ఏస్తిమి
గుత్తి చెనిక్కాయ అనిరి
ఏస్తిమి
తినేకి తిండిగింజలే కరువాయ
సజ్జలు యాటికి బోయనో
కొర్రలు, సాములు, జొన్నలు యాటికి బాయనో
రాగి సంగటి కతే మర్సిపోతిమి"[6]
ఈనాడు చాలా గ్రామాల్లో చిరుధాన్యాలను పండించే వారు కరువై పోయారు. పూర్వం మనం చిన్నప్పుడు జొన్న, సజ్జ రొట్టెలు, రాగిముద్దలు, కొర్ర అన్నం తినేవాళ్ళం. ఇప్పుడు వీటిని తినేవారు ఎవరు? కవి సమాజం ఎలా పరిణామం చెంది మనుషులు తినే ఆహారం ఏవిధంగా మరచిపోతున్నారో చిత్రించాడు.
వేంపల్లి అబ్దుల్ ఖాదర్ 'గోడలు లేవు ఈ జైలుకు' అనే కవితలో–
"కులాల కుళ్ళూ చిచ్చుల రొచ్చు
కారుణ్యం లేని
కక్షలూ కనికరం లేని శిక్షలు

కాలువల వెంబడి కేరింతలు ప్రవాహమై
పెరిగిన పచ్చని పైర్లను చేసెను"[11]
అంటూ కవి సీమలో కపిల తోలే విధానాన్ని సహజంగా స్వభావోక్తికంగా వర్ణించాడు. కపిలను తోలేటప్పుడు ఆ శ్రమ కనపడకుండా కపిల పాటలు పాడటం, కపిలను స్త్రీ సౌందర్యంతో పోలుస్తూ, సీమ జీవన సంస్కృతిలో భాగమైన కపిలను వర్ణించిన దృశ్యం ఇది.

రాధేయ 'సౌందర్య రాహిత్యం' కవితలో ఇలా చెబుతున్నాడు–
"నేనెక్కడికి వచ్చాను
నేనెక్కడున్నాను
ఒంటెద్దుల బండి లోంచి
నగరం నాగరికతలోకి దొర్లిపోయాక
నేను నా ఊరికే పరదేశినయ్యానా?
నా ఊరే నాకు పరాయిదై పోయిందా?
ఇప్పటికీ!
నా శ్వాస నా పల్లెది
నా ప్రాణం మాత్రం పట్నంది"[12]
అంటూ కవి నేటి సమాజంలో మనుషులు గ్రామాలను వదిలి పట్టణాలకు వలస పోయినవారిని గూర్చి చెప్పిన కవిత ఇది. బ్రతుకు తెరువు కోసం పల్లెలను వదిలి పట్టణాలకు రావడం వల్ల పల్లెలు తమ సంస్కృతినీ, కళలు, అందాలను కోల్పోతున్నాయి.
కెంగార మోహన్ 'రోలు... రోకలి... రోబో....'
అనే కవితలో చెప్తూ–
"షడ్రుచులనిచ్చే రోలు
పాతాళంలో ఇల్లు కట్టుకున్నది
రుబ్బిన కొద్దీ రుచీ
మాయా మిక్సీ
ఎన్ని చేసినా, ఎంత తిప్పినా
రవ్వంత సంతృప్తి లేదిపుడు
దంపుడు బియ్యం బువ్వ
జొన్న సంగటి దెబ్బ
కొఱ్ఱగంజి
అనుభూతుల అనుమస్తిష్కంలోంచి
నిష్క్రమించలేదు.
అన్నమైనా, పప్పూ పచ్చడైనా
రోబో చేసే రోజొచ్చింది
ఆయువు క్షీణిస్తేనేం
ఆకలి తీరితే చాలు"[13]
ఆధునిక పరిజ్ఞానం పెరగడం వల్ల మనిషి కూడా యంత్రమవుతున్నాడు. మిక్సీలు, గ్రైండర్స్, కుక్కర్స్ లాంటి పరికరాలు రావడంవల్ల రోలు, రోకళ్ళు లాంటి పాత సామగ్రిని మూలన పడవేసే పరిస్థితి వచ్చింది. 'కంచంలోని బువ్వ' కవితలో–
"పొలంగట్ల సింగారం
అదృశ్యమైంది
అమ్మలక్కల పనిపాటలు
పాడె గట్టాయి
పల్లె పనుల్ని యంత్రాలు
మింగేశాయి.
కలుపు తీయడం
కోత కోయడం
కుప్పనూర్చడం యంత్రమే"[14]
అధునాతన యంత్రాలు రావడం వల్ల పల్లెల్లో కూలీలకు పని లేకుండా పోయింది. వ్యవసాయ పనిలో ప్రతి పనిని యంత్రమే చేసే పరిస్థితి వచ్చింది.
టి. హెచ్. నటరాజన్ 'పాడైపోయిన గూడు' కవితలో తన ఊరి జ్ఞాపకాలను ఇలా చెబుతున్నాడు–
"సంగటిముద్దా చింతచిగురు వాసన కొట్టే
మా వూరి పొలిమేర్రాయి
చిన్నప్పటి నా జ్ఞాపకాల కలికితురాయి
మిట్ట మద్దేన్నం కాడ ఆవుల గంగప్ప
సద్ది 'చిక్కం' విప్పేదక్కడే
'మావిటింతల' కాడ గుట్టదిగే ఆవు గిట్టలకు
పాలపిట్టలు నేపథ్య స్వరాలు కూర్చేదక్కడే
కనుచూపు మేర కాలి నడకన
ఇస్కూలు కెల్లబారే చెప్పుల్లేని కాళ్ళు
'ముగ్రాళ్ల దొంతి'కి చూపుల్నంటే కళ్ల వాడిసెళ్ళు
చేతుల్లోని పుస్తకాలకు
చెమటంట కూడదని ప్రయాసలు
మా ఊరి జ్ఞాపకాలు
బాల్యం తేనెపట్టు నుండి రాలే తేనెబొట్లు"[15]
అంటూ కవి తన ఊరు, చిన్ననాటి జ్ఞాపకాలు, తన ఊరి అందాలు ఇలా ప్రతిఒక్క అంశాన్ని సహజ సుందరంగా కవిత్వీకరించాడు.
బద్వేలి రమేష్ 'కాకిరెక్కంత కరిమబ్బు కోసం' కవితలో–
"నోరాడించే మేత లేక
మాంసంగా మారే మూగజీవులు
మట్టిలో మెలకువ లేక
తూక మౌతున్న పంట విత్తనాలు
పల్లెలో బతుకు దారిలేక
వలసలైన నేలని నమ్మిన వాళ్ళు
జవాబు దొరకని కరువు ఊరేగింపులో
భాగమైన రైతు జనాలు
ఎడారి పల్లెకి ఎప్పటిలా

మారని కరువు దృశ్యాలు[16]
అంటూ సీమలో ప్రజానీకాన్ని, వ్యవసాయాన్ని కరువు ఎలా నాశనం చేస్తుందో కవి చిత్రించాడు. రైతులు, పశువులు, పల్లెటూళ్ళు, పొలాలు, తోటలు ఇలా అన్నీ కరువుబారిన పడవలసిందే.

యక్కలూరి శ్రీరాములు 'మూడు ఎడారులు ఏడు సముద్రాలు ఒకే ఒక్క అనంతపురం' కవితలో ఇలా అంటున్నాడు-

"ఎన్ని ఎడారులైనా ఏడు సముద్రాలైనా
ఒకే ఒక్క అనంతపురాన్ని చూసి సిగ్గుతో చిన్నబోతు
తలదించుకుంటాయ్.
ఆకాశంలో నీటిచుక్క కూడ వుండదు
పాతాళంలో కూడ తేమ ఆచూకీ దొరకదు
ఇక్కడ నీటి బిందువే అన్ని సమస్యల సింధువుల
మూలకారణ కేంద్రబిందువు[17]

అంటూ సీమలో అనంతపురం జిల్లా ప్రతి ఏటా కరువుకు గురౌతున్న విషయాన్ని చిత్రించాడు. జిల్లాలో వ్యవసాయ రంగానికి, తాగునీటికి కాలువల ద్వారా నీటి సదుపాయాన్ని కల్పించాల్సిన ప్రభుత్వాలు ఘోరంగా విఫలమౌతున్నాయి. రాజకీయ నాయకులు, ప్రభుత్వాలు అన్నీ కలిసి జిల్లా రైతాంగాన్ని అప్పుల ఊబిలోకి నెట్టి వేస్తున్నాయి.

రాయలసీమ కవిత్వంలో కవులు విభిన్న సామాజిక, సాంస్కృతిక అంశాలను కవితా వస్తువులుగా స్వీకరించి రాయలసీమ ప్రజల గుండె చప్పుళ్ళను కవిత్వీకరించి అక్షరబద్ధం చేశారు. తరతరాలుగా ప్రకృతి వైపరీత్యాలతో పోరాటం చేస్తూ, తమ ఆత్మాభిమానాన్ని ఈ సీమ రైతులు నిలుపుకుంటున్నారు. కవులు, రచయితలు, మేధావులు, విమర్శకులు తమకు రావలసిన హక్కులు, నీటి వాటాలను, సీమ మౌలిక వసతుల గురించి ఉద్యమాలు, చర్చలు, సమావేశాలు నిర్వహిస్తూ ఈ సమీ ప్రజానీకాన్ని చైతన్యవంతం చేస్తున్నారు. రాజకీయ నాయకులు, అధికార పార్టీలు సీమ కోసం చేయవలసిన కృషి, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో వారు తీసుకురావలసిన సామాజిక పరివర్తనను కవులు, రచయితలు ఆశిస్తున్నారు.

పాదసూచికలు

(1) ఆధునిక కవిత్వంలో సామాజికత, మోనోగ్రాఫ్, పుట 14
(2) కిరణం, కవితాసంపుటి, పుటలు 42, 43
(3) సీమ కవిత, కవితా సంపుటి, పుటలు 50, 51
(4) అవేద, కవిత్వం, పుట 101
(5) అతడే, పుట 36
(6) నిచ్చెనమెట్ల లోలకం, కవిత్వం, పుట 57
(7) కిరణం, కవిత్వం, పుట 47
(8) కామాలే, కవిత్వం, పుటలు 44, 45
(9) సముద్రమంత గాయం, కవిత్వం, పుట 131
(10)హంద్రీగానం, కవిత్వం, పుటలు 35, 36
(11)లోగొంతుక, కవిత్వం, పుటలు 17, 18
(12)అవిశ్రాంతం, కవిత్వం, పుటలు 32, 33
(13)విన్యాసం, కవిత్వం, పుట 93
(14)పైదే, పుట 27
(15)అనంత కవితా సంకలనం 79, 80
(16)పైదే, పుటలు 44, 45
(17)పైదే, పుటలు 76, 77

ఆధార గ్రంథాలు

(1) రామమోహనరావు, అద్దేపల్లి. ఆధునిక కవిత్వంలో సామాజికత (మోనోగ్రాఫ్), హైదరాబాదు : తెలుగు అకాడమి, 2012.
(2) అబ్దుల్ ఖాదర్, పేంపల్లి. కిరణం (కవితా సంపుటి), హైదరాబాద్ : జయంతి పబ్లికేషన్స్, 2014.
(3) మిత్రజ్యోతి, సీమ కవిత (కవితా సంకలనం), ప్రొద్దుటూరు : మిత్రజ్యోతి ప్రచురణలు, 2001.
(4) ప్రేంచంద్, జూపల్లి. అవేద (కవిత్వం), అనంతపురం : వాయిస్ దళిత అధ్యయన వేదిక, 1999.
(5) ప్రేంచంద్, జూపల్లి. (సం.పా), అనంత కవిత (కవితా సంకలనం), అనంతపురం : జిల్లా సాంస్కృతిక మండలి ప్రచురణ, 2012.
(6) ప్రేంచంద్, జూపల్లి. నిచ్చెనమెట్ల లోలకం (కవిత్వం), హైదరాబాద్ : పాలపిట్ట బుక్స్, 2011.
(7) వెంకట కృష్ణ, జి. లోగొంతుక (కవిత్వం), కర్నూలు : స్ఫూర్తి ప్రచురణలు, 2000.
(8) వెంకట కృష్ణ, జి. హంద్రీగానం (వచన కవిత్వం), కర్నూలు : స్ఫూర్తి ప్రచురణలు, 2010.
(9) కేశవరెడ్డి, నందవరం. కామాలే (కవిత్వం), తాడిపత్రి : విజయ్ ప్రచురణలు, 2009.
(10) రాజారాం, టి. అతడే (దీర్ఘ కావ్యం), అనంతపురం : సాహితి స్రవంతి, 2006.
(11) రాధేయ. అవిశ్రాంతం (కవిత్వం), అనంతపురం : స్పందన అనంత కవుల వేదిక ప్రచురణ : 2009
(12) మోహన్, బెంగార. విన్యాసం (కవిత్వం), హైదరాబాద్ : ప్రజాశక్తి ప్రింటింగ్ ప్రెస్, 2012.
(13) జగదీష్, కెరె. సముద్రమంత గాయం (కవిత్వం), రాయదుర్గం, కెరె & కెరె కంప్యూటర్స్, 2011.

# విడుదల సాంబశివరావు నాటికలు - సామాజిక చైతన్యం

తేర డేవిడ్ రాజు
పరిశోధక విద్యార్థి
తెలుగు విభాగం
ఆచార్యనాగార్జున విశ్వవిద్యాలయం
గుంటూరు

**1. ఉపోద్ఘాతం :**

తెలుగు సాహిత్యంలో నాటక రంగానికి విశిష్టమైన స్థానం ఉందని చెప్పవచ్చు. నాటకం వినోదంతో పాటు విజ్ఞానాన్ని అందిస్తూ సామాజిక చైతన్యానికి వారధిగా ఉంటుంది. నాటకంలో మానవ జీవితాన్నంతటిని సంక్షిప్తంగా తెలపటానికి తద్వారా ప్రేక్షకుడు చైతన్యపూరిత భావజాలాన్ని గ్రహించడానికి అవకాశం ఉంటుంది. ఈ విషయాన్నే దృష్టిలో ఉంచుకొని భరతుడు తన నాట్య శాస్త్రంలో దశ రూపకాల గూర్చి వివరిస్తూ, నాటక ఔన్నత్యాన్ని కొనియాడుతూ నాటకంలో కనిపించని జ్ఞానంగాని, శిల్పంగానీ, విద్య గానీ, కళగాని, యోగం గానీ, కర్మ గానీ లేనే లేదని తెలియజేస్తూ

"నతత్ జ్ఞానం నతచ్ఛిల్పం నసా విద్యా నసాకలా

నసా యోగో నతత్కర్మ నాట్యేస్మిన్ యున్నదృశ్యతే" అని వివరించాడు[1]. భరతుని దృష్టిలో నాటకం ఉత్తమోత్తమైన రూపకమని తెలుస్తుంది. నాటకం, నాటిక మధ్య బేధ సాదృశ్యాలున్నప్పటికీ రెండు కూడ సంగీత, సాహిత్య, చిత్ర, శిల్ప, నాట్య కళా సమాహారాన్ని అభివ్యక్తీకరించేవే. నాటకం పరిధి విస్తృతమైనది. నాటిక పరిధి చిన్నది. నాటిక చిన్నదైనా తాను చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా, స్పష్టంగా ఇతరులకు వెల్లడి చేయటానికి బలమైన సాధనంగా పరిగణింపబడుతుంది. ముఖ్యంగా సాంస్కృతిక పునర్జీవన ఉద్యమంలోనూ, సంఘ సంస్కరణోద్యమ కాలంలో సమకాలీన సమస్యలపై గళమెత్తటానికి ఎంతో దోహదకారి అయింది. ఇక జాతీయోద్యమ ప్రాధాన్యం ఎంతటిదో దాని ప్రభావం సమాజం మీద ఎలా పడిందో ప్రజలందరినీ ఎలా సమైక్యపరిచిందో అందులో నాటిక నాటకాల పాత్ర ఏమేరకు ఉందో మనకు తెలియంది కాదు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో మన జాతి జీవనాన్ని, దేశభక్తిని పెంపోందించే ఏ అంశాన్నైనా ఇతివృత్తంగా తీసుకొని రచయితలు నాటకాలు నాటికలు రచించి ప్రజలను జాతీయోద్యమ ప్రేరణకు, చైతన్యానికి పురిగోల్పారు. ఆ సమయంలోనే హేతువాద, చారిత్రక, పౌరాణిక నాటికలు విరివిగా వెలువడ్డాయి.

ఒక వైపు జాతీయోద్యమ దృక్పథంతో నాటికలు ప్రదర్శింపబడుతూ స్వాతంత్రోద్యమ దృకోణాన్ని ఆవిష్కరిస్తుండగా మరొక వైపు సమాజ మార్పును తీసుకురావటానికి సంఘ సంస్కరణ దృక్పథంతో

సాంఘీక నాటికలు ప్రముఖ పాత్ర వహిస్తూ రచించబడ్డాయి. ప్రాచీన సంప్రదాయాలు, ఆచారాలు మొదలగు వాటిపై తిరుగుబాటు చేస్తూనూతన భావజాలంలో నాటిక సామాజిక స్థితిగతులతోపాటు వ్యక్తుల మనః ప్రవృత్తులు తద్వారా వచ్చిన మార్పులను తన రచనలలో ప్రతిబింబం జేస్తూ ప్రజలను చైతన్యం చేస్తూ రచనలు వెలువడ్డాయి. మారుతూ ఉన్న సమాజంలో వచ్చే ఒడుదుడుకులను దుష్పరిణామాలను ఎత్తి చూపి మంచిని పెంచి మానవీయతను నైతికత పాదుగొల్పటానికి నాటక కర్తలు ఎంత గానో ప్రయత్నించారు. సంఘసంస్కర్తలు, మానవతా వాదులు సమాజ ఉద్ధరణకు పూనుకుంటూ ప్రజలను చైతన్యవంతం చేస్తూ నాటికలు రచించారు. వారిలో కందుకూరి, గురజాడ, చిలకమర్తి వంటి వారు సమాజాన్ని పట్టిపీడిస్తూ సామాజిక రుగ్మతలుగా పేరుపొందిన కన్యాశుల్కం, వరకట్నం, బాల్యవివాహాలు, బహుభార్యత్వం, మద్యపానం, వేశ్యాలోలత, అస్పృశ్యత, మూఢనమ్మకాల వంటి అకృత్యాలపై అధిక్షేపక, వ్యంగ్యపూరితంగా రచనలు చేసి సమాజానికి కనువిప్పు కలిగించారు.

స్వాతంత్ర్యానంతరం మార్క్సిస్టు దృక్పథంతో స్త్రీ పురుష సమానత, తెలంగాణా విమోచనోద్యమం, రైతాంగ జీవనపోరాట సమస్యలు, గ్రామీణ జీవనంలో పెట్టుబడీదారుల అకృత్యాలు, రైతు కూలీ సమస్యల వంటి వాటిని ప్రధాన భూమికగా చేసుకొని నాటికలు వెలువడి సమాజాభ్యుదయానికి నాంది పలికేటట్లు చేసాయి.

విస్తృత విద్యావ్యాప్తితోపాటు, ఆంగ్ల సాహిత్యాధ్యయనం వలన సమకాలీన సమాజం జరుగుతున్న ఘోరకృత్యాలను తుర్పారబడుతూ నేడు ఎంతో మంది సృజనాత్మక సందేశాత్మక నాటికలు రచిస్తూ సామాజిక చైతన్యానికి దోహదపడుతున్నారు. అటువంటి నాటక కర్తల్లో నేటి తరానికి చెందిన నాటకకర్త, నటుడు, రచయిత శ్రీ విడదల సాంబశివరావు ఒకరు.

ప్రస్తుత సమాజంలో అగమ్యగోచరంగా, అపరిష్కృతంగా వెంటాడి వేధించే సమస్యలపై అక్షర ఖడ్గాన్ని ఝుళిపించి వాటిని పటాపంచలు చేయడానికి పూనుకున్న విడదల వారు తన రచనల్లో సమకాలీన సమస్యలపట్ల స్పందించే తీరుకు ఆకర్షితుడ్నై విడదల సాంబశివరావు రచనలు – జీవితం అనే అంశంపై పరిశోధన చేయాలని సంకల్పించాను. నా పరిశోధన నాంశాన్ని పరిశీలనా సౌలభ్యం కోసం ఆరు అధ్యాయాలుగా విభజించుకున్నాను.

మొదటి అధ్యాయం : రచయిత జీవితం – సాహిత్య నేపథ్యం

రెండవ అధ్యాయం : విడదల సాంబశివరావు కథ సాహిత్యం – విశ్లేషణ

మూడవ అధ్యాయం : విడదల నవలాసాహిత్యం – వస్తువిశ్లేషణ

నాల్గవ అధ్యాయం : విడదల కవిత్వం - అనుశీలన

ఐదో అధ్యాయం : విడదల రూపక రచనానుశీలన

ఆరో అధ్యాయం : సాంబశివరావు రచనలు - శైలి

**విడదల సాంబశివరావు - జీవనరేఖలు**

**బాల్యం :**

నవల, కథ, నాటక, నాటిక రచయితగా పేరు తెచ్చుకున్న శ్రీ విడదల సాంబశివరావు 1952 జనవరి 22న చిలకలూరిపేట పట్టణ పరిధిలోని పురుషోత్తపట్నంలో శ్రీ విడదలరాములు, సీతమ్మ దంపతులకు జన్మించారు.

**విద్యాభ్యాసం :**

విడదల సాంబశివరావు ప్రాథమిక, హైస్కూలు విద్యను తన స్వగ్రామమైన పురుషోత్తపట్నంలోనూ, చిలకలూరి పేటలో అభ్యసించారు. కళాశాల విద్యను తెనాలి వి.యస్.ఆర్. & యన్.వి.ఆర్. కళాశాలలో బి.యస్.సీ డిగ్రీని పూర్తి చేసారు.

**వృత్తి :**

కళాశాల విద్యను పూర్తి చేసుకున్న విడదల సాంబశివరావు ఉద్యోగ వేటలో కొంతకాలం గడిపిన తర్వాత తన కాళ్ళపై తాను నిలబడి పదిమందికి సహాయ పడాలనే దృక్పథంతో స్వంత వ్యాపారాన్ని ప్రారంభించి అందులో విజయం సాధించారు.

**ప్రవృత్తి - రచనా వ్యాసాంగం :**

విడదల వారు వ్యాపార రంగంలో ప్రవేశించినా అభిరుచి మాత్రం సాహితీరంగం వైపే. హైస్కూలు చదివే రోజుల్లోనే చిన్న చిన్న నాటకాలలో నటించి అందరిచేత శబాష్ అనిపించుకోవటంతో సాహితీ రంగం పట్ల మక్కువ ఏర్పడినట్లు తెలియజేసారు[1].

**రచయితగా :** విడదల వారు హైస్కూల్ విద్యనభ్యసించే సమయంలోనే వారి భావుకతను గుర్తించిన ఉపాధ్యాయులు రచనలు చేయమని ప్రోత్సహించారట. గురువుల ప్రోత్సహంతో చిన్న చిన్న కవితలు, కథలు వ్రాయటం ప్రారంభించారు. స్కూలు, కాలేజీలలో వార్షికోత్సవ సందర్భంలో నాటక పోటీలు జరుగుతుండేవి. అందులో పాల్గొనాలనే ఉత్సాహంతో వీరు కాలేజీ చదివేరోజులలోనే నాటికలు వ్రాసి అందులో పాత్రలను పోషించడం కూడ జరిగింది. ఒకవైపు నటన, మరోవైపు రచన రెండూ సాహిత్య రచనారంగం వైపు పూర్తిగా నడిచేటట్లు చేసాయని విడదల వారు తెలియజేస్తారు. మన చుట్టూ ఉన్న సమాజంలో జరిగే సంఘటనలను తనను ఎంతో ప్రభావితం చేసాయని అందుకే తన రచనల్లో వాస్తవిక జీవన సంఘటనలకు ప్రాధాన్యత ఇచ్చి రచనలు చేసానని తెలియజేసారు. వీరు నీహారి, శివ కలం పేర్లతో రచనలు చేసారు. వీరి రచనల్లో కథలు, కవితలు, నవల, నాటకం నాటికలు కన్పిస్తాయి. అన్నింటిలో సమకాలీన జీవన సంఘటనలను ఇతివృత్తాలుగా ఎన్నుకొని సమస్యలకు పరిష్కార మార్గాలను వెల్లడించటం రచయిత ప్రతిభను వెల్లడి చేస్తుంది.

వీరి రచనల్లో నాటికల పాత్ర ఎక్కువని చెప్పవచ్చు. స్వతహాగా విడదల వారు నటుడు కావడం చేత నాటిక రంగం పట్ల అభిరుచి పెంపొందించుకొని నాటికలు వ్రాసారు.

వారి నాటకాలన్నీ సామాజిక చైతన్య పూరితమైన అద్భుత కళాఖండాలే వివిధ పత్రికలలో విడదల శివా అనే కలం పేర్లతో కూడా శ్రీ నీహారిక, శివా అనే కలం పేర్లతో కూడా శ్రీ విడదల వారి కథలు ప్రచురించబడినాయి. బందగి, గమ్యం, ఆత్మబంధం, బంగారుతల్లి మొదలైన కథలు శ్రీ విడదల వారు రాయడం జరిగింది. 100కి పైగా కవితలు వివిధ పత్రికలలో ప్రచురించబడినాయి.

శ్రీ విడదల వారి రచనలు :

1. రాబందుల రాజ్యమా - ఇక వర్ధిల్లవు (నాటకం)
2. పుణ్యభూమి నాదేశం (నాటకం)
3. అవనీతలంపై అమృత కలశం (నాటిక)
4. మృగయా వినోదం (నాటిక)
5. భారతరత్న (నాటిక)
6. తలారి తీర్పు (నాటిక)
7. ఓ నాన్న కథ (నాటిక)
8. బాలచంద్రుడు భగ్గుమన్నాడు (నాటిక)
9. అభ్యుదయానికి సంకెళ్ళా ? (నాటిక)
10. జనారణ్యంలో జానకి (నాటిక)
11. సరికొత్త ప్రేమలేఖ (నవల)

**శ్రీ విడదల వారు అందుకున్న పురస్కారములు :**

1. రాష్ట్రస్థాయి అత్యుత్తమ నటుడు పురస్కారం 2002 కళావాణి - రాజమండ్రి
2. అత్యుత్తమ రచనకు ప్రత్యేక ప్రతిభా పురస్కారం (తలారి తీర్పు - నాటిక) (2002 సం॥) పి.వి. రావు మెమోరియల్ ట్రస్ట్, గుంటూరు.
3. ఉత్తమ నాటక రచయితగా ప్రతిభా పురస్కారం (ఓ నాన్న కథ - నాటికల సంపుటి) (2011) డా॥ పట్టాభి కళాపీఠం, మచిలీపట్నం.
4. శ్రీ విజయనామ సంవత్సర ప్రతిభా పురస్కారం - 2013 (నాటక రంగం) ఆంధ్ర సారస్వత సమితి - మచిలీపట్నం (రాష్ట్ర అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి ద్వారా స్వీకరించడం జరిగినది.)
5. "కళా కౌశల" (నాటక రంగం) ప్రతిభా పురస్కారం - 2013 ది.25-07-2013న డా॥ సి.నారాయణరెడ్డి గారి జన్మదిన వేడుకల సందర్భంగా శాసనమండలి ఛైర్మన్ డా॥ఎ.చక్రపాణి గారి ద్వారా స్వీకరించడం జరిగినది.

జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్, హైదరాబాద్.

6. "రంగస్థల రత్న" బిరుదు ప్రధానం - ఘంటసాల కళా నిలయం, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా 12 జూలై 2015.

**నటుడుగా :** విడదల వారి నట జీవితం 1968లో బాలచంద్రుడు నాటికలో ఏకపాత్రాభినయంతో ప్రారంభమై ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. భవిష్యత్‌లో కూడ కొనసాగుతుందంటారు రచయిత. దాదాపు రాష్ట్రంలోని అన్ని పరిషత్‌లలో నటుడుగా తన విశ్వరూపాన్ని ప్రదర్శించి ఉత్తమ నటుడుగా, క్యారెక్టర్ యాక్టర్‌గా పలు బహుమతులు అందుకున్నారు. అక్కినేని నాగేశ్వరరావు గారితో మట్టి మనిషి సీరియల్‌లో నటించడం మర్చిపోలేని అనుభూతి అంటారు[2].

అదే విధంగా 1970 సం॥లో 18 సం॥ల వయస్సులో విశ్వవిఖ్యాత ఆంగ్లనాటిక రచయిత షేక్స్పియర్ రచించిన జూలియస్ సీజర్ నాటకంలో మార్క్ ఆంటోని పాత్రను పోషించి ప్రేక్షకుల ప్రశంసలు అందుకున్నారు. ఒకే సం॥లో నంది నాటకోత్సవాలలో రచయితగా (నాటకం, నాటిక) మరియు నటుడు విభాగాలలో ఎంపిక కాబడటం ఓ అరుదైన విశేషంగా పేర్కొంటూ ఎందరో కళారంగ ప్రముఖులు ప్రశంసలు వర్షం కురిపించడం గొప్ప అనుభూతి అని తెలియజేసారు. నేటికీ ప్రతి సంవత్సరం నటుడుగా, రచయితగా రంగస్థలంపై ఆయన తన ప్రతిభను కొన సాగిస్తూనే ఉన్నారు. 2012 సం॥లో గుంటూరు నగరంలో జరిగిన నంది నాటకోత్సవాలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు.

**సమాజ సేవా తత్పరుడిగా :** 1993 లో విడదల నీహారిక ఫౌండేషన్ స్థాపించబడడం జరిగింది. ఈ సంస్థకు వ్యవస్థాపక అధ్యక్షులుగా వ్యవహరిస్తూ పలు సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. వృద్ధులకు, వికలాంగులకు, బడుగు బలహీన వర్గాలకు, పేద విద్యార్థులకు అవసరమైన సహాయం

చేస్తూ సమాజంలో ప్రముఖమైన గుర్తింపును కలిగి వున్నారు. ఈ సంస్థ ద్వారా సాహితీ, సాంస్కృతిక, కళారంగాలకు సేవలందించుచున్నారు. అంతర్జాతీయసేవా సంస్థ రోటరీ ఇంటర్నేషనల్ (డిస్ట్రిక్ట్ -3150)కు "పందరీపురం రోటరీక్లబ్" అధ్యక్షుని హోదాలో 2005 -06 సంవత్సరంలో ఎన్నో సేవా కార్యక్రమాలను నిర్వహించి విలువైన గుర్తింపును పొందినారు. అంతేకాకుండా రోటరీ ఇంటర్నేషనల్‌లో ప్రముఖమైన గుర్తింపు కలిగిన హోదా "పాల్ హరిస్ ఫెలోషిప్ ( పి. హెచ్. ఎఫ్. )"ను పొందియున్నారు.

**విడదల వారి నాటికలు - సామాజిక చైతన్యం**

నాటకం సమాహారకళ, సంపూర్ణకళ అని విజ్ఞుల అభిప్రాయం సంగీత, శిల్ప, చిత్ర, నాట్య కళా సమాహారమైన నాటకం సంభాషణాది హావభావాలతో రంగస్థలంపై దృశ్యమానమయ్యే అద్భుత కళా రూపం అటువంటి నాటక రంగం శక్తివంతమైన మాధ్యమంగామారి సమాజ సాదృశ్యాలనే ఇతివృత్తాలుగా మలచబడి సామాజిక స్పృహతో ప్రజా జీవనాన్ని మేల్కొల్పుటకు ప్రయత్నిస్తాయి. ఆ సిద్ధాంతాన్ని బలంగా నమ్మిన విడదల వారు నాటికల ద్వారా సమాజానికి సందేశాన్నందించాలనే తపనతో అద్భుతమైన నాటికలు రచించారు. వీరు వ్రాసిన నాటికల్లో విశిష్టంగా పేర్కొన్న దగినవి "అభ్యుదయానికి సంకెళ్ళా... జనారణ్యంలోకి జానకి, తలారితీర్పు, భారతరత్న పుణ్యభూమి నా దేశం మొదలైనవి.

**1. అభ్యుదయానికి సంకెళ్ళా .....**

అభ్యుదయానికి సంకెళ్ళా నాటికలో కులం, మతం, ఆస్తి, ప్రతిష్ఠ, సంప్రదాయాల కోసం రెండు యువ హృదయాల ఆశల్ని, ఆశయాన్ని, భవితవ్యాన్ని చీకటి మయం చేసిన పెద్దల మరగుజ్జు మనస్తత్వాన్ని వ్యక్తీకరించేనాటిక. కృష్ణ ప్రసాద్, సుధ ఇద్దరూ ప్రేమించుకుంటారు. వారి స్వచ్ఛమైన

ప్రణయాన్ని జీవితంగా మార్చుకోవాలను కుంటారు. కానీ ఆస్తి, అంతస్తు, స్టేటస్ కోసం కృష్ణ ప్రసాద్ అన్న రాజశేఖరం, కులం సంప్రదాయం కోసం సుధ తండ్రి మాధవరావు అందుకు అంగీకరించరు. పెద్దల మాటకోసం వారి మీద గౌరవంతో గుండెల్లోని అనంతమైన ప్రేమను చంపుకొని కృష్ణప్రసాద్, సుధ విడిపోతారు. సుధని మరో వ్యక్తికిచ్చి తండ్రి మాధవరావు పెండ్లి చేస్తాడు. సుధను పెళ్ళాడిన వ్యక్తి మద్యంమత్తులో స్త్రీలోలుడై మానభంగం, హత్య కేసులో ఇరుక్కుని ఉరిశిక్షకు గురౌవుతాడు. జీవితాన్ని ఏ మాత్రం అనుభవించని యౌవనవతియైన సుధ పుట్టింటికి చేరుకుంటుంది. పుట్టింట్లో ఉన్న సుధను కొంతకాలానికి కృష్ణ ప్రసాద్ చూస్తాడు. అతడు ఆమెను ఆస్థితిలో చూచి ఆవేదనకు లోనవుతాడు. సుధ కృష్ణప్రసాద్ మరలా దగ్గరవటంతో వారిలో కొత్త ఆశలు చిగురిస్తాయి. వసంతం వెల్లి విరిస్తుంది. ఇద్దరూ ఒక్కటై క్రొత్త జీవితం ప్రారంభిద్దామనుకుంటారు. మరలా పెద్దల నుండి వ్యతిరేకత లభిస్తుంది. ఈ సారి ఎలాగైనా ఇద్దరూ ఒక్కటై జీవితాన్ని పండించుకోవాలన్న వారికోరికను తీర్చేదేవతలా రాజశేఖరం భార్య సుజాత తారసపడుతుంది. పెద్దవాళ్ళ ఆలోచనలు పట్టింపులకు భయపడుతూ కూర్చుంటే పనులు జరగవని చెప్పి తన నగలను వారికి ఇచ్చి ధైర్యం చెప్పి స్వేచ్ఛగా ఎక్కడకైనా వెళ్ళి జీవించమని పంపిస్తుంది సంక్షిప్తమైన కథ ఇది.

**అభ్యుదయానికి సంకెళ్ళా ..... సామాజిక చైతన్యం :**

అభ్యుదయానికి సంకెళ్ళా నాటికలో రచయిత మారుతున్న కాలంతోపాటు ఆచార సంప్రదాయాలు ఆస్తి అంతస్థులు వదిలి మనుషులంతా ఒక్కటే అనే భావన రావాలనే దృక్కోణాన్ని ఆవిష్కరించారు. స్త్రీకి సహజంగా పుట్టుకతోవచ్చిన పూలు గాజులు, పసుపుకుంకుమలు మరణం వరకు అలంకారంగా ఉండాలంటూ సుధను విధవగా మార్చే సన్నివేశంలో అంతర్భావ గర్భితంగా వ్యక్తీకరిస్తారు.

సంఘసంస్కరణ దృక్పధంతో ఎప్పుడో వీరేశలింగం పంతులు గారు చెప్పిన విషయాన్ని మరలా గుర్తు చేస్తారు. నేడు వృత్తి వ్యక్తి స్వార్థ చింతనతో డబ్బుకు విలువినస్తా మానవ సంబంధాలను తుంగలో తొక్కుతున్న వైనాన్నే తుర్పారబట్టారు. పెద్దలు పిల్లల సుఖాన్ని కోరుకోవాలి గాని పంతాలకు పట్టింపులకు పోతే వారి జీవితాలతో ఆడుకున్న వారు అవుతారని అది ఎప్పటికీ హర్షించే విషయం కాదని తెలియజేస్తారు.

ఆడమగ కలిసి బతకటానికి ఒకరిపై మరొకరికి ప్రేమేగాని కులమతాలు, ఆస్తులు, అంతస్తులు సంప్రదాయాలు కావని అవన్నీ మనం ఏర్పర్చుకున్న అడ్డగోడలు, సంకెళ్ళని వాటిని తెంచుకొని స్వేచ్ఛ విహంగులై జీవించాలని అప్పుడే అభ్యుదయం వెల్లివిరుస్తుందంటారు. సమసమాజ స్థాపనకు అభ్యుదయ భావజాలానికి దర్పణంగా నిలిచేలా ఈ నాటికను రచయిత తీర్చిదిద్దటం రచయిత ప్రజ్ఞాపాటవాలకు నిదర్శనమని చెప్పవచ్చు.

**2. జనారణ్యంలోకి జానకి**

స్త్రీల అవసరాల్ని, అసహాయతని తమకు అనుకూలంగా మార్చుకొని కామవాంఛల్ని తీర్చుకునే అభినవ రావణాసురుల మధ్య అతివలు అనుభవిస్తున్న మనోవేదనకు అద్దంపట్టే నాటిక జనారణ్యంలోకి జానకి.

ఉద్యోగునులైన స్త్రీలు తమకర్తవ్య నిర్వహణలో మగవారితో అనుభవిస్తున్న బాధలు, వేదింపులను రచయిత ఈ నాటికలో అద్భుతంగా వివరించారు. నేడు దాదాపు ప్రతికుటుంబంలోనూ భార్య భర్తలు ఉద్యోగం చేయక తప్పడం లేదు. ఉద్యోగ రీత్యా భర్తకు దూరంగా వున్న స్త్రీలు తోటి పురుష ఉద్యోగులు, సమాజం చేత ఎంత చిన్న చూపు చూడబడతారో జానకి పాత్ర ద్వారా తెలియజేసారు. రాముడి అజ్ఞానుసారం అడవికి వెళ్ళిన జానకీదేవి అరణ్యంలో ఒక్క రావణాసురుడితోనే ఎంతో వేదనకు గురైంది. నేటి జనారణ్యంలో, కార్యాలయాల్లో తన మధ్యే తిరుగుతున్న అనేక మంది రావణాసురుల మధ్య జానకి లాంటిస్త్రీ ఉద్యోగునులు ఎన్నో వేదనలకు గురౌవుతున్నారు. ఒక ప్రక్క కుటుంబ పోషణార్ధం, ఆర్ధికావసరాలు, మరోప్రక్క పురుష అధికారులు తమపై విసిరే కోర్కెల గాలాలు, ఉద్యోగం చేయలేక చేయకుండా ఉండలేక నలిగిపోతున్నారు. అయితే ఈ నాటికలో అలాంటి స్త్రీ సమస్యలకు జానకి పాత్ర ద్వారా చక్కటి ముగింపునిచ్చి స్త్రీ జాతికి మనో ధైర్యాన్నిచ్చారు రచయిత.

జానకి బదిలీపై విశాఖపట్నంలోని ప్రైవేట్ కంపెనీలో జాయిన్ అవుతుంది.

భర్త ఆర్ధిక పరిస్థితికి తన సంపాదన కూడ తోడైతే ఆడపడుచుల పెళ్ళిళ్లు చేయవచ్చని అనుకుంటుంది. ఆర్నెల్లు గడిచిన తర్వాత యం.డి. తన మనస్సులోని కోరికను బైటపెట్టి ఆమెను తనవైపు తిప్పుకోవాలని ప్రయత్నిస్తాడు. యం.డి గారి భార్యకు అటువంటి స్థితినే కలిగించి జానకి యం.డికి చుక్కలు చూపిస్తుంది. ఆధునిక యుగంలో స్త్రీలు ప్రతిచోట లైంగిక వేధింపులకు తోటి ఉద్యోగస్తుల మధ్య తమ తమ కళాశాలల్లో, వివిధ సంస్థలలో, అనేక ప్రాంతాలలో ఆనాడు వేధించబడ్డారు. ఇప్పటికి వేధించబడుతూనే ఉన్నారు. దీనిని నిర్మూలించడానికి రచయిత గారు పూనుకున్నారు. ఇది సంక్షిప్త నాటిక ఇతివృత్తం.

**జనారణ్యంలోకి జానకి - సామాజిక చైతన్యం**

సహజంగా స్త్రీకి సమస్య ఎదురైనప్పుడు ధైర్యాన్ని కోల్పోయి తమలో తామే కుదించుకుపోయి మధనపడుతూ, వేదన చెందుతూ కాలం గడుపుతారు. ఈ నాటికలో రచయిత జానకికి అభ్యుదయ భావాలుగా స్త్రీగా, సమస్య ఎదురైనప్పుడు తెలివిగా ఎదుర్కొనే పరిస్థితిని కల్పిస్తారు. అంటే సమాజంలో స్త్రీ ధైర్యంగా సమస్యను అధిగమించాలని అటువంటి చొరవ, నైపుణ్యం, కార్యదీక్షత అలవర్చుకోవాలని నేటి యువతకు చెప్పకనే చెప్పారు. ఎంతోమంది స్వార్ధంతో ప్రలోభాలకు గురిచేయుటానికి ప్రయత్నిస్తారని వాటిని తుచ్ఛమైన వాటిగా భావించి వారిపట్ల జాగరూకతతో వ్యవహరించాలనే సామాజిక సందేశాన్నందించారు.

స్త్రీ కుటుంబానికిచ్చే ప్రాముఖ్యత ప్రాధాన్యత జానకి పాత్ర ద్వారా ప్రతి ఒక్కరూ గమనించాలని ఆర్థిక స్థితిగతులు సరిగాలేనప్పుడు భార్యభర్తలిద్దరూ పని చేసుకుంటూ కుటుంబ జీవనాన్ని అర్థం చేసుకుంటూ సమస్యలను తొలగించుకోవాలని పిలుపునిచ్చారు. ఈ నాటిక ఆద్యంతం మంచి సామాజిక సందేశంతో రచయిత నడిపించడం ఆయన నటనాచాతుర్యానికి ప్రజ్ఞా పాటవాలకు గీటురాయని చెప్పవచ్చు.

**3. తలారితీర్పు :**

తప్పు చేసిన వారు శిక్ష అనుభవించవలసిందే అనే నీతిని తెలియజేసే నాటిక తలారి తీర్పు శ్రీరామచంద్రమూర్తి విశ్రాంత మండల రెవెన్యూ అధికారి ఆ మండలానికి ఎవరు యం.ఆర్.ఒ. గా వచ్చిన శ్రీరామచంద్రమూర్తి ఇంటిలోనే వసతి. యం.ఆర్.ఒ. గా వెంకటేశ్వరరావు ఆ ప్రాంతానికి వచ్చి వీరి ఇంట్లోనే ఉంటాడు. యం.ఆర్.ఒ. తో పాటు ఆయన కుమారుడు ప్రభాకర్ లాయర్‌గా ప్రాక్టీస్ చేస్తుంటాడు. శ్రీరామచంద్రమూర్తి మనవరాలు శ్రీదేవి డిగ్రీ చదువుతూ అందరితో సఖ్యతతో ఉంటూ తలలో నాలుకగ వ్యవహరిస్తుంటుంది.

యం.ఆర్.ఒ. కారుడ్రైవర్ సురేంద్ర శ్రీదేవిపై కన్నువేసి ఆమెను పొందుకై అవకాశం కోసం ఎదురుచూస్తుంటాడు. మార్కెట్ నుండి వస్తున్న శ్రీదేవికి దారి ప్రక్క స్పృహ కోల్పోయి ఉన్న నాగన్నకు సపర్యలు చేసి ఇంటికి తెస్తుంది.

అతను అనాధ అని తెలుసుకున్న శ్రీరామచంద్రమూర్తి తన ఇంట్లోనే పనులు చేసుకుంటూ బ్రతకమని ఆశ్రయం కల్పిస్తాడు. సురేంద్ర శ్రీదేవి ఒంటరిగాఉన్న సమయంలో బలాత్కారం చేయబోయి సాధ్యంకాక కత్తితో ఆమెను నిర్దాక్షిణ్యంగా చంపివేస్తాడు. సురేంద్ర పై కోర్టులో కేసు నడుస్తుంది. సురేంద్ర తరుపున ఎవరూ వాదించడానికి ముందుకురారు. సురేంద్ర తరుపున వకల్తా పుచ్చుకొని ప్రభాకర్ కోర్టులో వాదిస్తాడు. ముందు అందరూ, వ్యతిరేకించినా తర్వాత ప్రభాకర్ ఆలోచనలను అర్థం చేసుకుంటారు. సురేంద్రకు ఉరిశిక్ష పడేలా ప్రభాకర్ సాక్ష్యాలు ప్రవేశపెడతాడు. వేరే వారయితే సాక్ష్యాలు తారుమారు చేస్తారని ముందే ఊహించిన ప్రభాకర్ సురేంద్ర వైపు ఉన్నట్లు నటించి శ్రీదేవి ఆత్మకు శాంతి చేకూర్చడానికి పూనుకుంటాడు. ఉరిశిక్ష పడిన సురేంద్రను ఉరితీయటానికి తలారి లేరని, ఉన్న నాగరాజు మతిస్థిమితం కోల్పోయి ఎక్కడికో వెళ్ళిపోయారని పేపర్లో చూపిన నాగన్న తానే తలారి నాగరాజునని సురేంద్రను ఉరితీయడానికి ముందుకు వస్తాడు. ప్రభుత్వం మరల అతనిని తలారిగా నియమించి సురేంద్ర ఉరిశిక్ష తేదీని ఖరారు చేస్తుంది.

సురేంద్రకు ఉరిశిక్ష అమలు చేయడానికి అన్ని సిద్ధమయి ఉరికొయ్యపై ముసుగు ధరించి సమయం కోసం ఎదురు చూస్తున్న వేళ జైలు సూపరింటెండెంట్‌కి సురేంద్రకు రాష్ట్రపతి క్షమాభిక్ష ప్రసాదించినట్లు సమాచారం వస్తుంది.

సురేంద్ర ఉరిశిక్ష అపివేయమని సూపరింటెండెంట్ చెప్పేలోపు తలారి నాగరాజు ఉరిశిక్ష అమలు పరుస్తాడు. సూపరింటెండెంట్ నువ్వు ఎవరి ఆజ్ఞను ధిక్కరిస్తున్నావో తెల్సా అన్నా వినకుండా "గౌరవనీయులైన రాష్ట్రపతి గారి ఆజ్ఞను దిక్కరిస్తున్నాను. దీనికి ఫలితం మరణశిక్ష హాయిగా ఆనందంగా స్వీకరిస్తాను. ఒక మానవ క్రూరమృగం జనవాసాల్లోకి వచ్చి మనుషుల్ని చంపుతుంటే చూస్తూఊరుకుంటారా! ఎలాంటి తప్పు చేసినా రాష్ట్రపతి క్షమాభిక్ష పెడతాడులే అని ఘోరమైన నేరాలు చేసుకుంటూ పోతే సమాజంలో అబలలకు, అమాయకులకు ఎవరు రక్షణ కల్పిస్తారు. రాజ్యంగాన్ని మార్చమని, అందులో సవరణలు పొందుపర్చమని నేను ఎన్నుకున్న పార్లమెంట్‌ను అడిగే హక్కు ఈ దేశపౌరుడిగా నాకుంది. ఈ దేశపు పాలనావ్యవస్థను నడుపుతున్న మేధావులారా! సవరించండి మన రాజ్యాంగాన్ని. దుర్మార్గులు, కిరాతకులు, రాక్షసమూకలు చట్టం నుండి తప్పించుకు పోకుండా కఠినంగా శిక్షింపబడేటట్లు న్యాయం, రక్షింపబడేటట్లు ధర్మం వర్ధిల్లునట్లు మార్చండి అని తలారి ఉద్వేగంగా మాట్లాడతాడు[1]. ఇది సంక్షిప్తంగా నాటిక సారాంశం.

**తలారితీర్పు - సామాజిక చైతన్యం :**

తలారి నాటికలో ప్రతి సన్నివేశం ఎంతో అద్భుతంగా చిత్రీకరించబడింది. సందేశాత్మక సన్నివేశ కల్పన ప్రతి ప్రేక్షకుల హృదయాలను కదిలిస్తుంది. శ్రీరామచంద్రమూర్తి మనవరాలు శ్రీదేవిపై కారు డ్రైవర్ మానభంగం చేయటానికి ప్రయత్నించినప్పుడు ఆమె ఎదురు తిరిగిన సంఘటనను చూస్తే సమస్య వచ్చినప్పుడు ధైర్యాన్ని కోల్పోకుండా స్త్రీలు ఎలా ప్రతిఘటించాలో నేర్పుతుంది.

క్రూరమృగాలు జనకీకారణ్యంలోకి చొరబడినప్పుడు ప్రజలు అప్రమత్తంగా ఉండాలని, సురేంద్రలాంటి వారు నక్క వినయాలతో చనువుగా ఉంటూ తడిగుడ్డలతో గొంతులు కోస్తారని అటువంటి వారి పట్ల ఎంతో జాగురకతో అవసరమనే వివేచనను కల్గిస్తుంది.

ప్రభాకర్ లాంటి లాయర్లు ఉండబట్టే న్యాయం నాల్గుకాళ్ళపై నిలబడగల్గుతుందనే సందేశాన్ని అందించారు. శ్రీదేవిని సురేంద్ర అతికిరాతకంగా విచక్షణారహితంగా, నిర్భయంగా చంపివేసినప్పుడు చూసిన వాళ్ళు భయపడి నిజం చెప్పటానికి వెనకాడతారు. ఇది చాలా బాధకరమైన విషయమని ప్రజలకు ప్రభాకరక్ ఉద్బోధ చేసి వారు కోర్టులో సాక్ష్యం చెప్పటానికి ముందుకు వచ్చేటట్లు ప్రేరణకు గురి చేస్తాడు. సహజంగా హత్యలు చేసే వ్యక్తిని చూస్తే ఎవరికైనా భయం కలుగుతుంది. అదే భయాన్ని అతనికి కలగజేయాలంటే సమస్యను ప్రజలంతా సమిష్టిగా పోరాడితే చాలంటూ ఎంతో నైపుణ్యంగా సృజానాత్మక సందేశాన్ని ప్రభాకర్ ద్వారా రచయిత పలికించడం చూస్తే వ్యక్తి కంటే వ్యవస్థ చాలా ముఖ్యమని ఆ వ్యవస్థ ఒక శక్తిగా మారినప్పుడు ఏదీ దాని ముందు నిలవలేదనే సందేశాన్ని చక్కగా విశదీకరించారు.

తప్పు చేసిన వాడు ఎటువంటి వాడయినా శిక్ష అనుభవించవలసిందే అనేది ధర్మం. ఘోరమైన తప్పులు చేసి క్షమించమనటం లోక ధర్మం కాదు. సురేంద్ర లాంటి మేక వన్నె పులులు సమాజంలో తిరుగుతూ అవకాశం కోసం ఎదురు చూస్తుంటారని అటువంటి వారి బారిన పడకుండా స్త్రీలు జాగ్రత్త వహించాలని ఒకవేళ అనుకోని సంఘటన, ఉపద్రవం ఎదురైనప్పుడు ఏడుస్తూ కూర్చోక ఆత్మ స్థైర్యంతో ప్రతిఘటించాలని, నేడు స్త్రీలపై విచక్షణా దాడులు జరుగుతున్నాయని వాటి నుండి తప్పించుకోవటానికి స్త్రీలకు చదువుతో పాటు ఆత్మ రక్షణ పద్ధతులు కూడా అలవాటు చేయాలని రచయిత శ్రీదేవి పాత్ర ద్వారా లోకానికి వెల్లడించారు.

సురేంద్రను ఉరి తీయడానికి నియమించిన తలారి నాగరాజు అతనికి క్షమాభిక్ష లభించిందని తెలియగానే ఎంతో మదనపడతాడు. ముక్కు పచ్చలారని ఒక యువతిపై మానభంగానికి ప్రయత్నించడమే గాక ఆమెను ఏ ఖండానికి ఆ ఖండం చేసి రక్తపు ముద్దగా మార్చిన వ్యక్తికి రాష్ట్రపతి క్షమాభిక్ష పెట్టటమా! అని ప్రశ్న వేసుకొని తన మన:సాక్షిని చంపుకోలేక అవసరమైన తనకు ప్రాణహాని ఉన్నా తాను నమ్మిన సిద్ధాంతానికే కట్టుబడి ఉంటానని దుష్ట శిక్షణ శిష్ట రక్షణే ప్రతి ఒక్కరూ కర్తవ్యంగా భావించాలంటూ సురేంద్రను ఉరి తీయటం చూస్తే తలారికి ఉన్న వివేచన ప్రతి ఒక్కరకూ ఉంటే అసలు అకృత్యాలే జరగవని తెలుస్తుంది.

ఈ వాస్తవిక జీవన సంఘటన తనన కలిచివేయటంతో ఈ నాటిక వ్రాసానని రచయి తెలియజేస్తాడు. చిలకలూరిపేట దగ్గర కావూర గ్రామ సమీపంలో బస్సు దహనం కేసుల ముద్దాయికి రాష్ట్రపతి క్షమాభిక్ష మేరకు ఉరిశి రద్దవుతుంది. ఆ సంఘటన తనను యావ భారతదేశాన్ని తీవ్ర విభ్రాంతికి గురిచేసిందని ఆ సంఘటనలో ఎన్నో కుటుంబాలు ఆవేదనకు గు అవుతుంటే ముద్దాయి హాయిగా క్షమాభిక్షతో జీవిస్తున్నాడని దీనిని ప్రశ్నించవలసిన ఆవశ్యకత ఉందంటూ ఆ దృక్పథంతోనే ఈ నాటిక రూపుదిద్దుకుందని తన భావాన్ని వ్యక్తీకరిస్తారు. ఈ నాటిక ఎంతో రసాత్మకంగా మలచబడ్డ ఒక అద్భుత కళాఖండమని చెప్పవచ్చు. దీనిని ప్రదర్శించడానికి నటులు కూడ ముందుకు రాలేదంటే నాటిక భావోద్వేగాన్ని మనం అర్థం చేసుకోవచ్చు.

**ముగింపు :**

విడుదల వారి నాటికలలో ప్రతి సంఘటన, పాత్ర చిత్రణ వాస్తవ జీవనానికి అద్దం పడుతుంది. సమ సమాజ స్థాపనలో స్త్రీ పురుషులిద్దరూ భాగస్వామ్యం కావాలని, అప్పుడే అభ్యుదయం సాధించవచ్చని తెలియజేశారు. కులమతాలు, కుహునా సంప్రదాయాలన్ని వదలి ప్రజలంతా అన్నదమ్ముల వలె కలిసి మెలసి నడవాలనే సందేశాన్ని ప్రతి నాటికలో వెల్లడించారు. స్త్రీలు ఎప్పుడూ వంటింటి కుందేలులా వ్యవహరించక చక్కగా చదువుకొని పురుషులతో పాటు ఉద్యోగ విషయాలలో పోటీపడాలని ఒకవేళ ఉద్యోగ నిర్వహణలో సమస్యలు ఎదరైతే ధైర్యంగా

ఎదుర్కొని సమయస్ఫూర్తిగా పనులను చక్కదిద్దుకోవాలనే సందేశాన్ని అభివ్యక్తీకరించారు. వీరి నాటికలు సమాజ మార్పును స్వాగతించే ఎన్నో విషయాలను వెల్లడిస్తూ రచించబడ్డాయి. వీరి నాటికల ద్వారా ప్రేక్షకులకు రసాస్వాదనతో పాటు విజ్ఞానదాయకమైన ఎన్నో విషయాలను నేర్చుకోవటానికి అవకాశం ఉందనటంలో ఎటువంటి అతిశయోక్తి లేదు.

**ఆధార గ్రంథాలు :**


1. ఓ నాన్న కథ - విడదల సాంబశివరావు, నీహారిక ప్రచురణలు, చిలకలూరిపేట, 2011.
2. జనారణ్యంలోకి జానకి - విడదల సాంబశివరావు, నీహారిక ప్రచురణలు, చిలకలూరిపేట, 2012.
3. తలారి తీర్పు - విడదల సాంబశివరావు, నీహారిక ప్రచురణలు, చిలకలూరిపేట, 2010,
4. నాట్యశాస్త్రం - భరతుడు, నిర్ణయ సాగర ముద్రణ, ముంబాయి, 1943.
5. పుణ్యభూమి నా దేశం - విడదల సాంబశివరావు, నీహారిక ప్రచురణలు, చిలకలూరిపేట , 2010.
6. సాహితీ ప్రస్థానం - విడుదల సాంబశివరావు నీహారిక ప్రచురణలు, చిలకలూరిపేట, 2014
7. రచయితతో ముఖాముఖి.



తేర డేవిడ్ రాజు

**పరిశోధక విద్యార్థి , తెలుగు విభాగం**

**ఆచార్యనాగార్జున విశ్వవిద్యాలయం**

**గుంటూరు**

# "కాంతారావు కథల్లో అతుకుల బతుకులు"

-డా. జాడ సీతాపతి రావు, తెలుగు ఉపన్యాసకు
రాజీవ్ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయ
ఏ.పి.ఐ.ఐ.ఐ.టిబీ నూజివీడు, కృష్ణా జిల్లా, ఆంధ్ర ప్రదేశ్. 5212
చరవాణి: 99511712
విద్యుల్లేఖ: seethuphd@gmail.co

1.0.బలివాడ కథా వీచిక:-

మానవజీవన వెతల్లో ఎలుగెత్తి చూపడానికి కథా సాహిత్యం ఒక వాహిక. ఉత్తరాంధ్ర ప్రాంతంనుంచి ఉత్తర భారతదేశం వరకు ఒక సాగిన జీవనయానంలో పరిచయాలు, సంఘనలు ఉత్సాహం కలిగించే శైలితో కథనరంగంలోకి కార్యశూలులైనవారిలో బలివాడ ఒకరు.

'మనసు కదిలితే మౌనగీతాలు వస్తాయ్...' ఒక్కో భావనాశక్తి, కథన శక్తితో కలసి కథాగమనం లోకి ఒదుగుతుంది. "కాదేదీ కథకనర్హం..." అన్నట్లు, ప్రతిభా వ్యుత్పత్తి అభ్యాసాలు సాధనాలు ఉంటూ లోకాన్ని విలోకనం చేయడం చాలా మంది సాధ్యం కాదు. ఎక్కడకు వెళ్ళినా 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్న భావనను సార్ధకం చేసుకోవడం చెప్పినంత సులువూ కాదు. 'మగవాడు తిరక్క చెడిపోతాడు' అన్న పెద్దల మాటల్ని లోకజ్ఞానంతో కలిపి సూక్తులు, జాతీయాలు, పలుకుబడులను ఇమిడిపోయేలా కథనం చేయడం ఏ శ్రీపాదకో, తిలక్ లాంటి వారికో సాధ్యమయింది. అలాంటి పటుత్వం, మాటల ఒడుపుల్ని పొదుపుగా వాడిన వారిలో ఒకరు బలివాడ. 'ముంగిస కథ' అయినా 'మనో వైకల్యం' అయినా... 'గులాబీ' అయినా, 'గేటు' అయినాబీ 'మేషం' అయినా, 'మనో వైకల్యం' అయినా రచయితకు అందులో భావనాశక్తులు భద్రంగా 'బానిసా'తాయ్.

1.1. గుర్తుంచుకునే పార్శ్వాలు:-

బలివాడ వారి కథల్లో కొన్ని పరిచయాలు కనిపిస్తాయ్. అంతేకాదు మానవ హృదయాల్ని, చాలా అంశాలను పదిలంగా గుర్తుండిపోయేలా చేయడం కూడా.

1.1.1. కాంతారావు గారి ఊరిలో మహాభారత గాథలు చెప్పే గొల్ల రామస్వామి.

1.1.2. చిన్నప్పుడు వీధిలో జరిగిన గొడవలో తప్పొప్పులు బేరీజు వేసి, తీర్పు చెప్పాలంటే దూరంగా ఉంటూ గమనించడం

1.1.3. ఆఫీసు పెద్ద తన క్రింద సబార్డినేటు గురించి రాసిన రిపోర్టు- అడ్మినిస్ట్రేషనుకు, లేబరుకు మధ్య యితను సంధాన కర్తలా ఉన్న ఘటన.

1.1.4. బంధుత్వాలలో ఉన్న లేదా జరిగిన సంఘటనల కథారూపంలో చూపడం.

1.1.5. మానవ సంబంధాలను కొంతమంది విభి తత్త్వాలతో ప్రవర్తించి కలంకితులుగా మిగలడం

1.1.6. వ్యక్తుల్ని అంచనా వేయడం ద్వారా తగిన జాగ్రత్త తీసుకోవాలనుకునే తత్త్వాన్ని జీవితంలో భాగంగా అధ్యయన చేయవలసిన అవసరాన్ని గుర్తెరిగి ప్రవర్తించడం.

1.2. బలివాడ జీవన గమనాలు:-

ఆంధ్రప్రదేశ్ లో శ్రీకాకుళం జిల్లా, మడపాంలో జూలై 3, 1927న బలివాడ కాంతారావు పుట్టారు. తండ్రి సూర్యనారాయణగారి ద్వారా మొదలు పెట్టిన విద్యాభ్యాసం, పోలుమహంతి సూర్యనారాయణ గారి దగ్గర ఇంగ్లీషుతో, తాతయ్య రామమూర్తి దగ్గర రామాయణ, మహాభారత కథలతో లోకజ్ఞానాన్ని ఔపోశన పట్టారు. విశాఖపట్నంలో ఐదో తరగతిలో చేరారు. వారి అత్తయ్య, అమ్మాయమ్మ దగ్గర భేతాళ, విక్రమార్క కథలు, పంచతంత్రం కథలే కథకు ప్రాణం పోశాయి. పాఠశాలలో స్కూలు మ్యాగజేన్ కు సంపాదకుడిగా కూడా చేశాడు. పదిహేనో ఏట విశాఖపట్నం ఆర్డినెన్స్ లో చేరాడు. బదిలీకి ఒప్పుకోక ఉద్యోగాన్ని మానేశాడు. తర్వాత నౌకాదళంలో చేరి వివిధ విభాగాల్లో పని చేశారు. ఆయా ఉద్యోగాల్లో కొన్ని సన్నివేశాలను కథలుగా గుర్చారు. ఆయా ప్రదేశాలు, అనుభవాలు వీరి కథాభాగాలుగా ఒదిగాయి.

1.3. కథన ప్రస్థానం:-

సంఘటనలు మనసుపై ముద్ర వేస్తాయ్. అదే రచయిత/కవికి ప్రేరణను కలిగింపజేస్తాయ్. వర్ణనలు అందులో భాగమైన అది కలిసిపోయిన చక్కటి బిగువును ఇస్తుంది. ఆ కథావస్తువుకు కవితాశక్తి తోడై 'వాహ్వా' అనిపించేలానో, కన్నీటిని కురిపించేలానో ఇలా ఎన్నో విధాలుగా రచయిత చేయిస్తాడు. అలాంటి వారిలో ముంగిసను సైతం మానవతా వాదంతో ముడివేయగల కథకుడు, కాంతారావు. మనిషికుండే స్వార్థశక్తి

ముందు ఉపకారం చేసిన జీవికి కూడా దారుణంగా బలైపోవడం కథలోని అంశం.

13.1. 'బయ్యన్నా రా!' అని పిలవగానే వచ్చే ముంగిస, దానిపట్ల డాక్టర్ కుటుంబం పెంచుకున్న మమకారం, చివరకు పక్క ఇంటి ఆయన దారుణంగా చంపడం పాఠకుడికి కన్నీళ్ళు తెప్పిస్తుంది. మానవత్వం అనే మాటకు మనిషే నిలువెత్తు ద్రోహిగా ఇక్కడ భైరవయ్య కనిపిస్తాడు. ఇతడే బానయ్యను (ముంగిస) చంపినవాడు. ముంగిస 'తను చెయ్యలేదు' అని చెప్పడాన్ని కథకుడు వరి?ంచిన తీరులో మానవత్వపు అంశాలు కన్నీరును తెప్పిస్తాయ్.

1.3.1.1. పంచతంత్ర కథలోని 'ముంగిస, పిల్లాడిని కరవబోయిన పామును చంపి, యజమానికి కనబడటంతో పిల్లాడిని ముంగిస చంపింది' అని భావించి ఆ ముంగిసను యజమాని చంపేసి, తర్వాత నిజం తెలుసుకొని దుఃఖిస్తారు. దాని కంటే కొంచెం భిన్నం అనిపించిన యదార్థగాథ ఇది. ముంగిసయొక్క తల్లి, తండ్రి ముంగిసలు కనబడడం వాటి దగ్గరికి వెళ్లకపోవడం ఇవన్నీ కథనంలో నిజాలను చూస్తున్నట్లు అనిపిస్తుంది పాఠకుడికి. "ముంగిస కథ"– బలివాడ వారు తన మేనమామ ఇంటికి వెళ్లినప్పుడు మువ్వల శబ్దంతో తిరుగుతున్న ముంగిసను చూశారు. దానిమీద కూడా కథ రాస్తావా అని వారి అత్తయ్య సరదాకు అన్నది. అదే కథగా మలచారు.

ముంగిసను పట్టితెచ్చిన విధానం దాన్ని కుటుంబ సభ్యుడిగా పెంచిన వైనం ఇతడి కథనానికి కలికితురాయి. కానీ కాంతారావు కథ రాసి వినిపిస్తే వారి అత్తయ్య కళ్లల్లో నీళ్లు తిరిగాయట. ఇది బలివాడ కాలానికి ఉన్న కవనశక్తి.

1.3.2. మనిషి–పశువు కథ– ఒక ప్రత్యేకమైనది. బొంబాయిలో ఉద్యోగం చేస్తున్నప్పుడు ఒక త్రాగుబోతు డ్రైవరకు ఛార్జిషీటు ఇచ్చాడు. మళ్లీ కాంతారావు తిరుగు బదిలీ అవుతుంటే అతను కన్నీరు కార్చాడు. ఆ సంఘటనే ఈ కథకు ప్రేరణ. ఒక్కో కథకు ఒక్కో నేపథ్యాన్ని చక్కగా వాడుకోవడంలో, కథనంలోకి ఇమిడ్చడంలో దిట్ట కాంతారావు.

1.4. కథల పరంపర:-

1998లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన బలివాడ కాంతారావు కలం నుండి వెలువడిన మరికొన్ని ఆణిముత్యాలు! 'బలివాడ కాంతారావు కథలు'. ఈ పుస్తకంలో అశాంతి, తిరుపతి, కనకపు సింహాసనం, కదలిక, బాధ్యత మొదలైన 29 కథలు, 'రాతి బొమ్మలు' నవలిక ఉన్నాయి.

1.4.1. పి. రాజేశ్వర రావు సంకలనం చేసిన బలివాడ కాంతారావు కథా కలశం 133 కథలు, 5 కథానికలతో వచ్చింది. ఇది సార్థక నామధేయాన్ని సంతరించుకుంది.

1.4.2. జీవితంలో చాల పార్శ్వాలను తరచి చూడడం కథన శక్తి తోడవడం ద్వారా వీరి ప్రతిభను అన్ని కథలు నిలపక పోయినా, జీవితంలో చాలా సంఘటనల పుర్వాపరాలను క్రోడించి 300 పైచిలుకు కథలు రాసిన కథకులలో ఒకరుగా నిలిచారు.

1.5. స్వీయ వ్యక్తిత్వం:-

బలివాడ కాంతారావుగారు అభిప్రాయంలో - "ఎందరో రచయితల ఊహల్ని పంచుకోవడం వల్ల రచయిత ఎదుగుతాడు. ఏదో ఒక ఆదర్శం వెంట నడవనిదే రచయిత మనగలగలేదు. ముందు తరాలు మన కథలు చదవాలి. ఈ తరం నాడిని వైద్యునిలాగా పరీక్షించగలగాలి". మరో ఫ్రెంచి రచయిత విక్టర్ హ్యూగోని జ్ఞప్తికి తెచ్చుకుంటూ 'తన తరం కోసమే రచయిత రాస్తే నేను నా కలాన్ని విరిచి పారేస్తాను' అన్నారు. అలా చెప్పడంలోని రచయితగా ఉండాల్సిన ఔచిత్యం, నిబద్ధత మనకు తెలుస్తుంది. బలివాడ కాంతారావుది ఉదాత్త స్వభావం, ఆ వయసులోనే కనపడే అణుకువ, నమ్రత, ఎవ్వరినైనా ఒక్కలాగనే ఆదరించడం, వారిలో కనిపించే చిన్న నవ్వే ఆ సుగుణం.

1.6. సంఘం– సంతృప్తి:-

బలివాడ కాంతారావు 1949–50 సంవత్సరాల మధ్యకాలంలో విశాఖ రచయితల సంఘం ఏర్పాటులో కొంతమంది సాహితీ మిత్రులతో ఏర్పడింది . నిరాడంబరంగా, నిష్కల్మష హృదయంతో అందరి మన్ననలు పొంది, సభ్యుడిగా చేరి ఆకట్టుకున్నారు. వార, మాస పత్రికల్లో వీరి రచనలు ముద్రించటం ఒకవైపుటీ ఆహ్వానాలు మరో వైపు. అప్పటికే పేరు సంపాదించుకున్న పాలగుమ్మి పద్మరాజుగారు లాంటి వారు బలివాడ కాంతారావు ఇంటిని వచ్చి ఆత్మీయ సంభాషణ జరిపి, తనకు సమయం వెచ్చించినందుకు జీవితంలో అదొక మరపురాని ఘడియగా భావించడం వీరి వ్యక్తిత్వానికి ఒక నిదర్శనం.

1.7. చదువు చర్చలు:-

చిన్నతనంలోనే చదువుకోసం పక్క గ్రామాలకు వెళ్లవలసి వచ్చింది. హైస్కూలు చదువు పూర్తిచేసిన అనంతరం విశాఖపట్నంలోని నేవల్ ఆర్మమెంట్ డిపోలో ఉద్యోగిగా చేరారు. అంచెలంచెలుగా పదోన్నతి పొంది, ఉన్నత అధికారిగా

అనేక ప్రాంతాలలో పనిచేసి అపారమైన అనుభవం సంపాదించారు. అందుకు వారి రచనలే తార్కాణం. ఉద్యోగ రీత్యా విశాఖపట్నంలో నివసించినప్పుడు ఉదయం ఆరింటికి బయలుదేరిన వ్యక్తి సాయంత్రం ఆరింటికి ఇంటికి చేరి ఎటువంటి విరామం తీసుకోకుండా సాహితీమిత్రుల కొలువులో గడిపేవారు. ఆర్.కె.బీచ్‌లో కూర్చొని గంటల కొద్దీ సాహితీ చర్చలలో మునిగేవారు.

1.8. భవిష్య దర్శనం:– తన కథల ద్వారా సంఘం కుళ్ళును తుడిచిపెట్టాలని, అట్టడుగు వర్గాల జీవితాల్ని సరిదిద్దాలని తపన వీరి వ్యక్తిత్వానికి మెరుగులు. ఆ నేపథ్యంలో రచించిన కథ 'వదిన' చదివిన వారి కళ్లు కరిగి కన్నీళ్ళుగా మారిపోతాయ్.

1.9. బహుముఖ ప్రజ్ఞ – వారసత్వం:– 'మత్స్యగంధి' నవలను వీరి కుమార్తె ఆంగ్లంలోకి అనువదించారు. ఇలా కవితా వారసత్వాన్ని అంది పుచ్చు కోవడం కొసమెరుపు. సాహిత్యాన్ని ఒక చేత్తో, మరో చేత్తో 'జ్యోతిషం' 'హస్త సాముద్రికం' లో కూడా పటిష్టమైన అవగాహన ఇతని సవ్యసాచిగా నిరూపిస్తాయ్.

1.9.1. అవార్డులు– అనువాదాలు:– వీరి నవల 'పుణ్యభూమి'కి సాహిత్య పురస్కారం లభించింది. నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా వారు 'దగాపడిన తమ్ముడు' నవలను అనేక భారతీయ భాషల్లోకి అనువదించారు. 1998లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు. 'ఇదే నరకం – ఇదే స్వర్గం' హిందీ, ఆంగ్ల భాషల్లోకి అనువాదం జరిగి అందరి ప్రశంసలు పొందింది. 'సంపంగి' నవల అటు కన్నడం, ఇటు హిందీలోకి తర్జుమా జరిగింది. 'అడవి మనిషి' ఆకాశవాణిలో ప్రసారం చేసినా, కావిడికుండలు, అంతరాత్మ, ఢిల్లీ మజిలీలు, బలివాడ కాంతారావు కథలూ వచ్చాయి. 'శోధన', 'గోపురం' కథలకు భారతీయ జ్ఞానపీఠ్, న్యూఢిల్లీవారు 'ఎలీలీషికేష్ కా పత్తర్' అనే సంకలనంలో (హిందీ)కి తీసుకున్నారు. 'మన్ను తిన్న మనిషి' కన్నడంలోకి 'కొత్తనీరు'గా అనువాదం పొందింది. "దేవుళ్ల దేశం", "మదనిక" కూడా కన్నడంలోకి వెళ్లాయి.

1.10. సిక్కోలు సిరి:–

ఒకమారు వారు రాసిన 'గోడమీద బొమ్మ' వరుసగా కొన్ని రోజులు మిత్రులకు చదివి వినిపించి లోటుపాట్లు సరిదిద్దుకున్నారు. కళింగాంధ్ర జనం గుండె చప్పుళ్ళను కైవసం చేసుకున్నారు. వీరు వందకుపైగా చిన్నా పెద్ద నవలలు, దాదాపు ఐదు వందలకుపైగా కథలు, కొన్ని నాటకాలు, వ్యాసాలు రాస్తూ నిరంతర సాహితీ వ్యాసంగంలో తలమునకలయ్యేవారు. ఐదేళ్లపాటు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యులుగా వ్యవహరించారు. ఇలా సిక్కోలుకు కథా సిరిలో ఒకరిగా భావించవచ్చు.

1.11. హితం:–సాహిత్యానికి ఉన్న ప్రయోజనాలను జాగ్రత్తగా ఆయా కథల్లో అమరికగా చెప్పడం కాంతారావు ప్రత్యేకతల్లో ఒకటి.

1.11.1. భాస్కరాచార్య, గార్గేయ, పరాశర జ్యోతిషం చెబుతాడు. అతని దగ్గరి శిష్యరికం కోసం చాలా మంది విద్యార్థులు చేరుతారు. భాస్కరాచార్య ఎలక్ట్రాన్ ఇంజనీరు. చంద్ర మామ దగ్గరికి నన్ను తీసుకువెళ్ళు అని ఏడిచే వాడట. ఇది ఒక ఆలోచనకు బీజం. గార్గేయ ప్రేవేట్ డిటెక్టివ్. జ్యోతిష శాస్త్రంలో దొరికిన ఆధారాలను కూడా సమన్వయం చేసి అన్వేషించడానికట. పైగా గార్గేయ విదేశాలలో చాలా మంది "అమెరికాలో జ్యోతిషులకు లైసెన్సు ఉండేదట" అనడం గుర్తించదగినది. పరాశర ఆరు భాషలు నేర్చుకున్నాడు. పైగా జ్యోతిషం నేర్చుకొని దాని అంతుచూడాలనే పట్టుదల ఉన్నవాడు. ఇలా అందరు శిష్యులై ఎలాంటి ఆపేక్షా లేకుండా జ్యోతిష జ్ఞానం మనవసేవకు ఉపయోగిద్దాం అనడం వీరిలో ఉండే లోకోపకార శక్తి, సాహిత్యం చేసే హితం రెండిటినీ గుర్తుకు తెస్తున్నాయ్.

1.11.2. ఇబ్బందులలో ఉన్న వారి దగ్గర నుంచి డబ్బు తీసుకోకూడదు అనడం శాస్త్రం మీద ఉండాల్సిన నిబద్ధతను తెలుపుతుంది. కృత్తికా నక్షత్రంలో మంచి రూపు, తిండి, గౌరవ మర్యాదలు ఉంటాయ్. ఇలా నక్షత్రాలకు సంబంధించిన ప్రాథమిక సమాచారం, అవగాహన కలగేలా చేయడం కథలో అంతరాగ్గంగా మేషం నుంచి మీనం వరకు అనిపిస్తుంది.

1.12. కథానికలో వస్తు తత్త్వం:–

"రక్త స్పర్శ" కథానిక ఒక కుటుంబ జీవితపు లోతుల్ని పాఠకుడికి చూపిస్తుంది. త్రాగుబోతు భర్త, సుగుణవంతురాలైన భార్య కోపగించుకునే మామగారు (భార్య తండ్రి) వీరి మధ్య జరిగిన కథ ఇది. త్రాగుబోతులు మాట్లాడే మాటలు, నిలుపుకోలేని నిస్సహాయత, త్రాగుడుకు బానిసగా ఉన్నప్పటికీ భర్త పట్ల భార్య చూపిన ప్రేమకు పరాకాష్ట ఈ కథానిక. మనిషిలోని ఉద్వేగాలను ఒడిసి పట్టుకొని ఆలోచింపజేయడం, అసహాయత, ప్రేమ ఉన్నా దాన్ని సక్రమంగా మలచుకోని, అంతరంగంలో బాధపడే భర్త, అభిమానించే భార్యతో పయనించిన సంసార సాగరం. రెండు వైపులా ఆలోచించి ఒక సక్రమ స్థితి వైపు జీవితాన్ని మలచుకోవాలి అనే సందేశాన్ని ఇవ్వడం ఈ కథలో లోతైన అనుశీలన, అంతర్లయ కూడా.

కాంతాన్ని వర్ణిస్తూ "కాంతం మాట్లాడదు. గంభీరమైన ముఖ

కాంతిలో జాలికూడా మిళితమైంది. చిత్తస్థైర్యంలో పురుషునకు స్త్రీ తీసిపోదు. స్త్రీది సాధారణంగా జాలి గుండె అవటం వల్ల వేగంగా కళ్ళలో నీరు తిప్పివేయగలదు". ఇది స్త్రీల హృదయం. ఇలాంటి స్త్రీకి త్రాగుబోతు భర్త. ఇది పాఠకుడికి కన్నీరు పెట్టించక మానదు. "రామావధాన్లు రామాయణం చదువుతున్నాడు" అంటూ ప్రారంభమైన కథానిక రక్త స్పర్శ. ఇక్కడ రామాయణానికి, రక్త స్పర్శకు ఉన్న సంబంధం ఏమిటో తెలియక పాఠకుడి ఉత్కంఠ మొదలు అవుతుంది. ఒక మనిషి మానవత్వం కలిగి ఉన్న తీరు అరిషడ్వర్గాలు కలబోతగా ఉన్న తీరు, రామావధాన్ల ప్రథమకోపంతో మనకు తెలుస్తుంది. ఇతని అల్లుడు వెంకట్రావు. సహజంగా మంచి వాడే, కాస్త త్రాగుడు. ఆ గుర్రం ఎక్కినప్పుడు ఏం చేస్తాడో అతడికే తెలియదు. ఓర్పుకు మారు పేరు కాంత. సాక్షాత్తు రామావధాన్ల కుమార్తె.

ఇంట రామాయణం మొదలైంది. తిట్ల పర్వం ఎత్తాడు రామావధాన్లు. 'మీతో తిట్టించు కోడానికి రాలేదు. మీ అమ్మాయి వ్రాసిన ఉత్తరం చూసి వచ్చాను'. అనడంతో రామావధాన్ల నోట మాట రాలేదు. విషయం తెలుసుకొని ఆ వెధవకు ఎందుకు ఉత్తరాలు వ్రాసేవే? నా కడుపును కాల్చావే. నా పరువు ప్రతిష్ఠను గంగలో కలిపావే.... అంటూ ఇక ... వీధిగుమ్మంలో వీరంగం వేశాడు. ఇవన్నీ ఒక వైపు, "ఒళ్ళు హూనం చేసిన వాడిని ఆదరిస్తున్నావే? పిచ్చి దానవే?" అంటూ వెంకట్రావు అనడం ఇలాంటి మాటలెన్నో....

ఇలా కాంతం భర్త వెంకట్రావ్ దొంగతనం చేసి జైలు వెళ్తే భార్య సుఖంగా ఉంటుంది అనుకోవడం అతడు రాసిన ఉత్తరం కంట తడిని పెడుతూనే వ్యసనానికి బానిస అయిన వాడి స్థితిని తెలుపుతుంది. మాటాడితే పిచ్చి దానా అని సంబోధించే వెంకట్రావ్ పిచ్చిదాన్ని చూడలేకపోయాడు... ఇలా కథలో ఉత్తమ ఇల్లాలు, త్రాగుడుకు బానిసైన భర్త స్థితులను చూపిస్తూ వ్యసనాల జోలికి పోకూదని హెచ్చరించడం ధ్వని.

1.13. బలివాడ పోలికలు సూక్తులు:-

ఉక్తి అంటే మాట అని సూక్తి అంటే మంచి మాట అని అర్థం. బలివాడ వారు తమ రచనలలో వాడే పోలికలు కథాగమనంలో ఒక్కొకసారి వెనుదిరిగి చదివించేలా చేస్తుంది. కొన్ని -

1. 14.1. "నేను సివంగిని, నువ్వు నక్క వన్నట్లు"('నైజర్ తేనె' కథ) దీని సందర్భం చూస్తే- పర్బంతి అందం ఈ కథకుడిని ఆకర్షించింది. నాగరితా ప్రపంచం లేనప్పుడు చెప్పిన ఉపమానం ఇది. పర్బతి నక్కతో పోల్చాడు. అప్పటికి ఆమె ఉత్తమ మైనది. కాని భవిష్య దర్శనం నిజంగా ఆమె స్వభావం అలా అవడం కల్తీ తనాన్ని గిరిజనులపై దాడి చేయడాన్ని సూచింపజేస్తున్నది.

1.14.2. "పేరుకి గంగా భవాని, తాగబోతే నీటి చుక్క లేదని" పేరు చెప్పమని అడిగితే ఇలా మాట్లాడాడు. "నువ్వు పెట్టిన నమస్కారం వాళ్ళు అందుకోలేరు".(ప్రతీక్ష కథ)ఇద్దరూ చనిపోయారు అనే సందర్భాన్నీ చెప్పవలసిన సమయంలో ఈ విధంగా చెప్పించారు రచయిత. కథల్లో ఉండే కాస్త సాగసు, భావనాపటిమ, గొప్ప పద్ధతిని వాడుకున్నట్లు అనిపిస్తుంది.

1.14.3. "నాను మొగోన్ని, తుమ్మెదతో సమానం".(అంతులేని శోకం) ఇక్కడ గొడవలో ఆడదాన్ని చాల మంది మధ్యలోకి తెచ్చి నిజం చెప్పమని బలవంతం చేస్తారు. అప్పుడు ఒక వ్యక్తి వచ్చి ఈ మాటలు అంటాడు. ఆడవారిని పది మందిలోకి తెచ్చి ఇబ్బందికరంగా అడగడం సరైన విధానం కాదని, భారతంలోని ద్రౌపది సూరేణకు వచ్చేలా ఉంది.

1.14.4. "అప్పయ్య దీన్ని వీపుకు కట్టుకుంటే, అది అల్లుడ్ని కొప్పులో పెట్టుకున్న సందంగా వుంది" (అంతులేని శోకం) అత్తకి అల్లుడికి అక్రమ సంబంధం గురించిన విషయం రచ్చబండలో నిజం తేల్చమని సాక్షాత్తు మామగారే తగువు పెట్టడం. దానికి వచ్చిన వారిలో ఒకడు ఇలా అనడం. లోకులు కాకులై మానవబంధాలను ఎంత సులువుగా అనడం పట్ల రచయిత నిశితంగా విమర్శించడం ఇక్కడ చూడొచ్చు.

1.15. సింహావలోకం:- మార్మిజాన్ని మరామత్తు చేసి, తాతల నాటి కథలను తవ్విపోస్తూ, భావోద్వేగాలకు భాష్యం చెబుతూ, నిజంగా జీవితాల్లోని అన్నీ తానై కనిపిస్తారు, బలివాడ. 2000 మే 26వ తేదీన దూరమైనా బతుకు బడిలో, పాఠకుడి హృదిలో నిలిచిన కథల సిరి యితడు. మానవాజీవన పయనంలో బడి ప్రముఖ పాత్ర వహిస్తుంది. బలివాడ కథలు జీవితంలో చాలా అంశాలను ఒడిసి పట్టుకొని ఒక అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుడిగా, గుణపాఠాల వారధిగా కనిపిస్తాడు. కుంటుంబంలోని బాధల్ని అర్థం చేసుకోవడమే వాటికి తగిన పరిష్కారాలను సూచించడం వీరి ప్రత్యేకతల్లో ఒకటిగా భావించాలి. స్పందించే హృదయం కథల్ని ప్రతిభా శక్తితో నదిపిస్తూ పాఠక హృదయాల్లో స్థానాన్ని పొంది వాడ వాడల గాథల్ని ఒకబాట పట్టించిన బరువైన కథక బాటసారి బలివాడ.


ఆధారాలు: - 'కళింగాంధ్ర కథల వారధి బలివాడ'(వ్యాసం)- అడపా రామకృష్ణ:
ఆంధ్రభూమి ఆదివారం, 26 జూన్, 2016 పంచతంత్ర కథలు, బలివాడ కాంతారావు "కథాకలశం"
సంపాదకులు: పి. రాజేశ్వర రావు
బలివాడ కాంతారావు కథలు

# జానపదుల జీవన విధానం -పరివర్తన

శేషారావు...
ఎం.ఎస్.సి, ఎం.ఏ, పి హెచ్...
చరవాణి : 917396275...
ఈమెయిల్ : mantrisrinu@gmail.co...

ఉపోద్ఘాతము : జానపదం అనే మాట జనపదం అనే నుండి ఉద్భవించింది జనపదం అంటే గ్రామం లేదా పల్లె .పల్లెటూరు లో ప్రజలు : ఆ జీవన విధానంలో విశ్వాసాలు, ఆచారాలు పండుగలు వృత్తులు వంటివి మిళితమై వారికంటూ ఒక ప్రత్యేకమైన జీవనవిధానం సంస్కృతి ఏర్పడ్డాయి కాలానుగుణంగా వారి జీవన విధానంలో వచ్చిన ,మార్పులు పరిణామ క్రమం గూర్చి క్రింద చూద్దాం .

వివరణాత్మకంగా : గ్రామీణులు నివసించే ప్రతాన్ని జనపదం అని పిలిచే వారు జానపదంలో నివసించే వారిని జానపదులు అంటారు జానపద విజ్ఞానాన్ని ఫోక్లోర్ అని వ్యవహరిస్తారు నిరక్షరాశ్యులైన కర్షకులు వారి జీవన ప్రస్థానంలో పాటించే విలువలు సంప్రదాయాలు వృత్తులు జీవనోపాధికి చేసే వ్యవసాయం మొదలైనవి కలిసి వారి జీవనం ఒకరిపై ఒకరు ఆధారపడుతూ శ్రమైకజీవన సౌందర్యాన్ని పల్లెల్లో ఆవిర్భవింపచేశారు .

జానపదులు వారి జీవన విధానం :

జానపదులు పల్లె సంస్కృతిలో భాగమై నిరక్షరాశ్యులు అధికంగా ఉంటారు వీరు ప్రచ్చేనా కలం నుండే కులవృత్తులుగా సమాజాన్ని సహకారంకోసం విభజించుకుని సహకార దృక్పథంతో జీవించేవారు ఆ విభజనలో భాగంగానే ఆయా వృత్తులలో నిష్ణాతత ఏర్పడి వైభిన్నతతో కూడిన జీవనవిధానం ఏర్పడింది .

జానపదుల జీవనం -కులవృత్తులు :

జానపదుల సంఘజీవనంలో కులవృత్తులుగా విభజింపబడ్డాక ఆయా వృత్తులకు సంబందించిన సాహిత్యాన్ని సృష్టించారు అటువుగా పాటలు పాడుతూ వృత్తిపనులు చేస్తూ వృత్తికి సంబంధించిన సాహిత్యాన్ని సృష్టించారు

ఉదా: అదేనే ఎద్దు దుక్కీల వన్నావ్
నన్నేమి అంటావు జీతగాడినడుగు
ఏమిరా జీతగా అరకలేందుకుకట్టలే
నన్నేమి అంటావ్ వడ్లోడు నాగలి చెక్కలే. అంటూ

ఒకరిపై ఒకరు పాడుకుంటూ వృత్తిసాహిత్యాన్ని పరిపుష్టం చేశారు.

కులవృత్తులవారిని ఆశ్రయించి ఆశ్రీతకులాలవారు బుర్రకథ పులివేషాలు గరగనృత్యాలు డప్పు ఒగ్గుకథ బుట్టబొమ్మలు ... కళలను ప్రదర్శించేవారు . బుడిగెజంగాలు శారద... .బాలసంతులు,భాగవతుఉలు ఒగ్గులు పిచ్చుక కుం... వీరముష్టివారు, బవనీలు ముఖ్యంగా ఆశ్రీతులై జాన... కళలను ప్రదర్శిసిస్తారు .

సంఘజీవనంలో సహకార సమాజం :

అందరు ఒకే వృత్తి చేస్తే సమాజం అభివృద్ధి చెందదు కా... ఒకరికోసం ఒకరు పాటుపడుతూ జీవిస్తే సమాజం ఫలవం... నిలిచి పరిణితి చెందుతుంది .

వ్యవసాయప్రధానమైన దేశపు సమాజం గల మన గ్రామా... జానపదులు వ్యవసాయాన్ని చేస్తూ వ్యవసాయ అనుబం... వృత్తులుగా ఏర్పడి వృద్దివైపు సాగింది .

ఇలా వచ్చిన జానపదుల జీవనంలో సాహిత్యం పలు రకా... కనబడుతుంది.

1 గేయవ్మాయం
2 వీరగాథ వ్మాయం
3 స్త్రీల పాటలు
4 బాలబాలికల పాటలు
5 గద్య రూపాత్మకలు
6 సామెతలు
7 పొడుపుకథలు
8 ఇతిహాసాలు
9 వ్రతాలు నోములు
10 జానపద కథలు
11 పురాణాలూ వంటి వాటిగా జానపద సాహిత్యం జానపదు... జీవనంలో పరిణామక్రమానికి అభివృద్ధిలో పరివర్తన... తనవంతు సమయం చేసింది.

జానపద వ్మాయోద్ధారకుడిగా శ్రీ నేదును... గంగాధరం గారిని పిలుస్తారు .బిరుదురాజు రామరాజు ,... వి ఎస్ సుందరం, జి ఎస్ మోహన్, తంగిరాల వెంక... సుబ్బారావు, తూమాటి దొన్నప్ప, నాయని కృష్ణకుమా... శ్రీపాదకృష్ణ మూర్తి, దేవేంద్రసత్యార్థి వంటివారు జానప... సాహిత్యాన్ని వెలికితీసి ప్రపంచవ్యాప్తం చేసారు.

జానపదజీవన పరివర్తనంలో కళలు :

జానపద జీవనంలో జానపదుల జీవితాలు వృద్ధి చెంది నే...

అభివృద్ధి చెందిన సమాజానికి అనుగుణంగా ఎదుగింపచేయడంలో కళల పాత్ర అమోఘమైనది .అర్థికళలు వీధి భాగవతాలు వీవీధి భాగవతులు ఆంధ్రదేశ ప్రాంతాల్లో ఉంటారు వీరు ప్రాచీన పౌరాణిక ఘట్టాలను ప్రదర్శిస్తారు అంతేకాకుండా సాంఘిక నాటకాలను కూడా ప్రదర్శించి సమాజాన్ని మేల్కొలుపుతున్నారు .

శారదకాండ్రు వీ శారదకాండ్రు ఎక్కువగా తెలంగాణ ప్రాంతాల్లో కనబడుతారు వీరు శారదా అనే వాయిద్యాన్ని వాయిస్తూ వంశవృక్షాక్రమాన్ని ఆలపిస్తారు .నేడు వీరు సమాజాన్ని మేల్కొలిపే ప్రభుత్వ పథకలగూర్చికూడా పది జనాలని మేల్కొల్పుతున్నారు. వీరు రాత్రి వేళల్లో కథలను గానం చేసేవారు నేడు వీరు కనుమరుగైపోతున్నారు .

వీరముష్టివారు :

వీరు వీరభట , భద్రపాదఅనే పేర్లు గల్గి జేగంట తప్పెట వాయిస్తూ కతలు చెప్తారు .

బుడిగె జంగాలు :

వీరు భాగోతాలను పడుతూ నేటి సమాజానికి మానవవిలువల ప్రాముఖ్యతను తెలుపుతూ భాగోతాలను సమాజానికి అన్వయిస్తారు.

జానపదులు -నాటకాలు వీజానపద జీవనాభివృద్ధిలో నాటకాలు ప్రధాన పాత్ర పోషించాయి .

బయలాట అనంతపురం జిల్లాలో ఆడుతారు వీరు ఎక్కువగా హిందూపురం పెనుగొండ కల్యాణదుర్గం ప్రాంతాల్లో కనబడతారు.

కనకతారాజి

లవకుశ

వాలిసుగ్రీవ

వీరాభిమన్యు

వంటి నాటకాలు పల్లెల్లో ప్రదర్శిస్తారు .

శ్రమైకజీవనం -ఆటపాటలు శ్రామిక జీవనంలో ఆట పాట అనాదిగా ఉన్నాయి. జాజర పాటలు నాచన సోమన వసంత విలాసంలో కనబడతాయి జాజర పాటలు నేటికీ తెలంగాణాలో కనబడతాయి, వెన్నెలగుడిపాటాలు కొవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో కనబడతాయి .

ఇవేకాకుండా శ్రామిక, కల్యాణ బతుకమ్మ ,కోలాటం, పీరీలపండుగపాటాలు, శృగారగేయాలు కరుణారస గేయాలు అద్భుతరసాగేయాలు, వీరరసాగేయాలు. హాస్యరసాగేయాలు . మొదలైనవి జానపదుల జీవన పరివర్తనలో అద్భుతపాత్ర పోషిస్తున్నాయి .

విమర్శ : మారుతున్నకొద్దీ ప్రపంచీకరణ నేపథ్యంలో జానపదుల జీవనం కులవృత్తులు నాశనమైపోతున్నాయి ఆశ్రిత కులాలు వలసపోతున్నాయి .

ముగింపు వీనేడు జానపదులు తమ సాంప్రదాయ వృత్తులు మానుకొని వ్యవసాయ కూలీలుగా మిగిలారు .పాశ్చాత్య పరిశ్రమల ధాటికి తట్టుకోలేకపోతున్నారు జానపద కళలు చేతివృత్తులు నశించి పోతున్నాయి, కనుక ప్రభుత్వాలు గ్రామ స్వరాజ్యాన్ని కాపాడాల్సిన అవసరమున్నది.



# స్త్రీవాద సాహిత్యం సాంస్కృతిక - పరివర్తన

వడ్కపురం కృష్ణ
ఎం.ఏ,పిహెచ్.డి.
చరవాణి:919666602670

ఉపోద్ఘాతం :
భారత దేశం సనాతనంగా మాతృస్వామిక దేశం తల్లికి చెల్లికి భార్యకు వదినకు అత్తకు గొప్ప ప్రాధాన్యం ఇచ్చి అత్యున్నత స్థాయి లో స్త్రీ ని ఉంచింది.
యత్ర నార్యన్తు పూజ్యతే రమంతే తత్ర దేవతః అని ఆర్యోక్తి గలదు. స్త్రీ సృష్టికి మూలం స్త్రీ లేనిదే ప్రపంచం లేదు. కావున స్త్రీ కి ఉన్నత స్థానం ఇచ్చి గౌరవించాయి మన కావ్యాలు. మైత్రి, గార్గేయి, అనసూయ , అహల్య , అరుంధతి లోపాముద్ర వంటి విధూషి మణులు నాడు తమ ప్రతిభతో చిరస్థాయి ని సంపాదించుకున్నారు కానీ కాలక్రమంలో స్త్రీ జీవితంలో చాల మార్పులు సంభవించాయి. తుదకు స్త్రి లోను సామ్యవాద భావన రాజుకుని సమానత్వం కోసం తన హక్కుల కోసం స్వేఛ్ఛకోసం నినదించుటకు స్త్రీ సాహిత్యాన్ని ఆశ్రయించింది అదే నేడు స్త్రీ వాద సాహిత్యంగా పరిఢవిల్లి సమాజాన్ని, ప్రభావితం చేసాయి.
సవివరంగాబీ
కార్యేషు దాసి
కరణేషు మంత్రి
భోజేషు మాత అంటూ స్త్రీ ని పురుషుని జీవితంలో సతసహచారిగా ఉంచినా ఈ భావన ఏనాడు స్త్రీ జీవితంలో కనిపించలేదు. వేద కాలంలో ముఖ్యంగా యజుర్వేద కాలం నాటికి స్త్రీ వంటింటికే పరిమితమై విద్యకు సంఘానికి దూరమై ఒక బానిస బ్రతుకు అనుభవించింది.
18 శతాబ్దపు కాలం స్త్రీ జీవితంలో పరివర్తనం :
సతి సంప్రదాయం పేరిట స్త్రీ ని పురుషుని తో పాటుగా చితి పై దహనమయ్యే దురాచారాన్ని రూపుమాపాలని రాజారామ్మోహనరాయి బ్రహ్మ సమాజాన్ని స్థాపించి సతి దురాచారాన్ని నిలువరించారు.జ్యోతి రావు పూలే తన భార్య సావిత్రి బాయ్ పూలే కి చదువు నేర్పి అనేక మంది స్త్రీలకు చదువుకునే అవకాశాన్ని నాటి సమాజాన్ని ధిక్కరించి ప్రోత్సహించారు. కందుకూరి వేయిరేశలింగం పంతులు తన భార్య రాజ్యాలక్ష్మి పేరిట స్త్రీల కోసం పాఠశాలను ఏర్పాటు చేశారు .బాల్య వివాహాలను నిరసిస్తూ స్త్రీ పునర్వివాహం ,సభానాటకం వంటి సాంఘీక రూపకాలు రచించారు 1980 లో వితంతు వివాహ సంఘం స్థాపించారు .

తెలుగులో స్త్రీవాద కవిత్వం నేపథ్యం :
తెలుగులో స్త్రీవాద కవిత్వం 1970 వ దశకంలో ప్రారంభమై సామాజిక ఉద్యమంగా 200 సంవత్సరాలు దాటింది దీన్ని పురస్కరించుకొని %బఅశీ% 1975 -1985 మధ్యకాలాన్ని అంతర్జాతీయ మహిళా శతాబ్దాన్గా ప్రకటించింది .స్త్రీవాద కవిత్వం 1972 లో వోల్గా రాసిన ప్రతిస్త్రీ ఒక నిర్మల కావాలి అన్న కవిత తో తెలుగులో ప్రారంభమైంది.అస్మిత అనీ సంస్థద్వారా వెలువడుతున్న స్త్రీవాద మాస పత్రిక భూమిక.
స్త్రీ ఒక సిరి
స్త్రీ ఒక జరి'
స్త్రీ ఒక సృష్టి .
స్త్రీవాదకవిత్వంపరివర్తనకుగలకారణాలు :
కన్యాశుల్కం ,బాల్యవిహవాహల కాలం దాటి నేటి వరాశుల్కం కాలములో స్త్రీ గృహపరంగా, సమాజపరంగా ,ఏంటో పీడన ,వివక్షను ఎదుర్కొంటున్నది .వరాశుల్కం లేనిదే పెళ్లి జరగసాదం కష్టంగా ఉన్నదై నేటి సమాజంలో. పురుషులు గాని,కుటుంబాలు గాని,మానవత్వ సంబంధాల వృద్ధికి స్త్రీ ని గుర్తించడం లేదు స్త్రీ పురుషులు అప్పుడు కదా సృష్టి అనే అంశాన్ని పక్కకు నెట్టి స్త్రీ ని వరాశులకమనే పాషాణానికి బలిచేశారు కుటుంబాలు కూడా దేన్నీ ప్రతిష్టగా భావిస్తున్నాయి .తీరని కట్నదాహామ్ బలవన్మరణాలకు కారణమవుతోంది .బ్రూణహత్యలు ,ఆడపిల్ల అంటేనే తక్కువ దృష్టి ఏర్పరుచుకొని చిన్నచూపు చూసే సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని స్త్రీవాద సాహిత్యం ఆరంభమైనది స్త్రీవాద సాహిత్యం -రచనలు : రేవతీదేవి శిలలోలోలిత ,మూగబోయిన గొంతు ,అనే కవితలతో సమాజాన్నిప్రశ్నించింది
ఓల్గా :
స్వేఛ్ఛ
మానవి
ఆకాశంలో సగం
మెహేందిస్త్రీల విజ్ఞప్తి
ప్రతిస్త్రీఒకనిర్మలాకావాలి
జయప్రభ : పైటను తగలెయ్యాలి
వామనుడి మూడవపాదం
యశోధర వగపెందుకే

ఇక్కడకురిశినవర్షంఎక్కడిమేఘానిదో
ఘంటశాల నిర్మల :
ఏ కాల్ గర్ల్స్ మోనోలోగ్
నిర్వచనం
జుగల్బందీ పాటిబండ్ల రజని :
అబార్షన్ స్టేట్మెంట్
సర్వస్థానం
ఎర్రజాబిళ్ళఎరిన
కొండెపుడినిర్మల : సందిగ్ధసంధ్య
నడిచేగాయాలు
లేబర్ రూమ్....వంటి రచనలు స్త్రీలపై జరుగుతున్నా అరాచకాలకు గొడ్డలిపెట్టులాంటి ఆయుధాలై నిరసన తెలిపాయి. నేటి కాలంలో స్త్రీవాద రచనల ఆవశ్యకత బీ నేడు స్త్రీలపై రోజు రోజు కి అఘ్లదాడులు అత్యాచారాలు వరకట్న వేధింపులు ఆడపిల్లల అమ్మకం వంటి అసాంఘిక చర్యల నేపథ్యంలో స్త్రీవాద సాహిత్యం పుడుగులాంటిరచనలను గుప్పించాలిసిన ఆవశ్యకతనున్నది అట్లే ప్రభుత్వాలు కూడా స్త్రీవాద సాహిత్యానికి వెన్నుదన్నుగా నిలవాల్సిన సమయం ఆసన్నమైనది.

విమర్శ బీనేటికాలంలో వరకట్న దురాచారం చట్టం కళ్ళుగప్పి అరాచకం చేస్తోంది ఇట్టి దురాచారాన్ని సమూలంగా నాశనం చేయాలి బాల్యవివాహాలు నశించి ,అరాచకాలు నశించేలా ప్రభుత్వాలు బాధ్యత తీసుకోవాలి.

ముగింపు :

స్త్రీ ప్రపంచానికి మూలం అట్టి స్త్రీపై జరిగే అరాచకాలకు అడ్డుకట్టవేసి స్త్రీస్వేఛో స్వాతంత్ర్యాన్ని కాపాడిల్సిన బాధ్యత ప్రతి పౌరుడు తన సొంత బాధ్యతగా తీసుకోవాలి సర్కారు ప్రత్యేకచట్టాలు చేయాలి .మళ్లి మాత ృస్వామ్య సమాజం స్థాపితమవ్వాలి.

వడ్లకపురం కృష్ణ
ఎం.ఏ,పిహెచ్,డి.
చరవాణి : 919666602670

# కృత్రిమప్రేమ, కుళ్ళినరాజకీయాల మధ్య మానవుడు - "మాట్లాడే బొమ్మలు"

ఎమ్. రమా...
తెలుగు ఉపన్యాసకురాలు
రాజీవ్ గాంధీ సాంకేతిక వైజ్ఞానిక విశ్వవిద్యాలయం
బాసర, ఆదిలాబాద్ జిల్లా

పరిచయం:-

తెలంగాణాకు చెందిన ప్రసిద్ధ సాహితీవేత్త డా. కాలువ మల్లయ్య. ఈయన కలం నుండి ఇప్పటివరకు 875 కథలు, 16 నవలలు, 600 వ్యాసాలు, 200 కవితలు వెలువడ్డాయి. తెలంగాణ ప్రాంతీయ స్పృహ వీరి సొంతం. తెలంగాణ భూస్వామ్య వ్యవస్థ నుంచి ఇప్పటివరకు ఉన్న స్త్రీల జీవితాల్లోని సమస్యలే వీరి కవితాశిల్పాలు.
వీరి నవలల్లో 'మాట్లాడే బొమ్మలు'. ఈ నవల్లో తెలంగాణ ప్రాంతంలో ఎమర్జెన్సీ రోజులు(1975) మొదలు, 20వ శతాబ్ది చివరిదాకా నెలకొని ఉన్న పరిస్థితులను చిత్రించారు.

ఇతివృత్తం:-

కరీంనగర్ జిల్లాలోని ఓ గ్రామంలో జీవించిన రెండు కుటుంబాల కథే ఈ నవలలోని వస్తువు. ఐలయ్య, శాంతమ్మ దంపతులు. ఐలయ్య చిన్న రైతు. అతని చెల్లెలు సరస్వతిని అదే ఊరికి చెందిన సాంబయ్యకిచ్చి పెళ్ళి చేస్తాడు. కట్నం లేకుండ వివాహం చేసుకుంటాడు. సాంబయ్య డిగ్రీ, బీ.ఎడ్ పూర్తి చేసి , సమాజానికి ఏదో విధంగా సేవ చేయాలనే ఉద్దేశంతో టీచర్ గా పనిచేస్తుంటాడు. కానీ ఏవేవో పోకడలు పోయే, స్వాప్నిక ప్రపంచంలో జీవించే సహచరి సరస్వతి ఒత్తిడి వల్ల తర్వాత ఎరువుల ఫ్యాక్టరీలో ఉద్యోగిగా మారతాడు. ఐలయ్యకు ఒక కొడుకు శ్రీనివాస్, ఇద్దరు కూతుళ్ళు. సాంబయ్య పిల్లలు ఆనంద్, కవితలు. ఐలయ్య, సాంబయ్యలు తమ పిల్లలను, ఎన్నో కష్టాలకోర్చి చదివిస్తారు.

సాంబయ్య తాను కాలేజీ రోజుల్లో చూసిన, పాక్షికంగా పాల్గొన్న అభ్యుదయ ఉద్యమాల భావాలకు, వాటి ఆచరణలో ఇమిడిపోదామని చేసే ప్రయత్నంలో, మనిషి స్థానంలో అమానవీయత ప్రవేశించిన సమకాలీన సామాజిక పరిస్థితులకు మధ్య నలిగిపోతాడు. సాంబయ్య ఐలయ్య, బావ మరుదులిద్దరు తమ పిల్లల పాఠ్యపుస్తకాల్లోని విషయాలు, జీవితాన్ని ఎలా జీవించాలో బోధించేవిగా అనిపించక మనోవేదన పడుతుంటారు. కాలం గడుస్తున్నకొద్దీ సమాజంలో వస్తున్న మార్పులు వారిని మరింత కృంగదీస్తాయి.

నమ్మిన విలువల ప్రకారం పిల్లల్ని చదివిద్దామని, మాతృభాషలోనే విద్యాబోధన చేయిద్దామని తపించిన సాంబయ్య ఆశల్ని సమకాలీన సమాజం భంగం చేయడం వల్ల రాజీపడతాడు. కొడుకును ఐ.ఏ.ఎస్ కోసం ఢిల్లీలో కోచింగ్ కి పంపుతాడు. కూతూరు ఎం.బీ.బీ.ఎస్ చదువుతుంటుంది. ఐలయ్య కొడుకు బ్యాంకు ఆఫీసరై, విశాఖపట్నంలో ఉద్యోగం చేస్తూ, అక్కడే పరిచయమైన మానసను తల్లిదండ్రులకు చెప్పకుండానే పెళ్ళి చేసుకుంటాడు. వయసు పైబడిన సాంబయ్య, ఐలయ్యలు చదువులు, ఉద్యోగాలు, తరాల మధ్య సృష్టిస్తున్న అంతరాలు చూసి చలించిపోతారు. తానూ తన సహచరి పెళ్ళి అయిన తర్వాత మొదటిసారి కలిసి ఇంటికి వస్తున్నామని తండ్రికి ఉత్తరం రాస్తాడు. తాను వస్తానన్న రోజు కరీంనగర్ బస్టాండుకు తన బావ సాంబయ్యను తీసుకొని వచ్చి ఇద్దరు చాలాసేపు ఎదురు చూస్తారు. కానీ శ్రీనివాస్ ఎంతకూ రాడు. ఇంటిదగ్గర అందరు ఎదురు చూస్తుంటారు. గతకాలాన్ని స్మరించుకుంటూ సాంబయ్య, కొడుకు కోసం ఎదురు చూసే కళ్ళతో ఐలయ్యలు ఉంటారు. అంతటితో నవల ముగుస్తుంది

నవల నామౌచిత్యం:-

ఈ నవలకు "మాట్లాడే బొమ్మలు" అని పేరు పెట్టడంలో ఔచిత్యం కనిపిస్తుంది. మానవీయ విలువలు మాయమైపోయి కృత్రిమ మానవ సంబంధాలు ఏర్పడిన కాలంలో మనుషులు కేవలం జవజీవాలు లేని బొమ్మలైపోతారని, సంభాషణ బొమ్మలు చేసేది తప్ప మనుషులు చేసేది కాదని చెప్పడం ఒక ఉద్దేశం. బొమ్మలకు ఆలోచించే శక్తి ఉండదు. ఎవరైన కదిలిస్తే కదులుతాయి, కింద పడేస్తే పడిపోతాయి.. నిలబెడ్తే నిలబడతాయి. ఎక్కడ పెడితే అక్కడ ఉంటాయి. అంటే మనుషులు వాటిని నియంత్రిస్తుంటారు. ఈ నవలలోని మనుషులను బొమ్మలుగా ఉపమించడంలో ఆంతర్యం ఆనాటి సామాజిక పరిస్థితులే ఆయా పాత్రలను నియత్రించాయని, నడిపించాయని చెప్పడం మనుషుల ఉ

ద్దేశ్యపూర్వక కార్యకలాపాలకు స్థానం లేకుండా పోయిందని తెలియజేయడం మరొక ఉద్దేశ్యం.

ఈ నవలలో ప్రధానంగా 'చదువు' అనే విషయాన్ని చర్చించినప్పటికి ఆ 'చదువు'ను ప్రేరేపించగల, నిర్దేశించగల సామాజిక పరిస్థితులను గూర్చి వివిధ కోణాల్లో విశ్లేషించడం కనిపిస్తుంది.

మాతృభాషలో విద్యాబోధన :-

సాంబయ్యకు తను చదివే రోజుల ఆదర్శాలు వాసనారూపంలో వెన్నంటే ఉంటాయి. అందుకే అతని ఆచరణలో ప్రతి విషయం ప్రయోజనం అనే చట్రంలోంచే ఆలోచిస్తాడు. పైగా స్థానిక సంస్కృతి మీద అతనికి ఎనలేని ప్రేమ ఉంటుంది. అందుకే తన పిల్లలకు మాతృభాషలోనే విద్య చెప్పించాలనుకుంటాడు. అలా అయితేనే పిల్లల మానసిక ఎదుగుదల సక్రమంగా ఉంటుందని భావిస్తాడు. తెలుగు పరిరక్షణకు ఇది కూడా ఒక ఆచరణాత్మక పరిష్కారమని నమ్ముతాడు. అయితే అప్పుడున్న సామాజిక పరిస్థితులు దానికి సహకరించవు. దాంతో తన సహచరి సహా, శ్రేయోభిలాషులు కూడా ఆంగ్లభాషలోనే బోధన చేయించాలని పట్టుబడతారు. దాంతో ఎంతో వేదనకు గురవుతాడు సాంబయ్య.

"తెలుగు తెలుగని, మాతృభాష మాతృభాషని చెప్పే పెద్ద పెద్ద అధికార హోదాల్లో ఉన్నవారే తమ పిల్లలను తెలుగు మీడియం పాఠశాలల్లో చదివించడంలేదు. అసలు తెలుగునే ఇంట్లో ఉండనీయడం లేదు. తెలుగు కథలు, కవిత్వం రాసేవాళ్ళ పిల్లలు కూడా తెలుగు మీడియంలో చదువుతున్నారని నేననుకోను' రాంరెడ్డి మాటలు విని సంబరపడింది సరస్వతి.

అవును చెప్పేదొకటి చేసేదొకటన్నట్టుగానే ఉంటాయి పెద్దోల్ల పనులు. నీకిష్టం లేకున్నా ఈ విషయంలో నువ్వు నీ అభిప్రాయాలతో రాజీ పడడమే మంచిదని నా ఉద్దేశ్యం అన్నాడు తిరుపతిరెడ్డి.

'బావా? పల్లెటూళ్ళ మాటెలాఉన్నా ఇక్కడ తెలుగు మీడియం చదువులంటే కొంత తక్కువగానే చూస్తున్నారనిపిస్తోంది నాకు. ఊరివాళ్ళు కూడా ఇంగ్లీషు చదువులని మోజు పడుతుంటే ఇక్కడెలా ఉంటుందో నేనూహించగలను. ఇంగ్లీషు, తెలుగు మీడియం రెండున్న బళ్ళలో తెలుగు మీడియం వాళ్ళనంతగా పట్టించుకోరు. పిల్లలు తక్కువతనంగా ఫీలయ్యే అవకాశముంది. పోగా చెల్లెమ్మను అసంతృప్తికి గురిచేస్తూ నువ్వు మాత్రం సాధించేదేముంది? ఆనంద్ ను ఇంగ్లీషు మీడియంలోనే వేయి" ఐలయ్య కూడా సరస్వతికి మద్దతుగానే మాటాడాడు. తననెవరు సమర్థించకపోవడం సాంబయ్యకు బాధాకరంగానే ఉంది" (కాలువ మల్లయ్య, మాట్లాడే బొమ్మలు పుట280, 281) ఈ సన్నివేశ కల్పన ద్వారా రచయిత సమాజానికి ఒక పెద్ద ప్రశ్ననే వేశారు. ఒక వాస్తవికతను బయటపెట్టారు.

తెలుగును కాపాడాలని గొవ్వ గొవ్వ ఉపాన్యాసాలిచ్చేవాళ్ళ పిల్లల్ని మాత్రం ఇంగ్లీషు పాఠశాలల్లోనే చదివిస్తున్నారని, వాళ్ళమాటలకు, ఆచరణకు పెద్ద అంతరం ఉందని, నిజంగా తెలుగును కాపాడుకుంటున్నది ఉపాధ్యాయులే అని తెలియజేశాడు. నిజానికి ఇక్కడ సాంబయ్యని గానీ, అతని పిల్లల్ని ఇంగ్లీషుమీడియంలో చదివించమని సలహా ఇస్తున్నవారిని ఇరువురిని తప్పుబట్టడానికి లేదు. ఎందుకంటే ఎక్కువ ఉద్యోగవకాశాలు ఏ భాషలో వస్తున్నాయో సహజంగానే ఆ భాషలోనే చదువుకుంటారు. తెలుగులో చదువుకుంటే కూడ సరిపోయేటన్ని ఉద్యోగవకాశాలు ప్రభుత్వాలు కల్పించినపుడు, ప్రత్యేకమైన భాషా పరిరక్షణ ఉద్యమాలు, ఉపన్యాసాలు లేకుండానే ప్రజానీకం తమ పిల్లల్ని తెలుగు మాధ్యమంలోనే చదివిస్తారు.

మానవీయ విలువలు:- సాంబయ్య సహచరి సరస్వతి వారి పిల్లల్ని ఆంగ్లమాధ్యమంలో చదివించాలని పట్టుబట్టి మాట్లాడిన మాటల్లోనూ, ఐలయ్య కొడుకు శ్రీనవాస్ సహచరి వారి పెళ్ళి సందరరేలో పెట్టిన షరతులలోనూ, శ్రీనివాస్ ఆలోచనలలోనూ, ఆ తరువాత ఐలయ్య శ్రీనవాస్ గురించి ఎదురుచూస్తూ కరీంనగర్ బస్టాండ్ లో ఎదురుచూస్తూ ఉన్నప్పుడు ఆయన బావ సాంబయ్యతో జరిపిన సంభాషణలోనూ ఇంకా చాలా సందరాల్లో మానవీయ విలువల్లో వచ్చిన యాంత్రిక పద్ధతుల గురించి చక్కగా వివరించాలి. నవలాంతంలో సాంబయ్య, ఐలయ్యతో ఇలా అంటాడు. "ఐలయ్య త్వరలో మనం ఇరవైఒకటవ శతాబ్దంలోకడుగిడబోతున్నాన్నాం. ఈ విధానమిలాగే కొనసాగితే మనముండం. మన సంస్కృతుండదు, మన భాషాసాహిత్యాలుండవు. మిగిలేవి తాత్కాలిక సుఖాలు. శూన్యం సైన్సు.... ఇంకా... ఇంకా... అవైనా ఎందరికందుబాటులో ఉంటాయి? , 'బాగా ఆలోచిస్తే ఇది శ్రీనివాస్ తప్పు మాత్రమే కాదనిపిస్తోంది. అందరిలాగే చేస్తున్నారని కాదుగాని ఈ విధానంలో ఏదో లోపముంది ఈ చదువులు పరాయికరణకి గురి చేస్తున్నాయి. మాట్లాడే బొమ్మలను తయారు చేస్తునాయయిలయ్యా. రేపు నేను నీలా

ఎదురు చూడాల్సి వస్తుందేమో" సాంబయ్య కంఠం పూడుకుపోయింది"(కాలువ మల్లయ్య, మాట్లాడే బొమ్మలు, పుట. 327).

ఈ సంభాషణ ద్వారా ఆనాడు చదువుకున్నవారిలో ఏర్పడిన నూతన విలువలి, తల్లిదండ్రులపట్ల కొత్తగా ఏర్పర్చుకున్న కృత్రిమ ప్రేమలు మనిషిని ఎలా తయారు చేశాయో తెలియజేశారు. ఎప్పుడైనా కొత్త సామాజిక వాతావరణం ఏర్పడుతున్నపుడు కొంతకాలం పాత విలువలకు, కొత్త విలువలకు మధ్య సంఘర్షణ ఉంటుంది. పాత విలువల్లో జీవించే మనుషులకు కొత్త వాతావరణం జీర?ం చేసుకోవడం చాలా కష్టంగా ఉంటుంది. ఆ పరిస్థితి కొత్త పరిస్థితులకు సమకాలీన సమాజం అలవాటు పడే వరకు కొనసాగుతుంది. అప్పటిదాకా ఈ వైరుధ్యం అలాగే కొనసాగుతుంది. అందుకే అన్ని మాటలు మాట్లాడిన 'సాంబయ్య కంఠం చివరికి పూడుకుపోయింది

జానపద క్రీడల పరాయికరణ:-

కాలువ మల్లయ్య నవలలకు గ్రామాలే పునాది. ఆ గ్రామాల్లోని అనేక విషయాలను సూక్ష్మదృష్టితో గమనించినపుడు మాత్రమే పట్టుకోగలిగే అవకాశం ఉంటుంది. రచయితకు గ్రామీణ నేపథ్యం ఉండడం వల్ల ఆ అనుభవం రచనకు ఉపయోగపడింది. గ్రామాల్లో చాలా కాలం నుంచే కొన్ని క్రీడలు సాంప్రదాయికంగా వస్తున్నాయి. అయితే ఆధునిక కాలంలో అవి కనుమరుగు కావడం, వాటి స్థానంలో ఆధునిక క్రీడలు పాగావేయడం కనిపిస్తుంది. ఈ విషయాన్ని అద్భుతంగా చిత్రించారు.

"శీనూ! ఏం చేస్తున్నావురా? అడిగాడు ఐలయ్య.
'రవీందర్ నేను గోలీలాడుకుంటున్నం'
'అది కనబడుతూనే ఉందిగానీ నీకు ఈ దిక్కుమలాటే దొరికిందా?'
'బాపూ! నువ్వు చిన్నప్పుడు బొంగరాలాట, చిర్రగోనె ఆడెటోనివని చెప్పినవు గద! ఇప్పుడా ఆటలెవ్వరాడుతలేరు'
కబడ్డో, వాలీబాలో ఆడుకోక గోలీలాడేంది ?
'కబడ్డి ఆడెటోల్లు గూడ తక్కువే బాపు. కొంతమంది వాలీబాల్ మా ఆడుతండ్రు. అది బదున్నప్పుడు ఆడేటిదేనాయె. గ్రౌండవన్నీ కావాలి గద! ఇప్పుడు చాలామంది క్రికెట్ గూడ ఆడుతున్నారు. నువ్వేమొ క్రికెట్ బ్యాటన్న, టెన్నిస్ బ్యాటన్న కొనియ్యమంటె కొనియ్యకపోతివి' దేశీయ క్రీడలైన కబడ్డీ, ఖోఖోలాంటివి పోతూ క్రమక్రమంగా గ్రామాల్లోకి క్రికెట్ లాంటి క్రీడలు వస్తుండటం గమనిస్తునాడు ఐలయ్య (కాలువ మల్లయ్య, మాట్లాడే బొ... పుట. 273) ఈ సన్నివేశం ద్వారా గ్రామాల్లోని క్రీడల్లో... మార్పు వచ్చిందో తెలుస్తుంది. కానీ రచయిత ఈ స... కల్పన ద్వారా మరొక విషయాన్ని కూడ తెలియజేస్తు... ఐలయ్య చిన్నతనంలో ఉన్న బొంగరాలాట, చిర్రగో... రద్దయిపోయి గోలీలాటల మీదుగా వాలీబాల్, క్రికె... ప్రవేశించి స్థిరపడుతున్న సంధికాలం అది. అది కే... క్రీడలకు సంబంధించిన విషయమేకాదు, ఒక సా... పరిణామాన్ని కూడ తెలియజేయడం రచయిత ఉద్దేశ... అర్థం.

విద్యారంగం-రాజకీయాలు:-

విద్యారంగానికీ, రాజకీయాలకు సంబం... ఏముందని చాలామంది అనుకుంటారు. కానీ మ... ఆచరణలోని ప్రతివిషయమూ రాజకీయమే అనే విషయం ... మందికి తెలియని విషయం. కారణం విషయాన్ని తా... తాత్వికంగా ఆలోచించకపోవడమే అనిపిస్తుంది. మనిషి ... రాజకీయ జంతువు అంటాడు అరిస్టాటిల్. రాజకీయ జంతు... చేసే కార్యకలాపాలన్నీ రాజకీయాలే అవుతాయి తప్ప మరొ... కావు. అయితే ఆధునిక కాలానికీ, అంతకు పూర్వ కాలా... ప్రధానమైన భేదం అంతకు ముందు తమకు తెలవకుం... రాజకీయాలలో పాలుపంచుకుంటున్నారు. ఆ రాజకీయాల... మార్చే ప్రయత్నంలో భాగస్వామ్యం వహించలేదు. కానీ ఆధు... కాలంలో విద్యార్థులను గమనిస్తే తాము రాజకీయాల... పాల్గొంటున్నామనే ఎరుకతోనే, వాటిని మార్చాలనే ప్రయత్నం... కూడా భాగస్వాములవుతున్నారు. అవి మంచి రాజకీయాల... చెడ్డ రాజకీయాలా అటుంచి వివిధ రాజకీయ పార్టీలు కూ... విద్యార్థుల్ని రాజకీయాలలో క్రియాశీలం చేస్తున్నాయి. ... విషయం ఈ నవలలో చక్కగా వర్ణించబడింది.

"విద్యార్థులకు రాజకీయాలొద్దు. విద్యనార్జించే విద్యా... రాజకీయాల జోలికి పోతే విద్యార్జనకు భంగం కలుగుతుంది... చదువే ధ్యేయంగా బతకాల్సిన వాళ్ళకు రాజకీయాలెందుకు... అందుకే విద్యార్థులంతా రాజకీయాలకు దూరంగా ఉండాలి... చదువుపై మనసులను లగ్నం చేయాలి. ఆవేశపూరితమైన... నిర్ణయాలు తీసుకుంటూ తీవ్రవాదంవైపు మొగ్గు చూపకూడదు... అంటూ ప్రతి సభలోనూ చెబుతున్నారు నాయకులు. విద్యార్థులకు... రాజకీయాలొద్దా? ఏ రాజకీయాలు మీరనేది? మీరు

కోరుకుంటున్న రాజకీయాలైతే ఫర్వాలేదు కదా. మీకు పావులుగా ఉపయోగపడేవైతే మంచిదే. అలాంటి వాళ్ళే మీరే ప్రోత్సహిస్తారు. విద్యార్థుల్ని బలిపశువుల్ని చేస్తారు. తెలంగాణ ఉద్యమంలో 250 మంది విద్యార్థుల్ని బలిగొన్నారు. ఓడిక్కు ఇలా విద్యార్థుల్ని బలిపశువుల్ని చేస్తూనే విద్యార్థులకు రాజకీయాలొద్దనడంలో మీకున్న చిత్తశుద్ధి ఏపాటిది? పాఠశాలలను, కళాశాలలను ఎన్నికల కురుక్షేత్రాల్లా మారుస్తూ విద్యార్థులకు రాజకీయాలొద్దనంలో అర్థమేముంది? వీళ్ళు వద్దంటున్న రాజకీయలెలాంటివో విద్యార్థులు గుర్తించాలి అంటూ వామపక్ష విద్యార్థి యూనియన్ల నాయకులు వాళ్ళ ఉపన్యాసాలను ఖండిస్తున్నారు (కాలువ మల్లయ్య, మాట్లాడే బొమ్మలు, పుట. 266). ఈ మాటల్లో నాయకుల మాటలు పక్కన పెడితే విద్యార్థులు క్రియాశీలకంగా రాజకీయాల్లో పాల్గొంటున్నారనీ, అది కూడ విప్లవోద్యమ ప్రేరేపితులుగా ఉంటున్నారని అర్థం అవుతోంది. ఎన్నికలు ఉన్నప్పుడు సహజంగానే వాటిని బయటి రాజకీయాలు ప్రభావితం చేయడం అనేది ఉంటుంది. అయా రాజకీయ శిబిరాలకు చెందిన విద్యార్థులు చాలా సందరాల్లో తీవ్ర ఘర్షణలు పడ్డట్టు కూడ కాలువ మల్లయ్య ఈ నవలల్లో చిత్రించారు కూడ.

ముగింపు :-

నవలాసాంతం అనేక సమస్యల్ని, పరిస్థితుల్ని వివరించడం కనిపిస్తుంది. పరిస్థితులు, విలువలు మనిషిని ఒక యంత్రంగా చేసి, మానవీయ విలువల స్థానంలో కృత్రిమ సంబంధాలను ప్రతిక్షేపించిన వైనాన్ని తెలియచేసాడు. ఏ మనిషి ఆలోచనల మీదనైన తాను జీవించే సమాజ స్థితిగతుల ప్రభావం ఉంటుంది. ఆ పరిస్థితులకు తాను లోబడే ఆలోచిస్తాడేతప్ప, అది సాధ్యమయ్యే విషయం కాదు. అందుకే ఈ నవలలో చాలా పాత్రలు వాటికవిగా ఉన్నట్లు కనిపించవు. భిన్నమైన సామాజిక బృందాలకు, భావజాలాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు అనిపిస్తాయి. కనిపించని శక్తులు ఏవో నడిపిస్తే నడిచినట్లు అనిపిస్తాయి. అందుకే నవలకు 'మాట్లాడే బొమ్మలు' అన్నాడు. అర్థవంతంగా, చిదిత్య పూర్వకం కూడా. మొత్తంగా పరికించి చూస్తే పెరిగిన యాంత్రికత, కృత్రిమ ప్రేమలు, కుళ్ళిన రాజకీయాల మధ్య మానవుడు మాయమైపోతున్న విషాద సన్నివేశాన్ని పాఠకులకు కళ్ళకు కట్టించారు.

ఎమ్. రమాదేవి,
తెలుగు ఉపన్యాసకురాలు
రాజీవ్ గాంధీ సాంకేతిక వైజ్ఞానిక విశ్వవిద్యాలయం
బాసర, ఆదిలాబాద్ జిల్లా .

# దశకుమారచరితమ్ - వనచరసంస్కృతి

డా. మఱ్ఱివాడ. శివరామ్
సంస్కృతోపన్యాసకులు
ఆంధ్ర లొయోల కళాశాల, విజయవాడ

సహితస్య భావః సాహిత్యం . ఏదైతే ప్రజల హితాన్ని కోరుకుంటుందో అదే సాహిత్యమన బడుతుంది. ప్రపంచంలోని ఏ సాహిత్యమైనా ప్రజాహితాన్ని కాంక్షింస్తుంది. ప్రజలసమస్యలు, ఆచారవ్యవహారాలు , జీవనవిధానము కవి ఏదో ఒక చోట ఏదో ఒక విధంగా వరి?ంచకుండా ఉండదు. అందుకే సాహిత్యం సమాజదర్పణమని పిలువబడుతుంది. దండిమహాకవి సాహిత్యదర్పణంలో

ఆదిరాజయశోబింబమాదర్శం ప్రాప్య పాఙ్మయమ్
తేషామసన్నిధానే పి న స్వయం పశ్య నశ్యతి.

అంటాడు. ఆదిరాజులకీర్తిబింబాన్ని పొందిన వాఙ్మయం వారు లేనప్పుడు కూడా ప్రకాశిస్తుందంటాడు . అంటే వాఙ్మయానికి మరణం లేదు. అది అజరామరమైనది. శాశ్వతమైనది.

సమాజం లేకుండా సాహిత్యస ృష్టి ఉండదు. సమాజవిశేషాలన్నీ సాహిత్యవిషయాలే. వనచర సంస్క ృతి సంస్కృతసాహిత్యంలో అంతరాగం. వైదికసాహిత్యంనుండి నేటివరకు సాహిత్యంలో వనచరులు ఒక భాగమైనారు. వేదకాలంలో బహుశః అందరు వనచరులే కావచ్చు.వేదమంత్రాలలో వనచరసంస్క ృతిని వివరించే మంత్రాలు కనిపిస్తున్నాయి. నమకచమకాల్లో కొన్ని జాతుల పేర్లు ఉఛరింపబడ్డాయి. అవన్నీ వనచరజాతులే. అవన్నీ కులాలను ఆధారంగా చేసుకొని విభజింపబడ్డాయి.

కులాలేభ్యో కర్మారేభ్యోశ్చ నమోనమః. తక్షకేభ్యో తక్షపతిభ్యశ్చ నమోనమః

ఇందులో ప్రయోగింపబడిన తస్కర , కల్మాష మొదలైన జాతిపదాలన్నీ వనచరజాతిబోధకాలే.

రామాయణాన్ని రచించిన వాల్మీకి వనచరుడని పండితుల అభిప్రాయం. సంస్కృతసాహిత్యంలో వనచరుల జీవనవిధానాన్ని ఆధారంగా చేసుకొని రచింపబడిన గ్రంథాలు తక్కువే అయినప్పటికీ , గ్రంథాలలో అక్కడక్కడా వర్ణింపబడిన వనచరుల కథలను పరిశీలిస్తే వారి జీవనవిధానం మనకు అవగతమౌతుంది. వారి మానసికస్థితి , నైతికజీవనము , ప్రక ృతిపట్ల వారికున్న మక్కువ మనకు తెలుస్తాయి. రామాయణమహాభారతాలు వనచరుల జీవనాన్ని తెలియజేస్తాయి. రామాయణంలో వరి?ంపబడిన నిషాదరాజవ ృత్తాంతం సేవాధర్మం , స్నేహధర్మంయొక్క గొప్పదనాన్ని తెలియజేస్తాయి. శబరి భక్తిభావానికి ప్రతీక. మహాభారతంలోని ఏకలవ్యుడు గురుభక్తికి నిదర్శనం.

కావ్యాలలో కాదంబరి , కిరాతార్జునీయమ్ , దశకుమారచరితమ్ మొదలైన వాటిల్లో వనచరుల ప్రస్తావన కనిపిస్తుంది. ఈ గ్రంథాలను పరిశీలిస్తే తస్కరులు , కిరాతులు , భిల్లులు , అంధకులు , వనేచరులు , నిషాదులు , కల్మాషులు మొదలైన వనచర జాతి భేదాలు మనకు కనిపిస్తున్నాయి.

ఇప్పుడు దశకుమారచరితంలోని వనచరసంస్కృతిని పరిశీలిద్దాం. దీనిలో రెండు మూడు చోట్ల మాత్రమే వనచర ప్రస్తావన కనిపిస్తుంది. ఈ గ్రంథంలో శబరులు , కిరాతులు అనే రెండు జాతులు కనిపిస్తున్నాయి. వీటి ప్రస్తావన అపహారోపహారవర్మల వృత్తాంతంలోను మాతంగ వృత్తాంతం లోను కనిపిస్తుంది. ముందుగా అపహారోపహారవర్మల వ ృత్తాంతాన్ని పరిశీలిద్దాం.

ప్రహారవర్మ రాజహంసుని స్నేహితుడు. అతడు రాజహంసుని భార్యయైన వసుమతి సీమంతోత్సవానికి సకుటుంబంగా వెడతాడు. భార్యాబిడ్డలతో తిరిగి వస్తున్న ప్రహారవర్మను శబరసైన్యం అడగిస్తుంది. వారికి భయపడిన ప్రహారవర్మ అక్కడినుండీ పారిపోతాడు. ఆతనికున్న కుమారులో ఒకరిని ఒక శబరుడు దొంగిలించి తన భార్యకు బహుమతిగా ఇస్తాడు. ఆమె అతనిని కన్నబిడ్డలాగా పెంచుతుంటుంది. ఇంకొక కుమారుణి? ఎత్తుకొనిపోయిన శబరులు ఆ పిల్ల వానిని తమ దేవతయైన చండికకు బలి ఇవ్వాలని అనుకుంటారు. దానికోసం అనేక ఉపాయాలను ఆలోచిస్తారు.

చెట్టుకొమ్మకు తలక్రిందులుగా వ్రేలాడదీసి కత్తితో చంపాలని కొందరు , ఇసుకలో తలవకరకు పాతి బాణాలతో చంపాలని మరికొందరు , సూదులతో పొడిచి చంపాలని ఇంకొందరు , మరికొందమంది పరుగెత్తించి కుక్కలతో చంపాలని సూచిస్తారు. అదే సమయంలో అక్కడకు ఒక

బ్రాహ్మణుడు వచ్చి తన కుమారుడు తప్పిపోయాడనగానే ఆతనికి ఆ పిల్లవానిని అప్పగిస్తారు. (మహీరుహశాఖావలంబి తమేనమసిలతయా వా సైకతతలే ఖననిక్షిప్తచరణం లక్షీకృత్య సితతరనికరేణ
వా అనేకచరణైర్పలాయమానం కుక్కురబాలకైర్వా దంశయిత్వా సంహనిష్యామః)

ఈ వృత్తాంతాన్ని అనుసరించి ఆ కాలంలో దొంగతనము వారి ప్రథమజీవనోపాధి యని తెలుస్తున్నది. గ్రామదేవతల పూజలు , కానుకలు సమర్పించడం మొదలైనవి ఉన్నాయని తెలుస్తున్నది. జంతుబలులే కాకుండా నరబలులు కూడా ఉన్నాయని అవగతమౌతుంది. వారికి యుద్ధవిద్యలు తెలుసని , వారికి రాజులుంటారని , వారికి సైన్యం కూడా ఉంటుందని తెలుస్తుంది. అంతేకాకుండా వారి పనులు క్రూరంగా ఉంటాయి. అయినప్పటికీ వారు దయగలవారు. బాలుని రక్షించాలని ఒక తాపసి "తాను బాలుని తండ్రిని" అని అసత్యం చెప్పినప్పటికీ, బలిగా సమర్పిద్దామనుకున్న బాలునికూడా సంతోషంగా ఆతని తండ్రికి సమర్పించిన దయార్ద్రహృదయులు. వారికి వైద్యంకూడా తెలుసు. ఉపహారవర్మదాసి అనారోగ్యంతో , వ్రణంతో బాధపడుతుంటే ఒక వనచరుడు ఔషధాన్ని ఇచ్చి ఆ వ్రణానికి చికిత్స చేస్తాడు. అనారోగ్యాన్ని తగ్గిస్తాడు.

ఇందులో వర్ణింపబడిన మాతంగవృత్తాంతం వారి జీవనవిధానాన్ని సంస్కృతిని తెలియజేస్తుంది. మాతంగుడు ఒక బ్రాహ్మణుడు. ఆతని తండ్రేకాకుండా అనేకమంది నీచులైన బ్రాహ్మణులు తమ కులాచారాలను వదిలిపెట్టి కిరాతులతో కలసి జీవిస్తుంటారు. వారితో కలసి జంతువులను వేటాడుతుంటారు. వారితో కలసి మాంసాన్ని భుజిస్తుంటారు. దయాదాక్షాణ్యాలులేకుండా సంచరిస్తుంటారు. దగ్గరలో ఉన్న గ్రామాలలోకి ప్రవేశించి ధనవంతులైనవారినందరినీ బంధించి వారి సంపదలనన్నింటినీ దోచుకుంటూ ఉంటారు. ఒకసారి వారందరూ కలసి ఒక బ్రాహ్మణున్ని హింసిస్తూ ఉంటారు. మాతంగుడు వారిని వారించాలని ప్రయత్నం చేస్తే ఆతణి? కొట్టి చంపేస్తారు.

దీనిని పరిశీలిస్తే వేటాడడం , దోపిడీలు చేయడం వారి ప్రవృత్తియని అర్థమౌతుంది. కిరాతులతో కలసి బ్రాహ్మణులుకూడా జీవించేవారని తెలుస్తుంది. వారికి దయాదాక్షిణ్యాలు ఉండవని , ధనంకోసం స్త్రీలను పిల్లలనుకూడా బాధిస్తారని తెలుస్తుంది. మాసభక్షణం పరస్పరకలహం వారికి సర్వసాధారణం.

ఈ ప్రస్తావనలో వనచరులు ఈ విధంగా వర్ణింపబడినప్పటికీ వారు మృదుస్వభావులు. ఇతరులకు సాయపడే దయాగుణం కలవారు. ప్రకృతిని తల్లిగా తలుస్తూ దానిని ఆరాధించే మనస్సు కలవారు. తాము సంతోషంగా జీవిస్తూ ఇతరులను తూడా సంతోషంగా జీవింపచేసేవారు.

కిరాతార్జునీయంలో ఒక వనచరుడు ధర్మరాజు ఆజ్ఞానుసారం దుర్యోధనుని రాజ్యానికి వెడతాడు. దుర్యోధనుని రాజ్యపాలనను పరిశీలించి ధర్మరాజుకు నివేదిస్తాడు. ఇందులోని వనచరుడు సమస్తములైన రాజనీతులను తెలిసినవాడు. మాట్లాడడం తెలిసినవాడు. దూతలక్షణాలను కలిగి ఉన్నవాడు.

ఆర్థికస్వావలంబన , విద్యావకాశాలు లేకపోవడం, నగరజీవనవిధానాలకు దూరంగా ఉండడం వలన వనచరులు కొంత దురాచారాలకు లోబడి ఉండవచ్చును. కానీ సహజమైన వారి సంస్కృతి, దయాగుణములు అందరికీ ఆదర్శప్రాయములు.



Dr. N. V. KRISHNA RAO,
M.A., M.Phil., Ph.D.,
Asst. Professor Dept. of Telugu & O.L.
Acharya Nagarjuna University
GUNTUR (DIST.) A.P.

# ప్రపంచీకరణ నేపథ్యంలో గిరిజన కవిత్వం - జీవన చిత్రణ

మూడావత్ వెంక
పరిశోధక వి
హైదరాబాదు విశ్వవిద్యాల
సెల్ : 9ద5ద5ద
venkateshchowan@gmai

"కవిత్వమెంత పురాతనమైనదో అంత ాతనమైనది. సాంకేతికంగా, వైజ్ఞానికముగా వృద్ధినందుచున్న యుగములో ఊహలతో జీవించు ్వము బ్రతుకగల్గునాయను సందేహమును కొందరు ంచిరి. కవిత్వము ప్రధానముగా మానవుని అనుభూతులపై రపడియున్న కళ. అందుచేత మానవుడున్నంతకాలము ్వమునకు క్షతిలేదు, భౌతిక ప్రపంచమున ఎన్ని తములైన మార్పులు వచ్చినను మానవునిలోని మౌళిక ఃప్రవత్తులలో చెప్పుకోదగిన పరివర్తనములేదు. ద్వేషములు, పాపపుణ్యములు, అధికారవాంఛ, కీర్తికాంక్ష, ృతిప్రీతి, దైవభీతి నాడెటులో నెడటులే మానవుని మనస్సును వేసికొని యున్నవి. ఇవి ఉన్నన్నినాళ్ళు కవిత్వముండును. నవునిలో 'వాసనలు' నశించిననాడు కవిత్వమె" కాదు ఏ యును నిలువలేదు" అని సినారే గారు నిర్వచించడం గింది.

ఈ విధంగా కాలంలోని మార్పును సూచిస్తూ, వజాలంలోని నవ్యతను ప్రదర్శిస్తూ సాహిత్యంలోకి వచ్చిన క్రియగా ఎంత పురాతనమైందో అంతే ఆధునికమైనదిగా, తన భావావిష్కరణలకు, మానవుని అనుభూతులపై ారపడియున్న కళగా ఒక కొత్తదనానికి సంబంధించిన ంశంగా మానవుని ఆశలు, కీర్తి ఆకాంక్షలు, ప్రకృతి ప్రీతి, వభీతిలాంటివి ఉన్నన్ని నాళ్ళు కవిత్వం సజీవంగా ఉ ుందని, అవి లేనినాడు కవిత్వమే కాదు ఏ కళ కూడా ఉ డదు అని సమీక్షించి పేర్కొనడం జరిగింది. మానవుణి? రోగమనం వైపు నడిపించడం కోసం జరిగిన ప్రయత్నమంతా ధునికతలో భాగమైందని చెప్పవచ్చు. మనిషి పొందిన నుభవాల్ని, ఆరాటాల్ని, కష్టసుఖాల్ని, వేదనల్ని ప్రకటించడంలో విత్వానికున్నంత వెసులుబాటు మరేకళా రూపానికి లేదు. క్కువమందికి అందుబాటులో ఉండే కళాసాధనం కవిత్వం ని చెప్పవచ్చు.

తెలుగు సాహిత్యంలో వచనకవిత్వం ఒక ధానమైనటువంటి ప్రక్రియగా చెప్పవచ్చు. ఈ ప్రక్రియ ముక్తఃఛందం, వచనపద్యం వంటిపేర్లతో మాత్రమేకాక మినీకవిత, ప్రపంచపది, హైకూ, నానీ, నాహీ వివిధరూపాల్లో వికసించిన కవితాప్రక్రియ, ఈ ఆధు తెలుగు కవిత్వం కేవలం సాహిత్యప్రక్రియగా మాత్రమే వ్యక్తిని సాధికారికం చేయడానికీ, సమాజాన్ని చైతన్యవం చేయడానికీ, వివిధ సమూహాలు తమ ఉనికిని చెప్పుకోవడానికి ఊతమిస్తూ, అత్యంత ప్రజాస్వామిక ల తెలుగు సాహిత్యంలో విశిష్టమైనపాత్రను కూడా పోషి ంది.

ఇరవైవోవ శతాబ్దానికి ముందున్న దేశ, పరిస్థితులు ఈ కవిత్వ ఆవిరాహానికి కొంత దోహ చేశాయని చెప్పవచ్చు. ఎందుకంటే ఆనాటి విదేశీ పాల వ్యతిరేకంగా జరుగుతూ ఉన్న స్వాతంత్ర్యసంగ్రామ పోరా దేశభక్తి, సంఘసంస్కరణలు, ఆంగ్లవిద్యా పత్రికావ్యాప్తిలాంటి అనేక అంశాలు తెలుగులో ఈ ఆధు కవిత్వం ఆవిర్భవించటానికి దోహదం చేశాయి. కవిత్వ నిష్కర్షగా నిర్వచించుట సుసాధ్యముకాదు. అంతమాత్రమున అసాధ్యముకూడా కాదు. సెంట్ అగస్టిన్ ఒక సందర్భమ ఇట్లు నేను, If not asked, I know; If u Ask, me, I know కవిత్వ మాస్వాద రమణీయముగానే యుండును. తజ్ఞులెల్లరు దానిని గీటుగీసి నిర్వచించలేదు. కవితాత్మ ృము వంటిది. అమృత మిట్లుండవచ్చునని ఊహి అభివర్ణించినట్టి కవిత్వమును నిర్వచించుటయు జరిగి

కవిత్వం అలంకారికమైనటువంటిది. లయ రచనా విశేషాన్ని కవిత్వం అనవచ్చు. కవి ఆత్మ అనుభూతి, సామాజిక అవగాహన ఇందులో ప్రధాన ంటాయి. కవి తన అనుభూతిని సమాజంలో పంచుకో కవిత్వంరాస్తాడు. కవిత్వం ఎంతో రమణీయముగా అ హృదయముతో అమృతంలాగా ఆస్వాదించేవిధ ంటుందని కవిత్వమును ప్రత్యేక నిర్వచనం అంటూ ఇ ఊహించి చెప్పటమే జరిగియున్నదని సమీక్షించి ఎంతో వివరించారు. ఆచార్య సి. నారాయణరెడ్డిగా హృదయంలోని భావాలు ఆవిష్కరణ పొందే కళాత్మ కవిత్వం. ఇది కవి అనుభూతికి ప్రతిరూపంగా ని

ఆయా వర్గాల అవసరాలను వినిపించే క్రమంలో కాలానుగుణంగా వస్తున్న మార్పులను కవితాపరంగా వ్యక్తం చేస్తుంది కవిత్వం. సమాజం ప్రతిస్పందించే విధమైన మార్పుకు అనుకూలిస్తుంది కవిత్వం. ఇది ఒక రకంగా ఎంతో గొప్ప కళాత్మకమైన ప్రక్రియగా కూడా చెప్పవచ్చు.

నేడు వస్తున్న కవిత్వాన్ని పరిశీలిస్తే పరిణామ క్రమంలో పూర్వాపూర్వ ప్రభావాల్ని రచన సందర్భంలో ఉపయోగించుకుని తనదైన ప్రత్యేకతను చాటుకుంటున్నట్లు అవగతమౌతుంది. ఆధునిక కవిత్వం ఎన్నో వాదాలు, ధోరణులు, ఉద్యమాలకు ఒక వేదిక అయింది. ఆధునిక కవిత్వానికి ముఖ్యకారకులైన గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగం, రాయప్రోలు సుబ్బారావు, మొదలుకొని భావకవిత్వం, అభ్యుదయకవిత్వం, దిగంబర కవిత్యోద్యమం, విప్లవకవితోద్యమం అలాగే దళితవాదం, స్త్రీవాదం, ముస్లింవాదంలాంటి వాదాలను వారి జీవితంలోని సామాజిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ అంశాలను సమాజానికి తెలియజేయడంలో కవిత్వం ఒక ప్రధానమైన పాత్రను పోషించింది.

ప్రపంచీకరణ నేపథ్యంలో గిరిజన కవిత్వం:-

ప్రాచీన సాహిత్యంలో కంటే ఆధునిక తెలుగు సాహిత్యంలో గిరిజన జీవితం, సాహిత్యం ఎక్కువగా కనిపిస్తుంది. అది 'కథాసాహిత్య ప్రక్రియ'లో మెరుగ్గా కనిపిస్తుంది. 'నవలా సాహిత్యప్రక్రియ'లోను కొంత కనిపిస్తుంది. 'గేయసాహిత్యప్రక్రియ'లోను ఫర్వాలేదు అనిపిస్తుంది. కాని నాటకప్రక్రియ, గినిజన కవిత్వ ప్రక్రియలో చాలా తక్కువగా కనిపించడం జరుగుతుంది. ఎందుకంటే ఈ ప్రక్రియలలో ఎక్కువగా రచనలు చేయకపోవడం మూలంగా రాలేదని చెప్పవచ్చు.

గతంకంటే ఈ మధ్యకాలంలో కొంత గిరిజనకవిత్వం గిరిజనులకు జరుగుతున్న అన్యాయాలపైన, వారిపై జరుగుతున్న దోపిడిపైన, వివిధ సామాజిక అంశాలపైన కొంతమంది గిరిజన రచయితలు. అలాగే గిరిజనేతర అభ్యుదయ, విప్లవభావాలు కలిగిన రచయితలు, ఆదివాసి గిరిజనులు జీవనం 'విధ్వంసం' అవుతున్నదని వారి రచనల ద్వారా వెల్లడిస్తున్నారు. అది సంస్కృతికమైన దోపిడి, రాజ్యహింస, గ్రీన్ హంట్ కావచ్చు. వలసలు, పేదరికం, నిరుద్యోగం, అత్యాచారాలు, భూమిసమస్య, అభివృద్ధి పేరులో జరిగే విధ్వంసం, ప్రపంచీకరణ ప్రభావంకావచ్చు. అలాగే గిరిజనుల విముక్తి పోరాటాలు, అస్తిత్వ, ఆత్మగౌరవ, స్వయంపాలనా పోరాటాలు కావచ్చు. ఒక్కటేమిటి 'వాళ్ళ జీవితమే పోరాటం'గా కనిపిస్తుంది.

ప్రపంచీకరణ ప్రభావం - గిరిజన జీవన చిత్రణ:-

ప్రపంచీకరణ 1991 సరళీకృత ఆర్థిక విధానాలతో దేశంలో ప్రారంభమయింది. ప్రపంచం 'కూ'గ్రామంగా మారడం అనేది దీని లక్షణం. కాని దీనిమూలంగా లాభం ఎంతుందో నష్టంకూడా అంతే ఉందని చెప్పవచ్చు. దీని మూలంగా గిరిజన తెగల స్థానిక సంస్కృతులకు, భాషలకు ముప్పు తలెత్తింది. సామాజిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక రంగాలన్నింటిపైన ప్రపంచీకరణ ప్రభావం చూపింది. సాహిత్యరంగం కూడా ఈ ప్రభావానికి గురైంది అని చెప్పవచ్చు. ఈ ప్రపంచీకరణ ప్రభావంతో గిరిజన జీవనం ఛితికిపోయింది. అలాంటి పరిస్థితులను వివరిస్తూ కొన్ని కవితలు రావడం జరిగింది.

వాటిలో కొన్ని:

"బహుళజాతి సంపద వేటలో ఆదివాసి బతుకులు
బజార్ పాలు చేస్తనూ వికాశం వినాశనం అనే
జెపం చేతపట్టి బుసలు కొడుతున్న
బుర్జుకువా నల్ల తాచుల రాజ్యం ఇది
.....................

అభివృద్ధి అనే అడ్డు చెపుతున్న మిలో
ముసుగు చూపిస్తున్న ప్రభుత్వం ఇది
చూపుడు వేలుతో ధర్మచక్రం తిప్పుతునే
బొటన వేలుతో ఆదివాసీ గొంతు నొక్కుతున్న ప్రభుత్వం"

దశరథం, అడవి పుత్రులకి అండగా, అరుణతార, సెప్టెంబర్, అక్టోబర్, 2012.

బహుళజాతి దుర్మార్గాలతో ఆదివాసి తన అస్తిత్వాన్ని కోల్పోయే పరిస్థితి ఏర్పడింది.

బహుళజాతి కంపెనీలు అభివృద్ధి జపం చేస్తూ వాటి పేరు మీద అడవులను ఆదివాసి నివాస గృహాలను ఖాళీ చేయించి వారి జీవితాలను విధ్వంసం చేస్తున్నారు. వారి నుండి భూమిని లాక్కొని వారిని తరిమివేస్తున్నారు.

"కార్పోరేట్ తిమింగలం అమాంతం మింగి
సున్నం మగ్గుల బొమ్మరిల్లై
ముద్దులోలకబోస్తున్నాయి
అడవిబిడ్డల ముక్కెరలు పూసల పేర్లు అద్దాల రవికెలు
గేటెడ్ కమ్యూనిటికి ఎత్నిక్ అందాలు సమకూర్చాయి
మట్టిపాత్రలు లక్కపిడతలు వెదురుబుట్టలు
బహుళజాతి దుకాణంలో కుండపోతగా డాలర్ల వర్షం"

-స్వరూపరాణి

చల్లపల్లి, ఒక ఎత్నిక్ డ్రీమ్, కవితా ఝుంకార్.

ప్రపంచీకరణ ఆదివాసీల పట్ల ఒక శాపంగా మారిందని చెప్పవచ్చు. ఎందుకంటే ప్రతి కార్పోరేట్ కంపెనీకి ఆదివాసిలు ఉండే ప్రదేశాన్ని కోరుకోవడం దాంతో వారి జీవన విధానం ధ్వంసం అయింది. వారు తయారు చేసిన వస్తువులు నేడు 'ప్యాషన్ షోల్లల్లో' కనిపిస్తున్నాయి. డాలర్ల వర్షం కురిపిస్తున్నాయి. కాని వారికి మాత్రం తినడానికి ఆహారం లేక ఆకులు, గింజలు, అడవిలో దొరకే ఫలాలు తిని రోజులు వెల్లదీస్తున్న పరిస్థితి కనిపిస్తుంది.

"తండాల్లో జొన్న రొట్టెలు మాయం
ఫాస్ట్ ఫుడ్ సెంటర్లలో వెదకండి"
"ప్రపంచీకరణం దేనిని వదల్లేదు
ఆఖరికి తండా సంస్కృతి కూడా"

ప్రొ. సూర్యాధనుంజయ్, బంజారానానీలు.

ప్రపంచీకరణ మూలంగా లంబాడీ గిరిజనులకు కూడా వారి సంస్కృతిని సాంప్రదాయ ఆహారాలను కూడా కోల్పోయే పరిస్థితి ఏర్పడింది. లంబాడీలు ఎంతో ఇష్టంగా తినే ఆహారం జొన్నరొట్టెలు వారు ఎడ్లబండి మీద దూర ప్రాంతాలకు వలస వెళ్ళినా, ఇంకా పనికి వెళ్ళిన జొన్న రొట్టెలను ఎండబెట్టుకొని మూడు నాలుగురోజుల పాటు రొట్టే వారికి ఆహారం. అలాంటిది ఇవాళ ఫాస్ట్ ఫుడ్ సెంటర్ లలో వెతుక్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. అలాగే బంజారాల సంస్కృతి ఎంతో ప్రత్యేకమైనది. దానిని కూడా ప్రపంచీకరణ కబళించింది.

"నెలగర్భంలో సంపదంతా దోపిడి అవుతున్నది
ఆకుపచ్చని విధ్వసంమొకటి రాజ్యమై
సామ్రాజ్యవాదకెతిగాళ్ళు మల్టీనేషనల్ కంపెనీల భోజ్యమై విస్తరిస్తున్నది"

శిభా - ఆకాష్, పత్రహరితం, కవితాఝుంకార్.

ఇవ్వాళ అనేక మల్టీనేషనల్ కంపెనీలు వస్తున్నాయి. అవి రావడంతో నేడు గిరిజనులకు ముప్పు ఏర్పడుతున్నది. వాటి మూలంగా భూమిని కోల్పోవడమె కాక వాటి రసాయనాలకు, వచ్చే పొగకు, గిరిజనులు అనారోగ్యానికి గురికావడం జరుగుతుంది. దాంతో అడవిలోని చెట్లు నాశనం అవుతున్నది. ఈ ప్రపంచీకరణ మూలంగా మనం అనుకునే అభివృద్దే! సర్వమానవ వినాశనానికి కారణం అవుతున్నది.గిరిజనులు స్వభావం రిత్యా స్వతంత్ర జీవనాన్ని కలిగి ఉంటారు. అటువంటి జీవనానికే వారు ఆసక్తి చూపడం జరుగుతుంది. అలా వారు నాగరిక సమాజానికి దూరంగా ఉంటారు. అలాంటి గిరిజనులను ఓపెన్ క్యాస్టలు, సున్నం ఫ్యాక్టరీలు, విద్యుత్ ప్రాజెక్ట్ లతో, పులుల పెంపకాల పేరుతో వారి గూడేలను తొలిగించమని ఏ చట్టం చెప్పింది. ఏ వ్యవస్థ నిర్ధేసించింది అనే ఆవేదనను కవి ఈ కవిత్వంలో ప్రశ్నించాడు.

"ఆ తాటికమ్మ గుడిసెలు
నా కలల్ని పొదిగి
రక్తమాంసాలు అద్దిన మట్టిగూడు"

విద్యాసాగర్ గారు, పి. "ముంపు" ఆదిమ గిరిజన దీర్ఘకవిత్వం ఆదిమ గిరిజనుల జనఘోషను దీర్ఘకవిత్వంగా రచించారు విద్యాసాగర్ గారు. ఇది పోలవరం ప్రాంతంలో నివసించే గిరిజనుల ఆత్మఘోష అని చెప్పవచ్చు. ధ్వంసం అవుతున్న వారి జీవితాన్ని, వారి గుడెసెల్ని, కలల్ని పొదిగి రక్తమాంసాలతో చేసిన, అద్దిన మట్టిగూడును తొలగించడం అంటే అది అభివృద్ధి పేర విధ్వంసమే.

"పులై విచ్చుకోలేక
మొగ్గలైరాలి
ఎవరి దాహాలకో
సామూహిక దుఃఖాన్నై ప్రవహిస్తున్న"

విద్యాసాగర్ గారు, పి. "ముంపు" ఆదిమ గిరిజన దీర్ఘకవిత్వం.

ఊరంటే ఒక సామూహిక జీవనం, సమిష్టి సంస్కృతి వికసించడానికి మూలాధారం అసహజ జీవితానికి అలవాటపడిన మైదానం సహజ జీవితాన్ని విధ్వంసం చేయడానికి పూనుకుంటుంది అనే దానికి ఈ కవిత ఉదాహరణ. జంతువుల రక్షణ కోసం మనుషుల జీవితాలను విధ్వంసం చేయడం ఏమిటి?

"పోలవరం పోరు
ఆగేదెప్పుడో
గిరిజనుల
ఆశలు పూచేదెప్పుడో"

ప్రొ. సూర్యాధనుంజయ్, బంజారానానీలు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడప్పుడు అందరు సంతోషంగా ఉన్నారు. ఎందుకంటే రాష్ట్రం వచ్చిందని కాని ఆ ప్రత్యేక రాష్ట ఉద్యమంలో పాల్గొన్న ఆదివాసీలను మాత్రం ఆ ఏడు మండలాలను ఆంధ్రరాష్ట్రంలో కలిపేసి, వారిని నిర్వాసితులను చేసింర్రు. వారు రాష్ట్రం ఏర్పడ్డా ఆ తర్వాత అత్యంత బాధపడ్డారు. ఎంతో అన్యాయానికి గురైనారు.

"ఆదివాసుల పోరాటం - ఆత్మగౌరవ పోరాటం
నిత్య నిర్భంధాలు - అణిచివెతలు సాగవింక
ఆదివాసుల పోరు ముందు - సామ్రాజ్యవాదులెంత
చీమలదండై కదులుతాం -త దోపిడిదారులను తరిమేస్తాం"

నర్సింహారెడ్డి దామరపల్లి, ఆదివాసులోయమ్మ.

ఆదివాసులది ఆత్మగౌరవ పోరాటం, నిర్బంధాలను, అణిచివేతలను తట్టుకొని ఎదురుతిరిగి చేసే పోరాటం ఆదివాసుల పోరాటం ముందు, సామ్రాజ్యవాదం ఎంత. ఈ దోపిడిదారులు ఎంత ? చీమలదండై కదులతా, స్వేచ్ఛా సమానత్వంలో ఆత్మగౌరవంతో కూడిన స్వయంపాలనను సాధిస్తాం అనే భావాన్ని అర్థానిచ్చిన కవితానేపథ్యం ఇది.

ముగింపు:-

ఈ విధంగా ఆధునిక గిరిజన కవిత్వంలో వివిధ రకమైన సామాజికమైన అంశాలు, సమస్యలు, ప్రధానంగా కనిపిస్తాయి. మానవుల ప్రాథమిక అవసరాలు కూడు, గూడు, గుడ్డా, బ్రతకడం, అవి కాకుండా అమాయకమైన గిరిపుత్రులపై సాంస్కృతికంగా, ఆర్థికంగా, రాజకీయంగా దోపిడి కొనసాగుతూవున్నది. అవి వివిధ రకాలుగా భిన్న రూపాలలో, అలాగే ప్రపంచీకరణ ప్రభావం, గ్రీన్ హంట్, అభివృద్ధి పేరుతో వారిని నిర్వాసితులను చేస్తున్న పరిస్థితి, విద్యా, నిరుద్యోగ, ఉపాధి సమస్య, వలసలు, గిరిజనుల మంచితనం, అమాయకత్వంపైన జరుగుతున్న హింస మొత్తంగా ఆధునిక గిరిజన కవిత్వ, గిరిజనుల జీవితంపైన జీవన విధానాలపై జరుగుతున్న 'దమనకాండను' 'విధ్వంసం' కళ్ళ ముందు ద్రశ్యరూపం చూపించినట్లుగా వివరించడం జరిగింది. కాని ఇంకా ఆదివాసీ గిరిజన కవిత్వం చాలా రావాల్సి ఉంది. వాళ్ళ జీవితాలను వాళ్ళె చిత్రించుకోవాల్సివుంది. అప్పుడే ఆ కవిత్వం ఇంకా సజీవంగా సంపూర?ంగా గిరిజన జీవితాలను వాళ్ళ జీవితంలో జరిగే భిన్న విషయాలు సమాజానికి తెలియడానికి ఆస్కారం ఉంటుంది. అలాగే ప్రవహిస్తున్న కవిత్వంలో 'దళితవాదం' 'మైనార్టీవాదం' 'బీ.సి. వాదం' 'స్త్రీ వాదం' లాగా 'గిరిజనవాదం' కూడా భవిష్యత్ లో రావాలని గిరిజనులు మరింతమంది రాయాలని అప్పుడే "సంపూర్ణ గిరిజన కవిత్వ సాహిత్యం" మనకు ఆధునిక తెలుగు సాహిత్యంలో కనిపిస్తుంది.

ఉపయుక్త గ్రంథాలు:-


1. ఆధునికాంధ్ర కవిత్వము, సాంప్రదాయములు, ప్రయోగములు - ఆచార్య సినారే.
2. కవితా ఝంకార్ - విరసం 2013.
3. ముంపు - ఆదిమ గిరిజన దీర కవిత్వం - పి. విద్యాసాగర్ రావు.
4. బంజారా నాసీలు -ప్రొ. సూర్యా ధనుంజయ్.
5. అరుణతార - సెప్టెంబర్, అక్టోబర్ 2012.
6. భారతీయ గిరిజనులు - నదీం హస్ నైన్.
7. బంజారా చరిత్ర సంస్కృతి - ప్రగతి, చినీయా నాయక్.

# తెలుగు నవలలో సంచార తెగల జీవితం - ఒక పరిశీలన

మోహన్ బానోత్, పరిశోధక విద్యార్థి
హైదరాబాద్ విశ్వవిద్యాలయం, హైదరాబాద్
సెల్: 76809 58699
ఈ-మెయిల్ : -mohanbanothu@gmail.com

ఉపోద్ఘాతం :

భారతదేశం విభిన్న మతాల, జాతుల, కులాల, తెగల సమాహారం. ఇందులో భాగమైన తెలుగు రాష్ట్రాలలో కూడా ఈ వైవిధ్యం లేకపోలేదు. సాహిత్యం సమాజ ప్రతిబింబం అనుకున్నప్పుడు సమాజాన్ని అర్థం చేసుకోవడానికి సాహిత్యానికి మించి ఆధారాలు లేవు. కాబట్టి విభిన్న మతాలు, జాతులు, కులాలు, తెగలు, సామాజిక నేపథ్యాలు, సాహిత్య సాంస్కృతిక విషయాలు అధ్యయనం చేయకపోతే భారతీయ సమాజాన్ని, అందులో భాగమైన తెలుగు సమాజాన్ని అర్థం చేసుకోవడం కష్టమవుతుంది. శాస్త్ర, సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో ఎంతో అభివృద్ధి సాధించామనుకుంటున్నా నేటికి ప్రధాన జీవన స్రవంతిలో కలవకుండా, కొండల్లో, కోనల్లో, అభివృద్ధికి దూరంగా, అడవుల్లో జీవనం సాగిస్తున్న గిరిజన తెగలు ఎన్నో ఉన్నాయి. వీళ్లతో పాటు ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి సంచార జీవనం చేస్తున్న సంచార జాతుల గురించి తెలుసుకోవాల్సిన అవసరం కూడా ఉంది.

సంచార జీవనం చేసి జీవించే వాళ్లను సంచార జాతులు (Nomadic Classes) అని అంటారు. డా? వి.ఆర్. రాసాని గారు సంచార జాతుల గురించి ఈ విధంగా పేర్కొన్నారు. "మైదాన ప్రాంతాల్లో జీవిస్తున్న నాగరిక సమాజానికి నేటి సమాజం అనుభవిస్తున్న సాంకేతికపరమైన సౌకర్యాలకు, ఆర్థిక సమృద్ధికి, పాలనాపరమైన పథకాల యొక్క ఫలితాలకు దూరంగా ప్రకృతిలో ప్రకృతిగా కలిసిపోయి అడవులపైనా ఆధారపడి జీవించే ఆదివాసీలు, బతుకు పోరాటంలో ఆహారాన్వేషణ చేస్తూ ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి తరలిపోయే అస్థిర నివాసులు (Nomadic Residents) సంచార తెగలు (Nomadic Classes) ఒకప్పుడు అడవిపైన పడి జీవించి, కారణాంతరాల వల్ల ఎప్పుడో మైదాన ప్రాంతాలలోకి వచ్చి స్థిరపడి, అక్కడ బతుకు తెరువు కోసం నేర్చిన విద్యలను, లేదా తమ శ్రమను నమ్ముకొని ఎక్కువ కాలం బయటి ప్రాంతాల్లోనే సంచారం చేస్తూ బతికే సామాజిక వర్గాలు, కుల వృత్తులపైన ఆధారపడి ఇతర కులాలకు ఆశ్రిత కులాలుగా (Dependent Castes) జీవించే తెగలు, అర సంచార తెగలు (Seminomadic Classes) అని అంటారు.

సంచార తెగలవారు రెండు తెలుగు రాష్ట్రాలలో జీవిస్తున్నారు. సంచార జాతులలో ఎస్సీ, ఎస్టీ, బి.సి. కులాలకు చెందినవారు కూడా ఉన్నారు. సంచార జీవనాన్ని గడుపుతున్న తెగలలో ప్రధానంగా గుండులు, కొండరెడ్లు, కోలం, చెంచు, లంబాడీలు, ధోటీలు, భిల్లులు, పరదాన్లు, అందలు, నక్కలు, ఎరుకల, యానాది, కోయ, నాయక పోడులు, బుడ జంగాలు, బుడబుక్కలు, విప్ర వినోదులు, దొమ్మర, మందేచ్చులు, మొండోళ్ళు, పూసలోళ్ళు, గువ్వలోళ్లు, పిచ్చకుం గంగిరెద్దుల వాళ్ళు, దాసర్లు, నక్కలోళ్లు, గురవయ్యలు మొదలగు వారున్నారు. వీరిలో జంగమ, బుడబుక్కలు, గురవయ్యలు వంటి అర సంచార తెగలకు చెందినవారు వివిధ ప్రాంతాలలో జీవిస్తున్నారు.

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో బాగా ప్రచారం పొందుతున్న ప్రక్రియ నవలా సాహిత్యం. ఈ నవలా ప్రక్రియ పాశ్చాత్య సాహిత్యం ప్రభావంతో భారతదేశంలోకి వ్యాపించింది. సంచార తెగల జీవితాలను, వారి పద్ధతులను, కట్టుబాట్లను చిత్రించే నవలలు తెలుగు సాహిత్యంలో పరిమితంగా వచ్చాయి. అవి పురుడు, ఎన్నెల నవ్వు, ఎడారి మంటలు, సంచారి, జిగిరి, గుమ్మెట, వెూత, బయటి గుడిసెలు, వలస మొదలగునవి.

'పురుడు' నవలను భూతం ముత్యాలు రచించారు. ఈ నవలలో కథా వస్తువు కరువు.

కరువు వల్ల నాగార్జున సాగర్ డ్యాం ఎండిపోతుంది రైతులుగా ఉన్న ఆ ప్రాంత రైతులు ఏ విధంగా వలస కూలీలుగా మారారో ఈ నవల తెలియజేస్తుంది.

'ఎన్నెల నవ్వు' నవలను ఏకుల వెంకటేశ్వర్లు రచించారు. రచయిత ఈ నవలలో యానాదుల జీవితాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. అలాగే యానాదుల సమస్యల్ని ప్రధానమైన అంశాలుగా చర్చలోకి తెచ్చారు. అందులో యానాదులపై వివిధ రూపాల్లో కొనసాగే దోపిడిని, వారి పట్ల విప్లవ పార్టీల తీరు తెన్నులను, ప్రభుత్వం యానాదుల పట్ల వ్యవహరిస్తున్న విధానాలను వస్తువులుగా తీసుకొని ఒక కుటుంబాన్ని కేంద్రంగా చేసి కళాత్మకంగా యానాదుల సంస్కృతిని, సమస్యల్ని, అనుభవాల్ని, అనుభూతుల్ని అనేక కోణాల్లో చిత్రించారు.

పెద్దింటి అశోక్ కుమార్‌గారు సంచార జాతులకు సంబంధించి మూడు నవలలు రచించారు. వీటిలో 'ఎడారి మంటలు' నవలను గల్ఫ్‌వలసల మీద రాశారు.

'సంచారి'లో రాజలింగం అనే వ్యక్తి అక్కడి నుండి బతుకుతెరువు కోసం దుబాయ్‌కి వెళ్ళి అక్కడ జైలు పాలై ఎట్టకేలకు విడుదలై తిరిగి స్వదేశానికి వచ్చి ఏ విధంగా తన జీవనాన్ని కొనసాగించాడనేదే ఈ నవల ఇతివృత్తం. ఈ నవలలో గంగిరెద్దుల వారి జీవితాలను చిత్రీకరించారు.

'జిగిరి' నవలలో బీబమ్మ, చాంద్‌-షాదుల్, ఇమామ్‌ల చుట్టూ ఈ నవల నడుస్తుంది. షాదుల్ అంటే ఎలుగుబంటి, నవల ప్రారంభం నుంచి 'షాదుల్'ని చాలా ప్రేమతో చూసుకుంటారు. ఆ ఎలుగుబంటి వాళ్ళకు తన జీవితాన్ని ధారపోస్తుంది. కాని చివర్లో రెండెకరాల ప్రభుత్వ భూమి కోసం 'షాదుల్'ను వదిలించుకోవాలని చూస్తారు. కాని ఇమామ్‌కి ఏ మాత్రం షాదుల్‌ని విడిచిపెట్టడం ఇష్టం ఉండదు.

ఈ నవలలో దూదెకులానికి చెందిన వారి జీవితాలను చిత్రించారు. 'గుమ్మెట మోత' నవల రచయిత పాపి ఈ నవల బుడగజంగంకు సంబంధించింది. ఈ నవల జేజి నాయన, మశమ్మ, వీరప్ప, సుంకమ్మ, ఉలిగప్ప, రామలింగం పాత్రల చుట్టు తిరుగుతుంది.

ఈ నవల కథావస్తువు వలస శ్రీశైలం డ్యాం కృష్ణానదిపై కడతారు. ఆ నది చుట్టు ప్రాంతాలలో నివసిస్తున్న వారంతా వేరే వేరే ప్రాంతాలకి వలస వెళ్ళి తమ జీవనాన్ని కొనసాగిస్తారు. ఉలిగప్ప హైదరాబాద్‌లో ఒక యూనివర్సిటీలో పిహెచ్.డి. చేస్తుంటాడు. తన కులం గుర్తింపు కోసం సంఘం ఏర్పాటు చేసుకొని పోరాటం చేస్తుంటాడు. ఇదే ఈ నవల ఇతివృత్తం.

'బయటి గుడిసెలు' నవలను దేవులపల్లి కృష్ణమూర్తి రచించారు. ఈ నవలలో మొండి, బుడగజంగాలు వంటి కులాలు వాచ్యం గాను, దొమ్మరి, ఎరుకల వంటి కులాలు సూచనప్రాయంగా ఉంటాయి.

ఈ నవల ఇతివృత్తాన్ని పరిశీలిస్తే శ్రీశైలం ప్రాంతంలో కరువు ఏర్పడడం వల్ల బైరి ఎల్లడు, ముత్తి కుటుంబం పందులను తోలుకొని నల్లగొండ జిల్లా, నకిరేకల్లు చుట్టు ప్రాంతాలలో చెట్ల మందులు, తాయెత్తులు అమ్ముకుంటూ సంచార జీవనాన్ని కొనసాగిస్తుంటారు.

'వలస' నవలను డా॥ వి.ఆర్. రాసాని రచించారు. రాసాని సంచార జీవితానికి సంబంధించి అనేక కథలను రచించారు.

ఈ నవల కథావస్తువు ప్రధానంగా కరువు అనే చెప్పాలి. ఈ నవల ఇతివృత్తాన్ని పరిశీలిస్తే చిత్తూరు చుట్టు ప్రక్కల గ్రామాలలో కరువు ఏర్పడుతుంది. కురవ కులానికి చెందిన బలభద్ర అనే రైతు కరువు ధాటికి తాళలేక అప్పులపాలై తనకున్న పొలం అమ్ముకొని భార్యాబిడ్డల వెంటపెట్టుకొని కర్నాటక రాష్ట్రంలోని భద్రావతికి తన లాంటి కొంతమంది ఇతర రైతుల కుటుంబాలతో కలిసి వలస వెళతాడు. అక్కడ గొల్ల దాసే గౌడతో స్నేహం చేస్తాడు. తన రెండెకరాల పొలాన్ని కౌలుకు చేసుకుంటూ ఉంటాడు. అక్కడ అనివార్య కారణాల వల్ల అక్కడి నుంచి శిమోగకు చేరుకుంటారు. అక్కడ అల్లుడైన కిష్టప్ప పోరును భరించలేక తిరిగి తమ సొంతూరికి ప్రయాణమవుతారు వృద్ధ దంపతులు.

ఈ విధంగా రచయితలు తమ నవలలో సంచార తెగల జీవితాలను, వారి పద్ధతులను, కట్టుబాటులను ఆధారం చేసుకొని నవలలను రచించడం జరిగింది.

ఆధార గ్రంథాలు:


1. అప్పారావు, జర్రా. 2003. విశాఖపట్నం జిల్లా గిరిజన విజ్ఞానం. పిహెచ్.డి. పరిశోధన గ్రంథం.
2. ఆనందరామం, సి. 1997. నవలా విమర్శ. హైదరాబాద్. పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్.
3. ఆనంద లక్ష్మీ సి. 1979. తెలుగు నవలల్లో కుటుంబ జీవన చిత్రణ. విజయవాడ. నవజ్యోతి పబ్లికేషన్స్.
4. అశోక్ కుమార్, పెద్దింటి. 2011. జిగిరి. నయనం ప్రచురణలు. సిరిసిల్ల.
5. అశోక్ కుమార్, పెద్దింటి. 2011. సంచారి. చతుర.
6. కృష్ణమూర్తి, దేవులపల్లి. 2013. బయటి గుడిసెలు. డి.కె. ప్రచురణలు. నల్లగొండ.
7. పాపి. 2012. గుమ్మెట మోత. విప్లవ రచయితల సంఘం.
8. ముత్యాలు, భూతం. 2007. పురుడు. గుంపు సాహితి సంస్థ. నల్లగొండ.




19 వ శతాబ్దం చివరిభాగంలో మంజరి మధుకరీయం తో నాటకం ప్రారంభమైనది

నాంది ,ప్రస్తావన ,నిష్కంభం ,అంకవిభజన ,పంచసంధులు ,భారతవాక్యం మొదలైనవి నాటకలక్షణాలు .సమాజంలో జరుగుతున్నా దాష్టికాలను దురాగతాలను ప్రజలకు కళ్ళకు కట్టినట్టు చూపించుటకు నాటకం ఉ పయోగపడుతుంది .అన్యాయం జరుగుతున్న కోణాలను బట్టి పౌరాణిక ,చారిత్రక ,సాంఘిక ,విషాదాంత ,సమస్యాత్మక ,సదేశ్యాత్మక నాటకాలు వెలువడి ప్రజలను చైతన్యపరిచి జాగ ృతపరిచి జమీందారీవర్గాన్ని కూలదోయానికి ఉపకరించాయి .కొక్కొండవెంకట రత్నం గారి నరకాసుర విజయం వావిలాల వారి సిజరు చరిత్రం,చిలక మారుతి గయోపాఖ్యానం ధర్మవరం విషాద సారంగధర నాటకాలు ప్రజల్లో ఆలోచనలు ప్రేరేపించాయి .

కవిత్వం

కవితవం మారుతున్న సమాజంలో వివక్షలను ఎదురిస్తూ సామాన్యులపాలిట బ్రహ్మాస్త్రంలా తోడ్పడింది. సమాజంలో పీడిత వర్గాల వైపునుండి పెట్టుబడిదారీ వర్గ సమాజానికి పెనుదెబ్బలను కురిపిస్తూ సామజిక న్యాయాన్ని అడిగించింది కవిత్వం .కవిత్వంలో భావకవిత్వం ,అభ్యుదయకవిత్వం ,విప్లవ కవిత్వం ,దళిత వాద ,స్త్రీవాద ,మైనారిటీ వాద కవిత్వాలున్నాయి .

ఉదా :

1 ఏ దేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం
నరజాతిచరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం "శ్రీ శ్రీ" ....

2 ఇంగ్లీషు ఛానల్ను ఈదుతున్న ఈతరం స్త్రీలను చూస్తూ
ఇంకా ఇంకా మౌనంగా ఉండటం నా వల్ల కాదు
" షాజహానా".....

3 పాలినికిపోవడానికి అన్నట్టు
మనసింకిపోవడానికి
మాత్రలుంటే బావుణు? "రజని" .....

ముగింపు :

దక్షిణ భారతదేశంలో అగ్రభాగంగా ఉన్నటువంటి తెలుగు ప్రజలను అగ్రస్థానంలో నిల్పుటకు ఆయుధం అయినా చైతన్యమును సామాజికపరివర్తనను తేవడానికి ఆధునిక సాహిత్యంలో కథ ,నవల నాటకం ,కవిత్వం మొదలైన ప్రక్రియలు దోహదపడ్డాయి .అదే సూర్తిని నింపుకున్న ఈ తరం సమాజంలో సామజిక పరివర్తనను తీసుకొచ్చి వారసత్వాన్ని కొనసాగించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది.

పులుమద్ది సత్యనారాయణ
ఎం.ఏ, పిహెచ్,డి.
సెల్ : 9441000537
ఈమెయిల్ : pulumaddi@gmai.com

# మారుతున్న జానపదుల జీవన విధానం – ఆచార వ్యవహారాలు

డా. పి.వి.లక్ష్మణరావు, తెలుగు ఉపన్యాసకులు,
రాజీవ్ గాంధీ వైజ్ఞానిక సాంకేతిక విశ్వవిద్యాలయం,
నూజివీడు, కృష్ణాజిల్లా.
చరవాణి – 9492043837.
laxman009@gmail.com.

ఏ జాతిజీవన వేదన అయినా ఆ జాతి నిర్మించుకున్న సహజ కళల్లో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. జానపద కళల్ని చూస్తే సంస్కృతి, సంప్రదాయాలు, మానవతా విలువలు ప్రజా జీవితంలో కలిసి ఎలా బతుకుతున్నాయో చెప్పొచ్చు. అలాగే జానపద సాహిత్యం మన జాతి సంస్కృతికి దర్పణమై అనంత విజ్ఞాన వినోదాలనందిస్తూ సంగీత సాహిత్యాల మేళవింపుతో కళలకు కాణాచియై, మధురమైన ఆలోచనలకు ఆలవాలమై, జీవన సౌందర్యాన్ని, సౌకుమార్యాన్ని కళ్ళకు కట్టినట్లు తెల్పుతూ అనంతమైన ఆనందాన్నిస్తుంది. అంతే కాక ప్రసార ప్రచార సాధనాలు లేని కాలంలో మన పూర్వీకులు మానవ విలువలను బోధించే జానపద గేయాలను పాడేవారు, కథలను చెప్పేవారు. వెనుకటితరం వారు ముఖ్యంగా స్త్రీలు తమ పిల్లలకు ఉగ్గుపాలతో మానవ విలువలనూ, సంస్కృతీ, సంప్రదాయాల ప్రాధాన్యాలనూ రంగరించి పాటలు పాడేవారు. జీవితంలోని ప్రతిదశకూ ఒక ఆచారం, దానితో పాటు పాటలు పాడడం జానపదుల సంప్రదాయం. ఆచారాలను మేళవించిన పాటలతో సంబంధ బాంధవ్యాలు, ఆత్మీయ బంధాలు దృఢతరమయ్యేవి.

కానీ నేడు ప్రజలు పట్టణీకరణ, ఆధునికీకరణ చెందుతున్న క్రమంలో వందల ఏళ్లుగా పల్లెల్లో ఆదరించి, ఆనందించిన జానపద కళలు నేడు అంతరించిపోతున్నాయి, కళాకారులు కనుమరుగై పోతున్నారు. ఆధునిక వ్యవస్థ జానపద జీవితాన్ని ఛిద్రంచేసింది. దీనివల్ల సాంస్కృతిక వైవిధ్యం మరుగైపోయి ప్రజల మనుగడ ప్రశ్నార్థకమవుతున్నది. ప్రకృతితో ముడివడి ఉన్న సహజ సిద్ధ జీవితాలు ఛిన్నాభిన్నమవుతున్నాయి. కళలతో కష్టాన్ని మరుస్తూ వృత్తిని నమ్ముకున్న బ్రతుకులు ఛిద్రమయ్యాయి. ఇది ప్రమాద సంకేతం.

కొడిగడుతున్న జానపద కళారూపాలు: జానపద కళలకు మూలం జీవం. శిష్టసాహిత్యానికి దీటుగా జానపదకళలు అనేక పాయల్లో ప్రవహించి విభిన్న రూపాలతో విలసిల్లి తమ సాహిత్య బలిమిని బలంగా చాటాయి. ముఖ్యంగా తెలుగువారి పండుగల్లో జానపద కళాసంపద వెల్లివిరుస్తుంది. పండుగలు, ఉత్సవాలు, జాతరలు, నోములు, వ్రతాలు కొన్ని వందల ఏండ్ల నుంచి జానపద సమాజంలోని వ్యక్తులను ఒక్కచోట చేర్చి, వారు పరస్పరం ఆనందానుభూతుల్ని పంచుకొనేలా చేశాయి.

ఆధునిక ప్రసార, ప్రచార, సామాజిక మీడియాల ధాటికి, వ్యాపారదృష్టి తీవ్రతకు చాలా వరకు ప్రాచుర్యం తగ్గినా జానపదకళలకు ప్రాధాన్యత తగ్గలేదు. కళలను కళాకారులు బ్రతికిస్తూ ఇస్తున్న ప్రదర్శనలలో ఆకలి, ఆవేదన, ఆర్తి ఉన్నా ఆత్మగౌరవ సాహిత్య సంస్కృతికి అద్దం పట్టినతనం కన్పిస్తుంది. కళను నమ్ముకున్న జానపదుడు బికారిగా, భిక్షకుడుగా మారిపోతున్నా, పొట్టపోసుకునే మార్గంగా అది తోడ్పడకున్నా ఆ కళల ఉనికిని నిలబెడుతున్నాడు. ముఖ్యంగా మన తెలుగు రాష్ట్రాల్లో బతుకుతూనే కొడిగడుతున్న కళారూపాలు కోకొల్లలు. బుడిగె జంగాలు, కాకిపడగలోళ్ళు, బీరన్నలు, పిచ్చుకగుంట్లు, దాసరులు, శారదకాండ్లు, బుడుబుడుకలవాళ్ళు, సాధనాశూరులు, పిట్టలదొర, ముష్టి, బాలసంతులు, సిందోళ్ళు, గంగిరెద్దులోళ్ళ, ఒడ్డెరలు ఇలా చెప్పుకుంటూ పోతే లెక్కకు మించిన కళారూపాలు, కళాకారులు కన్పిస్తారు. కళాకారుల జీవన విధానం, స్థితిగతులను చూస్తే కళలకు ఉన్న ఆదరణ.. కళల మనుగడకు, కళాకారుడి జీవితానికి మధ్యన గల సంబంధం తెలిసి కళాకారుల్ని తద్వారా కళల్ని బ్రతికించుకునే మార్గాలను అన్వేషించే వీలుంటుంది. చిందు యక్షగానం, మడేలు పురాణం, కోలాటం, బ్రానాలు, గౌడ పురాణం, మల్లన్న పండుగ, పగటివేషాలు, ఒగ్గుకథ, డప్పుడోలు, చెక్కభజన వంటి కళారూపాలు ప్రదర్శనా విన్యాసాలలో కళాకారుల ప్రతిభావ్యుత్పత్తితో పాటు శక్తియుక్తులతో పాటు సామాజిక పరిస్థితులను గమనిస్తే వాటి పరిరక్షణ అవసరం తెలుస్తుంది. ఏది ఏమనుకున్నా ఆధునీకరణ ప్రభావంతో కులవృత్తులు విధ్వంసం కావడం వల్ల జానపద కళారూపాలకు ఆదరణ తగ్గిందన్న మాట వాస్తవం.

మరొక విషయమేమంటే జానపద కళలు ఆధునీకరణ చెందడం. ఉదాహరణకు 'కోలాటం'. ఇది ఒక జానపద కళారూపం. కోలాటంతో పోల్చి చెప్పదగిన నృత్యాలు ఆంధ్రప్రదేశ్‌లోను, భారతదేశంలోని ఆంధ్రేతర రాష్ట్రాలలోను విదేశాలలోను కన్పిస్తాయి. ఇపుడు కొంచెం పెద్ద కర్రలతో, వాద్యాలతో ఎడమ నుండి కుడికి జరుగుతూ ఆంధ్రదేశంలోని గోండులు ఆడే దండారియా నృత్యం, కర్నాటకలో తమ్మిడి (తప్పట) గజ్జెలు, తమిళనాడులో పిన్నల్ కోలాటం, గుజరాత్, మహారాష్ట్ర, రాజస్థాన్‌లలో ప్రచారంలో ఉన్న గర్భాకు కోలాటంతో పోలిక ఉంది. కాలానుగుణంగా సంస్కృతీ, సంప్రదాయాలలో ఈ మార్పు పట్టణ ప్రాంతాల్లో జరిగినంత వేగంగా పల్లెపట్టుల్లో జరగదు.

జాతి జీవనంలో జాతరలు: జాతి జీవనంలో జానపద కళలు గ్రామీణ సంస్కృతి చిహ్నాలుగా నిలిచాయి. ఇక కులపరంగా అనేక కళలూ ఉద్భవించినాయి. ఇవి ఆ కులానికి, జాతికి ఒక ప్రత్యేకత సంతరించుకునేలా చేశాయి. ముఖ్యంగా ఆయా కులాలకు, జాతులకు ప్రత్యేక జాతరలు ఉన్నాయి. ఇవి వారి జీవనంలో భాగంగా మారాయి. వివిధ గ్రామాలలోనూ, పట్టణాలలోనూ అనాదిగా తిరునాళ్ళుగా, జాతరలుగా, రథోత్స వాలుగా ఇలా అనేకం సంస్కృతిలో భాగంగా వస్తున్నాయి. తెలుగు రాష్ట్రాలలో ప్రతి గ్రామంలో ఏదో ఒక పేరుతో ఇవి నిర్వహించబడటం కనిపిస్తుంది. చెన్నారాయుడి సేవ, పీర్లపండగ వంటివి కూడా ఇందులో భాగాలే. ఈ జాతరలు రానురాను కొన్ని పెద్ద ఎత్తున జరుగుతుంటే అదే క్రమం కొన్ని మొక్కు బడిగా జరుగుతున్నాయి. ఇక ఈ జాతరలలో ప్రదర్శించే కళారూపాలు కొన్ని కనుమరుగవుతున్నాయి. జాతర సంగతి ఎలా ఉన్నా గ్రామీణ కళారూపాలు కనుమరుగవటం శోచనీయం. ఈ కళారూపాలను కాపాడుకుంటే మన సంస్కృతి సంపూర?ంగా నిలిచి ఉంటుంది.

కాలగతిలో కలిసిపోతున్న జానపదుల ఆచార వ్యవహారాలు: ఒక్కో జాతికి ఒక్కో విధమైన సాంఘిక ఆచారాలుంటాయి. అలాంటి ఆచారాలను, సంస్కృతి, సంప్రదాయాలను చిన్నతనం నుంచే పిల్లలకు అలవాటు చేయాలి. కానీ నేడు పిల్లలు మాట్లాడుకునే మాటలు కొన్ని పట్నంలోనే కాదు పల్లెల్లో కూడా వినిపించడం లేదు. తాయిలం, అప్పచ్చి, బువ్వ, కాకెంగిలి లాంటివి. మారుతున్న సంస్కృతిలో పరాయి భాషలపై మోజు బాగా పెరిగిపోయింది.

పల్లెల్లో విశ్వాసాలు, నమ్మకాలు బస్తీలకంటే ఎక్కువ. ఇంట్లోంచిఎవరైనా పొరుగూరు వెళ్తుంటే, "అన్నం తిని వెళ్లు" అనరు. అలా అన్నాక తప్పక తిని వెళ్లాలి. లేకపోతే తిండి దొరకకపోవడమో, అశుభం జరుగుతుందనో విశ్వసిస్తారు. అందుకని ఎంగిలిపడి వెళ్లు, మంచిమాట చేసికెళ్లు అంటారు. అప్పుడు ఔనన్నా కాదన్నా ఫర్వాలేదు. రాత్రిపూట ఉప్పు అనే మాట వాడరు. చవి, రుచి, బుట్టలోది అని వ్యవహరిస్తారు. నిజానికి జానపదుల ఇండ్లలో నూనె లేదా కిరోసిన్ దీపాలు ఉండేవి. ఉప్పు అని ఒత్తి పలికితే దీపం ఆరే పరిస్థితి సంభవిస్తుంది. కాబట్టి ఆ పదాన్ని వారు ఆ సమయంలో నిషేధించి ఉంటారు. "పెళ్లి వారమంటూ భోరు భోరున వెళ్ళాం. వెళితే ఏవుందక్కడ? మడత కుడుములు శేష పాన్పులూ తప్ప" ఇది నిష్టూరంగా అనే మాట. కుడుము గుండ్రంగా వుంటుంది. మడత కుడుం అంటే తినడానికి ఏమీ లేదని. శేష పాన్పులంటే తిండి లేక డొక్కల్లో కాళ్లు పెట్టుకుని ముడుచుకుని పడుకున్నామని ధ్వని. బడిలో మాస్టారు బెత్తాన్ని, బరికెని వాడేవారు. "ఏరా అల్లరి కట్టిపెడతారా, చింతావారి అమ్మాయితో పెళ్లి చెయ్యమంటారా" అనేవారు మాస్టారు. చింతావారి అమ్మాయంటే చింతబరికె అని అర్థం. పెళ్లి చేయడమంటే బాదడం అని అర్థం. దూదేకుడు, గుద్దుల బెల్లం కూడా పిల్లల్ని కొట్టే పరిభాషే.

ఇక వంటింట్లోకి వస్తే ఎంత సామాగ్రి కనుమరుగైంది. పొయ్యి, కుంపటి ఇప్పుడు మ్యూజియమ్ వస్తువులు. ఏవుందీ పొయి రాళ్లలాగా మేం ముగ్గురం అంటారు పెద్దవాళ్లు. అంటే పిల్లలు రెక్కలొచ్చి ఎవరిదారిన వారెళ్తే మేం మిగిలామని చెప్పడం. రోలు, రోకలి, తిరగలి, సన్నెకల్లు, పీట, కల్వం, కుంది ఇవన్నీ వెళిపోయాయ్. పాలు పల్చనవుతున్నాయ్, పాలల్లో నీళ్లు కలపద్దు అనడం కొంచెం యిబ్బందిగా వుంటుంది. అందుకని పూర్వీకులు "తోడుపాలు కలపద్దు" అనేవారు. తోడుపాలంటే నీళ్లని అర్థం. ఎంత హాయిగా ఉందండీ నిజంగా!

ఏదైనా తీసిన కొద్దీ వస్తుంటే, ఎన్ని తీసినా తరగకపోతే – "తేగల పాతరలా తరిగితేనా" అంటారు. ముంజెలు ముదిరి టెంకలవుతాయి. ఆ టెంకల్ని పాతర వేస్తారు. అవి మొలకెత్తుతాయి. తేగ తాడిచెట్టు అంకురమని ఎందరికి తెలుసు. దీనిలో ఎక్కువ ఫైబర్ (పీచు) ఉంటుంది. వీటిని గోదావరి జిల్లాల్లో మహా ఇష‘ంగా దీన్ని తింటారు. అది అనవసరమైన కొవ్వును శరీరం నుంచి తొలగించేందుకు సహకరిస్తుంది. ఇది ఒక ఆరోగ్య విధానం. ఏం చెప్పమంటారు– ధనియాలు జల్లితే కొతిమీర మొలిచిందని ఆశ్చర్యపోతున్న రోజులివి. బతికుంటే బలుసాకు తిని బతకచ్చు అని సామెత. బలుసాకు అనేది ఎక్కడ పడితే అక్కడ పిచ్చిగా పెరుగుతుంది. అనేక శక్తివంతమైన క్రిమి సంహారక మందుల కారణంగా కొన్ని కూరాకు కలుపు మొక్కలు కనుమరుగైనాయి. పొన్నగంటి,

పొగ్గలి కూర లాంటివి ఎన్నో. ఎక్కువగా మాట్లాడుతుంటే, "పీచాక వాగుడు కాదు" అంటుంటారు. ప్రకృతిని మనిషి ఎంతగా ఇష్టపడేవాడంటే - చాలా సందర్భాల్లో చుట్టరికాలు కూడా కలుపుకునే వాడు. చందమామ, చందమామయ్య లాంటి ఉదాహరణలు ఎన్నో.

శివారు, పొలిమేర లాంటి జానపదాలు చెవిన పడడం లేదు. ప్రభవ, విభవ మొదలైన తెలుగు సంవత్సరాల పేర్లు, కార్తెల పేర్లు వెళ్లిపోయి, ఇంగ్లీష్ నెలల తారీకులు వాడుకలో మిగిలాయి. ఒకప్పుడు "ఏరువాక" వ్యవసాయ సంవత్సరానికి సంకేతంగా ఉండేది. జానపద కళారూపాలు అంతరించడంతో వాటికి సంబంధించిన జనపదాలూ అంతరించాయి. సంక్రాంతి తరుణంలో వచ్చే సాతానిజియ్యర్లు, బుడబుక్కల వారు, జంగం దేవర్లు, మాసాబత్తిని వారు, పగటి వేషగాళ్ళు, విప్రవినోదులు, చెంచు దొరలు, కొమ్ముదాసర్లు, పిచ్చుకుంట్లవారు ఆధునిక సంస్కృతిలో తెరమరుగైనారు. బొమ్మలాటలు లేవిప్పుడు. వీధినాటకాలు కనుమరుగైనాయి. బుర్రకథలో జముకుల కథలో ఎంతటి జన జీవాలుంటాయో వీధి నాటకాలలో అంతకు మించిన రసావేశం ఉంటుంది.

ఏదైనా నగగాని వస్తువుగాని కుదిరిగ్గా పొందిగ్గా ఉంటే "చేతాళం" బావుందంటారు. చేతాళం, చేత అనే పదాలిప్పుడు అరుదే. రైతులు కూడా ప్రస్తుతం విత్తనం, వంగడం మాటల్ని వదిలేశారు. మత్స్యకారులకు సముద్రం మీద ఎంతటి అవగాహన ఉంటుందో గ్రామీణులకు ఆకాశం మీద అంతటి పట్టు వుంటుంది. ఆకాశాన్ని చూసి వాతావరణాన్ని ఆ రోజుల్లో చెప్పేవారు. చంద్రుడి చుట్టూ మేఘాలు కట్టే గూడుని "వరదగుడి" అనేవారు. దాన్ని బట్టి వాన రాకడ తెల్సుకునేవారు. చుక్క పొడుపుల్ని బట్టి రాత్రివేళల్ని చెప్పేవారు. వేగుచుక్క పొడిస్తే నిద్రలేచే వేళైనట్టు. ఒక పెద్ద నక్షత్రం చుట్టూ చిన్న నక్షత్రాలు గుంపుగా వుండే దాన్ని పిల్లల కోడి అనేవారు. వీటిల్లో జనపదాలే కాదు జానపద విజ్ఞానం కూడా ఉందని మనం గ్రహించాలి. కుంభకారుడు సారె మీద అనేక రకాల మట్టి పాత్రలని తయారు చేసేవాడు. కడవ, కుండ, బుంగ, చట్టి, దుత్త, ముంత, పిడత, బాన, తాబేటికాయ - ఇవి కొన్ని పేర్లు. ఎద్దు మెడని అర్రు అంటారు. అందని వాటికి అర్రులుజాచడం అంటే మెడ చాచడం అని అర్థం. లావో దేవో అనే హిందీ పదాల్లోంచి లావాదేవీలు వచ్చింది. హమ్ తుమ్ నించి అమీతుమీ వచ్చింది. అమీ తుమీ తేల్చుకోవడం అంటే నువ్వో నేనో తేలాలని భావం.

జానపదంగా పుట్టి పాఠ్యపుస్తకాలకెక్కిన పాట - కలవారి కోడలూ కలికి కామాక్షి, కడుగుచున్నది పప్పు కడవలో పోసి, అప్పుడే వచ్చెను ఆమె పెద్దన్న, కాళ్లకీ నీళ్లిచ్చి కనీళ్ళు నింపె - అని కామాక్షి కథ నడుస్తుంది. అందులో పాట[…] సంవిధానం ఒకనాటి ఉమ్మడి కుటుంబాలని కళ్లకు కట్టా[…] ఆర్థిక సాంఘిక పరిస్థితులు మర్యాదలు మన్ననలూ కన్పి[…] తెలుస్తాయి. "రచ్చలో కూర్చున్న రాజేంద్ర భోగి, […] అన్నలొచ్చారు మన్నింపుతారా" అని భర్తని అడుగుతుం[…] కామాక్షి. రచ్చ అంటే రచ్చబండ. పల్లెల్లో అన్ని పంచాయితీ[…] అక్కడే జరిగేవి. తీర్పులూ అక్కడే చెప్పేవారు. అక్కడ పరి[…] కూడేవారు. అందుకే రచ్చకీడ్చారు, రచ్చ చెయ్యొద్దు లాం[…] ప్రయోగాలు వచ్చాయి. సాంఘికాలే కాదు జానపదులు తమ[…] తోచిన విధంగా భారత రామాయణాలని, భాగవతంలో పు[…] వీరగాథల్ని పాటలుగా కట్టి పాడుకునేవారు. మహ[…] మహాదేవుళ్లని, మహారాజుల్ని కూడా తమ స్థాయిలోనే భూమిం[…] పాట కట్టేవారు. లేనిపోని వైభవాలు గాని, ఆడంబరాలుగా[…] వ్యక్తీకరణలో అలంకారాలు గాని వారికి తెలియదు. అందు[…] జానపద సాహిత్యం ముడివజ్రంలా అతిసహజమైంది. సాన[…] పెట్టడం, నగల్లో పొదగడం ఆధునికుల నైజం.

పల్లెటూళ్లలో సరదాలు, సరసాలు ఒకనాడు కూలీ[…] వికాసానికి వినోదానికి ఉపయోగపడేవి. ఎంతటి కష్టమైనా[…] మరిపించి నవ్వించేవి. చతుర్లాడడం, మేలమాడడం నా[…] పరిపాటి. ధనిక పేద, చిన్న పెద్ద తేడాలు పక్కనపెట్టి వరస[…] కలిపి పిలుచుకోవడం ఒక సంప్రదాయం. అందులో ఒ[…] ఆత్మీయత ఒక అభిమానం ధ్వనించేవి. ఉమ్మడి కుటుంబాల[…] అంతరించాక ఎన్నో పిలుపులు కొరవడ్డాయి. చిన్నాన్న[…] బాబాయ్, కక్కయ్య ఈ మూడూ అర్థంలో ఒకటే. నాన్న[…] కొందరు బాబయ్య, కొందరు బాబు అని పిలవడం కద్దు[…] ఇప్పుడు డాడీ ఒక్కటే వినవస్తోంది. చిన్నమ్మ, పిన్ని, కక్కి ఈ[…] మూడూ అమ్మ చెల్లెలికి పిలుపులు. పెద్దమ్మ, అమ్మ, అమ్మక[…] - ఇవి అమ్మ పెద తోబుట్టువు పిలుపులు.

జనపదాలు మరుగున పడ్డాక ఎన్నో సామెతల్ని అర్థ[…] చేసుకోవడం కష్టమవుతోంది. "ఈనగాచి నక్కలపాల[…] చేసినట్టు" ఇది సాధారణ సామెత. ఆవుని ఈనే దాకా జాగ్రత్తగ[…] కాపాడి, తర్వాత దూడని నక్కలపాలు చేశారని దీని అర్థం[…] ఊతకి వచ్చింది - ఈ మాట పశువుకి పంట చేనుకి కూడా[…] వర్తిస్తుంది. సామెతలు గ్రామీణ జన జీవితాల్లోంచి వచ్చాయి[…] సామెతలు జనపదాల్లో పుట్టి ప్రవహించిన పంట కాలువలు[…] జనపదంలో వెతకాలే గానీ లేని శిల్పం వుండదు. అద్భుతమై[…] ఉపమానాలుంటాయి. "మంది ఎక్కువైతే మజ్జిగ పల్చన" అ[…] మాట ఎప్పటికైనా ఎక్కడైనా ఇముడుతుంది. పూచిన తంగేడు[…] తామర తంపర, తామరాకుపై నీటి బొట్టు, అటుకుల[…] చింతాకులు, పేలాలు బొండుమల్లెలు ఇట్లా ప్రతిదానికీ వా[…] స్థాయిలో తగిన పోలికని ఎంచుకుంటారు.

# ఆధునిక సాహిత్యంలో సామాజిక పరివర్తన
## - తెలుగు నవలలు (1980-90)

డా: చింతనూరి కృష్ణమూర్తి
పోస్ట్ డాక్టోరల్ ఫెల్లో, (PDF)
తెలుగు విభాగం
కాకతీయ యూనివర్సిటీ - వరంగల్
ఇ-మెయిల్: chkrishnamurhty2015@gmail.com
సెల్:9705031007

ఆధునిక ప్రక్రియల్లో జీవితాన్ని విస్తారంగా చిత్రించడానికి నవలయే సరియైన ప్రక్రియ. ఇది జీవితమంత విశాల పరిధి కలిగింది. ఆనందాలు-విషాదాలు, వివాహం-విడాకులు, యుద్ధం-శాంతి, సంస్కరణ, సాంఘిక చిత్రణ, తిరుగుబాట్లు, విప్లవాలు, ఉద్యమాల చిత్రణకు అనువైన వాహిక నవల. సాంఘిక జీవితివృత్తంతో ప్రారంభమైన తెలుగు నవల అనేక ఇతివృత్తాలతో పరిఢవిల్లింది. తెలుగు వారి జీవితంపై ప్రభావాన్ని చూపిన ప్రతి సంఘటనను నవల వస్తువుగా తీసుకుని భవిష్యత్ తరాలకు సామాజిక చరిత్రను అందిస్తుంది. ఈ క్రమంలో 1980-90 మధ్య కాలంలో చెప్పుకోదగిన పరిణామాలు చోటు చేసుకున్నాయి. చిరకాలంగా పరిపాలిస్తున్న రాజకీయ పార్టి తన ప్రాభవాన్ని కోల్పోయి, అప్పుడే స్థాపించబడిన రాజకేయ పార్టి అధికారంలోకి రావడం, ప్రజాసంక్షేమ కార్యక్రమాలు ప్రవేశ పెడుతూ, ప్రజలకు సన్నిహితంగా మెలుగుతూనే, వారిపై నిర్భంధాన్ని పెంచడం ఒక విధమైన విచిత్రమైన పరిస్థితి ఈ కాలంలో కన్పిస్తుంది. విప్లవోద్యమ కాలంలో గ్రామాలు భూస్వామ్య వ్యవస్థ, భూముల ఆక్రమణ , తిరుగుబాటు, సాంఘిక దాస్యం, ఆగ్రహం, ఆవేశం, సైద్ధాంతిక పునాదుల్లో మార్పు, ప్రజావామ్యంపై విశ్వాసం సన్నగిల్లడం, నిత్య నిర్బంధం మధ్య ప్రజాస్వామ్యనికి సరియైనదనే పూర్వ భావనను తలకెత్తుకోవడం కన్పిస్తుంది. దేశంలో కొత్తగా ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టడం, లిబరలిజైషన్, గ్లోబలైజేషన్, ప్రవేటైజేషన్, లాంటి సరికొత్త వాతావరణం భారతీయ మార్కెట్ ను ఆవరించి సామాజిక వ్యవస్థపై చెరగని ముద్ర వేయడం కన్పిస్తుంది.

ఆంధ్ర దేశంలో మారుమూల పల్లెల్లోకి, పట్టాణాల్లోకి వస్తుజాలం చొచ్చుకుపోయి గ్రామాల్లో కొత్త పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. తద్వరా గ్రామాల్లో కుతర్కం మొదలై వికాసానికి అడ్డుగా నిలుస్తున్నాయి. విద్యావిధానాల్లో మార్పు, మానవ సంబంధాల్లో వ్యాపారాత్మక ధోరణి, కుటుంబాల్లో వైయుక్తిక ధోరణి, సంఘంలో సామాజిక ఆలోచన శక్తి నశించడం కన్పిస్తోంది. స్త్రీలు, దళితులు, దళిత బహుజనులు, క్రింది, మధ్యతరగతి ప్రజల్లో నిర్ణాయక శక్తి కోల్పోవడం, అవసరాలు ఏవో, విలాసాలు ఏవో తేల్చుకోలేని విచిత్ర పరిస్థితుల్లో ఇరుక్కోవడం కన్పిస్తుంది. పెట్టుబడులు, నకిలీ మందులు, విత్తనాలు, అప్పులు వర్షాభావం వంటి తదితర సమస్యలతో సమస్యలతో సతమతవ్వడం కన్పిస్తుంది.

తద్వారా అన్నదాతల ఆత్మహత్యలు కన్పిస్తాయి. చేతి వృత్తుల వారి దయనీయ పరిస్థితి వారి కుటుంబంలో రెండో తరంవారిని వృత్తిలోకి రాకుండా జాగ్రత్త పడడం, విద్యపైన దృష్టి పెట్టడం కన్పిస్తుంది. కొన్నిసార్లు చేనేత వృత్తి వారి ఆత్మహత్యలు ఈ కాలపు నవలల్లో కన్పిస్తాయి. ప్రజల్లో మూఢవిశ్వాసాలు పొడసూపడం లాంటి పరిస్థుతులు కన్పిస్తాయి. విద్యనభ్యసించడం, చరిత్రను స్మరించుకుని స్ఫూర్తి పొందడం, కార్మిక జీవనంలోని విషాదాన్ని గుర్తెరగడం, దళిత, స్త్రీల సామాజిక స్థితిలోని మార్పులు, ఆర్థిక స్థితిగతులు ఈ కాలం రచనల్లో చూడవచ్చు. మానసిక సంఘర్షణ, వేగంగా మారుతున్న పరిస్థితులు, విలక్షణమైన రాజకీయ స్థితిగతుల చిత్రణ, కారంచేడు, తిమ్మ సముద్రం లాంటి దురటనలు, దళితులపై జరుగుతున్న హత్యాచారాలు తెల్పుతున్నాయి. ఒకే వర్గానికున్న రాజకీయ ప్రాబల్యం రాబోయే కాలంలో దళితులపై విరుత స్వరూపాలు ప్రదర్శించబోయ పరిస్థితులు కన్పిస్తాయి.

ఈ నవలల్లో గల సామాజిక పరివర్తనతో సామాజిక చరిత్ర నిర్మాణం, ఆర్థిక, రాజకీయ, జీవిత పరిణామాలు ప్రజాజీవితంపై ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలు ఎలా ఉంటాయో తెలుస్తుంది. సామాజిక పరివర్తన సామాజిక చరిత్రకు దోహదపడేలా ఉండాలి.

ఈ నవలల్లో వస్తు, శిల్పవైవిధ్యం, సామాజిక పరిణామాలు ఇందులో చిత్రించబడ్డాయి. కుటుంబ జీవిత చిత్రణ, ఉద్యమాల చిత్రణ, ఉమ్మడి కుటుంబాలు శిథిలమవుతూ వైయుక్తిక కుటుంబాలుగా మారుతున్న క్రమం, ఆధునిక విద్య, ఉద్యోగాలు అందకుంటూ ఎదిగే క్రమంలో ఎదుర్కొటున్న కష్టాలు, సమస్యలు, మధ్యతరగతిగా స్థిరపడుతున్న తీరు చిత్రించబడ్డాయి. ఈ నవలల్లో సామాజిక

పెరుగుదల, సంస్కృతి, జీవన విధానాన్ని చిత్రించి రచయితలు తమ తమ ప్రత్యేకతను చాటుకున్నారు.

విప్లవోద్యమ చిత్రణతోనే కాకుండా, తెలంగాణ సమాజ చిత్రణతో అనేక నవలలు వెలువడ్డాయి. దాశరథి రంగాచార్య అన్నీ నవలలు, నవీన్, బోయ జంగయ్య, సరిపల్లి కృష్ణారెడ్డి, వెలమంద రాజా, జ్వాలా ముఖి, మొదలైన వారి నవలలు వచ్చాయి.

1980 తరువాత బతుకుపోరు (1982), బి.ఎస్. రాములు, కొమురం భీమ్, సాహు, అల్లం రాజయ్య, బోయ జంగయ్య- జాతర (1985), ఊరు (1981), అగ్నికణం (1982), వసంత గీతం(1986), అల్లం రాజయ్య- అడవి(1988), వసంత రావ్ దేశ్ పాండే - 'అతడు అడవిని జయించాడు' (1988), కేశవ రావు -'వెలుగు రేఖలు'(1985), సుద్దాల అశోక్ తేజ 'ఉమెన్స్ కాలేజీ'(1990), అంపశయ్య నవీన్ 'ముంతధార' నవలలు, బలివాడ కాంతారావు - 'శ్రీ పదార్పణ', కేశవరావు గార్ల నవలల్లో సామాజిక పరివర్తను అక్షర బద్ధం చేశారు.

**డా: చింతనూరి కృష్ణమూర్తి**
పోస్ట్ డాక్టోరల్ ఫెల్లో, (PDF)
తెలుగు విభాగం
కాకతీయ యూనివర్సిటీ - వరంగల్
ఇ-మెయిల్: chkrishnamurhty2015@gmail.com
సెల్:9705031007

# ఆధునిక కవిత్వంలో వ్యక్తిత్వ వికాసం

కవిత్వరా నిగూఢ భావాల, నిండైన పదాల నిర్మాణాత్మక ఓ సాహిత్య లేఖనం. "వాక్యం రసాత్మకం కావ్యం" అనివిశ్వనాథ సత్యనారాయణ పేర్కొన్నా, "ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళీ కావ్యం" అని దండి నిర్వచించినా, "భావ వ్యక్తీకరణమే కవిత్వం" అని షెల్లీ సులభంగానే తేల్చేసినా, కవిత్వానికంటూ ఓ ఇతమిద్ధమైన నిర్వచనం ఇప్పటికీ లేదు. గతిశీలమైన సమాజానికి తగినట్లే సాహిత్యంలోనూ ఎన్నో మార్పులు చేర్పులు వచ్చాయి. ఒకప్పుడు ఛందోబద్ధమైన రచనలే కవిత్వంగాచలామణి అవగా, ప్రస్తుతం ప్రతీ రచన ఓ విభిన్న ప్రక్రియగానో, వ్యక్తీకరణగానో గుర్తించబడుతోంది. ఒక విధంగా ఈ ఛందోబద్ధమైన సంకెళ్లు తెగడం ద్వారా, మంచే జరిగిందని చెప్పవచ్చు పండితులకే పరిమితమైన కవిత్వం సామాన్యులకుచేరింది. ఎందరో కవులు, ఎన్నో రచనలు చేశారు. నిత్య పరిణామశీలమైన సామాజిక వ్యవస్థను తమ రచనల్లో ప్రతిఫలించారు. ఈక్రమంలో కవిత్వం ద్వారా సమాజంలో పరివర్తన రావాలని, తేవాలని కొందరు ప్రయత్నిస్తే; సమాజ వర్తమాన స్థితిగతులనే ప్రతిబింబిస్తూ, అందుకు తగిన సాహిత్య ప్రక్రియల రూపకల్పన చేస్తూ, మరికొందరు నిరంతర సాహితీ కృషి సలిపారు. ఇలాకవిత్వం అన్ని దశలలోను ముఖ్యంగా ఆధునిక యుగంలో సామాజిక పరివర్తనని పరిశీలించింది, నిరూపించింది. ఆదర్శ భావాలవైపు మరల్చేందుకు పరివర్తనా సందేశాలు అందించింది. ఇందులో ఒక కోణమే వ్యక్తిత్వ వికాసం.

సహజంగానే కవి అక్షరాలనే ఆయుధాలుగా మల్చుకొని, ప్రగతిశీల భావాలతో అభ్యుదయ సమాజం కోసం అహోరహం శ్రమిస్తాడు, తపిస్తాడు. నిరంతరం మేధస్సుతో ఘర్షణ పడుతూ తన మనస్సుని లిఖిస్తాడు. ఆచరణయోగ్యమైన సిద్ధాంతాల ప్రతిపాదనకై జీవితాన్నే అంకితం చేస్తాడు. అందుకే ఎక్కువసార్లు కావ్యేతి వృత్తమ్‌గా సమాజాన్నే స్వీకరిస్తాడుకవి. అందుకేనేమోఅనుభూతి ప్రధానమైన కవిత్వాన్ని, చతుర్దశ విద్యలకి అనుబంధంగా చేర్చి, దాన్నొక విజ్ఞాన మూలంగా భావించారు ప్రాచీనులు. "కావ్యం విద్యాస్థానం" అని యాయవరీయుడు అన్నట్లుగా, కావ్య మీమాంసలో రాజశేఖరుడు ప్రస్తావించిన విషయం ఈ సందర్భంగా మనం గమనించవచ్చు. అయితే అసలు సాహిత్యానికి సమాజాన్ని మార్చే అంతటి శక్తుందా?. అంటే కొంతవరకు కొంతమందినైన ప్రభావితం చేయుగల మానసిక చైతన్యాన్ని, భావావేశాన్ని మాత్రం కల్పిస్తుందని చెప్పవచ్చు. పైగా ఎప్పుడైతే సాహిత్యం అన్న పురాణేతిహాసాలు, ప్రబంధాలను, పునఃరచనలని దాటి, ఊహాల కల్పనలను తోసిరాజని వాస్తవిక సంఘటనలు, జీవితాదర్శా నేపథ్యంలో సాగుతూ వస్తుందో అప్పుడే సామాజిక పరివర్త మొదలైందని భావించవచ్చు. సమాజ హితమే సాహిత్యం అన్న విషయం అందరికీ తెలిసిందే.

సాహిత్యం మనిషిలోని అంతర్ముఖాన్ని పరిచయం చేస్తుంది, స్వీయ విశ్లేషణకు ఆత్మ శోధనకు ఊతమిస్తుంది ముఖ్యంగా తననీ, ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకునే క్రమంలో సాహిత్యం తోడ్పడుతుంది. పాఠకుడు ఎంచుకునే అంశం, రచనలు బట్టి కొన్ని సార్లు వేదాంత ధోరణికి, కొన్ని సార్లు సిద్ధాంత ఆచరణకు కావలసిన ముడి సరుకును అందిస్తుంది. మనిషితనను తాను సంస్కరించుకునే, ఉన్నత వ్యక్తిత్వాన్ని పెంపొందించుకునే అవకాశాన్ని కల్పిస్తుంది. అలాగే తనదైన భావాలతో హృదయాన్ని రంజింపజేసి ఆనందించేలా చేస్తుంది. ఆనందము, ఉపదేశము ప్రయోజనాలైతే రసానుభూతి ప్రధాన లక్ష్యంగా ఉంటుంది సాహిత్యానికి, కవిత్వం మానవ జీవితాన్ని విభిన్న కోణాల్లో స్పృశిస్తూ, స్పందింపజేస్తుందనేమో దానిని కూడా ఓమానవ వికాస శాస్త్రంగా పేర్కొన్నారు పెద్దలు. ఇప్పుడు ఆ వికాస శాస్త్రంలో (కవిత్వంలో) వివిధ రచయితలు రాసిన పలుకవితలను ఉటంకిస్తూ అని సామాజిక పరివర్తనకు, మానవ వ్యక్తిత్వ వికాస భావనలను ఎంతమేరకు నిక్షిప్తం చేశాయో పరిశీలిద్దాం.

తెలుగు భాషా సాహిత్యాల పరంగా 1890 నుండే ఆధునిక యుగం మొదలైనా, కవిత్వం ప్రక్రియకి వచ్చేసరికి 1909-10 నుండి మనం పరిగణనలోకి తీసుకుంటున్నాం. దీనికి కారణం 1909లో రాయప్రోలు సుబ్బారావు గారి లలిత 1910లో గురజాడ అప్పారావు గారి ముత్యాల సరాలు ప్రచురణతో కవిత్వం నవ్యరీతుల్లోకి వెళ్లిపోయింది. అందుకే వీరిద్దరినినవ్య కవిత్వ యుగకర్తలుగా పేర్కొనవచ్చని ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయాలు ప్రయోగాలు అనే సిద్ధాంత గ్రంథంలో జ్ఞానపీఠ అవార్డు గ్రహీత సి.నారాయణ రెడ్డి గారు అభిప్రాయపడ్డారు. ఈ సంగతెలా ఉన్నా నవయుగ వైతాళికుడిగా అందరిచేమన్ననలు పొందుచున్న గురజాడ వారి రచనలు అటు - దేశీ మార్గంలో భాషా, శైలి, ఛందస్సుల పరంగానే కాకుండా ఇటు సామాజిక

చైతన్యానికి, వ్యక్తిత్వ వికాసానికి పెద్దపేట వేసిన రచనలుగా గుర్తింపు పొందాయి. ముత్యాల సరాలులోని మనిషి అనే గేయం మానవతా వాదాన్ని పురిగొల్పుతుంది. అలాగే లవణ రాజు కలలో.....

మంచి చెడ్డలు మనుజులందున

ఎంచి చూడగ రెండె కులములు

మంచి యన్నది మాలయైతే మాలనే అగుదున్

అని మనిషిలోని అంటరానితనపు భావనని అంతమొందించే ప్రయత్నం కనిపిస్తుంది. ఇక ఆయనకు అజరామరమైన కీర్తిని సంపాదించిపెట్టిన దేశభక్తి గేయమైన దేశమును ప్రేమించుమన్నా లో జాతీయాభిమానంతో పాటు విశ్వమానవ ప్రేమ గోచరిస్తుంది. ప్రబోధ కవిత్వానికి మార్గదర్శకులైనటువంటి వీరి ప్రేరణతో 1914లో రాయప్రోలు వారు కూడా ఏ దేశమేగినా ఎందుకాలిడినా అంటూ భారత జాతీయతను ప్రబోధించారు. భారత స్వాతంత్రోద్యమంలో అతివాద దశ నడుస్తున్న నాటికాలానికి తగ్గట్లు, వీరు ఆంధ్రులలో సమైక్యతా, స్వదేశీ భావనలు పెంపొందించడానికి ఇటువంటి రచనలు చేశారని తెలుస్తున్నది. విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తిలోనూ ఇదే కోణం కనబడినా, విశ్వనాధ వారు గ్రాంధికంనే వాడటానికే ఇష్టపడటంతోఆయన రచనల్లో ఆధునికత లేకపోయింది.

ఈ రకంగా సాగుతూ వచ్చిన కవిత్వ రచనలో భావ ప్రధానంగా, అంతర్ముఖ లక్షణంతో వచ్చిన భావ కవిత్వం – తెలుగు సాహిత్యంలో సంచలనం సృష్టించినా అది వ్యక్తిత్వ వికాసానికి పెద్దగా తోడ్పడలేదు. రసానుభూతి లక్ష్యంగా ఇవి ఎక్కువగా సాగిపోయాయి. అందుకే తర్వాత కాలంలో అభ్యుదయ కవిగా ఎదిగిన శ్రీశ్రీ వంటివారు భావ కవిత్వాన్ని నిరసించి,సమాజ చైతన్య గీతికలు రచించారు.

కదిలేది కదిలించేది

పెను నిద్దుర వదిలించేది

మునుముందుకు నడిపించేది

పరిపర్ణపు బ్రతుకు నిచ్చేది

కావాలోయ్ నవకవనానికి ( నవ కవిత, మహా ప్రస్థానం) అంటూ శ్రీ శ్రీ వ్యక్తిత్వ వికాసానికి, సామాజిక పరివర్తనకు, కవిత్వ రచనని ముడిపెట్టాడు. అప్పటి వరకూ ఉన్న ఛందోబద్ధ నియమాల ఉల్లంఘన చేసి వ్యక్తి చైతన్యమే సమాజ చైతన్యం, వికాసం అని భావించి, కవిత్వానికి విప్లవ వర్ణాలు అద్దాడు. నేనుసైతం ప్రపంచాగ్ని సమిధనొక్కటి ఆహుతిచ్చాను అంటూ యువతలో అభ్యుదయబీజాలు నాటాడు. మానవుడే నాసందేశంమనుష్యుడే నా సంగీతం అని ఎలుగెత్తి చాటాడు. దాశరథి పునర్నవంలో

మనసుకూ మనసుకూ చుట్టరికం హెచ్చితే

మనిషే మనిషికే మధ్య రాగబంధం ఏర్పడుతుంది.

అని తన కవిత్వం ద్వారా మనుషుల మధ్య మమతల వారధులను నిర్మించే ప్రయత్నం చేశాడు.

ఒక అలాగే కుందుర్తి వారు లక్ష్యసాధకుల్ని ప్రేరేపిస్తూ రాసినా యుగేయుగే లోని

నల్లని కాలం క్రమ్మిన కారు మబ్బుల ఆవరణ ఛేదించి

వెలుగు చంద్రుణ్ణి పెకలించు

గిరిశిఖరపుటంచుల త్రోవలకడ్డంగా

కట్టిన దుర్గమ దుర్గాలు ఛేదించి

బ్రతుకు పరమ సత్యం శోధించు...

వంటి కవితా పంక్తులు అచేతనుడిలో కూడా సగం బలాన్ని కల్పిస్తాయనడం అతిశయోక్తి కాదు.

ఆధునిక కాలంలో మనిషే కేంద్రంగా అభివృద్ధి చెందిన తత్వ శాస్త్రం అస్తిత్వవాదం. దాని భావజాలానికి ప్రభావితమైన వారిలో కాళోజీ ఒకడు. అందుకే అందరి గొడవను నా గొడవ అని ప్రకటించుకున్నారు.

ప్రతి వారికి వ్యక్తిత్వం ఉంటేనే పౌరత్వం

వ్యక్తిత్వం భద్రంగా ఉంటేనే వ్యక్తి బ్రతుకు

వ్యక్తిత్వం భద్రంగా ఉంటేనే జాతి బ్రతుకు

అన్న విశ్వాసం కాళోజీది. సంక్షిప్తత, సరళత ప్రధానమైన ఆయన కవిత్వంలో ప్రతి పంక్తి ఓ వ్యక్తిత్వ వికాస పాఠమే.

సాగిపోవుటె బ్రతుకు

ఆగిపోవుటె చావు

సాగిపోదలచిన

ఆగరాదిచటెపుడు అంటాడో కవితలో

పుట్టుక నీది

చావు నీది

బ్రతుకంత దేశానిది అంటూ మరో చోట

దిశా నిర్దేశం చేస్తాడు.

ఇక తెలుగు సాహిత్యంలో కీర్తి శిఖరమై భాసిల్లిన సినారె గారు తన తెరచిన పుస్తకంలో......

వ్యక్తిత్వం ఉబికి రావాలి

కొలిమి నిప్పులోంచి శిరసెత్తే సెగలా

# గిరిజన జీవన విధానము, సాంస్కృతిక పరివర్తన

పేర్లి దాసు, ఉపాధ్యాయులు
మండల పరిష్యత్ ప్రాథమికోన్నత పాఠశాల,
కేసరపల్లి, గన్నవరం మండలం, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్
సెల్ : 9963249775
ఈమెయిల్ : perlidasu@gmial.com

ప్రపంచంలోని గిరిజనుల సాధక బాధకాలు తెలియజేయమని ఐక్యరాజ్య సమితి 1982 సం॥లో కమీషన్‌ను ఏర్పాటు చేసింది. ప్రపంచవ్యాప్తంగా 5,000 తెగలు, 37కోట్ల గిరిజనుల జనాభాను గుర్తించి, 1994 ఆగస్టు 9వ తాదేన ఈ కమీషన్ ఐక్యరాజ్య సమితికి గిరిజనులకు సంబంధించిన ఒక నివేదికను అందించింది 1996లో ఐక్యరాజ్యసమితి గిరిజన హక్కులపై ముఖ్యమైన తీర్మానం చేసింది ఐక్యరాజ్య సమితి గిరిజనులకు స్వయం పరిపాలన హక్కు, సంస్కృతి, భాష, సాంప్రదాయాలను కాపాడే హక్కు ఇతర ప్రజలు ఆక్రమించుకున్న భూములను తిరి స్వాధీన పరచుకొనే హక్కు సంఘనిర్మాణం చేసుకొనే హక్కు భూమిని, ప్రకృతి వనరులను స్వయంగా నిర్మించుకునే హక్కు భూమిపై గిరిజన తెగల యాజమాన్యం పోకుండా చూసే చట్టంను చేయవలసిందిగా ప్రభుత్వాలకు కోరే హక్కు ప్రభుత్వాల నుండి రాయితీలు పొందే హక్కు ఐక్యరాజ్య సమితిలో గిరిజన తెగల సభ్యత్వం కలిగియుండే హక్కు , వివిధ దేశాలలో గిరిజన తెగలపై సాగుతున్న హింసాకాండను నిలిపివేయుట వంటి హక్కులను పొందుపరచి చర్యను ప్రవేశ పెట్టి, తీర్మానం చేసింది. 1997 సెప్టెంబర్‌లో దీనిపై ఓటింగ్ పెట్టగా, 143 దేశాలు అనుకూలంగా ఓటింగ్ వేయగా, 4 దేశాలు వ్యతిరేకంగా, "దేశాలు తటస్థంగా ఓటింగ్‌లో పాల్గొన్నాయి. ఐక్యరాజ్య సమితి గుర్తించిన ఆగస్టు 9వ తేదీని ప్రతి సం॥ ప్రపంచ గిరిజన దినోత్సవం జరుపుకుంటారు.

ఈ నేపథ్యంలో భారత దేశ జనాభలో 2011 జనాభ లెక్కల ప్రకారం 8.27 అనగా 8.44 కోట్ల గిరిజన జనాభ ఉంది. ఈ జనాభాలో 461 రకాల గిరిజన తెగలుండగా, 92% వరకు అటవీ ప్రాంతంలో, వ్యవసాయం, వేట, అటవీ ఉత్పత్తులపైనే జీవిస్తున్నాయి.

గిరిజనులు లేక ఆదివాసీలు :

భిన్న జాతుల సమాహారమైన భారత ఉపఖండంలో అనేక గిరిజన సముదాయాలు నివసిస్తున్నాయి. గిరిజనులు తమదైన ప్రత్యేకమైన సంస్కృతి, సంప్రదాయం, సామాజిక విలువలను కలిగి ఉంటారు. వీరు నివసించే ముఖ్యరాష్ట్రాలు, ఒడిసా, మధ్య ప్రదేశ్, ఛత్తీస్ ఘడ్, రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, బీహార్, జార్ఖండ్, పశ్చిమ బెంగాల్, మిజోరం, అండమాన్ నికోబార్ దీవులు

నాగాలు : వీరు అస్సాం మరియు మయన్మార్ లోని గిరిజన తెగలను పోలి వుంటారు. నాగాలు ఇండో, మంగోవాయిడ్ కుటుంబానికి చెందుతారు. నాగలలో 14 ముఖ్యమైన తెగలున్నాయి. అవి 1 అంగమి, 2 ఆవో 3 చఖెసంగ్, 4 ఛాంగ్, 5. ఖెముంగన్, 6 కాన్యాక్, 7 లోతా, 8 ఫోమ్, 9. పోచూరి, 10 రెంగ్మా, 11 సంగ్త, 12. సుమి, 13. యించుంగ్, 14. జిలాంగ్.

2. ఒడిషా గిరిజనులు :

1. శంతల, 2. సౌర, 3. కంధాస్, 4. భూమిహార్, 5. గ్వాండియ

3. జార్ఖండ్ మరియు పశ్చిమ బెంగాల్ గిరిజనులు : సంతాల్‌లు

4. మేఘాలయ గిరిజనులు, ఖాసీలు

5. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలలో గిరిజనులు :

1. గోండు (రాజ్ గోండ్, కోయుతూర్) 2. కోలం, 3. ప్రధాన్, 4. తోటి, 5. ఆంద్, 6. మన్నెవార్, 7.చెంచు, 8, నాయక పొడు, 9, కోయ, మెదలుగున్నవి మొత్తం 32 తెగలు.

చెంచులు : ఆంధ్రప్రదేశ్, తెలంగాణ హెడ్యూల్డ్ తెగల జాబితాలో 3వ కులం, హరిదాసులు, బుడబుక్కల, కాటికాపరులు, బోయ, కోయ, ఎరుకుల, యానాది, లంబాడి మొదలైన ఆదిమజాతుల్లో చెంచు కూడా ఒకటి. వీరు పూర్తిగా ఆదివాసీలు, ఆంధ్రప్రదేవ్‌లోని చెంచు తెగ ప్రాచీన సంచార తెగలో ఒకరు నల్లమల ప్రాంతంలోని కొండలు, గుట్టలే సంచార తెగలలో ఒకరు, నల్లమల ప్రాంతంలోని కొండలు, గుట్టలే చెంచుల ప్రస్తుత నివాసస్థలం. అంటే కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలో చెంచులు విస్తరించి, అటు నిజాం రాజ్యానికి, యిటు బ్రిటీష్ పరిపాలనలోని మద్రాస్ ప్రెసిడెన్సీకి సరిహద్దుగాన్ను కృష్ణానదికి ఇరువైపులా వున్న ప్రాంతాల్లో కనిపించేవారు. చెంచులు తెలుగు కూడా మాట్లాడతారు. శ్రీలంకలోని ప్రాచీన తెగ అయిన వెద్దా ల మాదిరిగానే చెంచులు కూడా రింగుల జుత్తు, విశాల వదనం, చప్పిడి

ముక్కు పొడవాటి దవడతో పొట్టిగా, నల్లగా ఉంటారు. శరీరాన్ని తమ పూర్వీకులలాగా ఆకులతో చుట్టుకోవడం ఇప్పుడు లేకపోయినా, మగవాళ్ళు గోచీ మాత్రమే పెట్టుకుంటారు. ఆడవాళ్ళు నూలు రవిక, చీర కట్టు కుంటారు. అడవి చెంచుల కన్నా, నిరుపేదలు మొత్తం భారతదేశంలోనే ఉండరు. పిల్లంబులు ఒక కత్తి, గొడ్డలి, గుంతలు తవ్వే కర్ర, కొన్ని కుండలు, బుట్టలు, మరికొన్ని చింకిపాతలు– ఇవే చెంచుల సమస్త ఆస్తిపాస్తులు, చెంచుల్లో వ్యక్తిగత స్వేచ్ఛా, స్వాతంత్రం అన్న భావనలు బలంగా కనపిస్తాయి. చెంచులు వేటనూ, అడవి పండ్లనూ ప్రసాదిస్తుందని విశ్వసించే ఒక దేవతను, పూజిస్తారు. హిందువులు పరమాత్మగా పూజించే భగవంతుడిలో కొన్ని లక్షణాలతో సారూప్యం ఉన్న ఒక “ఆకాశ దేవుణ్ణి” కూడా చెంచులు పూజిస్తారు. జీవితం దేవుడి వర ప్రసాదమేననీ, మరణించిన జీవుడు దేవుడిలో కలిసి పోతాడనీ, చెంచులు బలంగా నమ్ముతారు, హిందు సమాజ సంపర్కంవల్లే యీ విశ్వాసాన్నీ చెంచుల ఆలోచనా విధానల్లోకి ప్రవేశించాయి. అప్పటికప్పుడు ఆశువుగా పాటలు పాడుతూ స్త్రీపురుషులు నృత్యం చేస్తారు. వీరి ఆటల్లో సింగి సింగడు ప్రధాన పాత్ర ధారులు, నాయినా నాయకులు, డప్పుకు తగినట్టుగా గంతులేస్తారు. ఇప్పపువ్వు సారా తాగితే మైమరిచి కుప్పింగులేస్తారు. నెమలి నృత్యం, కోతి నృత్యం వీరి నృత్యాల్లో ముఖ్యమైనవి, చెంచుల కథలుకూడా పూర్వం ప్రసిద్ధి చెందిన జానపథకళల్లో ఒకటి.

పావనంబైన తమిలేటి పరిసరమున వేగి కురునాటికా దేశ విపినభూమి గోవులను పేరి చెంచుల కులమునందు గడిమి కత్తుల నా గలుగ గమ్మియలదు– (వినుకొండ వల్లభరాయుడు, క్రీడాభిరాము)

విలు నమ్ముల్ ధరియించి చెంచుల తదాభీలాటలీ మధ్యభూముల కన్పట్టిన నంజలింపుము మహాత్ముడైన భర్గుండు భక్తుల కిష్టార్థము లీయగోరిన గణస్థోమంబుతో మాయ పందుల వేటాడుచు భిల్లుడై నరుల కన్నుల్ గప్పి క్రీడించెడిన్ (గుర్రం జాషువా, గబ్బిలం)

బోయలు, చెంచులు మొదలైన వాళ్ళకి పాలన్నం పెట్టి నంత మాత్రాన విశాసవంతులేలూరు ఐతే వాళ్ళకి కోపం రావడం కూడా చాలా తేలికే. వాళ్ళవిషయంలో మంచితనంతో ఉండాలి (యామునిడి రాజనీతి సూత్రాలు)

వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు చెంచులనం విందుకు పిలిచి వాళ్ళు భోజనం చేశాక 150 మంది చెంచు నాయకులను వరుసగా నిలబెట్టి నరికించాడనీ అందుకే ఆ వధ జరిగిన ఊరిపేరు నరుకుళ్ళపాడుగా మారిందనీ తరువాత తాను చేసిన హత్యలకు పశ్చాత్తాపడి గుళ్ళూ గోపురాలు కట్టించాడనీ చరిత్ర.

క్షయ, మలేరియా వంటి వ్యాధుల మూ... చెంచులు మరణిస్తున్నారు. సంతానం నేమి కూడా ప్ర... సమస్యగామారింది. అతి ప్రాచీన ఆదివాసి తెగలైన చె... జాతి అస్తిత్వానికే ముప్పు ఏర్పడుతున్నది. మహబూబ్ న... ప్రకాశం, కర్నూలు, గుంటూరు, నల్గొండ జిల్లాల్లోని దట్ట... నల్లమల అడవీ ప్రాంతంలో వేల సంవత్సరాలుగా జీవిస్తు... చెంచులు. రాష్ట్రంలోని మిగతా జన సమూహాలలో ... ఇతర గిరిజన తెగలతో గానీ, చెంచు తెగకు దగ్గర పో... లేవు, వీరి మనస్తత్వాలు, అలవాట్లు, మానసిక, శా... స్థితిగతులు, సంస్కృతి భిన్నమైనవి. నల్లమల అ... ప్రాంతంలోని ఐదు జిల్లాలను పులులు అభయారణ్య... ప్రకటించి, శాశ్వత నిర్మాణాలు లేని ‘నో మాన్ లాండ్’... ప్రకటించారు. చెంచుపెంటలను పునరావసం పేరిట అ... బయటకు పంపించవద్దని జి.సి.సి. నిర్వహణను చెం... యువతకు అప్పగించాలని వీరు కోరుతున్నారు చెంచు... వ్యవసాయ భూములు అధిక భాగం అన్యాక్రాంతమయ్యా... అంతేకాక వీరి విలువైన వనరులు గిరిజనేతరుల చే... పోయాయి. చెంచుల ఇలవేల్పులైన శ్రీశైలం మల్లికార్జున స్వా... అహోబిళ లక్ష్మీనరసింహ స్వామి దేవాలయాలు వం... సంవత్సరాలుగా చెంచుల సంసరక్షణలోనే ఉండేవి. చెంచు... వీటిని వారసత్వ సంపదగా భావించుకుంటారు. చెంచు... గజ్జల కొండడు, మల్లయ్య తాత దొరవంటి వారు శ్రీశై... మల్లన్న అర్చకులు శ్రీశైలం మల్లన్న ఆలయంలో జ... పూజకార్యక్రమంలోచెంచులకు ప్రత్యేకస్థానం ఉంది. ... పార్వతీ దేవిని తమ ఆడపడచుగా భావిస్తారు. శ్రీశైల మ... సన్నిధిలో చెంచులకు ఉద్యోగాలివ్వాలని కోరుతున్నారు.

చెంచులు నివసించే గ్రామాలను పెంట అంటా... పాచిపెంట, సున్నిపెంట వంటిపేర్లు వినగానే అవి చెంచు... నివాసాలుగా గుర్తించవచ్చును. తాడిపాక, కొలను... గ్రామ నామాలలోని పాక జైనుల నివాసాలు... గుర్తించవచ్చును.

### కోయ

కోయ అనేది ఆంధ్రప్రదేశ్, తెలంగాణలో నివసి... ఒక తెగ తెలంగా, ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు తెగల జాబితా... 18వ కులం. వీరు ఇంద్రావతి, గోదావరి, శబరి, సీలే... నదుల ప్రాంతాల్లోను మరియు బస్తర్, కొరాపుట్, వరం... ఖమ్మం, కరీం నగర్, ఉభయ గోదావరి జిల్లా... విస్తరించియున్న దట్టమైన అడవులైన తూర్పు కనుమల... కనిపిస్తారు. భారతీయకుల వర్గీకరణ ప్రకారం వీరు షెడ్యూ... ట్రైబ్ గ్రూపుకి చెందిన వారు. 1991 జనాభా లెక్కలప్రకా...

వీరి సంఖ్య 1, 40,000 దేశభక్తి, ఐక్యత ఎక్కువగా ఉన్న వీరు 1880 సం॥లో బ్రిటీషు పాలనపై తిరుగుబాటుచేశారు. భారతీయ స్వాతంత్ర్య పోరాట చరిత్ర ప్రకారం తిరుగుబాటుచేశారు. భారతీయ స్వాతంత్ర్య పోరాట చరిత్ర ప్రకారం దీనినే కోయతిరుగుబాటు అని అంటారు. కోయ వారు మాట్లాడే భాష కోయి-తెలుగు భాషను పోలికగా ఉంటుంది.

కోయ వారి నమ్మకం ప్రకారం మొదటిగా జీవి నీటిలో పుట్టింది. నాలు సముద్రాల మధ్య ఘర్షణ ఏర్పడి అందులోంచి నాచు, కప్పలు,చేపలు, సన్యాసులు పుట్టుకొచ్చారు. ఆఖరిగా దేవుడు పుట్టుకొచ్చి తునికి మరియు రేగు పళ్ళను సృష్టించాడు. 18వ శతాబ్ధంలో మరాదాలు పెట్టిన చిత్రహింసలు భరించలేక కొండల్లో తలదాచుకున్నారు ఈ సమయంలో యాత్రికులు వీరిని అనాగరికులుగా పరిగణించేవారు. తరువాతి కాలంలో నిజం వారు భద్రాచలం తాలుకాను బ్రిటీష్‌వారికిచ్చారు అప్పుడు ఆ డివిజన్‌లో 225 కోయగ్రామాలుండేవి.

కోయవారిలో రాచకోయ, వింగదారి కోయ, కమ్మరకోయ మరియు అరటికోయ అనే ఉపకులాలున్నాయి ఈ ఉపకులాల్లోకే ఆహారపు అలవాట్లు ఒకలా ఉండవు. లింగవారి కోయలు గొడ్డు మాంసం తినరు ఇతరులతో భోజనం చేయరు. కులాంతర వివాహాలు వల్ల వచ్చే నష్టాలను నివారించడానికి కొన్ని పూజలు చేస్తారు. రాజకోయలు గ్రామ పెద్దలుగా ఉంటారు. పండుగ సమయంల్లో వీరుకూడా కొన్ని పూజలు చేస్తారు. కమ్మర కోయలు వ్యవసాయ పని ముట్లను తయారు చేస్తారు. అరటికోయలు పాటలు పాడతారు. వంశ వృక్షలను వివరిస్తారు.

జీవన భాగస్వామిని చర్చల ద్వారా ఎన్ను కుంటారు. ఒక్కొక్కసారి అమ్మాయి, అబ్బాయిని ప్రతి బింబించేలా అమ్మాయి మీద నీరు పోయడం వంటి నాటకోత్తర సన్నివేశాలు జరుగుతాయి. వివాహవేడుకను రెండు గ్రామస్థులు కలిసి మూడురోజులు జరుపుకుంటారు. ప్రతి వ్యక్తి ధాన్యాన్ని, మధ్యాన్ని పెళ్ళికూతురు ఇంటికి తీసుకువెళ్తరు జరుగుతుంది. తాటికల్లు ఎక్కువగా దారికే ఎండాకాలంలో వివాహాలు జరుగుతాయి.

దహన సంస్కారాలు విభిన్నంగా జరుగుతాయి. శవాన్ని మంచం మీద పడుకోబెట్టి, ఆశవం ప్రక్కన ధాన్యం, కల్లు, క్రొత్తబట్టలు, డబ్బులు మరియు ఆవుతోక పెట్టి అందరూ మోసుకెళ్ళి శవాన్ని తీసుకెళ్ళతారు. గర్భిణీ స్త్రీ మరియు ఐదునెలలోపు పిల్లల శవాలను పాటి బెడతారు, 11వరోజు దినం పాటిస్తారు. ఆసమయాల్లో ఆత్మ మరలా వచ్చి ఆనకుండా అనే మట్టి కుండలో నివసిస్తుందని నమ్ముతారు.

కోయ భాషను గురించి గిడుగు రామమూర్తి పంతులుగారు క్రింది విధంగా తెలియజేశారు.

సవరలు, కోయలు మొదలయిన మోటు జనులు సంఘములలో అందరూ ఒక్క విధమయిన భాషే మాట్లాడతారు, శిష్ట భాష అనీ, గ్రామ్య భాష అనీ తారతమ్యాము ఉండదు. నాగరికులతో సంబంధము గల వారు కొందరు నాగరికుల మాటలుకొన్ని తమ భాషలో కలిపి వాడుకుంటారు. వాటి ఉచ్చారణ సరిగా ఉండకపోయినా, అందరూ వాటిని మెచ్చుకొంటారు గాని నాగరికులు వాటిని "అపభ్రంశ" అంటారు. వర్ధవ్యవస్తే యేర్పడ్డ సంఘములలో భాషా వ్యవస్థకూడా ఏర్పడుతుంది. మాట్లాడే వారి ప్రతిష్ట, గౌరవము, కులీనత్వము మొదలయ్యి వాటిని బట్టి వారి భాష 'శిష్ట భాష' అని మెప్పు పొందుతుంది, అట్టి వారితో సహవాసము చేత, ఇతర జాతుల వారికి కూడా శిష్ట భాష అలవడుతుంది. క్రమక్రమంగా ఈ శిష్టభాష సంఘములలో వ్యాపిస్తుంది. దేశభాష అనేది ఈలాగుననే ఏర్పడుతుంది.

ఆదేవిధంగా గ్రాంధిక భాషావాసులు తెలియజేస్తూ... వెయ్యేళ్ళు క్రితమే స్థిరపడి తెలుగును కోయ, సవర, చచ్చట, భాషల్లాంటికే వల వ్యవహార దశకూ ఆటవిక స్థితికి దించరాదు అన్నారు.

నాగరికత ఎంతగా విస్తరిస్తున్నా, గిరిజన ప్రాంతాలు మాత్రం సమస్యలు ముట్టడి నుండి బయటపడటంలేదు. పౌష్టికాహారలోపం, రక్తహీనత, సాంక్రమిత వ్యాధులు, వాటికి తోడు మూఢనమ్మకాలు వెరసి ఉభయ తెలుగు రాష్ట్రాల్లోనూ పెద్ద సంఖ్యల్లో గిరిజనులు ప్రాణాలు కోల్పోతున్నారు అరకొర రహదారులు, అంతంతమాత్రమే వైద్యసదుపాయల కారణంగా సీజన్ వ్యాధులు విస్తరించినపుడు అడవిబిడ్డలు పరిష్కారం తెలియని అనివార్యతల్లోకి జరుపుకుంటున్నారు. వర్షాకాలం వస్తే చాలు అతిసారా, విషజ్వరాలు ప్రబలి మరణాలు సంభవిస్తుంటే ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు ప్రేక్షక పాత్రకే. పరిమితమవుతున్నాయి. ఈ దురవస్థను మార్చే గట్టి చర్యలు మాత్రం ఎక్కడా కనిపించడంలేదు. స్వాతంత్రం వచ్చి ఏడు దశాబ్దాలు గడుస్తున్నా-తెలుగు రాష్ట్రాల్లోని గిరిజన ప్రాంతాల్లో 70శాతం గిరిజన గ్రామాలకు సురక్షిత తాగునీటి వసతి, ఆపదవస్తే దగ్గర్లోని ఆసుపత్రికి చేర్చే సరైన రోడ్డు రవాణా సౌకర్యం లేదంటే అతిశయోక్తి కాదు.

భారత ప్రభుత్వం 2015లో వెలువరించిన గణాంకాల ప్రకారం సుమారు 22,93,000 గిరిజనులు ఆంధ్రప్రదేశ్‌లోను, 29,39,000 మంది గిరిజనులు తెలంగాణాలోనూ కొండ ప్రాంతాల్లో కనీస సౌకర్యాలకు ఆమడ దూరంలో నివసిస్తునారు.

ప్రస్తుతం ఉభయ తెలుగురాష్ట్రాల్లో గిరిజనులు ఒకరకమైన ఆరోగ్య ఆత్యయిక స్థితిలో బతుకునీడుస్తున్నారు. మలేరియా, డెంగీ, డయోరియాలు అనూహ్యంగా వ్యాపిస్తున్నాయి. గిరిజన ప్రాంతాల్లోని చిన్నపిల్లల్లో 54 శాతం మారి పోషకాహారంలోపంతో, గర్భిణీల్లో దాదాపు 50శాతం వరకు రక్తహీనతతో బాధపడుతున్నారు. సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థల ద్వారా ఏటా వందల కోట్ల కేటాయింపులు జరిపి వైద్య, విద్యారంగాల్లో అడవి బిడ్డల జీవన ప్రమాణాలు పెంచేందుకు ఖర్చు చేస్తున్నామని చెప్పుకొనే ప్రభుత్వాలు-గిరిజన ప్రాంతల్లో పెద్ద యెత్తున విషజ్వరాలు ప్రబలుతున్నా చురుగ్గా స్పందించకపోవడం దురదృష్టికరం.

అదే విధంగా గిరిజనుల్లో విద్యాభివృద్ధి అంతంతమాత్రమే నన్నది అక్షిరసత్యం గిరిజనుల జీవన ప్రమాణాలు పెంచి వారిని అభివృద్ధి పథంలోకి తీసుకొచ్చేందుకు ప్రారంభించిన గిరిజన ఉపయోగకరం లక్ష్యానికి దూరంగా నిలిచిపోతోంది. తెలుగురాష్ట్రాలఅల్లో గిరిజన ఉపప్రణాళిక అడవి బిడ్డల ప్రగతికి ఆశించినంత చేయుత నివ్వలేకపోతోంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ దేశాల్లో గిరిజన ప్రణాలిక చట్టం అమలుపై ఆర్థిక, సామాజిక అధ్యయక కేంద్రం (సెస్) అధ్యయనం నిర్వహించింది. సేస్ ప్రొపేసర్ ఎం. గోపీ... రెడ్డి నేతృత్వంలో పల్లా త్రినాధరావు, కూడిన బృందం... పప్రణాళిక కేటాయింపులు, అమలు తీరును మందించి... పప్రణాళిక అమలు బాల్యదశలోనే ఉందని వాఖ్యాని... ప్రభుత్వం చెబుతున్న కేటాయింపులు, చేస్తున్నా ఖర్చు... పొంతనే లేదని లేల్చింది. ఉపప్రణాళిక కింద ... ప్రయోజనాలు గిరిజనులకు అందడం లేదని, పథ... అమల్లోనూ అవకతవకలున్నాయని వెల్లడించా... చట్టబద్ధమైన వ్యవస్థలో ఉపప్రణాలక అమలు... సమీక్షించాలని సూచిస్తూ... ఆదాయ సృష్టి పథకా... వ్యవసాయ కార్యక్రమాల ద్వారా గిరిజనలు సానుకూలమై... మార్పు తీసుకొని వచ్చాని పేరుంది. ప్రభుత్వ గణాంకా... చూనస్తాంటే అమలుపై పర్యవేక్షణ సరిగా లేద... అమలవుతోందని, గిరిజనుల కోసం కోట్లాది రూపాయ... ఖర్చు చేస్తున్నామంటే ప్రజలు నమ్మరని వాఖ్యానించింది.

ఈ నేపంతో విజ్ఞులైన పాలకులు, అధికారులు చిత్త... ద్ధితో గిరిజనుల సంస్కృతి, సంప్రదాయాలను పరిరక్షణ... గిరిజనుల సంక్షేమానికి కృషి చేయవలసిన అగత్యం ఎంతై... ఉన్నది.

**పేర్లి దాసు, ఉపాధ్యాయులు**

మండల పరిష్యత్ ప్రాథమికోన్నత పాఠశాల,

కేసరపల్లి, గన్నవరం మండలం, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్

సెల్ : 9963249775

ఈమెయిల్ : perlidasu@gmial.com

## పత్ర సమర్పణ
## మల్లినేని నాగ వెంకట ప్రసాద్
M.A, (Phd)

**కవి సుధాంశు :**

ఖండ కావ్యాలతో అఖండ కీర్తి నార్జించి ఆధునికాంధ్ర సాహితీలోకానికి సుపరిచితులైన సుకవి జంధ్యాల పాపయ్య శాస్త్రి. తెలుగునాట తెలుగు నుడికారంతో అచ్చ తెలుగు పదాలతో పద్యవెలుగులు జిమ్మిన కవి చంద్రుడు కరుణశ్రీ. అదే జంధ్యాల వంశంలో పుట్టి వారి కవిత్వాన్ని వారసత్వంగా పుణికి పుచ్చుకుని వస్తువులో, ప్రక్రియలో నూటికి నూరు పాళ్ళు వారిని అనుకరిస్తూ వారి స్ఫూర్తితో కవిత్వం చెప్పిన కవిశశాంకుడు సుధాంశు. వీరి కలంపేరు సుధాంశు. వీరి పేరు జంధ్యాల వేంకట కృష్ణ లక్ష్మీ నారాయణ శాస్త్రి.

గుంటూరు జిల్లా కొమ్మూరు గ్రామంలో, 1933వ సంవత్సరంలో కృష్ణవేణమ్మ, మల్లయ్య దంపతులకు జన్మించారు. చిన్నప్పట్నుంచి తెలుగుభాషపై ఎనలేని అభిమానం. తెలుగుపై గల మక్కువ, బాబాయి కరుణశ్రీ గారి స్ఫూర్తి వీరిని తెలుగు అధ్యాపకుడిగా, తెలుగు కవిగా నిలబెట్టాయి. దాదాపు 17 సంవత్సరాలు తెలుగు భాషకు అధ్యాపకుడిగా విశేష సేవలందించారు. ఇక కవిగా తెలుగు తల్లికి తన కావ్యపుష్పాలతో పదార్చన చేశారు.

"వైజయంతి" తో కావ్య ప్రస్థానం ప్రారంభించి "ఆదికవి"తో కవిగా గుర్తింపు పొంది "జయ భారతి"తో తిరుగులేని కవిగా పేరు తెచ్చుకున్నారు. "ప్రతిమా, సులోచన" నాటకాలు నాటక రచయితగా పేరు తెచ్చి పెట్టాయి. నవలా రచయితగా "చంద్రగుప్త విజయం" తో నిరూపించుకున్నారు. ప్రతిమా, సులోచన నాటకాలు, అలాగే చంద్రగుప్త విజయం నవల విశ్వవిద్యాలయ, కళాశాలలకు పాఠ్యగ్రంథాలుగా కూడా నిర్దేశించబడటం విశేషం. వీరు కంచు కంఠంతో పద్యాలు పాడుతుంటే మంత్ర ముగ్ధులమై పోవాల్సిందే. రంగనాథ రామాయణాంతర్గత సులోచన వృత్తాంతాన్ని నాటకంగా తీర్చిదిద్దారు. నాటక రచనలో భాగంగా భారతీయ సంస్కృతికి అద్దం పట్టే అనేకానేక అంశాల్ని నాటకీకరించారు. కొన్నింటిని కాలానుగుణంగా మార్పు చేశారు. ఏది ఏమైతేనేం నాటకాన్ని సర్వలక్షణ సమన్వితం చేసి అందించారు.

**సంక్షిప్త నాటకం :**

తెలుగులో వచ్చిన రామాయణాల్లో రంగనాథ రామాయణం మొట్ట మొదటిది. రసాత్మకమైన రంగనాథ రామాయణంలో అనేక అవాల్మీకాంశాలు చోటు చేసుకున్నాయి. వాటిల్లో ఒకానొకటి మహాసాధ్వి సులోచన కథ.

ఇంద్రజిత్తు ఇల్లాలైన సులోచన ధర్మపక్షపాతి. మహాసాధ్వి. రావణుడి దుశ్చర్యకు రామలక్ష్మణులు లంకపై దండెత్తుతారు. ఇంద్రజిత్తును లక్ష్మణుడు హతమారుస్తాడు. సులోచన ఇంద్రజిత్తుతో సహగమనం చేస్తుంది. ఇది మూల కథ. ధీరోదాత్తయైన సులోచన కథను స్వతంత్ర నాటకంగా తీర్చి దిద్దారు సుధాంశు. ధర్మ విజయాన్ని నిరూపించడం నాటక లక్ష్యం. మహాపతివ్రతయైన సులోచన రాముడి సన్నిధిలో అభీష్టసిద్ధి పొందుతుంది. ఈ కథను నాటకీకరణ చేయడంలో రచయిత కృతకృత్యుడయ్యారు. రా వం లక్ష్మణులపై యుద్ధానికి వెళ్తున్న ఇంద్రజిత్తును సులోచన వారిస్తుంది. ధర్మాత్ముడైన రాముడితో యుద్ధం కూడదు. ధర్మానిదే జయం అంటుంది. తండ్రి ఆజ్ఞాపాలనయే సర్వ ధర్మ శ్రేష్ఠం అని ఇంద్రజిత్తు యుద్ధానికి వెళ్తాడు. యుద్ధ విశేషాల్ని అతివేగుడు వివరిస్తుంటాడు.

మేఘనాధుడు మేఘగర్జనలా విజృంభిస్తూ శత్రువుల్ని చీల్చిచెండాడతాడు. ఇంద్రజిత్తు లక్ష్మణులు సింహకిశోరాల్లాగా తలపడతారు. చివరికి ఐంద్రాస్త్రంతో లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరిస్తాడు.

ఇంద్రజిత్తు మరణంతో రావణుడు శోకాగ్నిలో మునిగిపోతాడు. సీతాపహరణమే ఇన్ని అనర్థాలకు, ఇంద్ర చావుకు కారణం. సీతను పంపించేసి రాముడితో రాజీ పడమంటుంది సులోచన. వీర మరణం చెంది భర్త దేహాన్ని తెచ్చివ్వమంటుంది. రావణుడు ఆత్మాభిమానం చంపుకొని శత్రువుల్ని అర్థించనంటాడు పతిపద సాన్నిధ్యమే నాకు ఆనందం. నా కోసం యుద్ధ భూమిలో ఎదురుచూసే భర్తను చేరటాని అనుమతి కోరుతుంది. ఆశ్రిత రక్షకుడైన రాముణ్ణిచేరి అనుగ్రహం సంపాదిస్తుంది. సంకల్ప బలంతో అభీష్టసిద్ధి పొందుతుంది.

సులోచన రావణుడికి ధర్మ బోధ చేస్తుంది. ఇంద్రజిత్తుకు కర్తవ్యపాలన గుర్తుచేస్తుంది. యుద్ధాన్ని నివారించటానికి ప్రయత్నిస్తుంది. భర్త మరణించినపుడు పుట్టిడు దుఃఖంలోనూ మనో ధైర్యంతో వీరమరణం చెందిన భర్తను చేరుతుంది. "నిత్య సుమంగళీభవ" అనే దివ్యాశీస్సులు పొందుతుంది. పతి పాదాల చేరటమే తన జీవితాశయంగా భావించి నెరవేర్చుకుంటుంది. ఆదర్శ చరితయైన సులోచన కథ నే స్త్రీలకు ఆదర్శనీయం, ఆమె మానసిక ధైర్యం అభిలషణీయం, శాంతికాముకత శ్లాఘనీయం, శత్రుగుణ కీర్తనం, ధర్మ పక్షపాతం కొనియాడదగింది.

ఈ నాటకం ద్వారా రచయిత సులోచన ధీరోదాత్తను నిరూపించాడు. ధర్మాత్ములైన శత్రువుని ఆశ్రయించి భర్తకు పుణ్యలోకాల్ని కలిగించిన ఆమెను ధర్మ స్వరూపిణిగా చిత్రీకరించాడు. సతీసహగమనం లాంటి కుసంస్కృతికి అప్రాధాన్యమిచ్చి సుసంస్కృతి స్థాపనకు కృషి చేశాడు. మహా సాధ్విగా ప్రస్తుతించాడు

**శత్రుగుణ కీర్తనం :**

రాముడితో యుద్ధానికి సిద్ధమైన ఇంద్రజిత్తుతో సులోచన లోకైక వీరుడైన రాముడితో యుద్ధం సామాన్యమైంది కాదు. అతి పిన్న వయస్సులోనే అనేకానేక శస్త్రాస్త్రాల నైపుణ్యాన్ని సంపాదించాడు తాటకను సంహరించాడు. విశ్వామిత్ర యాగరక్షణ చేశాడు, శివధనుస్సు విరిచి వేశాడు. లంకేశ్వరుల అకారణంగా రామ చంద్రునితో యుద్ధాన్ని తెచ్చిపెట్టుకున్నారు అంటూ రాముడి గొప్పతనాన్ని, ధర్మ స్వరూపాన్ని కొనియాడుతుంది. తద్వారా భర్తను యుద్ధ విముఖుడ్ని చేయ ప్రయత్నిస్తుంది.

సీ॥ **తండ్రి యానతి తలదాల్చి రాజ్యము వీడి**
**వనవాసమొనరింప వచ్చినారు**
**నిజతపోనుష్ఠాన నిష్ఠులౌ మునుల హిం**
**సించు దుర్జనుల శిక్షించినారు**
**అనుచిత వర్తనయైన మీ యత్తను**
**తగుశిక్ష వైచి యదల్చినారు !**
**మాయమై వంచించి మైథిలి హరియించి**
**తెచ్చిన దండెత్తి వచ్చినారు !**

**సులోచన నాటకం, పుట 201**

రాముడిలోని తండ్రి ఆజ్ఞాపాలనను, ముని రక్షణను, దుష్ట శిక్షణను శ్లాఘిస్తుంది. మంచి శత్రువుల్లో ఉన్నా పొగడదగింది. శాంతి స్థాపనలో భాగంగా భర్తను యుద్ధ విముఖుడను చేయడానికి శత్రు గుణ కీర్తన చేస్తుంది. ఇది దోషం ఏ మాత్రం కాదు. ధర్మాత్ములైన శత్రువుల గుణాల్ని కీర్తించటమనే గొప్ప సంస్కృతిని నాటకం ద్వారా అందించాడు.

**"శత్రు సంహారం కంటే ఆర్త రక్షణయే కర్తవ్యం"**: ఈ మాటలు రాముడి నోట పలికిస్తాడు. ఇంద్రజిత్తు మరణం తర్వాత సులోచన రాముణ్ణి ఆశ్రయిస్తుంది. ఆశ్రిత వత్సలుడైన రాముడు శత్రువులు ఆశ్రయించినా వారి అభీప్సితాలు తీర్చుతాడు.

తే ॥ **మునుపటి మహేశ చాప ఖండనము కంటె**
**నాటి సాగర సేతు బంధనము కంటె**
**ఈ రణము కంటె తావకాభీష్ట దాన**
**మే మహత్తర మంచునే నెంతు తల్లీ !** సులోచన నాటకం పుట:246

శివధనుర్భంగం కంటే, సేతు నిర్మాణం కంటే, రామ రావణ యుద్ధం కంటే కూడా ఆశ్రితుల అభీష్టాలు తీర్చడమే నాకు మిక్కిలి సంతృప్తి అంటాడు రాముడు.

శత్రువులపై సయితం దయ చూపించాలనే సందేశాన్ని, సంస్కృతిని రాముడి మాటల్లో చెప్పించాడు రచయిత. నేడు ఉగ్రమూకలు భయోత్పాతాన్ని సృష్టిస్తూ సామాన్యుల ప్రాణాలు బలిగొంటున్నాయి. శత్రుదేశాలు దురాక్రమణకు పాల్పడుతున్నాయి. అహింసను ప్రేరేపిస్తూ శాంతిని సమాధి చేస్తున్నాయి. ప్రభుత్వాలు యుద్ధాల మోజులో పడి ఆర్తుల ఆర్తనాదాల్ని పెడచెవిన పెట్టి వారి సంక్షేమాన్ని, సంరక్షణను పట్టించుకోవడం లేదు. ఇలాంటి సంస్కృతిని నుంచి బయటపడాలి. ఆశ్రిత, ఆర్త రక్షణే మన సంస్కృతి కావాలి అని ఆయన కాంక్షిస్తున్నాడు.

**శాంతికాముకత :-**

ఇంద్రజిత్తు మరణానికి కారణమైన రాముడిపై దండెత్తడానికి పాతాళపతి సిద్ధపడతాడు. రాముడికి లేఖ పంపిస్తాడు. తన తపశ్శక్తిని, మంత్రబలాన్ని నిక్షిప్తం చేసి ఇచ్చిన మణిగొప్పతానాన్ని వ్యర్థం చేసి ఇంద్రజిత్తును లక్ష్మణుడు హతమార్చటం అతని కోపానికి కారణం.

ఆ సమయంలో అక్కడే ఉన్న సులోచన మా నాన్నగారు తన మణిమహత్వానికి అపచారం కల్గిందని అపోహపడ్డారు. మీపై అనుచిత కోపాన్ని చూపిస్తున్నారు. వారిని క్షమించండి అని రాముణ్ణి వేడుకుంటుంది.

తండ్రికి ప్రతి సందేశం తానే పంపుతూ ॥ **"కరుణా సముద్రులైన శ్రీరామ భద్రులు నీ కన్న బిడ్డకు పతి భిక్ష పెట్టిన మహోదారులు ! ఇప్పుడు నేను వారి సన్నిధిలోనే నిల్చియున్నాను. ఈనాడు నా పతిదేవులు రత్నరక్షితులు కాకుండా రణరంగమునకేగుట చేత మరణించారు. మీ ఈ ఆగ్రహావేశ మక్రమమగుచున్నది. మీరు దుఃఖదూరులై ప్రశాంతులు కావలెనని నా కోరిక. మీ ప్రియ తనయ కడపటి కోర్కె మన్నింపగలరు"**॥ సులోచన నాటకం పుట 246

తన తండ్రికి ప్రత్యుత్తరం ఇస్తుంది. ఫలితంగా రాముడికి పాతాళపతికి జరగబోయే మహాయుద్ధాన్ని నివారిస్తుంది. రాముడి ప్రశంసలు అందుకుంటుంది.

తన భర్త మరణానికి కారణమైన వారిపై ప్రతీకారం తీర్చుకోకుండా ధర్మాధర్మ విచక్షణతో వ్యవహరించి రాబోవు యుద్ధాన్ని నివారిస్తుంది.

**సతి సులోచన :-**

లక్ష్మణుడి వీరోచిత ధర్మ పోరాటం ముందు ఇంద్రజిత్తు నిలువలేకపోతాడు. ఐంద్రాస్త్రం నేలకొరుగుతాడు. ఇంద్రజిత్తు మరణానికి బోరున విలపిస్తుంది సులోచన. అంతలోనే ధైర్యమొంది రాము ఆశ్రయించి భర్త దేహాన్ని చేరుకుంటుంది. వీరమరణం చెందిన భర్తతో సహగమనం చేస్తుంది. ఇ రంగనాథ రామాయణంలో బుద్ధారెడ్డి వివరంగా చెప్పాడు.

**ద్విపద ॥ ఆగతలైన ముత్తైదులకపుడు, బాగైన పసిడి శూర్పములు దానముల**
**నిచ్చి వస్త్రంబులనేకంబు లొసగి, యచ్చపు భక్తితో నా చితి మీద**
**బరగ బ్రవేశించి ప్రాణేశునురము, కరమర్థితో దన కౌగిట జేర్చి**
**యనలంబు సంధింప నాయింతి మేను, పనిగొనిపతి సమర్పణముగా జేసి**

॥ రంగనాథ రామాయణము ॥

ముత్తైదువులకు బంగారం, వస్త్రాల్ని దానం చేసి పతి భక్తితో చితిపైకి వెళ్ళి ఇంద్రజిత్తుతో సహగమనం చేసింది.

అని సహగమనం చేసిన విధానాన్ని రంగనాథ రామాయణ కర్త చెప్పాడు.

అయితే కాలానుగుణంగా సతీసహగమనం దురాచారంగా పరిణతి చెందింది. ఈనాడు సతీసహగమనం చట్టవిరుద్ధం. దీన్ని దృష్టిలో పెట్టుకొని రచయిత సులోచన నాటకంలో సతీసహగమనానికి అంతగా ప్రాధాన్యమివ్వలేదు.

ఇంద్రజిత్తు మరణం తర్వాత సులోచన యుద్ధభూమికి వెళ్తుంది. కొన ఊపిరితోనున్న భర్త ఆశీస్సులు పొందుతుంది. భర్తను చివరి చూపు చూసుకోవటానికి సాయపడిన అపద్బాంధవుడైన రాముడికి కృతజ్ఞతలు తెల్పుకుంటుంది. పినమామ విభీషణుడి మన్ననలు పొందుతుంది.

**తే॥ ఆ జగన్మాతయైన సీతమ్మ వోలె**
**జాతికొక నిత్యనూత్న తేజమ్ము గూర్చి**
**వెలిగెదు సీతమ్ము మామనో వీధులందు**
**దివ్యరోచిః ప్ర పూర్ణ ! సాధ్వీమతల్లి !**

**సులోచన నాటకం పుట 248**

పాతివ్రత్య ప్రభావమెట్టిదో నీ దృష్టాంతంతో లోకానికి తెలుస్తుంది. మహాసాధ్వియైన సీతలాగా నీ చరిత భరత జాతికి తేజస్సును అందిస్తుంది అని ప్రశంసలు పొందుతుంది.

అంతేగాక నిరంతర పతిచరణ సాన్నిధ్య సంపత్పూర్ణమైన నీ జన్మము చరితార్థము కాగలదు తల్లీ! అని రాముడితో ప్రశంసలు, ఆశీస్సులు పొందుతుంది.

ఈ విధంగా సులోచన పాతివ్రత్యాన్ని కొనియాడాడే తప్ప, సహగమనాన్ని ప్రత్యేకంగా పేర్కొనలేదు. ఇదొక సత్సంప్రదాయంగా మనం భావించాలి. నిరంతర పతిచరణ సాన్నిధ్యమే స్త్రీలకు గౌరవ ప్రదము, శుభదాయకం అని రచయిత ఉద్దేశం. అంతే తప్ప అనాచారాలు ప్రోత్సహించ లేదు.

ఈ విధంగా సులోచన కథను నాటకీకరించి రక్తి కట్టించాడు. శాంతి ఔన్నత్యాన్ని చాటి చెప్పాడు. అశ్రిత రక్షణను నిరూపించాడు. అనౌచిత్యాన్ని విడిచిపెట్టాడు. సత్సంస్కృతి స్థాపన చేశాడు.

# దళిత జీవన విధానం - సాంస్కృతిక పరివర్తన

ఎలగొండ రాములు.

'ఇండియా'గా పిలుస్తున్న మన దేశానికి ఒకప్పుడు 'జంబూ ద్వీపం' అనే పేరు ఉండేదని చెప్పేతందుకు మనకు ఎన్నో చారిత్రక, సాహిత్య, సాంస్కృతిక, భాషా సంబంధం గల ఆధారాలు ఉన్నాయి. కుల, మత, మూఢత్వ జాడ్యాలు ఆ కాలంలో లేవని, అది మాతృ స్వామ్య ద్రావిడ సంస్కృతి దేశమంతటా విస్తరించి యున్న గొప్ప కాలమని నిరూపిస్తున్న ఆధారాలు కూడా మనకు ఉన్నాయి. ఇందుకు నిలువెత్తు నిదర్శనంగా నిలుస్తున్నది సింధు నదీ లోయ నాగరికత. మానవత, నైతికత, సమానత మొదలగు సుగుణాల పునాదులపై నిర్మింతమైందీ నాగరికత. వ్యవసాయం మురుగు నీటి కాలువల అంతర్నిర్మాణ విధానం, మహాస్నాన వాటిక మొదలగునవి ఎంతో గొప్పగా వర్ధిల్లిన కాలమది. అటువంటి గొప్పతనం గల ఈ దేశంలో నేడు అనేక రకాల సామాజిక రుగ్మతలు ప్రజలను పట్టి పీడిస్తున్న విషయం మనం గమనిస్తున్నదే. కుల వ్యవస్థ కారణంగా దేశం సామాజికంగా అప్రతిష్ట పాలవుతున్నది. ఇటువంటి నేపథ్యంలో దేశంలోని అనేక భాషల్లో వెలువడిన దళిత సాహిత్యంలో వెల్లువెత్తిన సాంస్కృతిక చైతన్యాన్ని విశ్లేషించేదే ఈ వ్యాసం.

"అన్య భాషలలో సాంస్కృతిక పరివర్తన - ప్రాముఖ్యం" అనే పేరుతో జరుగుతున్న గన్నవరం జాతీయ సదస్సులో పత్ర సమర్పణకై నేను తీసుకున్న అంశం "దళిత జీవన విధానం - సాంస్కృతిక పరివర్తన". దళితులు సాంస్కృతికంగా అనుభవించిన అవమానాలు, అగచాట్లు, అనేక కష్టాలు ఏ విధంగా ఉన్నాయో! వాటిని ఎదిరించి ఎట్లా ముందుకు సాగిండ్లో తెలిపే ప్రయత్నం చేస్తున్నదీ వ్యాసం.

అస్పృశ్యులుగా, అంటరానివారుగా, నిమ్న వర్గాలుగా చండాలురుగా, పంచములుగా, హరిజనులుగా, షెడ్యూల్డు కులాలుగా, దళితులుగా పిలువబడుతున్న జనాల హితం కోరి రచించబడేదే దళిత సాహిత్యం.

సెనార్ట్, నెస్‌ఫీల్డ్, సర్‌హెచ్‌రైస్ట్, డాక్టర్ కాట్కర్ లాంటి ప్రపంచ మేధావులు కులాన్ని ఒక దుర్మార్గమైన వ్యవస్థగా చెప్పినట్లు డా॥బి.ఆర్. అంబేద్కర్ ఒక పరిశోధనలతో తెలిపారు. గెయిల్ ఆమ్‌వెత్ లాంటి వారు ఇటీవలి పరిశోదనల్లో కులం చేస్తున్న సామాజిక కాలుష్యంను విశ్లేషించారు. ఇట్టి సామాజిక కాలుష్యం తొలగింపజేసేటందుకు వచ్చిందే దళిత సాహిత్యం. 'ఇండియా'లో మరాఠీ, కన్నడ, తమిళ, గుజరాతీ, బెంగాలీ, హిందీ, మలయాళీ తదితర భాషల్లో వచ్చిన సాహిత్యం పరిశీలాద్దాం.

జాతీయ స్థాయిలో నడిచిన, నడుస్తున్న దళిత ఉద్యమాలకు, దళిత సాహిత్యోద్యమాలకూ, మార్గదర్శులుగా, దార్శనికులుగా సర్వామోదం పొందినవారు ఇద్దరు. వీరు 1) మహాత్మా జ్యోతిబా పూలే 2) డా॥బి.ఆర్. అంబేద్కరు. వీరిద్దరి స్ఫూరితోనే మన దేశంలో దళితోద్యమం, దళిత సాహిత్యోద్యమం, రూపు దిద్దుకున్నది. "గులాంగిరీ" అనే గ్రంథాన్ని పూలే, "అస్పృశ్యులెవరు?" అనే గ్రంథాన్ని డా॥ అంబేద్కర్ రాశారు. ఈ గ్రంథాలే దళిత కవులకు, రచయితలకు ఉద్యోమోత్సాహాన్నిచ్చాయి.

1956లో అనారోగ్యంతో డా॥ అంబేద్కర్ మరణించగా, 1958లో దళిత రచయితల మహాసభ ఏర్పాటై, మహారాష్ట్రలో దళిత సాహిత్య ఆవిర్భావానికి పునాది ఏర్పడింది. ఇండియాలో ఇట్టి సాహిత్య కృషిలో ఇదే మొదటి ప్రయత్నంగా చెప్తారు. 1972లో 'దళిత ఫాంథర్స్' రూపంలో బొంబాయిలో దళితోద్యమ సాహిత్యం విస్తృతంగా తీసుక వచ్చారు. వీరిలో ప్రముఖులు - నామ్‌దేవ్ దసాల్, అర్జున్ డాంగ్లే, జె.వి.పవార్, నామ్‌దేవ్ ప్రహ్లాద్ చెంద్ వాంకర్, అరుణ్ కాంబ్లే మొదలగువారు.

**కన్నడ దళిత సాహిత్యం-**

కన్నడ భాషలో దళిత కథా సాహిత్యం విస్తృతంగా వస్తున్నది. కన్నడ కథానిక దళిత చైతన్యానికి ఒక సంకేతంగా నిలుస్తున్నది. ఈ వ్యాసకర్త ఈ వ్యాసరచన కొరకు పరిశీలించిన కన్నడ దళిత కథానికలు 15. వీటిని 14 మంది కన్నడ రచయితలు రాశారు. ఈ కథల తెలుగు అనువాదకుడు రంగనాథ రామచంద్రరావు గారు. జూలై 2016లో తెలుగీకరించబడ్డ ఈ దళిత కథలు, కన్నడ భాషలో 1968-2015 మధ్య 48 ఏండ్ల కాలంలో రాయబడినవి. వీటిలో మొదటి పది కథలు 20వ శతాబ్దానికి చెందినవి. మిగతా కథలు 21వ శతాబ్దంలో గడిచిన పదేండ్లలో రాయబడ్డాయి. మొదటి దశలో దళిత జీవిత చిత్రణ స్పష్టాస్పష్టం. రెండో దశలోని కథల్లో దళిత దృక్పథం స్పష్టం.

దళిత జనాల జీవితాల్లోని ఆవేదనలు, పీడనలు, హింస మొదలగు అంశాలు మొదటి దశ కథలలో చిత్రితమయినాయి. ప్రశ్నించటం, ఎదురించటం, ప్రతిఘటించటం లాంటివి కొంత వరకు ఈ కన్నడ దళిత కథల్లో కనిపిస్తాయి. ఫిర్యాదు లక్షణం కూడా ఈ దశలో కనిపిస్తుంది. అంతే కాకుండా ఈ కథలలో నెమ్మదితనం తొణికిసలాడుతుంది.

దళితుల తిరుగుబాట్లు వాస్తవికంగా ఆవిష్కరింపబడిన రెండవ దశ కథలలో సమస్యల పరిష్కార దృష్టి వ్యక్తమౌతుంది. క్రియాశీలత ప్రదర్శితమౌతుంది.

అన్ని కథలలో కూడా దళితుల జీవితంలోని వెలుగు చీకట్లు ఆవిష్కరించబడినాయి.

డా॥ దేవనూరు మహదేవ గారు రచించిన కథ "అమ్ముడు పోయిన వాళ్ళు" ఈ కథలో గౌడ కొడుకు కిట్టప్ప దళిత మహిళల్ని, లొంగదీసుకొని అనుభవించడానికి అలవాటు పడ్డాడు. బీరడి భార్య లక్ష్మి ఆత్మగౌరవంతో ఆకలి దహించి వేస్తున్నా కిట్టప్పను ధిక్కరించినా, చివరికి అతనికి లొంగి పోక తప్పలేదు. ఆర్థిక దారిద్ర్యం, దళిత మహిళ ఆత్మగౌరవాన్ని, వ్యక్తిత్వాన్ని పరాయీకరించిన తీరును ఈ కథ చిత్రించింది.

మహదేవ గారు రచించిన మరో కథ పేరు "తూర్పు సీమలో హత్య గిత్య" ఇది గ్రామణ భూస్వామ్య దుర్మార్గాన్ని వాస్తవికంగా ఆవిష్కరించింది. రెక్కాడినా డొక్కాడని కుటుంబ పరిస్థితిని 'రంగప్ప' పాత్ర ద్వారా దీనగాథను వివరించిన కథ ఇది.

డా॥ బి.టి. లలితా నాయక్ గారి రచించబడిన కథ "పండుగ – బలి"దళితులూ మనుషులే. వాళ్ళకూ పండుగలూ, పబ్బాలూ ఉంటాయి. వాటిని ఉన్నంతలోనే భాగా జరుపుకోవాలే, అని అనుకుంటారు. అందుకొరకు కులతత్వవాదపు సంపన్నుల దగ్గర అప్పు చెయ్యక తప్పదు. ఇదే విషయాన్ని "పండుగ – బలి" కథలో చెప్పారు. ఈ కథలో కుటుంబ యజమాని 'సణ్ణు' సాంస్కృతిక ఉత్సవం కొరకు ఒక భూస్వామి దగ్గర అప్పుచేసి, తీర్చ లేక కష్టాల్లో ఇరుక్కుంటాడు.

డా॥ బరుగూరు రామచంద్రప్ప రచన 'కరువు' అనే కథానిక. 'అమ్ముడు పోయిన వాళ్ళు' కథలో లాగా 'కరువు' కథలో కూడా రాముని భార్య చన్నిని, కులతత్వవాది పెత్తందారు 'రంగప్ప' లొంగతీసుకుంటాడు. కరువు కాలంలో కూడా దళిత మహిళలు భూ కామాందులచే చెరచబడటం ఈ కథలోచిత్రించ బడినది.

డా॥ అరవింద మలగత్తి గారు రచించిన కథ 'చిల్లు నాణ్యం – నీళ్ళు' బావిలో నీళ్ళు తోడుకున్నందుకు 'సైద' అనే వ్యక్తి శిక్ష అనుభవించవలసిన పరిస్థితి వచ్చింది. నీటి కొరకు దళితులు పడే కష్టాలు, కులం వల్ల కలిగే అణిచివేత మొదలగు బాధలు ఈ కథలో వివరించబడ్డాయి.

డా॥ బి.టి. జాహ్నవి గారు చేసిన రచన 'రక్త సంబంధం' అనే కథానికి, ధనిక స్వామ్య వ్యవస్థలో డబ్బుకు మానవ సంబంధాలు ఎలా విచ్చినం అవుతాయో, దానికి రక్తసంబంధాలు కూడా ఎలా విలువ లేకుండా పోతాయో ఈ కథలో చక్కగా ఆవిష్కరించడం జరిగింది.

డా॥ మాడ్నాకూడు చిన్న స్వామి గారు రచించిన కథ 'మూగడి బాధ'. ఇది ఒక ఆర్ద్రమైన కథ. వ్యవసాయ కుటుంబంలో ఎద్దు చనిపోతే రైతుకు బాధ. పేద దళితులకు పండుగ. ఇదొక పార్శ్వం. ఈ కథలో గౌడకు ఎద్దు చనిపోయిందన్న బాధకన్నా దాని ద్వారా చెయ్యాలే, అని అనుకున్న వ్యాపారం దెబ్బతినది కదా! అనేది బాధ. కాని దళిత జీతగాడు మూగడికి మాత్రం, గౌడ ఎద్దు " కాళ" చచ్చిపోయిందన్న బాధ మిగిలింది. మనిషికి పశువకు మధ్య ఉండే సజీవ సంబంధం మూగడి పాత్ర ద్వారా ఈ కథ అద్భుతంగా చిత్రించబడినది.

డా॥ ఈరణ్ణ కోసగి గారి రచన ' సంజీవ – వాడి ఇల్లు' అనే కథానిక. 'రక్త సంబంధం' అనే కథలో డబ్బు ముందు రక్తసంబంధాలు ఓడిపోయినట్లే, 'సంజీవ – వాడి ఇల్లు' కథలో కూడా అవి ఓడి పోయాయి. తల్లి డబ్బు కొరకు సర్వ మానవ లక్షణాలను ఈ కథలో విసిరి పారేస్తుంది. ఇద్దరినీ ఆర్థిక సూత్రమే నడిపించినట్లు ఈ కథ సూచిస్తుంది.

డా॥ మొగళ్ళి గణేష్ గారు రచించిన కథ ' మా తాతకొక కోరిక ఉండేది.' ఇది చాలా పెద్ద కథ. కులతత్వవాదుల పెత్తందార్ల బతుకుల కొరకు దళితుల జీవితాలు బుగ్గయిపోయిన తీరును ఒక 'తట్టు(ప్లేటు)'ను ప్రతీకగా తీసుకొని ఈ కథ రచించబడినది. ఒక అతి పెద్ద దళిత కుటుంబంలోని తాత తన వాళ్ళంతా డా. బి.ఆర్. అంబేద్కర్‌లాగా బాగా చదువుకొని గొప్పవాళ్ళు కావాలని కోరుకుంటాడు. కాని ఆయనక కొడుకులు అందుకు భిన్నంగా తయారౌతారు. వ్యవస్థ అలా చేస్తుంది. ఈ కథలో ఇంకా అనేక సామాజిక వ్యక్తిగత రుగ్మతల్ని కూడా చిత్రించారు రచయిత.

మోదారు తేజ గారు చేసిన రచన 'తిరుగుబాటు'కథానిక. సాంస్కృతిక వివక్ష మీద ఒక యువకుని నాయకత్వంలో దళిత జనాలు తిరుగుబాటు చేసి విజయం సాధించిన కథ "తిరుగుబాటు". తిరుగబడినప్పుడే రావలసిన మార్పు వస్తుందని తెలిపిన కథ ఇది. అంబేద్కర్ సంఘం ఏర్పాటుతో సమాజంలోని దుర్నీతి అంతమై, సమానత్వ సాధన దిశగా కృషి సాగిన తీరుకు నిదర్శనం ఈ కథ.

డా॥ అనసూయ కాంబళే గారిచే రచించబడిన కథ "ఊరేగింపు" దళితులను రాజ్యాధికారం దిశగా అడుగులు వేయించిన కథ ఇది. దళితుల క్రియాశీల రాజకీయ చైతన్యాన్ని ఈ కథ ప్రతిపాదించింది. దళితులకు కలిగిన ఆనందం, దళితేతరులకు కంటగింపు కలిగించేదిగా ఉండటం, దళితుల్ని పోలీసు స్టేషన్‌కు పంపటం... మొదలగు సంఘటనల్ని చిత్రించిన కథ ఇది.

మంజునాథ వి.ఎం. గారు రాసిన కథ "అస్పృశ్య గులాబి" దళితుల శ్రమ కావాలి. వాళ్ళ స్పర్శ మాత్రం నిషేధింపబడాలి. ఈ దుర్మార్గాన్ని ఎత్తి చూపిన కథ "అస్పృశ్య గులాబి". 'మాదిగ' కులాన్ని ఆ కులం వారి ఆహారమైన పశుమాంసాన్ని అసహ్యించుకోవటం, అవమానించటం మొదలగు వాస్తవాల్ని ఈ కథ చిత్రించింది. అలాగే ప్రేమ చుట్టూ ఆవరించిన "అస్పృశ్యతను" కూడా ఈ కథలో ఆవిష్కరించటం జరిగింది.

టి.కె. దయానంద గారు చేసిన రచన ' ఓ యర్రన్న కథ'. పీడిత కులాలలోనే పీడకులు పుట్టుకొచ్చి స్వజాతి పీడనకు పూనుకునే వాస్తవాన్ని చెప్పింది ' ఓ యర్రన్న కథ'. రాజకీయ నాయకుడిగా చలామణి అవుతున్న వాలే రాముడు దళితుడైనప్పటికీ, దళితులకు చెయ్యాల్సిన సేవ, చెయ్యకపోగా, వారిని మోసం చేయ్యటం జరుగుతుంది. దగా, అన్యాయం లాంటి పదాలకు పర్యాయపదం వాలె రాముడు. అంతేకాక, పశువుల్ని దొంగిలించి, దగ్గరలో గల సంతలో అమ్మి, హమాలీ పనుల్ని చేసుకునే దళితులకు వడ్డీకి ఇచ్చిన పరమ నీచుడు, నికృష్టుడు. ఇతడి చేష్టలన్నీ తెలిసి కూడా నమ్మిన యెర్రన్న ఇతడి మోసానికి బలికావడం సమకాలీన దళిత సమాజంలోని వాస్తవిక జీవన విధానానికి ఈ కథ దర్పణం.

పి. మంజునాథ గారి కలం నుండి జాలువారిన కథానిక ' ఓ పలక ముక్క కథ". ఈ కథ విద్య ద్వారా దళితులు తమ జీవితాలను బాగు చేసుకున్న క్రమాన్ని ఆవిష్కరించింది. బానిసత్వంలోంచి స్వేచ్ఛా జీవితంలోకి ప్రవేశించేతందుకు ఆధారమైన 'పలక' చుట్టూ ఈ కథ అల్లబడింది.

సంతోష గుడ్డియంగడి గారు రాసిన కథ "గొడ్డు కాఫీ". హోటలులో రెండు గ్లాసుల పద్ధతి మీద తిరుగుబాటు చేసిన కేశవుని కథ 'గొడ్డు కాఫి'. నేటికి కూడా దేశంలోఅనేక చోట్ల దళితులకు, దళితేతరులకు వేర్వేరుగా హోటళ్ళలో రెండు గ్లాసులు పెట్టే విధానం కొనసాగుతూ ఉన్నది. ఇట్టి దౌర్భాగ్య స్థితిని వాస్తవికంగా చిత్రించిన కథ "గొడ్డు కాఫీ".

అమ్ముడు పోయిన వాళ్లు, పండుగ - బలి, తూర్పు సీమలో హత్య గిత్య, కరువు, చిల్లు నాణ్యం - నీళ్ళు, రక్త సంబంధం, మూగడి బాధ, సంజీవ -వాడి ఇల్లు, మాతాత కొక కోరిక ఉండేది - కథలన్నీ

1968–1992 మధ్య కాలంలో రచించబడినవి. వీటిని మొదటి దశ కథలు అంటున్నారు. ఈ కథలన్నిట్లో విమర్శనాత్మక వాస్తవికత ప్రధాన సూత్రంగా ఉన్నది. వీటిలో కొన్నింట్లో ప్రతిఘటనలు ఉన్నా అవి విఫలమయ్యాయి. ఆ తర్వాత రాబోయే కథల్లో క్రియాశీల వాస్తవికత ప్రధాన సూత్రమైంది.

కన్నడ దళిత కథల్లో రెండవ దశకు చెందినవి తిరుగుబాటు, ఊరేగింపు, అస్పృశ్య గులాబి, ఓ యర్రన్న కథ, ఓ పలక ముక్క కథ, గొడ్డు కాఫీ. ఇవి 2005–2015 మధ్య కాలంలో రాయబడినాయి. ఈ కథల్లో దళితుల తిరుగుబాట్లు సఫలమయ్యే దిశగా పయణించాయి. దళితుల ఉద్యమ చైతన్యం ఈ కథల్లో వెల్లివెరిసింది. రాజకీయ స్వభావం సుష్టుగా కనిపిస్తుంది.

ఈ విధంగా కన్నడ దళిత కథలు ఇండియా దేశపు సామాజిక అప్రజాస్వామికతను ఆవిష్కరిస్తూ, ఆలోచనలు రేకెతిస్తున్నాయి. మన దేశం నిజమైన ప్రజాస్వామిక దేశంగా మారవలసిన అవసరాన్ని ఈ కథలు గుర్తు చేస్తున్నాయి.

మహారాష్ట్ర నుంచి స్ఫూర్తిని అందిపుచ్చుకొని కర్నాటకలో అద్భుతమైన దళిత సాహిత్యం పుట్టింది. 1970లలో కర్నాటకలో దళిత సంఘర్షణ సమితి మొదలైంది. గ్రామ గ్రామాన ఈ సమితి శాఖలు ఏర్పడ్డాయి. ఈ సమితి నాయకులు, కార్యకర్తలు ఎక్కువగా కవులు అయి వుండటం విశేషం. వీరు హోరతాద హోటుగళు (ఉద్యమ గీతాలు) అనే పాటల సంకలనాన్ని తీసుకవచ్చారు.

పురాణాలనీ, ఇతిహాసాలనీ, ప్రశ్నిస్తూ కన్నడ దళిత సాహిత్యంలో ఎంతో కవిత్వం వచ్చింది. నాటికలు, దృశ్యరూపకాలు, నవలలు వచ్చాయి. ప్రముఖ కన్నడ దళిత రచయిత, కవి, నాటక కర్త, డాక్టర్ చెన్నన్న వాలీకర్ రాసిన 'ధావేహకువరు'... అనే నాటికలో లచ్చయ్య, తిప్పన్న అనే రెండు పాత్రల సంభాషణ ద్వారా దళితుల రాజకీయ చైతన్యాన్ని ధ్వనింపచేశారు. మరో ప్రముఖ కన్నడ దళిత కవి డాక్టర అరవింద మాల గాటి రాసిన 'మ్యాగిన వారు' (అగ్రకులు) యిలా సాగింది.

"రామాయణంలోని కాలుష్యాలన్నింటికీ సీతే కారణం.
హిందూ మతంలోని కాలుష్యాలలన్నింటికీ
అగ్రకులాలే కారణం
శకునే లేక పోతే
భారతమే లేదు.
కైకే లేక పోతే
రామాయణమే లేదు" – అంటూ అగ్ర కులాల వారి కారణంగానే కాలుష్యం అంతా వచ్చిందని

అభియోగం చేస్తున్నారు కవి.

ఇదే విధంగా మరో ప్రముఖ కన్నడ దళిత కవి సిద్ధ లింగయ్య తన 'సానిరారు నదిగలు (వేలాది నదులు)' అనే కవితలో ఇలా అంటారు.

"వేదాలు, శాస్త్రాలూ, పురాణాలూ అన్నీ
వేలాది నదుల మీద ఎండుటాకుల తెట్టులాగా
పోరాటాల సముద్రం వైపు ప్రవహిస్తున్నాయి".

కన్నడ దళిత కవులు జమీందారీ వ్యవస్థకూ, భూస్వామ్య వ్యవస్థకూ వ్యతిరేకంగా కవిత్వం రాశారు. గంగారామ్ చండాల అనే కవి 'వెట్టి కార్మికుడు' అనే కవితలో –

'రామ జపంలో పడి
నన్నూ నా వాళ్ళనీ మర్చి పోయాను
చీకటినంతా దిగమింగి
వాళ్ళకు వెలుతురు పంచుతున్నాను.
చివరకు నా కన్నీళ్ళలో
ఆకాశ నక్షత్రాన్ని చూశాను.
నేనొక తారకను కావాలనుకున్నాను' – అంటారు.

సిద్ధ లింగయ్య, రామనిణ్ణి లాంటి మరెందరో కన్నడ దళిత కవులు, అత్యాచారాలనూ, సామాజిక, ఆర్థిక దురన్యాయాలనూ దుయ్యబడుతూ గొప్ప కవిత్వం రాశారు. ఎంతో ఆగ్రహంతో రాశారు. దళిత భాషలో, దళిత పదచిత్రాలలో రాశారు. ఎంతో కసితో రాస్తూ కూడా ప్రేమ కవిత్వం కూడా రాశారు. డాక్టర్ చెన్నన్న వాలీకర్ 'నా ప్రేయసి అద్భుతాలు' 'ఏనుమనిబుత్రాలో నన్నేతేయ ఔన్న' సిద్ధ లింగయ్య 'నీకంటి పాట' 'వెండి కరణాలు (సత్తువ బల్ల కిరణ) యిందుకు మంచి ఉదాహరణలు

"ప్రియా!
ఆ కొండల మీద వెన్నెలలో
అలా స్వర్గం వైపు దారిలో తిరుగాడమాకు
నీ మల్లెపూవు దేహాన్ని
ఆ వెండి కిరణాలు
కాల్చేస్తాయో యేమో!" ఇది ప్రేమ కవిత్వం.

ముల్లూరు నాగరాజు రచించిన కన్నడ దళిత రచనలు అద్భుతం. వారు దళిత జీవితంలోని వైవిధ్యాన్ని, దళితుల ఆకాంక్షల్ని చాలా చక్కగా చిత్రించారు. ఆయన రాసిన 'మరణ మండల మధ్య దొడగె' (మరణంలోని జీవితం) ఎంతో ప్రాచుర్యాన్ని పొందిన నవల. దేవనూర మహాదేవ రాసిన 'ఒదలాల', 'అనూస' కథలు ఎంతగానో పేరు పొందాయి. కన్నడంలో దళిత నవల, దళిత కథ ప్రక్రియల్ని అద్భుతంగా తీర్చిదిద్దిన రచయితల్లో ప్రముఖులు దేవనూరు, మహదేవ, ముల్లూరు నాగరాజు గారలు.

ఈ విధంగా కన్నడ సాహిత్యం దళిత చైతన్యానికి తన వంతు చేయూతను అందిస్తున్నది.

**గుజరాతీ దళిత సాహిత్యం-**

గుజరాత్‌లో దళిత ఉద్యమం, దళిత సాహిత్యం మహారాష్ట్ర ప్రభావంతో పుట్టి వ్యాపించింది. గుజరాతీ దళిత ఉద్యమానికీ, దళిత సాహిత్యోద్యమానికీ ప్రేరణ డాక్టర్ అంబేత్కరే. డాక్టర్ అంబేడ్కర్ చనిపోయినప్పుడు ఎవ్వరి ప్రోద్బలం లేకుండా గుజరాత్ పట్టణాలలోని దళిత స్త్రీలలో వందలాది మంది దళిత కవిత్వం దుఃఖంతో రాశారు. ఈ వాస్తవాన్ని కె.బాలచందర్ గారు 'మరాఠీ, గుజరాతీ దళిత సాహిత్యం' అనే గ్రంథంలో వివరించారు.

1930 నుంచి గుజరాత్‌లో దళితుల గురించి కొందరు రాస్తున్నప్పటికీ, ఆ కాలం సాహిత్యంలో కరుణ భావమే కనబడుతుంది. కానీ దళిత సమాజపు సంపూర్ణ వేదనకు అద్దం పట్టలేదని ప్రముఖ గుజరాతీ కవి జయంత్ ఫర్మార్ అన్నారు.

1970 ఉత్తరార్థంలో ఆక్రోష్, కాలా సూరజ్, చ గరుడ్, దళిత బంధు, నయా మార్గ్, దిశ మొదలైన పత్రికలు దళిత సాహిత్యాన్ని మరింతగా ముందుకు నడిపించాయి. 1980 నాటికి గుజరాతీ దళిత సాహిత్యం ఒక విప్లవాత్మకమైన ప్రత్యామ్నాయ సాహితీ ఉద్యమంగా ఊపందుకుంది. మౌళికత వాసి విషయంలో అనేక చోట్ల యిది ప్రధాన సాహిత్యాన్ని తలదన్నిందని ప్రముఖ గుజరాతీ రచయిత కె.ఎం. షరీఫ్ అన్నారు. జోసఫ్ మక్వాన్, దళ్‌పత్ చౌహాన్,మోహన్ పర్మార్, బి.ఎన్.వణకార్, మనీషి జాని, భానుభాయి అద్వమ్య, అశోక్ చౌదరి మొదలగు వారు గుజరాతీ దళిత సాహిత్యాన్ని అభివృద్ధి చేశారని డా॥ బి.ఆర్.వి. ప్రసాదమూర్తి అన్నారు.

జయంత్ పర్మార్ అనే గుజరాతీ కవి తన కవిత్వం ద్వారా మనువును ఈ క్రింది విధంగా శిక్షిస్తారు.

"ఏదో ఒక రోజు మనువా
నిన్ను మా యింటి ముందు వేప చెట్టుకు వేలడదీస్తారు.
నీ నరాలు చీల్చి మా ముందు తరాల పెద్దల
నెతుర్తరెంత తాగావో చూస్తాను.
ఏదో ఒక రోజు నీ తోలు తీస్తాను."

మరో గుజరాతీ దళిత కవి ఏకలవ్యుడి బొటనవేలు తనను తినేస్తుందని శంబూకుడి శిరస్సు పెండ్యులంలా ఊగుతుందని అభివర్ణిస్తాడు.

"ఆ బొటన వేలు ఇప్పటికీ నన్ను తినేస్తుంది.
ఆ తలకాయ పెండ్యులంలా ఊగుతుంది." (కిసాన్ సోన)
రాబోయే ఇండియా భాషల దళిత కవిత్వానికి ఇది మార్గదర్శకంగా నిలుస్తుంది.

**బెంగాలీ దళిత సాహిత్యం-**

పశ్చిమ బెంగాల్‌లో మెహిత్ బిశ్వాస్, డాక్టర్ బసీల్ బిస్వాస్ వంటి వారు వారి మాతృభాష అయిన బెంగాలీలో దళిత సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. డాక్టర్ మొహితోష్‌గారు రాసిన 'The Soil's Illusiour' అనే నవలకు ఎంతో మంచి పేరు వచ్చింది. ప్రస్తుతం బంగ్లాదేశ్‌లో వున్న జెస్సోర్ జిల్లాలో నివసిస్తున్న అంటరాని వారి జీవితాల్లోని ఘర్షణలనూ, మార్పుల్నీ ఆయన ఆ నవలలో చిత్రించారు.

పశ్చిమ బెంగాల్ నుంచి కవిత్వం రాస్తున్న దళిత కవుల్లో బి.కె. బిశ్వాస్ ఒకరు. వీరు దళిత అభివ్యక్తిలో ఆగ్రహాన్ని తన కవిత్వంలో అద్భుతంగా చిత్రించారు. పశ్చిమ బెంగాల్ దళిత తాత్విక రంగంలో రచనలు చేస్తున్న మరో దళిత రచయిత డాక్టర్ బసీల్ బిశ్వాస్. ఆయన అనేక అంశాలలో పండితుడు. న్యాయశాస్త్రం, విజ్ఞాన శాస్త్రాలు, తత్వశాస్త్రం, మతం, మనస్తత్వ శాస్త్రం మొదలగు అంశాలలో ఎన్నో పుస్తకాలు రాశారు. 1970లో 'The matrics of Legal Philosophy' అనే పుస్తకాన్నిరాశారు. మరెన్నో రచనలు ఆయన కలం నుంచి జాలువారాయి.

**మలయాళీ దళిత సాహిత్యం-**

మలయాళం (కేరళ)లోదళిత సాహిత్యం ఇప్పుడిప్పుడే ఊపు అందుకుంటున్నది. దాదాపు 400 మంది దాకా రాస్తున్నప్పటికి కొద్ది మంది మాత్రమే దళిత దృక్పథతో రాస్తున్నారు. దళిత జీవితం ఇతివృత్తంగా వచ్చిన 'The Slayer Slain' అనే నవల కేరళలో మొదటి దళిత నవలగా చెప్పవచ్చు. మిసెస్ కాలిన్స్ అనే ఒక విదేశీ క్రైస్తవ మిషనరీ ఆ నవలను ఇంగ్లీషులో రాసింది. క్రైస్తవం తీసుకున్న దళితులైన మలయాళీల పట్ల కులతత్వవాదులుగా చలామణి అవుతున్న సరియన్ క్రైస్తవులు పాటిస్తున్న అంటరాని తనం, వివక్ష, హింసలు ఈ నవలలో చిత్రితమయ్యాయి. కేరళ బ్రాహ్మణులు వందలాది సంవత్సరాల క్రితమే క్రైస్తవాన్ని స్వీకరించారు. అంటరాని వారిని తమతో సమానంగా చూడడానికి నిరాకరించారు. ఈ నవలను ఒక విదేశీ వనిత రాసినప్పటికీ, కేరళ సమాజాన్ని మంచి కుదుపు కుదిపింది. కేరళ సిరియన్ క్రైస్తవుల దుర్మార్గానికి వ్యతిరేకంగా ఉద్యమాలు చెలరేగాయి. తొలినాళ్ళలో దళిత జీతాన్ని చిత్రిస్తూ దళితేతరులే రాశారు. ప్రముఖ మలయాళీ కవి, నవలా రచయిత కుమర్ ఆసాన్ రాసిన 'దురవస్థ' కవితా సంకలనం, తక్కళి రాసి 'రండి దంగళి' నవల, కదమ్మనిత్త రామకృష్ణన్ రాసిన 'కురటీ' కవితా సంకలనం... యివన్నీ దళితుల దయనీయమైన పరిస్థితులను చిత్రించాయి. 'చంగంపుళ' అనే దళితేతర రచయిత 'వళక్కుల' అనే నవల 'దళితుల మీద అత్యాచారాలు యింతగా సాగిస్తున్న కులతత్వవాదుల మీద రాబోయే తరం దళితులు ప్రతీకారం తీర్చుకుంటారు' అనే హెచ్చరికతో యం.సుకుమారన్ రాసిన 'శేషక్రియ', కళలక్కడ్ రాసిన 'సంక్రాంతి' పివల్సల 'నెల్లు' అనే నవలలు దళిత జీవితాన్ని చిత్రించాయి. ఆ తర్వాత దళిత రచయితలు రంగం మీదికి వచ్చారు. టి.కె.పి. వెడుతల 'నవవుద్యమున్ను' అనే నవల రాశారు. చివరకు రోడ్ అనే రచయిత 'పులయాత్ర' అనే నవల రాశారు. ఆర్.కె. గోవిందన్ 'అరుకోలక్కందమ్' అనే నవల రాశారు. ఒక దళితేతర క్రైస్తవ స్త్రీ రాసిన 'దైవమక్కల్' అనే నవల మంచి ప్రాచుర్యాన్ని పొందింది. టి.కె. నారాయణన్, కె.కె.ఎస్.దాస్, టి. హెచ్.పి., చెంతరస్సేరీ, కల్లడ శశి, కె.సి. పురుషోత్తమన్ మొదలగువారు దళిత సాహిత్యాన్ని సృష్టించారు.

కె.కె.ఎస్.దాస్ రచించిన పాటలు ఎక్కువగా పేరు పొందాయి. మంచివక్తగా, గాయకుడిగా, ఆయనకు పేరుంది.

యిప్పుడిప్పుడే మలయాళీ దళిత యువకుల కలాలు కదులుతున్నాయి. వాళ్లు రాస్తున్న దళిత కవిత్వం మంచి భవిష్యత్తును వాగ్దానం చేస్తున్నది.

**తమిళ దళిత సాహిత్యం-**

తమిళంలో భక్తి కవులు తక్కువేం లేరు. శైవ భక్తి కవి నందనార్‌గురించి ఎంతో మంది రాశారు. దాదాపు 150 ఏండ్ల క్రితమే గోపాలకృష్ణ అనే రచయిత 'నందనార్ చరిత్ర కీర్త నైహళ్' అనే గ్రంథాన్ని రాశారు. క్రీస్తు శకం 6వ శతాబ్దంలో కరైకాల్ అమ్మైవార్ అనే దళిత స్త్రీ శైవ సంప్రదాయంలో భక్తి రచనలు చేసి కుల వ్యవస్థను నిరసించారు. ఆధునిక కాలంలోగొప్ప సంస్కరణాభిలాషతో రచనలు చేసిన సుబ్రహ్మణ్య భారతి (1882-1921) దళిత సమస్యపైన అద్భుతమైన రచనలు చేశారు. కనకలింగం అనే అస్పృశ్య బాలుడికి ఉపనయనం చేసి 'ఇతను బ్రాహ్మణుడని ప్రకటిస్తున్నాను' అని సాహసోపేతంగా ప్రకటించిన వారు సుబ్రహ్మణ్య భారతి. ఆయన రాసిన ఒక పాటలో బ్రాహ్మణులను గొప్పవారని యజమానులని అనుకునే రోజులు పోయాయి అని ఆయన సాధికారికంగా ప్రకటించారు. ఆధునిక తమిళ సాహిత్యంలో తొలి కథను రాసిన రచయిత సుబ్రహ్మణ్యభారతి. అది అస్పృశ్యతా సమస్యను చర్చించింది. తమిళంలో దళిత సమస్యను చర్చకు పెట్టిన మొదటి కథగా దానికి గుర్తింపు ఉన్నది.

ఎ. మాదవయ్య, ఏదుమై సిట్టన్, న. పిచ్చమూర్తి. క.ప. రాజగోపాలన్, సి.ఎస్.చెల్లప్ప లాంటి బ్రాహ్మణులు చేసిన రచనలలో దళితుల జీవితం చిత్రించబడింది.

సుబ్రహ్మణ్య భారతి తర్వాత దళితేతరుడైన పుదుమై పెట్టన్ (1907-1948) అనే రచయిత దళిత సమస్యపైన రచనలు చేశారు. సుబ్రహ్మణ్యభారతి సాహిత్య వారసత్వాన్ని వీరు ముందుకు సాగించారు. వీరి కథ 'గోపాలన్ అయ్యంగార్ భార్య' కుల సమస్య విశ్వరూపాన్ని చూపించింది. ఈ కథలో వంట గదిలో కులం ఎలా పని చేస్తుందో వివరించింది.

తమిళంలో దళితులే రాసిన తొలి నవల 70లలో వచ్చింది. 'పూమణి' అనే దళిత రచయిత రాసిన 'పిరహు (అప్పుడు)' అనేది దళితులే రాసిన మొదటి తమిళ దళిత నవల.

90ల నాటికి తమిళనాడులో దళిత చైతన్యం తీవ్రమైంది. దాంతో దళిత సాహిత్యం విరివిగా రావడం మొదలైంది. ఎంతో మంది కవులు, రచయితలు, నవలా రచయితలు దళిత రచయితలుగా ముందుకు వచ్చారు. దళిత రచనలకు ప్రాచుర్యం పెరిగింది.

శివకామి అనే దళిత మహిళా ఐ.ఎ.ఎస్. అధికారి రాసిన 'పళయన కళిదల్ (పాత్ర అంతరించి పోయింది)' అనే అనే నవలపైన తమిళ సమాజంలో మంచి చర్చ జరిగింది. ఆ నవలలో కతాముత్తు అనే దళితుడు గౌడర్లు (దళితుల కంటే కొంచెం పైనున్న కులం) సాగించే అన్యాయాలను ఎదుర్కొంటాడు. అవవలగన్ అనే మరో రచయిత మంచి కథలు రాశారు. బామ అనే రచయిత రాసిన 'కరుకు' నవల క్రైస్తవ కాన్వెంట్‌లో జరిగే అక్రమాలు, అక్కడ వున్న కులతత్వాన్ని ఎత్తి చూపించి అది ఇంగ్లీషు, తెలుగు భాషల్లోకి అనువాదం అయ్యింది. మిళప ఇదయవేందన్ పాకీ కులం నుంచి వచ్చారు. చదువుకొని మునిసిపల్ అధికారిగా పని చేస్తున్నారు. పాకీ జీవితాన్ని కథల్లో చిత్రించారు. పెరుమాళ్ మురుగన్ అనే మరో రచయిత రచించిన 'ఎరుకెయ్యిళ్ (పెరుగుతున్న వేడి) అనే నవలకు మంచి పేరొచ్చింది. ఆయన రాసిన దళిత తమిళ భాష అందాన్ని ఆస్వాదించాలంటే ఆ భాషలోనే చదవాలే తప్ప, మరో భాషలోకి ఆ భాష సొగసును అనువదించడం అసాధ్యం అని అనువాదకులు అన్నారు. పవనన్, పాలమలైలు దళితులు కాకపోయినప్పటికీ దళిత జీవితాన్ని, అనుభవాన్ని రాస్తున్నారు. చో ధర్మన్ మంచి కథా రచయితగా పేరుపొందారు.

శివకాశీలో పని చేసే బాల కార్మికుల మీద ఆయన (చోధర్మన్) రాసిన 'నసుక్కమ్' (బాణా సంచా) అనే కథకు కథా అవార్డువచ్చింది. జాతీయ స్థాయిలో మంచి పేరు వచ్చింది. యిప్పుడు తమిళనాడులో దళిత రచయితలకూ, దళిత సాహిత్యానికీ విశేషమైన ఆదరణ లభిస్తుంది అనేక ప్రముఖ ఇంగ్లీషు ప్రచురణ సంస్థలు తమిళ దళిత సాహిత్యాన్ని ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించేటందుకు ముందుకు వస్తున్నాయి.

**హిందీ దళిత సాహిత్యం-**

హిందీ భాషలో కులాన్ని నిరసిస్తూ భక్తి కవులు కవిత్వం రాశారు. ఆదికాలీన సిద్ధి సాహిత్యంలో అచూత్ (అస్పృశ్యుల) సమస్యను గురించిన చర్చ విరివిగా లభిస్తున్నది. వజ్రయాన పరంపరలోని దిపద కవిత్వాన్ని సిద్ధి సాహిత్యం అంటారు. ఇందులో బౌద్ధ - తాంత్రిక వేత్తల భాష్యాలు కూడా వున్నాయి. భక్తి కవుల పరంపరలో కాంచీపూర్ణ శూద్రుడి శిష్యులు అనేక మంది కులాన్ని నిరసిస్తూ కవిత్వం రాశారు. రామానందుడు, కబీర్, రామ్‌దాస్, నానక్, సేనా,సీపా ధన్నా మొదలగు వాళ్లు కింది కులాల నుండి వచ్చిన భక్తి కవులు. వీళ్ళందరూ భక్తి గురించి రాస్తూనే ఏదో ఒక సందర్భంలో కులాన్ని నిరసిస్తూ కవిత్వం రాశారు.

ఆధునిక హిందీ సాహిత్యంలో ప్రేమ్‌చంద్ గారు దళిత జీవితాన్ని, దళితుల బాధల్ని కష్టాల్ని, అవమాన పూరితమైన అనుభవాన్నీ తన నవలల్లో చిత్రించారు. ఆయన తన 'సద్గతి' అనే కథలో 'దుఖీ' అనే చర్మకారుడి ఇతి వృత్తాన్ని చిత్రించారు.

"దళిత కులాల వారు ఎప్పటికైనా ధనవంతుల ఇళ్ళను ఆక్రమిస్తారు. ఆ ఆక్రమించేది తాము అందులో సుఖంగా వుండటానికి కాదు. తాము తాముగా ఏ విద్యకైతే దూరమయ్యారో ఆ విద్య కొరకు ఆ హవేలీలలను పాఠశాలలుగా మార్చుకుంటారు." అని నిరాలా అనే హిందీ రచయిత ఒక కవితలో రాశాడు. "బ్రాహ్మణవాద వ్యవస్థ దళితుల్ని పునర్జన్మ, భయం, కర్మ మొదలగు భయాలు సృష్టించడాన్ని 'తోడ్ చీ పత్తర్' అనే కవితలో నిరాలా గారు నిరసించారు. దళిత భిక్షకుడిని అభివర్ణిస్తూ వారు రచించిన 'భిక్షక్' అనే కవిత పాఠ్యగ్రంథాల్లో

పాఠ్యాంశం అయ్యింది. భిక్షకుడికి పొట్ట వీపు రెండూ అతుక్కు పోయిన దృశ్యాన్ని నిరాలా గారు 'భిక్షక్' కవితలో ఆవిష్కరించారు.

ప్రేమ్‌చంద్, నిరాలాల తర్వాత దళిత జీవితం గురించి అంతగా రాసిన వాళ్ళు హిందీ సాహితీరంగంలో కన్పించరు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత వచ్చిన సాహిత్యాన్ని పరిశీలిస్తే 'నాగార్జున' అనే కవి రాసిన కవిత్వంలో దళితుల ప్రసావన కనిపిస్తుంది. అయితే ఆ కవిపై డాక్టర్ అంబేద్కర్ ప్రభావం కన్నా మార్క్స్ ప్రభావం ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఆయన వ్యవస్థపైన వ్యంగ్య కవితాస్త్రాలను విసిరారు. ఆయన రాసిన 'హరిజన గాథ', 'లోగ్‌మోల్' వంటి కవితలు దళిత జీవితాన్ని చిత్రించినాయి.

పూర్తిగా దళిత ముద్రతో హిందిలో కవిత్వం రాసిన వాళ్ళలో రామచంద్ర శుక్ల ప్రముఖంగా కన్పిస్తారు. ధూమిలీ రాసిన 'మోచారామ్' వీరేన్ డంగ్వాన్ రాసిన 'రామ్ సింగ్' కవితల్లో అసహాయ మానవులు పడుతున్న వేదన కనిపిస్తుంది. సరస్వతీ పత్రికలో హీరోడోమ్ రాసిన దళిత కవితలు అచ్చయ్యాయి. యివి దళితులు రాసిన తొలి దళిత కవితలు అయివుంటాయని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. 1934లో ప్రారంభమైన 'సమితి' (ఆల్మోడా) పత్రికలో దళిత చైతన్యం వున్న ఓ కవిత అచ్చయ్యింది. అదే విధంగా 1962లో పంజాబ్‌లోని జలంధర్ నుండి అచ్చయిన 'భీమ్ పత్రిక'లో కూడా దళిత కవిత్వం వచ్చేది. అయితే దళిత అభివ్యక్తి అప్పటికి యింకా అభివృద్ధి కాలేకపోయింది. 1980 నుండి హిందీలో దళిత సాహిత్యం అభివృద్ధి వేగవంతం అయింది. అంతకు ముందూ 1973లో బిహారీ లాల్ హరిత్ రాసిన 'భీమాయనిక్' కృతి ప్రముఖమైనది. 1985లో ఢిల్లీలో 'భారతీయ దళిత సాహిత్య మంచ్ ' ఏర్పడింది. డాక్టర్ సోహన్‌లాల్ సుమనాక్షర్, డాక్టర్ కుసుమ్ వియోగి, కర్మశీల్ భావతి, మాసారామ్ విద్రోహి, లక్ష్మీనారయణ్ సుధాకర్, రామ్‌దాస్ శాస్త్రి, రాజ్‌పాల్ సింగ్‌రాజ్ మొదలగు రచయితలు ఈ సంస్థ ఏర్పాటులో పాలు పంచుకున్నారు. ఆ తర్వాత డాక్టర్ సోహన్ లాల్ సుమనాక్షర్ 'భారతీయ దళిత సాహిత్య అకాడమీ' స్థాపించారు. ఈ అకాడమీ డాక్టర్ అంబేద్కర్ చనిపోయిన డిసెంబర్ 6వ తారీఖున మొదలైంది. ప్రత్యేక రోజుల్లో జాతీయ స్థాయిలో సాహిత్య సమ్మేళనాలు నిర్వహించడం ఈ అకాడమీ చేస్తున్నది. ఈ సంస్థ సాహిత్య అవార్డులను ఇస్తున్నది. ఇట్టి అవార్డు పొందిన వారిలో ఈ వ్యాసకర్త కూడా ఉన్నాడు. ఆచార్య గురు ప్రసాద్, నావల్ వియోగి, పద్మశ్రీ డాక్టర్ శ్యామ్ సింగ్ శశి, డాక్టర్ ధర్మవీర్, డాక్టర్ సుఖ్‌వీర్‌సింగ్, మోహన్‌దాస్ నైమిశిరాయ్ మొదలగు దళిత రచయితలు ఈ అకాడమీ ద్వారా వెలుగులోకి వచ్చారు.

1980ల తరువాత ప్రముఖ హిందీ దళిత కవి నరేష్ చంద్ర సచన్ రంగం మీదికి వచ్చారు. "దళితుల స్థితి గతులను అద్భుతంగా చిత్రిస్తూ, బంధనాలను తెంచుకునేతందుకు ఉద్యమించాలే," అని సచన్ కవిత్వం ద్వారా ఉద్బోధించారు. శేఖన్‌రామ్ శాస్త్రి 'భోజ్‌పురీ లోక్‌గీత్' అనే పేరుతో పాటలు రాశారు. పెటిటాండన్ మొదలగు వారు 1980లలో నడిచిన నిర్ణాయక్ భీమ్ పత్రికలో కవిత్వం, వ్యాసాలు రాసేవారు. మరో హిందీ దళిత కవి భజన్‌లాల్ "కులం పేరుతో ఉచ్చనీచాలను నిర్ణయించే ధర్మం ఏదయితే ఉన్నదో, అది ధర్మం కాదు, అధర్మం" అని చెప్పారు.

"రాళ్ళు పగల గొట్టీ కొట్టీ చేతులు రాళ్ళయి పోయాయి. కోమలమయిన ముఖం కూడా కఠోరమైపోయింది. ఒక్క హృదయమే మిగిలింది. దానిపైన కూడా రాళ్ళేస్తున్నారు" అని దళిత జీవితాన్ని కవిత్వీకరించారు హిందీ కవి నరేష్ చంద్ర సచన్. ఓం ప్రకాశ్ వాల్మీకి అనే కవి కవిత్వాన్ని ఆత్మకథనాత్మక వచనాలుగా రాశారు. రాధే రాజ్ సింగ్ బబ్బన్ అనే దళిత కవి మంచి కవిత రాశారు. రజత్ రాణీ 'మినూ', ' మినూ సాగర్' లాంటి కవయిత్రులు దళిత జీవితాన్ని చిత్రిస్తూ కవిత్వం రాశారు. జుహల్ కిశోర్, పురుషోత్తమ్ దాస్, ఓం ప్రకాశ్ ఆజాద్, కర్మశీల్ భారత్‌లు 1980లలో రంగం మీదికి వచ్చిన దళిత కవులు. యిప్పటికీ హిందిలో మంచి దళిత కవిత్వం వస్తున్నది.

**మరాఠీ దళిత సాహిత్యం-**

డాక్టర్ అంబేద్కర్, మహాత్మాఫూలే గారల చైతన్యంతో మహారాష్ట్రలో మరాఠీ భాషలో దళిత సాహిత్యం రావటం మొదలైనప్పటికీ, మధ్యయుగాల కాలం నాటి 'చోఖ మేళా' అనే భక్త కవికి ఆలయ ప్రవేశం నిరాకరించిన సందర్భంలో ఈ క్రింది కవిత్వం రాశారు.

"నాకీ బలవంతపుజన్మనిచ్చిన కౄరుడివి
నా పుట్టుక సమయంలో నీవెక్కడున్నావు"
అని దేవుణ్ని ప్రశ్నిస్తారు.

ఆయన రాసిన ఆరు భాగాలలో ప్రముఖంగా ప్రచారంలో వున్నవి కొన్ని -
"చెరుకుగడ వంకరదే కావచ్చు
దాని రసం కాదు కదా!

పై మెరుగుల చూసి భ్రమపడి ఎందుకు మోసపోతావు?
విల్లు వంకరదే కావచ్చు
బాణం సూటిగా వుంటుంది కదా!

నది మెలికలు తిరుగుతుండ వచ్చు
కానీ నీరు వంకర కాదు గదా!

చోఖీ కురూపే కావచ్చు
అతని భావాలు కావు కాదా
ఎందుకు పై రూపం చూసి మోసపోతావు?"

ఇలా సమాజంలోని అసమానతలనూ, కుల వ్యత్యాసాలనూ, అంటరాని తనాన్నీ చోఖమేళా ప్రశ్నించారు. బ్రాహ్మణీయ హిందూ మతం కులం దేవుడి సృష్టేనని చెప్పడానికి ప్రయత్నిస్తే, భక్తి ఉద్యమకారులు దేవుడి దృష్టిలో కులాలు లేవని, మనుషులందరూ సమానమేనని చెప్పారు.

డాక్టర్ అంబేద్కర్ చేసిన అనేక రచనలు, పోరాటాలు మరాఠీ దళిత సాహిత్యానికి ఒక దిక్సూచిగా చెప్పవచ్చు. మహాత్మా జ్యోతిభా పూలే రచించిన గులాంగిరీ, పురోహితుల బండారం బట్ట బయలు, రైతు చేతి కొరడా, మూడో కన్ను....లాంటివి ఎంతో ప్రాచుర్యం పొంది, ప్రామాణికంగా నిలిచాయి.

పండిట్ కోండిరామ్ అనే మరాఠీ దళిత కవి రాసిన కవిత –
"తరాల నాటి మన వేదనని మరచిపోవద్దు
మానవ పశువు ఎక్కడైనా కన్పిస్తే
కాస్త గర్వపడు
బ్రాహ్మణ గ్రంథాలను దగ్ధం చేసి
అలైన సందేశమివ్వు
యిదే పండిట్ కోండిబా హెచ్చరిక."

మరాఠీ కవి వామన్ నింబాల్కర్ అమ్మ గురించి రాసిన కథ
"పగలు గడిచి రాత్రి రాజ్యం మొదలవుతోంది
దీపం లేని గుడిసెలు గుమ్మం దగ్గరే కూర్చొని వుంటాం
ప్రతి యింటా దీపాల కాంతి
మంటలు మొదలైన చప్పుడు జొన్న రొట్టెలు పేనం మీద
కాలుతున్న ఘుమఘుమలు
పప్పు కూరగాయలు ఉడుకుతున్న పరిమళం
నాకళ్ళ నుండి నీటి కాలువ ప్రవహిస్తుంది.
చీకటిని చీల్చుకొని ఒక పాలిపోయిన నీడ మా వైపు
నీరసంగా నల్లగా బక్క పల్చగా తలపై బరువైన
కట్టెల మోపుతో వస్తోంది – ఆమే మా అమ్మ.
పొద్దున్నుండి కట్టెల కోసం అడవిలో తిరిగింది.
పిల్లలమంతా కూర్చుని ఆమె కోసం ఎదురుచూస్తుంటాం.
కట్టెలు అమ్ముడు పోని రోజు పస్తుల నిద్రే
ఒక రోజు అది ఎలా జరిగిందో మాకు తెలియదు
అమ్మ వచ్చింది కాలికి కట్టు కట్టి వుంది
గాయం నుండి రక్తం స్రవిస్తుంది.
అమ్మను నల్లనాగు కాటేసిందని

వెంటవున్న ఆడవాళ్ళు చెప్పారు.
అది పడగ విపి కాటేసి జర జర పాక్కుంటూ వెళ్ళి పోయిందని చెప్పారు.
అమ్మను చాప మీద పడుకోబెట్టారు
పసుపు రాశారు, మంత్రాలు చదివారు, వైద్యుడ్ని పిలిచారు
పగలు వెళ్ళి పోయింది.
పగటితో పాటు అమ్మ ప్రాణం కూడా వెళ్ళి పోయింది.
మేం పిల్లలం భోరున ఏడ్చాం
అమ్మ వెళ్ళి పోయింది. పిల్లల్ని అనాథల్నిచేసి పోయింది.
మా అమ్మ కోసం దుఃఖంగా వెతుకుతుంటాము
ఇప్పుడు ఎప్పుడైనా కట్టెల మోపు మోస్తూ
నల్లగా బలహీనంగా వున్న ఏ అమ్మైనా కనిపిస్తే
మా అమ్మే గురుతుకొస్తుంది.
అందుకే ఆ కట్టెల మోపు నేను కొంటాను."

ఇది మరాఠీ దళిత తల్లిరూపం. మరాఠీ తల్లి శ్రమ. మరాఠీ తల్లి బిడ్డల వేదన. దుఃఖం. బిడ్డలకింత తిండి పెట్టి పోషించి, పెద్దచేయడానికి ఉదయాన్నే అడవికెళ్ళి, సాయంత్రం వరకూ కట్టెలేరుకొని, బతకడం కోసం, బిడ్డల్నిబతికించుకోవడం కోసం, ప్రమాదాలను సైతం లెక్క చేయ్యక శ్రమించి కట్టెల మోపును మోసుకొంటూ వెళ్ళి అమ్మితే ఆ రోజు తిండి, లేకుంటే పస్తులే. పెద్ద వాడైన బిడ్డడు తల్లిని గుర్తు చేసుకుంటున్నాడు. కట్టెలు మోస్తూ కనిపించే ప్రతి నల్లటి స్త్రీలోనూ తన తల్లినే చూసుకొంటున్నాడు.

మరో మరాఠీ దళిత కవయిత్రి డాక్టర్ జ్యోతి లాంగేవార్ అమ్మను గురించి రాసిన కవిత సారంశం ఇలా ఉన్నది.

"అమ్మా! బంగారు జరీ అంచు చీరలోనూ, బంగారు గాజుల్లోనూ, మెడలో నెక్లెస్‌తోనూ నిన్ను ఎప్పుడూ చూడలేదు. కాళ్ళకు చెప్పులతోనూ నిన్నెప్పుడూ చూడలేదు. మండు వేసవి ఎండలో చెప్పులు లేని కాళ్ళు కాలిపోతుండగా పసిబిడ్డను తుమ్మ చెట్టుకు కట్టిన ఉయ్యాలలో పడుకోబెట్టి రోడ్డు పనిలో తారు బెరళ్లు మోస్తూ చూశావు" ఈ కవితలో అమ్మ చేసే పని ఎలా చేస్తుందో దృశ్యమానం అవుతోంది.

జ్యోతి లాంగేవార్ దళిత తల్లి ఒక్కొక్క లక్షణాన్ని చెప్తున్నది. రెక్కలు ముక్కలు చేసుకునే తల్లి పిల్లలను ప్రేమగా చూసే తల్లి, బిడ్డని గొప్పగా చూసుకోవాలని అనుకొనే తల్లి మాత్రమే యిప్పటి దాకా తెలిసింది. పొయ్యి మూలకు కూర్చుని వంట చేసి రొట్టెలేవో కాల్చి అందరికీ పెట్టుంది. కడుపునిండా తినడానికి అప్పటికి వున్నా, పొద్దటి కొరకు మిగలాలని సగం మాత్రమే తిని అర్థాకలితో పడుకునే తల్లిని కవిత్వీకరించారు లాంగేవార్.

మరాఠీ దళిత కవి ప్రహ్లాద చెంద్ వాంకర్ నాన్న గురించి కవిత్వం రాశారు - ఈ కవిత సారాంశం-

“నాన్నా బాబు చదువుకోరా! చదువుకుంటే నువ్వ పెద్దసారవుతావు. కుర్చీ మీద కూర్చుంటావు. సోయి తప్పేంత వరకూ బాపనాయన కోసం కట్టెలు కొట్టే బాధ తప్పుతుంది. కనీసం నీ ఉత్తరాలు నువ్వు చదువుకోగలుగుతావు” ఇది తండ్రి ఆకాంక్ష.

ఇలా మరాఠీ దళిత కవిత్వం, సాహిత్యాన్ని సుసంపన్నం చేసింది.

ఈ విధంగా అన్య భాషలలో సాహిత్యం సాంస్కృతిక రంగాన్ని చైతన్యపరచి పరివర్తన దిశగా పరుగులు పెడుతోంది. దళితులు చైతన్యం పొంది, అభివృద్ధి దిశగా పరివర్తన జరిగితే, దేశ పురోగతికి దోహదం జరుగుతుంది. దేశంలో సమానత్వం సాధించబడాలని కోరుకుందాం.

---

ఆధార గ్రంథాలు:

1. “సమకాలీన కన్నడ దళిత కథలు - అనువాదం - రంగనాధ రామచంద్రరావు
2. “తెలుగు మరాఠి దళిత కవిత్వం - తులనాత్మక పరిశీలన” - సిద్ధాంత గ్రంథం - డా॥ శికామణి (కె. సంజీవరావు)

---

పరిశోధకుడి చిరునామా:
ఇ.నెం. 1-67 తొగర్రాయి
మం॥ దుగ్గొండి, జిల్లా: వరంగల్ రూరల్ - 506 331
తెలంగాణ రాష్ట్రం
ఇమెయిల్: ramulualagonda@gmail.com
సెల్: 96185 98847

---



# కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ కథానికలు సాంస్కృతిక పరివర్తన

కంకట సుబ్బారావు
తెలుగు ఉపాధ్యాయులు
వి.యస్. సెయింట్ జాన్స్, గన్నవరం
సెల్ : 940684974
ఈమెయిల్ : subbu9939@gmail.com

నేటి సమాజం సమస్యల సుడిగుండంలో కొట్టిమిట్టాడుతుంది. ఈ సమస్యలతో మానవ మనుగడ ప్రశ్నార్థకంగా మారింది ఈ నేపధ్యంలో సాంస్కృతిక పరివర్తనకై పరితపంచిన రచయితలు అయా అంశాలపై దృష్టి సారించి, వారి రచనలతో సామాజికాంశాలను ఇతి వృత్తాలుగా స్వీకరించి తద్వారా సాంస్కృతిక పరివర్తనకు నడుంబిగించారు.

కాటూరు వారి కథానికలను పరిశీలనకు ముందుగా సాంస్కృతిక పరివర్తన అనే అంశాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉందనక తప్పదు.

సంస్కృతి అనేది మానవ సమాజం జీవన విధానంలో ప్రముఖమైన విషయాలను అనగా జీవనం, ఆచారాలు, వ్యవహారాలు, ప్రమాణాలు, మతం, సంబంధాలు పాలన వంటి వాటిని సూచించే పదం.

ఒక సమాజంలో ముఖ్యమైన పద్ధతులు, నిర్మాణాలు మరియు వ్యవస్థలు ఆ సమాజం యొక్క సంస్కృతిని సూచిస్తాయి. సంస్కృతిని సూచించే సంకేతాలు, నిర్మాణాలు, వ్యవస్థలు, ఆచారాలు, వ్యవహారాలు ఇతివిత్తమైన హద్దులు లేవు, అని నిరంతరాయంగా మారుతుంటాయి. ఒక దానిలో ఒకటి కలుస్తూ, విడిపోతూ పరిణామం చెందుతుంటాయి.

ఒక సమాజం జీవనంలో మిళితమైన కళలు, నమ్మకాలు, సంస్థలు తరాలలో జరిగే మార్పులు, తరాల మధ్య వారసత్వంగా కొనసాగే విధానాలు అన్నీ కలిపి సంస్కృతి అంటారు. ఒక సమాజం యొక్క సంపూర్ణ జీవన విధానమే ఆ సమాజపు సంస్కృతి అని నిర్వాచింపవచ్చును.

ఆధునిక కాలంలో సమాజములో యొక్క నిరంతరముగా కొనసాగుతున్న అనేక సంస్కృత సంప్రదాయాలను ఎత్తి చూపుతూ వాటి పరిష్కార మార్గాలను కాటూరు వారు తన కథానికలలో పొందుపరిచారు. చక్కని సామాజిక దృడుకుడనం గల కాటురు వారి కథల పరిశీనకు ముందుగా కాటూరు వారిని గుర్చి కొంత వివరిస్తూ, తదుపరి వ్యాసాంగాన్ని కొనసాగించెదను.

సాహితి వాచస్పతి శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ శ్రీమతి అనసూయదేవి, వేంకట సుబ్బారావు పుణ్య దంపతులకు కృష్ణాజిల్లా కాటూరు గ్రామంలో జన్మించారు. స్వాతంత్ర సమరయోధులు అయిన వెంకట సుబ్బారావు గారు బహుముఖ ప్రజ్ఞాశాలి. తెలుగు సాహిత్య పరిశోధకులు, తండ్రి నుండి వారసత్వంగా 1955 సం॥నుండి సాహిత మాగాణంలో ఇల్లుతల్లి ఈ కథలో రాజన్న తన తల్లిని ఎలా చూసుకునే వారో, తరువాత తల్లి చనిపోతే ఇంతకి తల్లి అనే పేరు పెట్టుకుని తల్లిగా గృహం చూసుకోవటం కనిపిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగప్రవేశం చేరసి భూమి ధరలకు రెక్కలు వచ్చిన ఎంత అదిక ధర ఇస్తాను అని వచ్చినా ఏమాత్రం లెక్కచేయలేదు ఈ కథలోని విషయాన్ని పరిశిలించినపుడు ఆధునిక కాలంలో జరిగిన సాంస్కృతిక పరివర్తన చూడవచ్చు తల్లి దండ్రులు నడయాడిన ఇల్లును నేటి రోజులలో గొప్పగా చూచేవారు ఉన్నారని ధైర్యంగా చెప్పగమా? అంటే సందేహించాల్సిందే! ఇల్లు విషయం పక్కన బెట్టి అసలు తల్లి దండ్రులను ప్రేమాఆప్యాయతలలో పలకరించేవారు ఎందరున్నారు. ఆలోచించక యికతప్పదు బ్రతికిఉన్న తల్లి దండ్రులను పోషించే దారి లేదన్నట్లు వృద్ధాశ్రమంలో చేర్చుతున్న ప్రబుద్ధులు ఎందరులేరు. దీని కొంత కారణం లేకపోలేదు. నాడు ఉమ్మడికుటుంబాలలో పెద్దలు పిల్లలను ఆప్యాతానురాగాలతో చూచేవారు. అదే రీతిలో పిల్లలు నడిచేవారు నేటి సామాజికతలేదు – పిల్లలు హాస్టల్‌లో పెద్దలు వృద్ధాశ్రమములో అన్నట్లు కనిపిస్తుంది. ఇది సరైన తీరు కాదు. తల్లి దండ్రులు ఎంత పని ఒత్తిడి ఉన్నా పిల్లలతో తగిన సమయం కేటాయిస్తూ, వారితో మనోభావాలను పంచుకుంటూ నైతిక విలువలను బోధన కలిగితే బాగుంటుంది. ఆ అవకాశం లేక సరైన రీతిలో నడవక వక్రమార్గంలో నేటి యువత నడుస్తున్నారు. నేడు పాఠశాల స్థాయిలోనే డ్రగ్స్ సంస్కృతి ప్రవేశించిందని మనం పత్రికలలో చూస్తున్నాం కదా!

వేదమంత్రాలు అర్థం చేసుకుంటే ఇవే సందేశాలు వినిపిస్తాయి. కానీ, అంతటి శ్రద్ధా ఎవరికుంది? పరుగుల జీవితాలు, మంచి ఆలోచనలు రావు, ముందుగా కూర్పు నాలో కలగాలి అంటూ తల్లిఎవరికైనా తల్లి! అంటూ కథ ముగించారు. నేటి కాలంలో ఉరుకులు పరుగులు, హడావిడి జీవితంలో ఎటువంటి విలువలను కొల్పోతున్నారు తెలుపుతూ,

భారతీయ వేద మంత్రాల విలువలను తెలియచేశారు.

మరోకథ డబ్బు చెట్టు ఈ కథలో ధనాశాపరులైన తల్లిదండ్రుల మనసును అద్దం పట్టారు. నాడు పెద్దల నుండి కుల వృత్తులను ఒంటబట్టించుకుని ఉమ్మడి కుటుంబంలో సంతోషంగా జీవించేవారు కాని ప్రస్తుతంలవేరు. అధిక సంపాదన, ఆర్థిక స్వేచ్ఛ అనే మూల సూత్రంలో తల్లిదండ్రులు తమ బిడ్డలను విద్యార్థుని చేయించి విదేశాలకు తరలిస్తునారు. విధ్య అనేది విజ్ఞానంకోసమేగాని సంపాదన కోసం కాదనేది ఇందులో కనిపిస్తుంది. ఉన్నత చదువులు చదివించి విదేశాలనకు బిడ్డను పంపి వాడి సంపాదనతో దర్జాగా బ్రతకాలి అనుకున్న సూరి పాత్ర తెలుపుతుంది. అనాగా వస్తున్న డబ్బు వ్యామోహంలో పిల్లలను విదేశాలలో బానిసలుగా తరలిస్తున్నారు. సమాజంలో నేడు డబ్బుకున్న ప్రాధాన్యం మానవీయ విలువలకు ఇవ్వాలనేటువంటి చాక్కటి సందేశాన్ని అందించాడు.

కాటురు వారి కథనికలలో ప్రతి కథలో ఆధునిక కాలంలో వచ్చిన సామాజిక పరివర్తన ఎత్తి చూపుతూ దానికి పరిష్కార మార్గాన్ని అందించారు. సామాజిక పరివర్తనకు వారు వ్యతిరేకం కాదని, మారుతున్న కాలను గుణంగా మార్పుతప్పదని, కాకపోతే ఆరోగ్యకరమయిన మార్పు ఆశించదగినదే అంటే మానవుడు కొండగుహలో చెట్టుతొర్రలలో జీవించే స్థాయినుండి విలాసవంతమైన గృహలలో జీవితం గడపడం వంటి పరివర్తన హర్షించదగినదే కాని పాఠశాల స్థాయినుండే డ్రగ్స్ విష సంస్కృతి అలవాటు చేసుకునే అంతటి పరివర్తన సబబు కాదని వీరి అభిప్రాయం.

వ్యవసాయాన్ని వదిలి జీవించాలను కోవడం, చివరకు జీవిస్తున్న కొడుకులు దేశీయుల దాడులలో తీవ్రంగా గాయపడ్డాడు అని తెలుసుకుని సాంస్కృతిక పరివర్తన ఆవశ్యకతను గుర్తెంగి తన మదిలో ఎన్నో ఆశలన్నా నూరు గొర్లను తిన్న రాబందు ఒకే గాలి వానకు కూలినట్లు అన్ని ఆశలు కూలిపోయాయి. ఇక కొడుకుని తన వద్దే ఉంచుకోవాలి. కలసి తిరిగి వ్యవసాయాన్ని కొన సాగించాలని భావిస్తాడు అవును ఈ కథలోని సూరిమాత్రకుకాదు. చాలా మంచి తల్లిదండ్రుల ఆలోచన ఇలానే ఉంది డాలర్లు సంపాదించటం సామాజిక గౌరవంగా భావించే వారు ఎందరరో ఉన్నారు. అలా విదేశాలలో జీవిస్తూ అక్కడ జరిగే దాడులలో ప్రాణాలు కొల్పోయిన వారు ఎందరు లేరు. వృద్ధులయిన తల్లిదండ్రుల యోగక్షేమాలు చూచే వారు లేక వృద్ధాశ్రమాలను చేరటం ఇటువంటి అంశాలకు ఈ కథలో ముస్టిపంతులు నోటి ద్వారా సూరి ప్రాత్రకి, పరిష్కారం చూపాడు. నువ్వు నేల తల్లిని నమ్మావు మనసారా ప్రేమించావు. ఆతల్లి సేవలో ఆనందం ఉంది. నీ కొడుకు మట్టిలో మాణిక్యం. వాడు వచ్చాక మళ్లీ పొలం పనులు మొదలు పెట్టు వాడు నీకు సాయంగా ఉంటాడు అంటూ చెప్పించాడు.

అడుగు పెట్టి సిరులు పొలికిస్తున్నారు. వారు రంగప్రవేశం చేయని సాహితి ప్రక్రియ లేదంటే అతిశయోక్తి లేదు. దాదాపు 2000 కథలు పై చిలుకు రాసిన వీరి కథలలో 200పైగా వివిధ పత్రికలలో ముద్రింతం కాబడినవి. కథానికి, నాటిక, నాటినం, నవలికి, నవల, కవిత, గీతాలు, హరికథలు వగైర సాహిత్య ప్రక్రియల్లో విశేష కృషిచేశారు. 16సం॥ భారతీయ వైమానిక దళంలో 1965-1971 యుద్ధాలలో పాల్గొన్నారు పని చేసి, పదవీ విరమణ చేశారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయవాదిగా, ప్రముఖ సంస్థలకు న్యాయ సలహాదారునిగా, సాహిత్య, సామాజిక సేవాతత్పరతతో జీవిత ప్రస్థానం సాగిస్తున్న వీరికి అనేక సామాజిక సాహిత్య సంస్థల నుండి అనేక బహుమతులు, అవార్డులు పొందినారు.

కాటూరు వారి కథానికలలోని సాంస్కృతిక పరివర్తన వివరించే ముందు పరివర్తనను గుర్చి చర్చిస్తూ ముందుకు వెళతాను. కాలనుగుణంగా పరివర్తన సర్వసాదారణం అయితే పురోగమనం వైపు పయనిస్తే హర్షించదగినదే కాని, నాగరికత అంటూ అనారోగ్యకరమైన అలవాట్లు చేసుకుంటూ ప్రాశ్చాత్య సంస్కృతికతో మన ప్రాచీన సంస్కృతికి తూట్లు పొడుస్తుండడం సరికాదు అనే విషయాన్ని కాటూరు వారు కథానికలలోని ఆయా పాత్రల ద్వారా తేట తెల్లం చేశారు.

కాటూరు వారు ఈ పుస్తకంలో మొత్తం 24 కథానికలు పొందు పరిచారు. ఇందులో ప్రతి కథలో సమాజంలో ఉన్నటు వంటి ఏదో సామాజిక రుగ్మతను వెల్లడిచేశారు. అంతేకాక భారతీయ సంస్కృతిని ఎలా కాపాడుకోవచ్చు ఆయా పాత్రల ద్వారా తెలియజేశారు.



కంకట సుబ్బారావు
తెలుగు ఉపాధ్యాయులు
వి.యస్. సెయింట్ జాన్స్, గన్నవరం
సెల్ : 940684974
ఈమెయిల్ : subbu9939@gmail.com

# కాపుబిడ్డ కావ్యం - పరివర్తన దృక్పథం

డా॥ మట్టా సంపత్కుమార్ రెడ్డి
అధ్యక్షులు, తెలుగుశాఖ
ప్రభుత్వ డిగ్రీ కళాశాల - అగ్రహారం,
వేములవాడ - 505 302.
తెలంగాణ.
సెల్ : 98494 70792, 70328 75308
email: sampathkreddymatta@gmail.com

తెలంగాణాలో వచ్చిన తొలితెలుగుపత్రిక శేద్యచంద్రిక (1887). ఇది వ్యవసాయపత్రిక. ప్రభుత్వపక్షాన 'ఫునూన్' అన్న ఉర్దూపత్రికకు అనువాద పత్రిక. "రైతులోకులు తమ ఆశను అభివృద్ధిచేసుకోవటం" దీని ఆశయం. ఇక్కడ తొలితెలుగు స్వతంత్ర పత్రిక హితబోధిని (1913). ఇది తెలంగాణాలో వెలువడ్డ మలితెలుగు పత్రిక. హితబోధిని ఎంపికచేసుకున్న నాలుగు విషయాల్లో మొదటిది వ్యవసాయం. స్థానిక వ్యవసాయరంగంలో సంస్కరణల అవసరం, ఆధునిక సాగుపద్ధతుల అవగాహన, ప్రభుత్వాలు వ్యవసాయరంగానికి ఇవ్వవలసిన తోడ్పాటు పరమావధిగా ఈ పత్రిక పనిచేసింది. మతం, భక్తిప్రబోధాల అవసరాల నిమిత్తం వచ్చిన సత్యదూతవంటి తొలితెలుగుపత్రికలకూ తెలంగాణాలో వచ్చిన పత్రికలకూ నేపథ్యాలు వేరేవేరని ఇక్కడ బోధపడుతుంది. తెలంగాణాలో వచ్చిన పై రెండు పత్రికల మధ్యకాలం (ఒకదశాబ్దమున్నర) పదిహేనేండ్లు. ఈ కాలంలోనే ఇక్కడ ఆధునికత వైపు తొలిఅడుగులుపడటం గమనార్హం. ప్రజల భాషకు సాహితీసాంస్కృతిక వికాసానికి తగిన ఆదరణ. గౌరవం, స్వేచ్ఛ, అవసరం లభించకపోవటంతో విద్యావంతులైన యువకులు తమ పునర్వికాసానికి భాష, అక్షరజ్ఞానం, పుస్తకపఠనం జీవపదార్థాలని గ్రహించి కార్యాచరణకు పూనుకున్న దశ ఇది. దీనికి తొలి ఆచరణ గ్రంథాలయాల స్థాపన. ఇక్కడ రాబోతున్న ఉద్యమాలన్నిటికి ఇదే మూలకందం. భాషాభిమానంతో అంకురించిన ఉద్యమం అనతికాలంలోనే సామాజిక, ఆర్థిక, రాజకీయరంగాల్లోకి విస్తరించింది. శేద్యచంద్రిక కాలంనాడు పురుడుపోసుకున్న గ్రామీణ మధ్యతరగతియువతరం హితబోధిని వెలువడేనాటికి విద్యార్జనకోసం నానాఅగచాట్లు పడుతూ ఎదిగి నీలగిరి, తెనుగు పత్రికలు (1922) స్వయంగా ప్రారంభించటానికి, పత్రికలే కేంద్రంగా పనిచేయటానికి ఒకమార్గం రూపుదిద్దుకున్నది. ఉన్నతవర్గాల పిల్లల మధ్యన బట్టకుపొట్టకు భారమైన కుటుంబాల్లోంచి ఎదిగివచ్చిన యువకులు ఆనాటికి అతికొద్దిమంది. అందులో గంగులశాయిరెడ్డి ఒక మెరుపుతునక.

"మన్ను బుక్కి మన్నేరిగితే ఎవుసం" అని వ్యవసాయానికి రైతునిర్వచనం. రాత్రీపగలూ తేడాలేకుండా మట్టిలో పొర్లాడే వృత్తి. చేసీచేసీ బొక్కలు తెల్లబడ్డా బుక్కదొరుకని స్థితి. అప్పటి కాపుదనం పొద్దున శిస్తు మాపున పస్తు అన్నంత దయనీయం. ఇటువంటి బక్కపేద కుటుంబంలో పుట్టిన గంగుల శాయిరెడ్డి ఖాన్గిబడికితో ముగింపు ఇవ్వక స్వయంకృషితో ఎదిగివచ్చాడు. తన స్వగ్రామం జీడికల్లు అటు హైదరాబాదుకు ఇటు వరంగల్లుకు మార్గమధ్యంలో ఉండటం కలిసివచ్చింది. తను ఊరువిడిచేనాటికి తెలంగాణాలో గ్రంథాలయాలస్థాపన ముమ్మరమైంది. హైదరాబాదులో దళితజనోద్ధరణకోసం భాగ్యరెడ్డివర్మ కార్యదీక్షలో ఉన్నాడు. యాదవ, పద్మశాలి, గౌడ తదితరకులాల అస్తిత్వసమీకరణలు జరుగుతున్నాయి. కాలంతో బాటు కలిసినడుస్తున్న అప్పటి విద్యార్థితరం విధిగా ఏదోఒక సంస్థతరపున అంకితభావంతో పనిచేయటం సమాజఅవసరమైంది. సాయిరెడ్డి ఇరువయేండ్ల వయసులోనే గ్రంథాలయోద్యమంలో చురుకైన కార్యకర్తగామారాడు. అధ్యయనం పెరిగింది. పరిచయాలు పెరిగి ప్రపంచం విస్తృతమైంది. ఆర్యసమాజంలో, హిందూమహాసభలో, కళావంతుల సంస్కరణోద్యమంలో పనిచేశాడు. పత్రికోద్యమ కార్యకర్తగా తెలంగాణా పల్లెలన్నీ తిరిగాడు. సామాజిక, రాజకీయ, విద్యావిషయక అంతరాలను నేత్రానుభవంతో చూడగలిగాడు. తెలంగాణాఆత్మగౌరవ చిహ్నంగా ఉదయించిన ఆంధ్రజనసంఘం (1921) దీని భావప్రచారానికి రూపుదాల్చిన నీలగిరి, తెనుగు పత్రికలు స్థానికంగా తెస్తున్న మార్పులు, నిజాం సంస్థానం బయట వందేమాతరం, స్వదేశీ, చంపారన్ వంటి జాతీయోద్యమ ప్రభావాలు, దేశంబయట జరిగిన మొదటి ప్రపంచయుద్ధం

ఫలితాలు స్థానిక రైతుజీవితంలో సృష్టిస్తున్న ఆర్థిక సంక్షోభాలు, కోస్తాంధ్రలో/బ్రిటీషాంధ్రలో వ్యవసాయ రంగానికున్న ప్రభుత్వాదరణ, అక్కడి విద్యావికాసం, కృషీవలుడు వంటి నూతనకావ్యావిష్కరణ, స్థానికంగా అప్పటికే హైదరాబాదులో రెడ్డిహాస్టల్ (1918) ప్రారంభమై మొగ్గతొడిగిన కొత్తఆశలు శాయిరెడ్డిలో కావ్యసృజనకు మూలప్రేరణలుగా నిలిచిఉంటాయి. గంగుల శాయిరెడ్డి "కాపుబిడ్డ" కావ్యాన్ని రచించాడు.

1934లో వచ్చిన గోలుకొండకవులసంచికలో శాయిరెడ్డి కాపుబిడ్డ పద్యాలు భాగమయ్యాయి. రచనాకాలం 1925-1935 మధ్య ఉండిఉంటుందని కాపుబిడ్డకు పరిచయవాక్యాలు వ్రాసిన సురవరం ప్రతాపరెడ్డిమాటల్లో తెలుస్తుంది. పూర్వకవులకు రాజులూరాణులతో, ప్రస్తుత కవులకు బుచ్చమ్మ, చింతామణులతో కాలంగడుస్తుండగా దేశానికి వెన్నెముకయైన కాపును కావ్యనాయకునిజెయ్యటం కొత్తబాటకు శ్రీకారమని సురవరం కితాబిచ్చాడు. కాపుబిడ్డ తొలిముద్రణ 1938లో జరిగింది. గతంలో దువ్వూరి రామిరెడ్డి కృషీవలుడుకు ఉపోద్ఘాతం వ్రాసిన కట్టమంచి అచ్చంగా ఇదే అభిప్రాయం ప్రకటించాడు. కనుక కాపుబిడ్డ రచన సమకాలీన సాహిత్యంలో ఒక కొత్తమలుపు.

గంగుల శాయిరెడ్డి దార్శనికుడు. ఆకాలంలోనే అస్తిత్వభావనతో కావ్యనిర్మాణానికి పూనుకున్నాడు. వస్తువు, అభివ్యక్తి, ఉపదేశం మూడింటిలో కొత్తపోకడలుపోయి సమకాలీన సమాజాన్ని, భాషను చలనస్థితిలో పట్టుకోగలిగాడు. ఆనాటికి రైతుజీవితాన్ని చిత్రిస్తూ స్వయంసమగ్రమైన కావ్యంరాలేదన్న విషయాన్ని గ్రహించి వ్యథాభరితుడై, దు:ఖితుడై కాపుల విషయాన్ని కాపులభాషలో చెప్పేందుకు ధృడదీక్షను స్వీకరించాడు. తెలంగాణాలో తెలుగే లేదన్న మెల్లెకండ్లను సరిచేసేందుకు సంకల్పించి తనరచనకు కాపుబిడ్డ అనిపేరుపెట్టి తెలుగుభాష కమ్మదనాన్ని కావ్యంనిండా వెదజల్లాడు.

పల్లెలోని ప్రతిశ్రామికుడి లెక్కనే శాయిరెడ్డి మంచిపాటగాడు. మాటలమాధురీ మహిమ తెలిసినవాడు. స్వయంగా రైతు. కాపుదనపు ఆత్మాభిమానంతో రాజరికాన్నిసైతం ఎదిరించిన పోతన్నను ఆదర్శంగా స్వీకరించినవాడు. సాంప్రదాయాన్ని ఆధునికతను సరిసమానంగా గౌరవించినవాడు. నిరంతరం ఉద్యమచరణాల్లో పరిశ్రమిస్తున్నవాడు కనుక కాపుబిడ్డ కావ్యాన్ని సంపూర్ణమైన ఆత్మవిశ్వాసంతో, అభ్యుదయాంశతో వాస్తవికంగా వెలువరించాడు. సమకాలంలోని సమాజచలనమంతా కావ్యంలో నిక్షిప్తమవటమేగాక భవిష్యత్తు ఉద్యమదారులకు తగిన పూర్వరంగమంతా కావ్యంలో సిద్ధం చేయబడి ఉంటుంది.

కాపుబిడ్డ కావ్యనిర్మాణంలో ప్రధానంగా మూడుఅంశాలు ప్రస్ఫుటిస్తాయి. మొదటిది ఆత్మవిశ్వాసకల్పన, రెండవది ప్రస్తుతస్థితిపై అవగాహన, చివరిది సమస్యను అధిగమించి జీవితం ఫలవంతం చేసుకొనుటకు తగిన ఆచరణ. మూడింటి మధ్య ఏకసూత్రత పాటించి రైతుసమాజాన్ని ఆధునికతవైపు నడిపించటం ఫలశృతి. ఆనాటి తెలంగాణ మొత్తంగా సంస్థానంలో భాగమైనప్పటికీ జాగీర్, మక్తా, పాయ్‌గా, సర్ఫెఖాస్ మొదలైన అంతరపరిపాలనా విభాగాల భిన్నమైన భూసంబంధాలు కలిగిఉండేవి. పన్నులవిధానంలో విపరీతపు వ్యత్యాసం, దోపిడీ అమలయ్యేది. మొదటిప్రపంచయుద్ధపు ప్రభావంతో, వరుసకరువులతో నగదుకరువై పటేదార్లదోపిడీ మరింత బాధించి ఇంట్లో బర్రెను, భార్య వొంటిమీది గంటెపుస్తెలను అమ్ముకునే ఒత్తిడికి గురయ్యాడు. ఈ కృంగదీత రైతుకవియైన శాయిరెడ్డిచేత కాపుబిడ్డ కావ్యాన్ని రచింపజేసింది. మానవసమాజంలో కాపువృత్తి సర్వోన్నతమైనదని, కాపుసాక్షాత్తూ సృష్టిస్థితి లయకారులకు ఏకరూపుడని, ప్రకృతితో ముడిపడి రైతుపరిశ్రమ పవిత్రమైందని, ఆరోగ్యదాయకమని, తన నాగటిచాల్లో సీతమ్మతల్లి పుట్టినట్టి చరిత్రయని, పశువులు, పక్షులు, అనుబంధవృత్తులు, అచ్చగాళు (?)బిచ్చగాళ్ళు, వచ్చిపోయే బాటసార్లూ అందరికీ అన్నదాతే జీవధాతువని ప్రకటిస్తూ ఆశలు అడుగంటుతున్న కాపులజీవితంలో కాంతికిరణాలు ప్రసరింపజేయుట కావ్యంలో మొదటిదశ. రైతులు రాత్రీపగలూ ఆరుగాలం నడుంగట్టుకొని శ్రమిస్తారని, నీళ్లకు సరిసమానంగా చెమటానెత్తురూ ధారపోసి పంటలు పండిస్తారని, కాపుస్త్రీల జీవితం రికామ్‌లేని శ్రమతో కూడుకుని ఉంటుందని, చేసీచేసీ బొక్కలు తెల్లబడ్డా అప్పుల ఊబిలోనే రైతుజీవితాలు తెల్లారుతున్నాయని, మరోవైపు పల్లెలు మురికికూపాలుగా, రోగకేంద్రాలుగా ఉంటాయని వాస్తవచిత్రణ చేస్తాడు. పరిపాలనలోని లొసుగుల్ని ఎండగడుతూ వివిధశాఖల ప్రభుత్వోద్యోగుల అధికారదుర్వినియోగం, జమాబందీలోతిప్పలు, కరువులోనూ శిస్తు చెల్లింపుకు ఒత్తిళ్ళు, అప్పులిచ్చిన దొరలు, షావుకార్ల మోసాలు, కల్లం మీదబడి ఉన్ననాలుగుగింజలూ కొలుచకపోయే పనిపాటులోళ్ళతీరూ కుటుంబాలను

కాకులుచింపినవిస్తరిగా చేస్తున్నందుకు చలించిపోవటం, సంఘర్షణకు గురవటం రెండవదశ.

మారుతున్న కాలంతోబాటే కాపులూమారాలి. గంటకు ఇరువై ఆమడ గాలిమీద ప్రయాణించే విమానాలు వచ్చాయి. వందేండ్ల జీవితాన్ని ఘడియలో చూపించే సినిమాలు వచ్చాయి. మనచుట్టున్న కులాలు చైతన్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. మనం కండ్లు తెరువాలి. మంచెయెక్కి వడిసెలు చేబూని పంటను కాచుకున్నట్టు మనల్నిమనం కాపాడుకోవాలి. కాపులనూకందులనూ వేయిస్తే కమ్మదనం పెరుగుతుందని మనలను కోర్టు కార్వాయిలోపెట్టి చిప్పచేతికిచ్చేవారిపట్ల అప్రమత్తం కావాలి. వ్యవసాయంలో కొత్తపోకడలు తెలుసుకోవాలి. భూసారం, విత్తనశుద్ధి, పంటమార్పిడి, పండ్లతోటలు, పశువులపెంపకంలో మెలకువలు గ్రహించాలి. దేశభాషను, రాజభాషను చదవటం వ్రాయటం నేర్చుకోవాలి. తోటివారికి నేర్పించాలి. ప్రభుత్వచట్టాలను, వ్యవసాయ, వృక్ష, పశువైద్య గ్రంథాలను చదివి చర్చించాలి. చతుర్విధ పురుషార్థాలు సేద్యం ద్వారానే సాధ్యమని గుర్తించాలి. కష్టనష్టాలనేగాక మనం గెలుచుకున్న జీవితాలను కథలుగా కావ్యాలుగా వ్రాసుకోవాలి. పత్రికల్లో మనల్నిమనం ప్రకటించుకోవాలి. గుమస్తాగిరికి పాకులాడటంకాదు నాగలినిధరించటమే కాపుకు గౌరవప్రదమనే ఆలోచన మనమనస్సుల్లో నాటుకోవాలి. చిన్నపాటి సమస్యకైనా కందిరీగలతెప్పె కదిలివచ్చినట్టు కాపులంతా ఐకమత్యాన్ని అలవర్చుకోవాలి అని రైతులను జాగృతం చేసి ఆత్మస్థయిర్యంతో కొత్తదారుల్లో భవిష్యత్తును పయనింపజేయటం కావ్యానికి ముగింపు.

కథాసూత్రానికి గతం వర్తమానం భవిష్యత్తులను ముప్పూరులుగా స్వీకరించటం, పురాణేతిహాసాల పూర్వశాస్త్రాల్లోని నీతిరీతుల్ని రైతుకు అన్వయించటం, కాపువనితల కాయకష్టాన్ని తొలిసారి సాహిత్యంలో ప్రవేశపెట్టడం, నిరంకుశపాలనలో గుండెధైర్యంతో నిలబడి అధికారుల, దొరల దుర్మార్గాల్ని ఎత్తిచూపటం, కాపులు తమజీవితాన్ని ఆధునికతలోకి మరలించుకొనుటకు తగుమార్గాలు చూపించటం కాపుబిడ్డ కావ్యం సాధించిన సమగ్రతను, పక్వతనూ సూచిస్తాయి. కాపులజీవితంతో ముడిపడ్డ సంస్కృతిని విస్తారంగా వర్ణించటం, పనిచేస్తూకూడా పాడుకునేవిధంగా కేవలం దేశీఛందస్సులో తేటతెలుగులో కావ్యాన్ని రచించటం, సమాజంలోని చలనాన్ని పారదర్శకంగా ప్రదర్శించటం, రాబోయే రోజుల్లో రైతుచైతన్యాన్ని, ఉద్యమఛాయల్ని రేఖామాత్రంగా స్పర్శించటం కవి శాస్త్రీయతను, దార్శనికతను పట్టియిస్తాయి. అంతిమంగా చెప్పుకోవాల్సిన విషయం కాపుబిడ్డ కావ్యంలో నీతులు వల్లించిన శాయిరెడ్డి రచనానంతరం కాళ్ళురెక్కలు ముడుచుకుని కూర్చోలేదు. ఒక ఉద్యమకారుడిగా, హక్కుల కార్యకర్తగా, అన్నదాతగా, విద్యాదాతగా, వైద్యుడిగా, వనసంరక్షకుడిగా, సంస్కర్తగా, ధర్మకర్తగా, పారమార్థికుడిగా జీవితాన్ని ఆచరించి చూపించాడు. కనుక కాపుబిడ్డ ఇప్పటికి వందేండ్లకిందటి పాతకావ్యమే కావచ్చు కానీ ఎప్పటికి పాతబడని కావ్యమన్నది ఒక చారిత్రక సత్యం.

**డా॥ మట్టా సంపత్కుమార్ రెడ్డి**
అధ్యక్షులు, తెలుగుశాఖ
ప్రభుత్వ డిగ్రీ కళాశాల - అగ్రహారం,
వేములవాడ - 505 302.
తెలంగాణ.
సెల్ : 98494 70792, 70328 75308
email: sampathkreddymatta@gmail.com

# శ్రీమతి ముదిగొండ సీతారామమ్మ గారి శతకం సామాజిక విలువలు

ముదిగొండ పూర్ణ బాల కాత్యాయని
తెలుగు ఉపాధ్యాయిని
మండల పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల
ఫిర్యాది నైనవరం, విజయవాడ రూరల్ మండలం
చరవాణి:8978254817

ప్రవేశిక:

సమాజ హితాన్ని కోరేదే సాహిత్యం. తెలుగు సాహిత్యంలో విలక్షణ స్థానాన్ని సంపాదించింది శతక సాహిత్యం. ఈ శతక సాహిత్యం దానికున్న ప్రత్యేక లక్షణాల వల్లే నేటికి చిరస్థాయిగా ప్రజల మన్ననలు పొందుతోంది. సమాజాన్ని నైతికంగా ముందుకు నిడిపించే క్రమంలో శతక సాహిత్యం ఎంతో కృషి చేసింది. నాటి శివకవుల యుగం నుండి నేటి ఆధునిక యుగం వరకు ఎన్నో పోకడలతో మార్పులు సంతరించుకుంటూ సమాజాన్ని ఉద్ధరించడానికి తనవంతు సహకారం అందిస్తోంది.

పురాతన సాహిత్యంలోని శతకాలు గ్రాంధిక భాషలో వెలుగొందితే నేటి సాహిత్యంలోని శతకాలు వ్యవహారిక భాషలో ప్రజల మన్ననలు అందుకుంటున్నాయి. నేటి సమాజంలోకి శతకం ఇంతలా ఇమిడిపోవటానికి గల కారణాలలో అలతి అలతి పదాలతో పద్యాన్ని హృద్యంగా వ్రాయగలగటమే.

ఈ శతకం కూడా అందరి మన్ననలు అందుకొని మొదటి వరుసలో నిలుస్తుంది. ఈ శతకంలో కవయిత్రి నేటి సమాజానికి అవసరమైన మంచి విలువలని వివరించారు. అంతే కాక తిరోగమనంలో ఉన్న మనుషులకు చక్కటి సందేశాన్ని కూడా అందిస్తోంది. మనుషుల్ని, సమాజాన్ని ముందుకు నడిపించే ప్రయత్నం చేస్తున్న పద్యాలు ఈ శతకంలో చాలా ఉన్నాయి. సమభావం, గురుభక్తి, మూఢాచార ఖండనం, శ్రమ జీవన సౌందర్యం వగైరా భావాలకు ఈ శతకం నిలయం.

ముదిగొండ సీతారామమ్మ:

శ్రీమతి ముదిగొండ సీతారామమ్మ గారు నిడుమోలు శ్రీరామమూర్తి, శ్రీమతి కామేశ్వరమ్మ దంపతులకు కృష్ణాజిల్లా, మచిలీపట్టణం నందు జన్మించారు. వీరు ఉన్నత విద్యను మచిలీపట్టణం నందు పూర్తి చేసుకొని భాషా ప్రవీణను చిట్టిగూడూరు శ్రీ నారసింహ సంస్కృత కళాశాల మరియు గుంటూరులోని కె.వి.కె. సంస్కృత కళాశాలలో పూర్తి చేసిరి. మధురకవి ముదిగొండ నాగ మల్లిఖార్జున రావు గారిని వివాహమాడి వారి ప్రోత్సాహంతో పద్య రచన చేపట్టారు. మచిలీపట్టణంలోని పలు సాహితీ సంస్థలకు పద్య కవయిత్రిగా ఈమె చిర పరిచితురాలు. వీరి రచనా శైలి ద్రాక్షా పాకం వలె లలిత పదాలతో సరళ సుందరంగా అందరికి అర్ధమయ్యే రీతిలో అలరిస్తుంది. వీరి రచనలు అనేక మాస పత్రికలలో ప్రచురితమయ్యాయి. అనేక కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు.

శతకము సామాజిక దృక్పథము:

తెలుగు వాఙ్మయంలో శతక సాహిత్యానికి ఒక ప్రత్యేక స్థానం ఉన్నది. శతకమంటే నూరు పద్యాల సమాహారం. కొందరు కవులు తమ తమ శతకాలలో శతాధికంగా కూడా పద్యాలు రచించారు. ముక్తకం, మకుటం అనేవి శతకం యొక్క ప్రధాన లక్షణాలు. ముక్తకం అంటే ఏ పద్యానికి ఆ పద్యమే. స్వతంత్ర భావ ప్రతిపత్తితో విరాజిల్లటం. మకుటం అంటే కిరీటం. ప్రభువుకు మకుటం ఎంత ప్రధానమో శతకానికి మకుటం అనేది అంత ప్రధానం. శతకంలోని ప్రతి పద్యం చివరన ఈ మకుటం వస్తుంటుంది. కొన్ని శతకాలలో ద్విపాదమకుటాలు సైతం ఉన్నాయి. శతక సాహిత్యంలో ఏనుగు లక్ష్మణ కవి రచించిన (భర్తృహరి సుభాషితములకు అనువాదం) శతకానికి మకుటం లేకపోవడం ఒక ప్రత్యేక లక్షణంగా పేర్కొనవచ్చు.

శతక కవులు తమ పద్యాల ద్వారా సమాజానికి నీతిని, రీతిని బోధించారు. మానవ జీవితంలో వివిధ స్థాయిల వారికి వివిధ రకాల శతకాలు వారి వారి మానసిక స్థాయిన వికసింపజేయడానికి ఎంతగానో తోడ్పడతాయి అనటంలో అతిశయోక్తి లేదు. బాల్య, యౌవన కౌమార వార్ధక్యములు, భక్తి విజ్ఞాన వైరాగ్య భావములకు నిలయములని పెద్దల మాట (క్రమాలంకారము).

నేటి విద్యా విధానంలో నైతిక సద్భావనాంశాలకు అంతగా ప్రాధాన్యత లేదని విజ్ఞుల అభిప్రాయం. విద్యార్థులలో పై రెండు అంశాలను పాదుకొల్పలంటే శతక సాహిత్యాన్ని పరిచయం చేయటం అత్యంత ఆవశ్యకం.

ఈ శతకంలోని సామాజిక అంశాలైన విద్య, గుర భక్తి, దురాచార నిర్మూలన, తల్లితండ్రుల యెడల భక్తిని వివరిస్తూ నా పత్రాన్ని మరింత ముందుకు తీసుకువెళ్తాను.

విద్య: సంఘంలో మానవుడు సముచిత గౌరవాన్ని సంపాదించుకోవాలంటే విద్య తప్పనిసరి. ఆ విద్య నేర్వని వాడు వింత పశువుతో సమానమని పెద్దలు చెప్పారు. కాబట్టి ప్రతి వారు చదువుకోవాలి.

ఆ చదువు లేని కారణంగా అనేక రకాలుగా మోసపోయి ఆస్తులు నష్టపోయి అనేక ఇబ్బందులకు గురి కావలసివస్తుంది. ఈ శతకంలో కవయిత్రి.

విద్యలెన్నొ చదివి విద్వాంసుడగుచుండు
విద్యలేని నాడు విలువ లేదు
నేర్వవలెను విద్య నేర్పుతో అందరు
తెలుసుకొనర నీతి తెలుగువాడ

నేటి కాలంలో విద్యార్థి చదువు లేకపోతే రాణించడు. ఎన్నో విద్యలు చదివిన వారు విద్వాంసుడగునని, విద్య లేని వారికి సమాజంలో గౌరవం లేదని కాబట్టి అటువంటి విద్యను విద్యార్థులు ఎంతో చక్కగాద, నేర్పుతో నేర్చుకొనవలెనని సూచించారు.

చదువుకోని విద్యార్థి చదువుకునే వారి వద్ద కూర్చున్న కొంత చదువు వస్తుంది. అది ఏ విధంగా అంటే విలువ లేని దారం పూలతో కలవడం వాల్ల వాటి సువాసనను కొంత పొందాయి కదా.

"క్షణశ: కణనశ్చైవ విద్యామర్థం చ సాధయేత్ అని పెద్దలు చెప్పారు ఆ విధంగా ప్రతి క్షణాన్ని ఉపయోగించుకొని విద్యను పొందాలని వివరించారు.

సుఖార్థిచేత్ త్యజేత్ విద్యా
విద్యార్థి చేత్ త్యజేత్ సుఖమ్

కావున విద్యార్థి సుఖాన్ని వదిలిపెట్టి శ్రద్ధగా చదవవలసినదిగా సమాజానికి హితువు చెబుతున్నారు.

చిన్న నాటి చదువు చివరంటనుండును
పెద్ద వారి చదువు పేరు కొరకు
కనుక చిన్న నాడే చదువు కమ్మగా చదవరా
తెలుసుకొనర నీతి తెలుగువాడ

ఈ పద్యంలో కవయిత్రి విద్యార్థులకు చక్కని సందేశాన్ని ఇస్తున్నారు. చిన్నతనంలో చదివిన చదువు మాత్రమే చివరి వరకు మిగిలి ఉంటుందని, పెద్ద వయసులో చదివేఉ చదువు ఉపయోగకరం కాదు. డిగ్రీలు పేరు చివర వ్రాసుకోవడానికి తప్ప ఎందుకు కోరగావని కావున చిన్నతనంలోనే విద్యార్థి చక్కగాద చదవలసినదని చెబుతున్నారు.

తల్లిదండ్రులు:

దైవం అన్ని చోట్ల ఉండలేక బిడ్డల బాగోగులు చూడటానికి తల్లిదండ్రులను సృష్టించాడు. వారి సేవ అనంత పుణాన్ని ఇస్తుంది. అమ్మా నాన్నలంటే ఈ ధరణిపై దేవతలే వారి మనసు తెలుసుకొని నడుచుకొనుట మంచిదని భోదించారు. తల్లిదండ్రులు వున్న బిడ్డల్ని సంఘం గౌరవిస్తుంది. ఆ తల్లిదండుల్లో ఏ ఒక్కరు లేకపోయినా సంఘంలో అనేక అవమానాలను ఎదుర్కోవలసి వస్తుంది. కావున తల్లిదండ్రులు వున్న బిడ్డలు దాన్ని ఒక వరంగా భావించి వారి మనసు తెలుసుకొని ప్రవర్తించాలి.

నేటి సమాజంలో తల్లిదండ్రులు ఒక భాద్యతగా కాక ఒక బరువుగా ఎంచి వారిని ఇంటి నుండి బయట వృద్ధాశ్రమాలలో చేర్పిస్తున్నారు. అంతే కాక వారిని తన్ని గెంటివేస్తున్నారు. ఈ సంధర్భంలో వారు గ్రహించని ఒక విషయం ఏమిటంటే రేపు వారికి ఇదే పునరావృతమవుతుందన్న విషయాన్ని పద్యరూపంలో తెలియజేశారు.

తల్లిదండ్రి మీద దయజూపవలెగాని
తన్ని తగుల వేయు తప్పు తప్పు
నీదు కొడుకు రేపు నిన్నట్లు చేయడా
తెలుసుకొనర నీతి తెలుగువాడ

అంతే కాక అమ్మా, నాన్న అనారోగ్యంగా వున్నప్పుడు కొడుకుతన సుఖాన్ని మరచి తల్లిదండ్రుల సేవ చెయ్యాలి. అలా కాక కొంపలో సుఖాన్ని కోరుకుటే కిరివితో తల గోక్కునట్లేనని హెచ్చరించారు. తల్లిదండ్రుల సుఖాన్ని క్షేమాన్ని కోరుకున్న వారికి దైవం కూడా చేయూతనిస్తుంది. తన సుఖం చూసుకున్న వారికి చివరికి మిగిలేది శోకం మాత్రమే. ఆ విషయాన్ని తెలుసుకొని మసులుకోవాలని ఈ శతకంలో వివరించడం జరిగింది.

గురువు:

తల్లిదండ్రుల తర్వాత స్థానము గురువుదే
అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన తస్మైశ్రీ గురువే నమ:

అజ్ఞానం అనే చీకటిని పోగొట్టి జ్ఞానం అనే అంజనం వ్రాసి కళ్ళు తెరిపించి వెలుగు వైపు నడిపించేవాడు గురువు. అట్టి గురువు చదువు చెప్పే వేళ విద్యార్థి మంచిని కోరి కొట్టవచ్చు, తిట్టవచ్చు అని క్రింది పద్యం ద్వారా చక్కగా వివరించారు.

చదువు చెప్పు వేళ చక్కచేయగ నెంచి
కొట్టవచ్చు గురువు తిట్టవచ్చు
మంచి చేయనెంచు మార్గాలు గొప్పవి
తెలుసుకొనర నీతి తెలుగువాడ.

నేటి సమాజంలో గురు భక్తి సన్నగిల్లిపోయింది. గురువు యందు భయం, భక్తి ఉన్న వారికి బాగా చదువు వస్తుంది, కాని నేటి విద్యా విధానంలో శిక్షలు రద్దు చేయబడినవి. దానిమూలముగా పిల్లలకు సరియైన చదువు రావడం లేదు. గురువు యందు అమిత భక్తి ఉంటే మందమతి అయిన శిష్యుడు కూడా పద్మపాదుడంతడి వాడు అవుతాడని కవయిత్రి ఈ క్రింది పద్యంలో వివరించారు.

గురవు మీద భక్తీ గూడి ఉన్నప్పుడు
పామరుండు పద్మపాదుడగును
సేసలీయ గురువు శిష్యుడు శివుడౌను
తెలుసుకొనర నీతి తెలుగువాడ

మూఢాచారాలు:

అనాది కాలం నుండి సమాజంలో మూఢాచారాలు పాతుకుపోయి ఉన్నాయి. మనిషి ఎంత చదువువున్నా గ్రహాల మీదకు ఉపగ్రహాలు పంపుతున్నా ఈ నమ్మకాల నుంచి బయట పడటం లేదు. ఆడ పిల్లలు పుడితే దోషమని నమ్మే ఈ పురుష ప్రపంచానికి ఆడ పిల్ల ఇంటికి భాగ్యలక్ష్మి అని తల్లిగా, చెల్లిగా, భార్యగా, బిడ్డగా ఆమె సేవలు అనిర్వచనీయమని కవయిత్రి ఈ క్రింది పద్యంలో నిష్కర్షగా తెలియజేశారు.

ఆడప్లిల పుట్టేననుచు దీనంబుగా
బాధ పడకు యామె భాగ్యలక్ష్మి
కాంత మనకు నెపుడు కల్పించు సౌఖ్యంబు
తెలుసుకొనర నీతి తెలుగువాడ

అంతే కాక పురుషాధిక్య ప్రపంచంలో ఆడపిల్లను చిన్నచూపు చూడటం ఎక్కువగా కనిపిస్తుంది. అంతే కాక ఏమి చెప్పినా వినకపోవడం, మనసు తెలుసుకొని మసలుకోవడం వంటివి అసలే చేయరు. అతివంటే అమ్మే కాదు, శక్తి స్వరూపిణి అయిన అమ్మలగన్న అమ్మ. లాలిస్తుంది, పాలిస్తుంది, అవసరమైతే దండిస్తుంది. అనాదిగా ఆడపిల్లల ఎడ చూపుతున్న వివక్షను ఎంతో చక్కగా పద్యరూపంలో మన కవయిత్రి చక్కగా వివరించారు.

మహిళ మహిళ అనుచు మాటాడనివ్వరు
మహిళ మనసు తెలిసి మసులుకోరు
అతివ యెన్ననెపుడు యాదిశక్తియే గాదె
తెలుసుకొనర నీతి తెలుగువాడ

బాల బాలికలు ఈ విషయాన్ని గ్రహించి చక్కని విచక్షణను కలిగి ఉండాలని ఈ పద్యం ద్వారా కవయిత్రి కోరారు.

ఉపసంహారం:

ఈ శతకంలోని పద్యాలు విద్యార్థులలో స్ఫూర్తిని నింపుతాయి. నేటి సమాజానికి నిలువుటద్దంగా ఉన్నాయి. కావున విద్యార్థులు ఇందులోని మంచిని గ్రహించి మసలుకోవాలి. శతక వాఙ్మయం ఉన్నంత కాలం ఈ శతకం ఆబాల గోపాలాన్ని అలరిస్తూ చిరస్థాయిగా నిలుస్తుందని, అంతే కాక ఈ శతకం భావి తరాలకు స్ఫూర్తిగా నిలుస్తుందని నా నమ్మకం.

**ముదిగొండ పూర్ణ బాల కాత్యాయని**
తెలుగు ఉపాధ్యాయిని
మండల పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల
ఫిర్యాది నైనవరం, విజయవాడ రూరల్ మండలం
చరవాణి: 8978254817

# దళిత జీవన విధానం సాంస్కృతిక - పరివర్తన

మంత్రి శ్రీను
ఎం.ఏ బీఎడ్, పి హెచ్
చరవాణి 91955094
ఈ మెయిల్ ; mantrisrinu@gmail

ఉపోద్ఘాతం

భారతదేశం అను నామము ఈ దేశమునకు ఏర్పడక ముందే, ఆర్యుల రాకకు ముందే ఇక్కడ చక్కని సంస్కృతి సాంప్రదాయాలతో కూడిన మాతృస్వామ్య వ్యవస్థ గల సమసమాజంతో మన జంభు ద్వీపం కలదు .వారు దక్షిణ భారతదేశ ప్రాంతములైన తమిళనాడు తెలంగాణా ఆంధ్రప్రదేశ్ కర్ణాటక ప్రాంతాల్లో వీరి వాసముండేది .వీరే తదుపరి వింధ్యాచల సానువుల గుండా ప్రవహించే నర్మదా తపతి లోయల గుండా నేటి పంచ జింగ్ (పంజాబ్)ప్రాంతం చేరి సుమేరియా పర్షియా వంటి దేశాలతో వ్యాపారమొనర్చిన మూల వాసులు ఆది దేశీయులు. వీరు ఎలా దళితులైనారో వారి జీవనం ఎలా పరివర్తనం చెందిందో సాంస్కృతికంగా ఎలాంటి మార్పులు చోటుచేసుకున్నాయో క్రింద చూద్దాం. కూలంకషంగా :

మూలవాసులు దళితులైన విధము వారి జీవన విధానం - సంస్కృతి

మూలవాసులు దళితులుగా ఎలా మారారు అనే దానికి రెండు వాదనలు పరిగణలోకి తీసుకోవచ్చు.

1. వైదికవాదము
2. చారిత్రిక వాదము

1. వైదికవాదము :

ఋగ్వేద కాలమున సమాజము సమానమగు స్థాయిలో ఉండీ కేవలం వర్ణములు మాత్రమే ఉండేవి .ఎవ్వరు ,ఏ వర్ణము వారైనను తన సామర్థ్యానుసారంగా ఏ వృత్తినైనా స్వీకరించే అర్హత కలిగి ఉండెను .కానీ బ్రహ్మ వర్ణము స్వీకరించివారు క్షాత్ర వైశ్య వర్ణము వారు కాలానుగుణంగా క్రింది వర్ణము గ్రహించుటకిష్టములేక పురుష దేవుడను ఉద్భవింపజేసి పదవ మండలములో పురుష సూక్తముగా జొప్పించి సమాజమును పై వర్ణములకు చేరకుండా చేసిరి .దీనిని అతిక్రమించి వర్ణావర్ణ వివాహములకు పాల్పడిన వారిని వారి కుటుంబాలను శూద్రవర్ణంలో కడజాతి పంచములుగా చేసి గ్రామబహిష్కరణ చేసిరి. సమాజాన్నిశాసించి, బ్రహ్మవదముగ్రహించిరి, పైవర్గములధిష్టించి, పంచములుగాజాతిచీల్చి, వంచనలనుచేసిరి, రాజ్యమను భవించిరి, ప్రగతేవ్వడి సొంతమయే, ప్రతిబెప్ప దోస్కపోయా. అన్నట్టు సమాజం చీలి దళిత వర్గం ఏర్ప ఈ వాదం ప్రకారం.

2 .చారిత్రిక వాదం :

ఈ వాదం ప్రకారం సింధు ప్రాంతాన్ని చేరిన యూరేషి మధ్య ఆసియా తెగలు బ్రతుకు దెరువుకు హిమాలయ సాను గుండా వచ్చి ప్రాంతీయులైన సింధు ప్రజలపై జాలాల ,గోసంపద కోసం శాంతి కాముకులైన సింధు ప్రజల యుద్దాలు చేసి నాటి నగర నాగరికతను ధ్వంసం చేసిరి.మిగి ప్రజలను దశ్యులుగా -దాసులుగా - మార్చి సేవకుల పంచమ జాతులుగా జేసిరి .వీరినెదిరించి అడవుల విప్లవాలను చేసినవారిని రాక్షసులుగా-రక్షక అభివర్ణించి వా దాష్టికాలకు పాల్పడిరి .

బ్రతుకుటకు వచ్చి బ్రతుకునాగము చేసి ,గో సంపద దో దస్యులుగా మమ్ము మార్చి మానవత్వ విలువలను మాపి మంచితనము త్రుంచి మలినపరిచారు మనువాద ప్రభలింపజేసినారు. ఇలా జాతి జీవనంలోని అమూ వారసత్వాన్ని సంస్కృతిని అఘాతం లోకి తొక్కేశారు. జవహర్లాల్ నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియా లో ఈ విషయా మనము చూడవచ్చు .

సరమ పనుల సంవాదము రూపంలో బిఎన్ శాస్త్రి బ్రాహ్మణరాజ్యా సర్వస్వం లో చూడవచ్చు .

ఈస్థితిని నాకవితా వధూటీ వదనంబు నెగాదిగా జూచి రూ కమనీయ వైఖరుల గాంచి భళి భళీ యన్న వాడే, నీదే కులమ ప్రశ్న వెలయించి చివుక్కున లేచిపోవుచో బాకున గృవ్వినట్లుగాను పార్థివ చంద్ర వచింపని సిగ్గుగ "జాషువా " తన కవిత్వంలో నిమ్న జాతి వాడి దీన స్థితి గురించి చెప్పినాడు

ముసలి వాడైనా బ్రహ్మకు పుట్టినారు
నలుగురు కుమారులనుటవిన్నాము గాని
పసరము కన్నా హీనుడభాగ్యుడైనా
ఐదవ కులస్థుదేవారమ్మా సవిత్రి అంటూ ప్రశ్నించా

దళితజాతి జీవన విధానము - పరివర్తనం -సాంస్కృతిక

దృక్పథము :
పాద ముద్రే వారి పాలిట పాషాణముగా
అలసి సొలసిన మురికి దేహాలను
కడుగుటకు నీరు లేక
నడుముకు చీపుర్లతో
మెడకు బరువు ముంతలతో
ఈడుస్తున్న జీవితంలో .
వెట్టిచాకిరి చేయించుకుంటూ వారిని మాల మాదిగ తెగలుగా చేసి నీరటి పని బొందలత్రవ్వకం ,డప్పులు కొట్టడం ,చెప్పులు చేసివ్వడం వంటి పనులు చేయిస్తే స్త్రీలను దేవదాసీలుగా భోగవిలాసాలకుగాను చేసిరి .

ఆ క్రమంలో అవనిపై వచ్చాడు మా జ్యోతి
మా పాలిట మహిలోన నవజ్యోతి

అంటరాని బ్రతుకుల్లో చైతన్యము నింపి మాకు సాధికాచదువు నిచ్చు సావిత్రితో గూడి. అన్నటుగా జ్యోతిరావు పూలే అవతరించి తన గులాం గిరి అనే గ్రంథంతో బహుజన వాడల చేతనత్వం నింపి సావిత్రి బాయితో కూడి చదువు,పోరాట సూర్తి నిచ్చిన మహానుభావులు.

జ్యోతిబాపూలే,భాగ్యరెడ్డి ,అంబెడ్కర్ ల రాక-దళిత జీవితాల్లో మార్పు

తరాలుగా అనుభవిస్తున్న దురరే దారిద్ర్యం నుంచి విముక్తి కలిగించుటకా అన్నట్టు జ్యోతిరావు భాగ్యరెడ్డి అంబెడ్కర్ ల అభ్యుదయ ఉద్యమాలు దళిత జీవితాలను చైతన్యవంతం చేసి వర? వ్యవస్థకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపారు. ఇందులో భాగంగా సాంస్కృతిక భజనలతో కీర్తనలతో పాటలతో ఉద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్లారు .వారి త్యాగాల ఫలితమే నేటి దళిత జాతి విముక్తికి కారణం.

దళిత కవిత్వం సాంస్కృతిక పరిణామంలో వారి జీవనం
ఆశువుగా పలికితే పాట,గజ్జ కట్టి ఆడితే ఆట
సంగీతం సాహిత్యం శారద నీ స్వరం
దళిత జాతి విజ్ఞాన సర్వస్వం నీ గానం

ఆటా పాటా తరతరాలుగా అంటి పెట్టుకున్నది ఈ దళిత జాతిని. ఆశువుగా పాట కట్టి పాతకనుగుణంగా చిందెయ్యడం ద్వారా తమ పై జరుగుతున్నా దురాగతాలకు సమాధానం చెప్పడం ద్వారా నేటికీ సమసమాజాన్ని నిలుపుతూ జాతిని జాగృతం చేస్తున్నారు. జి లక్ష్మి నర్సయ్య చిక్కనవుతున్న పాట కవితా సంకలనం జయధీర్ తిరుమలరావు దళిత గీతాలు ,ఆచార్య ఎస్వీ సత్యనారాయణ దళితవాద వివాదాలు వంటి రచనలు వీరి జీవితాల్లో వెలుగులు నింపుతున్నాయి.

సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మో,

సినబోయి కూసున్నవెందుకమ్మో అంటూ గద్దర్ ,మాకొద్దీ నల్లదొరతనం అంటూ కునుమధర్మన్న వూరుమానాదిరా ఈ వాడ మనదిరా అంటూ గుడా అంజన్న ,జయ జయ జయ అంబేద్కర జయ జయ భారత భాస్కర అంటూ బోయి భీమన్న ,అందుకో దండాలు బాబా అంబేద్కరా అంటూ మాస్టార్జీ , దళిత జాతి అభ్యున్నతికి 1986 లో ఏర్పడిన దళిత మహాసభ ఆశయాలను కొనసాగిస్తూ కుల నిర్మూలన అంటరానితనం నిర్మూలన వంటి ఉద్యమాలను ముందుకు తీసుకుపోతున్నారు.

దళితుల జీవితాల మార్పుల్లో నవలలు కథలు కవిత సంపుటాలు కవితలు

దళితజాతుల నుద్దరించే క్రమంలో మల్లిక 1955 ప్రజలమనిషి 1952 బలిపీఠం 1962 కొల్లాయిగట్టితేనేమి 1955 చిల్లరదేవుళ్లు 1970 అన్ టచబుల్ ఇంక్రెడబుల్ గాడెస్ 1974 బంచెన్నికాల్మొక్తా 1976 నైమిశారణ్యం .అంటరానివసంతం,పంచమం కక్క వంటి నవలలు దేశం డైరీ జైలు గంటలు వెలివాడ పాదముద్ర ఏలికట్టె,కొత్తగబ్బిలం ప్రవహిచేపాట మున్నగునవి దళితజాతి లో ఉద్యమ సూర్తిని నింపి వారి జీవితాలలో వెలుగులు నింపుతున్నాయి.

విమర్శ
దళితజాతి జీవనవిధానంలో స్వాతంత్ర్య ఫలాలు దక్కి వారి జీవనం అత్యున్నతస్థాయిలో ఉండాలని మహనీయులు భారత రాజ్యాంగంలో పేర్కొన్న నేటికీ దళితులపై దాడులు ఆగడం లేదు కరం చేదు చుండూరు లక్ష్మి పురం నేటి గరగపర్రు అగిరిపల్లి సంఘటనలు తార్కాణం కావున ప్రభుత్వాలు వీరికి రక్షణ కల్పించాల్సిన బాధ్యత తీసుకోవాలి .

ముగింపుబీ దళిత జాతికి సద రక్షణగా సర్కారులు నిలబడాలి సంగంలో కులవివక్షత నశించి దేశం కుల రహితమై సమసమాజ భావతో సామ్యవాద సమాజంగల దేశంగా మారి ఏకత్వ భావన.

Dr. N. V. KRISHNA RAU,
M.A., M.Phil., Ph.D.,
Asst. Professor Dept. of Telugu & O.L.
Acharya Nagarjuna University
GUNTUR (DT.), A.P.

మంత్రి శ్రీనివాస్
ఎం.ఏ బీఎడ్, పి హెచ్.డి
చరవాణి 919550945096
ఈ మెయిల్ ; mantrisrinu@gmail.com

# ముస్లీం మైనారిటీ జీవన చిత్రణ సాంస్కృతిక పరివర్తన

- షకీలా బి

ఆధునిక సాహిత్యంలో వర్తమాన కవితా రీతులైన స్రీవాద, దళితవాద, మైనార్టీ వాదాలు ప్రతిఫలించాయి గమనించాము. నేటి కవులు వర్తమాన సామాజిక జీవితాలను నిశితంగా పరిశీలించి కాలానుగుణమైన భావజాలాలన, ధోరణులనూ, సిద్ధాంతాలను స్వాగతిస్తున్నారు. కేవలం సాహిత్యపరమైన అంశాలకే కాక సామాజిక సంబంధమైన ఇతరేతర మత, రాజకీయ, ఆరి'క, సాంస్కృతిక అంశాలను కూడా కవిత్వంలో ఆవిస్కరిస్తున్నారు. వాటన్నింటిని సమన్వయం చెసి విశ్లేషించుకుందాం.

ఒక జాతి యొక్క సంస్కృతిని అవగాహన చేసుకొవటమంటె ఆ జాతికి చెందిన మనుషులు యొక్క వివిధ కాలములలో, వివిధ పరిస్థితులలోని సంఘ జీవనాన్ని పరిశీలించుట. ఈ విధంగా నంస్క ృతికి నమాజంలో విడదియరాని సంబంధమున్నది.

ఒక జాతికి ఆది నుండి లభ్యమైన సంస్కృతిని గూర్చి తెలుసుకున్నపుడు ఆ జాతి మాట్లాడె భాషను మొదట పరిగనిస్తాము. భాషలో అచ్చులు, హల్లులు, ధ్వనులు, వాక్యనిర్మాణం మొదలైన అంశాలతో కూడినది భాషా శాస్త్రం. వ్యక్తి యొక్క భావన, కల్పన, అభిప్రాయ నివేదన మొదలైన బుద్ధి సంబంధమైనది సాహిత్యం. ఒక జాతికి వివిధ దశల యొందు లభించిన సాంస్కృతిక పరిణామములను ఆయా కాలములోని సాహిత్యంలో ప్రతిపలిస్తాయి. కాబట్టి లలితకళల అన్నింటిలో తలమానిక మైనది సాహిత్యం. ఒక జాతి యొక్క జీవన విధానంలో మతము, ప్రభుత్వము, న్యాయము, మనష్యుల మధ్య నెలకొన్న సంబంధాలు, ఆ చార వ్యవహారాలు మొదలైన అన్ని అంశాలను వివరించే శక్తి కలిగి ఉండటంతొ పాటు ఆ జాతి యొక్క వివిధ వర్గముల చరిత్రను, భిన్న అంశాలను గురించిన సమాచారాన్ని స్పష్టం చేస్తుంది.

భారతదేశంలొ ఇస్లాం మత ఆవిర్భావ వికాసాలు :- ప్రపంచంలో ప్రసిద్ధిగాంచిన మతాలన్నీటికి ఆయా మత స్థాపకుల పేర్లతోనే పేర్లు పెట్టారు జొరాష్టర్ నెలకొల్పిన మతానికి జొరాష్టియన్ మతమని. గౌతమబుద్ధుడు స్థాపించిన మతానికి బౌద్ధమతమని వ్యవహరిస్తున్నారు. కాని మహ్మద్ ప్రవక్త స్థాపించిన మతానికి మహ్మదీయమతమని పేరుపెట్టలేదు. ఇస్లాం అనే పదం ఏవ్యక్తినీ, ఏ జాతిని సూచించదు. ఈ మతంలో జాతి వర్ణ వ్యవస్థకు చోటులేదు. సర్వమానవులు దేవుని ద ృష్టిలొ సమానులేనని ప్రబోధిస్తుంది. ఈ ఆ కారణంగానే ఇస్లాం మతం విశ్వమతంగా వ్యాప్తిచెందింది. ఈ ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారు ముస్లింలు.

ప్రస్తుతం ప్రపంచ జనాభాలో రెండవ అతిపెద్ద మతం ఇస్లాం. నేడు ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 170 కోట్ల మంది ముస్లీంలు ఉన్నారు. 2015 నాటికి భారతదేశంలో 172 కోట్ల మంది ముస్లీంలు ఉన్నట్లు జనాభా లెక్కలు చెబుతున్నాయి. భారతదేశంలో సంఖ్యాపరంగా మైనారిటి వర్గాలలో అతిపెద్ద వర్గంగా ముస్లీంలను చెప్పవచ్చు.

ప్రపంచ వ్యాప్తంగా " ఇస్లాం " మతం అనుసరించే వారిని ముస్లింలు అంటారు. క్రీ. శ 576 లో మహ్మద్ ప్రవక్త జననం తర్వాత ఇస్లాం మతం ఆవిర్భవించింది. అస్తవ్యస్తమైన సామాజిక జీవనంలో అరాచకత్వం ప్రబలిన అరబ్ జనజీవితాన్ని క్రమబద్ధీకరించడానికి వారి జీవితానికి క్రమ శిక్షణనూ ఒక ధర్మబద్ధ మార్గాన్ని అందించడానికి దైవ సందేశానుసారం మహ్మద్ ప్రవక్త ' ఇస్లాం ' మతాన్ని వ్యస్థాపన చేశాడు.

భారతదేశంలో 7,8,9 శతాబ్దాలలో సూపీ ప్రవక్తలు వర్తకులు రావడంతో మొదలైన ఇస్లాం మత వ్యాప్తి క్రీ.శ 11 వ శతాబ్దంనాటికి పూర్తిగా వ్యాప్తి చెందింది. సూఫీ ముస్లీంలు కుల, మత, వర్గ, వర్ణ బేదంలు లేకుండా అందరినీ సమద ృష్టితో ఆదరాభిమానాలతో చూశారు. వీరు సామాన్య ప్రజలతో మమేకమై వారి భాషల్లోనే తమ తత్వాన్ని బోధించారు. ప్రజలు వీరిని దైవసమానులుగా భావించారు. వారు చనిపోయిన తర్వాత వారి స్మ ృతి చిహ్నాలైన దర్గాలను కూడా పవిత్రంగా భావించారు. వాటికి పూజలు చేసి కుల మతాలకు అతీతంగా మొక్కులు చెల్లించారు. వీరిని ఫకీర్లని, ఫీర్ లని పిలిచేవారు. భారతదేశంలో జైన, బౌద్ధ, పారశీక, సిక్కు క్రైస్తవ, ముస్లీం మతాలను మైనారిటిలుగా గుర్తిస్తున్నారు. ఈనాడు తెలుగు రాష్ట్రాలలో మైనారిటీలు అంటే ముస్లీం లే అన్నమాట స్థిరపడిపోయింది. దీనికి ప్రధానకారణం జైన, బౌద్ధ, పారశీక, సిక్కు క్రైస్తవ సాహిత్యాలు తెలుగులో తమ వాదాన్ని, జీవితాన్ని అంతగా తెలియజేయలేదు. ఈ రకంగా తెలుగులో కొద్దిపాటి క్రైస్తవ సాహిత్యం వచ్చినా, అది వేళ్లమీద లెక్కపెట్టగలిగేదే. ఇది ఒక ఆంధ్ర, తెలంగాణా రాష్ట్రాలలోనే కాదు, భారతదేశం మొత్తం మీద కూడా ' మైనారిటీలు ' అంటే ' ముస్లీం ' ప్రజానికమే అని రూఢి అయింది.

రాజకీయ కారణాలు :-

భారతదేశంలో ఇస్లాం మత వ్యాప్తి ప్రజ్వరిల్లడానికి ముస్లీం రాజులు భారతదేశంపైకి దండెత్తి రావడం కూడా ఒక ప్రధాన కారణం. ముస్లీం రాజులు భారతదేశంలో రాజ్యాలను స్థాపించడం మరో కారణం. ఒక వైపు రాచరిక వ్యవస్థతో మొదలైనా, మరొకవైపు సూఫి ప్రచార కర్తల బొధనల ధ్వారా, సందేశాల ద్వారా భారతదేశంలో ఇస్లాం మతవ్యాప్తి జరిగింది.

భారతదేశంలో రాజులద్వారా ఇస్లాం మతవ్యాప్తి రెండు విధాలుగా జరిగినది. ఒకటి ఇష్టపూర్వకంగా ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారున్నారు. రెండు ముస్లీం రాజులద్వారా బలవంతంగా మతం మార్చుకున్నవారు కూడా ఉన్నారు.

ఆర్థిక కారణాలు :-

ఔరంగ జేబు పరిపాలనలో జిజియా పన్నును భరించలేక చాలా మంది హిందువులు ఇస్లాం మతాన్ని స్వీకరించారు అలాగే ఇష్టపూర్వకంగా మతం మారిన వారు కొందరైతే సంస్థానాలలో పదవుల కోసం ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారు మరి కొందరు. చదువుకున్న వారు అప్పట్లో మతం మారడం వల్ల రాజు ఆస్థానాలలో మంత్రి పదవులు, ఇతరత్రా పదవులు లభించే అవకాశం ఉండేది. అందువల్ల కూడా ఇస్లాం మతాన్ని స్వీకరించిన వారు ఉన్నారు.

వర్తమాన కవితాధోరణులలో మైనారిటి వాదం గురించి పేర్కోనడమైనది. మైనారిటిలు అనే పదాన్ని అల్పసంఖ్యాకులు అనే అర్థంలొ వినియోగించు కుంటున్నాం. ముఖ్యంగా మతపరంగా ఈ పదాన్ని వ్యవహరించుకుంటున్నాం. ఈ దేశంలో ఏయే మతస్తులు అల్పసంఖ్య లొ ఉన్నారొ వారంతా మైనార్టీలే. ఈ దేశంలో హిందువులు మతపరంగా మెజారిటీలు. హిందుయేతర మతాలైన సిక్కు, బౌద్ధం, క్రైస్తవం, జైనం, ఇస్లాం వంటి మత సంప్రదాయాలను అవలంబిచేవారు మైనారిటిలు. మైనారిటి అన్న పదానికి నిర్వచనాలు, వివరణలు, చాలా ఉన్నాయి. విమర్శకులు కొన్నింటిని పేర్కోన్నారు. వాటి లో ప్రధానమైనవి.

జాతి, భాష, మత, జనసంఖ్య పరంగా, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, ఆచార సంప్రదాయాల పరంగా మిగతా సమాజాల కన్నా భిన్నంగా ఉంటే వారిని మైనారిటిలు అని అనవచ్చు. సామాజికంగా మిగతా సమాజాల కన్నా తక్కువ సంఖ్యలో ఉన్న ప్రజానీకాన్ని ' మైనారిటీలు ' అనవచ్చు.

సాంస్కృతికంగా తెగల పర్మా, జాతి పరంగా ఒక పెద్ద సంఘంలో ప్రత్యేకమైన స్వభావాలతొ జీవిస్తున్న వారిని మైనారిటీలు అంటారు.

భారదేశంలొ జైన, బౌద్ధ, పారశీక, సిక్కు, క్రైస్తవ, ముస్లీం మొదలైన మతాలను మైనార్టిలుగా పరిగణిస్తున్నారు. ఖూరాన్ పవిత్రగ్రంథం. ఈనాడు తేలుగు రాష్ట్రాలలో మైనార్టీలు అంటె ' ముస్లీం లే అన్న మాట స్థిరపడిపొయింది.

ముస్లీం - మైనారిటీ :-

JOE R. FEAGIN అనే రచయిత RACIAL AND ETHIC RELATIONS అనే గ్రంథంలో మైనారిటి సమూహం కొన్ని విశిష్ట లక్షణాలు కలిగి ఉంటుందని ఇలా వివరించాడు.

- మైనారిటి సమూహం మెజార్టీ సమూహానికి అధినతను ప్రకటిస్తూ వారిచేత అణచివేతకు గురవుతూ ఉంటుంది.
- భౌతికంగాను లేదా సాంస్కృతికంగా ప్రత్యేకమైన వారిగా గుర్తింపబడుతూ ఆధిపత్య సమూహం చేత ఆక్షేపణలకు గురవుతుంటారు.
- సాముహిక గుర్తింపు మరియు సాధారణ సమస్యల్లొ మైనారిటీలందరూ భాగస్వాములుగా భావించుకుని పంచుకుంటారు.

అలాగే ముస్లీం మైనారిటీల లక్షణాలను కూడా ప్రధానంగా ఐదింటిని చెప్పవచ్చును.

1. వేషధారణ
2. ఆహార పానీయాలు
3. మత విధులు
4. భాష
5. సంస్కృతి సంప్రదాయాలు

1. వేషధారణ :-

ముస్లీంలు జీవన విధానంలో స్రీ, పురుషుల వేషధారణలో సౌందర్యం ప్రధానమైనది. మిగతా భారతీయ సమాజానికి భిన్నంగా ముస్లీం మైనారిటీల వేషధారణ ఉంటుంది. ముస్లీం స్రీలు ఎక్కువగా ఎరుపు, ఆకుపచ్చ చీరలు, సల్వార్ కమీజ్‌లు వాటిపైన మెరిసే చెమ్కిలు అలంకరించిన వస్త్రాలను ధరిస్తారు. రకరకాల గాజులు, పూసల హారాలు, ఎర్రటిచెప్పులు, కాటుక, మెహంది మొదలైనవి స్త్రీలు ఉపయోగిస్తారు. ముస్లీం పురుషులు ధరించే లాల్చీ, పైజామా, షెర్వాని, గడ్డం, కళ్ళకు సూర్మ, అత్తరు మొద్లైనవి ముస్లీంలను సౌంద్ర్య పిపాసులుగా చూపెడతాయి.

2. ఆహారపానీయాలు:-

ప్రపంచానికి ముస్లీంల ఆహార పానీయాలు అనగానే మొగలాయి బిర్యాని, దం బిర్యానీ, షేర్ కుర్మా, డబుల్ కా మీఠా, కిచిడి, ముత్తంజన్ మొద్లైన పసందైన వంటకాలు గుర్తుకొచ్చి ప్రతి ఒక్కరి నోరూరిస్తాయి. ఈ వంటకాలు చెయడంలో ముస్లీంలకు ఎవరూ సాటిరాలేరు. హలీం ను కూడా పరిచయం చెసింది ముస్లీంలే. హైదరాబాద్ బిర్యానీ ప్రపంచంలో నే ప్రసిద్ధి. ఇరాని ' టీ ' ని కూడా పరిచయం చేసింది ముస్లీంలే. మిగరావారి ఆహారపు అలవాట్ల కన్నా ముస్లీంల ఆహారపు అలవాట్లు కొంత భిన్నంగా ఉంటాయి.

3. మతవిధులు:-

ముస్లీంల ప్రధాన విశ్వాసం ' లా ఇలాహ ఇల్లలా మహమ్మదుర్ రసులిల్లా ' అంటే అల్లాతప్ప వేరేదేవుడు లేదు. అల్లాకు తప్ప మరెవరికి మోకరిల్లను అని అర్థం. ఇస్లాం మతాన్ని స్వీకరించిన ప్రతి ముస్లీం తప్పక ఐదు విధులను పాటించాలి.

అవి.

1. కలీమా 2. నమాజు
3. రోజా 4. జకాత్
5. హాజ్

4. భాష :-

ముస్లీంల భాషను అర్థం చేసుకుంటె ముస్లీంల జీవితం అర్థమవుతుంది. భారతదేశంలో ముఖ్యంగా ' ఆంధ్ర దేశంలో ముస్లీంల ప్రధాన వ్యవహార భాష ఉర్దూ. ఆంధ్రప్రదేశ్ లో ముస్లీంలు ఇంట్లో ఉర్దూను, బయట తెలుగును మాట్లాడుతారు. ఈ విధంగా ముస్లీంల జీవితంలో రెండు భాషలున్నాయి. మరి కొందరు తెలుగు ఉర్దూ మిళిత భాషను మాట్లాడే వారు కూడా ఉన్నారు. ఆ క్రమంలోనే తెలుగు సాహిత్యంలో ముస్లీం కవులు జీవితంలో ఉన్నటువంటి ఉర్దూ పదాలను, మాటలను కవిత్వంలోకి తీసుకొని రావడం కాదు. సంస్కృతిలో భాగంగా అవి వచ్చి చేరాయి. ఇలా తెలుగు సాహిత్యానికి కూడా ముస్లీం కవులు ఒక అదనపు గౌరవాన్ని కల్పించారు. తెలుగు ద్వారా భారతీయ సాహిత్యానికీ, తద్వారా మానవ నాగరికతకీ అందుతున్న అపూర్వమైన ఒక అదనపు విలువ ముస్లీం వాదం ' అని ఖాదర్ మొహియుద్దీన్ నిర్వచించారు.

తెలుగు సాహిత్యంలో చాలా వరకు ముస్లీం మైనారిటివాద కవుల కవితా సంకలనాలు, కవితసంపూటాలు దాదాపు ఉర్దూ శీర్షికలతోనే ప్రచురితమైనాయి. విప్లవ రచయితల సంఘం 1997 జనవరిలో ప్రచురించిన ' జీహాద్ ' ముస్లీం వాదకవులు ప్రచురించిన జల్ జలా వంటి అనేక కవితా సంకలనాలు వెలువడ్డాయి. ఫత్వా, జగ్ నేకీ రాత్, నఖాబ్ మొదలైన తెలుగు కవితా సంపుటాలు వెలువడ్డాయి. అయితే ఇవన్నీ ఉర్దూ శీర్షికలతోనే ప్రచురితమయ్యాయి. తెలుగు సాహిత్య పరిధిని విస్తృతం చేశాయి. తెలుగు కవిత్వానికి ఒక అదనపు శక్తిని ఈ ముస్లీం మైనారిటీవాద కవిత్వం కలిగించింది.

సంస్కృతి – ఉర్దూ శీర్షికలు :– ముస్లీం కవులు ఉర్దూ శీర్షికలను మాత్రమే కాకుండా సంస్కృతికి సంబంధించిన పదాలను కూడా శీర్షికలుగా ఎంచుకున్నారు. స్కైబాబ అమ్మ మీద ప్రేమగా రాసిన కవిత ' రెహల్ ' సాధారణంగా ముస్లీం రిహల్, రెహల్ అనే పదాలను దాదాపు ఒకే అర్థంలో వాడుతారు. కానీ ఈ రెండు పదాలకు వేరువేరు అర్థాలున్నాయి. చెక్క లేదా ప్లాస్టిక్ లేదా ఇనుము తో తయారు చేసిన వస్తువు పై పవిత్ర గ్రంథమైన ఖురాన్ ను ఉంచి చదువుతారు. ఈ వస్తువును ' రిహల్ ' అంటారు. పూర్వం రాచరిక వ్యవస్థ లో రాణిని కూర్చోపెట్టుకుని వెళ్ళే వస్తువును రెహల్ అనేవారు. ఈ రెండింటికీ మధ్య భేదాన్ని గుర్తించ వలసి ఉంటుంది.

యాకూబ్ – అవ్వల్ కల్మా
షాజహాన – తస్వీర్
ఖాజా – షరతు

వంటీవి సంస్కృతిలో భాగంగా వచ్చిన కవితా శీర్షికలు

భాషా పరమైన శైలి :– ప్రపంచంలోని ప్రతి మానవుడు తన ఆలోచనలను, భావాలను, ఇతరులకు తెలుపడానికి, ఇతరుల ఆలోచనలను, భావాలను తెలుసుకోవడానికి ఉపయోగించుకునే మాధ్యమమే భాష. భాషకు లిపి, భాషా సూత్రాలు, వ్యాకరణం, సాహిత్యం వంటివి ముఖ్యమైన అంశాలు. ఈ భాషా పరమైన శైలిని ముస్లీం మైనారిటీ వాద కవిత్వం లో రెండువిధాలుగా చెప్పవచ్చు.

ఎ. తెలుగు – ఉర్దూ శైలి      బి. ఉర్దూశైలి

ఎ. తెలుగు – ఉర్దూ శైలి :– ముస్లీంల జీవితాన్ని అర్థం చేసుకుంటే ముస్లీం మైనరిటీ సాహిత్యం అర్థమవుతుంది. ఆంధ్ర ప్రదేశ్ లో ముస్లీంల జీవితంలో తెలుగు, ఉర్దూ రెండు భాషలు సమ్మిలితమై ముస్లీం మైనారిటి వాద కవిత్వంలో చోటుచెసుకున్నాయి.

అలీ ' జోడికి రఖం ' కవితలోనూ ఈ తెలుగు – ఉర్దూ శైలి గమనించవచ్చు.

నిఖా ముసుగులో షరియత్ ను కప్పేసి
జోడెకి రఖం – లేనేదేన్ కొసం అంగలార్చడమే తప్ప
మహెర్ నగదుగా దేనా
నహీ జాస్త క్యా ?
షరబత్ లా మధురంగా ఉండాలే జిందగీ
షరాబి నౌకలో దిగజారి పోతుంది

ముస్లీం స్త్రీలు నిఖా మూలంగా పురుషుని చేతిలో ఏ విధంగా అణచివేయబడుతున్నరో కవి వ్యక్తం చేస్తున్నాడు.

తెలుగు– ఉర్దూ పదాలతో కూడుకున్న ఈ మిశ్రమ శైలిలో కవిత రాయని ముస్లీం మైనారిటీ కవి ఒక్కరు కూడా లేరంటే అతిశయోక్తి కాదు. అంత విరివిగా ఈ శైలిలోని ఖండికల్ని ఇక్కడ మనం ఉదాహరించు కోవచ్చు.

బి. ఉర్దూశైలి :– తెలుగు కవితల్లో ముస్లీంల జీవితాన్ని ప్రదర్శించేటప్పుడు ముస్లీంల జీవన నేపథ్యానికి సంబందించిన ఉర్దూ మాటలు వాడటం అనేది కూడా ముస్లీం మైనారిటి. వాద కవిత్వంలో భాగంగా ఇమిడి పోయింది. ఇలాంటి కవిత్వంలో లిపి తెలుగులోనూ , భాష ఉర్దూలో ఉంటుంది ఈ ఉర్దూ శైలి ముస్లీం సంస్కృతిని తెలుగు వారికీ, తెలుగు కవిత్వానికి పరిచయం చేస్తుంది.

5. సంస్కృతి – సంప్రదాయాలు :–

ముస్లీం సంస్కృతిలో మనకు ప్రధానంగా కనిపించేవి ' అస్సలామాలైకుం ' అంటె ఒకరికి ఒకరు ఎదురు పడినప్పుడు పెద్ద–చిన్న, పేద– ధనిక అని భేదం లేకుండా ఆత్మీయంగా పలకరించే మాట. స్వచ్ఛమైన మనస్సుతో గుండెకు గుండెను చేర్చి కౌగిలించుకోవడం. ఈ కౌగిలింతలో బాధ, దు: ఖం కష్టాలు తొలగి పోతాయనే ఆత్మస్థైర్యం, మనకంటూ ఒకరు అండగా ఉన్నారనే నమ్మకం విశ్వాసం కలుగుతుంది.



యమ్. ఆరోగ్య మేరి
పరిశోధక విద్యార్థిని

# సాహిత్య సామాజిక జీవన విధానం - పరివర్తన

## సాహిత్య పరిచయం :

సాహిత్యం అనే పదానికి "సాహిత్య భావః సాహిత్యమ్" "హితేనసహితం సాహిత్యమ్" అనే నిర్వచనాలున్నాయి. అంటే హితంతో కూడినది. హితాన్ని చేకూర్చేది అని ఆనిర్వచనాలకు అర్థం. సకల శాస్త్ర విషయాలతో కూడుకొన్నది కూడా సాహిత్యమే సరస్వతి సంబంధమైనది. సారస్వతం. అన్ని విద్యలకు తల్లివంటిది. సరస్వతి కాబట్టి సారస్వతమైంది.

సాహిత్యానికి సమాజానికి అవినాభావ సంబంధం వుంది సమాజంలోంచి సాహిత్యం పుడుతుంది. సాహిత్య సృష్టి చేసేవారు కూడా సమాజంలోని ఒక వ్యక్తే గదా! సాహిత్యం మనుగడ సమాజంపైనే ఆధారపడి వుంది. కాబట్టి సాహిత్యం సమాజం కోసమే అని అంటారు. ఒక సాహిత్యం రచనని అంచనా వెయ్యటానికి ఆనాటి సామాజిక స్థితిగతులు ఎంతో తోడ్పడతాయి.

సాహిత్యం సమాజాన్ని ప్రభావితం చేస్తుందా? సమాజాన్ని సాహిత్యం మార్చి వేస్తుందా? అనే ప్రశ్నలున్నాయి. ఏసాహిత్య రచనైనా సమాజాన్ని మంత్రదండంలామార్చి వేస్తుందనుకోవటం సరికాదు. కాలక్రమేణా పరిణామానికి సాహిత్యం తోడ్పడుతుంది. హరిశ్చంద్రుని కథ వల్ల ఒకరో ఇద్దరో మాత్రమే ప్రభావితులవుతారు. అయితే మానసిక పరివర్తనకి దారి చూపించేది సాహిత్యం శ్రీశ్రీ రచనల వల్ల చాలా మంది అభ్యుదయం వైపుమళ్ళారు. నేటి స్త్రీ వాద దళిత వాద సాహిత్యం కొత్తకోణాన్ని ఆవిష్కరింపజేస్తోంది. కాబట్టి సామాజిక అభ్యుదయానికి, మంచికి, మానవతానికి సాహిత్యం ఎప్పుడు అవసరమే మంచి సాహిత్యం కోసం సమాజం, మంచి సమాజం కోసం సాహిత్యం అనటం సముచితంగా వుంటుంది.

## సామాజిక జీవన విధానం

మధురాంతకం నరేంద్ర గారి రచనలలో ఎక్కువగా కథా సాహిత్యం సామాజిక జీవన విధానం గోచరిస్తుంది. మధురాంతకం నరేంద్ర గారు రాసిన "కేంద్రం లేని వృత్తం" కథలో మూడు తరాల వారి పెళ్ళిళ్ళు మూడు విధాలుగా జరుగుతాయి. మొదటి తరం పెళ్ళి కృష్ణమూర్తి శాంతమ్మ గార్లది. అది ప్రేమ వివాహం. వివాహం అప్పట్లో ఆ ప్రేమ వివాహమే ఒక విప్లవం లాంటిది వాళ్ళిదరూ మేనత్తా మేనమామ బిడ్డలు కృష్ణమూర్తి పేద కుటుంబంలో పుట్టాడని శాంతమ్మనిచ్చి పెళ్ళి చేయడానికి ఆమె తండ్రి ఒప్పుకోడు. అప్పుడు శాతమ్మ కొట్లాడి పెద్ద విప్లవం లాంటిది లేవదీసి ఆత్మ హత్య చేసుకుంటానని బెదిరించి కృష్ణమూర్తిని పెళ్ళి చేసుకుంటుంది. అప్పటికదే ఆదర్శం.

అయితే అలాంటి ప్రేమ వివాహం చేసుకున్న కృష్ణమూర్తిగారే తన తర్వాతి తరానికి చెందిన సురేంద్ర కూడా ప్రేమ వివాహం చేసుకోబోతే హర్షించడు సరికదా, "మనకు వాడు పుట్టనేలేదు" అని శాంతమ్మతో అనేస్తాడు. దానికి కారణం సురేంద్ర తనకంటే ఒకడుగు ముందుకేసి వర్ణాంతర వివాహం చేసుకోబోవడమే.

మూడో తరానికి చెందిన సుదారాణి మరో అడుగు ముందుకేసి సలీం అనే వ్యక్తిని మతాంతర వివాహం చేసుకుంటుంది. ఇంతలో కృష్ణమూర్తి గారి మరో కొడుకు సుధాచంద్ర అకాలమరణం చెందుతాడు. దాంతో కృష్ణమూర్తి గారు తీవ్రమైన మానసిక వ్యధకులోనై సురేంద్రనూ, చిన్న కూతురు సుధారాణిని దగ్గరకు తీసుకుంటాడు.

పరివర్తన :- మనుషులు మారాలని, మారడమే అభ్యుదయమనే తరాల అంతరాలు దాటి మనుషులు ముందుకు వెళ్ళాలని తెలియజేస్తారు. ఈ కథలో జరిగిన అపారమైన సంస్కరణ వ్యక్తుల మధ్యే వుండిపోయింది. కృష్ణమూర్తి స్వా ద్వారా అభ్యుదయకరమైన ఏమార్పైనా వైయక్తికం కాదని, సామాజికమేనని వ్యక్తి సామాజికుడనీ కథా సాహిత్యం ద్వారా చెప్పబడుతుంది.

సాహిత్యం సమాజానికి దర్పణం అన్నమాటలు చెప్పటానికి బాగుంటాయి. కాని అంతిమంగా సాహిత్యం సమాజాన్ని దర్పణంలాగా ప్రతిబింబించినప్పుడు ఆ సాహిత్యం రోజు మన చుట్టూ ఉన్న వాస్తవికతను, మనకు పరిచితమయిన వాస్తవికతను మాత్రమే చూపిస్తుంది. అందువల్ల అది మనలో కొత్తగా తీసుకురాగలిగిన మార్పుగాని కలిగించగలిగిన ఆలోచన విమర్శనాత్మక దృష్టికానీ ఏమి వుండదు. అందువల్లనే సాహిత్యకారులు వాస్తవికతలాగా కనపడే అంశాల లోతులలోనికెళ్ళి విశ్లేషించగలిగినప్పుడు ఆవాస్తవికత అలా వుండటం వల్ల ఏర్పడే పర్యావసనాలను విశ్లేషించగలిగినప్పుడు ఆ సాహిత్యం ఆసక్తికరంగా వుంటుంది.



# దళిత జీవన విధానం సాంస్కృతిక - పరివర్తన

కత్తి శ్రావణి
పరిశోధక విద్యార్థి,
ఎ.యన్.యు గుంటూరు

“ షెడ్యూలు కులాలు అనే పదాన్ని అంబేద్కర్ రూపొందించారు. అస్పృశ్యతకు గురైన కులాల చరిత్ర, సంస్కృతి ఈనాటి చారిత్రక అవసరం. ఒక జాతి చరిత్ర, ఆ జాతి అభివృద్ధికి పునాదిని రూపొందిస్తుంది. ఏ జాతి అయినా దాని మూలాలను వెతుక్కోవడంలోనే విస్తృతి వుంటుంది. జాతి, సంస్కృతి, భాష, చరిత్ర పరస్పర ప్రేరకాలు. ఒకదానికొకటి అవినాభావ సంబంధం వుంటుంది. ఈ సంబంధాల అన్వయాలను పరిపుష్టం చేయుట మన కర్తవ్యం. ఎస్సీ కులాలు డా॥ బి.ఆర్.అంబేద్కర్ ఉద్యమంలో ఎంతో అభివృద్ధి చెందాయి. ఆయన రాజ్యాంగంలో పొందుపరిచిన హక్కులు వారి జీవితంలో ప్రతిఫలించాయి. మానవాభ్యుదయానికి బాటలు వేశాయి. మెయిన్ స్ట్రీమ్ సమాజంలోకి ఎస్సీలు చొచ్చుకుపోవడానికి విద్య అనే ఆయుధాన్ని అంబేద్కర్ చేతబూనాడు, దళితులకూ అందించాడు అని దళితుల సామాజిక సాంస్కృతిక చరిత్రలో డా॥ కత్తి పద్మారావు గారు ఈ విధంగా వివరించారు.

మనిషిని, జాతిని, సంస్కృతిని చరిత్రను చాతువర్ణ్య చట్రంలోకి తెచ్చారు. ఆ వర్ణాల ఆధిపత్యానికి దైవదృష్టి మెదలైన అనేక అంశాలను అన్వయిస్తూ చరిత్రను, సామాజిక, సాంస్కృతిక, భాషా చరిత్రల వాస్తవాలను ద్వేషిస్తూ వచ్చారు. అందువల్ల మెత్తం భారత ఉపఖండం అంతా ద్రావిడ భాషలపై కూడా వెల్లువను దొర్లించారు. సంస్కృత భాషతో ద్రావిడ భాషలు యుద్ధం చేశాయి. ఈ యుద్ధంలో కూడా అది భారతీయుల సాంస్కృతిక పునాదిని దెబ్బతీయడానికి సంస్కృత భాషాధిపత్యవాదులు ప్రయత్నం చేశారు. ద్రవిడ భాషా మూలాలను చిదిమేసి, ద్రావిడ భాషలన్నీ సంస్కృతం నుండి పుట్టాయని నిరూపించడానికి ప్రయత్నించారు. దళిత మూలాలు ద్రావిడ భాషల్లోనే వున్నాయి. భారతదేశంలోని ఎస్సీ కులాల జాబితాలో సంస్కృత భాష రాకపూర్వమే దళిత భాషలు అభివృద్ధిచెందాయి.

ఆదిమ మానవులు మరణించిన వాణ్ణి తాకితే “మైల” అనుకునే వారు కాని, హిందువులేమో బ్రతికున్నవారిని కూడా ముట్టుకుంటే లేక చూస్తే మైలగా భావించారు. డా॥ బి.ఆర్.అంబేద్కర్ ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ “ఆదిమ మానవుడు మృత్యువును” తీవ్రమైన మైలగా భావించేవాడు. కేవలం మృతదేహమే కాదు. మరణించిన వ్యక్తి శవంతోపాటు అతడు ఉపయోగించిన పనిముట్లు, ఆయుధాలు వంటి వాటిని కూడా సమాధిలో వుంచడం విస్తృత ప్రచారంలో ఉన్న ఆచారం. వాటిని ఇతరులు ఉపయోగించడం ప్రమాదకరమూ, దురదృష్టకరమూ అనేది సూచిస్తోంది.

దళితులు రాజ్యాంగం రక్షించవలసిన ప్రజలు వారిని రక్షించవలసిన చట్టాలు ఉన్నా అవి ఆచరణలో అమలు జరగడం లేదు. పోలీస్‌స్టేషన్‌లు, ఎమ్మార్వో ఆఫీసులు ఇంకా దళిత స్పృహను కలిగిలేవు. అందుకే దళిత స్త్రీలపై అణచివేత కొనసాగుతుంది. దళిత విద్యార్థినులు మెల్లగా అనేక వ్యవస్థల్లోకి ప్రవేశిస్తున్నారు. టీచర్లు, ఇంజనీర్లు, లాయర్లు, డాక్టర్లు ఇలా అనేక ఉద్యోగ, ఉద్యోగేతర తరగతుల్లోకి ప్రవేశిస్తున్నారు. ఎన్నో కుల, మత, ఆర్థిక, కుటుంబ సమస్యలు వారిని చుట్టుముడుతున్నాయి. వాటికి పరిష్కారాలు కూడా కావాల్సివుంది. దళిత స్త్రీలు వ్యవసాయ కూలి సమాజం నుండి ఒక మధ్యతరగతి సమాజంగా ఆవిర్భవించే సమయంఓల ఒక కౌటుంబిక పరిసరాన్ని సృషజ్టంచుకోవాల్సి వుంటుంది. కులాధిపత్యం, పురుషాధిపత్యం, ధనాధిపత్య అంశాలన్నీ దళిత స్త్రీమీద పెత్తనం చేస్తూ వుంటాయి.

దళితుల్లో పురుషపెత్తనం ఎక్కువ. పురుషుడు స్త్రీని బానిసకు బానిసలా చూస్తాడు. ఉద్యోగస్థులైన వారు కూడా భార్యను కొట్టడం, తిట్టడం అనేక సందర్భాల్లో చూశాం. దళిత పురుషుడిలో వున్న ఈ పితృస్వామిక భావం పల్లెల్లో, పట్టణాల్లో గొడవలకు ఎక్కువ కారణం అవుతుంది. ఇంటా, బయటా దళిత స్త్రీ అనేక వత్తిడులకు ఇప్పుడు మరింతగా గురవుతోంది. పిల్లలు పుట్టినపుడు, అత్త, భర్త, సహాయం పొందుతున్నవారు కూడా తక్కువ ఆంధ్రప్రదేశ్‌లో పట్టణ ప్రాంతాల్లో దళిత విద్యార్థులు ఎంతో ఘర్షణలో జీవిస్తున్నారు. దీర్ఘకాలిక ప్రణాళికలతో చదవడానికి ఇంటిదగ్గర పరిస్థితులు అనుకూలంగా వుండవు. ప్రయివేటైజేషన్‌లో ఏ కులంవాడు సంస్థ పెట్టుకుంటే ఆ సంస్థవారి కులం వారినే ఎక్కువగా ఉద్యోగాల్లో పెట్టుకోవడం వలన ఉద్యోగాలు దొరక్క చాలా ఇబ్బందిపడుతూ వుంటారు. అనేక సందర్భాల్లో టీ బిస్కట్‌తో గడిపే సందర్భాలు కూడా వుంటాయి. వీరికి ప్రభుత్వం నిరుద్యోగ భృతి ఎంతోకొంత కల్పించడం చాలా అవసరం. నిరుద్యోగం ఒక శాపంగా దళిత యువకులను వెంటాడుతూ వుంటుంది. ఇళ్ళకెళితే ఇంకా దుర్భరమైన పరిస్థితులు పరీక్షలు రాసి, చివరకు పరీక్షలకు ఫీజుకట్టలేని పరిస్థితులు ఎగ్జామ్‌కు ఆకలితో వెళ్ళే పరిస్థితులు కూడా వారిని వెంటాడతాయి.

విద్యా సంస్కృతికి సంబంధించి దళిత విద్యార్థులు ఏ ఏ కోర్సుల్లో చరితే ఏమి ప్రయోజనం చూకూరుతోంది. ఏ కోర్సులకున్న ఉపకారవేతనాలు ఏమిటి? అనే కెరియర్ గైడెన్స్ తక్కువే వుంది. సమాజం లోపం వల్ల కూడా దళిత విద్యార్థులు అనేకమైన అంశాలు కోల్పతున్నారు. ఎడ్యుకేషన్ ఆఫ్ షెడ్యూల్డు కాస్ట్స్ అనే గ్రంథంలో ఈ సమాచార వ్యవస్థ గురించి చాలా విషయాలు తెలుస్తాయి. దళిత విద్యార్థులకు ఈనాడు విద్యా సమాచారం చాలా అవసరం. గ్రామాల్లో, మండలాల్లో వివిధ కోర్సుల గురించి తెలియచెప్పే సమాచార కేంద్రాలు రూపొందించడమేగాక జిల్లా కలెక్టరేట్‌లలో దీనికొక ప్రత్యేకమైన ఆఫీస్ పెట్టడం కూడా అవసరం.

సమాచారం లేక చాలామంది దళిత విద్యార్థులు శూన్యంలో జీవిస్తున్నారు. ఒక కోర్సుకు, ఇంకొక కోర్సుకు మధ్య ఖాళీ వీరిని వివిధ రకాల అలవాట్లకు పురిగొల్పుతుంది. విశ్రాంతిగా జీవించటం, ముచ్చట్లతో గడపడం పనికిరాని మాటలను పదే పదే చెప్పుకుని నవ్వుకోవడం – చివరకు నవ్వులపాలవుతున్నారు. నిజానికి దళితుల్లో పైకి వచ్చిన వారి పిల్లలే దళిత రిజర్వేషన్ ఫ్రూట్స్‌ను అనుభవిస్తున్నారు. వీరు కనీసం ట్రస్ట్‌లుగా రూపొంది గ్రామాలు దత్తత తీసుకొని దళిత వాడల్లో "ఎవేకనింగ్ క్యాంప్స్" పెట్టవలసిన అవసరం ఎంతైనా వుంది. గ్రామాల్లో అట్టడుగునున్న దళితుడికి, నిరక్షరాస్యులైన తల్లిదండ్రులు వున్న దళిత విద్యార్థులకు సరైన మేలు జరగడం లేదు.

దళితులకు ఏ భాషైనా త్వరగా వస్తుంది. ఇది మౌఖిక జాతుల లక్షణం. ప్రపంచీకరణలో పారిశ్రామికీకరణతో పాటు వివిధ రంగాల్లో వస్తున్న మార్పుల కారణంగా విదేశీ భాషల్లో నిష్ణాతులైన అభ్యర్థుల అవసరం పెరుగుతోంది. ముఖ్యంగా నాన్ ఇంగ్లీష్, స్పీకింగ్ దేశాల భాష తెలిసిన వారికి మంచి అవకాశాలు ఉంటున్నాయి. ఉన్నత చదువులు చదవవలసిన ఎంతోమంది దళిత యువతుల చదువు మధ్యలోనే ఆగిపోయిందో, ఎంత ప్రతిభ అవకాశాలు లేక వ్యర్థమైందో, ఎంతమంది ఆడపిల్లలు అటు చదువుకి, ఇటు భౌతికశ్రమకు పనికిరాకుండా పోయారో, అర్థాంతరంగా వివాహాలు చేసుకోవడం వల్ల అటు ఉద్యోగం చేయలేక, ఇటు నాట్లకు, కోతలకు వెళ్ళలేక, సరిగా పిల్లలను పెంచుకోలేక అరకొర జీవితాలు జీవించాల్సిన పరిస్థితులకు నెట్టబడ్డారో లెక్కలేదు.

విశ్వవిద్యాలయాల్లో ఆడపిల్లలు ఎదుర్కొంటున్న మానసిక సంక్షోభం అంతా ఇంతా కాదు. అది పల్లెల్లో అనుభవించే వివక్షకంటే దారుణంగా ఉంటుంది. కొందరు ఉపాధ్యాయులు దళిత విద్యార్థుల ముఖాలవైపు చూడకుండా పాఠాలు చెబుతూ అవమానిస్తున్న సంఘటనలూ ఉన్నాయి. దళితులను ఓటర్లుగా గుర్తించటంలోనూ, వారి ఓట్లు దండుకోవడంలోనూ, అవసరం అయితే వారి ఓట్లను బలవంతంగా వేయించుకోవడంలోనూ, వారిని మద్యానికి బానిసలుగా చేయడంలోనూ రాజకీయ నాయకులు తమ ఆసక్తిని కనబరుస్తున్నారు. కాని భారతదేశ పునర్నిర్మాణం విషయంలో నిరాసక్తిగా వున్నారు. ఈ ఆర్థిక వ్యత్యాసాలకు కూడా కులం, అస్పృశ్యత ప్రధాన కారణం అనే అవగాహన ఈనాటి విద్యార్థులకు అవసరం. అన్నిజబ్బులు మురికి నీళ్ళవల్లే వస్తున్నాయి. దళితులు పట్టణాల్లో ఊరిచివర్లో మురికివాడల్లోనే జీవిస్తున్నారు. ఊరిలోవున్న మురికినీరంతా వీరి వాడల్లోకి చేరుతుంది. దానివలన కాలేయం చెడి జబ్బులకు, జ్వరాలకు గూడాలు, వాడలు నిలయాలు అయిపోయాయి. ఇక్కడ ప్రభుత్వాసుపత్రులన్నీ మరణాన్ని ప్రసాదించే కేంద్రాలకు మారాయి. ప్రభుత్వ ఆసుపత్రులు నరకాన్ని తలపిస్తాయి.

"అమ్మ డబ్బు ఉప్పు" అనే కథలో రచయిత వృద్ధులకు ఇచ్చిన ప్రాధాన్యత కనిపిస్తుంది. సరస్వతి అనే వృద్ధురాలి పాత్ర ద్వారా నేటి తరానికి వృద్ధుల అవసరం ఎంత అవసరమో గుర్తించమంటారు. కూరలోకి సరిపోయినంత ఉప్పు వేసుకుంటాం గానీ దానికి మించి ఉప్పును ఉపయోగించం. దానివల్ల రుచి పెరగకపోగా ఆ కూర తినడానికి పనికి రాకుండా పోతుంది. డబ్బు విషయంలో కూడా మన స్తోమత గమనించి ఖర్చుపెట్టాలే తప్ప అవసరానికి మించి ఖర్చు పెడితే అప్పులు పెరుగుతాయనే బోధ వృద్ధురాలైన సరస్వతి తన కుటుంబసభ్యులకు చెప్పినా ఎవరూ పట్టించుకోరు. కూతురు కొడుకైన వంశీకృష్ణకి ఫీజుకట్టే నిమిత్తం పద్దెనిమిది వేలిచ్చిన సరస్వతి కొడుకు కూతురైన స్రవంతి స్నేహితు లతో కలిసి టూరుకి వెళ్తానంటే మాత్రం డబ్బివ్వడానికి నిరాకరిస్తుంది. అవసరాలను గుర్తించి డబ్బు ఖర్చుపెట్టుకోవాల్సి ఆలోచన ఈ తరానికి కూడా చెప్పాలనే తపన ఉన్న పాత్రగా 'సరస్వతి' కనిపిస్తుంది.

"అందరూ ఉన్నా..." అనే కథ మరో కొత్త కోణాన్ని ఆవిష్కరిస్తుంది. పిల్లలచేత నిరాకరించబడిన తల్లిదండ్రు లంతా వృద్ధాశ్రమాల్లో సేదదీరుతుంటారు. ఇద్దరు స్నేహితులకు చెందిన కథను ఇందులో వివరిస్తారు రచయిత వృద్ధాప్యంలో తల్లిదండ్రులు పసిపిల్లల లాంటివారని, పిల్లల్ని ఎంత జాగ్రత్తగా చూసుకుంటామో తల్లిదండ్రుల్ని కూడా అంతే జాగ్రత్తగా చూసుకోవాలనే ఆలోచనకు పాదువేస్తారు రచయిత. పిల్లలు తప్పులు చేయడం సహజం. అయినా వాటిని తెలుసుకుని తల్లిదండ్రుల పట్ల తమ బాధ్యతను నెరవేర్చడం అవసరం అని చెప్తుందీ కథ. "అమ్మా అని పిలిచినా" కథలో వృద్ధాప్యంలో సేవచేసే భార్యని అమ్మా అని పిలవడంలో తప్పులేదనే భావాన్ని వ్యక్తపరుస్తాడు రచయిత. జీవితపు మలిసంజెలో కాలూచేయీ కూడదీసుకోలేని సమయంలో, బ్రతుకు చరమదశలో కాలకృత్యాలకు సైతం తన వంతు సహకారం అందించి అన్నివేళలా ఆదుకునే భార్యను అమ్మా అని పిలవడం ఆశ్చర్యం ఏముంది అనే విషయాన్ని ఈ కథలో వ్యక్తపరుస్తారు రచయిత.

"అంతర్మథనం" కథ నేటి వృద్ధుల పరిస్థితులకు అద్దంపట్టిన కథ. వృద్ధాశ్రమంలో ఉన్న తండ్రి తనపై నిర్లక్ష్యం చూపిన కొడుకుని ఉద్దేశిస్తూ రాసిన ఉత్తరమే అయినా తల్లిదండ్రుల పట్ల కొంతమంది కుమారులు ఎంత నిర్దయగా ఉంటారో తెలియజేసిన కథ ఇది. 'కనిపెంచిన నాడు కొడుకు కానీ కోడలు వచ్చాక కొడుకు కాదు' అన్న సామెత తన కొడుకు జీవితంలో ఎలా నెరవేరుతుందో చెప్తూనే వృద్ధాప్యంలో నిరాదరణను మించిన భయంకరమైన వ్యాధి మరొకటి లేదనే వాస్తవాన్ని కూడా ఈ కథ చెప్తుంది. మొక్కుబడిగా తల్లి మాసికాలు పెట్టిన కొడుకు బీపీ షుగర్ వున్న తండ్రిని ఎంతగా నిరాదరించాడో ఈ కథలో చెప్తాడు రచయిత. వృద్ధాప్యంలో ఓపికలేకపోయినా తన పని తాను చేసుకుంటున్న తండ్రికి ప్రతీ పనిలోనూ వంకపెట్టడమే కాకుండా ఛీదరించుకున్న కొడుకు కోడలు మనస్తత్వాన్ని చెప్తూనే, కనీసం మనవడికైనా మంచి ప్రవర్తన నేర్పించమని ఉద్బోధిస్తాడు. లేకపోతే ఈరోజు తనకి పట్టిన ఈ గతి రేపు నీ కొడుకు ద్వారా నీకు కూడా పడుతుందనే విషయాన్ని తెలియజేయడం బాధాకరం.

"బామ్మగారి బస్సుప్రయాణం" అనే కథ వినోదాన్ని పండిస్తూనే విషాదాన్ని వ్యక్తపర్చిన కథ. ముసలితనం శరీరానికే కానీ మనసుకు కాదని తెల్పిన ఒక బామ్మకథ ఇది. వృద్ధాప్యంలో కొడుకులు కూతుళ్ల చేత నిరాకరింపబడిన బామ్మ వృద్ధాశ్రమంలో చేరి, తన పరిస్థితికి కుంగిపోకుండా ఎవరినీ నిందించకుండా తన జీవితాన్ని గడపడం ఈ కథలో కనిపిస్తుంది. తనకు తెలిసిన అప్పడాలు, వడియాలు పెట్టడం అనే పనిని ఎంతో చాకచక్యంగా చేసుకుంటూ వాటిని

షాపులలో అమ్మి వచ్చిన డబ్బుల్ని కూడా మిగతా వృద్ధులకు కేటాయించడం అనేది ఈ కథలో కనిపించే ముఖ్యాంశం. మనసును ఆనందంగా ఉంచుకుంటే ఎటువంటి పరిస్థితిలో అయినా సంతోషంగా ఉంటామనే విషయాన్ని తెల్పుతుందీ కథ. అప్పడాలు వడియాలు అమ్మడానికి బస్సులో ప్రయాణించిన బామ్మ మిగతా ప్రయాణికుల్ని ఉద్దేశించి చెప్పిన మాటలు అందరూ ఆలోచించదగ్గవి. అధిక సంతానం గురించి, యువకులలో రావలసిన పరివర్తననీ గురించి వ్యంగ్యంగా హెచ్చరించడం ఈ కథలో కొసమెరుపు.

వృద్ధుల సమస్యలను వ్యక్తపర్చిన మరో కథ "ఆశాభావం". 'పదేపదే ముసలాళ్లమని అనుకోవడంతోనే ఈ చిక్కులు. మనకీ ఇంకా ఏదైనా చేసే శక్తి ఉంది. అంతకన్నా మనమీద మనకి విశ్వాసం ఉంది. .. అంటూ వృద్ధులు కూడా వాళ్లమీద వాళ్ళకి నమ్మకం కలిగించుకోవాలనే అవగాహనను ఈ కథలో వ్యక్తపర్చారు రచయిత్రి. రిటైరయ్యాక కొడుకు మాటలు నమ్మి వచ్చిన డబ్బులన్నీ కొడుకు కడుతున్న ఇంటికి ఇచ్చేస్తారు శాస్త్రి, కామాక్షి దంపతులు. కానీ రోజులు గడిచేకొద్దీ కొడుకు కోడులులో వస్తున్న మార్పుల్ని గమనిస్తున్న చేసేదేమీలేక ఊరుకుంటారు. మనవడికనీ, మనవరాలికనీ, తమ ప్రైవసీ కోసమనీ కొడుకు కోడలు కనీసం వీళ్ళిద్దరూ ఉండడానికి గదికూడా లేకుండా చేస్తారు. ఆత్మాభిమానంతో ఇల్లువదిలిపెడతాడు శాస్త్రి. మూర్తి అనే వ్యక్తి సాయంతో వాళ్ళకు తెలిసిన వంటలు చేయడం ద్వారా కష్టపడి మరో కొంతమంది వృద్ధులకి చేయూతనివ్వడం ఈ కథలో కనిపిస్తుంది. తల్లిదండ్రులెప్పుడూ పిల్లల అభివృద్ధికి అడ్డురాకూడదు. మనం మన సంతానమనీ, మనవళ్ళనీ పాకులాడితే వాళ్ళు కూడా వాళ్ళ సంతానం కోసమే స్వార్థచింతన ఎక్కువ చేసుకుంటున్నారు అంటూ చెప్తారు రచయిత్రి.

వృద్ధాప్యంలో తోడు ఎంత అవసరమో చెప్తుంది "ఊతకర్ర" అనే కథ. భార్యపోయిన తర్వాత పిల్లల ప్రవర్తనలో వచ్చిన తేడా గమనించిన ఆనందరావు నలభై ఐదు సంవత్సరాల వయసున్న ఒక కాలేజీ లెక్చరరుని పెళ్ళిచేసు కుంటాడు. దానినొక నేరంగా భావించిన కుటుంబసభ్యులతో పాటు తెలిసిన వారందరూ ఆనందరావు చేసిన పనిని నిందిస్తుంటారు. కానీ వయసులో ఒక తోడుకోసం, వృద్ధాప్యంలో ఊతకర్రగా ఉపయోగపడతుందనే వుద్దేశ్యంతోనే ఆమెను పెళ్లిచేసుకున్నాను తప్ప వేరే వుద్దేశ్యంతో కాదు అని తన స్నేహితుడితో చెప్తాడు ఆనందరావు. జీవితపు మలిసంజెలో తోడు ఎంత అవసరమో ఈ కథలో చెప్తారు రచయిత్రి.

అమెరికాకు పిల్లల్ని పంపించాలనే ఆలోచన ప్రతీ తల్లీదండ్రికి ఉంటుంది. దానికోసం ఎంతో శ్రమపడతారు. తీరా వాళ్ళు అమెరికాకు వెళ్ళాక తమను చూడడానికి రాలేదని నిరంతరం తపన పడుతుంటారు. అటువంటి తల్లి దండ్రుల మానసిక క్షోభను వివరించే కథ "రెండు ఒకటైన వేళ". 'డబ్బు... డబ్బు... సంపాదన, విదేశాలు... ఈ కోరికల్ని వాళ్లలోకి ఎక్కించి మన ఒంటరితనాన్ని మనమే కొనితెచ్చుకున్నామేమో...' అనే సంభాషణ ఈ కథలోని విషయాన్ని చెప్పకనే చెప్తుంది. జీవితంలో ఎంత డబ్బున్నా, ఎన్ని కార్లున్నా అయినవాళ్ళు దగ్గరలేని వెలితి ఏదో ఒక రూపంలో వెంటాడుతూనే ఉంటుంది. పిల్లలు చూడడానికి రావట్లేదని బాధపడుతున్న భర్త మనోవేదన కొంచెమైనా తగ్గించాలనే ఉద్దేశ్యంతో యాదగిరిగుట్ట ప్రయాణం పెడుతుంది సీతమ్మ. దారిలో ప్రతీక్షణం పిల్లల గురించి కలవరించి, వాళ్ళకోసం తపనపడి స్వామి దర్శనం కాకుండానే గుండెపోటుతో మరణిస్తాడు రామారావు. శవాన్ని భద్రపరిచే ఎమ్బాల్మింగ్ కూడా దొరకదు. ఏం చేయాలో తెలియని స్థితిలో ఉంటారు. అయితే అమెరికాలో ఉన్న పెద్దకొడుకు బ్లాక్స్ చేసిన దాడిలో

మరణించడం, చిన్నకొడుక్కి ఉద్యోగం పోయి అందరికీ దూరంగా బ్రతకడం అనే విషయాలు తెలియకుండా
రామారావు మరణించడం, ఏం చేయాలో తెలియక సీతమ్మ పిచ్చిదానిలా ఆలోచించడం మనసును కదిలిస్తాయి.
వృద్ధాప్యానికి తోడు ఇలాంటి విషయాలు కూడా జతచేరితే జీవితం ఎంత దయనీయంగా ఉంటుందో ఈ కథలో
చూపిస్తారు రచయిత.

"ఒడలు-బళ్ళు" అనే కథ ఒక కొత్త కోణాన్ని మనముందు ఆవిష్కరిస్తుంది. కోడలి చేతిలో బానిసల్లా బతికి,
అత్తామామలు, అనుకోకుండా జరిగిన ప్రమాదంలో కొడుకు మరణించిన తర్వాత కోడల్ని తమ కూతురులా
చూసుకోవడం, తను చేసిన పనులకు సిగ్గుపడి కోడలు పశ్చాత్తాపం పొందడం అనే అంశాల్ని ఈ కథలో చక్కగా
వివరించారు రచయిత. "చేతులు కాలాక..." అనే కథ కూడా వృద్ధాశ్రమంలో ఉన్న తల్లిదండ్రుల గురించి చెప్పే కథ.
అందరికీ పెద్దదిక్కుగా ఉన్న సదాశివం కోడలి మాటలతో చాలా బాధపడతారు. కొడుకు ఏమీ మాట్లాడకుండా
ఉంటాడు. చివరికి కోడలి పోరు భరించలేక తల్లిదండ్రుల్ని చూస్తూ ఉండలేక ఇద్దర్నీ తీసుకెళ్లి ఒక అనాధాశ్రమంలో
చేర్పుతాడు. సదాశివం దంపతులు ఇద్దరూ అక్కడున్న వారి అందరి ఆదరాభిమానాలు పొందుతారు. అయినా కొడుకు
దగ్గరలేడనే బాధతో సదాశివం చనిపోతాడు. కొడుకుని పిలిపించి ఆశ్రమంలోనే అంత్యక్రియలు చేయిస్తారు. అవి
అయిన తర్వాత అక్కడున్నవారంతా తండ్రి గొప్పదనాన్ని చెప్తుంటే కొడుకైన నాగేంద్ర చాలా సిగ్గుపడతాడు. తల్లిని
అక్కడుంచలేక ఇంటికి తీసుకెళ్తాడు. వెళ్ళిన దగ్గర్నుంచీ మళ్ళీ కోడలి చేతిలో ప్రత్యక్ష నరకాన్ని చూసిన తల్లి కూడా తండ్రి
పోయిన మూడు నెలలకు చనిపోతుంది. ఏం చేయాలో తెలియక తన అశక్తతకు తనలో తానే బాధపడుతుండడం ఈ
కథలో వివరిస్తారు రచయిత్రి.

వృద్ధాప్యంలో ఒకర్ని విడిచి ఒకరు ఉండలేని పరిస్థితులు ఎలా ఉంటాయో, అలా ఉండాల్సిన తరుణం
వస్తుందేమో అనుకున్నప్పుడు వాళ్లెంత పని చేస్తారో చెప్పే కథ "జీవితంలో కొంత". పిల్లలకు ఇంగ్లీష్ రాకపోవడానికి
కారణం తల్లిదండ్రులని భావించిన అవినాష్ వాళ్ళను తమ దగ్గర్నుంచి పంపించి వేరేచోట ఉంచుదామనుకుంటాడు.
ప్రయాణంలో ఉన్న అవినాష్'కి ఆంజనేయులు అనే ముసలాయన పరిచయమవుతాడు. చివరికి తెల్లారిన తర్వాత తన
బ్యాగ్ కనిపించకపోవడంతో కంగారు పడిన అవినాష్ పోలీస్ కంప్లైంట్ ఇస్తాడు. తర్వాత అతని బ్యాగు దొరికిందని చెప్పి
బ్యాగుతో పాటు ఆంజనేయులిచ్చిన ఉత్తరం కూడా అవినాష్'కి ఇస్తారు. ఆంజనేయులు తన భార్య వైద్యంకోసమే విధిలేని
పరిస్థితుల్లో బ్యాగు దొంగిలించాననీ, తన భార్య చనిపోతే తను కూడా బతకలేననీ, వైద్యంకోసం ఎనిమిది వేలు
ఖర్చుపెట్టుకున్నాననీ రాస్తాడు. ఆ ఉత్తరం చదివిన అవినాష్'లో పశ్చాత్తాప కలుగుతుంది. వృద్ధాప్యంలో ఒకరి తోడు
ఒకరు కోరుకునే తల్లిదండ్రుల్ని దూరంగా ఉంచాలన్న ఆలోచన తనకు కలిగినందుకు సిగ్గుపడతాడు.

"తదనంతరం" అనే కథ తండ్రీ కొడుకుల స్వగతంలా సాగే కథ. ఆస్తికోసం ఈ తరాలెంత ఆరాటపడు
తుంటాయో చెప్పే కథ. కొడుకు ఎప్పుడు ఆస్తిని పంచమని అడిగినా నా తదనంతరం ఇస్తానంటూ దాటవేస్తుంటాడు
విరాటమూర్తి. చివరికి విరాటమూర్తికీ కొడుకు నానాజీకి ఆస్తి విషయంలో గొడవ జరుగుతుంది. వ్యాపారాలు చేసి ఆస్తిని
తగలబెట్టిన కొడుక్కి మళ్ళీ ఇల్లుకూడా అమ్మి డబ్బిస్తే తమకు ఉన్న ఒక్క ఆధారమూ పోతుందని బాధపడతాడు
విరాటమూర్తి. కానీ కొడుకైన నానాజీ కూడా తనలో తను మథనపడుతుంటాడు. తను ఆస్తి హారతికర్పూరంలా

తగలబెట్టబట్టే తన తండ్రి తనకు ఆస్తినివ్వట్లేదని గ్రహిస్తాడు. అయినా ఒక్కసారి ఇస్తే తనను తాను నిరూపించు కోవాలనుకుని ఒక రాత్రి భోజనాల దగ్గర తండ్రితో గొడవ పెట్టుకుంటాడు. రోజు రాత్రి భోజనం చేసిన తర్వాత నడవ డానికి వెళ్తాడు విరాటమూర్తి. బ్యాంకు పాస్'బుక్ కోసం తండ్రి గదిలోకి వెళ్ళి అన్నీ వెదుకుతున్న క్రమంలో దిండుకింద కనిపించిన గుండెజబ్బు మాత్రలు నానాజీలో పరివర్తన కలిగిస్తాయి. గుండెజబ్బును కూడా దాచిపెట్టి తన కుటుంబాన్ని సాకుతున్న తండ్రిని అపార్థం చేసుకున్నానని తనలో తానే కుమిలిపోతాడు. చివరికి తండ్రికి గుండెనొప్పి రావడం, సకాలానికి ఆస్పత్రికి తీసుకెళ్తూ "నీ సంస్కారం, ఆత్మీయత, ప్రయోజకత్వం మాకు సంక్రమిస్తే చాలు. తదనంతరం ఆస్తికోసం ఆశించను గాక ఆశించను" అని మౌనంగా రోదిస్తాడు నానాజీ.

"నాన్న నవ్విన వైనం" కథ ఒక కొత్త ఆలోచనని పాఠకుల ముందుంచుతుంది. వృద్ధాప్యంలో తల్లిదండ్రుల్ని చూడాల్సిన బాధ్యత పిల్లలది. కానీ అనేక కారణాలతో తల్లిదండ్రుల్ని ఏదో ఒక ఆశ్రమంలో చేర్పించి చేతులు దులుపు కుంటున్నారు నేటి పిల్లలు. కథలోని గోపాలరావు తన కొడుకులతో ఎప్పుడూ తల్లిదండ్రులను ఆశ్రమాల్లో చేర్పించిన కొడుకుల గురించి చెప్తుంటాడు. ఆ మాటలు విన్న కొడుకులిద్దరూ ముసలివాళ్ళైన తల్లిదండ్రులిద్దరూ తమనుంచి ఏదో ఆశిస్తున్నారని భావించి వాళ్ళిద్దరిని ఎవరు తీసుకెళ్లాలో అనే విషయం గురించి గోపాలరావుకి తెలియకుండా మాట్లాడు కుంటూ ఉంటారు. చివరికి ఏం జరుగుతుందో అర్థంకాక అయోమయంలో ఉన్న కొడుకులిద్దరికీ యశోదమ్మ తన భర్త చేయబోయే పని గురించి చెప్తుంది. తనకున్న ఇల్లు అమ్మేసి వృద్ధాశ్రమం పెట్టాలనుకుంటున్నారనీ, అందుకోసం ఏఏ వూరిలో ముసలివాళ్లున్నారో వాళ్ళ గురించి మీ నాన్న ఎంక్వైరీ చేస్తున్నారనీ చెప్తుంది. ఆ మాటలు విన్న పిల్లలిద్దరూ ఆలోచనలో పడతారు. వృద్ధాప్యంలో కొడుకుల మీద ఆధారపడకుండా, తమలాగే వున్న కొంతమంది వృద్ధుల్ని చేరదీసి వాళ్ళకు కూడా ఆశ్రయం కల్పించాలనే ఆలోచనతో వున్న తండ్రిపట్ల తమ బాధ్యత మర్చిపోయి ఏవో కుటిల ఆలోచనలు చేసినందుకు బాధపడతారు.

దూరంగా ఉన్న పిల్లల్ని తల్చుకుని తల్లిదండ్రులెంత తల్లడిల్లుతారో చెప్పే కథ "పిడికెడు గుండె". డాక్టరైన కొడుకు అమెరికాలో స్థిరపడి తల్లి చనిపోయినప్పుడు కూడా ఇండియాకి రాడు. కొత్తగా ప్రాక్టీసు పెట్టిన డాక్టరులో తన కొడుకుని చూసుకోవాలని ప్రతీరోజు అతని దగ్గరికి వస్తుంటాడు ప్రసాదరావు అనే 62 సంవత్సరాల ఒక ముసలాయన. వారంలో రెండుసార్లు ఏదో ఒక రోగం వచ్చినట్లుగా రావడం, కాసేపు డాక్టరుతో మాట్లాడిపోవడం, ఆయన రాసిచ్చిన మందులచీటీ చించడం డాక్టరుకి తెలుస్తుంది. ప్రసాదరావు చేసిన పనికి ముందు కోపం వచ్చినా తర్వాత అతని ప్రవర్తనకి కారణం ఏంటో కనుక్కోవాలనే కుతూహలం కలుగుతుంది డాక్టరుకి. చివరికి ఎన్నిసార్లు వచ్చినా గుండెనొప్పి గురించి చెప్తుంటాడు ప్రసాదరావు. డాక్టరు తన కొడుకులాగే ఉండడం, ఏదో ఒక వంక పెట్టుకుని అతన్ని చూడడానికి వస్తున్నట్లుగా చెప్తాడు ప్రసాదరావు. ఆయన మాటలు విన్న డాక్టరుకి మనసులో ఏదో బాధ కలుగుతుంది. భార్య చనిపోయి, కొడుకు దూరంగా ఉండి ప్రసాదరావు జీవితం ఒంటరితనంతో ఎంత ఆవేదన చెందుతుందో తెల్సుకుని బాధపడతాడు డాక్టరు.

వృద్ధాప్యంలో వచ్చే అల్జీమర్స్ గురించి చక్కగా వివరించిన కథ "మా ఊరు ఒక్కసారి పోయి రావాలి". తోట మాలిగా ఉన్న తండ్రి, పద్యాల్ని పాటల్ని నేర్పిన తల్లిని వదిలి ఎక్కడో విదేశాలలో ఎం.డి చేసి సైకియాట్రిస్ట్'గా స్థిరపడిన

తగలబెట్టబట్టే తన తండ్రి తనకు ఆస్తినివ్వట్లేదని గ్రహిస్తాడు. అయినా ఒక్కసారి ఇస్తే తనను తాను నిరూపించు కోవాలనుకుని ఒక రాత్రి భోజనాల దగ్గర తండ్రితో గొడవ పెట్టుకుంటాడు. రోజు రాత్రి భోజనం చేసిన తర్వాత నడవ డానికి వెళ్తాడు విరాటమూర్తి. బ్యాంకు పాస్'బుక్ కోసం తండ్రి గదిలోకి వెళ్ళి అన్నీ వెదుకుతున్న క్రమంలో దిండుకింద కనిపించిన గుండెజబ్బు మాత్రలు నానాజీలో పరివర్తన కలిగిస్తాయి. గుండెజబ్బును కూడా దాచిపెట్టి తన కుటుంబాన్ని సాకుతున్న తండ్రిని అపార్థం చేసుకున్నానని తనలో తానే కుమిలిపోతాడు. చివరికి తండ్రికి గుండెనొప్పి రావడం, సకాలానికి ఆస్పత్రికి తీసుకెళ్తూ "నీ సంస్కారం, ఆత్మీయత, ప్రయోజకత్వం మాకు సంక్రమిస్తే చాలు. తదనంతరం ఆస్తికోసం ఆశించను గాక ఆశించను" అని మౌనంగా రోదిస్తాడు నానాజీ.

"నాన్న నవ్విన వైనం" కథ ఒక కొత్త ఆలోచనని పాఠకుల ముందుంచుతుంది. వృద్ధాప్యంలో తల్లిదండ్రుల్ని చూడాల్సిన బాధ్యత పిల్లలది. కానీ అనేక కారణాలతో తల్లిదండ్రుల్ని ఏదో ఒక ఆశ్రమంలో చేర్పించి చేతులు దులుపు కుంటున్నారు నేటి పిల్లలు. కథలోని గోపాలరావు తన కొడుకులతో ఎప్పుడూ తల్లిదండ్రులను ఆశ్రమాల్లో చేర్పించిన కొడుకుల గురించి చెప్తుంటాడు. ఆ మాటలు విన్న కొడుకులిద్దరూ ముసలివాళ్ళైన తల్లిదండ్రులిద్దరూ తమనుంచి ఏదో ఆశిస్తున్నారని భావించి వాళ్ళిద్దరిని ఎవరు తీసుకెళ్లాలో అనే విషయం గురించి గోపాలరావుకి తెలియకుండా మాట్లాడు కుంటూ ఉంటారు. చివరికి ఏం జరుగుతుందో అర్థంకాక అయోమయంలో ఉన్న కొడుకులిద్దరికీ యశోదమ్మ తన భర్త చేయబోయే పని గురించి చెప్తుంది. తనకున్న ఇల్లు అమ్మేసి వృద్ధాశ్రమం పెట్టాలనుకుంటున్నారనీ, అందుకోసం ఏఏ వూరిలో ముసలివాళ్లున్నారో వాళ్ళ గురించి మీ నాన్న ఎంక్వైరీ చేస్తున్నారనీ చెప్తుంది. ఆ మాటలు విన్న పిల్లలిద్దరూ ఆలోచనలో పడతారు. వృద్ధాప్యంలో కొడుకుల మీద ఆధారపడకుండా, తమలాగే వున్న కొంతమంది వృద్ధుల్ని చేరదీసి వాళ్ళకు కూడా ఆశ్రయం కల్పించాలనే ఆలోచనతో వున్న తండ్రిపట్ల తమ బాధ్యత మర్చిపోయి ఏవో కుటిల ఆలోచనలు చేసినందుకు బాధపడతారు.

దూరంగా ఉన్న పిల్లల్ని తల్చుకుని తల్లిదండ్రులెంత తల్లడిల్లుతారో చెప్పే కథ "పిడికెడు గుండె". డాక్టరైన కొడుకు అమెరికాలో స్థిరపడి తల్లి చనిపోయినప్పుడు కూడా ఇండియాకి రాడు. కొత్తగా ప్రాక్టీసు పెట్టిన డాక్టరులో తన కొడుకుని చూసుకోవాలని ప్రతీరోజు అతని దగ్గరికి వస్తుంటాడు ప్రసాదరావు అనే 62 సంవత్సరాల ఒక ముసలాయన. వారంలో రెండుసార్లు ఏదో ఒక రోగం వచ్చినట్లుగా రావడం, కాసేపు డాక్టరుతో మాట్లాడిపోవడం, ఆయన రాసిచ్చిన మందులచీటీ చించడం డాక్టరుకి తెలుస్తుంది. ప్రసాదరావు చేసిన పనికి ముందు కోపం వచ్చినా తర్వాత అతని ప్రవర్తనకి కారణం ఏంటో కనుక్కోవాలనే కుతూహలం కలుగుతుంది డాక్టరుకి. చివరికి ఎన్నిసార్లు వచ్చినా గుండెనొప్పి గురించి చెప్తుంటాడు ప్రసాదరావు. డాక్టరు తన కొడుకులాగే ఉండడం, ఏదో ఒక వంక పెట్టుకుని అతన్ని చూడడానికి వస్తున్నట్లుగా చెప్తాడు ప్రసాదరావు. ఆయన మాటలు విన్న డాక్టరుకి మనసులో ఏదో బాధ కలుగుతుంది. భార్య చనిపోయి, కొడుకు దూరంగా ఉండి ప్రసాదరావు జీవితం ఒంటరితనంతో ఎంత ఆవేదన చెందుతుందో తెల్సుకుని బాధపడతాడు డాక్టరు.

వృద్ధాప్యంలో వచ్చే అల్జీమర్స్ గురించి చక్కగా వివరించిన కథ "మా ఊరు ఒక్కసారి పోయి రావాలి". తోట మాలిగా ఉన్న తండ్రి, పద్యాల్ని పాటల్ని నేర్పిన తల్లిని వదిలి ఎక్కడో విదేశాలలో ఎం.డి చేసి సైకియాట్రిస్ట్'గా స్థిరపడిన

ఆదిత్య పుట్టిపెరిగిన ఊరిలో సెమినారుకి వస్తాడు. అతను మతిమరుపు గురించి, వృద్ధులలో వచ్చే సమస్యల గురించి ఉపన్యసిస్తున్న సందర్భంలో హఠాత్తుగా ఒక వృద్ధురాలు ఆ ప్రాంతంలోకి వచ్చి వెంటనే వెళ్ళిపోతుంది. ఆమెను చూసిన ఆదిత్య ఆమెను తన తల్లిగా గుర్తించి బాధపడతాడు. విదేశాలలో మైథిలి అనే అమ్మాయిని ప్రేమించి, ఆమెను పెళ్లిచేసుకోవడానికి తానొక జమీందారు కొడుకునని అబద్ధం చెప్తాడు ఆదిత్య. చివరికి ఇన్నేళ్ల తర్వాత తన తల్లి అల్జీమర్స్'తో బాధపడుతూ కనీసం తనని కూడా గుర్తించలేని స్థితిలో ఉంటుంది. ఎన్నో విషయాలు తల్లికి గుర్తుచేస్తాడు కానీ ఆమె నవ్వి ఊరుకుంటుంది. కొడుకుని గుర్తించాడు. చివరికి చిన్నతనంలో తల్లిపాడిన పాటను తల్లితో కలిసి పాడతాడు. విదేశాలు వెళ్లాలనే ఆలోచన మానుకుని తన తల్లి 'ఆశా పేరుమీద 'అఫెక్షన్ సెక్యూర్ హోమ్ ఫర్ అల్జీమర్స్ పేషెంట్' అనే ఆశ్రమాన్ని స్థాపిస్తాడు. కథాకథనం ఎంతో ఆర్ద్రంగా సాగుతుంది. ఉన్నఊరును కన్నతల్లిని మరిచిపోయి మనిషి ఎంతదూరం వెళ్ళినా ఆ జ్ఞాపకాలు మనసులో కదలాడుతూనే ఉంటాయని చెప్పిన గొప్ప కథ.

ముగింపు:

వృద్ధుల సమస్యలను వివిధ కోణాలలో వ్యక్తపరుస్తూనే అక్కడక్కడా వాటికి పరిష్కారాలు కూడా సూచించిన కథలు ఈ సంపుటంలో మనకు కనిపిస్తాయి. అన్ని కథలను పరిచయం చేయడం వీలుపడలేదు. కేవలం పైన చెప్పిన కథలే కాకుండా మిగిలిన కథలు కూడా వృద్ధుల సమస్యలను అర్థం చేసుకునే దిశలోనే సాగడం విశేషం. దాదాపుగా అన్ని కథలూ కుటుంబసంబంధాలు, పిల్లల మనస్తత్వాల్ని అర్థంచేసుకోలేక ఇబ్బందిపడే తల్లిదండ్రులు, తల్లిదండ్రుల్ని అర్థంచేసుకోలేని పిల్లలు, అన్ని పరిస్థితులకు ఆర్థిక సంబంధాలే పునాదిగా నిలవడం ఈ కథల్లో మనకు కనిపించే అంశాలు. రెండోపెళ్లి చేసుకున్నా దాన్ని ఇంకా ఆమోదించలేని సమాజ వాతావరణం కూడా ఆయా కథల్లో కనిపిస్తుంది. మొత్తం మీద వృద్ధాప్య జీవన పరివర్తనని అన్నీ వైపులనుంచీ సమర్థంగా వ్యక్తీకరించిన సంపుటంగా "మా అమ్మానాన్న కథలు" అనే కథాసంపుటాన్ని మనం గుర్తించవచ్చు.

★★★

# రాయల సీమ కథల్లో కర్షక జీవన విధానం -పరివర్తన

- పెరుమాళ్ళ రవి కుమార్

రాయలసీమ వ్యవసాయం ప్రధానంగా గల ప్రాంతం. ఈ ప్రాంతం అత్యల్ప వర్షపాత ప్రాంతం .ఇక్కడ ఆరుగాలం కష్టించే రైతుకి ఎప్పుడు కష్టాలే .వర్షాలు కురుస్తే అతివృష్టి ,కురవకపోతే అనావృష్టి .నిత్యం రైతు కళ్ళల్లో ఆశాభావం తప్ప ఆకలి మంట చల్లారదు. ఆకలి ,ఆర్త నాదాలే ఇక్కడి రైతుల నేస్తాలు.రైతు అహర్నిశలు శ్రమ పడినా పంట సరిగ్గా పండక,అప్పులు తీరక గుండె దిటవు చేసుకొని బ్రతుకునెల్లదీస్తున్న కర్షకులు ఎందరో.దైవం కరుణించి పంట పండినా గిట్టుబాటు ధర లేక,దళారీల చేతుల్లో మోసపోతున్నారు.విత్తనాలు,ఎరువులు దొరకక ,దొరికినా కల్తీ విత్తనాలతో మోసపోయిన అభాగ్యజీవులు.పుట్టి, పెరిగిన భూమినే కన్న బిడ్డలా భావించి కంటికి రెప్పలా కాచి కాపాడుకున్నా ప్రకృతి వైపరిత్యాలవల్ల నష్టపోయి అప్పుల ఊబిలో కూరుకుపోయి ఆత్మ హత్యలు చేసుకుంటున్నారు.

సీమలో అన్ని రంగాల అభివృద్ధి మాట ఎలా ఉన్నా వ్యసాయ రంగంలో రైతు సంక్షోభం ఎదుర్కుంటున్నాడు. జాతికి అన్నం పెట్టే రైతు అలుపెరుగని శ్రామికుల్లా బతుకు బండి లాగలేక పోతున్నాడు.ఇక్కడ మిగతా ప్రాంతాలకన్నా కొంత ఆలస్యంగా సాహిత్యం ప్రారంభమైనా ఇక్కడి సామాజిక పరిస్థితులు ,రాజకీయ అంశాలు ,కరువులు ,రైతుల దీనావస్థ మొదలైన అంశాలు సాహిత్య వస్తువు అయ్యాయి. ఇక్కడిరాయల సీమ నుంచి ఎన్నో కథలు పుంఖానుపుంఖాలుగా పుట్టుకొచ్చాయి .రాయలసీమ రైతాంగ సాహిత్య వైతాళికునిగా కె.సభా గారిని చెప్పుకోవచ్చు. సభా గారు స్వయంగా వ్యవసాయం చేసిన అనుభవంతో కథలు రాశారు. రైతుల కష్టాలు ,కడగండ్లు "అంతరంగం" అన్న కథలో దర్శనమిస్తాయి.వీరి కథల్లో ఆదర్శ వాస్తవికతా వాదం కనిపిస్తుంది.

రాయలసీమ కథా రచయితల్లో పేరుపొందిన మరో రచయిత సింగమనేని నారాయణ.రైతు పక్షాన కథలు రాశారు. కరువు కాటకాలవల్ల కృషీవలుని పరిస్థితి మరీ దారుణంగా తయారయ్యింది.వీటివల్ల వ్యవసాయాన్ని మానుకొని బ్రతుకుదెరువు కోసం కొత్త మార్గాల్ని అన్వేషించాల్సిన పరిస్థితి దాపురించినదని చెప్పుకోవచ్చు.ఇలాంటి ఇతివృత్తంతో రైతు గుండె చప్పుళ్ళను కథల్లో వినిపించిన కథకుడు సింగమనేని నారాయణ.

ప్రజాపాలకులైన,రాజకీయ వేత్తలైనా దేశాన్ని శాస్త్ర సాంకేతిక పరంగా అభివృద్ధి చేయాలని చూస్తున్నారు. వ్యవసాయ రంగాన్ని అభివృద్ధి దిశగా అడుగులు వేయించలేకపోతున్నారన్నది నిర్వివాదాంశం.ఇక్కడ భూస్వాములు మరింత భూస్వాములుగా మారుతున్నా వ్యవసాయ కూలీలు కూలీలుగానే మిగిలిపోతున్నారు.పంట రుణాలు భూయజమానులకు అందుతున్నాయి తప్ప కౌలు రైతులకు అందక అప్పులు చేసి అప్పులు తీరక వడ్డీలు కట్టలేక,కుటుంబాన్ని నడపలేక ,పిల్లల చదువులు పెళ్ళిళ్ళు చేయలేని నిస్సహాయ స్థితి కన్పిస్తుంది.ఇలాంటి పరిస్థితిలో ఏం చేయాలో దిక్కుతోచక ఆత్మహత్యలు ఇక్కడ సర్వ సాధారణం.కరువుల వల్ల,సరైన వర్షాలు లేక వరి పంట కాక వెలిపంటలపై ఆధారపడాల్సివస్తుంది.

కర్నూల్ కు చెందిన జి.రామ కృష్ణ రాసిన "గరుడ స్తంభం"కథలో దాసరి కులానికి చెందిన ఒక యువకుడు చావు కర్మలు చేసే వృత్తిని వదిలి వ్యవసాయ వృత్తిని చేపడుతాడు.కాని వ్యసాయం వల్ల లాభసాటి లేక అప్పులపాలై వడ్డీలు పెరిగి ,బ్యాంక్ లో అప్పు పెరిగి చావులోతుల్లోకి వెళ్ళి తిరిగి తమ కులవృత్తి మేలనుకుని తమ కులవృత్తి అయిన దాసరి వృత్తిలోకి మారుతాడు.ప్రపంచీకరణ నేపథ్యం వల్ల వ్యవసాయరంగంలోని మార్పులను ఈ కథలో చూపించారు.

చిన్న కారు,సన్న కారు రైతుల జీవన చిత్రాన్ని చిత్రించిన మరో కథ "చిదిమే చదువులు".ఈ కథ లో సుభాషిణి సన్నకారు రైతులు తమ పిల్లల భవిష్యత్తు బాగుండాలని తమకున్న కొద్ది పాటి భూమిని అమ్ముకొని పట్టణాలకి వలస వెళ్ళిన జీవితాలు ఇందులో దర్శనమిస్తాయి. సీమ కథా రచయితల్లో మరో రచయిత మధురాంతకం రాజారాంది ప్రత్యేకమైన శైలి.చిత్తూరు జిల్లా మాండలిక పదాలతో ప్రతి విషయాన్ని హృద్యంగా చిత్రిస్తారు.వీరి కథల్లో పాత్రలు మనతో సంభాషిస్తాయి. "ఇక్కడ మేమంతా క్షామం"అన్న కథలో పల్లెల్లో "మనుషులకు పని దొరకాలంటే సేద్యాలు జరగాలి.సేద్యాలు జరగాలంటే నీరుండాలి. వాన సినుకు కిందనేలరాలకపోతే ఆ తల్లి బతుకేంగావాల? ఆతల్లిని నమ్ముకున్న మనుషుల గతేంకావాల?అని ఈ కథ ద్వారా ప్రశ్నిస్తారు.మనల్ని ఆలోచింజేస్తారు

రాను రాను రైతు పరిస్థితి మరీ దారుణంగా తయారైంది.ఇలాంటి పరిస్థితి కొనసాగితే రైతు జీవన విధానం అస్తవ్యస్తంగా మారుతుంది. మరికొంత కాలానికి రైతు వాడిన

ఏమిముల్లు కనుమరుగయ్యే పరిస్థితి ఎదురవుతుంది.అంతేకాక వాటిని ఏ ప్రయత్నాలలోకి మారాల్సివస్తుంది. సీమలో రైతు స్థితి అప్పటికీ ఇప్పటికీ ఒకేలా ఉంది కాలం మారినా స్థితి గతులు మారడం లేదు.వ్యవసాయ రంగం లో అధునాతన పరికరాలు వచ్చినా ఆ వృత్తిని వదిలి మరో వృత్తులలోకి వెళ్ళిపోతున్నారు.

విద్యార్థి స్థాయి నుండి రైతుపట్ల గౌరవభావం పెంపొందించుకోవాలి.విద్యార్థులను మీ లక్ష్యం ఏమిటి అని ప్రశ్నిస్తే ఇంజనీర్లు,డాక్టర్లు,లాయర్లు అవ్వాలని చెప్తారే తప్ప వ్యవసాయ వృత్తి చేపడతాను అని చెప్పరు.విద్యార్థి దశలోనే అధునాతన పరికరాలతో శాస్త్ర సాంకేతికత తో వ్యవసాయం పై మక్కువ పెంచగలగాలి.



## పరిశోధనాంశము

# తూర్పు గోదావరి జిల్లా గ్రామ దేవతల - సాంస్కృతిక -సామాజిక పరిశీలన

### తూర్పుగోదావరిజిల్లాభౌగోళిక, చారిత్రక, సాంస్కృతిక నేపథ్యం: -

### తూర్పు గోదావరి జిల్లా :-

భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఈశాన్యాన 16' 30' నుండి 18' 20' ఉత్తర అక్షాంశాల మధ్య 81' 30' మరియు 82' 36' తూర్పు రేఖాంశాల మధ్య ఉంది. కాకినాడ, రాజమండ్రి దీని ముఖ్య పట్టణాలు. కాకినాడ రాష్ట్ర రాజధాని అమరావతికు 246 కిలోమీటర్ల దూరంలో ఉంది. ప్రకృతి అందాల సమాహారం - ఆంధ్రాకు పర్యాటక మణిఇహారము తూర్పు గోదావరి జిల్లా. ఓ పక్క పెట్టని కోటలా నిలబడిన తూర్పు కనుమలు. మరోపక్క దట్టమైన అడవులతో నిండిన అరణ్య ప్రాంతము. ఆ ప్రక్కనే గోదావరి డెల్టా. ఒక్క మాటలో చెప్పాలంటే విభిన్న భౌగోళిక స్వరూపాల సమాహారము తూర్పు గోదావరి జిల్లా. మెట్ట ప్రాంతము, అడవులు, నదులు, డెల్టాలతో కూడిన విశాలమైన సముద్రతీరంతో విభిన్న జీవన సంస్కృతీ సౌరభాలతో విరాజిల్లుతోంది. ఈ ప్రాంతాన్ని మౌర్యులు, శాతవాహనులు, విష్ణుకుందినులు, తూర్పు చాళుక్యులు, చోళులు, కాకతీయులు, ముసునూరి సేనాధిపతులు, కొండవీటి రెడ్డి రాజులు, గజపతులు, కుతుబ్ షా హేలు మొఘులాయిలు... ఇలా ఎందరో రాజవంశీయులు పాలించారు.

### 1947 భారత దేశ స్వాతంత్ర్యం అనంతరం :-

1947 ఆగస్ట్ 15న స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మద్రాసు ప్రెసిడెన్సీ మద్రాసు రాష్ట్రంగా అవతరించింది. 1953లో ఉత్తర జిల్లాలు గోదావరి జిల్లాలతో చేర్చి ఆంధ్రప్రదేశ్ పేరుతో కొత్త రాష్ట్రం అవతరించింది.

### గోదావరి :-

ప్రకృతి ప్రసాదించిన అద్భుత వరాలు మన జీవనదులు. మన దేశంలో గంగానది తరువాత గోదావరి నది అతి పవిత్రమైంది. దక్షిణ భారతదేశంలోనే గోదావరి అతిపెద్ద నదిగా గుర్తించబడింది. సుమారు 7 వేల అడుగుల ఎత్తు, 500 సెం.మీ వర్షపాతము ఉన్న పడమటి కనుమలలోని నాసిక్ త్రియంబకం గోదావరి జన్మస్థానము. ఇచట నుండి ఆగ్నేయ దిశగా ప్రవహించి, తూర్పు కనుమలలో ప్రవేశిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లోని అదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాల గుండాల ప్రవహించి దేవీపట్నం గుండా తూర్పు గోదావరి జిల్లా లో ప్రవేశిస్తుంది. దీని పొడవు 1450 కి.మీ కాగా, ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే 927 కి.మీ ప్రవహిస్తుంది.

శాఖోపశాఖల సంగమ స్రవంతి అయిన గోదావరి నదిని ద్రాక్షారామ భీమేశ్వర స్వామి ప్రతిష్టా సమయాన గౌతముడు, వశిష్టుడు, విశ్వామిత్రుడు, అత్రి, కౌశకుడు, భరద్వాజుడు, అగస్త్యుడు అనే సప్తమహర్షుఉ ఒక్కొక్క పాయగా తీసుకువచ్చారనీ, ఈ కారణంగానే ఆ ఏడుగురు రుసుల పేరు మీదుగా ఏడు పాయలుగా ఉన్నట్లు ప్రతీతి. గోదావరి నది సప్త శాఖలకు కాశ్యప లేక తుల్యభాగ, అత్రి లేక కోరంగ, గౌతమి, భరద్వాజ, విశ్వామిత్ర

టీక కౌశిక, జమదగ్ని, వశిష్ట అనే పేర్లు కలవు. కానీ ఈనాడు వీటిలో గౌతమి, వశిష్ట మాత్రమే ప్రవహిస్తూ ఉన్నాయి. వీటిలో తూర్పు గోదావరివైపున 45 మైళ్ళ దూరం ప్రవహించి వృద్ధ గౌతమి, కోరంగి నదులుగా చీలి సముద్రంలో కలుస్తుంది. అదేవిధంగా పశ్చిమ గోదావరిగా వశిష్ట దక్షిణంగా 25 మైళ్ళ దూరం ప్రయాణించి వైనతేయ పాయగా అంతర్వేది వద్ద సముద్రంలో కలుస్తుంది.

ఖమ్మం జిల్లా కూనవరం ప్రాంతము వద్ద శబరి నదిని అక్కున చేర్చుకుని గోదావరి నది వెడల్పు తూర్పు కనుమల్లోని పాపికొండల వద్ద 175 నుంచి 250 మీటర్ల మాత్రమే ఉంటుంది. దేవీపట్నం నుండి 15 కిలో మీటర్లు దాటిన తర్వాత క్రమేపి పెరుగుతూ రాజమండ్రి వద్ద నాలుగు కి.మీటర్లు ధవళేశ్వరం వద్ద ఏడు కి.మీటర్ల వరకూ విస్తరించింది.

## సంస్కృతి :-

బ్రాహ్మణులు, క్షత్రియ రాజులు, కాపులు, రెడ్డి, కమ్మ, కొండ రెడ్డిలు అధికంగా ఉన్న ఈ జిల్లాలో ఇంకా ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఉంది. రాచపల్లి వంటి మెట్ట ప్రాంతాల్లో ఇంకా క్షత్రియ రాజుల జమిందారీ వ్యవస్థ కొనసాగుతున్నది. ఈ జిల్లా వాసులకు ఎక్కువగా పశ్చిమ గోదావరి జిల్లా వాసులతో వివాహ సంబంధాలుంటాయి. ఈ జిల్లా రాజమండ్రి, కాకినాడ వంటి పట్టణాలో కొద్దిగా ఆధునికత కనిపించినా మిగిలిన మండలాల్లో చాలా వరకూ గ్రామీణ సంస్కృతి కనిపిస్తుంది. మహిళల్లో అక్షరాస్యత తక్కువ. బాల్య వివాహాలు ఎక్కువగా జరుగుతాయి. సంక్రాంతి, ఉగాది, వినాయక చవితి, క్రిస్టమస్, మరియు గ్రామ పండుగలు వైభవంగా జరుపుకుంటారు.

## రవాణా వ్యవస్థ :-

తూర్పు గోదావరి జిల్లా దేశం నలుమూలలకు రహదారి మరియు రైలు మార్గాలతో అనుసంధానించబడి ఉంది. చెన్నై, కోల్‌కత్తాలను కలిపే జాతీయ రహదారి, రైల్వేలైనులు జిల్లా గుండా పోతున్నాయి. రాజమండ్రి, కొవ్వూరును అనుసంధానిస్తూ అతిపెద్ద రహదారి మరియు రైలు వంతెన ఉంది. రాజమండ్రికి 15 కి.మీ దూరంలో ఉన్న మధురపూడి వద్ద ఒక విమానాశ్రయము ఉంటుంది. కాకినాడలో నౌకాశ్రయము ఉంది.

## జనాభా లెక్కలు :-

2011 జనాభా గణాంకాలను అనుసరించి తూర్పు గోదావరి జిల్లా జన సంఖ్య 5,151,549. భారత దేశంలో జన సంఖ్య తూర్పు గోదావరి జిల్లా 19వ స్థానంలో ఉంది. అలాగే రాష్ట్రంలో రెండవ స్థానంలో ఉంది. జిల్లా జనసాంద్రత 1 మి.మికు 477. జిల్లా వైశాల్యం 1,240 చ.మైళ్ళు. జిల్లా అక్షరాస్యత 71.35 శాతం. స్త్రీ: పురుష నిష్పత్తి 1005: 1000 మంది కలరు.

## గ్రామ దేవతలు సాంస్కృతిక -సామాజిక పరిశీలన

ఈ సృష్టికి మూలమైన జగన్మాత త్రిమూర్తులను సృష్టించి తనను పరిణయమాడవలెనని కోరగా, అందుకు బ్రహ్మ, విష్ణువులు అంగీకరించకపోవుటచే శంకరున్ని కోరగా మూడవ నేత్రమును, తన శక్తులను తన వశము చేసినచో అందుకు అంగీకరించెదనని తెలిపెను. ఆ మాటలకు జగన్మాత అంగీకరించి తన శక్తులతో

పాటు మూడవ నేత్రమును శంకరుని వశము చేసినంతనే శంకరుడు జగన్మాతను భస్మము చేసెనట. అంతట ఆ భస్మమును నాలుగు భాగములు చేసి మూడు భాగములను సరస్వతి, లక్ష్మీదేవి, పార్వతిగా తాను పొందిన శక్తి ప్రభావముచే సృష్టించెను. మిగిలిన నాల్గవ భాగమును మరలా 101 భాగములుగా చేసి వాటికి ప్రాణం పోసి, లోక రక్షణకై ఒక్కొక్క గ్రామమునకు ఒక్కొక్క దేవత గ్రామరక్షణ గావించవలెనని ఆదేశించెనట. అలా పరమశివుడు ఆదేశించిన దేవతలే నేడు గ్రామ దేవతలుగా ప్రతీ గ్రామంలోనూ వెలిసినారట. అలా వెలసిన వారే నూకాలమ్మ, పోలేరమ్మ, సత్తెమ్మ, శ్యామలమ్మ, ముత్యాలమ్మ, మద్ద గౌరమ్మ, మొదకొండమ్మ, నేరేళ్ళమ్మ, మరిడమ్మ, పళ్ళాలమ్మ, సుబ్బాలమ్మ, ముసళ్ళమ్మ, సోమాలమ్మ, ఎల్లమ్మ, పోచమ్మ, నల్లపోచమ్మ, అంకమ్మ, పాదాలమ్మ, పెద్దింటిమ్మ, మాలచ్చమ్మ, మావుళ్ళమ్మ, ధానమ్మ, గంటాలమ్మ, తిరుపతమ్మ, తాతయ్యగుంట గంగమ్మ, ముత్యాలమ్మ, కనకాంబిక, భద్రకాళి, కనకమహాలక్ష్మి, దుర్గమ్మ, రేణుక, కుంకుళ్ళమ్మ, తదితర దేవతలుగా 101 మంది అక్కా చెల్లెళ్లు ఉద్భవించినారట. శ్రీ మహావిష్ణువు వీరందరికీ తమ్ముడుగా పోతురాజు అనే నామంతో ఉద్భవించెనట. అప్పటి నుండియూ ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క గ్రామ దేవత వెలసి గ్రామ సంరక్షణార్థమై గ్రామ పొలిమేరల్లో ఉంటూ గ్రామాన్ని దుష్ట శక్తుల బారి నుంచి కాపాడి రక్షిస్తున్నారట. ప్రతీ సంవత్సరం ఫాల్గుణ శుద్ధ అమావాస్య వరకూ ప్రతీ రోజూ రాత్రి గ్రామ సంరక్షణార్థమై ఈ దేవతలు తనకు ప్రతిరూపమైన గరగలుగా వెళ్ళి ఎక్కే గుమ్మం దిగ్గి గుమ్మంగా వెళ్లూ ఏమైనా దెయ్యాలు-భూతాలు కనిపించినచో తమ తమ్ముడైన పోతురాజుకు అప్పగించి వస్తారట.

తన అక్క అప్ప చెప్పిన దుష్ట శక్తులను పోతురాజు బారికోడు (మాదిగవాడు) కి అప్పగించి వస్తాడట. అలాఅప్పగించిన దూతలను బారికోడు మరల గ్రామ పొలిమేరకు తీసుకెళ్లి దిగుదుడుపులను వదలి వస్తుంటాడట. ఇది అనాదిగా వస్తున్న ఆచారంగా ఈనాడు పల్లెల యందు - పట్టణాలయందు కూడా పూర్వపు సంప్రదాయ బద్ధంగా ఆచరిస్తూ వస్తున్నారు.

గ్రామ దేవతలు ముఖ్యంగా జానపదుల ఆరాధనా దేవతలు. ప్రాచీన కాలం నుండి భారతదేశంలో స్త్రీని అమ్మవారి యొక్క అంశంగా భావించి గౌరవించడం జరుగుతున్నది. 5000 సంవత్సరాల క్రితం ఉత్తర మరియు పశ్చిమ భారతదేశ ప్రాంతాలలో వర్థిల్లిన సింధూ నాగరికతాకాలంలో అమ్మ దేవతల్ని (మదర్ గాడెస్) పూజించినట్టుగా నిరూపించే పురావస్తు ఆధారాలు లభించాయి. ఆదిశక్తి ఈ సృష్టికి మూలం అని హైందవ మత ధర్మ శాస్త్రాలు ప్రకటిస్తున్నాయి. ఆ ఆదిశక్తి యొక్క వివిధ అంశాలే భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో గ్రామ దేవతలుగా పూజింపబడుతున్నారు.

మానవుడు నాగరికతను నేర్చిన తొలినాళ్ల నుంచి శక్తి రూపమైన తల్లిని ఆరాధనలు జరపడం నిత్యజీవితంలో భాగంగా చేసుకున్నాడు. మానవుడు అరణ్యంలో ముందు వేటగాడిగా తన మనుగడను ప్రారంభించాడు. ఈ దశలోనే అతడిలో భయం అన్న భావన పొడచూపింది. తన జీవనోపాధిలో భాగంగా అడవిలో గడుపుతున్న మానవుడికి ప్రకృతి వైపరీత్యాలు ఈ భయానికి కారణమయ్యాయి. అడవుల్లో హఠాత్తుగా రాజుకునే కార్చిచ్చు, తుఫాను గాలులు, ఉరుములు, మెరుపులు, వరదలు, కొండచరియలు విరిగిపడటం. తదితర ప్రకృతి బీభత్సాలను అనుభవించినప్పుడు మనిషికి తన ఉనికి అనుభవైక వేద్యమైంది తనను మించి ప్రాకృతిక శక్తి ఏదో ఉందని తెలిసివచ్చింది. మానవాతీత శక్తులపై నమ్మకం కలిగింది. ఈ నేపథ్యంలో తనను తన కుటుంబాన్ని ఆ శక్తుల నుంచి కాపాడుకునే ప్రయత్నంలో భాగంగా మానవుడు, ఆ శక్తులను శాంతింప చేసే మార్గాలను అన్వేషించడం ప్రారంభించాడు. అలా ప్రకృతి శక్తులను మంచి చేసుకునే ప్రయత్నంలో భాగంగా ముందు మూగజీవాలను మచ్చిక చేసుకోవడం ప్రారంభించాడు. పెంపుడు జంతువులను దగ్గరకు తీసి పశువుల కాపరిగా వృత్తి జీవనం వైపు మొగ్గుచూపాడు. ఈదశలోనే నిప్పు, నీరు వంటి ప్రకృతి వనరులను వినియోగించడం కూడా అలవాటు చేసుకున్నాడు. అనంతర పరిణామంలో అరణ్యాల దగ్గరలో నదీపరీవాహక ప్రాంతాల్లో నివాసాలను ఏర్పరుచుకోవడం అలవాటు చేసుకున్నాడు. అలా ప్రకృతికి సమీపంగా జీవిస్తున్న మానవుడికి ఆ శక్తుల పట్ల కృతాజ్ఞతాభావం పొడచూపింది. అలా తనకు తన పరివారానికి సహాయదుతున్నందుకు సూర్యుడు

వంటి ప్రకృతి శక్తులను ఆరాధించడం ఆరంభించాడు. ఆదిమానవుడికి నేలకున్న శక్తి తెలిసొచ్చింది. అలా నేలతల్లిని నమ్ముకోవడం అలవాటు చేసుకున్నారు. స్థిర నివాసిగా, నదీపరీవాహక ప్రాంతాలను నివాస యోగ్యంగా ఎంచుకున్నారు. ఇలా వ్యవసాయంపై ఆధారపడ్డ మానవుడు సకాల వర్షాల కోసం, పంటల సంరక్షణార్థం కూడా ప్రకృతి శక్తులను ప్రార్థించడం అలవరచుకున్నారు. మరోవైపు వ్యవసాయకుడిగా, మనిషి, ప్రకృతి వెనుకనున్న మార్మికతను తెలుసుకోదానికి ప్రయత్నించాడు. తాత్విక, ఆధ్యాత్మిక చింతనలవైపు మొగ్గుచూపాడు. జనన మరణ చక్రం వెనుకనున్న రహస్యాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించాడు. ఇక్కడో మత సంబంధమైన ఆలోచనలకు మానవుడు నాంది పలికాడు. అనేక ఆధ్యాత్మిక, శాస్త్రసమ్మత విధి విధానాల ఆరాధనా పద్ధతుల ఆధారంగా 'మతం' అనే భావనను అభివృద్ధింప చేశాడు. ఈ విధంగా మనిషి ఒక క్రమబద్ధమైన జీవితానికి అలవాటుపడ్డాడు. ఫలితంగా కళలు, ఆధ్యాత్మికత, గృహ నిర్మాణ శాస్త్రం, దేవాలయ నిర్మాణ శాస్త్రం తదితర రంగాలవైపు దృష్టి సారించాడు.

భారత దేశ చరిత్రలో అనాదిగా హిందువులతోపాటు ఇతర మతాలన్నింటికీ కూడా ప్రార్థనా మందిరాలుగా గ్రామ దేవాలయాలు ప్రాథమిక ఆధ్యాత్మిక ప్రాంతాలుగా ఉపకరిస్తున్నాయి. గ్రామ దేవతలు ముఖ్యంగా జానపదుల ఆరాధన దేవతలు.మాంత్రిక తాంత్రిక అతీంద్రియ శక్తులెన్నో ఉన్నాయని, అవే దుఃఖదుఃఖాలకు మూలమని నమ్మటమే గ్రామ దేవతల పుట్టుకకు కారణం. గ్రామ రక్షణ ఒక శక్తిపై లేదా దేవతపై ఆధారపడి ఉందనే విశ్వాసం కూడా ఇందులో ఇమిడి ఉంది.

గ్రామ దేవతల్లో స్త్రీ దేవతలకే ప్రాముఖ్యం, ప్రాచుర్యం. ఆదిమ మానవుల్లో స్త్రీలకే వ్యవసాయం చేసే అధికారం ఉండేది. అందువల్లనే గ్రామ దేవతల్లో స్త్రీలే ఎక్కువని కొందరంటారు.విలక్షణమైన ప్రసిద్ధమైన కొన్ని గ్రామ దేవతలు పేర్లు పరిశీలించండి. పోలేరమ్మ గంగానమ్మ మైసమ్మ, పోచమ్మ ఈదెమ్మ అంకాలమ్మ ముత్యాలమ్మ, నూకాలమ్మ మొదలైనవి.

గ్రామ దేవతలకు సాధారణంగా ఆకరం ఉండదు. ఒక రాయికి నూనె, పసుపు రాసి, కుంకమ బొట్టు పెట్టి సగంపైకి కనిపించేలా పాతితే 'గ్రామ దేవత' వెలిసినట్లే. ఈ గ్రామ దేవత రాయి ఊరి మొదట్లో గాని , మధ్యలో గాని ఉంటుంది.

ప్రయోజనాలు :-

ప్రతి సంప్రదాయము మత ఆచారము వెనుక అనేక ప్రయోజనాలు ఎల్లప్పుడూ ఉన్నాయి. అలాగే గ్రామ దేవతలు పూజలు ఆచారాలు ఆచరణాత్మక ప్రయోజనాలు ఉన్నాయి. పండగ సమయములో జంతుబలులు, ఊరేగింపులు వంటి కార్యక్రమాలు గ్రామ శివార్లో పూర్తి చేస్తారు. గ్రామ దేవతల జెండాలు ఆ ఊరిలోని సరిహద్దులలో ఉంచుతారు. దీనివల్ల పొరుగు గ్రామాల భూ భాగ పోరాటాలు లేకుండా నివారించుకుంటారు. పండుగ సమయ ంలో గ్రామస్తులు చాలా అవసరమైన పోషకాలు అందిస్తుంది. కొన్ని చోట్ల కొంత కాలంపాటు మాంసము మరియు మద్యపాన వినియోగం మరియు ఆచరులపై ఆరోగ్యంలో ఒక స్పష్టమైన సానుకూల ప్రభావం నైతిక క్రమశిక్షణ కలిగి ఉంటుంది. పండుగల ద్వారా చుట్టు గ్రామాల వ్యాపార వృద్ధి, గ్రామస్తుల ఐకమత్యతను చాటుతుంది. లఅలాగే ప్రశాంత జీవనాన్ని, ఆధ్యాత్మికతకు, అపార విశ్వాసానికి గ్రామ దేవతల పండుగలు మానవుని ఆచరణ యోగ్యమైనవి.

# శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ గారి "అమ్మీజాన్" నవల - సామాజిక పరివర్తన

యు. సత్యప్రభ
పరిశోధక విద్యార్థిని మరియు జూనియర్ అధ్యాపకురాలు (తెలుగు),
ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల, పాలకొండ
చరవాణి :- 8985468756
**E-mail :- usatyapraba@gmail.com**

1. ప్రవేశిక :-

"పరివర్తన అంటే మార్పు. సమాజంలోని ప్రజల ఆలోచనలలోను, ప్రవర్తనలోను, జీవన ప్రమాణ స్థాయిలలోను అభిలాషణీయమైన మార్పు రావడమే సామాజిక పరివర్తన".

సాహిత్యం అంటే హితంతో కూడినది. సాహిత్యం యొక్క ముఖ్యమైన లక్ష్యాలు సమాజ హితం మరియు సామాజిక పరివర్తన. దేశకాల పరిస్థితుల కనుగుణంగా సమాజంలో నడవడిక ఉంటుంది. ఆ సమాజం యొక్క పోకడలే సాహిత్యంలో ప్రతిబింబిస్తాయి. సామాజిక పరివర్తనను ఆశించేదే సజీవ సాహిత్యం అనిపించు కుంటుంది. కవి, రచయిత ఎవరైన సరే వారి వారి రచనలు సమాజానికి దర్పణంగా సాగుతాయి. అయితే రచయిత ఏ ప్రక్రియలో రచనలు చేసినా దానికి ఒక సామాజిక ప్రయోజనం ఉండాలి. రచనలో అంతర్భాగంగా, ఆ రచన ద్వారా సమాజానికి అనుసరణీయమైన ఒక సందేశం ఇమిడి ఉండాలి. ఆ సందేశం ద్వారా ఆ సమాజ అభ్యున్నతికి అవసరమైన పరివర్తన జరగాలి. ఆ సామాజిక పరివర్తన సర్వజన ఆమోదదాయకంగా, ఆచరణ యోగ్యంగా ఉండాలి. అంటే రచన, కథ, నవల, నాటకం, కవిత్వం ఇలా ఏ ప్రక్రియలో ఉన్నా ఆ రచనలు ఆ సమాజాన్ని అభిలషణీయమైన పరివర్తన దిశలోకి తీసుకువెళ్ళాలి.

నేను " ఆధునిక సాహిత్యంలో సామాజిక పరివర్తన అనే అంశాన్ని శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ గారు రచించిన "అమ్మీజాన్" అనే నవల ద్వారా విశదీకరిస్తాను.

శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ :-

శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ గారి స్వస్థలం కృష్ణాజిల్లా కాటూరు గ్రామం. తల్లిదండ్రులు కీ.శే॥ అనసూయాదేవి, వేంకట సుబ్బారావు గార్లు. తండ్రిగారు బహుభాషా కోవిదులు. తండ్రిగారు స్వగ్రామం నుండి 1930 దశకాల్లో సకుటుంబంగా విజయవాడకు కదిలివచ్చారు. తెలుగు, హిందీ, ఇంగ్లీషు, సంస్కృత భాషలలో సుబ్బారావు గారికి చక్కని పాండిత్యం ఉండేది.

ఈ నేపథ్యం రవీంద్ర త్రివిక్రమ్ గారి సాహిత్య జీవితానికి మంచి పునాదులు వేసింది. అత్యధిక సమయం తండ్రి గారితో గడుపుతూ శ్రీ త్రివిక్రమ్ సారస్వత పరిజ్ఞానాన్ని క్రమంగా

పెంచుకున్నారు. 1955 సం॥లో శ్రీ త్రివిక్రమ్ రచనా వ్యాసంగం ప్రారంభించారు. వీరు కొన్ని వందల కథలు రచించారు. అంతేకాక కవితలు, నాటికలు, నాటకాలు, వైజ్ఞానిక ప్రసంగాలు, న్యాయ సలహాలు, వార్తా వ్యాఖ్యలు వంటివి రచిస్తున్నారు.

శ్రీ త్రివిక్రమ్ గారు సుమారు 20 వరకు నవలలు రచించారు. అందులో "అమ్మీజాన్" నవల ఒకటి.

1963 నుంచి 16 సంవత్సరాల పాటు భారతీయ వైమానిక దళ సాంకేతిక విభాగంలో తన సేవలందించారు. 1965,1971 యుద్ధాలలో సైతం పాల్గొన్నారు. పదవీ విరమణ తరువాత ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయవాదిగా, ప్రముఖ సంస్థలకు న్యాయసలహాదారుగా ఉంటున్నవారు అనేక సాహిత్య, సామాజిక సంస్థల నుండి బహుమతులు, అవార్డులు పొందినారు.

3. అమ్మీజాన్ నవల - సామాజిక పరివర్తనః-

రచయిత శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ గారు "అమ్మీజాన్"నవలలో ఆనందపురం అనే గ్రామాన్ని సమాజం యొక్క ప్రతీకగా తీసుకుని, ఆ ఊరిలోముస్లిం నవాబు వంశస్తులు, ఉదార స్వభావులు మరియు ఊరి యొక్క సర్వతోముఖాభివృద్ధికి నిరంతరం పాటుపడే వ్యక్తులైన షరీఫ్; అమ్మీజాన్ (అసలుపేరు షాజహాన్ బేగం)ల ద్వారా చేయించే అనేక కార్యక్రమాలు ద్వారా గ్రామంలో ఎన్నో సంస్కరణలు తీసుకువచ్చారు. అనేక సేవా కార్యక్రమాలను చేయించడం ద్వారా సమాజహితాన్ని, సామాజిక పరివర్తనను నవలలో ఆవిష్కరించారు. వాటిని ఒక్కొక్కటిగా ప్రస్తావిస్తే నవలలో రచయిత ఆశించిన సామాజిక పరివర్తనను తెలుసుకోవచ్చు.

I.అమ్మీజాన్, షరీఫ్ గార్ల ద్వారా ఆ ఊరికి కావలసిన ఎన్నో సౌకర్యాలను తమ స్వంతఖర్చుతో కల్పించడం :-

ఆనందపురం గ్రామంలోని పిల్లలకు ఉచితంగా చదువు నేర్పడానికి ఒక పాఠశాలను నిర్మించారు. దానిని క్రమంగా ఎలిమెంటరీ పాఠశాల స్థాయి నుండి ఉన్నత పాఠశాల స్థాయివరకు అభివృద్ధి చేశారు. త్వరలో జూనియర్ కళాశాల స్థాయికి చేరబోతుంది. పాఠశాలకు అనుబంధంగా హాస్టల్ ఉంది. బీదవారికి, దూర గ్రామాల వారికి అక్కడ వసతి, భోజన ఏర్పాట్లు ఉన్నాయి. లైబ్రరీ, కంప్యూటర్ ల్యాబ్, సైన్స్ ల్యాబ్ తో సహా ఆధునిక విద్యాసౌకర్యాలు ఉన్నాయి. పరీక్షలలో జిల్లాలోనే అధిక శాతం ఉత్తీర్ణత ఫలితాలను సాధిస్తోంది.

గ్రామంలోని ప్రజలకు వైద్యసౌకర్యం అందజేయడానికి ఆనందపురంలో ఆసుపత్రి నిర్మాణాన్ని తలపెట్టారు. ఊరి ప్రజలు ఆసుపత్రి నిర్మాణానికి సమిష్టి కృషి చేశారు. విరివిగా చందాలు ఇచ్చారు. శ్రమదానం చేశారు. షరీఫ్ గారు 20 లక్షలు ఖర్చు చేసి అత్యాధునిక వైద్య పరికరాలు తెప్పించి, పట్టణంలో ఆసుపత్రులకు ధీటుగా ఆసుపత్రిని కట్టించారు. వైద్య విభాగాలు అన్నీ ఏర్పాటు చేశారు. కులమతాలకు అతీతంగా ఆసుపత్రికి "జనతా హాస్పిటల్" అని పేరు పెట్టారు.

ఊరి ప్రజలు సాయంత్రం పూట సేద దీరి ఉల్లాసంగా, ఉత్సాహంగా గడపడానికి ఒక పార్కును నిర్మించారు. పిల్లల ఆటలకు, వ్యాయామానికి అవసరమైన ఏర్పాట్లు చేశారు. పార్కులో ప్రతి ఆదివారం ధార్మిక సదస్సులు నిర్వహించి, అన్ని మతాలలోని మూల సిద్ధాంతాలను క్రోడీకరించి బోధించే ఏర్పాట్లు చేశారు. సాటి మానవులపట్ల చూపించవలసిన ప్రేమ, కరుణలాంటి అంశాలను ప్రజలకు బోధించుటకు గాను అన్ని మతాల మేధావుల ద్వారా ఆధ్యాత్మిక ప్రసంగాలు ఏర్పాటు చేయబడ్డాయి.

మౌల్వీ సాహెబ్ గారి కోరికను అనుసరించి ఊరిలో షరీఫ్, అమ్మీజాన్‌ల భూరి విరాళాలతోపాటు ఊరిలో అన్నీ మతాలు, వర్గాల ప్రజల యొక్క ఇతోధిక చందాలతో సర్వమతసమభావనకు ప్రతీకగా మసీదు నిర్మాణం ప్రారంభమయింది. చందాలు కొందరు హిందువులే కాక క్రిస్టియన్ లు కూడాఇచ్చారు. మసీదు నిర్మాణంలో అన్ని మతాల, వర్గాల ప్రజలు శ్రమదానం చేశారు. ఇలా సర్వమత సమభావనతో మసీదు నిర్మాణం పూర్తయింది. అంతకు ముందే పెద్ద నవాబు గారి (షరీఫ్ గారి తండ్రి) హయాంలో గుడి నిర్మాణం జరిగింది. దాని నిర్వహణ నిమిత్తం తమకున్న భూములలో కొంత భాగాన్ని గుడి మాన్యంగా ఇచ్చారు. అలాగే చర్చి నిర్మాణానికి షరీఫ్ గారు విరాళం ఇచ్చారు.

ఆనందపురం గ్రామంలో పేద స్త్రీల ఆర్థిక స్వావలంబన కోసం అమ్మీజాన్ పేరు మీదుగా ఒక ట్రస్ట్ ఏర్పాటు చేసి దాని ద్వారా స్త్రీలకు ఉచితంగా కుట్టుపని, అల్లికలు, పెయింటింగ్ లాంటి పనులను నేర్పించారు.

ఈ విధంగా ఆనందపురంను యూనిట్ గా తీసుకున్న రచయిత ఆ ఊరికి అవసరమైన మౌలిక సదుపాయాలను కల్పించడం వలన ప్రజల జీవన ప్రమాణ స్థాయిని పెంచడం ద్వారా సామాజిక పరివర్తనను తీసుకురావచ్చు అని తెలియచేశారు.

## II. పరమత సహనం మరియు మతాల మూల స్వభావాల యొక్క సమానత్వం :-

పవిత్ర ఖురాన్ యొక్క సందేశాల ద్వారా మనుష్యులను పవిత్రమైన వారిగా సంస్కరించడం అలానే మతం పేరు ఏదైనా అందులోనే మూల స్వభావం ఒక్కటే అని చెప్పారు. ఏ మతమైనా మనిషినీ మనీషిగా మార్చే ప్రయత్నం చేస్తుంది తప్ప, ఏ మనిషినీ సైతాన్‌గా మారమని బోధించదని తెలియజేశారు. దానికి ఉదహరణగా పరమహంస పాత్ర ద్వారా హైందవ - క్రైస్తవ మతాల యొక్క మూలస్వభావం ఒక్కటే అని తెలియ చేశారు.

ఒక సారి షరీఫ్, పరమహంస గార్ల సంభాషణ ద్వారా సర్వమత సమానత్వం గురించి తెలియజేశారు. పరమహంసగారు, “అన్ని మతాలలో దేవుడు ఒక్కడేనని చెప్పబడింది. కానీ ఏమతం వారు ఆ మతం దేవుడినే ఆరాధిస్తున్నారు. ఇతర మతాలను నిరసిస్తున్నారు. భగవంతుడు తాను ఒక్కడై ఉండీ, అన్ని మతాలవారిలో విభేదాలకు ఎందుకు కారణమవుతున్నాడు?”

దానికి షరీఫ్ గారు ఇలా అంటారు.

“భగవంతునికి సర్వమానవ ప్రపంచం ఒక్కటే. ఆయనకు భాషాభేదాలు, ప్రాంతీయ భేదాలు ఏమీలేవు. భగవంతుడు ఏ మతాన్ని తనకు తానుగా సృష్టించలేదు. కేవలం దైవధర్మాన్ని

కొందరు మహనీయుల ద్వారా మానవాళికి తెలియచేశాడు". దానికి పరమహంసగారు " మీ మాటలతో నేను ఏకీభవిస్తాను.మతాలన్నీ సన్మార్గ శిక్షణాలయాలే. నదులన్నీ సాగరంలోని కలుస్తున్నట్లు, ఆరాధనలన్నీ ఒకే పరమాత్మకు చెందుతాయి".అన్నారు.

ఇలా నవల ఆసాంతం అన్ని మతాల మూలస్వభావం ఒక్కటే అని, అది మంచి, మానవత్వం, స్నేహ సౌరభాలని వ్యాపింపచేయాలని తెలియచేయబడింది.

III. మత మౌఢ్యం, మూఢాచారాలను ఖండించే ప్రయత్నం :-

ఈ నవలలో మతమౌఢ్యాన్ని మరియు మూఢాచారాలను ఖండించే ప్రయత్నం చేశారు. ఒకసారి అవధాని అనే పురోహితుడు కృష్ణశాస్త్రితో "ఒరే శాస్త్రి! మనది సనాతన హిందూ ధర్మం. నువ్వు మరికొందరి హిందువులలో కలిసి మస్జిత్ నిర్మాణంలో పనిచేయడం నాకు నచ్చలేదు అంటాడు. అపుడు ప్రక్కనే ఉన్న పరమహంసగారు"అవధానిగారూ మన ఉపనిషత్తులలో అల్లోపనిషత్ అని ఉంది. అది అల్లాహ్ గురించి వివరిస్తుంది. దైవం ఒక్కటే దాని మూలశక్తి ఒక్కటే. ఉన్నవి నామ భేదాలే" - అని అంటాడు.

అలానే ఈ నవలలో ప్రభుదాసు, అబ్రహం అనే క్రైస్తవుల సంభాషణ ద్వారా మతసామరస్యం వ్యక్తమవుతుంది.

ఉస్మాన్ అనే ముస్లిం తన కూతురు జమీలాకు 15 సంవత్సరాలకే ఒక అరబ్ షేక్ తో వివాహం చేయడానికి నిశ్చయించుకుంటాడు. అపుడు అమ్మీజాన్ ఇంట్లో పనిచేస్తున్న ఉస్మాన్ భార్య ఫాతిమా ద్వారా విషయం తెలుసుకున్న అమ్మీజాన్, షరీఫ్ గారి ద్వారా పెళ్ళి ఆపు చేయిస్తుంది. అలానే యాసిన్ అనే ముస్లిం వక్త యొక్క ప్రేరణతో బక్రీద్ నాడు ఆవును కుర్బానీ ఇవ్వడానికి కొందరు ముస్లింలు ప్రయత్నిస్తారు. అపుడు షరీఫ్ గారు వారిని మందలించి "ఆవు హిందువులకు పూజ్యనీయమైనదని, ఇలాంటి నిర్ణయాల ద్వారా హిందువులలో వ్యతిరేకత వచ్చి కార్చిచ్చులా మారుతుందని, అందుకని ఇలాంటి ప్రయత్నాలు ఇంకెప్పుడు చెయ్యవద్దని మందలించి విరమింపచేస్తాడు.

ఉపసంహారం :-

దేశంలో కొన్ని ప్రాంతాలలో ప్రజలకు ప్రాథమిక అవసరాలైన విద్య, వైద్య సౌకర్యాలు కల్పించ లేకపోవడం వలన ఆ ప్రాంత ప్రజలు కనీస జీవన ప్రమాణస్థాయిని పొందలేని స్థితిలో ఉన్నారు. అంతే కాకుండా మూఢ విశ్వాసాలను కలిగి ఉంటూ సామాజికంగా వెనుకబడి ఉన్నారు.

రచయిత శ్రీ రవీంద్ర త్రివిక్రమ్ గారు "అమ్మీజాన్" నవలలో గ్రామానికి అవసరమైన ప్రాథమిక సౌకర్యాలను నవలలోని పాత్రల ద్వారా కల్పించడం వలన ప్రజలు ఉన్నత జీవన ప్రమాణ స్థాయిని పొందవచ్చు మరియు మూఢనమ్మకాలను తొలగించడం, వారిలో మత మౌఢ్యాన్ని పోగొట్టి సర్వమత సమానత్వాన్ని బోధించడం ద్వారా ప్రజలలో పరివర్తన కలిగి సామాజికంగా ఉన్నత స్థానానికి చేరవచ్చు అని తెలియచేశారు.

ఈ విధంగా "అమ్మీజాన్" నవల ద్వారా రచయిత శ్రీ రవీంద్ర త్రివిక్రమ్ గారు తాను ఆశించిన సామాజిక పరివర్తనను సాధించటంలో సఫలీకృతులయ్యారని చెప్పవచ్చు.

వడితె పద్మ
పరిశోధన విద్యార్థిని
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
గుంటూరు జిల్లా.

# దళిత జీవన విధానం సాంస్కృతిక - పరివర్తన

"జాతి పరంగాను, సంస్కృతి పరంగాను, భాషా పరంగాను, ప్రపచంమంతా ఒకే లక్ష్యాన్ని, ఏకతను సాధించడానికి కృషి జరుపుతున్నది. ప్రపంచం ఏకతవైపు ప్రయాణిస్తున్నది. ఈ ప్రపంచానికి అనేక కోణాలున్నాయి. అనేక అవరోధాలు, కష్టాలు, కన్నీళ్లు ఉన్నాయి. పురతాన సంస్కృతులు నశించిపోతున్నాయి."

ప్రముఖ పరిశోధకుడు నదీం హస్నైన్ అన్న మాటలు అక్షర సత్యాలు. విభిన్న సంస్కృతులకు, జాతులకు, జీవన విధానాలకు, నిలయమై ఉన్న భారతీయ సంస్కృతి భిన్నమైనది. ఇక్కడ నివశించే ప్రతి జాతికి విభిన్నమైన జీవన విధానం, అమోఘమైన చరిత్ర ఉంది. చరిత్ర కొనసాగింపుగానే సాంస్కృతిక మార్పుల్లో భాగంగా జాతుల జీవన విధానం పరివర్తనకు లోనవుతూవుంది. గతంతో పోలిస్తే ప్రస్తుతం భిన్నమైన జీవన విధానాలను మనం చూస్తున్నాము. జీవన విధానంలో సాంస్కృతిక పరివర్తన ఏ కొద్ది కాలంలోనూ సంభవించే మార్పుకాదు. ఇది నిరంతరం జరిగే ప్రక్రియ. సాహిత్యం కూడా జాతుల జీవన విధానాలకు, అభివృద్ధికి, మార్పుకు దోహదం చేస్తుందిఅనడంలో ఏమాత్రం సందేహం లేదు. గడిచిన 150ఏళ్ళ కాలంలో దళితుల జీవన విధానం క్రమేనా మార్పుకు లోనైంది. దీనికి సాహిత్యం కూడా ఒక ప్రధాన కారణం.

## 1850కి పూర్వం దళితుల జీవన విధానం:

1860-80 ప్రాంతంలో ఎమ్మా రోషాంబు క్లౌ అనే బ్రిటీషు దొరసాని ఒంగోలు కేంద్రంగా క్రైస్తవ మిషనరీని స్థాపించారు. ఆమె ఉన్నత విద్యావంతురాలు. రాయల్ ఏషియాటిక్ సోసైటీలో సభ్యురాలు. మిషనరీ పనులలో భాగంగా దళితులు అనబడే మాదిగల జీవన విధానాన్ని ఆమె క్షుణ్ణంగా పరిశీలించారు. మాదిగలతో కలిసి జీవించారు. ఆమె సేకరించిన గాధలు, మాదిగ జీవన విధానం పుస్తకరూపంలో ప్రచురించారు. ఆమె పరిశీలన ప్రకారం దళితులలోని ఒకరైన మాదిగలకు మహోన్నతమైన పురాణ చరిత్ర ఉంది.

ఆది జాంబవంతుడు తమ మూలపురుషుడుగా మాదిగలు చెప్పుకుంటారు. ఆయన వారి పితామహుడు. రామాయణ మహకావ్యంలో ఆదిజాంబవంతుడు ఘట్టాన్ని వివరించారు. అప్పటికే జాంబవ తెగకు ప్రత్యేక జీవనవిధానం, సంస్కృతి ఉందని దళితుల నమ్మకం. అందుకే శ్రీరామ చంద్రుడు యుద్ధంలో జాంబవుడి సలహా తీసుకున్నాడని అంటుంటారు. ఇప్పటికి జాంబవంతుని నాటకాన్ని మాదిగవాడలలో ఆడుతుంటారు. దీనికి జాంబవ పురాణం అనికూడా అంటారు. అలాంటిదే అరుంధతి శాపం కథ. ఒకానొకప్పుడు అనేక పాపాలు చేసిన బ్రహ్మణుడు ఉండేవాడు. ఇసుకను అన్నంగా మార్చగల భక్తి గల స్త్రీ దొరికితే తనకు పాప విమోచన కలుగుతుందని తెలుసుకుంటాడు. అలాంటి అద్భుత శక్తిగల స్త్రీ ఎన్నికులాల్లో వెతికినా కనపడదు. చివరకు అతను మాదిగల వద్దకు వచ్చాడు. కన్నెగా వున్న అరుంధతిని కలుసుకుంటాడు. తన మనసులో ఉన్న మాటను ఆమెకు చెపుతాడు. దానికి అరుంధతి నేను చేయగలని కానీ, నాది నీచ జన్మ, మేము వెలివేయబడ్డవాళ్లం అంటుంది. ఆ బ్రహ్మణుడు సంతోషించి తక్కువ కులం అయినా తన కోరిక తీర్చమని వేడుకుంటాడు. ఆమె దానికి అంగీకరించి ఇసుకతో అన్నం వండుతుంది. దీనికి ఆశ్చర్య పోయిన బ్రహ్మణుడు అరుంధతిని పెళ్లాడితే తనకు పాప విమోచన కలుగుతుందని భావించి తనను పెళ్లాడమని అభ్యర్ధిస్తాడు. ఇంతలో అరుంధతి అన్నయ్య వచ్చి జరిగింది తెలుసుకుని కోపంతో బ్రహ్మణున్ని, చెల్లెలను చంపుతానని బెదిరిస్తాడు. మాదిగలలో ఏ ఒక్కరూ వారిని దరిచేరనివ్వరు. అందరిది ఒకటే మాట. ఆ తరువాత అరుంధతి అకాశంలోకి వెళ్లిపోతుంది. వెళ్లిపోతూ ఇలా శపిస్తుంది. "మీరు అందరికి బానిసలు అవుదురు గాక, ఎంత శ్రమపడినా మీరు ఈ స్థితినుండి పైకి రాకుందురు గాక" అనిశపించిందని మాదిగలు నమ్ముతారు. అందుకే తరతరాలనుంచి దుర్భరమైన జీవనవిధానం అనుభవిస్తున్నామని వారి విశ్వాసం.

అస్పృశ్యులు అనబడే దళితులు (మాల, మాదిగలు) సాంస్కృతిక, సామాజిక మార్పునకు లోను కాకముందు అంటరానివారిగా పిలవబడేవారు. వారు ఊరికి దూరంగా జీవనాన్ని గడిపేవారు. తెగనాయకుడి ఆధీనంలో ఉండేవాళ్ళు. వీరు శ్రమజీవులు. దొరికిన పనిని చేసి కడుపు నింపుకోవడమే వీరి ప్రధానలక్ష్యం. చనిపోయిన పశువులను తోలువలచడం, వాటి కళేబారాలను ఊరికి దూరంగా పడవేసి శుభ్రం చేయడం, వీరి ప్రధాన వృత్తి. పశువుల తోలును ఎండబెట్టి శు భ్రం చేసి వాటితో చెప్పులు కుట్టడం, డప్పు వంటి వాయిద్యాలు చేయడంలో వారు నేర్పరులు. బ్రిటీషు క్రైస్తవ మిషనరీలు ఆంధ్రరాష్ట్రంలో వారి కార్యాకలాపాలు ప్రారంభించటానికి పూర్వం దళితులు హిందూ తెగగానే వున్నారు. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్త మాల్యదలో మాలదాసరికథ వృత్తాంతం ఉంది. హిందూ గ్రామ దేవతలను, మహాలక్ష్మీ అమ్మవారు (మాలచ్చుమ్మ) దేవతలను పూజించేవారు.

1850 ప్రాంతంలో ఆంధ్రరాష్ట్రంలో సంభవించిక దుర్భరమైన కరువుకటాకాల నేపథ్యంలో తినటానికి తిండిలేక ఎంతోమంది దళితులు మృత్యువాత పడ్డారు. ఈ కాలంలోనే ఆంధ్రరాష్ట్రంలోఉన్న క్రైస్తవ మిషనరీలకు దళితులు దగ్గరైయ్యారు. ఎంతోమంది మాలమాదిగలు క్రైస్తవ్యం స్వీకరించారు. క్రైస్తవ్యం స్వీకరించిన తరువాత దళితుల జీవనవిధానంలో మార్పులను స్పష్టంగా గమనించవచ్చు.

## దళితుల జీవన విధానం – మిషనరీల ప్రభావం :

1850 తరువాత దళితులు క్రైస్తవ్యం స్వీకరించడంతో వారి జీవన విధానం భిన్నమైన మార్పులకు లోనైయ్యాయి. అప్పటివరకు నిరక్ష్యరాస్యులగా వున్న దళితులు విద్యకు దగ్గరైయ్యారు. మత మార్పిడిలో భాగంగా వారు ఇంగ్లీషు చదువులు చదువుకున్నారు. ఇతర గ్రంథాలు, కావ్యాలు, చదువుకున్నారు. దీంతో వారి జీవన విధానంలో ఘనసీయమైన మార్పు కన్పిస్తుంది. భారతదేశంలో వచ్చిన సంఘసంస్కరణ ఉద్యమం దళితుల సాంఘిక పరివర్తనపై అత్యంత ప్రభావం చూపింది. మహాత్మగాంధీ రాకతో దళితోద్ధరణ ఉద్యమంగా రూపాంతరం చెందింది. ఇందులో ఎంతోమంది మేధావులు, ఇతర వర్గాలవారు పాలుపంచుకున్నారు.

## దళితుల జీవన విధానంపై సాహిత్య ప్రభావం :

1910 తరువాత దళితుల స్థితిగతులు మార్పులు కన్పిస్తాయి. ఈ మార్పుకు తెలుగు సాహిత్యం ఎంతో దోహదం చేసింది. 1909లోనే ఆంధ్రభారతి పుస్తకంలో మాలవాంధ్ర పాట అన్న గేయంలో అస్పృశ్యత నిరసన కనిసిస్తుంది. 1910లో గురజాడ అప్పారావు రాసిన లవణరాజు కల లో అస్పృశ్యత మరింత స్పష్టంగా కనిపిస్తుంది. 1915లో నిరుద్ధ భారతం అనే పద్యకావ్యాన్ని ముంగిపూడి వెంకటశర్మగారు రాశారు. అస్పృశ్యత నిరసనను పూర్తిగా కావ్యరూపంలో అందించిన తొలికావ్యం ఇది. 1922లో ఉన్నవలక్ష్మీనారాయణ రచించిన మాలపిల్ల నవల అప్పట్లో ఓ సంచలనం సృష్టించింది. ఆ తరువాత 1930నుంచి విద్యావంతులైన దళితులే తమ ఇతీబాధలను సాహిత్య రూపంలో ముదుకు తీసుకువస్తున్నారు. 1980 తరువాత తెలుగు సాహిత్యంలో దళితఉద్యమ కవిత్వం ప్రత్యేక శాఖగా రూపాంతరం చెందింది. సాహిత్యం దళితుల జీవనంలో ఎంతో మార్పు తీసుకువచ్చింది. ప్రస్తుతం నయాదళితవాదం పేరుతో సాహిత్య ప్రక్రియ కొనసాగుతూనే ఉంది.

ముగింపు :

తెలుగు సాహిత్య ప్రక్రియ దళితుల జీవన విధానంలో ఎంతో పరివర్తన తీసుకువచ్చింది. సాహిత్యమే అసమానతలను ప్రశ్నించేతత్వాన్ని దళితులకు నేర్పింది. వారి గడచిన జీవన విధానంలోని వివక్షతను విద్యార్థికులు ప్రశ్నించి మార్పును ఆకాంక్షించారు. దీని ప్రభావంతో దళితజాతి నాగరికత వైపు అడుగులు వేశారు. ఉన్నత చదువులు, భారత రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్లు, ఆధునిక సమాజంలో అందివస్తున్న అవకాశాలు నాగరికతలో మార్పులు గమనిస్తూ దళితులు తమ జీవన విధానంలో ఎంతో పరివర్తన సాధించారు. దీనికి తెలుగు సాహిత్యం ఎంతో తోడ్పాటును ఇచ్చిందిఅనడంలో అతిశయోక్తి లేదు. చరిత్ర కారుడు, ప్రముఖ పరిశోధకుడు నదీం హస్నైన్ అన్నట్లు ప్రపంచం ఏకత వైపు ప్రయాణిస్తుంది. ఏదో ఒకరోజు జాతులు అంతరించి ఒకే జాతిగా, భారత జాతిగా మార్పు చెందటం ఖాయం.


ధన్యవాదములతో...

వడితె పద్మ

పి.హెచ్.డి. స్కాలర్

ఫోన్ నెం. 9866623380

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం




పరిశీలించిన పుస్తకాలు :


1. చెప్పులు కుడుతూ.... కుడుతూ.....

   ఆంగ్లమూలం: ఎమ్మా రొషాంబుక్లొ

   తెలుగు: వివినమూర్తి

2. మాదిగ తత్వం – ప్రొ॥ కంచ ఐలయ్య
3. దళిత కవిత్వం (వ్యాసం) – డా॥ శిఖామణి
4. భారతీయ గిరిజనులు : నదీం హసనైన్




## కవిరాజు, శ్రీ పైడిపాటి 'నీలం' కథ – సామాజికత

– డా. యశోద పూర్ణచంద్రరావు

కవి సమ్రాట్టు బిరుదొందిన పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారి రచనలే నా పరిశోధనాంశం. వీరి రచనల్ని ఎన్నుకోవడానికి గల కారణం, వీరి రచనల్లో అడుగడుగునా 'దేశభక్తి' ఉండడమే. అందులో వీరి జాతీయ కవి కావడం విశేషం. శ్రీ పైడిపాటి తెలుగు సాహిత్యంలో వున్న అన్ని ప్రక్రియల్లోనూ ఇంచుమించుగా కవిత్వాన్ని మనకందించారు. వీరి కథా సాహిత్యాన్ని పరిశీలించినట్లైతే 'నీలం', 'మేనతీకం' అను రెండు కథాసంపుటాలు, వివిధ పత్రికల్లో వచ్చిన కథలు, కథానికలు, కాలం దాటని కథలు కూడ వున్నాయి.

తెలుగు సాహిత్యంలో కథలు, కథానికా రచనలు చేయడంలో లబ్ధ ప్రతిష్ఠులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ మధురాంతకం రాజారామ్, శ్రీ పాలగుమ్మి పద్మరాజు, శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీ గుడిపాటి వెంకటచలం ప్రభృతులు అనేకులున్నారు. వీరు శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారికి సమకాలిక రచయితలే. వీరిలో శ్రీ పాలగుమ్మి పద్మరాజు గారి గాలివాన, పడవ ప్రయాణమనేవి ప్రపంచ ఖ్యాతిని ఆర్జించి పెట్టాయి. ప్రస్తుతం పైడిపాటి వారి 'నీలం' కథాసంపుటి నుండి 'నీలం' కథను తీసుకొని గోష్ఠీపత్రంగా సమర్పిస్తున్నాను. దానిని పరిశీలిద్దాం –

**'నీలం' కథ /1942/ :–** ఈ కథలో నాయిక 'నీలం' పూర్తి పేరు 'నీలవేణి'. నీలవేణి కళావంతుల పిల్ల. బ్రాహ్మణుల పిల్లవాడు కథానాయకుడు. పాఠశాలలో చదువుకొనే రోజుల్లో పంతులుగారు పేము బెత్తంతో కథానాయకుణ్ణి కొట్టిన సందర్భంలో కథానాయిక కళ్లు చెమర్చి ప్రేమ ఉద్భవించింది. సినిమా చూస్తున్నప్పుడు అనుకోకుండా ఉంగరాలు మారడంతో ఆ స్నేహం బలపడింది. కళావంతుల పిల్లతో స్నేహానికి, ఇతరులకు చదువు చెప్పడానికి కూడ ఇష్టపడని బ్రాహ్మణ బాలకులు మడి, ఆచారం పాటించే ఒక బ్రాహ్మణుని అనురోధంతో ఆయన ఉంపుడు గత్తె కూతురైన 'నీలవేణి'కి చదువు చెప్పడంతో ఆ పిల్లలిద్దరి మధ్య సాన్నిహిత్యం పెరిగింది. ఆమె తండ్రి గొప్ప చదువులు చదివిస్తానన్నా ఇతరుల సహాయంతో చదువుకోవడానికి ఇష్టపడని ఆత్మాభిమానం గల కథానాయకుడు చిరు ఉద్యోగిగా జీవితంలో స్థిరపడిపోతాడు. కథానాయిక ఎం.బి.బి.ఎస్. చదివి కాలాంతరంలో డాక్టరయి అతణ్ణి మరచిపోలేని స్థితిని లేఖ రాస్తుంది. ఆమెను చూడటానికి వెళ్లిన కథానాయకుడు, 'నాయిక తండ్రి అవరోధంతో, ఇద్దరు బిడ్డల తండ్రి అయినప్పటికీ వేశ్యల్ని వివాహమాడటానికి నిరాకరించటమనేది పూర్వకాలపు బ్రాహ్మణుల వైఖరిని వివరించాడు కవి. అప్పుడు కథానాయకుని తండ్రి "ధనం – రూపం ఇవి బాహిరమైనవి. అంతస్తు బాగుండాలి నాయనా. దయ, సత్యం, శౌచం ఉంటే చాలు"[1] అని విశ్వసించగా, అప్పుడు నాయిక తండ్రి "వేశ్య పర స్త్రీ కాదు, పర స్త్రీ అంటే ఏమిటి? పరుని స్త్రీ అని అర్థం. పరుని స్త్రీ వివాహం అయితే కదా కావడం? వివాహం లేనప్పుడు కన్యకదా? కన్య నందరును కోరవచ్చునుగదా, వేశ్య నిత్యము కన్యయే గదా. ఇతరములైన విషయాలను అల్లా ఉంచితే వేశ్యతో ఉండుట పాతకం మాత్రం కాదు[2]" అని కథానాయిక తండ్రి నాయకునికి బోధిస్తాడు.

కథానాయిక, నాయకుడు బీచ్‌కి వెళ్లడం, రాత్రి రెండు జాములదాక అక్కడ సుఖించడంతో కథ అంతమౌతుంది.

సంస్కార భావాల్ని ప్రచారం చేసే ఉద్దేశంతో నడచినప్పటికి కథానాయకుడు మొదట చాదస్తుడుగా చివరకు ప్రణయిని వాదాన చమత్కృతికి లోబడి లొంగిపోయిన వాడుగా చిత్రింపబడ్డాడు. నవీన విమర్శనాదృష్టితో చూస్తే ఈ కథానాయకుడు వెన్నెముక లేనివాడు. కథ ఎత్తుగడ నాయకునికి మనియార్డరు రావడం, దానితోపాటు కథానాయిక నుండి ఉత్తరం కూడ రావడంతో ప్రారంభమై, చివరకు నాయికానాయకుల ప్రణయోల్లాసంతో ముగుస్తుంది. వివాహితుడైనప్పటికి, భార్యా ఇద్దరు పిల్లలున్నప్పటికి, మరొక వేశ్యను వివాహమాడడం సమాజం ఎలా హర్షిస్తుందో రచయిత ఎక్కడ చెప్పలేదు. అందువల్ల ఈ 'నీలం' కథ చదువుకోవటానికి బాగున్నప్పటికి మంచి సందేశాన్ని ఇవ్వలేకపోయిన కథగా మిగిలిపోతుంది. కానీ కులాంతర వివాహం చేసుకోవడం, అందులో ఒక అగ్రజాతికి చెందిన బ్రాహ్మణునికి, దిగువజాతికి/కళావంతులజాతికి చెందిన వేశ్యను పెళ్లి చేసుకోవడమనేది ఒక విప్లవాత్మకమైన నిర్ణయమే. దీనిని బట్టి ఆనాటి సంఘ పరిస్థితులు ఎలా వున్నాయో మనకు శ్రీ శాస్త్రి కళ్లకు కట్టినట్లుగా తెల్పారు. కథానాయకుడు వివాహితుడనేది ప్రక్కన పెట్టితే, సామాజిక పరివర్తన చెందినవాడని మనం కథానాయకుణ్ణి భావింపవచ్చు.

శ్రీ శాస్త్రి స్వాతంత్ర్య సమరయోధులు, నటులు, అవధానులు కావడం వల్ల ప్రాచీన సంప్రదాయాలల్ని బలపరుస్తూనే సందేశాలు, సమకాలీనమైన సమాజ పరిస్థితుల్ని, సంఘటనల్ని, సన్నివేశాల్ని చక్కగా కథల్లో పొందుపర్చారు. స్వస్తి.

తెలుగు లెక్చరర్,
పి.బి. సిద్ధార్థ ఆర్ట్సు & సైన్సు కళాశాల,
విజయవాడ-10.
9294005664



# సాహిత్యం సామాజిక జీవన విధానం -పరివర్తన తిరుప్పల్లాండు ప్రబంధము

సాహిత్యం:- సామాజిక చైతన్యానికి ప్రతీక. సాహిత్యం సమాజ జీవన విధానంలోని స్థితిగతులు, వాటి అధ్యయనమునకు ఆధారం. సాహిత్యంలోనే సమాజం స్పష్టంగా ప్రతిఫలించి, జీవన విధానంలో మార్పుకు దోహదపడుతుంది.

తెలుగు సాహిత్యంలో పెరియాళ్వారుకు ప్రముఖ స్థానమున్నది. పెరియాళ్వారు అని చెప్పడంలోనే వీరియొక్క విశేషత తెలియుచున్నది. వీరు రచించిన తిరుప్పల్లాండు ప్రబంధము సకల వేదసారము. ఇతర ప్రబంధములకన్నా ఈపల్లాండు ప్రబంధమునకు చాలా ప్రత్యేకత కలదు.

తమిళ సాహిత్యంలో వైష్ణవ సంప్రదాయములో ఆళ్వారు ప్రబంధములకు విశేష ప్రాముఖ్యము కలదు. ఆంధ్రదేశములో వైష్ణవ సంప్రదాయము ప్రవేశించి, అది రామానుజుల సిద్ధాంతముతో బలపడింది. కాలక్రమమున, తమిళ భక్తి సాహిత్యం తెలుగులోకి అనువాదం కావడం అనివార్యమయినది.

ఆ విధంగా తిరుప్పల్లాండు ప్రబంధము అనేక తెలుగు సాహితీ ప్రక్రియల్లో చోటుచేసుకుంది. పల్లాండులోని ద్రావిడ పాశురాలు తెలుగు పద్యరూపంలో ప్రకాశించినవి. ఈ పల్లాండు ప్రబంధమునకు అనేక భాషలలో వ్యాఖ్యానాలు వెలువడినవి.

ఒక మత సంప్రదాయానికి, ఒక తాత్త్విక సిద్ధాంతమునకు, ఒక కవిత్వధర్మానికి, ప్రజల జీవన విధానంలో ఆధ్యాత్మక మార్గమునకు పట్టుగొమ్మగా నిలిచిన తిరుప్పల్లాండు ప్రబంధము, తెలుగులో ఏయే రూపాల్లో ఉన్నదో, ఆయా ప్రక్రియలను పరిచయం చేయడం, తులనాత్మక దృష్టితోచూడటం ఈ తిరుప్పల్లాండు పరిశీలన ముఖ్య లక్షణం.

## పన్నిద్దరాళ్వార్ల విశిష్టత:-

ఆళ్వార్ అనేది తమిళపదం. ఆళ + వార్ అని పద విభాగము. ఈ ఆళ్వారులందరూ తమిళదేశంలో పుట్టి, పెరిగి, విద్యాబుద్ధులు నేర్చి, తమ అమోఘమైన వాక్కులతో, తమిళ ప్రాంతాన్నే మొదటగా ప్లావితం చేసి, ఆ ప్రాంతములోనే తిరిగి, అక్కడే తనువులు చాలించారు కాబట్టి వారికి ఆళ్వారులనే తమిళ నామమే వాడుకలోనికి వచ్చింది.

ఆళ్వార్ అన్న పదానికి అనేకమైన అర్థాలు పెద్దలచే చెప్పబడుతున్నాయి. తెలుగులో ఆళ్వారులు అనగా 1) మహా జ్ఞాని అనీ, 2) భగవంతుడు అని కూడా అర్థం ఉన్నది. 3) 'ఆళ్వారు' అనగా భగవద్భక్తి పరవశులు లేక భగవద్భక్తిలో మునిగి తేలేవారని మరొక అర్థము. (4) ఆళ్వారులనగా కాపాడువారని మరొక అర్థము. పాప ప్రపంచములో అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్న జనులను తమ బోధనలతో, తమ ప్రవర్తనతో సరిదిద్ది, కాపాడువారని చెప్పవచ్చును. (5) భగవంతుని కళ్యాణ గుణములను తనివితీరా తామనుభవించి, భక్తితో భగవంతుని వశము చేసుకొని ఆయనపై (భగవంతునిపై) ఆధిపత్యం నెరపేవారని మరొక అర్థం. (6) పరిపాలకుడని మరో అర్థం. (7) ఆళ్వారులనగా వేదవేదాంగాలు, రామాయణ, మహాభారత పురాణాల్లోని అంతరార్థాల లోతు తెలిసినవారని కానీ, అనంత గుణసాగరుడైన శ్రీహరి హృదయంలోని వాత్సల్యపులోతు తెలిసిన వారని అర్థం చెప్పవచ్చు.

ఈ అభిప్రాయాలన్నీ ఆళ్వారుల వ్యక్తిత్వాల పట్ల సత్యాలే. ఈ అభిప్రాయాల్లో ఏదీ తీసివేయదగినది కాదు. అన్ని అర్థాలు ఆళ్వారులకు ముమ్మూర్తులా అన్వయించేవే.

ఆళ్వారులు తాము తరించి మనల్ని తరింపజేయటానికి భగవదాజ్ఞతో అవతరించిన వారు. ఈ మహాత్ముల చరిత్రలు పరమ పావనాలు. అఖిల పాపహరాలు, సుఖ సంతోషదాయకాలు, అజరామరాలు. ఆళ్వారుల అవతరణ వలననే లోకంలో భగవంతుడు ఉన్నాడని, భగవంతుడే రక్షకుడు అనెడువంటి జ్ఞానం ఉదయించినది.

ఆళ్వారులందరూ తమిళదేశంలోనే ఎందుకు పుట్టారు? ఇదో పెద్ద సందేహం. కొందరైనా ఏ ఆంధ్రదేశంలోనో, మహారాష్ట్రలోనో, ఉత్తర భారతదేశంలోనో పుట్టిఉండవచ్చుగదా అని తరచుగా చాలామంది అడుగుతూ ఉంటారు. భగవత్సంకల్పం అలా లేదు. ఆళ్వారులందరూ ద్రావిడ దేశంలోనే పుట్టాల్సివుంది. ఇందుకు కారణమైన ఒక గాథను తెలుసుకుందాం!

పూర్వం శివపార్వతుల వివాహం జరుగుతోంది. ఆ పుణ్యాత్ముల కళ్యాణం చూడడానికి దేవతలు, ఋషులు అందరూ వచ్చారు. జనం పోగుపడడంవల్ల ఉత్తరదిక్కు భారంచేత వంగిపోయింది. శివుడు దేవశిల్పి అయిన విశ్వకర్మను అడిగి విషయం తెలుసుకొని "ఇప్పుడు ఈ ప్రమాదాన్ని ఎలా నివారించాలి?" అని అడిగాడు. అప్పుడు విశ్వకర్మ "ప్రభూ! పొట్టివాడైన ఈ అగస్త్యుడు దక్షిణ దిక్కుకు వెళ్ళిపోతే భూమి సరిగా అయిపోతుంది" అని ఉపాయం చెప్పాడు. అగస్త్యుడు ఎన్నో ఘనకార్యాలు చేసిన మహా తపశ్శక్తి సంపన్నుడు. తమిళ భాషను సృష్టించిన మహానుభావుడు. అలాంటి అగస్త్యుణ్ణి దక్షిణ దిక్కుకు వెళ్ళిపొమ్మని శివుడు ఆజ్ఞాపించాడు.

భగవంతుడు కూడా సుఖంగా ఉండాలి. అనే పల్లాండు పాడుతున్నారు. తన స్వరూపాన్ని తలక్రిందుగ చేసుకుని అయినా భగవత్సమృద్ధిని ఆశించడమే శేషత్వంలో పరాకాష్ట. ఆ స్థితిలో వున్నారు మన ఆళ్వార్. ఈ తిరుప్పల్లాండు ప్రబంధము పన్నెండు (12) పాశురములు కలిగి ఐశ్వర్యములు, కైవల్యములు తగనివని చెప్పి ఉత్తమ పురుషార్థమైన భగవత్ కైంకర్యమునుసంగ్రహముగా ప్రతిపాదించినది.

**పెరియాళ్వార్ల పల్లాండులోని మొదటి పాశురం:-**

**1) పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు పలకోటి నూరాయిరం**
**మల్లాణ్డతిణ్తోళ్ మణివణ్ణా ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు -పల్లాండు పల్లాండు**

## అనువాదం

మంగళం వేయేండ్లు, మరి వేల యేండ్లుగా, కోటి యేండ్లుగ, నూరు కోట్ల ఏండ్లుళ ఎప్పుడు మంగళం మల్లురను మర్దించు భుజములకు మంగళం, నీలమణి అంగవైభవమునకు మంగళం, శ్రీపాదయుగళి కెల్లప్పుడు నీవైభవమునకు తిరుక్కాప్పు కెల్లప్పుడు

## సామాజిక ప్రయోజనము

విశిష్టాద్వైత వైశిష్ట్యము:- రామానుజులు వైష్ణవ మతమునకు విశిష్టాద్వైతమును నూతన సిద్ధాంతమును జోడించెను. సంస్కృతమునందలి ఉపనిషత్తులలో, ఆగమములలో ఋషులు విధించిన తత్త్వములు తమిళ పాశురములందు ఆళ్వారులు విధించిన తత్త్వముతో అభేదముగ నుండుటచేత ఈ రెండు తత్త్వములను సమన్వయ పరచుటచేతను, ఈ ఉభయ వేదాంతములు కలిసి విశిష్టాద్వైతముగా రూపొందినది. విశిష్టాద్వైతమునకు తత్త్వము, హితము, పురుషార్థము అను మూడు అంగములు కలవు.

తత్త్వములు మూడు, ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి. 1) ఈశ్వరుడు సర్వజనులకు, ప్రకృతికి ఆత్మవంటివాడు. సర్వ జీవ ప్రకృతులు ఈశ్వరునికి శరీరప్రాయములు. ఈశరీర, శరీరి సంబంధమే విశిష్టాద్వైతమునకు మూలము. 2). హితము: తత్త్వ స్వరూపము నెరిగిన పిదప జీవుడు ఆత్మజ్ఞానముచేత బ్రహ్మ సాయుజ్యమును నందుటయే హితము. 3). పురుషార్థము:-ధర్మార్థ, కామ, కైవల్య, భగవత్ప్రాప్తులను, పురుషార్థములను విశిష్టాద్వైతము ప్రతిపాదించుచున్నది. అన్ని జన్మలలో మానవజన్మ ఉత్కృష్టమైనది. దానికి కారణము జ్ఞానమే. మానవకోటిలో ముముక్షువు అగ్రగణ్యుడు.

ముముక్షువు అంటే మోక్షము కోరువాడు. ఈ మోక్ష మార్గమును ఆళ్వారులందరూ తాము అనుభవించి, ప్రబంధములద్వారా ప్రజలకు అందజేసి, సమాజం సన్మార్గంలో ప్రవర్తించుటకు దారిచూపినారు. భగవంతుని పొందుటకు భగవంతుని గుణానుభవము చేయుటకు వీలుగా నాల్గు వేదముల సారమైన నాలాయిర దివ్యప్రబంధము సామాన్యులు సైతం పాడుకొనుటకు వీలుగా సులభశైలిలో కవిత్వము చెప్పినారు. నేడు మన భారతదేశంలో అందరికీ అందుబాటులో ఉండేవిధంగా వీటకి అన్ని ముఖ్య భాషలలోనూ వ్యాఖ్యానములు

వచ్చినవి. ఆళ్వార్లు ఏ కులములో జన్మించినా, కుల మత భేదములు భగవంతుని పొందుటకు అడ్డురావని చాటిచెప్పినారు. భగవద్రామానుజులు కుల, వర్గ రహితమైన మోక్షప్రాప్తిని ప్రభోదించిరి. గురువుగారి ఆజ్ఞను ధిక్కరించి, సర్వులకు అష్టాక్షరీ మహా మంత్రమును ఉపదేశించిరి. విశిష్టాద్వైతము ఇట్టి సమైక్యతాభావమును బోధించినది.

భగవద్రామానుజులు పంచములకు 'తిరుకులత్తారులు' అని పేరుపెట్టి, వారికి దేవాలయ ప్రవేశము చేయించి, ఆనాడే సమాజంలో ఉన్న అస్పృశ్యతను తొలగించుటకు పీఠు కల్పించినారు. జైన, బౌద్ధ మతస్థులకు మంత్రోపదేశము చేసి విశిష్టాద్వైతములో చేర్చినారు. భగవద్రామానుజుల స్ఫూర్తితోనే గాంధీగారు పంచములకు హరిజనులని పేరు పెట్టి, అంటరానితనమును నిర్మూలించినారు. భగవద్రామానుజులు నాలాయిర దివ్య ప్రబంధములను నిత్యం దేవాలయములలో సాంప్రదాయముగా సేవాకాలము చేయుటకు ఏర్పాటు చేసినారు. ఆధ్యాత్మికత అనేది మానవత్వములోని అంతర్భాగమే. స్వామి వివేకానంద గీతలో ఏ ఒక్క శ్లోకము చదివినా భగవద్గీత మొత్తము చదివినంత ఫలితము మానవుడు పొందగలడు అని చెప్పినారు. గీతయొక్క సందేశము మొత్తము ఈ ఒక్క శ్లోకములోనే ఇమిడియున్నది అని కర్తవ్యము ఉపదేశించినారు.

"క్లైబ్యం మాస్మగమః పార్థనైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప"

"అర్జునా అధైర్యపడకు! పిరికితనము నీకు తగదు. నీచమగు నీ హృదయ దౌర్బల్యమును వీడి నీ కర్తవ్యమునకు పూనుకొనుము". ఈవిధముగా మేధావులైన దేశనాయకులు, తాత్త్వికులు సైతము తమ కర్తవ్య బోధలో సమాజ శ్రేయస్సు ఆధ్యాత్మిక మార్గముతోనే ముడిపడి ఉందని పేర్కొనిరి.

## సాహిత్య సమాజిక జీవన విధానం – పరివర్తన

By: టి.జి. రాజ్యలక్ష్మి
(యం.ఫిల్.స్టూడెంట్)
Regd.No. Y16TELR061

## తెలుగుకథప్రక్రియ–సామాజికచైతన్యం

డా. నారాయణం నరేశ్ బాబు,
సంస్కృత అధ్యాపకులు,
ఆంధ్రలొయొల కళాశాల,
విజయవాడ–520008
కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్
చరవాణి: 9866282107

**1. ఉపోద్ఘాతం:-**

'హితేన సహితం సాహిత్యం' అంటే సాహిత్యం అనేది మానవునికి మంచి ని ప్రబోధించేది అ అర్థం. అందువల్లనే ఆదికవి నన్నయ ఆంధ్రమహాభారతం అవతారికలో '''సారమతిన్ కవీంద్రులు....' అనే పద్యంలో 'జగద్ధితంబుగన్' అని తన కావ్య రచనా పరమార్థాన్ని సుస్పష్టం చేశారు. అప్ప సమాజంలో బౌద్ధ, జైనమతాల ప్రభావం వల్ల స్త్రీపురుష సంబంధాలకు భంగంవాటిల్లింది. ఆపట్టి నుండి సమాజాన్ని కాపాడాలనే ధ్యేయంతో ఆంధ్రమహాభారత రచన చేసినట్లు '''శ్రీవాణీ గిరిజాశ్చిరాయ.....' అనే శ్లోకంలో పేర్కొన్నారు నన్నయ. కాబట్టి సాహిత్యం అనేది సమాజాన్ని ఉన్నతపథంలో నడిపేందుకు ఉపకరించాలి. అంతేకాని సమాజానికి హానికరం కాకూడదు. ఎందుకంటే ఒక సమాజం ప్రభావం సాహిత్యం పై ఎలా ఉంటుందో అదేవిధంగా సాహిత్యప్రభావం సమాజంపై అలా ఉంటుంది. 'సహితస్య భావః సాహిత్యం' అని, 'శబ్దార్థౌ సహితౌ కావ్యం', 'వాక్యం రసాత్మకం కావ్య మొదలైన సాహిత్య, కావ్యనిర్వచనాలు ఎంత మంది, ఎన్ని రకాలుగా చెప్పినా అంతిమంగా సాహిత్యపరమార్థం కేవలం జనరంజకమే కాకుండా ప్రజోపయోగంగా ఉండాలి. అప్పుడే ఆ సాహిత్య ప్రజాదరణ పొంది, ప్రజలనాల్కలపై నాట్యం చేస్తుంది.

'''ఆంధ్రదేశమునందు సారస్వతజీవనము దురారాధ్యముగ నున్నది. సరస్వతీ ప్రసన్నుల లక్ష్మీప్రసన్న మసురూపముగ నున్నది. సరస్వతీదేవి నుపాసించుటకు గంకణమును గట్టుకొనినవారల లక్ష్మీకటాక్షము దుర్లభముగ నున్నది. శ్రీమంతు లను, రాజులను, మహారాజులను నాశ్రయించుట సరస్వతీదేవినుపాసించుట కవకాశములు లేవు. పూర్వయుగములందట్టి సేవ కవకాశములు లేవు. పూ యుగములందట్టి సేవ కవకాశములుండినను భౌతికాడంబరమయమైన కలియుగమునందు బొత్తి నవకాశములు లేవు. ఈ కారణమువలననే సుబ్బారావు గారి వంటి భాషాసేవకులకు సారస్వతజీవన దుర్లభమై అకాలమృత్యువు సంప్రాప్తమైనది. సుబ్బారావుగారు పిఠాపురము నందును చెన్నపురియందు జీవయాత్రను గడుపుచున్నపుడు వారికి గలిగిన యసంతృప్తి వారి యకాలమరణమునకు మూల పిఠాపురమునందు ప్రతిభావంతులైన శ్రీయుత పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారికి ప్ర

శిష్యులై రచనాకౌశలమును బడసిరి. శ్రీయుత చెలికాని లచ్చారావుగారి యాదరణ పోషణముల క్రింద నాంధ్రపరిశోధన మహామండలిని స్థాపించి దాని నిర్వహణము నందపారమైనశక్తిని గనుపరచిరి. ఆంధ్రపరిశోధకమండలి యందు లభించిన యనుభవము వేమన, యాంధ్రవాఙ్మయ చరిత్రము, శతకకవుల చరిత్రము మొదలగు రచనలకు దోడ్పడినది."

*(శతకవులచరిత్రము-పీఠిక-దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు-పుట-2)*

లోకంలో రెండు పదాలను సర్వసాధారణంగా సమానార్థకాలుగా ప్రయోగిస్తుంటాం. అవి ఒకటి సమాజం, రెండు సంఘం. సాధారణ పరిభాషలో ఈ రెండింటి మధ్య భేదం లేకుండా వాడుతుంటాం. కాని విస్తృతార్థంలో సమాజం వేరు, సంఘం వేరు. ఆధునిక జీవనవ్యవస్థలో నివసిస్తున్న మనం ఈ రెండింటి అర్థం తెలుసుకోవడం అత్యంతావశ్యకం.

సమాజం అంటే ప్రజలందరిని ఒకటిగా పరిగణిస్తూ, ప్రజలను ఎటువంటి తరతమ భేదాలతో పరిశీలించని వ్యవస్థ. ఈవ్యవస్థలో మరేయితర ప్రాతిపదికలపై ప్రజలు వివిధ వర్గాలుగా విభజింపబడరు. అనగా వర్గవిభజనలేని వ్యవస్థను సమాజంగా పేర్కొనవచ్చు. కాని సంఘం అంటే ప్రజలంతా కుల,మత, ప్రాంత, భాష మొదలైన ప్రాతిపదికలపై గుర్తింపబడిన వ్యవస్థ. ఒక విధంగా చెప్పాలంటే సమాజంలో ప్రజలను వర్గాలుగా విభజించేదే సంఘం. అందువల్ల నేటికాలంలో మానవులు స్త్రీ,పురుషులు అనే రెండు విరుద్ధమైన లింగవ్యవస్థతో కూడిన దృక్కోణంలో చూడబడుతున్నారు. ఈ విధమైన అంతరాన్ని తగ్గించడానికి సాహిత్యకారులు స్త్రీ,పురుష సంబంధాలను పెంపొందించే తాత్త్వికదృష్టితో నైతిక బాధ్యతవహిస్తూ రచనలు చేస్తున్నారు. ఈ విధమైన రచనలు నిస్పృహ, నైరాశ్యంతో కూడిన సంఘంలో మానవతా విలువలు పరిమళింపచేసి, ప్రజలలో సామాజికస్పృహను పెంపొందించడంలో ప్రధాన పాత్రను పోషిస్తాయనడంలో సందేహం లేదు.

## 2. సాహిత్యప్రక్రియలు–సామాజికచైతన్యం:–

సమాజానికి, సాహిత్యానికి ఒక విడదీయరాని పరస్పర సంబంధం ఉంది. సమాజంలో ఉన్నవాళ్ళ అలవాట్లు, ఆచారాలు, జీవనవిధానం, ఆలోచనాధోరణులు మొదలైన అంశాల ద్వారా మానవుల మధ్య సమష్టి సంబంధాలు పెంపొందించవచ్చు. ఒక సమాజంలో ఒక జీవనవిధానంలో జీవిస్తున్న రచయిత తాను రచించబోయే కావ్యాల్లో తను పెరిగిన సమాజస్థితిని తప్పనిసరిగా ప్రతిబింబిప చేస్తాడు. అదే సమర్థుడైన రచయిత అయితే తన రచనల ద్వారా వ్యవస్థలో, ప్రజల ఆలోచనాధోరణులలో సమూలమైన మార్పులు తీసుకువచ్చి,ఆ సమాజాన్నే మార్చివేస్తాడు. ఇటువంటి రచనలకు ఆధునికతెలుగుసాహిత్యంలో ఒక గురజాడ, ఒక కందుకూరి మొదలైన వాళ్ళే ప్రబల సాక్ష్యాధారాలు. ప్రభుత్వాలు శాసనాల ద్వారా చేయ్యలేనిది కవి తన కలంతో ప్రజలలో వారి ఆలోచనా విధానాల్లో, జీవన సరళిలో సమూలమైన మార్పులు తీసుకురాగలడు. "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః' అన్న మాటలు అక్షరసత్యాలు.

అందువల్ల సమాజంలో ఉన్న అంశాలు సాహిత్యంలో ప్రతిబింబించినట్లే, సాహిత్యప్రభావం సమాజంపై తప్పనిసరిగా ఉంటుందని చెప్పకతప్పదు. దీనికి కారణం సాహిత్యం సమాజనిష్ఠం.

'సామాజిక స్పృహ, సామాజికచైతన్యం అనే మాటలు సమకాలీన సాహిత్యంలో బహుళప్రచారం పొందిన మాటలు. అయితే సరిగ్గా ఈ భావాన్ని ఏ నేపథ్యంలో అర్థం చేసుకోవాలో మొదటిసారి శాస్త్రీయంగా వివరించినన మేధావి మార్క్స్ మాత్రమే. సమాజంలోని మార్పుకి దోహదం చేసే సాహిత్యంలో సామాజిక చైతన్యం ఉండాలి అని భావించినప్పుడు ఆ చైతన్యానికి సరైన నిర్వచనాన్ని కూడా అవగాహన చేసుకోవసి ఉంది.

సాధారణంగా మానవుడి చైతన్యం తన సామాజిక అస్థిత్వాన్ని నిర్ణయిస్తుం దన్నది బహుళ ప్రచారం పొందిన సిద్ధాంతం. అందువల్లనే ఒక్క మహానుభావుడు సమాజమంతటినీ మార్చగలడనీ, లే మానవుడి మంచి చెడులకు అతడే కారణ మనీ చాలామంది భావిస్తారు. ఈ భావనని మొదటిసారి తప్పని రుజువు చేసిన ఒక కొత్త తాత్విక భావనకి తెరతీశాడు. అతని మాటలివి"

"It is not the consciousness of man that determines their being but on the contrary their social being tha determines their consciousness" (మానవుల చైతన్యం వారి సామాజిక అస్తిత్వాన్ని నిర్ణయించదు. అందుకు విరుద్ధంగా సామాజిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది)"

*(డా॥ అద్దేపల్లి రామమోహనరావు-ఆధునికకవిత్వంలో సామాజిక-పుట48)*

సమాజానికి, సాహిత్యానికి ఎటువంటి సంబంధం ఉందో సమాజానికి, భాషకు అటువంటి సంబంధం ఉంది. ఒక భాషాసాహిత్యాల్లో సాహిత్యమంతానశించి పోయి నప్పటికీ భాషమాత్రం జీవించి ఉంటుంది. అయితే దీనికి కారణం సమాజం. సమాజం అంటే వ్యక్తులసమూహం. ఆ వ్యక్తుల సమూహం లేనిదే భాషాప్రయోగం లేదు. "ప్రయోగ శరణం వ్యాకరణం' అని ఏవిధంగా అంటారో ఆదేవిధంగా భాషకూడా సమాజంలోని వ్యవహర్తలపై ఆధారపడి ఉంటుంది. అలాటప్పుడే భాషగాని, సాహిత్యంగాని కలకాలం లో సమాజంలో అస్థిత్వాన్ని కలిగి ఉంటాయి. కాని భాష నశించినా సాహిత్యం జీవించి ఉంటుందనడానికి సంస్కృతం, ల్యాటిన్ వంటి భాషలు, మరియు మాండలిక భాషలే చక్కని ఉదాహరణలు.

**3. శతకప్రక్రియ-సామాజిక చైతన్యం :-**

శతకప్రక్రియ ఎంత ప్రాచీనమైందో అంతఆధునికమైందికూడా. దీనికి కారణం మార్గ, దేశి ప్రవృత్తులు రెండూ శతకప్రక్రియలో ఇమిడి ఉండటమే. భక్తితత్త్వంతో ప్రారంభ మైన శతకప్రక్రియ తెలుగుసాహిత్యంలో శాఖోపశాఖలుగా ప్రయోగవైవిధ్యంతో విస్తరించింది. లౌకికసంబంధమైన జీవితాన్ని సమకాలీన భావాలతో మేళవించి,భావితరాలకు అందించగలగడంచేత సమాజంలోవిస్తృతంగా

వ్యాపించగలిగింది. తెలుగుసాహిత్య చరిత్రలో శతకప్రక్రియ ఒక్కొక్క యుగంలో ఒక్కోవిధంగా విరాజిల్లింది.

""1. శివకవియుగంలో స్తుతిరూప భక్తిశతకాలు ఎక్కువగావచ్చాయి.

2. తిక్కనయుగంలో నీతిశతకాలకు ప్రాచుర్యం హెచ్చింది.

3. శ్రీనాథయుగంలో మధురభక్తిశతకాల ప్రాముఖ్యం గోచరిస్తుంది.

4. ప్రబంధయుగంలో తాత్త్వికభక్తిశతకాలకు గౌరవం పెరిగింది.

5. దక్షిణాంధ్రయుగంలో నీతి, అధిక్షేపణ, శృంగార, భాషా వ్యాకరణ, నిఘంటు, ప్రహేళికాశతకాలు, అనువాదశతకాలు అధికమయ్యాయి.

6. ఆధునిక యుగంలో భక్తి, నీతి, చారిత్రక, అధిక్షేప, వ్యాజనింది, హాస్య, కథాత్మక, సమస్యాపూరణాత్మక, రాజప్రశంస, మిత్రప్రశంస, ఉద్యమాత్మక, జీవితకథాత్మక, ఆత్మకథారూపక శతకాలు, బూతుశతకాలు, తిట్టుశతకాలు, అధివాస్తవికత శతకాలు, అనువాదశతకాలు, సామాజిక స్పృహగల శతకాలు ఎన్నోరకాలు వచ్చాయి".

(సాహిత్యంలో వర్ణనీయాంశాలు–ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం–పుట–149)

ఈ విధంగా సమాకాలీన భావపరంపరలతో దశదిశలా వ్యాపించింది శతకప్రక్రియ. ఏ సాహిత్య ప్రక్రియ అయినా సమాజస్థితిగతులను అర్థంపడితే ఆ సాహిత్య ప్రక్రియ ప్రజలగుండెల్లో చెరగని ముద్రవేస్తుంది. వేమనపద్యంరాని సాహిత్యప్రియుడు ఉండడంటే అతిశయోక్తికాదు. ఎందువల్లనంటే సమాజంలోని జీవనవిధానాన్ని ప్రజలకు అత్యంత దగ్గరగా చూపించాడు వేమనయోగి. వాస్తవికతను వ్యంగ్యాభివ్యక్తితో, దృష్టాంతాలతో, ఉపమానాలతో చెప్పి, శతకప్రక్రియద్వారా సమాజానికి మేలుచేయడానికి ప్రయత్నించాడు వేమన.శతకప్రక్రియలోని సామాజిక స్పృహ వల్ల ఈ ప్రక్రియ ఎప్పటికీ నిత్యనూతనంగా భాసిల్లడానికి కారణమైంది. శతకప్రక్రియలో సామాజికస్పృహ ఉందనడానికి గుర్రంవారి శతకాలే ఒక చక్కని ఉదాహరణలు.

ఈ విధంగా దేశకాలపరిస్థితులను ప్రతిబింబింపచేస్తూ,భక్తి,శృంగార భావాలే కాకుండా, లౌకిక సమాజచిత్రణను కూడా చేసి, నిత్యనూతనంగా విరాజిల్లుతున్న సాహిత్యప్రక్రియ శతకం. సామాజిక స్పృహతో ప్రజలలో సామాజిక చైతన్యం కలిగించిన శతకప్రక్రియ ప్రజలకు మరింత చేరువైంది. రాజాస్థానాలకే పరిమిత మైన సాహిత్యాన్ని ప్రజల దగ్గరకు చేర్చింది శతకం అనడం సత్యదూరం కాదు.

**4. ఆధునిక తెలుగుసాహిత్యం–సామాజికచైతన్యం :–**

తెలుగుసాహిత్యంలో సమాజానికి, వాస్తవికతకు దగ్గరగా ఉండేది ఆధునికతెలుగుకవిత్వం. ఈ వాస్తవికతను సమాజం నుండి ఆకళింపుచేసుకొని, సాహిత్యం లో నిక్షిప్తంచేసే పరంపరలో కాల్పనిక

వాదం, వాస్తవికవాదం, అభ్యుదయవాదం, హేతువాదం, అధివాస్తవికవాదం, అస్థిత్వవాదం, అనుభూతి వాదం, విప్లవవాదం, సంప్రదాయవాదం,రూపవాదం, దళితవాదం, స్త్రీవాదం మొదలైన భిన్నధోరణులు సామాజిక స్పృహతో కూడిన సాహిత్యచైతన్యాన్ని మేళవించుకొని ఆధునిక తెలుగు సాహిత్యంలో ఉద్భవించాయి. తన చుట్టూ ఉన్న సమాజాన్ని, అక్కడ ఉన్న సామాజికపరిస్థితులను ఏ రచయిత అయితే విస్మరిస్తాడో, ఆ రచయిత మనుగడను కోల్పోతాడు. ఏ రచయిత అయితే సమాజాన్ని సాధ్యమైనంత సహజంగా తనకవిత్వంలో ప్రయోగ,ప్రక్రియా వైవిధ్యాలతో కళాత్మకంగా దిద్ది తీర్చుతాడో ఆ రచయిత తన రచనల ద్వారా తరువాతి తరాలవారికి ఆ సమాజ స్వరూపస్వభావాలను అందించగలుగుతాడు.

సాహిత్యంలో సామాజికస్పృహ అనేది ఆ సాహిత్యంలోని ఆధునికతను బట్టి ఉంటుంది. "సాహిత్యంలో ఆధునికతను రెండు విధాలుగా నిర్వచించవచ్చు. మొదటిది సమకాలీకతనే ఆధునికతగా నిర్వచించడం. ఈ దృష్టిలో సమకాలంలో వచ్చిన ఏ సాహిత్యమైనా సాంప్రదాయకంగాని, నవీనంగాని ఆధునికం అవుతుంది. రెండవది మారిన ఆర్థిక, సామాజిక, రాజకీయపరిస్థితులు పునాదిగా ఏర్పడిన కొత్తదృక్పథా లు స్వరూపాన్ని సంతరించుకోవటమే ఆధునికత అని నిర్వచించటం. ఈ విధమైన సాహిత్యానికి అంతకు ముందులేని ప్రత్యేక లక్షణాలు, కొత్త విలువలు ఉంటాయి. ఇక్కడ ఆధునికత అనేది కాలాన్ని సూచించేది కాదు. అది ఒక తత్త్వం. సామాజిక ప్రయోజనం.హేతుబద్ధమైన శాస్త్రీయదృష్టి. వాస్తవికతలపై ఆధారపడిన సాహిత్య దృక్పథాలు తాత్త్విక భూమికగా కలిగిన ఆధునికత ఒకటి. అభ్యుదయవాద, విప్లవ వాద, వాస్తవికతా వాదాలు కొంతవరకు హేతువాదం ఈ కోవలోకి వస్తాయి. పైన చెప్పిన విలువలు లేకుండా వ్యక్తివాద, అరాచకవాదాలు తాత్త్వికభూమికగా కనిపించే ఆధునికత రెండవది."

*(ఆధునికతెలుగుసాహిత్యంలో విభిన్నధోరణులు – ఆచార్య కె.కె.రంగనాథాచార్యులు – పుట–5)*

ఈ ఆధునికతలో ప్రక్రియావైవిధ్యం, ప్రయోగవైవిధ్యాలను కలిగి సామాజిక స్పృహను సాధించడం సాధ్యమౌతుంది. సామాజికస్పృహ ఉన్నప్పుడు ఆ సాహిత్యంలో సామాజికచైతన్యంతో కూడిన రచనలు వెలువడతాయి. రాయప్రోలుతృణకంకణం, తిరుపతి వేంకటకవుల శ్రవణానందం, విశ్వనాథ ఆంధ్రప్రశస్తి, గుర్రంజాషువా గబ్బిలం, దువ్వూరి కృషీవలుడు, శ్రీశ్రీ మహాప్రస్థానం, తిలక్ అమృతం కురిసిన రాత్రి, దాశరథి తిమిరంలో సమరం, కుందుర్తి నయాగరా, ఆరుద్ర త్వమేవాహం, సినారే నాగార్జున సాగరం, శేషేంద్రశర్మ ఆధునిక మహాభారతం మొదలైన కావ్యాలు సామాజిక చైతన్యాలతో భాసిల్లుతున్నాయి.

– – – – –

# ఆధునిక సాహిత్యంలో వల్లూరుపల్లి లక్ష్మి కథలు - సామాజిక పరివర్తన

కె. నీలాంబ్రము
పరిశోధక విద్యార్థి
డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు
ఆచార్య నాగార్జున యూనివర్సిటీ
గుంటూరు
చరవాణి - 9912643223

*పరిచయం :* తెలుగు జాతి వైభవం, విశిష్టత, వారసత్వాలను తెలుసుకోవడానికి తెలుగు భాషా సాహిత్యాధ్యాయనం చాలా అవసరం. సమాజ హితాన్ని కోరి చేసే రచన సాహిత్యం హితమనేది కాలాన్ని బట్టి, సంస్కృతిని బట్టి, దేశాన్ని బట్టి మారుతుంది. సాహిత్యం మౌఖిక రూపంలో ఉండవచ్చు లేదా లిఖిత రూపంలో ఉండవచ్చు. తెలుగు సాహిత్య పూర్వదశ క్రీ.పూ 201 నుండి క్రీ.శ. 1000 వరకు, ఆధునిక సాహిత్యయుగం క్రీ.శ. 1875 నుంచి నేటి వరకు అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం తన పేర్కొన్నారు.

<u>ఆధునిక సాహిత్య వివరణ :</u>

సాహిత్యంలో ఆధునికత ఎప్పుడూ రెండు వ్యవస్థల ఘర్షణలో నుండి రూపొందుతుంది. ఆ ఘర్షణ ఎన్నోరంగాల్లో, ఎన్నోరూపాల్లో ఉండవచ్చు. వ్యవస్థాత్మకమైన ఈ ఘర్షణే సాహిత్యం అభివ్యక్తిలోనూ ఎన్నో మార్పులను తెస్తుంది. కొంచంగానో, ఎక్కువగానో ఈ ఆధునికత అనేది ఏ కాలం సాహిత్యంలోనైనా ఉంటుంది.

ఆధునికత కాలాన్ని గురించిన శబ్దం కాదనే, భావాలకు సంబంధించిన పదమనీ ఆనాటి నుంచి ఈ నాటిదాకా సాహితీ విమర్శకులందరూ చెప్తూనే ఉన్నారు. ఈ ఆధునికత నిర్వచనాన్ని అనేకమంది అనేకవిధాలుగా నిర్వచించారు.

ఆధునికత - నిర్వచనం

1) సంప్రదాయాలనూ, సాంప్రదాయకమైన విశ్వాసాలనూ, ఆచారాలనూ నిర్మొహమాటంగా విసర్జించి ప్రతి సమస్యనూ ఆధునిక విజ్ఞానశాస్త్రాల సహాయంతో, హేతువాద దృష్టితో పరిశీలించడం - రాచమల్లు. రామచంద్రారెడ్డి (రా.రా)

2) సామాజిక వ్యవస్థను ఆశ్రయించుకున్న బౌద్ధిక విశేషమేగానీ, నిరాధారమైన భావవిశేషం కావడానికివీల్లేదు - కె. వి. ఆర్

ఏమైనా ఆంగ్లేయుల ప్రమేయం లేకుండా ఇక్కడ 'ఆధునికత' రాలేదు. స్వరూపంలో భారతీయులుగా స్వభావంలో ఆంగ్లేయులుగా ఈ దేశ ప్రజలను మార్చే ప్రగాఢ లక్ష్యంతో మెకాలే ప్రారంభించిన ఆంగ్లవిద్యయే దీనికి ప్రారంభం. 1840 నుంచి ఇంగ్లీష్ విద్య విస్తృతంగా పాఠశాలల్లో బోధించడం మొదలైన తరువాత ఇంగ్లీష్ భాషను, సాహిత్యాన్ని ఒంటబట్టించుకున్న మేధావులు కొద్ది సంవత్సరాల్లోనే అసంఖ్యాకంగా రూపొందారు. ఇలా విద్యావంతులైన వారికి భారతదేశ వ్యవస్థల్లో ఉన్న లోపాలన్నీ బాగా అవగాహనకు వచ్చాయి. ఈ లోపాలకు వ్యతిరేఖంగా పోరాడాలనే ఉద్దేశంతో వారు సాహిత్య ప్రక్రియ లన్నింటినీ చేపట్టారు. అది ఆధునిక సాహిత్యమైంది.

19వ శతాబ్దపు చివరి పాతిక సంవత్సరాలు, 20వ శతాబ్దపు మొదటి పాతిక సంవత్సరాలు సుమారురుగా ఆధునిక సాహిత్య బీజాలు పడిన కాలం. సాహిత్యంలో ఆధునికతకు మూలస్తంభాలు గురజాడ, కందుకూరి. గురజాడది సమగ్రమైన ఆధునిక దృక్పథం. ఆనాడు ప్రారంభమైన ఆధునికత ఎన్నో విధాలుగా అంతస్సంఘర్షణలతో, ఈ నాటికీ సజీవంగా ఉన్నది. ఆధునికతలోని మరో అంశం పద్యరచనను మానేసి అనేక ప్రక్రియలను స్వీకరించడం. పూర్వం నుంచి వస్తున్న సాంప్రదాయక రచనలోని చట్టాన్ని తల్లక్రిందులు చేయడమే ఆధునికత చేసిన పని.

## సైనికుని సతీమణి కథ – సామాజిక పరివర్తన

సమాజానికి పునాది కుటుంబం. కుటుంబానికి పునాది తల్లి. ఈకథలో కార్మెన్ పాత్ర ద్వారా స్త్రీ గొప్పతనం, స్త్రీ బాధ్యతలు, విధులు హృదయానికి హత్తుకునేవిధంగా రచయిత్రి వివరించారు. కార్మెన్ మనోవేదనను అనుభవిస్తూ తన పిల్లలను సంతోషంగా ఉంచాలనుకుంటుంది. సమాజంలోని ప్రతి తల్లిదండ్రులు చాలా మంది ఇలానే ఉంటారు.

కుటుంబంలో సరైన విలువలతో పెరిగిన పిల్లలే సమాజంలో సత్పౌరులుగా ఉంటారు. ఈ సత్పౌరులను తీర్చిదిద్దే తొలి పాఠశాల కుటుంబమే. ఈ కుటుంబానికి తొలి గురువు తల్లే. అందుకే కబీర్ అంటాడు వేలమంది దేవుళ్ళను ఒకవైపు తల్లిని ఒకవైపు ఉంచితే నేను నా తల్లికే నమస్కరిస్తాను కారణం అసలు దేవుడంటూ ఉన్నాడని నాకు చెప్పింది నా తల్లి అని అన్నాడు. సమాజంలో ఎల్లవేళలా అత్యున్నత స్థానం అపాదించబడేది తల్లికే కరుణరసాత్మకమైన ఈ కథలోని కార్మెన్ పాత్ర ద్వారా స్త్రీలు తమ విధి నిర్వహణలో ఎలామెలగాలో చక్కగా ఉగ్ఘాటించారు.

## ముగింపు :-

శ్రీమతి వల్లూరుపల్లి లక్ష్మి రోజురోజుకు అడుగంటిపోతున్న మానవ సంబంధాల ప్రాధాన్యతను సందర్భానుగుణంగా వివరించే సదుద్దేశంతో రచయిత్రి మేఘన కథల సంపుటిలోని కథలు వ్రాశారు. అర్థమైన సన్నివేశాలను సమస్యలను ఇతివృత్తం ద్వారా ఎన్నుకొని సమస్యను సంపూర్ణంగా ఆవిష్కరించి ఫలితాన్ని కూడా చెప్తూ హృదయాలను కదిలించే విధంగా మానవీయ సంబంధాలు, విలువలు ఎంత గొప్పవో నిరూపించే ప్రయత్నం చేశారు. మాతృదేవోభవ కథలో తల్లి ప్రాధాన్యతను,కుటుంబ విలువలను, అనుబంధాలు కథలో వ్యక్తుల మధ్య అన్యోన్యతను, సైనికుని సతీమణి కథలో స్త్రీ ఔన్నత్యాన్ని, త్యాగాన్ని, ఉన్నత విలువలను సమాజానికి అందించారు. ఆయా విలువలను మనకు అన్వయించుకోవడం ద్వారా సమాజంలోని పరివర్తన తప్పక సిద్ధిస్తుంది అనడం సమంజసమే.

## ఆధార గ్రంథం :-


1. ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రక్రియలు – ధోరణులు
   – తెలుగు అకాడమి – హైదరాబాద్
2. తెలుగు బోధనా పద్ధతులు
   – డి.ఎడ్ తెలుగు అకాడమి – హైదరాబాద్
3. మేఘన – కథల సంపుటి – విజయవాడ, 2011
   – చినుకు పబ్లికేషన్స్

# ఆధునిక సాహిత్యంలో నాటకం - సామాజిక పరివర్తన

దాసరి సుశీల్ ప్రత్యూష
పరిశోధక విద్యార్థి
డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు
ఆచార్య నాగార్జున యూనివర్సిటీ
గుంటూరు
చరవాణి - 8142678009

## సామాజిక పరివర్తన :-

పరివర్తన అనేది సహజమైన విశ్వజనీనమైన ప్రక్రియ "భౌగోళిక పరిస్థితులలోని మార్పుల వల్ల గాని, సంస్కృతిలో మార్పు వల్ల గాని, జనాభా కూర్పులో మార్పు వల్ల గాని, భావజాలంలోని మార్పు వల్ల గాని ఆమోదయోగ్యమైన జీవన రీతుల్లో చోటు చేసుకునే మార్పులను సామాజిక పరివర్తన" అంటారని గిల్లిన్ & గిల్లిన్ అనే సామాజిక శాస్త్రవేత్త నిర్వచించారు.

సామాజిక పరివర్తనలో వాతావరణ పరిస్థితులు, ఎడారులు, అగ్నిపర్వతాలు, భూకంపాలు, తుఫానులు, నదీలోయలు మొదలగు భౌగోళిక పరిస్థితులకు సర్దుబాటు చేసుకుంటూ సమాజాలు క్రమక్రమంగా పరివర్తనం చెందుతున్నాయి. సమాజంలోని అసమానతలను చట్టాల ద్వారా తొలగించి సమాజంలో పరివర్తన తీసుకురావచ్చు. స్త్రీల పట్ల దురాచారాలను నివారించటానికి వారి ఔన్నత్యాన్ని కాపాడటానికి అలాగే షెడ్యూల్డు తెగలు, కులాలు, ఇతర వెనుకబడిన వర్గాలకు విద్య, ఉద్యోగాల్లో రిజర్వేషన్లు కలిగించటం ద్వారా సమాజంలోని అసమానతలను తొలగించి సమాజంలో పరివర్తన తీసుకురావచ్చు. సామాజిక పరివర్తన అనేది నిరంతర ప్రక్రియ.

సామాజిక అంశాలలో కనిపించిన మార్పులను "సామాజిక పరివర్తన" అంటారు. మార్పు అనేది భౌతిక అంశాలు, మానసిక అంశాలు, వైఖరులు, ప్రవర్తనా రీతులు, ఆలోచనా విధానాలు, ఆకాంక్షలు, నమ్మకాలు, సంప్రదాయాలలో కనిపిస్తుంది.

సామాజిక పరివర్తన, సాహిత్యాల మధ్య సంబంధం :-

"హితేన సహితం సాహిత్యం" అనగా ప్రజలందరికీ మంచి (హితం) జరిగేలా చూడటం అనేది సాహిత్యం యొక్క పరమోద్దేశం. సామాజిక పరివర్తనను కలిగించే కారకాలలో ప్రక్రియలైన కథ, నవల, గేయం, కథానిక, నాటిక, నాటకం మొదలగునవి శక్తివంతమైనవిగా పేర్కొనవచ్చు.

సామాజిక పరివర్తన, సాహిత్యాల మధ్య సంబంధం :-

వాఙ్మయమున రస ప్రధానమైన భాగము సాహిత్యం. కావ్యం, నాటకం అందలి ప్రధాన శాఖలు. కావ్యము కేవలము శ్రవ్యము. నాటకము శ్రవ్యము, దృశ్యము కూడా. నాటకము దశ విధములైన రూపకములలో ప్రధానమైనది. రూపకములు పది విధములు.

1. నాటకము 2. ప్రకరణము 3. భాణము 4. ప్రహసన
5. డిమము 6. వ్యాయోగము 7. సమవాకారము 8. వీధి
9. అంకము 10. ఈహామృగము

వీనిలో సర్వరూపక లక్షణములచే సుసంపన్నము సమగ్రమునైనది నాటకము. కనుకనే రూపకములకు నాటకమను పేరు రూఢమై యున్నది.

నాటకము నానరసభావమయమై, (సమాజంలోని) సామాజికులను రంజింపచేయును.

మనం నివసిస్తున్న సమాజం నిన్నటికన్నా ఇవాళ, నేటికన్నా రేపు మరింత మెరుగైన సమాజంగా గౌరవనీయమైన సమాజంగా రూపొందించటానికి సాహిత్య ప్రక్రియ నాటకం తోడ్పడుతుంది. సమాజంలోని మూఢ విశ్వాసాలు, దురాచారాలను రూపుమాపటానికి, ప్రభుత్వపరంగా చేపట్టే చర్యలు సత్ఫలితాలను ఇచ్చి ఆశించిన సామాజిక పరివర్తన తీసుకురావటానికి నాటకాలు తోడ్పడతాయి.

"నాటకాలు ఆలోచనలను వికసింపచేస్తాయి. మేధస్సుకు పదును పెడుతుంది. నాటక ప్రక్రియ ధ్యేయం ఆనందం కాదు "ఆలోచన" అదే ధోరణిని నవీన నాటక రంగం కలిగించినది.

సుల్తానీ జీవిత కథలోని మలుపును సహజంగా - హృదయం ద్రవించేలా ఒక్కొక్క సన్నివేశంలో మలిచారు శాస్త్రి గారు. నటీనటులు తమ నటనా సామర్థ్యంతో తెలంగాణ యాసతో వాచిక అంగిక - సాత్వికాభినయాలలో అంచులు తాకడానికి ఒక తూనిక రాయి "సుల్తానీ" నాటిక.

## ముగింపు :-

స్వచ్ఛమైన ప్రేమకోసం ఆమె జీవితమంతా మనస్సు ఇచ్చే మగవాడికోసం - తపించి తపించి నిరాశతో నిస్పృహతో, నిర్వేదంతో చివరకు ప్రేమామయుడైన ఆ ఏడుకొండలవాడినే తన నిజ భర్తగా వలచింది. ఆ అనంత ప్రేమ జ్యోతిలో లీనమై పోయింది. పూర్వ జన్మ వాసనా బలం వల్ల సంక్రమించిన జీవ లక్షణాన్ని గుర్తించగల శక్తి అందరికీ వుండదు. మళ్ళీ అంతటి మహిత సంస్కారం వున్న మహావ్యక్తికే అది సాధ్యమవుతుంది. పరమానంద, సుల్తాన్ వంటి సమాన్యులకది సాధ్యం కాలేదు. ఆ సంస్కార బలం వున్న శాంతయ్య ఒక్కడు మాత్రమే సుల్తానీలో వున్న వెలుగును గుర్తించగలిగాడు. సుల్తానీ అంతస్సంఘర్షణను, ఆత్మనివేదనను చిత్రించటంలో నాటకకర్త అద్భుతమైన ప్రావీణ్యం ప్రదర్శించారు.

## సామాజిక పరివర్తన సాధనాలుగా నాటకాలు :-

వ్యక్తులను చైతన్యవంతులను చేయుటం వల్ల సామాజిక పరివర్తనకు ఆటంకం కలిగించే అజ్ఞానం, నిరక్షరాస్యత, అసమానతలు, దురాచారాలు, మూఢ విశ్వాసాలు తొలగిపోయి సామాజిక పరివర్తన సులభమవుతుంది.

## సుల్తానీ నాటకం సామాజిక పరివర్తన :-

సవాళ్ళను ఎదుర్కోలేని "సుల్తానీ" లాంటి సామాజికపరంగా బలహీనులైన వారు తమ భావాలను ఆచరించుటలో ఏదో లోపం ఉందనిపించేట్లుగానే ఆచరణలో విఫలులై సామాజిక వ్యతిరేకతకు తలొంచి కాలగర్భంలో కలసిపోతారు.

అయితే ఈ నాటకం ద్వారా సమాజంలో ఆనాటి సామాజికస్థితిని, స్త్రీ దుస్థితిని తెలియచేశారు.

నేటి సమాజంలో స్త్రీలకు ముందుగా కావలసినది ఏ పరిస్థితికైనా ఎదురొడ్డి నిలవగలిగిన సత్తా ఉండాలి. అటువంటి మానసిక స్థైర్యమే పరిస్థితులను అనుకూలంగా మార్చుకోగలిగిన వివేకాన్ని ఇస్తుంది. ఆ మానసిక స్థైర్యం ఎదురొడ్డి నిలబడగల సత్తా ఉన్ననాడు సమాజం కూడా దానిని గుర్తించి భావితరాలకు ఆ మార్పును సహజసిద్ధంగా చూపించగలదు.

ఆలోచనా విధానాలలో మార్పు, సామాజిక పరివర్తనకు ఆటంకం కలిగించే అజ్ఞానం నుండి బయటపడటానికి, అవగాహన కలిగి ఉండటానికి నాటకాలు తోడ్పడతాయి.


పరామర్శ గ్రంథాలు :-

1) వేలూరి శివరామశాస్త్రి కథలు – మొదటి సంపుటం
– వేలూరి శివరామశాస్త్రి

2) వేలూరి శివరామశాస్త్రి కథలు – రెండవ సంపుటం
– వేలూరి శివరామశాస్త్రి

3) ప్రసిద్ధ తెలుగు నాటికలు – ప్రయోజనాత్మక రచనలు
– సంపాదకుడు వల్లూరు శివ ప్రసాద్

4) అలనాటి నాటకాలు – ఇంద్రగంటి శ్రీకాంత శర్మ




కథా రచనకు వస్తువు (ఇతివృత్తం, థీమ్) ప్రధానము. దీనితోపాటు భాష, శీర్షిక, శైలి, పాత్రపోషణ, సన్నివేశ కల్పన, వర్ణన, ఎత్తుగడ, నడక, మలుపు, ముగింపు మొదలైనవి కూడా చాలా అవసరం. వీటివల్ల కథకి సాహిత్య విలువ ఏర్పడుతుంది. పాఠకులకు ఎక్కువగా చదవాలనిపించేది, ఆలోచింపచేసేది, ఆనందాన్ని కలిగించేది 'మంచి కథ'. మంచి కథలలో ఇంకా బాగున్న కథను 'గొప్ప కథ' అంటారు. తెలుగు కథలలో అనేక విభాగాలు కలవు. అవి : పెద్ద కథ, కథానిక, మినీ కథ, గల్పిక, స్కెచ్, పేజీ కథ, కాలం కథ, కార్డు కథ, రేడియో కథ, సినిమా కథ మొదలగునవి. అదేవిధంగా ఇతివృత్తాన్ని బట్టి నీతి కథ, శృంగార కథ, ప్రేమ కథ, హాస్య కథ, క్రైం కథ, రాజకీయ కథ, అభ్యుదయ కథ, విప్లవ కథ, స్త్రీవాద, దళితవాద కథలు మొదలగునవి కలవు.

ఆధునిక కథా సాహిత్యం 1910తో ప్రారంభమైంది. అప్పటినుండి నేటి దాకా తెలుగు కథ అనేక మార్పులు చేసుకుంటూ, సామాజిక పరివర్తనకు ప్రధాన భూమికను పోషిస్తూ ఎంతో పవిత్రంగా రూపు దిద్దుకుంటుంది. నేటి కథా ప్రపంచం యొక్క పరిధి చాలా విస్తృతమైంది. 1980 నుంచి వస్తున్న కథా సాహిత్యాన్ని అత్యాధునిక కథా సాహిత్యంగా చెప్పవచ్చును. నేటి కథా సాహిత్యంలో ప్రాంతీయ భాష (వాడుక భాష)కు ప్రాధాన్యతనివ్వటం జరిగింది. ప్రస్తుత సమాజంలో విలువల రాహిత్యం ఎంతగానో ప్రబలిపోయింది. మానవ జీవన ప్రస్థానంలో సమస్యలు, ప్రశ్నలు పెరిగిపోయాయి. అటువంటి సమస్యలకు, ప్రశ్నలకు పరిష్కారమార్గాలు అవసరమౌతున్నాయి. అందువలన కథలలో క్రొత్త కోణాల్ని ఆవిష్కరించాల్సిన బాధ్యత కథారచయితలపై ఎంతగానోవుంది.

**<u>తెలుగు కథ – సామాజిక పరిణామాంశాలు :</u>**

తెలుగు భాషలో కథా సాహిత్యం ప్రారంభమైన నాటి నుండి నేటి వరకు రచయితలు తమ కథల ద్వారా సమాజంలో అనేక మార్పులు తీసుకొచ్చేందుకు విశేష కృషి చేశారు. వారు ఏ అంశాలను ఇతి వృత్తాలుగా తీసుకుని సామాజిక పరివర్తనకు కారణమయ్యారో చూద్దాం. అవి :

7. జీవితానికి సంబంధించిన ప్రతి విషయాన్ని, ప్రతి అంశాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి దానిలోని ఆనందకర అంశాలను ఆస్వాధిస్తారు.

మన పూర్వీకులు, ముందుతరాల వారు జీవితం గురించేకాదు, సమాజంలోని విషయం గురించైనా తమ తర్వాతి తరాల వారికి ఇచ్చే సూచనలు, సలహాలు, మార్గదర్శకాలు వారి అనుభవసారమే. అందువలన వాటిని బాగా అవగాహనచేసుకుని ఆచరణలోకి తీసుకురావాలి. కానీ నేటితరం పెద్దల మాటలను పెడచెవినపెట్టి సమాజంలో అనేక సంఘర్షణలకు, అనేక సంక్లిష్ట పరిస్థితులకు కారణమౌతున్నది. అంతేగాక జీవితాన్ని సమస్యల వలయంగా మార్చుకుంటున్నారు. అలాకాకా ఈ కథలో బామ్మ సూచించిన సూచనల అట్లే వారి కుటుంబంలోని పెద్దల మాటలు, సమాజంలోని పెద్దల మాటలకు గౌరవమిచ్చి వాటిని ఆచరించిన యెడల నేటితరాలుకూడా తమ జీవితాలను సుఖంగా, హాయిగా మనుగడ కొనసాగించవచ్చును.

కథల ద్వారా సామాజిక పరిణామం సాధ్యమనుటలో అతిశయోక్తి లేదు. ఇది వాస్తవం ఎందుచేతననగా జగన్నాథశర్మ గారు రచించిన "జగన్నాథ రథ చక్రాల్" అనే పుస్తకంలో నూరు కథలు కలవు. అనగా వంద సామాజికపరమైన అంశాలను వాటిలోని వస్తువు సమస్యలను, పరిష్కారాలను సమాజానికి అందించుట జరిగింది. వీటి ప్రభావం నేటి సమాజంపై ఎంతగానో వుంటుంది. అదేవిధంగా ఆధునిక తెలుగు సాహిత్యంలో ఎంతోమంది రచయితలు ఎన్నో ఇతివృత్తాలను, ఎన్నో అంశాలను వస్తువుగా తీసుకుని కథలను రాసి నేటి సమాజాన్ని జన బాహుళ్యాన్ని జాగృతపరచుట కొరకు ఎంతగానో సాహితీ కృషిని చేస్తున్నారు – వారందరికీ నా వందనములు.


**ఆధార గ్రంథాలు :**

1. తెలుగు సాహిత్య సమీక్ష (రెండవ సంపుటము) – డాక్టర్ జి. నాగయ్య
2. తెలుగు సాహిత్య కోశము ఆధునిక సాహిత్యం (1851–1950) – తెలుగు అకాడమీ
3. తెలుగు పసిడి – శ్రీ మండలి బుద్ధ ప్రసాద్, శ్రీ తాతా రమేష్ బాబు
4. జగన్నాథ కథ చక్రాల్ – శ్రీ జగన్నాథ శర్మ గారు

# తెలుగుసాహిత్యంలో అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ కథలు దివ్యాంగుల జీవన విధాన పరివర్తన చిత్రణ

డా.నాగరాజు అసిలేటి
పోస్ట్ డాక్టోరల్ ఫెల్లో
హైదరాబాదు విశ్వవిద్యాలయం

తెలుగు సాహిత్య ప్రక్రియలో ఇప్పటి వరకు ఎన్నో సరికొత్త అంశాలు సృశించబడ్డాయి. వాటిలో వికలాంగత అనే అంశం ఒకటి. ఇప్పటివరకు వైకల్యత అనే అంశం మీద అనేక రచనలు వెలువడటం జరిగింది. వాటిలో కథా ప్రక్రియదే ప్రథమ స్థానం అని చెప్పటంలో సందేహం లేదు. తమ ప్రమేయం లేకుండానే సంభవించిన వైకల్యతను తలంచుకొని నిరాశ నిస్పృహలకు లోను కాకుండా ఏదో ఒకటి సాధించి తమ శక్తిసామర్థ్యాలను నిరూపించుకోవాలనే భావం వైకల్యులలో తలెత్తాలి. అప్పుడే ఈ సమాజంలో మనగలుగుతారు.

అసలు వైకల్యం ఎందుకు సంభవిస్తుంది అనే ప్రశ్నకు సరైన సమాధానం ఎవరు ఇవ్వలేరు. దానికి అనేక కారణాలు ఉండి ఉండవచ్చు. అనగా జన్యుపరమైన, ప్రమాదవశాత్తు సంభవించేవి ఇలా అనేకం. కారణం ఏది అయితేనేమి వైకల్యత సంభవించాక నిర్మూలించడం కష్టం. కాబట్టి పై కారణాలు విషయంలో తెలివిగా ఉండటం, తెలుసుకొని మసులుకోవటం జరిగినట్లయితే వైకల్యతను కొంత వరకు దూరంగా ఉంచొచ్చు.

కొన్ని దశాబ్దాల క్రితం సమాజంలో దివ్యాంగులకి ఎటువంటి గౌరవం ఉండేది కాదు. ఇంకా చెప్పాలంటే వీరి వలన సమాజానికి ఎటువంటి ప్రయోజనం లేదు అనే భావనలో సకలాంగులు, ప్రభుత్వాలు కూడా ఉండేవి. అయితే కాలానుగుణంగా దివ్యాంగులలో సైతం చలనం కలిగి ఆలోచనాశక్తి పెరిగింది. వీరు జీవన విధానాన్ని చక్కదిద్దుకొనే ప్రయత్నాలలో మునిగారు. మారుతున్న కాలానికి అనుగుణంగా శాస్త్ర సాంకేతిక రంగాలలో నైపుణ్యతను సాధించారు. ఉన్నత విద్యలను సైతం అందుకోగలిగారు. వీరు అంటే ఇతరులలో ఉన్న చిన్నచూపును రూపుమాపి తమలోని శక్తిసామర్థ్యాలను నిరూపించారు.

తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధులైన రచయితలు తమతమ రచనలలో వికలాంగత గురించి ప్రస్తావించారు. ఈ పత్రంలో కథాప్రక్రియ కీలకమైనది కాబట్టి కథాప్రక్రియ ద్వారా అడవి బాపిరాజుగారు, విశ్వనాథ సత్యనారాయణగారు దివ్యాంగుల పాత్రలను ఎలా నడిపించారు. దివ్యాంగులలోనూ యావత్తుసమాజంలోనూ జీవన పరివర్తనం తీసుకు వచ్చేందుకు ఎలా ప్రయత్నించారో తెలియజేసే ప్రయత్నం చేస్తాను.

అడవి బాపిరాజు"గుడ్డి పిల్ల"

తెలుగు సాహిత్యంలో అడవి బాపిరాజు గారి గురించి తెలియనివారు అంటూ ఉండరు. వీరు ఎన్నో సుప్రసిద్ధమైన నవలలు మరెన్నో సందేశాత్మకమైన కథలను పాఠకలోకానికి అందించారు. ఇటీవల విశాలాంధ్ర పబ్లిషంగ్ హౌస్ వారు అడవిబాపిరాజు సాహిత్యం అంతటిని ఎనిమిది భాగాలుగా ప్రచురించారు. వాటిలో ఎనిమిదోవది బాపిరాజు రచనలు-8 కథలు. ఇందులో చెప్పుకోదగినది "గుడ్డిపిల్ల"

ఈ కథ గురించి స్థూలంగా వివరించే ప్రయత్నం చేస్తాను. అంధత్వంలో భిక్షాటన చేస్తున్న అమ్మాయికి ఎటువంటి అవాంతరాలు ఎదురయ్యాయో చివరకు ఆమె జీవితం ఎలా సఫలీకృతం అయిందో తెలియజేసే కథే 'గుడ్డిపిల్ల'దీని ఉద్దేశ్యం వైకల్యం అనేది శరీరానికే గానీ,మనసుకు గాదు.నిత్యం ఎన్నో రైళ్ళలోనూ,మరెన్నోబస్టాండ్లలోనూ ఇంకెన్నో వీధుల్లోనూ ఎంతోమంది బిచ్చగాళ్ళని మనం చూస్తూనే ఉంటాం. వాళ్ళలో దివ్యాంగులు కూడా ఉంటుంటారు. సమాజంలో దివ్యాంగుల దుస్థితి మరీ దయనీయంగా ఉంది.వారిలో స్త్రీల పరిస్థితి మరీ దారుణం. కథలో అంధత్వంలో ఉన్న స్త్రీకి మరో దివ్యాంగుడు జీవితానిచ్చినట్లు చిత్రించి రచయిత దివ్యాంగుల పట్ల సమాజానికి గల బాధ్యతను తెలుపుతూ వివక్ష చూపకూడదని చేయూతనివ్వాలని గుర్తు చేస్తాడు. ప్రస్తుత కథలో గుడ్డిపిల్లకు జీవితానివ్వడం అంటే వైకల్యాన్ని వైకల్యంగానే చూడకుండా తనకున్న శక్తిసామర్థ్యాలతో ఆమె జీవితానికి భరోసా ఇవ్వడంగా గుర్తించాలి. అలా ఆ రోజుల్లోనే కాదు ఈ రోజుల్లో కూడా ఒకరి జీవితానికి మరొకరు భరోసా ఇవ్వడానికి ముందుకొచ్చేవారు చాలా తక్కువ.కానీ ఈ కథలో గుడ్డిపిల్లకు మరో బిచ్చగాడు భరోసా ఇచ్చాడు.అతడు దివ్యాంగుడే ఇలా బాపిరాజు దివ్యాంగులలో జీవన పరివర్తనం తీసుకువచ్చేందుకు కృషి చేశారని చెప్పడంలో సందేహం లేదు.

అడవి బాపిరాజుగారిచే వ్రాయబడిన మరో గొప్పకథ'తిరుపతి కొండమెట్టు'ప్రస్తుత సందర్భంలో ప్రస్తావించదగిన గొప్ప కథ ఇది.

"తిరుపతి కొండ మెట్టు" దివ్యాంగుడైన పున్నెడుకి తోటి బిచ్చగాళ్ళలో ఏర్పడిన కక్ష,ఈర్ష్య వలన ఎటువంటి ఇక్కట్లు

దవి చూడాల్సి వచ్చిందో 'తిరుపతి కొండ మెట్లు' కథలో చూడొచ్చు. పగ, ద్వేషాలతో సాధించగలిగేది ఏదీలేదని, ప్రేమతో మాత్రమే ఏదైనా సాధించవచ్చు అని ఈ కథ ద్వారా తెలుసుకోవచ్చు. ఈ కథలో కనిపిస్తున్న పున్నేడు వంటివారు చాలా అరుదుగా ఉంటారు. నేడు ప్రపంచంలో నానాటికీ కరువవుతున్నది కలుషితమవుతుంది ప్రేమ. ఎటువంటి అవాంతరాలనయినా ప్రేమతో జయించవచ్చని పున్నేడు పాత్రను బట్టి అర్థమవుతుంది. చెప్పుడు మాటలు విని తనపై కత్తి కట్టిన అలివేలు వంటివారు ఆ రోజుల్లోనే కాదు ఈ రోజుల్లోనూ ఉన్నారు. కథలో పున్నేడు ప్రేమ అలివేలులో మార్పు తీసుకురాగలిగింది. అంతేగాక రచయిత బిడ్డగాడు, దివ్యాంగుడైన పున్నేడుకి అలివేలుని జీవిత భాగస్వామి అయినట్లు చిత్రించి తన ప్రతిభను కనబరచాడు.

ఓ పక్క అవిటితనం దేనికీ ఆటంకం కాదని తెలుపుతూనే మరో పక్క ప్రేమ దేన్నైనా జయిస్తుందంటూ దానికి ఉదాహరణగా పున్నేడునీ, అలివేలును చూపించాడు. అలివేలులో మార్పుకు పున్నేడు ప్రేమ కారణమైంది. కనుక మార్పుంటే సంస్కరించబడటంగా గుర్తించాలి. కాబట్టి రచయిత బాపిరాజు గారు దివ్యాంగులలో జీవన పరివర్తనం తీసుకు వచ్చేందుకు కృషి చేశారని చెప్పడంలో సందేహం లేదు.

విశ్వనాథ సత్యనారాయణ"పరిపూర్తి"

తెలుగు సాహిత్యంలో ప్రక్రియలన్నింటిని తన సృజనాత్మకతతో పావనం చేసిన ఉద్దండుడు విశ్వనాథ సత్యనారాయణగారు వీరు అద్వైతానికి సంప్రదాయ అభిలాషి. అయిన వికలాంగతను కథ ప్రక్రియలో 'పరిపూర్తి' అనే చిన్న కథలో చూపించి సమాజాన్ని ఆలోచింపచేయించారు.

ఈ పరిపూర్తి కథ గురించి స్థూలంగా వివరించే ప్రయత్నం చేస్తాను.అంధత్వంలో అవస్థపడుతూ అయిన వారితోనూ, బయటి వారితోనూ అగచాట్లు ఎదుర్కొంటున్న యువత చివరకు తన జీవితాన్ని ఎలా పరిపూర్ణం చేసుకుందో తెలిపే కథ ఈ పరిపూర్తి. దీని ఉద్దేశ్యం వైకల్యాలు దురదృష్టవశాత్తు పొరపాటునో, గ్రహపాటునో కొందరికి సంభవిస్తాయి. దీనిని వైఫల్యంగా భావించకూడదు. వైకల్యాలు ఎక్కువమందిలో ఉంటాయని తెలియజేయడమే.

ఈ కథలో కనిపించిన చంద్రశేఖరరావు పాత్ర వంటి మనస్తత్వం గల వ్యక్తులు సమాజంలో చాలా తక్కువమంది ఉంటారు. అటువంటి మనస్తత్వం,ఆలోచన కలిగిన మనుషులు నేడు సమాజానికి చాలా అవసరం. వైకల్యాన్ని ఎవరూ కోరుకోరు. దురదృష్టవశాత్తు ఏదో ఒక రూపేనా సంభవించిన చంద్రశేఖరరావులా చేయూతనిస్తే అన్ని విధాలుగా రాణిస్తారు. ఆ రోజుల్లోనే కాదు ఈ రోజుల్లో రెండు, మూడు పెళ్ళిళ్ళు చేసుకోవడానికి సిద్ధపడిన వ్యక్తులున్నారు. కానీ, అంధత్వంతో అవస్థపడే వారికి కొత్త జీవితాన్ని ఇవ్వడానికి ముందుకొచ్చేవారు చాలా తక్కువ. కానీ కథలో విశ్వనాథ సత్యనారాయణగారు అందగాడైన చంద్రశేఖరరావు ద్వారా గుడ్డిపిల్ల రాధకు ఒక్క జీవితాన్ని ఇచ్చినట్లు చిత్రించి విశ్వనాథ సత్యనారాయణగారు దివ్యాంగులలోనూ, వాళ్ళ చుట్టూ ఉన్న సభ్య సమాజంలోనూ జీవన పరివర్తనం తీసుకు వచ్చేందుకు కృషి చేశారని చెప్పడంలో సందేహం లేదు. ఈ కథ గురించి స్థూలంగా వివరించే ప్రయత్నం చేస్తాను. చెవిటి, మూగతనంతో అవస్థపడుతున్న యువతి తన లక్ష్యం చేరుకునే క్రమంలో కుటుంబ సభ్యుల నుండి తిరస్కారాన్ని నిరాదరణని ఎదుర్కొంటూ ఎలా జీవితాన్ని కొనసాగించిందో తెలిపే కథ ఇది.

కథలో మీనాక్షి చెవిటి మూగతనంతో అవస్థపడుతూ జీవితాన్ని కొనసాగిస్తూ ఉంటుంది. అయితే ఆమెలో ఆత్మస్థైర్యం బలంగా ఉంది. చదువుకే నమ్ముకొని ఎవరికీ భారం కాకూడదు, నిర్ణయించుకొని తన కాళ్ళ మీద తను నిలబడేందుకు నిశ్చయించుకొని ఇంటి నుండి వెళ్ళిపోతుంది. కొంత కాలానికి టీచరుగా స్థిరపడి రామకృష్ణను వివాహమాడుతుంది. ఈ కథలో రచయిత మీనాక్షిని నిరాశ, నిస్పృహలకు లోనైనట్లు చూపించకుండా కథను నడిపి దివ్యాంగులలోనూ వారి చుట్టూ ఉన్న సభ్యులలోనూ కొత్త చైతన్యం కలిగించేందుకు కృషి చేయడం జరిగింది.

ఈ కథ "మేము సైతం" అనే కథా సంకలనంలోనిది. ఈ కథా సంకలనానికి డా.విహారిగారు "కథా దీప్తి-లక్ష్య దీప్తి చైతన్య స్ఫూర్తి" అనే ముందు మాటలో "తుది పయనం-తొలి విజయం" కథ గురించి ఇలా పేర్కొన్నారు. "డా.నాగరాజు అజేటి "తుది పయనం-తొలి విజయం" "కథ హృదయ శిల్పానికి మంచి ఉదాహరణ. మీనాక్షి చదువు చుక్క కానీ, వినడమూ మాట్లాడలేదు కన్నవారే కడగండ్ల పెడతారు. బాధలు భరించలేక ఇల్లు వదిలి వెళ్ళిపోతుంది. బి.ఎడ్ చేసి డెఫ్ అండ్ డమ్ స్కూల్లో టీచర్‌గా చేరుతుంది. తరగని, చెరగని ఆత్మవిశ్వాసానికి ప్రతీకగా నలుగురి మెప్పు పొందుతుంది."(మేము సైతం-పుట)

ఇలా తెలుగు రచయితలు వైకల్యత అనే అంశాన్ని తమ రచనల్లో స్పృశించి యావత్ సమాజాన్ని, ఆ సమాజంలో ఒక భాగంగా ఉన్న దివ్యాంగుల్ని చైతన్య పరిచారు.

ఆధార గ్రంథాలు

అడవి బాపిరాజు రచనలు-8 కథలు
విశ్వనాథ సత్యనారాయణ చిన్న కథలు
మేము సైతం(కథా సంకలనం)

# కర్షక జీవన విధానం – పరివర్తన

భారతదేశం వ్యవసాయాధార దేశం. మన దేశంలోని ప్రజలు ఎక్కువ వ్యవసాయం చేసుకుంటూ జీవనం సాగిస్తున్నారు. రైతన్నను దేశానికి వెన్నుముకగా చెప్పుకుంటామే తప్ప వెన్నుదన్నుగా నిలిచిన సందర్భాలు లేవు. ప్రభుత్వాలు ముఖ్యంగా రైతు జీవన విధానమును మెరుగుపర్చాలని, అతనిని ఆదరించాలని ప్రధాన ఉద్దేశ్యంగా పరిపాలన కొనసాగించాలి. ప్రభుత్వ ఆదరణ లేక గిట్టుబాటు ధరలు లేక రైతులు విలవిలలాడే పరిస్థితి ఏర్పడింది.

రెక్కాడితే గాని డొక్కాడని పరిస్థితి రైతన్నది. కంటికి నిద్ర ఉండదు. కడుపుకు వేళకు అన్నము ఉండదు. బీళ్లను పరిమళ్లుగా చేసి ఆహారధాన్యాలు పండిస్తూ దేశానికి అన్నపూర్ణ అయినాడు. ఎండా, వాన, చలిని లెక్కచేయక బండరాయిలాగా మారి తన గుండెను బండగా చేసుకొని తన కష్టాన్ని తన చెమటను చిందిస్తూ కుటుంబాన్ని చాలీ చాలని వసతులతో దీనహీనంగా జీవిస్తున్నాడు.

పండించిన పంటను మార్కెట్‌లో అమ్ముదామని వెళితే సరైన ధరలు లేక కమీషన్ ఏజెంట్లు, దళారుల చేతులలో చాలా మోసపోవుచున్నారు. దేశంలో ఎవ్వరైనా తాము ఉత్పత్తి చేసిన వస్తువుకు తానే ధర నిర్ణయిస్తాడు. కాని రైతు పండించిన పంటలకు ఎప్పుడు ఏ కాలంలో కూడా తాను పండించిన పంటలకు ధరను నిర్ణయించలేడు. డిమాండ్ చేయలేడు.

కొనుగోలుదారుడు కొన్న రేటుకే ఇవ్వాల్సిన దుస్థితి, పరిస్థితి రైతన్నకు ఏర్పడుతుంది. ఈ రకంగా కొనుగోలుదారు, కమీషన్ ఏజెంట్లు, దళారుల చేతిలో ధరలు రాక నలిగిపోవుచున్నారు. ఒక సంవత్సర కాలంలో తాను కష్టపడ్డ కమతములలో పనిచేసిన రోజులను లెక్కించుకుంటే భార్యాభర్తలకు కనీస దినసరి వేతనం, రోజువారి కూలి కూడా రాని దయనీయమైన, హీనమైన పరిస్థితి రైతన్నకు దాపురించింది.

మన దేశంలో 80% మంది చిన్న సన్నకారు రైతులు ఉన్నారు. వారికెన్నడూ ఆదాయ భద్రత లేదు. నిత్యం అప్పుల ఊబిలోనే మునిగిపోతున్నారు. మన దేశంలో ఉన్న రైతు ఎక్కువున్నా వాతావరణ పరిస్థితుల దృష్ట్యా అతివృష్టి, అనావృష్టి ఏదో ఓ ప్రకృతి వైపరీత్యాన్ని తాను భరించాల్సివస్తుంది. తీవ్రమైన నష్టాన్ని, కన్నీరును వాతావరణ పరిస్థితులు మిగిల్చిపోతున్నాయి. ఇలాంటి సమయంలో ప్రభుత్వం బాధ్యతగా వ్యవహరించి రైతన్నకు భరోసా కల్పిస్తూ వారి కుటుంబానికి ఆర్థిక భద్రత లేదా పంట నష్టపరిహారాన్ని తప్పనిసరిగా అందించాలి. అతివృష్టి, అనావృష్టి కాలంలో పాడి పశువులు మిగతా ఇతర జీవరాశులు వ్యవసాయ అనుబంధంగా వున్న వాటికి నష్టపరిహారాన్ని చేయూతగా ప్రభుత్వం అందించాలి.

ఎన్నో ఆధునిక పద్ధతులు శాస్త్రీయ పరిజ్ఞానం, యంత్రాలు అందుబాటులోకి వచ్చినా రైతులందరికి నాణ్యమైన విత్తనాలు అందడం జరుగుటలేదు. ఇప్పటికి ప్రాంతీయ ప్రాంతాలలో రైతులు తయారుచేసుకున్న విత్తనాలే విత్తుకొని అరకొర పంటలను పండిస్తున్నారు. భారతదేశంలో ఆయా ప్రాంతాల ఆహార అభిరుచులు, పశుపక్ష్యాదుల అవసరాల దృష్ట్యా, వ్యవసాయ వాతావరణం, సాగునీరు, స్థానిక సాంప్రదాయాలకు అనుగుణంగా పంటలను పండిస్తారు. మరియు మనదేశంలో పండ్లతోటలు ఎక్కువగా వేస్తున్నారు. కాలవైపరీత్యం వలన కాపుదశలో వాతావరణ పరిస్థితులలోని మార్పుల వలన తీవ్రమైన పంటనష్టానికి రైతన్న గురవుతున్నాడు.

మన దేశంలో గడిచిన 20 ఏళ్ళలో నాలుగు లక్షల మంది రైతన్నలు ఆత్మహత్య చేసుకున్నారు. దేశంలో రసాయన ఎరువులు, అధిక దిగుబడిని ఇచ్చే వంగడాలు, పంట రకాలు వచ్చినాయి. జన్యుమార్పిడి పంటలకు అడ్డు అదుపు లేకుండా పోయింది. దీనితో జీవ వైవిధ్యం దెబ్బతిన్నది. భారతదేశంలో డైరి (పాల ఉత్పత్తి) వ్యవసాయ అనుబంధంగా ఉన్న ఈ రంగం మీద దాదాపు 10 కోట్ల మంది జీవనాధారం ఆధారపడి ఉంది. పాశ్చాత్య దేశాల నుండి పశువులను దిగుమతి చేసుకోవడం వలన మన దేశంలోని సాంప్రదాయక జీవుల మనుగడ కనుమరుగవుతున్నది.

ఇతర దేశాల ఎరువులు కూడా కుప్పలు కుప్పలుగా మన దేశంలోకి వచ్చి పడుతున్నాయి. సాంప్రదాయ ఎరువులకు ప్రాధాన్యత ఎక్కువగా పెంచాలి. పంటలు దెబ్బతిన్నప్పుడు భీమా డబ్బులు సకాలంలో రైతన్నకు అందివ్వడంలో ప్రభుత్వం చాలా విఫలం అవ్వడం జరుగుతుంది. మన దేశంలో 67% రైతులకు భీమా గురించి అస్సలు తెలియదు. మన దేశంలో నదీ పరివాహక ప్రాంతం కూడా ఎక్కువనే, నదులు చాలా ఎక్కువనే, సముద్రంలో ఎక్కువ నీరు కలువకుండా నదుల మీద ఎక్కువ ప్రాజెక్టులు చేపట్టి సాగునీటి పంటలు పండించే రైతన్నలుగా ప్రభుత్వం తయారు చేయాలి. ఎక్కువ ప్రాజెక్టులు కట్టడం వలన నీరు నిలువ ఉండి భూగర్భ జలాలు పెరిగి, ప్రాజెక్టులలోని నీరు సాగునీరుగా కాలువల ద్వారా అంది భూములన్ని సస్యశ్యామలం అయ్యే అవకాశం వుంది.

పెట్టుబడి పెట్టి పంట రాక అప్పుల ఊబిలో కూరుకుపోయి ఆత్మహత్యే శరణ్యమంటూ వారి మానసిక పరిస్థితి దిగజారిపోతుంది. దీనివలన ఆత్మహత్యలు పెరిగిపోవుచున్నవి.

ప్రభుత్వాలు రైతన్నలు పండించే పంటలను మద్దతు, గిట్టుబాటు ధరల ప్రకారం కొనుగోలు చేయడానికి సరిపడా నిధులు ప్రభుత్వాలు సమకూర్చుకోవాలి. ప్రభుత్వ సంస్థలు, బ్యాంకులు అందించే రుణ సదుపాయం తగిన సమయంలో రైతును ఆదుకునేంతగా ఏనాడు లేదు.

భూములున్న అనేకమంది రైతులు దేశంలో పంటలను సాగు చేయడంలో ఉన్న ఇబ్బందులను గుర్తించి, ఆ ఇబ్బందులను ఎదుర్కోవడం మావల్ల కాదని కౌలుకు ఇవ్వడానికి ఎక్కువగా శ్రద్ధ చూపుతున్నారు. ఈ భూములను కౌలుకు తీసుకున్న కౌలు రైతులు పెట్టుబడి లేక అనేక అవస్థలు ఎదుర్కొని పండించిన పంటకు గిట్టుబాటు ధర లేక అప్పులలోనే కూరుకుపోవుచున్నారు.

మార్కెట్‌లలో రైతుకు కావాల్సిన సదుపాయాలు సరిగా లేవు. మార్కెట్‌లలో కమీషన్ ఏజెంట్లు, దళారీ వ్యవస్థ ఇప్పటికి నివారించలేకపోవడం ప్రభుత్వ లోపాలు కన్పిస్తున్నాయి. అన్నదాతలను ఆదుకోవడానికి ప్రభుత్వమే మార్కెట్ల ద్వారా పండించిన ఆయా పంటలను కొనుగోలు చేసి గిట్టుబాటు ధర కల్పించి మధ్య దళారీ వ్యవస్థను ఏ మార్కెట్‌లలో కూడా ఉండకుండా నిర్మూలించాలి.

అన్నదాతను ఆదుకోవడానికి వ్యవసాయ అనుబంధ పరిశ్రమలను నెలకొల్పాలి. నిరుద్యోగ సమస్యను నిర్మూలించాలి. ప్రాంతీయ పంటలకు ఆధారంగా ఆయా పరిశ్రమలను నెలకొల్పి జీవనాధారం కల్పించాలి. అన్నదాతలను ఆదుకోవడానికి పాడి పరిశ్రమ చాలా ఉపయోగకరమైనది. గుజరాత్ రాష్ట్రంలో నేడు ఆత్మహత్యలు లేవంటే కారణం పాడి పరిశ్రమనే ప్రధాన ఆధారం.ఇలా అన్ని రాష్ట్రాలలో ప్రోత్సాహకర వాతావరణాన్ని ప్రభుత్వం తీసుకరావాలి.

రైతులు తమ పొలాలలో, చేనులలో పంటలు వేసినప్పుడు అంతర సేద్యం చాలా ముఖ్యం. అంతర కృషి తగ్గితే పంట నాణ్యత దిగుబడి తగ్గిపోతుంది. అంతర సేద్యాన్ని రైతులు సమర్థవంతంగా నిర్వహించాలి, ఎదుర్కోవాలి. అంతర సేద్యపు కలుపు యంత్రాలు కూడా ప్రభుత్వాలు సబ్సిడీ ద్వారా అందిస్తున్నాయి. వాటిని ప్రతి రైతు కూడా తీసుకొని అంతర సేద్యం చేసి లబ్ది పొందాలి.

రైతు కుటుంబంలో నానాటికి ఖర్చులు చాలా పెరిగాయి. రైతులు తమ పొలాలకు మోటార్ సైకిల్ పై వెళ్ళలేని దుస్థితి నేడు ఉంది. ఇక విలాస వస్తువుల జాడ ఆ ఇంట్లో ఉండనే ఉండదు. పిల్లల చదువులకు కూడా, పండుగ పబ్బాలకు, పిల్లల పెండ్లిలకు కూడా, అనారోగ్య పరిస్థితులు వచ్చినప్పుడు కూడా అప్పులు చేసి అవసరాలు తీర్చుకునే పరిస్థితి నేడు రైతన్నకు ఉంది.

రైతన్న కుటుంబాలు దృఢసంకల్పంతో ఆత్మహత్యలను ఎదుర్కోవాలి. కరువు రక్కసి కలుపు మొక్కలను పీకివేయాలి. దుర్భర దుఃఖ పరిస్థితులకు నెరవకుండా మనోధైర్యంతో ముందుకుసాగాలి.

**<u>రైతన్న సమస్యలకు శాశ్వత పరిష్కార మార్గాలు – పరిపర్తన</u>**

1) ప్రభుత్వం తప్పనిసరిగా గిట్టుబాటు ధర కల్పించాలి, దళారీ వ్యవస్థను నిర్మూలించాలి.
2) ఆధునిక, సాంకేతిక పరిజ్ఞానం విస్తృత పరచాలి.
3) నకిలీ, కల్తీ లేని విత్తనాలు, ఎరువులు అందించాలి.
4) సాంప్రదాయ ఎరువులను ప్రోత్సహిస్తూ తక్కువ రూపాయలకు అందించాలి.
5) రైతు తన కమతాన్ని ఎన్ని ఎకరాలు ఉంటే అన్ని ఎకరాలనే ఒక యూనిట్‌గా పరిగణించి భీమా పథకం కిందికి తీసుకరావాలి.
6) భీమా పథకంలో పంట నష్టమైనా పంటలకు వెంటనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భీమా డబ్బులు చెల్లించే విధంగా ప్రణాళికలు ఉండాలి.
7) రైతుకు భూముల రికార్డు పరంగా అనేక సమస్యలు ఉన్నాయి. వాటిని రెవెన్యూ సదస్సులతో వెంటనే సమస్యను పరిష్కరించాలి.
8) రైతులకు బ్యాంకులు రుణాలు ఇవ్వడానికి కాళ్ళు అరిగేలా తిప్పించుకుంటున్నాయి. ఈ పద్ధతి పునరావృతం కాకుండా
రైతు దగ్గరికే బ్యాంకులు వెళ్ళి రుణాలు ఇచ్చే స్థాయికి రావాలి.
9) బ్యాంకులు అవగాహన లేని వ్యక్తులను నియమించి రైతన్నలు లంచమిస్తేనే రైతు రుణాలు ఇచ్చే పరిస్థితి నేడు బ్యాంకులలో ఉంది. ఈ పద్ధతి నిర్మూలనకు ప్రభుత్వం పకడ్బంది శిక్షా చట్టం తేవాలి.
10) ఊరూరా రైతు భరోసా యాత్ర ద్వారా సమస్యలు పరిష్కరించాలి.
11) బ్యాంకులు వ్యవసాయ రుణములే కాకుండా రైతుల జీవిత అవసరాల కోసం తన యొక్క భూమిని మార్టిగేజ్, తనఖా పెట్టినప్పుడు ఎక్కువ మొత్తంలో అప్పు ఇచ్చే విధంగా ఉండాలి.

12) వ్యవసాయ అనుబంధమైనటువంటి డైరి, మత్స్య, కోళ్ళ పరిశ్రమలను ఎక్కుగా ప్రోత్సహించి నిధులు అందించాలి.

13) ప్రతి మండలంలో రైతు పండించిన పంటను నిలువ చేసుకొని తగిన అప్పు పొందుటకు గౌడెన్లు, గోదాములు ప్రభుత్వమే నిర్వహణ వ్యవస్థ నిర్వహించాలి.

14) రైతులకు 8, 9 గంటలు కాకుండా తప్పనిసరిగా అన్ని రాష్ట్రాలలో నిరంతర ఉచిత విద్యుత్ సరఫరా చేయాలి.

15) రైతు ఆత్మహత్యలు చేసుకోకుండా ఊరూరా వ్యవసాయ అధికారులను రైతుల వద్దకు పంపిస్తూ వారికున్న సమస్యలను తెలుసుకొని వారికి తగిన ఆర్థిక సర్దుబాటును బ్యాంకుల ద్వారా, ప్రభుత్వం ద్వారా చేపట్టే విధంగా వారిని ప్రోత్సహించాలి.

16) గత్యంతరం లేక రైతు ఆత్మహత్య చేసుకున్న కుటుంబాలను ప్రభుత్వం తప్పక ఆదరించాలి.

17) వ్యవసాయ సామాగ్రి, పనిముట్లు, యంత్రాలు కుల,మతాలకు అతీతంగా అందరికి సబ్సిడీ రాయితీ అందించాలి.

18) ఫర్టిలైజర్స్, ఫెస్టిసైడ్స్, విత్తనాలు, కల్తీ అమ్మిన దుకాణాలను, తయారీదారులను కఠినంగా శిక్షించాలి.

19) దేశంలో రైతులకు పండ్ల తోటలను పెంచే విధంగా చర్యలు తీసుకోవాలి. తక్కువ శ్రమ ఎక్కువ లాభం ఉన్న పండ్ల మొక్కలను రైతులకు ఉచితంగా సరఫరా చేయాలి. విధిగా బావులను, పైపులైన్లను, కరెంటు కనెక్షన్లను ఉచితంగా ఇవ్వాలి.

20) బంగారంతో సమానంగా ధర ఉన్న గంధం, ఎర్ర చందనం, టేకు, సుగంధద్రవ్యాలు, పట్టు పరిశ్రమలకు అవసరమయ్యే తోడ్పాటును ఉచితంగా అందించి రైతుల జీవనస్థాయిని మెరుగుపరిచే ఇలాంటి పంటలను ఎక్కువగా ప్రభుత్వాలు ప్రోత్సహించాలి.

21) రాష్ట్ర వ్యవసాయ విశ్వవిద్యాలయాలు ప్రయోగాలు చేసి వీలైనంత త్వరలో రైతులకు తగిన సలహాలు ఇవ్వడం అత్యవసరం.

22) దేశంలో ఉన్న ప్రతి జిల్లాకు వాతావరణ హెచ్చరికల కేంద్రం ఉండాలి. విధిగా ఉచిత సలహాలు అందించాలి.

23) రైతును జ్ఞానవంతులుగా చేయడానికి వారి కుటుంబాలకు రైతుకు సమగ్ర జ్ఞానం అందించడానికి ప్రతి రైతు కుటుంబాలకు ఉచితంగా నెల నెలా ప్రభుత్వ పథకాలు, రైతు సాగులో ఉన్న కష్టాలకు తగిన సూచనలను ఇస్తూ వెలువడే పత్రికను తీసుకవచ్చి రైతు కుటుంబాలను ప్రభుత్వం జాగృతపర్చవలసిందిగా తప్పనిసరిగా ఇది చేయాలి.

24) ఉపాధి హామీ పథకాలలో రోజువారీ వేతనం (కూలీ) ఆరోజే చెల్లించే విధంగా ఉండాలి.

25) మన దేశంలో వ్యవసాయం చేసకుని జీవిస్తూ ఉన్న వారికి స్వచ్ఛంద సంస్థలు ముందుకు వచ్చి బాసటగా నిలవాలి. రాజకీయ నాయకులు, సంస్థలు ముందుకు వచ్చి దత్తత తీసుకుని వారికి మనోధైర్యం నింపాలి.

తెలంగాణలో తెలంగాణ జాగృతి అధ్యక్షురాలు శ్రీమతి కల్వకుంట్ల కవిత గారు మానవతా దృక్పథంతో, దయార్ద్ర హృదయం కలిగి తెలంగాణ రాష్ట్ర వ్యాప్తంగా ఆత్మహత్యలు చేసుకున్న 386 రైతు కుటుంబాలకు ఆర్థిక సహాయం నెల నెల 2500 చొప్పున నాలుగు సంవత్సరాలు చేస్తున్నారు. ఈలాంటి ఆదర్శ కార్యక్రమంలో అందరు పాల్గొనాలి.



కవి, రచయిత
**టి. చత్రపతి శ్రీనివాస్ యం.ఎ., ఎం.ఫిల్,**
తండ్రిః రాజమల్లు, చొప్పదండి(గ్రా।। & మం।।
జిల్లా కరీంనగర్
తెలంగాణ రాష్ట్రం,
సెల్. **9848116906**
mail: chatrapathithallapally906@gmail.com

# బమ్మిడి జగదీశ్వరరావు కథలు - సామాజిక పరివర్తన

డా॥ డి. ప్రవీణ
తెలుగు లెక్చరర్
డా॥వి.యస్. కృష్ణ గవర్నమెంట్ డిగ్రీ కళాశాల
విశాఖపట్నం

మనదేశ సంస్కృతి - సంప్రదాయాలకు గ్రామాలు మూలం. మానవ జీవన విధానం నుండి సంస్కృతి సంప్రదాయాలు ఉద్భవించాయి. గ్రామీణ సంస్కృతి సంప్రదాయాలు మనకు ఆటపాటల్లో, పెండ్లి పేరంటాల్లో, పూజాపునస్కారాల్లో జాతరల్లో మనకు ఎక్కువగా కనిపిస్తుంది. మానవ సంబంధ బాంధవ్యాలు, ఆశలు, ఆశయాలు, ఆచార వ్యవహారాలు ఇవన్నీ సాంస్కృతిక జీవనం కిందకు వస్తాయి. వీటి అన్నింటిలోనూ క్రమక్రమంగా వచ్చే మార్పే సామాజిక పరివర్తన.

ప్రసిద్ధ రచయిత బమ్మిడి జగదీశ్వరరావు గారి రెండవ కథల సంపుటి "పిండొడిం"లోని కథల ద్వారా గ్రామీణ జీవన విధానం, సామాజిక పరివర్తన ఏ విధంగా ఉన్నదో ఈ పరిశోధనా పత్రం ద్వారా తెలపడం జరిగినది.

వెలుగుదారి వెతుకు దారి:

"వెలుగుదారి వెతుకుదారి" కథలో గోదారమ్మ కొడుకుతో ఇష్టం లేకున్నా పట్నం బయలుదేరుతుంది. తల్లికి ఏ కష్టం వచ్చినా ఎవరూ చూడరని తనతోనే రమ్మని కొడుకు కేశవుడు బలవంతం చేస్తే చేసేది లేక పట్నం బయలుదేరుతుంది గోదారమ్మ,

గోదారమ్మ పట్నం బయలుదేరుతున్నపుడు ఆవూరి వాళ్ళంతా గోదారమ్మ వెంట వచ్చి సాగనంపడం పల్లెటూరి ఆప్యాయతకు అనురాగానికి నిదర్శనం.

"ఊరి కోనేరు, గుడి గోపురం, పావురాలు, పాలపిట్టలు, కోకిళ్ళు, కాకులు, గేదెలు, ఆలమందలూ, మేకలు, గొఱ్ఱెలు అన్నింటినీ వదిలిపోవడం కష్టంగానే వుంది" అని గోదారమ్మ అనడంతో గ్రామీణ జీవితం ప్రకృతితో మమేకమవుతున్న విషయం ప్రతిబింబిస్తుంది.

"మళ్ళొస్తావా?... అక్కడే వుండిపోతారేటే"- అంటూ అందరిదీ ఒకటే ప్రశ్న. అప్ప, సెల్లి, అత్త, పిన్ని, కోడలు, ఈరకత్తె, అమ్మమ్మ, నానమ్మ" అందరూ ఏదో ఒక సంబంధమున్నట్లు సంబోధనలే".... అనడంలో ఊరంతా ఒకే కుటుంబమైన విషయం అర్థమవుతుంది.

గోదారమ్మకు పట్నం వెళ్ళిన తరువాత అక్కడ ఉండే సంస్కృతి విచిత్రంగా కనిపించింది. పల్లెటూరి నుండి పట్నం వచ్చిన కొడుకులోని పరిణామం అక్కడి ప్రజల సామాజిక పరివర్తన విచిత్రంగా తోచింది.

పట్టణంలో ఎవరినీ పలకరించకపోవడం గొప్పవాళ్ళ సంస్కృతి అన్న కొడుకు మాటకు ఆశ్చర్యపడ్డది. యాక్సిడెంటు అయి మనిషి ప్రాణంపోతే కొడుకు కేశవుడు "సినిమాకి టైమయిపోతుంది. టికెట్లు అయిపోతాయేమో" అని గింజులాడిపోవడం పట్టణ వాసుల సంస్కృతా? అని అలోచించింది.

పండగ వస్తే ఇంట్లో పిండివంటలు తప్ప సందడి లేదు. అక్కడ వూర్లో లాగ సంబరాలు లేవు. సరదా లేదు. అక్కడ ఊరెంత ఉప్పొంగిపోతుంటుందో" అని అనడంలో పట్టణ సామాజిక పరివర్తన ఔన్నత్యతకు బదులు మనుషుల మధ్య సంబంధ బాంధవ్యాలు దూరమవడం కనిపిస్తుంది.

చివరకు పట్టణ నాగరికత సంస్కృతులలో ఇమడలేక గోదారమ్మ తన వూరు వెళ్ళింది. దీని ద్వారా నేడు పట్టణ వాసులు తమ సంస్కృతి నాగరికతల పరిణామం మంచివైపు కాక చెడు వైపు జరుగుతుందని, బంధాలకు విలువ ఇవ్వలేదని స్పష్టమవుతుంది.

జలగ: బమ్మిడి జగదాశ్వరరావు రాసిన మరొక కథ జలగ. దీనిలో ఎంకడు తను కష్టపడుతూ కొడుకును బాగా చదివించి ప్రయోజకుడిని చేయాలనుకుంటాడు. కొడుకు సూరి మంచి ప్రయోజకుడు కావాలన్న తపన కనబడుతుంది. కూలివాని కొడుకు కూలివానిలాగే ఉండాలన్న ఆసామికి బుద్ధి చెప్పడం కనిపిస్తుంది.

"అయినా ఈ నెల్లో ఎలాగయినా సేసి ఆల పుస్తకాలు కొనెయ్యాల... కనకం పట్టీలు తాకట్టుకు వడ్డీ తరువాత కట్టుకోవాల... ముందు సదువు"

"ఆలయినా సదువుకుంటే వెఱ్ఱోగం వస్తాది. ఆలూ రిచ్చావోళ్ళు కాకూడదు. ఎన్నో మార్లులాగే ఈసారి నిర్ధారించుకున్నాడు". ఈ వాక్యాలు ద్వారా చదువుకు ఉండే ప్రాముఖ్యత ఎంకడు గుర్తించినట్లు తెలుస్తుంది. చదువుకుంటేనే పరివర్తన జరుగుతుందని గుర్తించాడు. భార్య పట్టీలు కంటే చదువు ముఖ్యమని తెలిపాడు.

"పెద్దోడా పాటాలు సెప్పినారా?" అని కొడుకును ప్రశ్నించిన ఎంకడిలో తండ్రి చదువు రానివాడయినా పిల్ల చదువుపై శ్రద్ధ పెట్టాలని, వారి చదువు విషయాలు తెలుసుకోవాలని ఎంకడి ద్వారా రచయిత తెలిపారు.

"అయ్యా, నువ్వు దిగరా నేను తొక్కుతాను.." అని కొడుకు సూరి అడగడంలో చదువుకుంటున్నా ఎంత పరివర్తన చెందినా తండ్రి చేసే పని చెయ్యడం చిన్నతనం కాదని, తల్లిదండ్రుల పై పిల్లలు చూపించాల్సిన ఆప్యాయత కనిపిస్తుంది.

ఆసామి రాజగోపాలం పక్కన తండ్రి ఎంకడిని బలవంతంగా కూర్చోబెట్టి సూరి రిక్షా నడపడంలో ధనిక పేద కులమత భేదాలు ఉండకూడదన్న సూరి భావం నిజంగా అభినందనీయం. " అయినా ఎంతమార్పు? తాత పెదవి విప్పక పోయినా తండ్రి పెదవేం కర్మ... గుండె విప్పి అడిగాడు. మరితానో "కంబారకం సెయ్యలేను పొమ్మన్నాడు". సొతంత్రంగా బతుకుతున్నాడు. ఇప్పుడు తన కొడుకో? తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు ఎంకడు"

ఈ వాక్యాల ద్వారా సమాజం ఏ విధంగా పురోగతి చెందినదో తెలుస్తుంది. ఎంకడి తాత ఆసాములు ఏం చేసినా ప్రశ్నించలేదు. ఎంకడి తండ్రి ఆసాముల దుర్మార్గాలను ప్రశ్నించాడు. ఎంకడు వారి ప్రవర్తన నచ్చక, వారి దగ్గర నుండి బయటకు వచ్చేస్తాడు. కానీ కొడుకు "నువ్వు నేను సమానమే, అందరం మనుషులమే" అని జ్ఞానోదయం కలిగించాడు.

రాజాగోపాలాన్ని జలగ బారి నుండి ఎంకడు ... అతనికి ఎంకడు, సూరి సాయం చేయడంలో ధనం ... గుణం గొప్పదన్న విషయం తెలుసుకున్నాడు రాజగో...

"గతుకులు" కథలో చిల్లర వ్యాపారి కిష్టి... షావుకారు క్రిష్ణమూర్తి అయిపోతే సాంఘిక హోదా తల్లక్రిం... అప్పు కోసం బాధపడడంతో "తన చేయి రాయికిందున్న... వుందని వాపోయే రైతు మన కళ్ళముందు నిశ్చల... నిలిచిపోతాడు. "వానపాము" కథలో పరస్పర విధ్వంస... వ్యవస్థగత హింసను చూడలేకపోవడం సాధ్యం అయ్యే... కాదు. "పోలిగాడి చావు" కథలో రెక్కలు తప్ప మరే ఆధా... లేని బ్రతుకుల్లో చొరబడే అమానవీయ స్థితి మ... వెంటాడుతుంది. ఈ కథలన్నింటిలో చితికిపోతున్న గ్రా... ఆర్థిక వ్యవస్థ, ఛిద్రమైపోతున్న వ్యవసాయ సమాజ మాన... అనుబంధాలు, విలువలు, పట్టణీకరణ పరిణామం... పరాయిణీకరణ, దుర్భర దారిద్ర్యంతో పెనుగులాడుతున్న ... వాస్తవిక చిత్రణ వుంది. అయితే సమూల మార్పులో మా... సమగ్ర పరిష్కారం వుంది. కనుక సామ్రాజ్యవాదంతో ... వేసుకున్న రాజకీయ ఆర్థిక వ్యవస్థ చట్రాన్ని ఛేది... పెట్టుబడిదారేతర ప్రత్యామ్నాయం దిశగా సోషలిజం కో... చేసే పోరాటం మాత్రమే సామాజిక పరివర్తన కలిగించగల... ఈ కథలు చెప్పకనే చెప్పాయి.

# జానపదుల జీవన విధానం - ఆధునికత ప్రభావం

రమేష్ దాసరి
పరిశోధక విద్యార్థి
ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం
చరవాణి నెం. : 9951854571
: పర్యవేక్షకులు :
డా॥ ఎస్.వి. కృష్ణారావు

**ఉపోద్ఘాతం :**

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఎన్నో గొప్ప నాగరికతలు, సంస్కృతులలో పోల్చుకుంటే భారతీయుల సంస్కృతి, సాంప్రదాయాలు చాలా ఉత్కృష్టమైనవిగా చెప్పవచ్చు. భిన్నమైన ప్రజలు, భిన్నమైన ఆచారాలు కలిగినప్పటికీ అందరం సంఘటితమై ఒక్కటిగా నివసిస్తున్న దేశం. అందుకే పెద్దలు మన సంస్కృతిని 'భిన్నత్వంలో ఏకత్వమని' ప్రస్తుతించారు. దేశంలోని భిన్నమైన జీవన సంస్కృతులలో తెలుగువారి జీవన విధానం చాలా గొప్పది. తెలుగువారి ఆచార వ్యవహారశైలి, సాంప్రదాయాలు, కట్టూబొట్టు మొదలగునవి అన్ని ఎంతోమంది ప్రముఖుల మన్ననలు పొందుకుంది. ఇంతటి ఘనకీర్తి లభించడానికి కారణం పల్లెలు, అందులో నివసించే గ్రామీణులు. ఒక గొప్ప సంస్కృతి నిర్మాణానికి పునాదులు పల్లెల్లోనే ఉంటాయి. అరమరికలు లేని గ్రామీణులైన జానపదుల జీవనం అంత ప్రఖ్యాతమైనది.

పట్టణాలు నాగరికంగా అభివృద్ధి పథంలో నడుస్తున్నా వాటి మూలాలు మాత్రం గ్రామాలలోనే ఉన్నాయి. ఎందుకంటే పట్టణాలలో నివసించే జనాభాలో ఎక్కువమంది గ్రామాల నుండి వచ్చినవారే ఉంటారు. నాగరికులైనా, గ్రామీణులగు జానపదులైనా ఇంచుమించుగా ఒకే సంస్కృతి, సాంప్రదాయాలను కలిగినవారుగా ఉంటారు. కాని వారికి మధ్య ఉన్న సంస్కృతిలో కొన్నిపాటి వ్యత్యాసాలు ఒకరిమీద మరొకరు తమ ప్రభావాన్ని చూపే విధంగా ఉంటారు.

**ఎవరు జానపదులు?**

జానపద విద్వాంసులు ప్రకారం జనపదం అంటే పల్లెటూరు, దేశం, ఒక నిర్దిష్ట ప్రాంతం అనే అర్థాలున్నా 'పల్లెటూరు' అర్థాన్ని స్వీకరించారు. గ్రామాలలో నివసించే కర్షకులు, అనాగరికులైన ప్రజలను జానపదులుగా భావించారు. అంటే జనపదాలలో నివసించే ప్రజలే జానపదులు. ఒకే విధమైన ఆచార వ్యవహారాలు, సాంప్రదాయాలు కలిగి జీవించేవారు, ఒక భౌగోళిక ప్రాంతంలో నివసించేవారు జానపదులు. అనాటి నుండి వారసత్వంగా వస్తున్న ఆచారాలను, వ్యవహార శైలిలను, కట్టుబాట్లను నిరంతరం కొనసాగిస్తూ, భవిష్యత్ తరాలకు వారసత్వాన్ని అందింపజేస్తారు. సాంప్రదాయకమైన వ్యవసాయ విధానాలను కొనసాగిస్తారు.

కాని ఈ నాటి కాలంలో జానపదుల వ్యవహారాలలో మార్పులు చాలా ఎక్కువగా కనిపిస్తాయి. ఆధునికత వారి జీవితాలను మారుస్తుంది.

**ఆధునిక జానపదులు జీవనం - పరివర్తన :**

ఒకనాటి జానపదుల జీవన విధానానికి నేటి కాలంలో జానపదుల జీవనానికి ఎంతో మార్పు వచ్చిందనే విషయం జగమెరిగిన సత్యమే. సృష్టిలో మార్పు సహజం. ఒక సంస్కృతి ప్రభావం మరొక సంస్కృతిపై, ఒక భాష ప్రభావం మరొక భాషపై, ఒకరి ఆచార వ్యవహారాలు మరొకరిపై ఖచ్చితంగా ప్రభావం చూపిస్తాయి. ప్రపంచం ఒక కుగ్రామంలా మారిన ఈ కాలంలో ఆధునికత మారుమూల పల్లెలకు కూడా చేరింది. దీనివల్ల జానపదుల జీవనంలో అనేక విధాలైన మార్పులు చోటుచేసుకున్నాయి. ఒకనాటి గ్రామీణుల జీవితానికి నేటి గ్రామీణుల జీవితానికి చాలా తేడా ఉంది. ఆధునికత అనేది చాలా వరకు శ్రేయస్కరమైనది, ప్రయోజనకరమైనది అయినా దాని మోజులో పడి సాంప్రదాయకమైన ఆచారాలు మర్చిపోతున్నారు. దాని వల్ల భవిష్యత్ తరాలకు వాటి విలువలు అందటం లేదు. దీనిని మనం ఈ క్రింది అంశాలలో గుర్తించవచ్చు.

**ఆధునిక వ్యవసాయ పద్ధతులు :**

గ్రామీణులు తరతరాలుగా సాంప్రదాయకమైన ఆచారాలను పాటిస్తూ, పశువులతో వ్యవసాయం చేసేవారు. కాని ఈ నాటి కాలంలో రోజురోజుకూ పెరుగుతున్న ఆధునిక యంత్ర పరికరాలను సమర్థవంతంగా వాడుకుంటూ పశువులతో వ్యవసాయాన్ని చేయుటకు అయిష్టతను ప్రదర్శిస్తున్నారు. పశువులతో వ్యవసాయం అనేది శ్రమతోను, కాలయాపనతోనూ

అదే విధంగా వానకూడా. నాడు చెట్లు ఎక్కువగా ఉండేవి కాబట్టి పొద్దున్నే వాన వస్తే మధ్యాహ్నానికి ఆవిరిగా మారి, ఆర్ద్రత పెరిగి మళ్ళీ కురిసేది. కాని ఈనాడు ఆవిరిగా మారి, గాలికి తరలిపోతుంది. అదే విధంగా 'కాశీకి పోతే కాటికి పోయినట్లే' ఇలాంటివి ఈ కాలానికి వర్తించవు. ఈ క్రమంలోనే కొత్త సామెతలు వాడుకలోకి వచ్చాయి. ఉదాహరణకు 'బంతులు బౌండరీలు దాటవుగాని, మాటలు మాత్రం కోటలు దాటుతాయి', 'అయిపోయిన పెళ్ళికి ఆర్కెస్ట్రా ఎందుకు?' 'పళ్ళు ఊడినాక ఏ పేస్టయితే ఏముందిలే', వాడి మాటలు వీసాలు తీసుకుని దేశాలు దాటుతుంది' వంటివి ఎన్నో వచ్చాయి. ఇవేకాక ఫేస్బుక్కు ప్రేమలు, సీరియల్ సంసారం, కంప్యూటర్‌తో కాపురం వంటి జాతీయాలు, పలుకుబడులు ఎన్నో జానపదాల్లో చేరిపోయాయి.

**9. జానపద క్రీడలకు లోపిస్తున్న ప్రాధాన్యత :**

గ్రామీణ ప్రాంతాల్లో ఒకనాడు పిల్లలంతా వీధుల్లో చేరి ఎన్నో క్రీడలు ఆడేవారు. కర్రాబిళ్ళా, ముక్కుగిల్లుడు, దాగుడుమూతలు, వానావానా వల్లప్పా వంటివి బాగా సందడి చేసేవి. కాని ఈనాడు ఇవి మచ్చుకైన కానరావు. కబడ్డీ వంటి జానపద క్రీడ మాత్రమే ఇంకా మనగలుగుతుంది. పిల్లలంతా ఈనాడు క్రికెట్‌కు, వాలీబాల్‌కి ఇస్తున్నంత ప్రాధాన్యత వేరే ఏ ఆటకు ఇవ్వడం లేదంటే అతిశయోక్తి కాదు.

**10. వివాహాది వేడుకలలో కొరవడుతున్న ఆప్యాయతలు :**

ఒకనాడు గ్రామీణ ప్రాంతంలో ఒక జానపదుడింట పెళ్ళైనా, పేరంటమైనా ఊరంతా నందడిగా ఉండేది. చుట్టాలు ముందుగానే చేరి సందడి చేసేవారు. రకరకాల కార్యక్రమాలతో, ఆటలతో, పాటలతో వియ్యాల వారిని ఆటపట్టించేవారు. కాని ఈ నాటి కాలంలో అంత తీరిక ఎవరికీ లేదు. పాటలు పాడేవారు కూడా కరువయ్యారు. ఒక్కరోజులోనే పెళ్ళి కొడుకును చేయడం, పెళ్ళి, శోభనం ఇతరత్రాది తంతులన్నీ పూర్తి చేస్తున్నారు. పుట్టినరోజు వేడుకలు కూడా నాడు దీపారాధనతో ఇంటిల్లిపాది తీపి వంటలు చేసుకుని, దేవాలయంలో పూజలు చేసి చేసుకుంటుంటే, నేడు మాత్రం కేకులు కోసి, క్యాండిల్స్ ఊది చేసుకుంటున్నారు.

**11. మొక్కుబడిగా జరుపుతున్న పండుగలు :**

ఒకనాడు జానపదులు ఏరువాక పున్నమి మొదలుకొని సంక్రాంతి వరకు ప్రతీ పండుగను చాలా ఘనంగా నిర్వహించేవారు. కాని నేటి కాలంలో ఏరువాక పున్నమి నామమాత్రంగా చేస్తున్నారు. తిరునాళ్ళు, జాతరలు వంటివి ఒక్కరోజుకే పరిమితమవుతున్నాయి. వినాయకచవితి నాడు విగ్రహాన్ని ఒక్కరోజు లేదా మూడు రోజులకు మించి ఉంచడం లేదు. చాలా పండుగల ప్రాధాన్యత నేటి తరానికి తెలియకుండానే పోతుంది.

**ఉపసంహారం :**

ఇలా ఎన్నో అంశాలలో నాటి జానపదుడి జీవనశైలికి, నేటి గ్రామాల్లోని జానపదుల జీవనశైలికి చాలా వ్యత్యాసం కనిపిస్తుంది. ఆధునికత అనేది చాలా వరకు గ్రామీణులకు ఉపయోగపడినా, వాటి వల్ల తమదైన ప్రత్యేకమైన సంస్కృతిని, సాంప్రదాయాల విలువను గుర్తించలేకపోతున్నారు. మరుగునపడేస్తున్నారు. ఒకనాడు గ్రామాలు స్వయం సంపూర్ణంగా ఉండేవి. కాని నేడు ఇతరుల మీద ఆధారపడవలసి వస్తుంది. ఆధునికత అవసరమైనంతవరకు వాడుకుంటే మంచిదే. కాని దాని మోజులో పడి జానపదుడు తనను తాను గుర్తించకపోతేనే నష్టం వాటిల్లుతుంది. మార్పు మంచి కోసమే, కాని ఆ మార్పు జానపదుడి జీవితాన్ని ఉన్నత మార్గం వైపు నడిపించేదిగా ఉండాలి కాని, దిగజార్చేలా ఉండకూడదు.

# దళితుల జీవన విధానం సంస్కృతి - పరివర్తన

Dr. Ambati Syam Sundara Rao, PDF Scholar
Department of Telugu & Oriental Languages
Achrya Nagarjuna University,Guntur
Email:ambatisyam@gmail.com Ph.9949248976

## దళితుల చరిత్ర

దళితులు భారత దేశంలోని ఆదిమ తెగలవారని భూమి పుత్రులని (Sons of the Soil) నిర్ధారణ చేయవచ్చు. మనుషులందరూ సమానమే, అందరికీ ఉండే అవయవాలు ఒక్కటే, అందరిలో ఉండే రక్తపు రంగు ఒక్కటే, అని హేతువుగా ఆలోచించి చూస్తే, అందరూ సమానమైన సామాజిక స్థితిలో ఉన్నట్లు తెలుసుకోవచ్చు. అయినా మనుష్యులందరూ ఒక్కటే, మనిషికి మనిషికి మధ్య అంతరాలు సృష్టించబడ్డాయి. బలవంతులు, స్వార్థపరులైన మేధావులు వర్ణవిభేదాలు సృష్టించి బలహీనులను బందీలుగా చేశారు. ఈ బంధీలను నీచులుగాను, దాసులుగాను, ప్రతిలోములు, మ్లేచ్ఛులు, అసురులు, చండాలురుగాను, అస్పృశ్యులుగాను, శ్వపచులు, అంత్యజులు, పంచములు, హరిజనులు, ఆది హిందువులు, ఆదిమాంధ్రులుగా పిలిచి, విద్యను, విజ్ఞానాన్ని వారికి దూరం చేసి సమాజంలో వీరిని అజ్ఞానులుగా సమాజం చిత్రీకరించింది. వారే ఈ నాటి దళితులు అని చెప్పవచ్చు.

భారతీయ సమాజంలో "తరతరాలుగా అస్పృశ్యతకు గురై, మతం పేరిట సాంస్కృతికంగా హీనంగా చూడబడి, విద్యాసౌకర్యాలు కరవై సమాజంలో ఉంటూ కూడా ప్రధాన జీవన స్రవంతికి దూరమై, ఆర్థికమైన అణచివేతకు, శ్రమదోపిడీకి గురిఅయినవాళ్ళు" (రంగనాథాచార్యులు. 1994:12) దళితులుగా చెప్పారు.

సమాజంలో దళితులు ఎన్నో కారణాల వల్ల ప్రత్యేకంగా గుర్తించదగి ఉన్నారు. తరతరాలుగా అణచివేతకు గురైన వీరు అన్ని రంగాలలోనూ వెనుకబడి ఉండటం వల్ల ఈ ప్రత్యేకమైన గుర్తింపు అవసరం అవుతుంది. విద్య, సంపద, అధికారం మొదలయిన సామాజికమైన విలువల గుర్తింపుకు ప్రమాణాలైన అన్ని రంగాలలోనూ వీరి వెనకబాటుతనం కొట్టోచ్చినట్టు కనిపిస్తుంది. దళితులు అంటరానివారుగా ఊరికి దూరంగా వెలివేయబడిన సమాజలకు చెందినవారు కనుకనూ, ఉన్నత వర్గాల వారికి ఊడిగం చేసే వృత్తులకు చెందినవారు కనుకనూ వీరు సామాజికంగా తక్కిన వర్గాలవారితో సామాజిక సంపర్కం (Social Contact) లేక పోవడం వల్ల భాషాపరమైన సంపర్కానికి కూడా దూరంగా ఉండిపోయారు.

సమాజంలోని దళితులు వారికి జరుగుతున్న అన్యాయాలను ఎదిరించే క్రమంలో దళితులు స్పందన, నిరసన, సంస్కరణ, విమర్శ, చైతన్యం, ప్రతిఘటన అనే భావజాలంతో వారి వారి సామాజిక స్థితిగతులను ఈ సమాజానికి వారి వారి సొంత గొంతుకులతో వినిపించిన సంగతి మనందరికి తెలిసిన విషయమే.

ప్రతి దేశంలోని ప్రాంతానికి జాతికి, కులానికి, వర్గానికి ప్రత్యేకమైనటువంటి ఆచార వ్యవహారాలు సాంప్రదాయంగా వస్తున్నటువంటి కొన్ని విలువలు ఉంటాయి. ఇవి భౌగోళిక పరిస్థితులను బట్టి, వ ృత్తిని బట్టి, ఆర్థిక స్థితిగతులను బట్టి ఏర్పడతాయి. అయితే ఒక ప్రాంతాన్ని గాని లేదా కుల లేదా వర్గాల, లేదా జాతిని అధ్యయనం చేసేటప్పుడు వాటి వాటి సాంస్కృతిక నేపథ్యాన్ని కూలంకషంగా చర్చించాల్సిన ఆవశ్యకత ఉంది. ఈ క్రమంలో ప్రధాన సాంస్కృతిక వాహిక అయిన భాష ప్రధాన భూమిక వహిస్తుంది. అసలు సంస్కృతిని భాషే వ్యక్తం చేస్తుంది అనడం సబబుగా ఉంటుంది. అందుకే సాంస్కృతిక అధ్యయనంలో భాష ప్రధాన పాత్ర అవుతుంది.

సామాజిక స్థాయిలో వర్గాన్ని బట్టి, వృత్తిని బట్టి, విద్యా సంస్కారాన్ని బట్టి మాండలికాలు ఏర్పడుతున్నాయి. ఒక వర్గం వారికి 'అన్నం' అనే పదం వాడుకలో ఉన్నప్పుడు వాళ్ళ పిల్లల్లో ఒకడు ఎప్పుడైనా 'కూడు' అన్న పదం వాడితే వింతగా చూస్తారు. ఎందువల్ల ఆ రెండు రూపాలు రెండు భిన్న వర్గాల వారి వ్యవహర రూపాలు కావడమే. అలాగే కులవృత్తిని బట్టి కూడా కొన్ని వాడుకలు ఏర్పడతాయి. ఉదా. పనిరాయి, పనిసంచి, గూటం, కత్తి, ఉలి, ఆరి, పట్టకర్ర, ఆకురాయి, మాదిగ కత్తులు, సానకత్తులు, రంపం, దారపుండ, డాట్, పంచ్, రివేటు, హైలేటు, గాబు, గెల్లబాబు, కొమ్ము, లందె సున్నం, కరక్కాయ, తుమ్మచెక్క, తంగేటి చెక్క, సలప, అన్నబేడ్ వంటి వృత్తిపదాలు వారి సంస్కృతిని తెలియజేస్తాయి. వీరికి సంబంధించిన పదజాలం కూడా నిఘంటువులకు ఎక్కలేదు.

## దళితులు - సామాజిక నేపథ్యం

ఒక సమాజంలోని భిన్న వర్గాలవారి మధ్య గల సామాజికమైన, ఆర్థికమైన, వృత్తిపరమైన భేదాలు కారణంగా వారి మధ్య సంపర్క అవకాశాలు (Contact Opportunities)

వేరు వేరుగా ఉంటాయి. ఇది వారి భాషావ్యవహారంలోని భిన్నత్వానికి కారణం అవుతుంది. భారత దేశంలోని దళిత వర్గాల భాషా వ్యవహారంలోని భిన్నత్వానికి కారణం అయిన సామాజిక, ఆర్థిక స్థితిగతుల నేపథ్యాన్ని గణాంక వివరాలు కొన్ని పరిశీలించటం ఈ సందర్భంలో ప్రయోజనకరంగా ఉంటుంది.

భారత దేశంలోని 1991వ సంవత్సరపు గణాంక వివరాలను బట్టి షెడ్యూల్డ్ కులాలవారిలో 81.3శాతం మంది గ్రామాలలో నివసిస్తున్నారు. (Chakrabarty. 1999:190) అంటే షెడ్యూల్డ్ కులాల వారిలో అత్యధిక శాతం పట్టణాలలోను, నగరాలలోను మాత్రమే లభించే ఉన్నత విద్య మొదలయిన సౌకర్యాలకు దూరంగా ఉన్నారని చెప్పవచ్చు.

భారతదేశంలో షెడ్యూల్డ్ కులాల వారి అక్షరాస్యతను పరిశీలిస్తే 1991 జనాభా లెక్కల ప్రకారం మొత్తం షెడ్యూల్డ్ కులాల జనాభాలో 37.41 శాతం అక్షరాస్యులు. ఆంధ్రప్రదేశ్ లో ఇది 31.59శాతం మాత్రమే. (Directorate of Economics and statics. 1996 : 5). ఇక్కడ అక్షరాస్యత అంటే కేవలం పేరుకు మాత్రమే అక్షరాలు నేర్చుకున్న వారు అని. కాని ప్రయోజనకరం అయిన అక్షరాస్యతను (Effective literacy) పరిశీలిస్తే 1994లో ఇది భారతదేశంలోని షెడ్యూల్డ్ కులాల జనాభాలో 41.5 శాతంగాను, ఆంధ్రప్రదేశ్‌లో ఇది 39.6శాతం గాను నమోదు అయింది. (Chakrabarty.1999:195) అంటే షెడ్యూల్డ్ కులాల వారిలో అత్యధికశాతం పట్టణాలలోను, నగరాలలోను మాత్రమే లభించే ఉన్నత విద్య మొదలయిన సౌకర్యాలకు దూరంగా ఉన్నారని చెప్పవచ్చు.

సాధారణంగా ప్రభుత్వ పాఠశాలలో కంటె ప్రభుత్వం వారి సహాయం (aid)తో నడిచే పాఠశాలలో మెరుగైన విద్యాసౌకర్యాలు ఉంటాయి. అంత కంటె మెరుగైన విద్యాసౌకర్యాలు ప్రవేటు యాజమాన్యం నడిపే పాఠశాలలో లభిస్తుంది. షెడ్యూల్డ్ తరగతులకు చెందిన విద్యార్థులు ఎక్కువగా ఏ పాఠశాలలో చదువుకుంటున్నారో గమనిస్తే వారికి అందే విద్యయొక్క నాణ్యతను తెలుసుకోవచ్చు.

దళితులు విద్యకు దూరం కావటం అనేది దళితుల భాష ఇతర వర్గాల వారి భాష కంటే భిన్నంగా ఉండేందుకు ప్రధాన కారణం అయింది. దీనికి తోడు వారి ఆర్థిక పరమైన వెనకబాటుతనం మరొక ప్రధాన కారణం. పైన పేర్కొన్నట్లుగా దళిత జనాభాలో 81.3శాతం మంది గ్రామాలలో నివశిస్తున్నారు. వీరిలో చాలా మంది అనిశ్చితమైన ఆదాయం కల వృత్తులూ, కూలి పనీ చేసుకుంటున్నవాళ్ళే. కనుక దళితులలో అత్యధిక శాతం దుర్భ దారిద్ర్యం అనుభవిస్తున్నారు అని చెప్పక తప్పదు.

దళితులు - వృత్తులు

సమాజంలో దళితులు అస్పృశ్యులుగా, పంచములుగా ముద్రవేయబడ్డారు. వీరికి విద్యను అభ్యసించే అవకాశం లేక అందుబాటులో ఉన్న వృత్తులు చేసుకొని జీవనం సాగించారు. మన దేశానికి ఆంగ్లేయుల రాకతో దళితులకు విద్యనభ్యసించే అవకాశం కలిగింది.

దళితకులాలలో మాలవారు వ్యవసాయ వృత్తి, వ్యవసాయ కూలీలుగా(Agricultural Labourers)పనిచేశారు. వీరు 75%శాతం ఈ వృత్తిలోనే ఉన్నారు. మిగిలిన వారు నేతపనివారుగా ఉన్నారు. ఆ కాలంలో నేత పని చేస్తున్నా వారిని "సగం సాలెనేత సగం మాలనేత" అనే లోకోక్తితో మాలవారిని హేళన చేస్తూ ఉండేవారు. వీరిలో కొంతమంది వీధులను శుభ్రపరచే వారుగా ఉన్నారు. మాదిగల ముఖ్యవృత్తి చర్మకార (Leather Working) పని. ఈ చర్మకార వృత్తిలో మాలవారు కూడా ఉన్నారు. వీరు ఆరె మాలలుగా వ్యవహరించబడుతున్నారు.

దళిత కులాలలో కొందరు వెట్టిపనివారు ఉన్నారు. మరి కొందరు హరిభక్తులై పూజారులుగా ఉండే మాలవారిని హరిదాసులు లేక మాలదాసరులు అని అనేవారు. గ్రామపని చేసే గ్రామోద్యోగిని తలవరి అనే పేరుతో పిలిచే వారు. గుంటూరు జిల్లాలో గ్రామ సేవకుడిని మోతాదు అని పిలుస్తారు. గ్రామాల్లో గ్రామ వార్తలను తెలిపే వ్యక్తిని చలవాది/సలాది అంటారు. గ్రామ వీరులుగా, రక్షకులుగా కూడా వీరు పని చేశారు.

దళితులు - ఆచార వ్యవహారాలు

ఆదిమ సమాజంలో దళితులు ఆటవికులుగా ఉండేవారు. ఆటవిక స్థితిలో ఆచారాలు, కట్టుబాట్లు చాలా పటిష్టంగా ఉండేవని చరిత్ర చెబుతుంది. దళితుల ఇంటి పేర్లు పరిశీలిస్తే ఒక్కొక్క ఇంటి పేరు గలవారు ఒక్కొక్క కుదురుకు సంబంధించిన వారిగా గుర్తించవచ్చు. చాలా మందిలో ఇంటిపేర్లు ఆటవిక పరిసరాల్లో కన్పించే జంతువులకు, పక్షులకు ప్రకృతికి సంబంధించేవిగా ఉంటాయి. ఉదా. పిల్లి, ఎద్దు, కాకి, బ్రెరె, మేక, కొమ్ము, గాలి, పిట్ట, గుర్రం, గద్ద, కరి లేక కర్రి మొదలగునవి. కొందరికి వారు ధరించిన ఆయుధాల పేర్లు, కొందరికి వారు నివసించిన ప్రాంతం పేర్లు ఇళ్ల పేర్లుగా కన్పిస్తాయి.

దళితులు అరుంధతీయులు, జాంబవంతులు అనే పేర్లతో కూడా పిలవబడుతున్నారు. అరుంధతి మాదిగల ఆడపడుచు. మహా పతివ్రత. హిందూ సమాజంలో ఏ పెండ్లి జరిగినా ఆ మహానుభావురాలిని దర్శించడం చూస్తాం. అరుంధతి నక్షత్ర దర్శనంగా ఈ ఆచారం మాలమాదిగలకే కాకుండా ఇతర కులాలకు ఉంది. దళితులు సంయుక్తంగా పూజించే గ్రామదేవత ఎల్లమ్మ. అన్ని కులాల వారు జాతరగా చేయబడే ఈ పూజా కార్యక్రమంలో పాల్గొంటారు. మేళతాళాలు, డప్పు వాద్యాలు, నృత్యాలు, జంతు బలులు ఈ పూజా వ్యవహారంలో చోటు చేసుకొంటాయి. వీరు మాంతంగికి అంకితమై స్త్రీలు కన్యలుగానే ఉండిపోతారు. గ్రామాల్లో పొలిచల్లడం అనే ఆచారం 19వ శతాబ్ది పూర్వార్ధం వరకు ఆంధ్రదేశంలో చాలా ఎక్కువగా ఉంది. పొలి చల్లనప్పుడు దున్నపోతు మాంసాన్ని తినడం పొలిలో ఒక భాగం. అయితే క్రైస్తవ మిషనరీల ప్రభావం వల్ల దాదాపుగా ఈ పొలి ఆచారం కనుమరుగైంది.

హిందువులుగా ఉన్నప్పుడు మాలవారు మాలపున్నమి అనే ప్రత్యేకమైన పండుగను ఆచరించేవారు. వర్ణాంతర ప్రేమకు సంబంధించిన విషాద గాథ నుండి ఈ పండుగ పుట్టింది. జోకరయ్య అనే తెలగ యువకుడు మాలకులానికి చెందిన ఒక యువతిని ప్రేమిస్తాడు. వివాహానికి కులం అడ్డుగోడలై పెద్దలు అంగీకరించరు. ఫలితంగా ప్రేమికులిరువురు ఆత్మహత్య చేసుకొంటారు. వారికి గుర్తుగా మాలపున్నమి నేటికి మహాలయ పున్నమి పేరుతో హిందువులు ఆచరిస్తారు. భాద్రపద పూర్ణిమను మాల పున్నమి అంటారు.

సంక్రాంతి సందర్భంగా మాల దాసరులు హరినామ స్మరణ చేస్తూ ఇంటింటిని దర్శించడం గ్రామీణ పట్టణ ప్రాంతాల్లో చూడవచ్చు. అట్లతద్ది పండుగ సందర్భంగా అట్లు వేసుకొని తినడం, ఊయల లూగడం వంటి కార్యక్రమాల్లో గ్రామీణ, మాల మాదిగలు పాలు పంచుకోవడం కన్పిస్తుంది.

18వ శతాబ్దం నుండి మాల మాదిగలు ఎక్కువ మంది క్రైస్తవ మతంలోకి ప్రవేశించారు. అయినా ఇప్పటికీ పూర్వం ఆచరించిన హైందవ ఆచారాలు కొన్ని చోట్ల ఆచరిస్తూనే ఉన్నారు.

వివాహ సందర్భంగా పసుపు పూసి వధూవరులకు నలుగు పెట్టడం, తాళి కట్టడం, ప్రధానం, యార్నాలు వంటి కార్యక్రమాలు ఆచరించటం ఇప్పటికీ ఆచరిస్తున్నారు.

రోమన్ కాథలిక్ వారి పూజా విధానంలో హిందూ దేవతా పూజా విధానం పూర్తిగా ఆచరించబడుతుందని చెప్పవచ్చు. ఏసూ క్రీస్తు, మరియమ్మ విగ్రహాలను పూజిస్తూ కొబ్బరికాయలు కొట్టడం, మొక్కులను చెల్లించడం, శిరోముండనం చేయించుకోవడం, తిరునాళ్ళు నిర్వహించడం, మేరీమాత ప్రభలు కట్టి ఊరేగించడం వంటి ఆచారాలు పాటిస్తున్నారు.

క్రైస్తవులుగా మారిన దళితులు కొందరు జనవరి ఒకటిన కొత్తసంవత్సర పండుగ, మార్చి ఏప్రిల్లో ఈస్టర్ పండుగ, డిశంబర్ నెలలో క్రిస్టమస్ పండుగలు జరుపుకుంటారు.

వీరిలో వితంతు పునర్వివాహం జరుపుకోవడానికి అనుమతి ఉంది. మరణించిన భర్త సోదరుడ్ని మాత్రం వివాహం చేసుకోరు. భర్త, భార్య నుండి విడాకులు పొందే హక్కు ఉంది.

మరణించిన వ్యక్తులకు కర్మకాండలు చేసే ఆచారం ఉంది. మరణించిన వ్యక్తుల్ని పూడ్చి పెట్టడం అనాదిగా వస్తున్న ఆచారం. మరణించిన వ్యక్తులు దీర్ఘ రోగంతో బాధపడి మరణిస్తే వారిని దహనం చేసేవారు. ఆ తరువాత 3, 5, 7, 11, 13 రోజులకు దినం చేస్తారు. మరణించిన వ్యక్తులకు సంబంధించిన వరుస అయ్యేవారు. అంటే మామలు, బావలు, బావమరదళ్ళు క్రొత్త బట్టలు వేస్తారు. అలా చేస్తే కీడు పోతుందని వీరి విశ్వాసం.

దళితులు-పరివర్తన

సమాజ పరిణామ క్రమంలో దళితులు అంబేద్కర్ భావజాల స్ఫూర్తితో తమకు జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలను తెలుసుకునే జ్ఞానం పొందారు. దళితులు రాజ్యాధికారం వైపు అడుగులు వేస్తున్నారు.

**ఉపయుక్త గ్రంథసూచి**


రంగనాథాచార్యులు, కె.కె.
1994. 'తెలుగు సాహిత్యంలో దళిత చైతన్యం. ఆధునిక సాహిత్యం దళిత స్పృహ.'

Chakrabarty, G.
1999. "SCs and STs in Rural Andhra Pradesh: Their Education, Health Status Income" In Journal of Rural Development Vol.18 (2). Hyderabad: NIRD. Pp. 185-219.

# స్త్రీ వాద సాహిత్యం సాంస్కృతిక - పరివర్తన

పత్రసమర్పకులు:-
**Dr. B.V.Leela Rani,**
M.A. M. Phil, Ph.D
Reader in Telugu, H.O. D
Y.V.N.R. Govt - Degre college
Kaikaluru - Krishna Dist
Ph. No. 9440771216

న స్త్రీ స్వాతంత్ర మర్హతి అంటూ అనాదిగా సామాజిక కుటుంబపు పునాదిరాళ్లలోనే ఉంచబడిన స్త్రీ, నేడు రోదసిలో రాకెట్లు నడిపే చైతన్య స్థాయికి చేరుకుని, ఆకాశంలో సగభాగస్వామ్యాన్ని కోరుకుంటున్న విషయం తెలిసిందే. ఆ చైతన్య ప్రస్థానంలోనే మహిళల స్వేచ్ఛాకాంక్ష అర్థమవుతుంది. మానవ ప్రగతికి స్వేచ్ఛ, స్వాతంత్రం ముఖ్యం అని గ్రహించిన మహిళలు, తాము పురుషులతో పాటు సమానంగా ఎదగలేకపోవటానికి కారణాలను అన్వేషించారు. ఆ క్రమంలో లింగ వివక్ష పోషించిన స్వేఛ్ఛారాహిత్యం ప్రధాన కారణమని గ్రహించారు.

స్త్రీలకు తమ అస్తిత్వాలపైనను, ఆలోచనలకు, విలువలేని తనమే తమ సమస్యలకు మూలకారణమనే అవగాహన కలిగింది. పితృస్వామ్య సంస్కృతీ చట్రంలో తాము బందీలుగా అయ్యామనే జ్ఞానంతో దాని నుండి విముక్తి చెందటానికి ఆంక్షల సంకెళ్లను వదిలించుకునే చైతన్యాన్ని తెచ్చుకుంటే తప్ప తాము స్వేఛ్ఛా వాయువులను పీల్చలేమనీ అర్థం చేసుకున్నారు. స్త్రీ సమస్యలు సామాజికమైన జటిల సమస్యలుగా తయారయ్యాయి. పుట్టుక, చదువు , పెళ్లి, కుటుంబం, ఉద్యోగం, నిర్ణయాత్మకత, సాధికారికత వంటి విషయాలలో స్వేచ్ఛ, లేకుండా చేసి మహిళలను అనేక సమస్యల వలయాలలో చిక్కుకునేటట్లు చేసిన సమాజ సంస్కృతిపై శంఖారావం చేసే చైతన్యమొక్కటే స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్రాలను ఇవ్వగలుగుతుందని భావించారు.

పితృస్వామ్య సంస్కృతి -

చారిత్రకంగానే పని విభజన స్త్రీల ప్రాతివత్యం ప్రాతిపదికలుగా కుటుంబ నిర్మాణం జరిగింది. ఋగ్వేదం నాటికే పితృస్వామ్యసంస్కృతిలో భాగంగా తండ్రి నుండి భర్తకు స్త్రీలపై హక్కులు బదలాయింపుగా వివాహక్రతువును నిర్వహించేందుకు, సూర్యుడు తన కుమార్తె అయిన తపతిని సంవరణుడికి ఇచ్చి పెళ్లిచేయటం జరిగింది అంటే ఆమె పరాధీనురాలుగా చెప్పబడింది. పరాధీనత స్వేచ్ఛా స్వాతంత్రాలకు గొడ్డలిపెట్టువంటి విషయం. అందుకే యుగయుగాలుగా మహిళ పితృస్వామ్యపు సంకెళ్ళను విదిలించుకోవటానికి తన పరిధిమేరకు చైతన్యం తెచ్చుకున్న విషయాన్ని తెలుగు సాహిత్యం అద్దం పడుతోంది.

తెలుగు సాహిత్యం ప్రతిఫలించిన మహిళా చైతన్యం:-

ఇదొక వారసత్వ చైతన్య స్రవంతిగా తెలుగు సాహిత్యంలో నేటికి కనబడుతోంది. కుటుంబ నిర్మాణ చరిత్ర కలిగిన దేవుళ్ళుగా భావించబడ్డ శివకేశవులకు ఆడపిల్లల పుట్టక శూన్యం ఆంధ్రుల చరిత్రలో ఒకటవ శతాబ్దానికి చెందిన కృష్ణాగోదావరి ప్రాంత మహిళలు "గాథా సప్తశతి అనే ప్రాకృత గ్రంథంలో కుటుంబ సంస్కృతిలో పురుషుడి వైపు నుండి కొఱవబడిని " ప్రేమ, నమ్మకం అనే వాటిని పాటల రూపంలో ప్రశ్నకు పెట్టటంగా గ్రామీణ మహిళా చైతన్యం ప్రారంభఅయ్యింది.

రామాయణం - మహాభారతం - అస్తిత్వ చైతన్యం:-

ఆనాటి నగర వాసులుగా ఉన్నత వంశాలకు చెందిన స్త్రీలు తమ అస్తిత్వాలకు వ్యక్తిత్వాలకు విలువ నిచ్చుకునే దిశగా రామాయణ భారతేతిహాస కావ్యాలతో కన్పడతారు.

రామాయణంలో శక్తిమంతురాలైన కైకతన అస్తిత్వానికి విలువ ఉంటుందనే భావనతో రాముడు, భరతుడు, ఒకే రోజు పుట్టారు కాబట్టి తానెందుకు రాజమాతగా గౌరవాన్ని పొందకూడదనే ఆమె చైతన్యమే రామాయణ కథను మలుపు తిప్పింది. భారతంలో గాంధర్వ వివాహం చేసుకున్న దుష్యంతుడి చేత పదిమందిలో తనని అతని భార్యగా ఒప్పింపచేసిన శకుంతల కుటుంబంలోని తన హక్కును కాపాడుతుంది. రాజ్యమధంతో పరస్త్రీ అయిన ద్రౌపది యొక్క మానానికి ముప్పు తెచ్చే ప్రయత్నం చేసిన దుర్యోధనుడు యుద్ధంలో చచ్చిపోవటమే న్యాయమని భావించిన తల్లిగాంధారి యొక్క న్యాయ చైతన్యం అది న్యాయకోవిదులకు కరదీపిక.

అలాగే భాగవతంలో రుక్మిణి తన పెళ్ళివిషయంలో తన యిష్టానికి నిర్ణయానికి విలువ నిచ్చుకున్న చైతన్యం ఆమెను అంత:పురం దాటి వెళ్ళగలిగేలా చేసింది.

అలాగే కుటుంబంలో సమతుల్యతను దెబ్బతిస్తూ స్త్రీల యొక్క స్థాయిలను తగ్గించే బహుభార్యత్వపు సంస్కృతి పట్ల సత్యభామ ప్రతి ఘటనా చైతన్యమే ఆ తరువాత వచ్చిన ప్రబంధ కావ్యాలలో వచ్చిన స్త్రీల చైతన్య పరిణామంగా కన్పడుతుంది.

అయితే ఈ పాత్రల చైతన్యాల నన్నింటిని అణచివేస్తూ తాటాకు టాపాకాయలుగా చేసి పితృస్వామ్యం తన అధికారాలను నిలుపు కోవటం చేసింది. అనేదానికి సాక్షీభూతం తెలుగు సాహిత్యం.

మధ్యయుగాలలో దాదాపుగా అన్ని వర్గాల వంశాలకు చెందిన గ్రామీణ నగరయువతులు పురుషుడికి అన్యస్త్రీ సంబంధాలను ఏర్పరచుకునే అవకాశం యిచ్చిన పితృస్వామ్యంలో స్త్రీలు తాము కూడా రహస్య సంబంధాలు పెట్టుకుంటే తప్పేమిటి అని భావించటంతో, రాజ్యం ముందుకు వచ్చి స్త్రీలను శిక్షణ గురిచేయుటాన్ని కథాకావ్యాలు అద్దం పడుతున్నాయి. అదే మేరకు పురుషులకు ఎటువంటి శిక్షణ వేయకపోవటమే నేటికే నిర్భయకేసులకు వెన్నుదన్నుగా నిలిచింది. ఆడపిల్లల పుట్టకలు విలువలేనివిగా కథాకావ్యాలలో చెప్పబడ్డాయి.

ఆధునిక యుగంలో సాహిత్యం స్త్రీ

ఆధునిక యుగంలో స్త్రీల ఎదుగుదలని అడ్డుకునే సమాజ సంస్కృతిని సంస్కరించాలనుకున్న వారుగా కందుకూరి వీరేశలింగం గురజాడ స్మరణీయులు. కందుకూరి "రాజశేఖర చరిత్ర" నవలలో రుక్మిణి చదువుకోవటం చేతనే పురుషవేషంలో సమాజంలో స్వేచ్ఛగా తిరిగి కుటుంబ సమస్యలను తీర్చగలిగింది. మహిళలు స్వేచ్ఛగా పెరగకపోవటానికి బాల్య వివాహాలు, కన్యాశుల్కం కారణమని భావించి ఆ సంస్కృతిని రూపుమాపటానికి గురజాడ ఉద్యమించారు.

1902లోనే బండారు అచ్చమాంబ "స్త్రీ విద్య" అనే కథరాసి దూరతీరాలలో ఉన్న భర్తకు తన భావాలను ఉత్తరాల రూపంలో పంచుకునే అవకాశం. "స్త్రీ విద్యతో ఏర్పడుతుందని భావించటం జరిగింది. "వరవిక్రయం" నాటకంలో కాళింది కమలలు చదువుకోవటం చేతనే మహిళా జీవితాలకున్న విలువల విషయాన్ని ఆలోచించటం చేయగలిగారనీ వరకట్న విషయంలో కమలకు న్యాయశాస్త్రాన్ని కూడ ప్రశ్న వేసే చైతన్యం కలిగిందని తెలియచేశారు. ఈ చైతన్యం లింగవివక్షా సంస్కృతిలో నుండి ఆవిర్భవించిన "స్పృహ" శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి "అరికాల మంటలు" కథలు రుక్మిణి తన అస్తిత్వానికి విలువనిచ్చుకునే విధంగా వితంతుస్త్రీగా శిరోముండన మనే సంస్కృతిని వ్యతిరేకించి స్వేచ్ఛగా పునర్వివాహం చేసుకుని తిరిగి కుటుంబంలో స్థానం పొందాలనుకుంటుంది.

"స్త్రీలకు శరీరం ఉంది దానికి వ్యాయామం కావాలి స్త్రీలకు మెదడు ఉంది దానికి జ్ఞానం కావాలి స్త్రీలకు హృదయం ఉంది దానికి స్పందనలు ఉంటాయనే చలం కథలలో మహిళల లైంగికత మీద, జీవితము మీద పురుష పెత్తనాలను ఎత్తిచూపుతూ కుటుంబాలలో భర్తల రూపంలో ఉన్న సంస్కృతి స్త్రీల చైతన్యానికి అడ్డుగోడగా ఉందని చెప్పటం జరిగింది.

రంగనాయకమ్మ కథలలో పురుషులు మహిళలను అర్ధంచేసుకోలేక పోతే స్త్రీ అస్తిత్వాలకు ఒక విలువ ఉందని అది స్వేచ్ఛనిచ్చే మార్గమని భావించే చైతన్యం కావాలని కనబడుతుంది.

1975 అంతర్జాతీయ మహిళా సంవత్సరం బాలికా సంవత్సరం, అక్షరాస్యతా సంవత్సరాల ప్రకటన అనంతరం, స్త్రీలకు చదువు ఉద్యోగం ఉన్న కూడా స్వేచ్ఛారాహిత్యంలో మరుగున పడ్డ తమ అస్తిత్వాలను ఉనికిని వెలికి తీయాలన్న చైతన్యం వచ్చింది. ఆధునిక తెలుగు సాహిత్యంలో స్త్రీల సమస్యలను స్త్రీవాద స్వేచ్ఛఅణచివేతను తెలియచేస్తూ మతం పేరుతో, సంస్కృతి పేరుతో ఏ విధంగా ఉన్నదో ప్రపంచ సమాజానికి ఎత్తిచూపడానికి ఉద్యమించిన కవిత్వమే స్త్రీవాద సాహిత్యం.

1980 తర్వాత తెలుగు సాహిత్యంలో స్త్రీవాదం చోటు చేసుకుంది. పుట్టకతో ఆడపిల్ల కాని ఆమె సమాజం చేత స్త్రీగా తయారుచేయడుతుందని ఆక్రమంలో ఎంతో హింసకు గురి అవుతుందనీ ఆమె అవయవాలను చూస్తూ చొంగ కార్చుకుంటూ చూడటం తాకటం చేసేవారి హింసకు గురి అయిన స్త్రీలు బయటకు వెళ్ళే కనీస భౌతిక స్వేచ్ఛలేక ఆందోళన చెందడం "ఓల్గా రాజకీయ కథల్లో" కన్పడుతుంది.

పొతూరి విజయలక్ష్మి "అబలాయానం" నవలలో ఐదుతరాల స్త్రీల చరిత్రను అవగాహన చేసుకోగలిగేటట్లు వ్రాసారు. స్త్రీలు ఎదుర్కొన్న వివక్షలైంగిక వేధింపులు, అసమాననైతిక సంస్కృతిని విశ్లేషణకు పెట్టి అక్షరాస్యత వలన స్త్రీల జీవితాలలో మానవ సంబందాలు విస్తృతం అయి ప్రపంచజ్ఞానాన్ని అవగాహన చేసుకునే శక్తి స్త్రీలకు ఏర్పడుతుందని తెలియచేస్తుందనీ నవల.

కుప్పిలి పద్మ వ్రాసిన "పొద్దుకెదురు తిరిగి పువ్వు" కథలో స్వేచ్ఛను అనుభవించాలన్నా, ఇంకొకళ్ళ స్వేచ్ఛను కాపాడాలన్నా మనోధైర్యం అవసరం ఆడపిల్లలు రోడ్డు మీద

స్వేచ్ఛగా నడిచే స్థితిలో ఉండాల్సిన సామాజిక బాధ్యతకై రావాల్సిన జనచైతన్యాన్ని గుర్తుచేస్తుంది ఈ కథ.

ఆధునిక యుగంలో స్త్రీలు చదువుకున్నా ఉద్యోగాలు చేస్తున్నా నేటి మార్కెట్ శక్తుల కాలంలో కూడ మహిళా సంస్కృతి కొత్తసీసాలో పాత సారాయిగా ఉంటూ వారి స్వేచ్ఛా స్వాతంత్రాలను అడుగడుగునా హరించివేస్తూనే ఉంది. నేటికి మహిళలకు కుటుంబహింస, సామాజిక అభద్రత, అస్తిత్వరాహిత్యం వారి ఆలోచనల సృజనాత్మకతలకు అవరోధంగా ఉన్న వివక్షా సంస్కృతి రాజ్యమేలుతోందన్నది వాస్తవ దృశ్యం. మహిళా స్వేచ్ఛకై లింగవివిక్షని ఎదుర్కొనే చైతన్యాన్ని పొందే క్రమంలో ఎన్నో సమస్యలు వచ్చినా, స్వేచ్ఛకై మహిళలు పోరాటం చేస్తున్నారు.

మహిళా స్వేచ్ఛకై అవసరమైన చైతన్యం తెచ్చుకోవటం రెండురకాలుగా ఉంటుంది. ఒకటి తాము చైతన్యం తెచ్చుకోవడం రెండోది – తోటివారిని చైతన్య పరచటం మహిళా చైతన్యవేు. అది మహిళా స్వేచ్ఛకు సోపానాలు వేయగలుగుతుంది.

అందుకే నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ కుటుంబంలో సంపదలను పంచినా స్త్రీలు వనరుల్ని ఉపయోగించాలనుకునే స్వేచ్ఛతో పాటు, సృజనాత్మకతను పెంచుకుంటూ స్వతంత్రమైన గౌరవ ప్రదమైన జీవన విధానం కుటుంబంలో మహిళలకున్నప్పుడే మహిళాభివృద్ధి ఉంటుందని చెప్పారు.

# స్త్రీ వాద సాహిత్యం సాంస్కృతిక పరివర్తన

డా॥ దోనెపూడి సరేశ్ బాబు
ఉపాధ్యాయుడు
జి.ప.ఉ. పాఠశాల, గోస్పాడు
కర్నూలు జిల్లా, 518674

సాంస్కృతిక పరివర్తన అనే పదబంధంలో సంస్కృతి, పరివర్తన అనే రెండు బహుళార్థబోధక పదాలున్నాయి. ఈ రెండుపదాలకున్న భిన్నార్థాలాధారంగా చాలా అర్థాలు చెప్పవచ్చు. అందువల్ల అర్థపరిమితినివిధించుకోవడం అవసరం. అంత కడివెడు పాలపై ఒక్కింత మీగడ పేరినట్లు మనకు మిగులును గతము లోపలి మంచి - అదియె సంస్కృతి. ఇది సంస్కృతికి సి.నా.రె గారు ఇచ్చిన నిర్వచనం. ఒక జాతి, సంస్థ,సాహిత్యంలో కాలక్రమంలో గుణాత్మకంగా వచ్చిన మార్పును మనం సంస్కృతిగా భావించవచ్చు. ఇక పరివర్తన అంటే వ్యక్తిలో వచ్చిన గుణాత్మకమైన మార్పు అని ఒక అర్థం.

మార్పు, పరిణామం అనేవి కాలక్రమంలో సహజంగా వచ్చే అంశాలు. కానీ పరివర్తన అటువంటిది కాదు. గుణాత్మకమైన మార్పు ఇందులో అవశ్యంగా ఉండాలి. పరివర్తన అనే మాటను ఇంటర్ ఛేంజ్ అనే ఆంగ్ల పదబంధానికి సమానార్థకంగా కూడా వాడుతున్నారు. పరివర్తన యోగం అనే పారిభాషిక పదం జ్యోతిష శాస్త్రంలో కూడా వినిపిస్తుంది. అంటే ఏవైనా రెండు విషయాల మధ్య పరస్పరం చోటుచేసుకునే మార్పు, అక్కడి ప్రభావం ఇక్కడ, ఇక్కడి ప్రభావం అక్కడ పడితే దాన్ని పరివర్తనం అంటారు. సౌలభ్యం కోసం మొదటి అర్థానికే పరిమితమవుదాం.

పాతికేళ్లకిందటనుంచీ తెలుగులో స్త్రీవాద సాహిత్యం ప్రస్ఫుటమైన నిర్దిష్టమైన రీతిలో వెలువడుతోంది. అంతకుముందు అడపాదడపా కొన్ని రచనలు వచ్చినా ఉద్యమ స్ఫృహతో రచనలు వెలువడటం మొదలైంది మాత్రం 92 ప్రాంతాలనుంచే!

కొన్ని సామాజిక రంగాలలో కుటుంబ జీవనంలో స్త్రీకి పురుషునితోపాటు సమానహక్కులు, సమాన స్థానం నేటికీ ప్రశ్నార్థకంగానే మిగిలిఉంది. ఈ విషయాన్ని చర్చిస్తూ స్త్రీ పురుష సిద్ధాంతాన్ని వివరించేది స్త్రీవాదం

సమాజంలోనూ కుటుంబంలోనూ పనిలోనూ స్త్రీలు గురౌతున్న అణచివేత దోపిడీకి సంబంధించిన అవగాహన కలిగిఉండి ఈ పరిస్థితి మార్చడానికి స్త్రీపురుషులిరువురూ చేపట్టే చైతన్యవంతమైన కార్యక్రమం స్త్రీవాదం - ఫెమినిస్ట్ స్టడీ సర్కిల్

స్త్రీపురుషులమధ్య అసమానతలున్నాయనీ వాటి కారణంగా సమాజంలోనూ కుటుంబంలోనూ స్త్రీలు అణచివేతకు గురౌతున్నారని తెలిసి ఈ విధమైన స్త్రీ జీవితాలను, అనుభవాలను వస్తువులుగా చేసి రాసేదే స్త్రీవాద కవిత్వం. -- కాత్యాయనీ విద్మహే

పై నిర్వచనాలను దృష్టిలో పెట్టుకొని ప్రసిద్ధ రచయిత్రి ఓల్గా రాసిన యశోబుద్ధ నవలను సమీక్షించడం ఈ వ్యాస ఉద్దేశం.

సహజ, స్వేచ్ఛ, కన్నీటి కెరటాల వెన్నెల, మానవి, గులాబీలు వంటి నవలలను చతుర మాస పత్రికలో రాసిన ఓల్గా జులైనెల చతురలో యశోబుద్ధ అనే మరో నవలనందించారు. ప్రచురణ కర్తలు దీన్ని స్త్రీవాద దృక్కోణంలో సాగిన చారిత్రక నవలగా అభివర్ణించారు. దీన్ని చారిత్రక నవలగా రచయిత్రి భావించారో లేదో తెలియదు కానీ ప్రచురణ కర్తలు మాత్రం చారిత్రక నవల అని అచ్చుగుద్ది చెప్పారు.

తెలుగులో చారిత్రక నవలలు రాయడంలో ప్రసిద్ధి చెందిన శ్రీ నోరి నరసింహ శాస్త్రి గారు చరిత్ర బీజంగా ఉన్నది చారిత్రక నవల అని చెబుతూనే " చారిత్రక నవలాకారులను ఎదుర్కొనే ప్రమాదమొకటి ఉంది. ఇప్పటి తమ ఆదర్శాలూ, భావాలూ పుర్వకాలాల వారికి అన్వయించి చరిత్రను తారుమారుచేయడము. మన కావ్యాదుల వల్ల ఆయా కాలాల సాంఘిక మతాచారాదులు తెలియవస్తున్నవి. వాటిని మాత్రము ఉల్లంఘించకుండా జాగ్రత్తి పడితే చాలును" అన్నారు. చారిత్రక నవలా కారులు తీసుకోవలసిన మొదటి జాగ్రత్తగా దీనిని చెప్పారు శాస్త్రిగారు. మరో ప్రసిద్ధ విమర్శకులు రారా కూడా చారిత్రక నవలకు ఐదు లక్షణాలను చెప్పారు. పై నిర్వచనాలను ఆధారం చేసుకొని పరిశీలిస్తే యశోబుద్ధ చారిత్రక నవల అని చెప్పడం కష్టం.

ఈ నవలలో రచయిత్రి తనను తాను పరిచయం చేసుకుంటూ "నేనేం రాసినా స్త్రీల గురించే! స్త్రీలను బాధితులుగా చూసే దృక్పథాన్ని మార్చి సామాజిక అభివృద్ధిలో వారి పాత్రను గుర్తింపుకు తేవాలని ప్రయత్నిస్తుంటాను" అని చెప్పుకున్నారు. ఈ నవలలో ఆ ప్రయత్నం సఫలం అయింది. రాజకీయ కథలవంటి కథా సంపుటాల ద్వారా స్త్రీల అణచివేత స్వరూపాలను కళ్లకు కట్టినట్లు చెప్పగలిగారు ఓల్గా. ముక్కుపుడక, జడ మొదలైన కథలలో స్త్రీలపై అసంకల్పితంగా పురుషులు నెరపే ఆధిపత్యం అందరికీ తెలిసేలా కథలు రాశారామె. ఈ నవల వాటికన్నా భిన్నమైనది.

బుద్ధుడి జీవితంలో మహాభినిష్క్రమణానికున్న ప్రాధాన్యం అందరికీ తెలిసిందే! అదో ముఖ్యమైన చారిత్రక ఘట్టం. కుటుంబ పరిధులను, పరిమితులను ఒదిలించుకొని విశ్వమానవాళి ఆర్తిని దుఃఖాన్ని పోగొట్టడానికి తగిన మార్గాన్ని అన్వేషిస్తూ రాజకుటుంబంలో పుట్టిన బుద్ధుడు బయలుదేరి వెళ్లాడు. ఆ సమయంలో ఆయనకు భార్య, పిల్లవాడు కంటికి కనిపించలేదు. ఈ ఘట్టాన్ని ఆధారం చేసుకొని తెలుగులో ఎన్నో రచనలు వచ్చాయి. యశోధరా విలాపం వీటిలో ప్రధాన వస్తువు. బుద్ధుడి పునరాగమనం సందర్భంగా యశోధర మానసిక చిత్తవృత్తిని వర్ణించిన రచనలు కూడా ఉన్నాయి. ఇవన్నీ యశోధర బేలతనాన్ని, విరహాన్ని వర్ణించేవే! నాకోసారి చెప్పిపోతే ఏమైంది? నేనేమైనా వద్దంటానా! అని నిష్ఠూరాత్మకంగా మాట్లాడేవే! కానీ ఈ రచన వాటికి పూర్తిగా భిన్నం. ఎలా భిన్నమో చూసే ముందు ఈ కథేమిటో స్థూలంగా తెలుసుకుందాం!

సిద్ధార్థుడు గౌతమి దగ్గర పెరుగుతుంటారు. చిన్నప్పట్నుంచీ వైరాగ్యభావ సంపన్నుడే! కాలముని అనే గురువు దగ్గరకు వెళ్లి వస్తుంటాడు. తండ్రి బలవంతం మీద యుద్ధ విద్యలన్నీ నేర్చుకున్నా, అందరిలోకీ ప్రథముడిగా నిల్చినా అవన్నీ తండ్రి కోసమే! కపిలవస్తుకు సమీపంలో ఉన్న కొలీయ గ్రామానికి చెందిన బింబాననుడు, విశిష్టల కూతురు యశోధర. ఈ రెండు ఊళ్ల మధ్య ఒక గుడి. అక్కడకు సిద్ధార్థుడు రోజూ వెళ్లి ధ్యానం చేసుకుంటుంటాడు. ఓ రోజు యశోధర అదే గుళ్లోకి వెళ్లి సిద్ధార్థుణ్ని చూసి మనసు పారేసుకుంటుంది. వాళ్లిద్దరికీ పెళ్లవుతుంది. బింబాననుడికి యజ్ఞయాగాదులపట్ల విశ్వాసం మెండు. వాటిలో జరిగే జీవహింస గురించి అతడు పట్టించుకోడు. కానీ చిన్నప్పట్నుంచీ యశోధరకు అవంటే గిట్టదు. సిద్ధార్థుడితో వివాహం జరిగిన తరువాత బింబాననుడు తలపెట్టిన యజ్ఞాన్ని ఆపాలని యశోధర ప్రయత్నిస్తుంది. ఈమెను పిచ్చిదానిగా జమకట్టి తిరిగి అత్తగారింటికి పంపిస్తాడు బింబాననుడు. ఆ తర్వాత రాహులుడి జననం, సిద్ధార్థుణ్ని మహాభినిష్క్రమణ చేయమని యశోధర కోరడంతో నవల ముగుస్తుంది.

ఆమె అతడి కోసమే గుడికి వెళ్లింది
కానీ ఎందుకో అతనింకా రాలేదు
విసుగ్గా పూలుకోసి సజ్జలో వేసుకుంది
చాటుగా నిల్చుని ఎదురుచూసింది
కొంతసేపటికి ఆ యువకుడొచ్చాడు
కొత్తవాడనే మొహమాటం లేకుండా
ఊరూ పేరూ అడిగింది
అంతటితో ఆగక సజ్జలో పూలు
అతని దోసిట్లో పోసింది
తన వివరాలన్నీ చెప్పి నవ్వుకుంటూ వెళ్లిపోయింది

ఇది నవలకు ఇంట్రో. ఇంట్రోలోనే యశోధర పాత్ర స్వభావం తెలుస్తోంది. ఆమె సిగ్గరి కాదు. తనకు ఏం కావాలో తెలీని అమాయకురాలు కాదు. భావి జీవితంలో సిద్ధార్థుణ్ని ఆధ్యాత్మిక లోకాల్లోకి నడిపించిన ధీర వనిత. ఇదీ యశోధరను ఓల్గా చిత్రించిన తీరు. ప్రతి మగవాడి విజయం వెనుక ఓ స్త్రీ ఉంటుందనే పాత మాటకు ఉదాహరణ ప్రాయం యశోధర జీవితం.

ఉదాసీనంగా ఉన్న సిద్ధార్థుడి జీవితంలోకి ప్రవేశించిన యశోధర అతనిలో అస్పష్టంగా కదులుతున్న ఆధ్యాత్మిక జీవిత దృక్పథాన్ని తీర్చిదిద్దుతుంది. ఊహాలోకంలో ఉన్న అతని ఆలోచనాసరళిని వాస్తవ జీవితంతో ముడిపెట్టి అసలైన జ్ఞానోదయం కలిగిస్తుంది. ముఖ్యంగా స్త్రీల విషయంలో. అన్నిటికన్నా ముందు స్త్రీలకూ ఆలోచన ఉంటుంది. దాన్ని గౌరవించాలి అనే స్పృహ కలిగిస్తుంది. "స్త్రీలు రకరకాల కోరికలతో సతమతమవుతారని, పురుషులను కట్టిపడవేస్తారని సంసార కూపంలోకి లాగి మరి అందులోనుంచి బైటికి రానివ్వరని కలహ ప్రియులనీ వారికి దూరంగా ఉండటం ఉత్తమమని" కొందరు శ్రమణులు చెప్పగా విని ఊరుకున్నాడు సిద్ధార్థుడు. ఒక సమూహంగా స్త్రీల నట్లా భావించ వచ్చా? అనీ ఆలోచించి వదిలేశాడు. యశోధర పరిచయంతో దానిపై అతనికి పునరాలోచనలు చిగురించాయి.

యశోధర వివాహం సమయంలో స్వయంవరం ఏర్పాటు చేయడం కూడా సిద్ధార్థుడికి ఇష్టం ఉండదు. ఎందుకంటే "యశోధరను గెల్చుకోవడానికి ఆమె రాజ్యం కాదు. భూమి కాదు. నదీజలం కాదు. వస్తువు కాదు. పరస్పర అంగీకారంతో ప్రవేశించవలసిన బంధం"– ఇదే ఆలోచన యశోధర ద్వారా ఆమె తండ్రికి చేరుతుంది. ఇది విన్న వెంటనే ఆమెనో పిచ్చిదానిగా

భావించి ఇలాంటి దానికి స్వయంవరం ప్రకటిస్తే తన పరువు పోతుందని గుట్టు చప్పుడు కాకుండా సిద్ధార్థుడికి ఇచ్చి పెళ్లి చేయడానికి అంగీకరిస్తాడు బింబానసుడు.

యశోధరా సిద్ధార్థుల మధ్య సంభాషణాత్మకంగా సాగిన ఈ నవలలో ఓ దశలో సిద్ధార్థుడు " నీవు నన్నర్థం చేసుకున్నట్లు నేను నిన్నర్థం చేసుకోలేదనిపిస్తోంది" అంటాడు. కానీ సిద్ధార్థుడికన్నా యశోధర ఆలోచనా స్థాయి కాస్త తక్కువే అని రచయిత్రి సూచ్యం చేశారు. " రక్షణ అంటే ఏమిటి? ఎవరి నుంచి రక్షణ? శత్రువుల నుంచా? ఎవరా శత్రువులు? ఎందుకా శత్రుత్వం? మనుషుల మనసుల్లో ద్వేషం, కోపం, శత్రుత్వం ఇతర మనుషులపై ఎందుక కలగాలి? అలా కలిగిన మనుషులను రక్షించాలి గానీ" అని ఓ సందర్భంలో

సిద్ధార్థుడన్న మాటలను అర్థం చేసుకోవడం యశోధరకు కష్టమవుతుంది. ద్వేషంతో ఉన్న మనిషిని రక్షించడం అనే మాట ఆమె ఆలోచనకు అందలేదు. అని రచయిత్రి తన మాటగా చెబుతారు. యశోధరకు ఇదే ఆలోచనాధోరణి కొనసాగిందనడానికి నవలలో సాక్ష్యాలున్నాయి. పుట్టినింటికి వెళ్తానంటే భార్యను అడ్డగించేంత కఠినాత్ముడా నా కుమారుడు అన్న గౌతమి మాటలకు బదులిస్తూ" కరుణ తెలియని వారి పట్ల కఠినంగా ఉండాల్సి వస్తుంది. వారెంత దగ్గరివారైనా సరే!" అంటుంది. దీన్ని బట్టి యశోధర సిద్ధార్థుడి అంత పరిపక్వ దశకు చేరుకోలేదని తెలుస్తుంది. కానీ అతని ఆలోచనా ధోరణి మొత్తం సమాజానికి ఉపయోగ పడేట్లుగా ఉంది కాబట్టి అతనిని తన దగ్గరే కట్టిపడేసుకోవాలనే స్వార్థం మాత్రం ఆమెలో లేదని తెలుస్తుంది.

పైగా సమాజంలో తన ఆలోచనలకు విలువ లేదు కాబట్టి స్త్రీవిషయకమైన తన ఆలోచనలను

సిద్ధార్థుడి ద్వారా వ్యాపింపచేయాలని ఆలోచిస్తుంది. సిద్ధార్థుడికి గురువైన కాలమునికి కు విషయంలో సదభిప్రాయం లేదు. సిద్ధార్థుడింకా పూర్తి ప్రభావం నుండి బయట పడలేదు. అది జరగాలి. "తను కాదు. కాజాలదు. మార్గదర్శి మార్గాన్ని నిరాటంకము, స చేయాలి. అదే తన జీవన సాఫల్యం." ఈ మాటలు దృక్పథాన్ని తెలియజేస్తున్నాయి.

వీటితోపాటు మానవ సంబంధాలలోని పూర్ణత్వం గురించిన చర్చలు అంతరంగ మథనాలు ఈ పుష్కలంగా ఉన్నాయి. తాత్వికాంశాలను ఇష్టపడేవారికి న నచ్చుతుంది.

నవల మొత్తం చదివాక చారిత్రక పాత్రలు ఈ ర జీవిస్తే ఎలా ఉంటుందో ఊహించి రాసినట్లు అనిపిస్తుంది నిజానికి చారిత్రక నవలా లక్షణానికి విరుద్ధం. అయినా య సిద్ధార్థుడు అనే రెండు పాత్రల సహాయంతో తన భావజా పాఠకులకు అందించడంలో రచయిత్రి కృతకృత్యులయ చెప్పవచ్చు.

కాల్పనికమైన ఈ రచనలో యశోధరా సిద్ధార్థుల ఉన్న సాంస్కృతిక పరివర్తన నేటి తరానికై

నా ఉందా! అంటే లేదని నిర్వివాదంగా చెప్పవచ్చు రచయిత్రి ఆశించిన పరివర్తన సంఘంలో రావాలని ఆశిద్దా

# రాయలసీమ దళిత కవిత్వం - విద్య-దళితులకు చైతన్య దీపిక

డా॥ ఆంజనేయులు

1823 వ సంవత్సరంలో భారతదేశంలో విద్యా వ్యాప్తికి గల అవకాశాలను పరిశీలించుటకు ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ దేశమంతటా పరిశోధన చేసి ప్రభుత్వానికి కొన్ని సూచనలు చేసింది. సంస్కృత కళాశాలలు ఎక్కువగా స్థాపించాలన్నది ఈ కమిటీ ఉద్దేశ్యం. వీరి సూచన మేరకు బ్రిటీష్ ప్రభుత్వం అడుగు ముందుకు వేసింది. కానీ రాజారామ్ మోహనరాయలు ఈ సంస్కృత కళాశాలల స్థాపనకు వ్యతిరేకంగా ఉద్యమించాడు. ఈ సంస్కృత వీటి స్థానంలోనే ఇంగ్లీషు భాషా మాధ్యమంను ఆధునిక పద్ధతులలో శాస్త్ర విజ్ఞానం, గణితం మొదలైన విషయాలను బోధించాలని పట్టు బట్టాడు. ఈయన ఉద్యమ ఫలితంగా 1835లో లార్డ్ మెకాలే ఇంగ్లీషు భాషా మాధ్యమంగా ఆధునిక విద్యా విధానాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఆంగ్ల విద్యా సమూపార్జన ఫలితంగా భారతీయులలో భాండను దృష్టి తొలిగి నవకొత్త దృక్పథం జనించింది. క్రైస్తవ పాఠశాలలు, కళాశాలలు ఏర్పాటై కింది కులాల వారికి విద్యా బోధన జరిగింది. అయితే సాంఘిక అసమానతల దృష్ట్యా విద్య కొందరికే పరిమితమైతే జ్యోతిబాఫులే మొదటిసారిగా దళిత బాలబాలికలకు పాఠశాలను స్థాపించి వారిని విద్యావంతులుగా చేయడంలో చేసిన కృషి అనన్య సమాన్యమైనది.

భారతదేశంలోనే రెండవ ఎడారిగా పిలవబడుతున్న ప్రాంతం రాయలసీమ. కర్నూలు, కడప, అనంతపురం చిత్తూరు జిల్లాలను రాయలసీమగా పరిగణిస్తున్నారు. వర్షాభావ ప్రాంతాలుగా, ముఠా కక్షలకు నిలయంగా పేరెన్నికగన్న ఈ ప్రదేశాలు ఆధిపత్యం కోసం నిత్యం రగులుతూనే ఉంటాయి. ఒకప్పుడు రత్నాలు రాశులుగా పోసి వీధులలో అమ్మేవారని ఇక్కడి ప్రాంత ప్రజలు చెబుతున్నా నేడు తాగటానికి కనీసం గ్లాసు నీళ్ళు కూడా దొరకని దుర్భర పరిస్థితి. పాలకులు, ప్రభుత్వాలు, ఎన్ని పథకాలు, నివారణ చర్యలు చేపట్టినా ప్రయోజనం, అంతంత మాత్రమే. వ్యవసాయ దారులు భూస్వాములకు, వడ్డీ వ్యాపారులకు తాము నమ్ముకున్న నేలను, కాడెద్దులను కబేళాలకు పంపుతూ దారదత్తం చేస్తూ జీవనం కొరకు వలసబాట పోతున్నారు. కాస్త ఉన్నవారే బతుకు పోరులో ఇక్కడ నిలబడలేకపోతే కుల పరంగ అస్పృశ్యులుగా ఎండబడి సీదమైన పనులు చేస్తూ ఉన్న దళితుల స్థితి ఇక్కడ ఎంత దయనీయంగా ఉంటుందో మనం ఊహించుకోవచ్చు. ఏ మాత్రం అక్ష పొస్తులులేని హరిజనులు ఒక పక్క కులావమానాలు మరోపక్క ముఠాకక్షల మధ్యలో నలుగుతూ బతకడం కోసం నిరంతరం శ్రమిస్తూనే ఉన్నారు. ప్రభుత్వ పథకాలు కొంత ఊరట నిచ్చినా అసమానతల మూలంగా విద్యా ఉద్యోగాల్లో సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో అట్టడుగునసే ఉంటున్నారు. వీరి జీవితాలలో వెలుగులు నింపటం కోసం సామాజిక వేత్తలు చేస్తున్న కృషి అభినందించదగినది.

రాయలసీమలో కరువు ఉన్నా సాహిత్యానికి మాత్రం ఏ ఢోకా లేదు. ప్రబంధయుగ సాహిత్యం, నవలా సాహిత్యం, గేయ పర కవితా సాహిత్యం పుట్టడానికి ఈ ప్రాంతమే వేదిక అయ్యింది. ఆంధ్రప్రదేశ్‌లో దళిత సాహిత్యం సంఘ సంస్కరణోద్యమంలో మొదటి భాగమై అభ్యుదయ, విప్లవ సాహిత్యాలలో రూపుదిద్దుకుంటూ కారంచేడు చుండూరు, కంచిక చర్ల మొదలైన ప్రాంతాలలో దళితులపై జరుగుతున్న హత్యాకాండలను వ్యతిరేకిస్తూ ఉధృతంగా ముందుకు వచ్చింది. చిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట, దళితమేనిఫెస్టో, వంటి సంకలనాలతో దళితుల ఆత్మగౌరవం ప్రతీకార, తిరుగుబాటు ధోరణిని ప్రకటిస్తూ రాజ్యాధికారం వైపు దళితులను మళ్లించటం ప్రధానధ్యేయంగా ముందుకు సాగింది. అదే కోవలోనే రాయలసీమ ప్రాంతాలలో కూడా దళిత కవిత్వం మొదట తిరుగుబాటు ప్రతీకార స్వభావంతోనే ప్రారంభమైనది. కొలకలూరి ఇనాక్, రుయు విజయుడు, చిక్కి కృష్ణ, ఇంద్రవెల్లి రమేష్, నాగప్పగారి సుందర్‌రాజు మొదలైన కవుల రచనల్లో ఈ ధోరణి మనకు కనబడుతుంది. వీరి కవితల్లో దళితుల విద్యా విధానానికి వీరు, చూపిన మార్గదర్శకాలను తెలపటమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

'యింకా లేవకుంటే' అనే కవితలో కవి (రమేష్) దళిత విద్యార్థుల సమస్యలను కవిత్వీకరించాడు. పిల్లలకు చదువుకొనేటప్పుడు ఉపకారవేతనం వస్తుంది. హాస్టల్లో వార్డెన్ మంచివాడైతే సరి, లేదంటే పిల్లలు సమస్యలను ఎదుర్కోవాలసి వస్తుంది. రోగిని పరీక్షించే డాక్టరు జాతి గలవాడైతే ఉదారంగా చూస్తాడు. లేదంటే డబ్బు తీసుకొని పరీక్షచేస్తాడు. వ్యాధి

ముదిరినదైతే, పేదవారైతే ఎక్కువ డబ్బులు చెల్లించుకోవలసి ఉంటుంది. అలా ఇవ్వలేనివాళ్లు, ప్రైవేటు హాస్పిటల్లో చూపించుకోలేనివాళ్లు గవర్నమెంట్ హాస్పిటల్‌కు పోవలసి ఉంటుంది. అక్కడ కొంత అనుకూలమైన సౌకర్యాలు ఉన్నప్పటికీ ఎక్కువ బాధ్యతను తీసుకొనే వారు తక్కువగా ఉంటారు. అలా గవర్నమెంట్ హాస్టల్లోకూడా ముదిరిన వ్యాధుల వలె ఉంటాయట వసతులు. రోగికి చికిత్స సమయంలో నొప్పికలగకుండా ఉండేందుకు ఒక మత్తు ఇంజక్షన్ ఇస్తారు. మరి ఇక్కడ వేయబోయే మందు జనాల్ని లేపడమేనట. ఇదే చెబుతున్నాడు కవి -

" మనం వొక రిజర్వేషన్
మనం వొక గవర్నమెంట్ హాస్టల్
మనం వొక స్కాలర్‌షిప్
లోపల ముదిరే రోగం తెలియకుండా
బయట నొప్పి కలగకుండా ఒక మత్తు
ఇది వైద్యం కాదు
ఇవి మందులసలే కావు, వొట్టి మత్తు
లేపండి ! లేపండి ! మన పిల్లకాయల్ని"

ఇలా మత్తునుండి విడివడి వాస్తవ జగత్తునకు దళిత విద్యార్థులు రావాలంటాడు. తానే చెప్పినట్లు చూపులు గుచ్చుతూ వుంటాయంటాడు. ఏకళ్ళు వాటిని తెగించి చూడలేవు. మనల్ని పాతాళానికి తొక్కేసిన ఆ బ్రాహ్మణ కాళ్లను మన పిల్లలకు గుర్తుచేసి మన పిల్లల్ని చైతన్యవంతుల్ని చెయ్యండి అంటూ హరిజన తల్లిదండ్రులకు చెబుతున్నాడు. సాగరాలు అనేకమైన నీళ్లు ఒక్కటే. నదీజలాలు ఎన్ని ఉన్నా తీపి తరగదు. అట్లే దళితులు ఎక్కడున్నా, ఏరకమైన జీవితం గడుపుతున్నా సామాజికమైన అణచివేతకు గురయ్యే వాతావరణాన్ని పసిగట్టి ఉత్తేజితులు కావాలి.

తిండిగింజలు పండించేది, బావులు తవ్వేది, పాచిపనులు చేసేది దళితులే అయినా, పంక్తి భోజనానికి, నీళ్లు తాగడానికి, అగ్రకులస్థుల సమీపాన ఉండటానికి నోచుకోలేదు. ఎక్కడ చూసినా అసమానమే కనిపిస్తుందంటాడు హరేరామమూర్తి. అసలు మానవ సంఘంలో అన్ని విజయాల వెనుక దళితులే ఉన్నారు. ఇది చరిత్ర చెబుతన్న సత్యం. అవకాశమే వస్తే ఆకాశం వరకు పెరిగే సామర్థ్యం దళితులలో ఉందంటూ

"తిండిగింజ పండించేను – పంక్తికేమొ పనికిరాను
నేను తవ్విన బావిలో – నీళ్లుతాగనోచుకోను
శుచి శుభ్రత కోరు మీ పాచిపనుల జేసెను
కులము హెచ్చుతగ్గనుచు మీలాగ కులకనులే
రంగు జూసి నవ్వేరా – రీతి పరిహసించేరా
సంఘములో మేములేక – మరిమీరే మనగలరా
'అ, ఆ' లతో మొదలు పెట్టి – అసమానతలు తుంచగ అవకాశము నిచ్చెనగా ఆకాశము తాకవచ్చు"

అని కవి దళితుల తరపున అంటున్నాడు. ఇది సిలబస్ పాఠశాలల్లో చదివిన విద్య పుస్తకాల వరకే. అయితే జీవిత విద్య ఆకాశం దాకా పెరగవచ్చు. ఈ అస్పృశ్యత దురాచారం చిరకాలం సాగి వస్తుందంటాడు. నేటి రైతులకు కూడా నిజమైన స్ఫూర్తి ప్రదాత దళితుడే అన్నది గుర్తు పెట్టుకోవాలి.

ఇంద్రవెల్లి రమేష్ రచించిన 'పాఠక మహాశయులారా' కవిత అధిక్షేపకవితగా కనిపిస్తుంది. ఛాందసవాదుల్ని ఈ కవి పరిహసించాడు. ఏ ఎండకు ఆ గొడుకు పట్టి పబ్బం గడుపుకొనే అవకాశ వాదుల్ని ఇతడు అధిక్షేపించాడు. యూనివర్శిటీల్ని ఈకవి ఈ కవితలో చెత్తకుండీలతో పోల్చాడు.

"పూర్వము
కాదు ప్రస్తుతము కూడా
యూనివర్సిటీలు అనబడు చెత్తకుండీలుండెను
వాటికి అజీర్తిచేసెను
ఆ అజీర్తి నుండి సందులు, గొందులు ఏర్పడెను
అందుండి
రచయితలు, మేధావులు అనబడు సంతానము
జనించెను వారు పుస్తకములు తిని, పుస్తకములు
ఏరిగిరి ఆ మల పదార్థమలు రచనలనియు,
సిద్ధాంతములనియు ప్రఖ్యాతిగాంచెను
అందుండి ఘోరమైన దుర్వాసనములు వెలువడెను"

యూనివర్సిటీలకు అజీర్తిచేసి సందులు, గొందులు, రచయితలు, మేధావులు ఇలాంటివన్నీ ఒకదాని వెంట వొకటి ఏర్పడినట్లు చెబుతున్నాడు. రచయితలు, మేధావుల పని పుస్తకాలు రాయడం, చదవడం, కాని, ఆచరణ మాత్రం శూన్యం. చెప్పేదొకటి, చేసేదొకటి. వాళ్లు విసర్జించినవి కూడా పుస్తకాలే. అవి మహా దుర్వాసన గలవి. అంటే జిడ్డు భావాన్ని చెప్పారన్న మాట. ఆచరణలో మంచి సిద్ధాంతాలు ప్రతిబింబించని గొంగమనుషులను రచయిత చక్కగా అధిక్షేపించాడు.

కొందరు పండితులు పుస్తకాల్ని రంగు రంగుల పువ్వులుగా పోలుస్తారు. అవి భావదీప్త్యా ప్రపంచమంతా వ్యాపిస్తాయంటారు. ముఖ్యంగా పుస్తకాలకు రెక్కలొచ్చి సీతాకోక చిలుకల్లా ఎగిరిపోయి పల్లెపదాల పచ్చని చేలల్లో వాలిపోతే ఎంతో బాగుంటుందంటాడు. 'పుస్తకాలకు రెక్కలొస్తే' అనే కవితలో రచయిత బక్కికృష్ణ. విలువైన గ్రంథాలు దళితులకు అందకుండా ఉన్నాయి. గ్రంథం అంటే అంతా వ్యాపించాలి. అందరికీ అందుబాటులో ఉండాలి. గ్రంథాలకే పరిమితం

కాదు. నిరక్షరాస్యత అనేది చీకటి వంటిది. అటువంటి గ్రంథాల్ని దళితులకు అందకుండా గ్రంథాలయాల్లో మాత్రమే భద్రపరచడం జ్ఞానాన్ని బంధించవ చేయడవే... గ్రంథాలయాలలోకి దళితుల్ని రానివ్వకపోవడం, పుస్తకాలను గ్రంథాలయాలకే పరిమితం చేయడంను గూర్చి "..... నిర్వాహకులకి మాలవాళ్లుకూడా పుస్తకాలడుగుతారేమోనని భయం పుట్టింది. క్రమంగా బూజుపట్టి శిథిల మయింది." [65] అంటూ మహీధర రామమోహన రావుగారు అభిప్రాయ పడ్డారు. మట్టి మనుషుల జీవననాదం అంతా గ్రంథంలో వుంటుందంటాడు బిక్కికృష్ణ.

"తరతరాలుగా అక్షర పూజకు నోచుకోని దళితులకు
గ్రంథాలయ, దేవాలయ ప్రవేశం కల్పించండి
మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి
వెట్టిచాకిరీ చేస్తున్న చిన్నారులు
రంగు రంగుల పుస్తకాల రంగుటద్దాల్లో
తమ భవిష్యత్తును చూసుకోనివ్వండి"

ఇన్నేళ్లు అక్షరాలు తెలియకనే హరిజనుల కళ్లల్లో అశ్రువర్షం కురిసింది. దళితుల బ్రతుకులు అగ్నినీడలై మ్రోగాయి. అందుకే అక్షర పూజకు నోచుకోని దళితులకు గ్రంథాలయ, దేవాలయ ప్రవేశం కల్పించమంటున్నాడు కవి. మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి వెట్టిచాకిరి చేస్తున్న చిన్నారులకు కూడా చక్కటి భవిష్యత్తును మలచుకోవడానికి అవకాశం ఇవ్వాలంటున్నాడు. ఆ మధ్య దేవాలయ ప్రవేశ యోగ్యత దళితులకుండేది కాదు. గ్రంథాలయం కూడా దేవాలయం వంటిదే. అందరికీ ప్రవేశముండాలి. ముఖ్యంగా దళితుల కుండాలి. అప్పుడే గ్రంథాల్లోని జ్ఞానాంశాల్ని దళితులు గ్రహిస్తారు. జీవితాన్ని చక్కదిద్దుకుంటారు. పుస్తకాలకు రెక్కలు రావటం అంటే ప్రపంచ మంతా వ్యాపించడమే అని అర్థం.

ఒకప్పుడు నాగప్పగారి సుందర్‌రాజు కేంద్రీయ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసే రోజున ఎం.ఫిల్. చేయాలని ప్రయత్నిస్తే అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు పరిశోధనకు పనికి రావడంతో సుందర్‌రాజు పట్టుపట్టి ఎం.ఫిల్ పూర్తిచేయడం అతని కవితలో కనిపిస్తుంది. పనికిరాడు అనబడిన వ్యక్తి ధృవీకరించుకోగలిగాడు. ఈ ఘట్టం కేంద్రీయ విశ్వవిద్యాలయానికే అన్వయింపక అన్ని విశ్వవిద్యాలయాలకు అన్వయించాలి. అప్పుడే విద్యార్థుల్లో పట్టుదల పెరుగుతుంది. చదువుకొంటారు. పరిశోధనా చేస్తారు. ఉత్తమ సిద్ధాంత గ్రంథాలు రాస్తారు. విద్యారంగంలో ప్రభుత్వం ఎన్నో పథకాల్ని, ప్రణాళికల్ని ఏర్పాటుచేసి దళిత విద్యార్థుల్ని ప్రోత్సహిస్తుంది. ఈ అవకాశాలను వీళ్లు సద్వినియోగం చేసుకోవాలి. ఇలా సద్వినియోగం చేసుకోవాలంటే పరిశోధనలో పర్యవేక్షణకుని మార్గదర్శకత్వం ఉండాలి. చాలా చోట్ల ఇలా జరగడం లేదు. కనుక అపుడప్పుడు ఇలా నిర్దేశక సూత్రాన్ని గుర్తుచేస్తూ, పద్ధతి ప్రకారంగా సీట్లు పొందే మార్గదర్శకత్వం లభించినా, లభించకపోయినా సొంతంగా కూడా ఉత్తమ సిద్ధాంత గ్రంథాలను రాసి విశ్వవిద్యాలయాలకు సమర్పించిన వాళు ్లన్నారు. వారికి కూడా ఎం.ఫిల్., పి.హెచ్.డిలు యూనివర్సిటీలు ప్రధానం చేశాయి. కాబట్టి ఆచార్యుల ప్రోత్సాహం పరిశోధన విద్యార్థులకు చాలా అవసరం. అంతేకాక మార్గదర్శకత్వం కూడా కావాలి. గురు శిష్యుల మధ్య విషయ చర్చ జరగాలి. అదికూడా నిష్పక్షపాతంగా జరగాలి. చక్కటి విశ్లేషణాత్మకమైన ఆలోచనా విధానం ఏర్పడాలి. ఇలా ఉంటేనే పరిశోధనలు పూర్తవుతాయి.

"పరిశోధనకు అయోగ్యుడివంటే
ఎం.ఫిల్ పూర్తిచేసి చూపించా"

నంటాడు కవి. రచయిత కర్నూలు జిల్లాలోని మొలగవల్లి గ్రామ నివాసి. ప్రాథమిక, ఉన్నత విద్య సమీప ప్రాంతాల్లో పూర్తి చేసుకొని ఆ తర్వాత పరిశోధన కోసం కేంద్రీయ విశ్వవిద్యాలయంలో చేరేటప్పుడు ఏర్పడిన ఆటంకాలను ఇతడు అధికమించాడు. పరిశోధన చేశాడు. పనికి వచ్చేవాడినని నిరూపించుకున్నాడు. అలా పర్యవేక్షకుల మార్గదర్శకత్వం లేకుండా కూడా స్వయంగా సిద్ధాంత వ్యాసాలు తయారు చేసుకొని సమర్పించి డ్గిరీలు పొందిన వాళ్లు ఉన్నారు. అంతేకాని గురువు గార్లకు అణగిమణగి ఉండనక్కరలేదు. ఇచ్చు గౌరవం ఇవ్వాలి. చేసే పరిశోధన చేయాలి. అనవసరంగా నిరుత్సాహ పరిస్తే అధికమించి తమ ప్రతిభను నిరూపించుకోవాలి. వక్తిగతంగాకూడా సిద్ధాంతగ్రంథ సమర్పణ చేయాలి. పరిశోధనా పట్టాల్ని స్వీకరించి సమాజంలో చక్కటి ప్రతి పత్తిని పొందాలి. ఈ సంఘటనకు వేదిక తెలంగాణా రచయిత కర్నూలు జిల్లా నివాసి. ఆటంకాల్ని విస్లేషణ చేసి చూస్తే అన్ని ప్రభుత్వ సంస్థలకు ఈ కవిత వర్తిస్తుంది. వ్యక్తిగతంగా సిద్ధాంత గ్రంథాల్ని సమర్పించుకొని డిగ్రీలు పొందడమే దాదాపు చివరి పరిష్కారం. అన్ని ప్రయత్నాలు విఫలం కాగా సఫలమయ్యే ఈ ప్రయత్నాన్ని పాటించి హరిజన విద్యార్థినీ విద్యార్థులు తమ జీవితాలను మెరుగుపరుచుకోవాలి. ఈ సంఘటన రచయితకు జరిగింది. అలాగే దళిత సాహిత్యంపై పరిశోధన చేయదలచిన దళిత విద్యార్థులు అందరికీ 1995-96వ సంవత్సరానికి గాను ఎం.ఫిల్. అడ్మిషన్ లేకుండా చేసిన హైదరబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం నిరంకుశత్వాన్ని నిరశిస్తూ 'డప్పు కొట్టిన చేత్తో డొక్క చీలుస్తా' అనే శీర్షికన నాగప్పగారి సుందర్ రాజు రాశారు. 'మా అక్షరం' అనే కవితను వ్యంగ్యాత్మకంగా రచించాడు

ఓబిలేసు. ' మా అక్షరం' అనగా మాదిగలకు అక్షరాస్యత కావాలి అని అర్థం. అంతవరకూ అనగా సంపూర్ణ అక్షరాస్యత సిద్ధించే వరకు 'మా' పోరాటం అనగా మాదిగల పోరాటం ఆగదంటాడు.

విద్య ఉంటే ఉద్యోగం వస్తుంది. ఉద్యోగాల్లో కూడా రిజర్వేషన్లుండాలి. అప్పుడు అగ్రవర్ణస్థులతో పాటు మాదిగలు కూడా సుఖజీవితం గడుపుతారు. వారితో సమానంగా ఉంటారు. మరి అక్షరాస్యత లేకుంటే అనగా విద్యలేకుంటే ఉద్యోగాలు రావు, వచ్చినా చిన్న చిన్న ఉద్యోగాలు బంట్రోతులాంటి ఉద్యోగాలొస్తాయి. అలాంటివి వస్తే మళ్లీ అధికారుల దగ్గర వెట్టిచాకిరి తప్పదు. విద్య అంటే ఉన్నత విద్య అని ఇక్కడ అర్థం. ఉన్నత విద్యవల్ల ఉన్నతోద్యోగం వస్తుంది. సమాజం ఎలా ఉంది. ఎటుపోతూంది అనే విషయాలు తెలుస్తాయి. జీవితాలు చక్కదిద్దుకోవచ్చు. అందరితో పాటు దళితులకు కూడా విచక్షణ పెరుగుతుంది. అందుచేత సంపూర్ణ అక్షరాస్యత కావాలంటాడు. కవి.

నిరక్షరాస్యత పెద్ద సమస్య. విద్యలేని కారణంగా దళితులు అజ్ఞానంలో ఉంటారు. సంపూర్ణ అక్షరాస్యత సాధించాలంటే హరిజనులకు అన్ని రకాల సౌకర్యాలు కలుగజేయాలి. ఆ తరువాత విద్యకు తగ్గ ఉద్యోగాలు రావాలి. అప్పుడే ఆర్థిక సమానత్వం సాధ్యమౌతుంది. అంటరాని వాళ్లకు అక్షరవంతులుగా చేసినప్పుడే సమాజం బాగుపడుతుంది. అంతవరకూ అనగా సంపూర్ణ అక్షరాస్యత సిద్ధించేవరకు దళితులు ఏదో విధంగా పోరాడుతూనే ఉంటారనే విషయాన్ని ఇలా చెబుతున్నాడు.

"మాకు అక్షరం
రానంత వరకూ
మా పోరాటం ఆగదు"

విద్య అందరి హక్కు. అలాగే దళితులకు కూడా విద్య నేర్చుకునే హక్కు ఉంది. మంగిపూడి వేంకట శర్మ–

"అన్ని జాతులకు విద్యాదానము చేసి
జ్ఞాన సంపద బెంప బూనరయ్య !

అని హితవు పలికాడు. పైన కవి అక్షరం రానంతవరకు దళితులు పోరాటం చేయాలంటాడు. దానికన్నా ముందు కోరుకున్న కవుల సందేశాలను పాటించటం లేదు కనుకనే ఓబిలేసుకవి పోరాటం చేయమంటున్నాడు. అలాగే విద్య నేర్చుకోవడానికి తగిన ఉపాధి సౌకర్యాలు కల్పించాలంటున్నాడు. అలా చేయని పక్షంలో అక్షరాస్యత ఉద్దేశం నెరవేరుటకు పోరాటం తప్పదని హెచ్చరిస్తున్నాడు.

ప్రభుత్వం చేసే పథకాలన్నీ దళితులకు అందకుండా పోతున్నాయి. హరిజనులు ఈ పవిత్ర భారతదేశంలో ముఖ్యంగా ఊరిచివరతప్పొ ఎక్కడ ఉండాలన్నా సాధ్యం కావటం లేదు. చదువుకోవడానికి పట్నాలకు వస్తారు. అద్దెగదులు సాధారణంగా కింది కులస్థులకు ఇవ్వబడవు. ఒకవేళ ఇచ్చినా యజమానులు చాలా అసహ్యంగా చూస్తారు. ప్రతినెలకు అద్దె పెంచుతారు. అలాగే అవమానాలని బిక్కికృష్ణ, 'ఎక్కుపెట్టిన విల్లు' అనే కవితలో ఇలా తెలియజేస్తున్నాడు.

"నేను యూనివర్సిటీ మెట్లెక్కినప్పుడే తెలిసొచ్చింది
అక్కడ కులం వేయి పూలుగా వికసిస్తోందని
ఉద్యోగంలో చేరాక నాకర్థమైంది.
అక్కడ వారి దృష్టిలో నేనో పేదపురుగునని
అద్దె కొంపకోసం వీధివీధి గాలించినపుడే నాకర్థమైంది
నాదేశం జెండా సాక్షిగా నేనింకా అంటరాని వాణ్ణేనని
కొలాయి దగ్గర నా భార్య అవమానింపబడ్డప్పుడు
బాగా అర్థమైంది
ఈ దేశం సాక్షిగా మేమింకా అస్పృశ్యులమే నని"

అందుచేత ఇందుకు కారకులైన వారి మీద విల్లు ఎక్కుపెడుతున్నానంటాడు. చుండూరు, పాదిరి కుప్పం, కారంచేడు, నీరుకొండ వంటిచోట్ల దళితులపై దాడిచేసి అగ్రకులస్థులు ఘోరంగా చంపినపుడు నాకు పరిష్కార మార్గం దొరికిందొక్కటే అదే విల్లు ఎక్కుపెట్టడం. అంటే ఉద్యమించడం. రిజర్వేషన్ సౌకర్యాలు ఓట్ల రాజకీయాలు ఇవేవి దళితుల జీవితాలను బాగుపరచడం లేదు. అందుచేత ఉద్యమించాలి.

"అక్షరాలు దళితులకు అందని ద్రాక్షా ఫలాలు
దండ కారణ్యపు కొమ్మల్లో పూచిన అగ్నిపూలు
మృత వీరుల రక్తంతో తడిసిన బర్నింగ్ రోజాలు"

ఎన్నో సమస్యలకు అక్షరాలే పరిష్కారాలను చూపుతాయి. అనగా సమస్యను విద్యద్వారా పరిష్కరించుకోవచ్చు. కనుక సంపూర్ణమైన అక్షరాస్యత దళితులకు సిద్ధించాలన్నది కవి అభిప్రాయం. ఇక్కడ కవి మాటలు తిలక్ కవిత్వాన్ని గుర్తుకు తెస్తున్నాయి. తిలక్ "నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు" అన్నాడు. ఇది శృంగార భావాలకు సంకేతం. దళితులకు అక్షరాలు అవసరం. అవి అందని ద్రాక్ష ఫలాల్లాగా అందకుండా ఉన్నాయి. అంటే దళితులకు విద్య అందకుండా ఉందన్నమాట. మరి సంపూర్ణ అక్షరాస్యత సిద్ధించేదెప్పుడు?

దళితులు వేకువపిట్టల వంటివారు. కనుక వాళ్లను సమాజం ఎదగనివ్వాలి. మనుధర్మ వ్యాఖ్యల్ని పాటించకూడదు. దళితుల తలలపై అక్షరాలే నాటాలంటాడు కవి. అంటే ఆలోచింపజేయాలి. మెదడుపని అదే. ఆలోచించే లక్షణం దళితులకు కూడా కావాలి. అది రావాలంటే అక్షరాస్యత సిద్ధించాలి.

అనాదిగా దళితులు భూస్వామ్యవర్గం చేత పలు విధాల దాడులకు గురౌతున్నారు. హరిజనులు నిరంతర కష్టజీవులు. భూస్వాముల పొలాల్లో పొద్దుట్నుంచి సాయంకాలం దాకా విరామమెరుగని పనిచేస్తారు. బాగా అలసి పోతారు. అలా తరతరాలుగా ఒక వర్గంచేత అణచివేతకు గురై వారు వెలుతురు చూడలేని గబ్బిలాలుగా ఈ 'ప్రతిఘటన' కవితలో ఇనాక్ వర్ణించాడు. తరతరాలుగా దళితులు కష్టనికృష్ణ జీవులు, బానిసలు, పాలేర్లు, ఆర్థిక పుష్టిలేని కారణంగా అగ్రవర్ణస్థులతో సమానంగా ఉండలేరు. అందుచే రెడ్లు, బాపలు, కమ్మలు, బలిజ, కులస్థులు వీళ్లను తాకరు. కనుక వీళ్లు అంటరాని వారుగా ముద్రవేయబడినారు. వీళ్లనుగూర్చి ఇనాక్ ఇలా అంటున్నాడు.

" గుడికి, బడికి, మాన్యానికి దూరంగా
బుద్ధికి శుద్ధికి విద్యకు వివేకానికి ఎడంగా
కాలం గాలైతోలి విసిరేసిన
పులిస్తరాకులా బహిష్కరించింది"

సమాజం దళజతుల్ని బహిష్కరించింది. బడిలో అందరి విద్యార్థులతో పాటు వీళ్లు కూర్చోరాదు. ఇక గుడిలో పలికి ప్రవేశించరాదు. ఇలా విద్యకు, గుడికి దూరమై జీవించే నికృష్టజీవనం వీరిది. అందుకే భూస్వాముల ఇండ్లలో ఊడిగం చేస్తుంటారు. వెలివేతకు కారణం ఒకటే ఊళ్లో ఉండరాదు. ఊరికి దూరంగా ఉండాలి. ఊర్లో పందులు, గాడిదలు తిరగవచ్చు. కుక్కలు సరేసరి. ఇద దళితులు ఏ విధంగా సంస్కారవంతులవుతారు. వాళ్ళు హక్కులేమి కావాలి? అప్పుడప్పుడు ఇలాంటి హక్కులను గూర్చి అడిగితే అమాంతం సవర్ణుల దాడులు భయంకరంగా వుంటాయి. అంతేకాక దళిత మహిళల్ని మానభంగాలు కూడా చేస్తారు. ఇప్పుడిప్పుడే దళితుల్లో చైతన్యవంతమైన విజయపరంపలు కనిపిస్తున్నాయి. తమ హక్కులేమిటో తెలుసుకుంటున్నారు. ఇలా పోరాట మార్గం ద్వారా దళితులు తమ గమ్యాన్ని చేరవలసి ఉంటుంది. ఇక కోర్టులు, పోలీసు నిలయాలు ఇవన్నీ వ్యర్థమే. ఎవరికో ఒక ప్రక్క తమ మద్దతును ప్రకటిస్తాయి. అంతేకాని దళితులకు న్యాయం జరిగేదేముంది. నిన్న మొన్నటిదాకా అగ్రకులస్థుల దాడులు భరించలేక తలవొంచారు.

'కులం – ధనం' అనే కవితలో ఇనాక్ హరిజనుల కడగండ్లను చెప్పాడు. కులంలేకుంటే లేకపోవచ్చు. ధనముంటే చాలు అంటున్నాడు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణవ్యవస్థ కిరీటంలో బ్రాహ్మణకులం తలమానికం వంటిది. దళితుల్ని చదువుకోకుండా చేసింది బ్రాహ్మణులే. ఒకవేళ పంచములకు కూడా చదువువస్తే బ్రాహ్మణులనే స్తుతించే సాహిత్యం వర్ధిల్లుతుందట.

"చదువు రాకుండా చేస్తే తన పని పదిలం
ఒకవేళ వస్తే తననే స్తుతించే సాహిత్యం సంసిద్ధం"

బ్రాహ్మణ మనువు స్మృతిని ప్రసాదించినా, అబ్రాహ్మణ కృష్ణుడు గీత తెలిపినా గీత కథలుగా, జాతి కథలుగా, జీవిత గాథలుగా సంస్కృత సాహిత్యం వర్ధిల్లింది అంటాడు ఇనాక్. ఆ కాగితాలన్నీ పదిలంగా పొందుపరచబడ్డాయి.

ఇలా రాయలసీమ దళిత కవిత్వంలో దళితుల విద్య గురించి కవులు పొందుపరిచిన విషయాలను గమనించవచ్చు. దళితుల అభ్యున్నతికి విద్య ఒక్కటే సరైన మార్గం. ఇంతకాలం విద్య ఒక్కటే సరైన మార్గం. ఇంతకాలం విద్యకు, వినోదానికి దూరమైన దళితులు వీటిని పొందాలంటే సరైన మార్గం విద్యే. అన్ని సమస్యలకు పరిష్కారం చదువే.

# నేటి ఉపాధ్యాయులు - విభిన్న ధోరణులు

డా॥ డి.మస్తాన
పోస్ట్ డాక్టరల్ ఫెలో (యుజిసి)
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి
సెల్ :9948016904

పూర్వం శిష్యులు విద్యను గురుముఖతః నేర్చుకునేవారు. గురువులు ఆనాడు ఆశ్రమాల్లో ఉండేవారు. వారి వద్దకు శిష్యులు వెళ్లి అన్నీ విద్యలు నేర్చుకొని వస్తుండేవారు. అలా విద్యలన్నీ నేర్చుకున్న పిదప గురువుకు గురుదక్షిణ సమర్పించి, ఆశీసులు తీసుకుని వస్తుండేవారు. ఆ రోజుల్లో గురువంటే భయం, భక్తి, గౌరవం ఉండేవి. వారు గురువును త్రిమూర్తి స్వరూపుడిగా చూసుకునేవారు. ఆ రోజుల్లో సమాజంలో గురువుకు ఎంతో ఆదరాభిమానాలు ఉండేవి. కాలక్రమంలో అవి పూర్తిగా మారిపోసాగాయి. బతకలేనివాడు బడి పంతులు అనే స్థాయికి పరిస్థితి దిగజారింది. అయితే నేడు ఈ సూక్తిని తిరగజెపుతున్నారు. బతక నేర్చిన వాడు బడిపంతులు అంటున్నారు. గతంతో పోల్చి చూస్తే నేటి గురువుల ఆర్థిక స్థితిగతులు చాలా మెరుగ్గా ఉన్నాయని చెప్పక తప్పదు. ఆనాడు గురువులు పరిపూర్ణంగా నిస్వార్థపరులు. నేడు కూడా అలాంటి వారు కొందరున్నారు.

ప్రాచీన కవులు వేదాలు పురాణాలు కావ్యాలు ప్రబంధాది గ్రంథాల్లో గురువును ఘనంగా శ్లాఘించారు. అయితే ఆధునిక కాలంలో గురువులు ఆ స్థాయిని అందుకోలేక పోతున్నారు. దీనికి ప్రధాన కారణం గురు శిష్యుల మధ్య ఆత్మీయత కొరవడడమేనవచ్చు. నేడు చదువు పూర్తి కాగానే గురువులను మరచిపోతున్నారు. గురువులు కూడా శిష్యులను మరచిపోతున్నారు. నేడు గురు శిష్యుల మధ్య బంధం వ్యాపారి-వినియోగదారుడు మధ్యగా బంధం వలే ఉంది. ఆదర్శ సమాజానికి ఇది ఆటంకమవుతుందని చెప్పవచ్చు. నేడు విద్య ప్రైవేటీకరణ దిశగా వడివడిగా అడుగులు వేస్తున్నది. సరిగ్గా ఈ క్రమంలోనే ఉపాధ్యాయుడు-విద్యార్థి మధ్య అంతరం పెరగడం జరుగుతున్నది. ఈ అంశాలన్నింటిని ఆధునిక కథకులు తమ కథల్లో చిత్రించారు. గురువుల గుణగణాల విషయంలో ప్రాచీన కవుల చిత్రణకు నేటి ఆధునిక కథకుల చిత్రణకు ఎంతో వ్యత్యాసం కనబడుతుంది. నాటి గురువులకు విద్యాబోధన ఒక్కటే లక్ష్యం. నేటి గురువుల వ్యాపకాలు విభిన్నంగా ఉన్నాయి.

**1. ఉపాధ్యాయులు-ఆర్థిక సమస్యలు:** అర కొర జీతాలతో అధ్యాపకత్వం సాగించే వినాయక్ ఎలాంటి సమస్యలు ఎదుర్కొంటాడో ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు 'అస్పృశ్య గంగ' కథలో ఇలా తెలిపారు.

"వాళ్ల జీతాలు అంతంత మాత్రం. భార్యా భర్తలిద్దరికి ముసలి తల్లిదండ్రులున్నారు. వాళ్ళూ పేదవాళ్లు. పల్లెల్లోనే ఉన్నారు. వాళ్లకూ ఎంతో కొంత పంపాలి. వాళ్లు చదువులేని వాళ్లు. వారికి ఆస్తి పాస్తులు లేవు. పిల్లల్నీ సంపదగా పెంచుకున్నారు. వాళ్ల మీదే ఆధారపడ్డారు. వాళ్లు పల్లెలు వదల్లేరు, పట్నం రాలేరు. వచ్చి ఉండలేరు. కలోగంజో పల్లెలోనే చాలంటారు. ఖర్చు తప్పదు. వాళ్ళకు పంపగా మిగిలింది ఇంటికి సరిపోతుంది.

నలుగురు పిల్లలు ఎక్కొస్తున్నారు. వాళ్ల చదువులకు డబ్బు ఖర్చు పెరుగుతూ ఉంది. వాళ్లు పెరుగుతున్నారు. తిండి, బట్టలు, చదువు ఖర్చు పెరుగుతూ ఉంది. కాలం గడిచేకొద్దీ డబ్బు అవస్థగా ఉంది. దానికి తోడు ఇల్లు కట్టుకోవడం, దాని ఖర్చు తెచ్చిన అప్పు, నెలనెల వడ్డీ. మొత్తం మీద డబ్బు కటకటగా ఉంది. ఆ పరిస్థితుల్లో బావి తవ్వించుకోవలసి వచ్చింది. ఖర్చు మీద ఖర్చు. బావిలో బండ పడింది. (కొలకలూరి ఇనాక్ కథలు -పు 39) అంటాడు కథకుడు. ఒకప్పుడు ఉపాధ్యాయులకు తక్కువ వేతనాలుండేవి. కుటుంబాన్ని పోషించడానికి వారు ఎంతో ఆవేదన చెందుతుండేవారు. అయితే 2006 పిఆర్సీలో ఉపాధ్యాయులకు వేతనాలు భారీగా పెరిగాయి. దాంతో లక్షలాది మంది ఉపాధ్యాయులు లబ్ది పొందారు. అయినా కొందరు ఉపాధ్యాయులు పెడ ధోరణుల్లో నడుస్తున్నారు.

**2. నిబద్ధత గల ఉపాధ్యాయులు :**

శ్రీపతి తన కథల్లో ఎక్కువగా ఉపాధ్యాయ వృత్తిని గూర్చి ప్రస్తావించాడు. మారుమూల ఏజన్సీ ప్రాంతానికి చెందిన గూడెం ప్రజలు ఉపాధ్యాయున్ని వేటకు తీసికెళతారు. ఉపాధ్యాయుడు అక్కడ అడవంతా కలియ తిరుగుతాడు. సందర్భంలో ఇలా ఆలోచిస్తాడు.

"వేసవి సెలవులు మొదలయ్యాయి. శిరోమణి చెల్లెలు సుజాత పెళ్లి మా ఊర్లో ఈ మే నెల రెండవ వారంలో ఉంది. ఈ వేసవి సెలవులకి డూన్ నుంచి రామారావు, శ్రీనగర్ నుంచి గురుమూర్తి, ఝాన్సీ నుంచి కృష్ణన్నయ్య, బాంబే నుంచి వెంకటరత్నం వస్తారని ఊరు వెళ్లే హడావుడిలో పరీక్ష పేపర్లు దిద్ది ఇచ్చేయడం, మార్కుల జాబితాలు అందజేయడం ప్రోగ్రెస్ కార్డులు తయారు చేయడం పనుల్లో నిండా మునిగి ఉండగ ఒక రోజు...." (నెమళ్ల అడవి–పు:125) అంటాడు. వేసవి సెలవులకు తమ ఊరికి వెళ్లాలని దూర ప్రాంతాల్లో పనిచేసే ఉపాధ్యాయులు ఎంతో ఉబలాటపడతారు. అయినా వృత్తి ధర్మాన్ని నెరవేర్చిన పిమ్మటనే పోవాలనుకుంటారు. సంవత్సరాంతంలో పిల్లలు రాసిన పరీక్ష పేపర్లు దిద్ది, మార్కులు వేసి, జాబితా తయారు చేసి ప్రధానోపాధ్యాయులకు సమర్పించి వెళ్లేవారు. ఈ కథ ద్వారా కొందరి ఉపాధ్యాయులకున్న నిబద్ధత ఎలాంటిదో కథకుడు పేర్కొన్నాడు.

**3. నిర్లక్షపు ఉపాధ్యాయుడు :**

డి. రామచంద్ర రాజు గారు కొందరి టీచర్ల స్థితిగతులను గూర్చి 'నోలాంగ్ బెల్ ప్లీజ్' కథలో ఇలా అంటాడు.

"మా చంద్రశేఖర్ స్కూలుకు వచ్చి సంతకం పెట్టి చెట్టుకింద పడుకుని నిద్ర పోతాడు. పిల్లల కింత చెప్పవయ్యా! అంటే ససేమిరా పట్టించుకోడు" అన్నాడు చలపతి తన సహోధ్యాయి మీద అక్కసుతో మీరు లక్ష చెప్పండి. మనపై అధికారులు ముక్కుగ్రతో పొడవకపోతే అంతే! దద్దమ్మ ఎంఇఓలూ, డి.ఇ.ఓ.లూ ఉంటే పరిస్థితి అంతే! ఆ చెంచురాజు ఎం.ఇ.ఓ. గా ఉన్నపుడు అయ్య వార్లంతా ఉచ్చులు తెంచుకొని బడికి పరుగెత్తుతూ వుండినారు. స్కూలు టయానికి ముందే వూరు చేరుకుని అయ్య వార్ల పనితీరును విద్యార్థుల చదువును క్లాసు రూములోనే పరీక్షిస్తూ, ఒక్కొక్క క్లాసులో గంటకు పైగా గడిపేవాడు. ఇప్పుడీ ఎం.ఇ.ఓ. స్కూలు ముఖం చూసి ఎన్నేండ్లయింది. చెప్పు" – అంటాడు లింగారెడ్డి. కొందరు టీచర్లు ఎలా సోమరిగ ఉంటున్నారో కథకుడు చక్కగా చిత్రించాడు. సోమరి టీచర్లను సక్రమ దారిలో పెట్టుటకు కొందరు టీచర్లు ప్రయత్నిస్తారు. అయినా వారి ప్రవర్తనలో మార్పురాదు. ఇలాంటి వారు విద్యా వ్యవస్థకు చీడ పురుగు వంటివారు.

**4. ఆదర్శ ఉపాధ్యాయుడు:**

రామచంద్ర రాజు ఆదర్శ ఉపాధ్యాయుని గూర్చి ఇలా అంటాడు. "ఊర్లో వాళ్లంతా కొత్త టీచరు చీకటి పడేంత వరకూ పిల్లలందరిని కూర్చోబెట్టుకొని స్టడీ క్లాసులు మెయిన్ టైన్ చేస్తుంటే మీరు టైం కాకముందే వెళ్లిపోతున్నారే? ఆయనకున్న శ్రద్ధ మీకెందుకు లేదు? అని ముఖం మీదే అడుగుతున్నారు అసహ్యంగా! ఆ మాటలు ఈటెల్లా ఉన్నాయి. మనం కూడా మారకపోతే సమాజంలో పనికి రాకుండా పోతాం. అందుకోసం ఇక నుంచి నోలాంగ్ బెల్ ప్లీజ్" అంటాడు సుబ్బా రెడ్డి. కొందరు టీచర్లు బెల్లు బిల్లు చూసుకుంటుంటారు. మరికొందరు టీచర్లు పిల్లల విద్యాబోధనకు అంకితమై బోధన చేస్తుంటారు. లాంగ్‌బెల్ కొట్టినా అదనంగా మరింత సమయం అక్కడే ఉంటూ పిల్లలకు నీతి కథలు, హితవచనలు చెబుతుంటారు. ఇలాంటి టీచర్లు కూడా కొందరు అక్కడక్కడ ఉన్నారు. వారిని సమాజం చాలా గౌరవ ప్రదంగా చూస్తున్నది.

**5. దుర్మార్గపు ఉపాధ్యాయులు:**

ప్రైవేటు కాలేజీల్లో అధ్యాపకులు ఎలా ప్రవర్తిస్తున్నారో కథకుడు పలమనేరు బాలాజి 'ప్రార్థన' కథలో తెలిపాడు. ప్రైవేటు కాలేజి ఉపాధ్యాయులే గాక ప్రభుత్వ ఉపాధ్యాయులు కూడా కొందరు దుర్మార్గపు బుద్ధితో నడచుకుంటున్నారు.

"ఫిజిక్స్ లెక్చరర్ – నిన్న ఎందుకు రాలేదు? ఏమైంది? హెల్త్ ప్రాబ్లమా ఏమైనా? మొన్న సాయంత్రం కూడా క్లాసుకు రాకుండా బయటే ఉండిపోయావ్. ఏమైంది? ఏం జరిగింది? ఏమైనా హెల్ప్ కావాలా? అని ప్రత్యేకంగా పిలిపించి క్లాసు బయట అడుగుతుంటే.......వాడి చూపులకు భయం కలిగింది. భుజం పైన చెయ్యి వేసి నొక్కుతుంటే.......ఆ చెయ్యిని నరికేయాలనిపించింది. అయినా ఎంత ధైర్యం వాడికి?

ఏమైనా కావాలంటే అడుగు. మొహ మాట పడకు. తెచ్చిస్తాను...

స్కౌండ్రల్........వాడసలు లెక్చరర్ కాదు కదా కనీసం మనిషిగా కూడా పనికిరాడు. కల్చర్‌లెస్ బ్రూట్.

మొన్న రాధిక ఒకటే ఏడుపు. వాడి బాధ పడలేక. అనుష్కాలా వున్నావ్. యోగా నేర్పిస్తావా అనడిగాడట. వెధవ ఆడపిల్లల హాస్టల్లో మగపురుగులే లేకుండా వుంటే ఎంత బావుంటుందో" (ప్రార్థన –పు:30) అంటూ ఒక కాలేజి అమ్మాయి ఆవేదన చెందుతుంది. ప్రైవేటు కాలేజీల్లో పనిచేసే కొందరు లెక్చరర్లు ఆడపిల్లలను ద్వంద్వార్థాలతో లైంగికంగా, మానసికంగా వేధిస్తున్నారు. అనడిగాడట. వీరి ఆగడాలను ఎదుర్కోలేక, ఇంట్లో చెప్పుకోలేక ఎందరో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. అయినా యాజమాన్యాలు ఇలాంటి కేసులను ధన, రాజకీయ బలంతో అణచివేయడమో, పక్కదారి పట్టించేస్తున్నాయి. ఇది దుర్మార్గుల పాలిట వరమవుతున్నది.

**6. పిల్లలను హేళన చేసే ఉపాధ్యాయులు:**

కొందరు ఉపాధ్యాయులు పిల్లలకు రకరకాల పేర్లు పెడతారు. అలాంటి టీచర్ల వర్తనాన్ని గురించి 'పంచన్ లామా' కథలో జొన్నవిత్తుల శ్రీరామ చంద్రమూర్తి ఇలా అంటారు.

"పేర్లు పెట్టే దాంట్లో హిందీ సారు ఒక రకంగా మేలే. అదే సోషల్ సారయితే గబ్బు గబ్బు పేర్లన్నీ పెడతాడు. చాకల చలపతి పేరు తిప్పుడు. గాండ్ల శెట్లు ఆముదం అమ్ముతారనేసి వెంకటి గాని పేరు తైలం. వడ్డి వాళ్ల వెంకట్రాము పేరు వడ్డి వెంకు. మంగల ముత్యాలు గాని పేరు కత్తి లేక బ్లేడు. ఇట్లా అందరికీ కులాన్ని బట్టి పేరు పెడతాడు. బాపనోళ్ల శ్రీరామమూర్తి పేరు జెనివారం అని పెట్టినప్పుడు శ్రీరామ మూర్తి తల్లిదండ్రులకు బాధ అనిపించింది. దాంతో ఈ సారు పేర్ల పోరు పడలేక వాడికి మదనపల్లి రెసిడెన్షియల్ స్కూల్లో చేర్పినారు.

సోషల్ సారుకు గాని కోపం వచ్చిందంటే మంచీ చెడ్డ చూడకుండా రేగిపోతాడు. పై జాతుల కడ జాతుల పేర్లతోనూ అదే తక్కువ జాతి వాడైతే ఎంత పుటం వేసినా ఇనుము ఇనుమే గాని బంగారం కాదు. కుక్క తోక ఏమి చేసినా సొట్ట సొట్టే గాని సక్కగా కాదు. ఇట్లాంటి చాటువులు వేస్తూ నోటికి వచ్చినదంతా వాగేస్తాడు. ఎస్సీ ఎస్టీ పిలకాయులు ఎవరైనా గానీ, కోటా రెడ్డి అనో, దేవుని బిడ్డ అనో...గవర్నమెంటు అల్లుడనో పిలుస్తాడు.

విన్నవాళ్ల కడుపు కాలిపోతుంది" (పంచన్ లామా-పు:17) అంటాడు. పిల్లలను శారీరకంగా మానసికంగా వేధించడం అతి పెద్ద నేరం. దీనిని బాలల హక్కులు హరించడం గానే పరిగణించవచ్చు. ఉపాధ్యాయుల నైతిక వర్తనానికి ఇది విరుద్ధం. విద్యాబుద్ధులు నేర్పాల్సిన ఉపాధ్యాయులే ఇలా ప్రవర్తించుటను అనైతిక చర్యగా భావించాల్సి ఉంది. ఉపాధ్యాయులు ఇలాంటి చర్యల మూలంగా ఎందరో పిల్లలు బడి మానేస్తున్నారు. దీని ద్వారా భావి భారత పౌరుల ఎదుగుదలకు అడ్డుకట్టు పడుతున్నది. దీనిని గుర్తించిన సుప్రీంకోర్టు 2000 లో ఆదేశాలు జారీ చేసింది. పిల్లలను కొట్టినా తిట్టినా వేధించిన అగౌరవపరచిన సహించరాదని ప్రభుత్వాన్ని ఆదేశించింది. అప్పటి నుంచి ఉపాధ్యాయుల్లో గణనీయమైన మార్పు వచ్చిందని చెప్పవచ్చు.

ప్రాచీన కాలంలో ఏ గురువూ అనైతికంగా అసభ్యంగా దుర్మార్గంగా ప్రవర్తించినట్లు ఆధారాలు లభించడం లేదు. కానీ నేడు ఏ రోజు పత్రిక చూసినా, ఎలక్ట్రానిక్ మీడియా చూసినా విద్యార్థులపై లైంగిక దాడులు, అత్యాచారాలు జరిగిన సంఘటనలే కనిపిస్తాయి. దీనికి ఉపాధ్యాయులను చాలా వరకు బాధ్యులను చేయవచ్చు. ఎందుకంటే కొందరు ఉపాధ్యాయులు విద్యార్థులను లైంగికంగా, ప్రేమ పేరుతో వేధిస్తున్నారు. విద్యార్థులు వారు బాలబాలికలు ఎవరైనా కావచ్చు, వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాల్సిన బాధ్యత గురువులదే. దేశ భవిష్యత్తు ఉపాధ్యాయులపైన్నే ఆధారపడి ఉంటుంది డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్ చెప్పిన మాటలు అక్షర సత్యాలని చెప్పక తప్పదు. అయితే తాము చేస్తున్న తప్పులు సరిపుచ్చుకొనుటకు కొందరు ఉపాధ్యాయులు అర్థంపర్థం లేని వాదనలు వినిపిస్తుంటారు. అది సమర్థనీయము కాదు. ఉపాధ్యాయులందరూ మంచి వారు కాదు. అలాగని అందరూ చెడ్డవారు కాదు. అయితే అందరూ మంచి వారుగా ఉండడమే తక్షణ కర్తవ్యం.

వశిష్ఠుడు, సాందీపుడు, విష్ణు శర్మ వంటి గురువులు శిష్యులను పరిపూర్ణ గుణవంతులుగా తీర్చిదిద్దారు. వారి వారసత్వాన్ని నేటితరం ఉపాధ్యాయులు స్వీకరించి విద్యార్థుల్లో నైతిక విలువలు, మానవతా విలువలు, సద్గుణాలు అలవరచి వారి జీవితంతోబాటు జాతి భవిష్యత్తును ఉజ్వలంగా తీర్చిదిద్దుటకు త్రికరణశుద్ధిగా బోధన చేయాల్సిన ఆవశ్యకత ఉంది. ఈ లక్ష్య సాధనను దృష్టిలో పెట్టుకుని కథకులు కథలు రాయాల్సి ఉంది.

# ప్రాచీన సాహిత్యంలో మాతృప్రేమ

డా.సల్ల విజయ కుమార్,
ఎం.ఏ., పిహెచ్.డి.
తెలుగు అధ్యాపకులు, కోఠి మహిళా కళాశాల,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.
చరవాణి : 9014846651

"దేవుడు ప్రతిచోట ఉండలేడు అందుకే అమ్మను సృష్టించాడు" అనే జ్యూయిష్ సామెత అమ్మ యొక్క ఔన్నత్యాన్ని చాటుతుంది. నవమాసాలు మోసి, పురిటినొప్పులను భరించి కని, ప్రేమను రంగరించి పెంచే అమ్మకన్నా ప్రేమమూర్తి సృష్టిలో మరొకరు కనిపించరు. 'అ' అంటే అమ్మ అని మొదలయ్యే మన తెలుగు చదువు కూడా అమ్మకు ప్రథమ ప్రాధాన్యాన్ని ఇచ్చిందని చెప్పవచ్చు.

తల్లిపట్ల ప్రేమను వ్యక్తం చేయడం ఆధునిక కాలంలో కొత్తగా ప్రారంభం కాలేదు. శాతవాహనుల కాలం నుండే ఉన్నది. శాతవాహన రాజులు కొందరు తమ పేర్లలో తమ తల్లి పేరును కూడా చేర్చుకోవడం ఇందుకు నిదర్శనంగా చెప్పవచ్చు. తెలుగు సాహిత్యంలో మాతృప్రేమను వర్ణించడం నన్నయ కాలం నుండే ఉన్నది. మహాభారతము సంస్కృతంలో నుండి తెలుగులోనికి అనువాదమైంది. అయినప్పటికీ ఇందులో కనిపించే తల్లి పాత్రలు వ్యాసభారతంలోని తల్లి పాత్రలుగా కనిపించవు. గాంధారి, కుంతి, ద్రౌపది వంటివారు గొప్పమాతృమూర్తులుగా కనిపిస్తారు. నన్నయ ఆయా తల్లి పాత్రలను చిత్రించిన విధానాన్ని గమనిస్తే నన్నయకు అమితమైన మాతృప్రేమ లభించి ఉంటుందనిపిస్తుంది. మహాభారతములో చాలా తల్లి పాత్రలు ఉన్నప్పటికీ ఆదివర్వంలోని అష్టమాశ్వాసంలో కనిపించే జరిత పాత్ర ప్రత్యేకమైనది. ఎందుకంటే ఈ జరిత ఒక పక్షి. రెక్కలు తన నలుగురు కుమారులతో ఖాండవ వనంలో నివాసం ఉండేది. ఖాండవ వన దహన సమయంలో తన కుమారులకు కలిగిన ఆపదను తలుచుకొని అది అనుభవించిన మనోవేదనను చూడండి.

"వీరల దోడ్కొని పోవగ
నేరను బాలకుల బెట్టి నిర్దయబుద్ధిన్
వీరల తండ్రి క్రియం జన
నేరను విధికృతము గడవ నేరగ లావే."

దీనిని గమనిస్తే భాద్యతారాహిత్యమున్న తండ్రులు ఉంటే తల్లులు ఎలాంటి నరకమనుభవిస్తారో తెలుస్తుంది. భారతంలోని ఆ ఘట్టం వల్ల సకల ప్రాణుల యందు మాతృప్రేమ ఒకేవిధంగా ఉంటుందని కూడా తెలుస్తుంది. జరిత పాత్రతోపాటు ద్రౌపది గర్భశోకాన్ని పొందిన ఘట్టాన్ని వర్ణించే సమయంలో కూడా నన్నయ తల్లి ప్రేమలోని లోతును ఆవిష్కరించారు. తన కుమారులకు వచ్చిన ఆపద తనకు వచ్చినా పర్వాలేదనుకునే తల్లులు భారతంలోనే కాదు నేటికీ భాహ్య ప్రపంచంలో కూడా మనకు అనునిత్యం కనిపిస్తుంటారు.

పాల్కురికి సోమనాథుడు కూడా మాతృప్రేమ గొప్పతనాన్ని బసవపురాణంలో చాలా అద్భుతంగా వర్ణించాడు. బసవపురాణంలోని ప్రతి పాత్ర సోమనాథుని కాలంనాటి యథార్థగాధలే. ఈ గ్రంథంలో సామాన్య శివభక్తుల చరిత్రను సోమనాథుడు నిక్షిప్తం చేశాడు. వాటిలో బెజ్జమహాదేవి పాత్ర చాలా ముఖ్యమైనది. ఈ పాత్ర ద్వారా తన కాలపు తల్లులు తమ పిల్లలను ఎంతలా ప్రేమిస్తారో, వారికి ఎలాంటి సేవలను చేస్తారో, పిల్లలను ఎలా లాలిస్తారో మన ముందుంచారు. బెజ్జమహాదేవి సాక్షాత్తు పరమేశ్వరున్ని తన కుమారుడిగా భావించి, ప్రేమించి, లాలించిన ఒక ముగ్ధభక్తురాలు. తల్లి లేనందు వల్లనే పరమశివునికి ఇలాంటి స్థితి వచ్చిందని ఇలా భావించిందట. "తల్లి గల్గిన నేల తపసిగానిచ్చు
తల్లి గల్గిన నేల తల జడల్గట్టనిచ్చు
తల్లియున్న విషంబు త్రావనేలిచ్చు
తల్లి యుండిన తోళ్లు దాల్చనేలిచ్చు
తల్లి పాముల నేల ధరియింపనిచ్చు..."

తన పిల్లవాడిని తీర్చిదిద్ది సమాజంలో ఉన్నతునిగా చేయాలని ప్రతితల్లి భావిస్తుంది. అంతేగాని తన కుమారుడు సన్యాసిగా మారతానంటే ఏ తల్లి ఇష్టపడదు. తల్లులు తమ పిల్లలకు ప్రతిరోజు స్నానం చేయించి పరిశుభ్రంగా చూసుకుంటారే గాని, తల జడలు కట్టేంత వరకు ఉపేక్షించరు. అమృతమయమైన ఆహారాన్ని వండి పెడతారు గాని, విషాన్ని తాగనివ్వరు.

బమ్మెర పోతన భాగవతంలో మాతృప్రేమను అత్యంత సహజంగా వర్ణించాడు. భాగవతంలోని దశమస్కంధంలో కనిపించే యశోద పాత్ర చాలా ముఖ్యమైనది. ఈ పాత్రను వర్ణించే సందర్భంలో తన తల్లి లక్కమాంబను మనసులో ఊహించుకొని రాసివుండవచ్చు ననిపిస్తుంది. అందుకు మచ్చుతునకగా ఈ పద్యాన్ని చూపవచ్చు.

అలసితివి గదన్న యాకొంటివి గదన్న

మంచి యన్న యేడ్పు మానుమన్న
చన్ను గుడువు మన్న సంతసపడుమన్న
యనుచు జన్ను గుడిపె నర్భకునకు.

బాలకృష్ణుడు శకటాసుర సంహారం చేసి, ఏమి ఎరుగని వాడిలా ఏడుస్తున్న సందర్భంలోనిదీ పద్యం. యశోద బాలకృష్ణుడిని చూసి—ఏడ్చి ఏడ్చి అలసిపోయావా? ఆకలేస్తుందా? మంచి వాడివి కదా! ఏడుపు మానేయ్యమ్మని లాలిస్తుందట. ఏడ్చే చంటి పిల్లాడిని ఇలాంటి మాటలతో లాలించే దృశ్యం సంస్కృత భాగవతంలో లేదు. పోతన భాగవతంలోనే కనిపిస్తుంది. యశోద పాత్రను నిశితంగా గమనించడం ద్వారా తన కాలం నాటి తల్లుల ప్రవర్తనను పోతన అక్షరబద్ధం చేశాడేమోనని అనిపిస్తుంది. ఎందుకంటే యశోద పాత్ర పలికిన ప్రతి మాట ఇప్పటి తల్లులు మాట్లాడే మాటలను గుర్తుకు తెస్తుంది. ఇది బమ్మెర పోతన లోకపరిశీలన శక్తికి నిదర్శనం.

మాతృప్రేమ సముద్రమంత లోతైనది. ఆకాశమంత విశాలమైనది. దానికి సరిహద్దులు ఉండవు. అంతులేని ప్రేమ కాబట్టే అమ్మ ప్రేమకు సాటిలేదని ఎందరో కవులు వర్ణించారు. అయితే ఈ ప్రేమను చూయించడంలో తల్లులు కొంత జాగ్రత్త వహించాలనే విషయాన్ని శ్రీనాథుడు కాశీఖండంలోని గుణనిధి కథ ద్వారా వివరించాడు. గునినిధి తల్లి సోమిదమ్మ. ఆమెకు చాలాకాలం తరువాత ఎన్నో పూజలు చేస్తే పుట్టినబిడ్డడే గుణనిధి. అందుకే సోమిదమ్మ తన కుమారున్ని అమితంగా ప్రేమిస్తుంది. అది ఎలాంటిదంటే కుమారుడు బడికి వెళ్ళకుండా చెడు సహవాసం చేస్తున్నాడని తెలిసినా కూడా కొడుకుని పల్లెత్తు మాట అననంత ప్రేమ. ఒక రకంగా చెప్పాలంటే గుడ్డి ప్రేమ. ఆ ప్రేమే గుణనిధి పాలిట శాపంగా మారి అతడు పెడదారులు పట్టడానికి కారణమైంది. గట్టిగా మందలించాల్సినప్పుడు కూడా ఆవిడ తన కుమారునితో ఎలా పలుకుతుందో ఈ పద్యం ద్వారా తెలుసుకోవచ్చు.

నివిడువకు నీవు పట్టణము వీథల వీథుల వెఱ్ఱివాడవై
చెడుగుల గూడి ధౌర్త్యములు సేయ
మహీరమణుండెఱింగెనే
విడుచును సోమయాజి మనువృత్తులు చేకొను
నెల్లభంగులన్
జెడుదుము నీకతంబునను జీరయు గూడును లేక
పుత్రకా.ఽ పూర్తిగా పెడదారిపట్టిన ఆ కుమారుడు తల్లి సున్నితంగా చెప్పిన ఈ మాటలను చెవిన పెట్టలేదు. తన కుమారునిపైన అతి గారాబం చూపించడమే కాకుండా గుణనిధి చేసేపనులను తన భర్త దగ్గర దాచి పెట్టడం కూడా సోమిదమ్మ చేసిన మరో పెద్దతప్పు. పనిభారంతో ప్రతినిత్యం నిమగ్నమైన భర్తకూడా గుణనిధి ప్రవర్తనను గమనించడు. కుమారుని గురించి అడిగినప్పుడల్ల చదువుకోవడానికి వెళ్ళాడని అబద్ధం చెబుతుంది. చివరికి తన భర్తకు నిజం తెలిసినప్పుడు కూడా ఆ విషయాన్ని ఇలా కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తుంది.

నిమధ్యహ్న సంధ్యాసమాగమం బిది తీర్థ
మవధరింపుము నిత్యమాచరింపు
మగ్ని కార్యము దీర్పు మభవు బూజింపుము
పంచ మహాయగ్నపరుడ వగుము
మొగసాల నున్నారు జగతీ సుపర్వులు
గ్రాసార్థులగుచు బెక్కండ్రతిథులు
పక్వాన్నములు శాకపాకాదికంబులు
చల్ల నాఱినయేని జవులు దప్పు
బదిలముగ మందసమునందు బరిణలోన
నునిచి దాచిన దాన మీ యుంగరంబు
దీరదిప్పుడు పెట్టె శోధించి చూడ
నారగించిన పిదప నేనధిప తెత్తు.ఽ

ఇలా ఏవోసాకులు చెప్పి విషయాన్ని తప్పుదారి పట్టించి తన కుమారున్ని రక్షించుకోవాలని భావిస్తుందే కాని, ఇలా అబద్దాలు చెప్పడం వల్ల తన జీవితం కష్టాలపాలవుతుందని ఆలోచించలేదు. గుణనిధిని మాతృప్రేమ రక్షించలేకపోయింది. చివరికి తల్లి కుడుకుల జీవితాలు అంధకారమయమౌతాయి.

మాతృప్రేమ అనుభవించ లేకపోవడం వల్ల అనర్థాలు ఉంటాయని బెజ్జమహాదేవి కథ చెబితే, మాతృప్రేమ శృతిమించడం వల్ల కలిగే అనర్థాలను గుణనిధి కథ చెబుతుంది. అయితే ఇలాంటి హద్దులు పెట్టుకోవాలని ఏ తల్లి కోరుకోదు. తన పిల్లలపట్ల అంతులేని అనురాగాన్ని ప్రదర్శిస్తుంది. అందుకే తల్లిని మాతృదేవోభవ అని అంటారు. ఇలాంటి మాతృమూర్తులను ప్రాచీన తెలుగు సాహిత్యంలో అడుగడుగునా మనము దర్శించవచ్చు.

# అస్తిత్వపోరాటంలో-ఆధునిక స్త్రీ

(ఆగష్టు 2017, 5,6 తేదీలలో భారతీయ భాషాధ్యన సంస్థ (CIIL) మైసూరు, వేములపల్లి కొదండరామయ్య కళాశాల, గన్నవరం మరియు వి.యస్. సెయింట్ జాన్స్ మాధ్యమికోన్నత పాఠశాల, గన్నవరం సంయుక్తంగా నిర్వహిస్తున్న రెండు రోజుల జాతీయ సదస్సులో సమర్పిస్తున్న గోష్ఠీపత్రం).


డాక్టర్. రెంటపల్లి. రవీంద్రభాస్

రీడర్, తెలుగుశాఖాధిపతి

ఆంధ్రా లొయోలా. కళాశాల

విజయవాడ - 520 008.

చరవాణి : 9848389900


'పితా రక్షతి కౌమారే / భర్తా రక్షతి యౌవనే

పుత్రో రక్షతి వార్థక్యే / నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి'

---

స్త్రీ కౌమరంలో తండ్రి సంరక్షణలో, యవ్వనంలో భర్త రక్షణలో, వార్థక్యంలో కొడుకు సంరక్షణలో ఉండాలని స్త్రీకి స్వాతంత్ర్యం లేదని అందుకు ఆమె అర్హురాలు కాదు అని మను ధర్మశాస్త్రం పేర్కొంటుంది.

సమాజం ఆవిర్భవించిన తొలినాళ్ళలో మానవ సమాజంలో, సమూహంలో స్త్రీ పురుషుల వ్యత్యాసాలకు, వైరుధ్యాలకు చోటు లేదు. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనే భావన లేదు. చారిత్రకంగా చూసినా స్త్రీ పురుషుల మధ్య సమానత్వమే కనిపిస్తుంది. అప్పుడప్పుడు స్త్రీ శారీరక ధర్మాన్ని అనుసరించి బలహీనురాలు అయినా ఆమెను నేటి సమాజం తక్కువగా పరిగణించిన దాఖలాలు లేవు. మరి స్త్రీ పురుష అసమానతలు, కృత్రిమ కట్టుబాట్లు, దాని తాలుకా విధి విధానాలు ఆచార వ్యవహారాలు ఎలా మొదలయ్యాయి అనేది ఆలోచిస్తే ఎప్పుడయితే పురుషుడి పెత్తనం మొదలయి పితృస్వామ్యం రూపుదిద్దుకుందో అప్పటి నుంచి పురుషుడు స్త్రీని తన సొంత ఆస్తిగా భావించి ఆమెను ప్రాణమున్న జీవిగా మర్చిపోయాడు. ఆమె ఆలోచనలకు, భావాలకు ప్రాధాన్యం ఇవ్వటం మరిచి స్త్రీని నిరంకుశంగా అణిచి వేయటం మొదలు పెట్టాడు. ఇక కుటుంబంలో ఈ అణిచి వేత ఎంతగా పెరిగిపోయిందంటే ఇంట్లోని స్త్రీలపై బొడ్డూడని పసివాడు కూడా పెత్తనం చెలాయించేంత వరకు.దానికి పరాకాష్ఠ మనువు వచించిన సూక్తం. ప్రపంచ వ్యాప్తంగా ఎన్ని మతాలు, సంస్కృతులు ఉన్నా అన్నింటిలోను సామాన్యంగా అగుపించే గొప్ప విశేషం స్త్రీని అణిచి ఉంచటం.

వైదిక వాఙ్మయంలోను, పురాణేతిహాసాలలోను స్త్రీ జాతిని కించపరిచే అవమానించే అనేక అంశాలు కనిపిస్తాయి. వాత్సాయనుడు "భార్య భర్తను దైవంగా పరిగణించాలి. భర్త తినకుండా తినకూడదు. భర్తకు తెలియకుండా ఏపని చేయకూడదు. భర్త తరుపు బంధువులను, స్నేహితులను తగిన రీతిలో గౌరవించాలి. నిరంతరం అత్తమామల సేవ చేయాలి. భర్తకు వేరే భార్య ఉంటే గొడవ పడరాదు ఆమెను సోదరిలా చూడాలి". ఇటువంటి ఎన్నో ప్రతిపాదనలు కనిపిస్తాయి. ఇది కేవలం హిందూమతంలోనే కాదు, ఇతర మతాలలోను ఉంది. ఇస్లాం మతధర్మం "స్త్రీలు పురుషులకు వ్యామోహాన్ని రేకెత్తించే వస్తువులతో సమానం. వారిని ఎప్పుడు కనిపెట్టుకుని ఉండాలి. స్త్రీలు సేద్యపు భూముల వంటివారని, అందులోకి తను కోరుకున్న విధంగా వెళ్ళే అధికారం పురుషుడికి ఉందని" అంటుంది.

ఇక క్రైస్తవంకూడా "స్త్రీ పాపహేతువు కేవలం పురుషుని సంతోష పెట్టడానికే స్త్రీ సృష్టించబడింది" అంటూ ఆమెను నీచప్రాణిగా పరిగణించింది పురుషుని కష్టాలకు స్త్రీయే మూలకారణం అంటుంది క్రైస్తవ మతం. ఇటువంటి భావాలతో స్త్రీ చుట్టూ ఒక గిరి గీసి ఆమెను వంటింటికి పడకింటికి పరిమితం చేసారు. దీని నుంచి బయటపడటానికి చేసిన ప్రయత్నంలో వచ్చిన ఉద్యమమే స్త్రీవాదం.

బ్రిటీష్ వారి వలస పాలన వలన భారతీయులకు జరిగిన మేలు ప్రతి ఒక్కరికి విద్య అందుబాటులోకి రావటం. దాని ద్వారా ప్రజల ఆలోచనలలో మార్పు వచ్చి మన

సంస్కృతిలో వేళ్ళూనుకున్న దురాచారాలను వ్యతిరేకించటం మొదలయింది. అయితే ఇందులో కూడా పురుషులకు వచ్చినంత పేరు ప్రఖ్యాతలు స్త్రీలకు రాలేదన్నది స్త్రీవాదుల ఆరోపణ. సతీసహగమనానికి వ్యతిరేకంగా పోరాడిన రాజారామ్మోహన్ రాయ్‌కి వచ్చిన పేరు ప్రఖ్యాతి పండిత రమాబాయికి రాలేదు అని వారి ఆరోపణ. స్త్రీల గురించి వారి పట్ల జరుగుతున్న దురాచారాల గురించి జరిగిన పోరాటంలో స్త్రీలకు మేలు జరిగిందనే చెప్పాలి. అలాగే వారిలో కొంత తమ పరిస్థితి పట్ల అవగాహన, ఆలోచనను కలగచేసాయనడంలో అతిశయోక్తి లేదు.

ఎంతో కాలంగా సంఘంలోని అసమానతలను రూపుమాపాలని అందరికి సమానహక్కులు ఉండాలనే వామపక్ష పార్టీలు కూడా స్త్రీల హక్కుల పట్ల, వారి అణిచి వేతపట్ల ఎటువంటి ప్రణాళికలు కలిగి లేవు అనటం అతిశయోక్తి కాదు. దానినే ఓల్గా ఇలా అంటారు. "విప్లవ రచయితల సంఘంలో గాని, జనసాహితి సంఘంలో కాని స్త్రీల సమస్యల పట్ల సరి అయిన అవగాహన లేదు. స్త్రీ పురుష సమానత్వం అనేది లేదు. సమసమాజం కావాలనే వాళ్ళకి స్త్రీ పురుష సమానత్వము అనే స్పృహ లేకపోతే ఏం చేయగలుగుతారు. ఈ క్రమంలో అందులో నుంచి బయటకు వచ్చి నేనేమిటి? అని ప్రశ్నించుకున్నాను. స్త్రీ పురుష సమానత్వము అనే స్పృహ లేకపోతే స్త్రీల సమస్యల పునాదులను అన్వేషిస్తూ, విశ్లేషణంగా ఆలోచిస్తూ స్త్రీవాదిగా మారాను" అంటారు. స్త్రీవాద రచయితలంతా ఇలా వచ్చిన వాళ్ళే స్త్రీగా తన అస్తిత్వమేమిటి? సమాజంలో తమ ఉనికి ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలు వెతుకుతూ తమను తాము కనుక్కునే ప్రయత్నంలో వెలువరించిన కథలు / కవితలు వివిధ రకాల సాహితీ ప్రక్రియలు అద్దంపడుతాయి.

70వ దశకంలో కుటుంబంలో యజమానిగా పురుషుడి అదుపాజ్ఞలలో సభ్యులంతా ఎలా నడుచుకునే వారో వివరిస్తూ హేమా వెంకట్రావు ఇలా అంటారు. "నాన్న పెట్టే హింస నుంచి ఇంట్లో నాలుగు గోడల మధ్య నాన్నకు దూరంగా గడిపే ప్రయత్నంలో పూజా పుస్తకం ఓ వెసలుబాటు అని అమ్మ అనేది. సమాజంలోని పాతివ్రత్య ధర్మాన్ని, పితృస్వామ్య కట్టుబాటునో పెంపొందించే పుస్తకాలే అమ్మకు పరిమితం. అది అప్పటి స్త్రీలందరి పరిస్థితి. తమ సమస్యలన్నిటికి సమాధానం తరాలుగా అనుసరిస్తున్న సమాధానాలే ఉంటాయని వాటిని మార్చలేమని నిర్దుష్ట అభిప్రాయానికి వచ్చేసింది. ఉమ్మడి కుటుంబం నుంచి వచ్చిన నాన్నకు తన కుటుంబ బాధ్యతలు తనపై అధికారుల జులుం రాజేసిన క్రూరత్వా... తాను హింసకు గురవుతూ అమ్మను గురి చేశాడు". ఇ... నాటి సమాజంలో సాధారణంగా కనిపిస్తే నేటికీ అక్కడక్కడా కనిపిస్తూనే ఉంది. పురుషాధిక్యత అనేది నరనరా జీర్ణించుకున్న సమాజం దాని నుంచి పూర్తిగా బయట పడలేదనేది వాస్తవం.

దీని నుంచి బయటకు రావాలనే తపన, తమకంటూ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించుకోవాలనే ఆరాటంతో మొదట్లో వచ్చిన స్త్రీవాద కవిత్వాలలో కనిపిస్తుంది. సీతగానో / సావిత్రిగానో / అనసూయగానో / అరుంధతిగానో తప్ప / బతకలేని వాళ్ళం / మొగుడి ఛాయా మార్గం వినా / వేరే తోవ తెలియని వాళ్ళం / మేం ఎవరమని మాట్లాడగలం / శతాబ్దాలుగా / ఈ జాతి పుంసకత్వానికి / అరాచకత్వానికి సమిధలమై / సగం చచ్చి బతుకు తున్న వాళ్ళం - జయప్రభ - విస్తరిస్తున్న ఎడారులు.

1980లకు ముందు స్త్రీలకు తమ సమస్యలను ధైర్యంగా చెప్పేగుణం ఉన్నట్టు కనిపించదు. ఛాయా మాత్రంగా తమ బాధను చెప్పే ప్రయత్నం చేశారు.

"ఇప్పుడేమో నాకు / చెప్పాల్సిందేదో ఉంది / చాలా గాఢమైంది / చాలా ఇష్టమైంది / చాలా స్వచ్ఛమైంది / మాట్లాడబోతే ఎవరూ వినిపించుకోరు / అందుకో మరందుకో ఈగొంతు మూగపోయింది" అంటుంది రేవతి. తన గురించి తన సమస్యల గురించి మాట్లాడినా ఆడదానిగా తన మాటలను వింటుందో వినదో అని సందేహం !

దిగులు / దిగులు దిగులుగా దిగులు / ఎందుకో ఎందుకో చెప్పేవీలుంటే / దిగులెందుకు - శిలాలోహిత (రేవతి) అంతరంగాన్ని చెప్పలేని దిగులు అంతర్మథనంతో కుంగిపోయే దిగులు, చెప్పుకోలేని అసహనం ఇవన్నీ రేవతి కవిత్వంలో వినిపిస్తాయి.

ఈదిగులు ఏంటో సావిత్రి వివరంగా తన కవితలో వినిపిస్తుంది. "వాడికేం మగమహారాజని ఆడామగా వాగినప్పుడే అర్థమైపోయింది. పాఠం ఒప్పచెప్పకపోతే పెళ్ళి చేస్తానని పంతులుగా రన్నప్పుడే భయమేసింది పెళ్ళంటే పెద్ద శిక్షని మొగుడంటే స్వేచ్ఛా భక్షకుడని మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే మమ్మల్ని విభజించి పాలిస్తోందని" - బందిపోటు.

తమ బాధలను భయాలను అరకొరగా అక్కడక్కడా ప్రస్తావిస్తు వచ్చిన స్త్రీవాదులు తమగొంతును బలంగా వినిపించటం మొదలు పెట్టింది 1985 తర్వాతే.

తమను తక్కువగా చూడటం సహించబోమని ధృతరాష్ట్రుడిలా పుట్టుగుడ్డి కాదు కదా మనం / గాంధారిలా ఆపాదించుకున్న అంధత్వం మనది / ఇందుకు లింగ భేదం లేదు / చూపుతే కాదు మనసుకూ మనకెందుకులే ఉపేక్ష – జ్వలిత (అంధత్వం) దీని గురించి సమాజంలోని ప్రతి ఒక్కరూ ఆలోచించాల్సిన సమయం వచ్చిందంటుంది. మగవారి దృక్పథం నుంచి కాక స్త్రీ దృక్పథం నుంచి ఆమె అంతరాంతరాలలో నుంచి వెల్లువెత్తిన ఆక్రోశం, ఆవేదన, సమాజం కట్టుబాట్లపై తీసుకున్న నిరసనను స్త్రీవాదులంతాగొంతెత్తి చెప్పటం ఉధృతమయింది 1990నాటికి.

మగవాడి చూపులను అవి ఆడదానికి చేసే మానసిక గాయాలను సూటిగా వారికి గుచ్చుకొనేలా చెప్పిన జయప్రభ కవిత –

రెండు కళ్ళ నుంచి చూపులు సూదుల్లా వచ్చి / మాంసపు ముద్దల మీద విచ్చల విడిగా తిరుగుతుంటాయి. వంటి మీద చూపులు చెదల్లా పాకుతుంటాయి. ఆ చూపులకు వర్ణ విభేదాలు లేవు. చొంగకార్చేకుక్కలాంటి ఆకలుంటుంది / వికృతమయిన భల్లూకపు పట్టులాంటి దేదో విడవక కలల్లో సైతం వెంటాడుతుంది. రోడ్డు మీద బస్సులోను క్లాసులోనూ / వేసే ప్రతి అడుగులో స్త్రీ నేటికి ఈచూపుల నుంచి విముక్తి లభించిందా అంటే ప్రశ్నార్ధకమే. వయసుతోనూ, వావి వరసలతో సంబంధం లేకుండా స్త్రీ నిత్యం ఎదుర్కొనే లైంగిక దాడులలోని ఒక కోణం ఇది. ఆమె ఇష్టా ఇష్టాలు ఆలోచనలు, పట్టించుకోకుండా కేవలం భోగ వస్తువుగా లైంగిక వినియోగ పరికరంలా చూడటానికి అలవాటు పడటమే ఇందుకు కారణం. ఇది అనాదిగా వస్తున్న ఆలోచనా పరంపరేఅని సమాజం దానినుంచి భయటపడలేదంటుంది. హైమవతి.

గాయాలు మానినా / మచ్చలు మానవు / వెంటాడే విషాదస్మృతిలా ఆనాడు పురాణాల్లో / ఏ మహర్షిలా తపోభంగానికయినా / ఓ ఊర్వశీ విలాస దృగంచలం / ఓమేనకామనోజ్ఞ భంగిమ / మహేంద్రుని ఆయుధాలు – (సంతకాలు చేద్దాం) అంటూ ఆతత్వమే నేటి ఆధునిక కాలంలోను నడుస్తోందని అంటుంది. పిల్లలను కని, పెంచటం మాతృత్వపు మాధుర్యాలను ఆస్వాదించటం అనే ఊహాలోకపు భావనలు పటా పంచలు చేస్తూ ఆడవాళ్ళ శారీరక స్థితి వారు పడే బాధను 'లేబర్ రూం'లో కొండే పూడి నిర్మల ఇలా అంటారు.

ప్రపంచంలోని నరకమో / నరకంలోని ప్రపంచమో త్రీడీలో చూస్తున్నట్టే వుంటుంది / లేబర్ రూంలో అడుగు పెడితే చాలు కాళ్ళునలా ఎడం చేసి దీనంగా హీనంగా నీచాతినీచంగా / ఒక హింసాతల పరాకాష్ఠ కోసం ఎదురు చూడ్డమంటే... ఆలోచించే చోటు లేదు / చావుకి బతుక్కి మధ్య పిసరంతగీటు లేదు".

ఈ కవిత మీద పుంఖాను పుంఖాలుగా విమర్శల దాడి జరిగినా స్త్రీ వాదులు వెనకడుగు వేయలేదు. "పురుషానుకూల విలువల విధ్వంసానికి కవయిత్రులు రచనలు కారణమవుతున్నాయన్న భయం వల్ల" ఇటువంటి విమర్శలు వస్తున్నాయని ఎదురుదాడి చేశారు. దీనికి ప్రతిగా మరింత ఉధృతంగా స్త్రీవాదులు స్త్రీలు ఎదుర్కొనే సమస్యలకు కారణమయిన అనేక అంశాలపై దృష్టి సారించి రచనలు చేయుటం మొదలు పెట్టారు. అందులో కొన్ని స్త్రీల అనుభవాలకు, ఆలోచనలకు కవిత్వంలో ఎక్కువ చోటు కల్పించటం, స్త్రీ జీవితాలను శాసించే పురాణ కాలం నాటి నమ్మకాలను తిరిగి ప్రశ్నించటం, ప్రాచీన సాహిత్యాన్ని స్త్రీ వాద దృక్పథంతో తిరిగి విశ్లేషణ చేయుటం, ప్రఖ్యాత స్త్రీల పాత్ర చిత్రణ ప్రతీకలను తీసుకుని కవిత్వం రాయుటం మొదలయింది. ఇది ఒక పార్శ్వం అయితే ఇంకో పార్శ్వం స్త్రీని పురుషుడు అణిచి వేయుటం ఎన్ని విధాలుగా జరుగుతుందో వివరిస్తూ రాయబడిన రచనలు కొన్ని. మాతృత్వం, లైంగికత్వం, మానభంగాలు, చిన్న పిల్లల పై అత్యాచారాలు ఇలా భిన్న పార్శ్వాలలో స్త్రీ సమస్యలను చిత్రించటం జరిగింది.

స్త్రీకి గుర్తింపు వచ్చిందానికి వందరెట్లు తెలివి ఉంటుందని, ఆ తెలివిని అణచటం చేతకాక ఆమెకు చోటు ఇస్తున్నారని దానితో ఆమె పొంగిపోయి అందులో స్థిరపడి పోతుందని అది నేడు మన సమాజంలో కనిపిస్తున్న దృశ్యమని అంటారు స్త్రీవాదులు. వారిశక్తిలో సగంపైగా సమాజంతో, మిగిలిన సగం ఇంట్లో వాళ్ళతో యుద్ధం చేయుడానికే సరిపోతుంది అంటారు. ఓల్గా రాజకీయ కథలలో.

'విశాల ప్రపంచంలో తాము కూడా భాగస్వాములమని గుర్తించాలని, తమ జీవిత గమ్యం ఏమిటో తెలుసుకునే ప్రయత్నంలో నేటికీ స్త్రీ విఫలమవుతునే ఉంది. మారిన కాలమాన పరిస్థితులు స్త్రీని మరింతగా అణగతొక్కుతున్నాయి అని స్త్రీ వాదుల అందోళన.

ఆధునిక స్త్రీ ఇప్పుడు పురుషునితో సమానంగా విద్యావంతురాలయింది. అన్ని రకాల ఉద్యోగ బాధ్యతలను నిర్వహిస్తోంది. అయినా ఆమెకు ఇంటి పనుల్లో ఏమాత్రం వెసులుబాటు, విశ్రాంతి దక్కక పోవటం విచారకరం. ఒకప్పుడు కేవలం వంటగదికే పరిమితమై "నడుస్తున్న వంటగదిలా ఉంటుంది. ఆమెను చూస్తే ఒక గరిటెగానో పెనంలానో / మావంటింటిని అలంకరించిన ఒక పరికరంలానో ఉంటుంది...." అనే స్థితి నుంచి నేటి మహిళ "అదృష్టవశాత్తు" మంచి వంటింట్లో పడ్డానన్నారంతా / గ్యాసు, గ్రైండర్లు, సింకులు, ట్రైల్సు / అమ్మలా గారెలూ, అరిసెలు కాక / ఇప్పుడు కేకులు, పుడ్డింగులు చేస్తున్నాను నేను." వంటిల్లు – విమల.

'బహు పాత్రాభినయ పోటీలో / నా చేతులకెప్పుడు ఫస్ట్‌ప్రైజే / నాశరీరమే చేతులుగా మారినా / నా హస్తద్వయమే / కార్యవీరార్జుని సహస్ర బాహువులుగా / పరిణమించి నా పనిచేసినా / ఆఫీసుకెళ్ళేంత వరకు నాపని అనంతమే. ద్విపాత్రాభినయం – హైమవతి. చదువుకుని ఉద్యోగాలు చేసే స్త్రీలు కూడా పరిస్థితులతో రాజీపడి బతికేస్తున్నారు. వారుస్వతంత్రంగా బతకడానికి కావలసిన శక్తి, ఆత్మబలం స్త్రీకి సమాజం కల్పించలేదనేది వాస్తవం. నేటి తరం స్త్రీ తమకంటూ సమాజంలో స్థానం కోసం తపన, తమను తాను గుర్తించుకోవాలన్న తపన, తమ అస్తిత్వాన్ని గుర్తించాలన్న తపనతో పోరాటం చేస్తూనే ఉన్నారు. తమకు ఆసరా ఇవ్వని సమాజం కోసం 'మానసిక కష్టం నుంచి ఓపిక తెచ్చుకుని నడవాలని ప్రయత్నిస్తూనే ఉంది'. (కుప్పిలి పద్మ)

## ఆధార గ్రంథాలు


1. గత ఇరవైయేళ్ళ స్త్రీవాద సాహిత్యం – జయప్రభ
2. స్త్రీవాద కవిత్వం – ఓ పరిశీలన – డా॥ యమ్.యస్. బ్రహ్మానందయ్య
3. స్త్రీలు ఉన్నతం కాలం స్త్రీవాదం ఉంటుంది – ఓల్గా
4. మా నాలుకలు తెగేసిన చోట – సక్కా హేమావెంకట్రావు

# అధ్యాపక జీవన విధానం - పరివర్తన

డా॥ సర్వా సీతారామ చిదంబర శాస్త్రి
అసోసియేట్ ప్రొఫెసర్ - తెలుగు శాఖ
శ్రీమతి గెంటేల శకుంతలమ్మ కళాశాల
జగ్గయ్యపేట - 521175 - కృష్ణాజిల్లా, ఎ.పి
చేపలుకు - 9885383741
మెయిల్ అడ్రస్ : ssrcsastry@gmail.com

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః॥"

భారతీయ సంప్రదాయంలో గురువు స్థానం మహోన్నతమైనది. సద్గురువు లేనిదే జ్ఞానం మరియు మోక్షం కలుగదనేది వేదకాలం నుండి వాడుకలోనున్న మాట. సద్గురువనేవాడు ఏ జాతి వాడైనా, ఏ కులంవాడైనా, ఏ మతధర్మానికి చెందినవాడైననా, ఏ వయసువాడైనా, సామాన్యుడైనా, అసామాన్యుడైనా, పండితుడైనా, పామరుడైనా, ప్రత్యక్షంగా ఉన్నా, పరోక్షంగా ఉన్నా, చివరకు తల్లిదండ్రులైనా గురుసేవను కావించి విద్యనార్జించి జ్ఞానాన్ని పొందాలనేది పెద్దల మాట.

గురువు - ఆచార్యుడు - అధ్యాపకుడు - ఉపాధ్యాయుడు - అనే పదాల్ని మనం సామాన్యార్థంగా ఒకే విధంగా వాడుతున్నాం.

'గృణాతి ఉపదిశతి గాయత్ర్యాదికం గురుః - గృ - శబ్దే - అని వ్యుత్పత్తి. గాయత్ర్యాది మంత్రాల్ని ఉపదేశించేవాడు గురువు.

'ఆచారం గ్రాహయతీతి ఆచార్యః' - సంప్రదాయాల్ని గ్రహింపచేసేవాడు ఆచార్యుడు. 'య ఆచారం గ్రాహయతి సర్వా విద్యా బోధయతి స ఆచార్యః' - చర - గతి భక్షణయోః - అనే ధాతువు ఆఙ్ పూర్వకం కాగా ఆచార్య శబ్దం ఏర్పడింది. సత్యమైన ఆచారాన్ని నేర్పుతూ సర్వ విద్యల్ని బోధించేవాడు ఆచార్యుడు. 'మంత్ర వ్యాఖ్యాకృదాచార్యః' - అన్నారు. కల్ప సూత్రాది సహితమైనది వేదం. దానిని అధ్యయనం చేయించి దాని అర్థం తెలిపేవాడు ఆచార్యుడు.

'అధ్యాపయతి అధ్యాపకః' - అని వ్యుత్పత్తి. ఇఙ్ - అధ్యయనే' - అని ధాతువు. అధ్యయనము చేయించేవాడు అధ్యాపకుడు.

'ఉపేత్యాధీయతే అస్మాదితి ఉపాధ్యాయః' - సమీపమున ఉంచుకొని అధ్యయనం చేయించేవాడు అని అర్థం.

ఈ వ్యుత్పత్తులనన్నింటినీ క్రోడీకరించి చూడగా విద్యార్థికి గాయత్రీ మంత్రోపదేశం కావించి అన్నం పెట్టి పోషిస్తూ విద్యను అభ్యసింపజేస్తూ వివాహాది కర్మల్ని చేయించేవాడు గురువు అనగా అతడు తండ్రి స్థానాన్ని పొందినవాడవుతాడు. అందుకే శిష్య వాత్సల్యమనే పదం గురువుపరంగా చెప్పబడింది.

విద్యార్థికి ఉపనయనంగావించి, కల్ప సూత్రాలు - ఉపనిషత్తులు మొదలైన వాటిని తాను అధ్యయనం గావించి, శిష్యులకు బోధించేవాడు ఆచార్యుడు.

ఉపాధి నిమిత్తంగా విద్యల్ని అన్నింటిని తాను నేర్చిన వాటిని శిష్యులకు నేర్పేవాడు అధ్యాపకుడు లేక ఉపాధ్యాయుడు.

"గు శబ్దస్త్వంధకారస్తు రు శబ్దస్తన్నిరోధకః
అంధకార నిరాసత్వాత్ గురురిత్యభిధీయతే."

అన్నారు. 'గు' - అనే అక్షరం చీకటి అనగా అజ్ఞానం అయితే, 'రు' - అనే అక్షరం దానిని పోగొట్టి వెలుగును అనగా జ్ఞానాన్ని అందిస్తుంది. అందుకే 'గురు' వన్నారు.

'మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషోవేద.' అని శతపథ బ్రాహ్మణమ్(14-5-8-2) చెప్పింది. వాస్తవంగా చెప్పాలంటే పిల్లలకు ఉత్తమ శిక్షకులు ముప్పురే. తల్లి-తండ్రి-ఆచార్యుడు. ఈ శిక్షకులుగల పిల్లలు ఉత్తమ జ్ఞానవంతులవుతారని తెలిసికోవాలి.

"శాంతోమహంతో నివసంతి సంతో వసంతవల్లోక హితం చరంతః
తీర్ణాః స్వయం భీమ భవార్ణవం జనాన హేతు నా న్యానపి తారయంతీః."

భయంకరమైన సంసార సముద్రం నుండి తాము స్వయంగా తరించి, నిర్హేతుక కటాక్షంతో ఇతరుల్ని సైతం తరింపజేస్తారు గురువులని శ్రీ శంకరాచార్యులు గురుతత్వాన్ని చక్కగా విశదపరచారు.

"సహనావవతు - సహనౌభునక్తు - సహవీర్యం కరవావహై - తేజస్వినావధీతమస్తు - మా విద్విషావహై - ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః" - అని ఉపనిషన్మంత్రం. దీని అర్థం తెలిసికొంటే గురుశిష్యసంబంధం ఎంతటిదో తెలుస్తుంది.

"(గురుశిష్యులమగు) మమ్ము పరమాత్మ రక్షించుగాక! మాకు పోషణము కలుగజేయుగాక! మేము కలిసి విద్యకు సామర్థ్యమును కలుగజేయుదుము గాక! మా చదివిన విద్య తేజస్వంతమగుగాక! మేము పరస్పరము ద్వేషింపక యందుముగాక! త్రివిధ పాపాలు శాంతించుగానక!"

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తన విప్రనారాయణ చరిత్రలో చెప్పిన ఈ క్రింది పద్యాలు గురుశిష్యులెలా ఉండాలో సూచిస్తున్నాయి.

"శిష్యునెపుడు గురుడు నిరసింపగూడ - దాత్మ సమునిగ భావింప నగునతండు
తనదు సహపాఠకుని గాగ దలప వలయు - నిద్దఱు స్వగురు శిష్యులం చెన్ననగును."

"శిష్యునాత్మకు భక్తి విశేష్యమిచ్చి - పరమదయ దాని బోషింప గురుని భార
మధిక భక్తిని గురుదేహ మాచరించి - రక్షణము సేయ శిష్యుభారమ్ము సుమ్ము."

ఇంకా చాలా పద్యాలున్నాయి. ఉదాహరణకు రెండు మాత్రమే తెలిపాను.

ప్రాచీన కాలంలో విద్యాబోధన గావించే అధ్యాపకులు ఎంతో చక్కని శిష్యవాత్సల్యం కలవారై తాము అన్నీ నేర్చుకొని దానిని నిత్యం స్మరించుకొంటూ అత్యంత శ్రద్ధతో విద్యార్థులకు విద్యా ప్రదానంగావించేవారు. శిష్యులు కూడా గురువులు ఏ పని చెబితే ఆ పనిని ఆచరిస్తూ ఎంతో వినయంగా ఉండి మిక్కిలి శ్రద్ధతో ముఖ్యంగా జిజ్ఞాన కలవారై విద్యనభ్యసించేవారు. గురువులకు గొప్పగా విలువ ఇవ్వబడ్డ కాలమది. రాజులు గురుకులాలు ఏర్పరిచి మహాపండితులైన గురువుల్ని వాటిలో నియమించి శిష్యులకు విద్యాబోధన కావించేటట్లు చేసేవారు. ఎన్నో విద్యల్ని ఆనాటి పిల్లలు అవలీలగా నేర్చుకొనేవారు. అది ఎంతో ఉత్తమోత్తమమైన కాలం.

మధ్యకాలంలో బ్రతకలేక బడిపంతులన్నారు. ఏ పనీ చెయ్యడం చేతకానివారు కూడ బడిపంతులుగా అవతారం ఎత్తినవారు కూడా ఉన్నారు. చాలీచాలని జీతాలతో పెళ్ళాం బిడ్డల్ని పోషించుకోలేకపోయినప్పటికీ ధర్మ-నీతియుత జీవనం కలవారై ఉపాధ్యాయులు పిల్లల్ని దగ్గరగా ఉంచుకొని శ్రద్ధగా-ఓపికగా-మమకారంతో పిల్లలకు చక్కని విద్యల్ని బోధించేవారు. పిల్లలు గూడ అన్నింటిని తెలిసికోవాలనే తపనతో ఉండేవారు. చక్కగా చదువుకొనేవారు.

ప్రాచీన - మధ్యకాలాల్లో అధ్యాపకులు నిర్వర్తించే మహోన్నతమైన విద్యాదానమనే పనిని ఒక సేనగా అందరు భావించేవారు. ఆనాటి అధ్యాపకుల్లో తపన - అంకితభావం - నిస్స్వార్థం - మెండుగా ఉండేది. లాభాపేక్షను వారాశించలేదు. విద్యను అమ్ముకోలేదు. దానివల్ల విద్యార్థికేకాక దేశానికి ఎంతో మేలు ఒనగూరేది. ఆనాటి అధ్యాపకవృత్తి జీతం పుచ్చుకునే వ్యాపకంగా మాత్రమే గాక విద్యార్థుల్లో చైతన్యాన్ని, స్ఫూర్తిని, ప్రతిభను పెంపొందింపజేసే సేవాకార్యంగా విరాజిల్లింది. ఇది గత విషయం.

నేడు గొప్పగా బ్రతక కలిగినవాడే బడిపంతులు. మార్కుల్ని మాత్రమే గడించగల విద్యార్థుల్ని రూపొందించే యాంత్రిక కార్యాచరణలో అధ్యాపకులు తలమునకలై ఉండడం జరుగుతోంది. దీనికి కారణం ఈనాటి విద్యార్థుల, తల్లిదండ్రులు మరియు పాలకులు. నేటి అధ్యాపకులు దక్షి ప్రధానంగా జీవితం గడుపుతున్నారు కొందరు.

సౌశీల్యాన్ని నిర్మించేది - మానసిక బలాన్ని పెంపొందింపజేసేది - బుద్ధిని వికసింపజేసేది - ఒక వ్యక్తిని తన కాళ్ళ మీద తానే నిలబడేటట్లు చేసేది విద్య. అట్టి విద్యను విద్యార్థులకందించేవాడు అధ్యాపకుడు. కనుక అతడు విద్యార్థులకు ఆదర్శప్రాయునిగా ఉండాలి. అలా ఉన్నప్పుడే వారిని ఆదర్శంగా తీసికొని విద్యార్థులు చక్కని సంస్కృతి సంప్రదాయాల్ని అలవరచుకొని అధ్యాపకుల పట్ల వినయవిధేయతలు కలిగి గౌరవంగా, విశ్వాసంగా మసలుతారు. అధ్యాపకునిపట్ల విద్యార్థులు గౌరవభావంతో ఉండాలంటే -

మొదటగా అధ్యాపకులకు విద్యార్థుల పట్ల ప్రేమ-అనురాగం-వాత్సల్యం-సహనం అవసరం. అదిలేనివాడు ఉపాధ్యాయవృత్తి కనర్హుడు.

అధ్యాపకులకు తాము బోధించే పాఠ్యాంశాలపై సరియైన అవగాహన ఉండాలి. తమకు తెలియని విషయాల్ని అనుభవజ్ఞుల నుండి నేర్చుకొని విద్యాబోధన గావించాలి గాని తనకు తెలిసినట్లుగా నిరూపించుకోవడానికి ప్రయత్నించరాదు. ఎందుకంటే విద్యార్థుల్లో కొందరు సూక్ష్మగ్రాహులుంటారు. వారు తమ అధ్యాపకునికి ఏది తెలుసు - ఏది తెలియదనే విషయాన్ని ఇట్టే పసిగడతారు. కనుక ఉత్తమ ఉపాధ్యాయుడెప్పుడు తనకన్నీ తెలుసుననుకోడు. గర్వించడు. తాను చేసే ప్రతిపనిలోను ప్రతిభ - ప్రజ్ఞ ఉట్టిపడేలా ఉంటాడు.

అలాగే అధ్యాపకుడు సచ్ఛీలుడై ఉండాలి. అది లేకుండా విద్యార్థులకు హితవు గరపడానికి ప్రయత్నిస్తే అంతకన్న నవ్వులపాలు అయ్యే విషయం మరొక్కటి ఉండదు.

అధ్యాపక - విద్యార్థి సంబంధం ఎంతో గొప్పది. వారిర్వురి మధ్య ఆదరాభిమానాలు నెలకొని ఉండాలంటే విద్యార్థులతో అధ్యాపకుడు చనవును ప్రదర్శించినప్పటికి అది అతిగా ఉండరాదు. విద్యార్థుల్లో విసుగు, నిస్పృహ చోటు

పుతకుండా, చెప్పిందే మరల మరల చెప్పకుండా, కొంత వ్యక్తిత్వంతో అవసరమైనప్పుడు అనగా తప్పని పరిస్థితుల్లో కూడా వినోదం పాలు మేళవిస్తూ విద్యార్థులకు బోధనగావించాలి. అధ్యాపకుడు నిరంతర అధ్యయనశీలిగా ఉండి అధ్యయనంగావించాలి. ఇతరములైన విషయాల పట్ల కూడ అవగాహన-పరిజ్ఞానం కలిగి ఉండాలి అధ్యాపకుడు. విద్యార్థులకాసక్తి కలిగేటట్లు బోధనగావించడం అధ్యాపకుని కర్తవ్యం.

మరి విద్యార్థుల్లో వారు కూడా అధ్యాపకుల పట్ల వినయ విధేయతలతో ఉత్తమాంగులై ఉండాలి. అధ్యాపకుల్ని ఉపయోగించుకునే పద్ధతిలోనే వారి భావి పురోగతి ఆధారపడి ఉంటుంది. అధ్యాపకుల్ని ఎదిరించడం, ఎకసక్కెంతో హేళనంగా మాటలాడడం, ఎగతాళి చేయడం ఇత్యాది దుష్కార్యాలవల్ల తామెంతో నష్టపోతామని విద్యార్థులు తెలుసుకోవాలి. విద్యార్థులనగా భావిభారత సౌధానికి మూల స్తంభాలు కనుక వారు సత్ప్రవర్తనారాహిత్యంగా – బాధ్యతారాహిత్యంగా – నిర్లక్ష్యంగా ఉండరాదు. మొండితనంతో ఎట్టి ఆటంకాలు లేకుండా విద్యనభ్యసించే విద్యార్థులు అధ్యాపకుడు చెప్పేవాటినన్నింటిని ఆకళింపుజేసుకొని అభ్యసిస్తూ ఉత్తమ విద్యార్థిగా ఎదగాలి. అప్పుడే వారు అన్ని రంగాల్లో మిక్కిలిగా రాణించి యశోవంతులవుతారు.

చివరగా ఒక్కమాట. విద్యార్థుల విషయం ప్రక్కనబెడితే నేడు అధ్యాపకుల వర్తనం ఎలా ఉందంటే కొందరధ్యాపకులు ఎంతో పవిత్రమైన ఆ వృత్తికే మాయని మచ్చలా ఉంటున్నారు అని చెప్పవలసి వచ్చినందులకు ఒక అధ్యాపకునిగా నేను సిగ్గుపడుతున్నాను.

విద్యార్థుల్ని ఉత్తమ జ్ఞానవంతులుగా, భావిపౌరులుగా దిద్ది తీర్చవలసిన అధ్యాపకుల్లో కొద్దిమంది మాత్రం నిర్లక్ష్యభావంతులవారై సరియైన విద్యాబోధన గావించడంలేదు. వారికి పాఠ్యాంశాలపై పట్టు ఉండదు. ఇతర వ్యాపకాలెక్కువగా కలవారై ఉంటున్నారు. తాము ఉద్యోగించే విద్యాలయంలో కన్నా బయటి విద్యాలయాల్లో పాఠాలు బోధిస్తూ వాటిల్లో సభ్యులుగా ఉంటూ వాటి అభివృద్ధికి నిరంతరం పాటుపడుతున్నారు. తన విద్యాలయం నశించిపోయినా పరవాలేదు అని భావిస్తూ పైకి మాత్రం ఎన్నో నీతులు చెబుతున్నారు. రియల్ ఎస్టేట్ వ్యాపారాలు, వడ్డీ వ్యాపారాలు ఇలా పలు రకాలైన పనులతో తీరికలేక యుండి మాతృవిద్యాలయాన్ని గాలికి వదలుచున్నారు.
స్వంతంగా విద్యాలయాలు నెలకొల్పుకొని వాటి పురోగతికి పాటుపడుతున్నారు. ఇంకా కొందరు తమ ఉనికిని కాపాడుకోవడం కోసం రాజకీయనేతల వెంట పరుగులు తీస్తున్నారు. అలాగే విద్యార్థినులను కామదృష్టితో చూస్తూ వారిని తాయిలాల్ని, మార్కులను ఎరవేసి లైంగికంగా వేధించే ఉపాధ్యాయులుండడం మనం చూస్తూనే ఉన్నాం. అట్టివారు రాజకీయ నాయకుల అండదండలతో గొప్పగా తిరుగుతుండగా విద్యార్థినులు మాత్రం కోరిక ఉన్న చదువుమానుకొని ఇంట్లో కూర్చుంటున్నారు.

సమాధాన పత్రాలు దిద్దడంలో కూడా నేటి అధ్యాపకుల్లో కొందరు నిర్లక్ష్యధోరణిని చూపుతున్నారు. వారు సరిదిద్దే పత్రంపై వారికి పట్టు ఉండదు. ఎవరువచ్చినా వారు ఏ సబ్జెక్టునయినా దిద్దిపారవేసే ప్రబుద్ధులు కూడా కొందరున్నారు. గైడును ఎదురుగా పెట్టుకొని సమాధానపత్రాలు దిద్దడం మన దౌర్భాగ్యం.

పరిశోధన రంగంలో కూడా పర్యవేక్షకులుగా వ్యవహరించేవారిలో కొందరు అవగాహనారాహిత్యం కలవారై ఉన్నారు. తమ వద్ద పరిశోధనచేసేవారికి ఏది ఎలా వ్రాయాలో, సిద్ధాంత గ్రంథమెలా ఉండాలో, ఎట్టి అంశాల్ని పరిశోధనకి ఇవ్వాలో కూడ తెలియని వారున్నారు. అట్టి ఆచార్యులు ధన సంపాదనే ధ్యేయంగా పరిశోధక విద్యార్థులనుండి డబ్బుల్ని ఆశిస్తూ ఇవ్వనివారిని బాధిస్తూ స్త్రీ పరిశోధకుల్ని లైంగికంగా పీడిస్తూ ఉన్నారని చెప్పవలసి వచ్చినందులకు నేను చాలా బాధపడుతున్నాను.

ఎంతో పెద్ద మొత్తాల్లో వేతనాలందుకొంటూ విద్యార్థులకు ఒక్క ముక్క కూడా పాఠం చెప్పకుండా సమయభంగంగావించే అధ్యాపకులు కూడ నేడున్నారంటే ఏం చెప్పాలి. అంతేకాదు అధికార వ్యామోహంతో తోటి వారికి పదవీభంగం కల్గించి అధికారాన్ని చేజిక్కించుకొని పరపీడనా పరాయణులుగా కూడ కొందరు అధ్యాపకులు నేడుండడం లోక విదితం.

ఈ పరిస్థితి మారాలి. ఇట్టి అధ్యాపకులు ఆ వృత్తికే గొడ్డలిపెట్టు. ఇట్టి వారిని ప్రతి ఒక్కరూ గర్హించాలి. దీనివల్ల మంచి అధ్యాపకులకు కూడ చెడ్డ పేరు రావడమే కాక విద్యావ్యవస్థయే నిర్వీర్యమవుతుంది. ప్రతి అధ్యాపకుడు ఉత్తమ గురువుగా పేరొందాలి. అవతార పురుషులకే విద్యలు గఱపి పేరొందిన వారున్న లోకం మనది. శ్రీకృష్ణుడు వేదవ్యాసుడు – శంకరాచార్యులు జగద్గురువులుగా వాసికెక్కారు. బృహస్పతి – శుక్రాచార్యుడు – పరశురాముడు – వసిష్ఠుడు – విశ్వామిత్రుడు – సాందీపుడు – సమర్థ రామదాసు – రామకృష్ణపరమహంస – మున్నగువారు ఎందరో గురుపరంపరలో కీర్తింపబడ్డారు. ఎవరెంత గొప్ప గొప్ప పదవుల్లో ఉన్న వారందరు గురుముఖతః విద్య నేర్చిన వారే.

"సబ్ ధరతీ కాగజ్ కరూం లేఖనీ సబ్ బన్ రామ్

సాత్ సముద్ర కీ మసి కరూ గురుగుణ్ లేఖనజాయ్."

భూమినంతటినీ కాగితం చేసి, అడవులన్నింటినీ కలంజేసి సప్తసముద్రాల్ని సిరాగా చేసి రాసినప్పటికీ గురువు గుణాల్ని వర్ణించలేమంటాడు. కబీరుదాసు.

'నన్ను రాష్ట్రపతి అని పిలవడం కన్నా 'గురువు' అని పిలిస్తే గొప్పగా ఆనందపడతాను' – అని దివంగత రాష్ట్రపతి శ్రీ అబ్దుల్ కలాం అన్నారంటే గురువు విశిష్టత ఎంతటిదో తెలిసికోండి.

"దేరీజ్ నో ట్రూత్ గ్రేటర్ ద్యాన్ గురు. దేరీజ్ నో మంత్ర హయ్యర్ ద్యాన్ పాదుక. నో గాడ్ హయ్యర్ ద్యాన్ గురు."

కావున ప్రతి ఉపాధ్యాయుడు ఒక మంచి గురువుగా కీర్తింపబడి తమ దగ్గర చదువు నేర్చే విద్యార్థులకు ఆదర్శంగా ఉండాలని, ఉంటారని ఆశిస్తూ, ఈ వ్యాసం [illegible] నొప్పించడానికి వ్రాయలేదని, నేటి కాల పరిస్థితుల్ని [illegible] ఉంచుకొని కళంకింపబడుతున్న ఉపాధ్యాయ వృత్తిని [illegible] శిఖరాయమానం గావించాలనే తలంపుతో [illegible] తెలుపుతూ, ఈ వ్యాసం ఏరికైనా బాధ కలిగిస్తే క్షంత[illegible] తెలుపుకుంటూ ముగిస్తున్నాను.

**-: సర్వేజనా స్సుఖినోభవంతు :-**





# అన్నమయ్య సంకీర్తనలు - సామాజిక పరివర్తన

డా,, ఇ. వాసు
తెలుగు అధ్యాపకులు
పి.వి.కె.యన్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, చిత్తూరు.
చరవాణి :9490175017.

ఏ దేశ జాతీయ సమైక్యతకైనా, ఏ దేశ ఉద్యమానికైనా, కవిత్వమే ఎదురులేని ఒక ఆయుధం. మన భారతదేశంలో సంస్కృత భాషల్లో తప్ప దేశ భాషల్లో కవిత్వం రాస్తే చెల్లుబడి కాని రోజుల్లో 11 శతాబ్దంలో తెలుగులో భారతరచనతో ప్రారంభమైన కవితోద్యమం, 12వ శతాబ్దంలో ద్విపద కవిత్వంలో శైవమతోద్యమం వెలసినట్లుగానే, అష్టాదశ వర్ణనలతో సుదీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠ ప్రబంధ ప్రక్రియతో తప్ప ప్రజాకవిత్వానికి విలువలేని రోజుల్లో 15వ శతాబ్దంలో పదకవిత్వం ఉద్యమంగా సాగింది. అందుకే తెలుగు సాహిత్యంలో 15వ శతాబ్దానికి ఒక విశిష్ట స్థానం వుంది. రాజాస్థానాలకు, పండితుల ప్రశంసలకు నోచుకోని పదకవిత సాహిత్య సింహాసనాన్ని అదిష్టించింది.. పదకవితలనే ఆనాడు సంకీర్తనలని కూడా పిలిచేవారు. పదకవిత్వాన్ని రచించేవారిని వాగ్గేయకారులంటారు. సారంగదేవుడు సంగీత రత్నాకరంలో...

" వాజ్మాతురుచ్చతే గేయం ధాతురిత్య భిధీయతే
వాచం గేయంచకురుతేయ: సవాగ్గేయకారక: "

అని వాగ్గేయకారుని గూర్చి నిర్వచించాడు. ఒక పాటలోని మాటలకూర్పును మాతుపు అని, సంగీతపు కూర్పును ధాతువు అని, ఈ మాతు ధాతువులను రెండిటిని చేసి తానే పాడేవాడిని వాగ్గేయకారుడంటారని ఈ శ్లోకార్థం అతనినే అభయకారుడని, బయకారుడని, సంకీర్తనాకారుడని, పదకర్త అని పిలుస్తారు.

అన్నమాచార్యుని జీవిత విశేషాలు :- ప్రథమ వాగ్గేయ కారుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఇతడు క్రీ..1408లో కడపజిల్లా, రాజంపేట తాలూకా "తాళ్ళపాక" అనే గ్రామంలో లక్కమాంబ, నారాయణాచార్యులు అనే పుణ్యదంపతులకు క్రోధినామసంవత్సరం, వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు విశాఖ నక్షత్రంలో శ్రీ వేంకటేశ్వరుని నందకవంశములో జన్మించాడు. ఇతనికి తిమ్మక్క, అక్కలమ్మ అనే ఇద్దరు భార్యలు. అన్నమయ్య కొన్నాళ్లు సాళువ నరసింగరాయుల కొలువులో నివసించి ఆపైన రాజ దురహంకారాన్ని నిరసించి, రాజాశ్రయాన్ని వదలి నానాదేశ సంచారం చేసి తిరుమలలో స్థిర నివాసం ఏర్పరుచుకుని 32 వేల సంకీర్తనలు రచించడమే కాకుండా, సంస్కృతంలో సంకీర్తనలక్షణం, వేంకటేశ్వర మహత్యం, 12 శతకాలు, శృంగారమంజరీ, ద్విపదరామాయణం రచించినట్లు అతని మనమడు చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య జీవిత చరిత్ర ఆధారముగా తెలుస్తుంది. అన్నమయ్య క్రీ.శ.1503 నందు దుందుభి సంవత్సరం ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు శ్రీ వేంకటేశ్వర సాయుజ్య చెందాడు.

అన్నమయ్య సంకీర్తనలు - సమాజ సంబంధ ప్రభోదం

అన్నమాచార్య సంకీర్తనల్లో ప్రధాన లక్ష్యం భక్తి ప్రచారమే. అయినావారి సంకీర్తనల్లో భక్తి ప్రాధాన్యమైన అంశాలను సమన్వయిస్తూ సామాజిక ప్రతినిధియై అతడు చెప్పిన సామాజిక ప్రభోదం కూడా లేకపోలేదు. కవి సమాజంలో పుట్టి సమాజానికి ప్రతినిధియై సమాజ కష్ట సుఖాలను అనుభవించి తన ఆవేధనను, ప్రభోధాన్ని తన కవిత్వంలో వ్యక్తపరుస్తాడు. వాగ్గేయకారుల్లో ప్రాత:స్మరణీయుడైన అన్నమయ్య సంకీర్తనల్లోను సామాజిక సంబంధమైన ప్రభోధం కనిపిస్తుంది. ఇది అనేక అంశాల్లో ప్రస్పుటమవుతుంది.

భగవంతుడు సృష్టించిన పంచభూతాలకు హీనాధక బేధాలులేవని ఆహారనిద్రాభయాలు అందిరికి సమానమేనని మానవుల్లో ఈ విబేధాలు, హెచ్చుతగ్గులుండకూడదని పరబ్రహ్మం సంకీర్తనలో వివరించాడు.

"తందనాన ఆహి తందనానపురె
తందనాన భళా తందనాన
బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే పర
బ్రహమ్మమొక్కటే పరబ్రహమ్మమొక్కటే!!
కందువగు హీనాధికములిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకులమంతానొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ!!

అన్నమయ్య తాను ఎన్నో శాస్త్రాలు చదివి పరపీడన చేయడం పాపమని, పరోపకారం చేయడం పుణ్యమని, శాంతంకన్నా స్వధర్మం లేదని హరిదాసుడు కావడం కన్నా వేరేగతి లేదని చెబుతూ...

కంటిని దేయర్థము ఘన శాస్త్రములు దవ్వి
నంటున నిందు కంటెను నాణెమందూ లేదు!!
పరపీడన సేయుటకంటే పాపము మరెందులేదు
పరోపకారము కంటే బహుపుణ్యము లేదు
నిరత శాంతము కంటే నిజధర్మమెందులేదు
హరిదాసు డౌకంటే నటగతి లేదు!!

మానవుడిగా పుట్టినందుకు సద్గుణాలు కలిగి ఉండాలని, ధాన ధర్మాలు చేయాలని, దైవాన్ని తలుచుకోవాలని చెబుతూ.....

మనుజుడై ఫలమేది మఱి జ్ఞాని యౌదాకా
తనువెత్తి ఫలమేది మఱి జ్ఞాని యౌదా(కా
ధనికుడై ఫలమేది ధర్మముచేయు దా(కా
చదివియు ఫలమేది శాంతము గలుగు(దాకా
పెదవెత్తి ఫలమేది ప్రియమాడు దా(కా
మదిగల్గి ఫలమేది మాధవుదల(చుదాకా !!

అనే సంకీర్తన రచించాడు.

మానవులందరూ పుట్టుకతో సమానులే అయినా మానవ కల్పితమైన అజ్ఞానమైన కులతత్వంతో, కులభేదంతో ఒకరినొకరు అవమానపరచుకోవడం, హింసించుకోవడం, సమాజంలో జరుగుతుంది. కులతత్వాన్ని ఖండిస్తూ అన్నమయ్య ఈ సంకీర్తన వివరించాడు.

"విదురునకు బరలోకవిధి చేసెనట తల్లి
అదెధర్మ సుతుడు వర్ణాశ్రయంబులు విడిచి
కదిసి నీదాసుడైన కతముననే కాదేయీ
యెదురనే తుదిపదం బిహముననేకలిగే"
అంటరాని గద్దకులమంటి జయాయువునకు నీ
వంటి పరలోక కృత్యములు నేసితివిమును
వెంటనే కైంకర్యవిధి కలిమినేకాదె
వొంటి నీహస్తమున యోగమై నిలిచే !!

అన్నమయ్య రాజులను, మానవులను ఆశ్రయించి కొలిచి బ్రతికే వారిని కూడా నిరసిస్తూ

"మనుజు(డై పుట్టి మనుజుని సేవించి
అను దినమును దు:ఖ మందనేలా
జుట్టెడు గడుపుకై చోరని చోట్లు చొచ్చి
పట్టెడు గూటికై బతిమాలి!!

నాస్తికత్వాన్ని, వితండవాదాన్ని, వికృత చేష్టల్ని గమనించి ఆవేదన చెంది వారికి జ్ఞాన ప్రబోధం చేస్తూ అన్నమయ్య క్రింది సంకీర్తనలో

"ఇట్టి నాస్తికుల మాటయేమని నమ్మెడి ది(క
పట్టి సముల మంటానే భక్తుల దూషింతురు"
వేదములు చదువుతా విశ్వమెల్లా గల్లనేరు
అదె సతాము పుట్టుండి అదియును మాయనేరు
పాదగు విష్ణుడుండగా బయలు తత్వమనేరు
లేదు జీవత్వమంటా లేమల బొందుదురు.

అనే సంకీర్తనలు రచించాడు

సమాజంలో జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను చిత్తచాపల్యాలను గమనించి ఆవేదనచెంది శాంతి సంరక్షణలకోసం అన్నమయ్య రచించిన సంకీర్తన.

"తతిగాని యీపాటు దైవమా విచారించవే
కతలాయ చెప్పనేడు కలికాల మహిమ!!
అంగలార్చె కామినుల యంగభంగపు దోపు
లింగతాన మింట సూర్యడెట్టు చూచెనో!!
అరుదుగ గోహత్యలు సేయంగ దూడలంగలార్వ
సరిధర్మదేవలెట్టు సమ్మతించెనో!!
నిరపరాధుల జంపి నెత్తురు హరించగాను
తెరలకెట్టుడెరో దిక్పాలులు
విరస వర్తునులుండే విపరీతకాలమున
గరువాలు కపటాలే కలికాల మహిమ!!

అనే కీర్తనలో స్త్రీలకు మానభంగాలు జరుగుతుంటే సూర్యుడేవిధంగా చూచాడో, గోహత్యలు జరుగుతుంటే ధర్మదేవత ఎలా సహించిందో, ఇతర దేశీయులు వచ్చి దేవాలయాలను కొల్లగొడుతుంటే దేవతలు ఎలా ఉన్నారో, నిర్ధోషులను చంపిరక్తాన్ని హరిస్తుంటే దిక్పాలకులు ఎలా నిశ్చలంగా ఉన్నారో, ఇటువంటి విపరీత కాలంలో నమ్మకద్రోహాలు, గర్వాలు, కపటాలే ఎక్కువగా ఉంటున్నాయి. ఇదంతా కలికాల మహిమ అంటూ ఆవేదన చెంది దైవానికి విన్నవించుకోవడం కనిపిస్తుంది.

ఐహిక సంబంధమైన సంపదలు మానవ సంబంధాలు ఎప్పటికైనా నశించేవే భోగ భాగ్యాలపై మనసు పోనివ్వకుండా క్రింది సంకీర్తనలో ప్రజలకు ప్రబోధం చేశాడు.

" ఉన్న విచారము లేల వాహెూ సంసారులారా
యిన్నిటికితండే రక్షయిదే మీకు మనరో !!
భవరోగ వైద్యుని పాదములు సేవించి
భువి రోగముల బాసి పొదలరో
తవిలి పది దిక్కులు తానైన వాని
గా విసి పొగడి దిక్కు గలిగి బ్రదుకరో !!
మెచ్చరో మనుజులార మీరే హరికథలు
పుచ్చరో మీ మదిలోని పొరలెల్లాను

కొచ్చురో మనుజులార కోరకలెల్లను మీకు
నిచ్చుని శుభములు యిదియెల్లా కాలము !!

సమాజంలో మూఢమైన, ఛాందసమైన, హింసాత్మకమైన భక్తిని ఖండిస్తూ, సహేతుకమైన భక్తిని పెంపొందించడానికి అన్నమయ్య రాసిన సంకీర్తనలు.

మొక్కరో మీరు మోసపోక మీకు
దిక్కు దెనైన ఆది దేవునికి
మారు చేతులీయవద్దు మారుగాళ్ళియవద్దు
బీరాన గుండెలు గోసిపెట్టవద్దు
గోరపడి చిచ్చులోన గుండాలు చొ(్రవద్దు
ఊరకే మీ వారమని వున్నచాలు!!

అనే సంకీర్తనలో దైవానికి జంతుబలి నివ్వవలసిన పనిలేదని నీవేదిక్కు అని ఊరకుంటే చాలని ప్రజలకు సులభమైన భక్తిమార్గాన్ని ఉపదేశించాడు.

అన్నమయ్య సమాజంలో జరుగుతున్న అన్యాయాలను ఎత్తిచూపడమేగాక కుటుంబంలో పురుషాధిక్యత, స్త్రీ అణచివేత, స్త్రీ పారతంత్ర్యం అన్నీ బాగా గమనించి ఆవేదన చెంది, ప్రతి సృష్టికి కారకురాలు, పూజ్యనీయురాలు అయిన స్త్రీ కూడా మనిషేనని ఆమెను హీనపరచకూడదని, సమానత్వ హితబోధ చేస్తూ.....

"పొల(తులు జీవులే పురుషులు జీవులే
తల ప్రభావ బేధములేకాని
బలిమి స్వతంత్ర్యము బరతంత్ర మొకరికి
యెలమి నిందులో జెల్లే హీనాధకములే"

అనే సంకీర్తన రచించాడు.

అన్నమయ్య ఆ కాలంనాటి చదువులు దుస్థితిపట్ల చదువుకున్నవారు చేస్తున్న అజ్ఞానపు పనులవల్ల, వారి మూఢత్వం పట్ల ఎంతో ఆవేదన చెంది వారిలో జ్ఞానదీపం వెలిగించడానికి కొన్ని సంకీర్తనలు రచించాడు.

"చదువు గలిగిన ఫలము సంశయాంబేగాని
సందమల జ్ఞాన నిశ్చయమింతలేదు"
"ఏటి విజ్ఞాన మేటి చదువు
గూట బడి వెడలుగతి గురుతుగనలేదు"
"చదువు గనవలసినను శౌరినామము దిరుగ
జదువుటె సకల శాస్త్ర సమ్మతము"
"సారమైన చదువులు సారెసారె చదివినా
గోరపు దుష్టునికి కోపమేలమాను"

అన్నమయ్య తనకాలంనాడు మత విభేదాలతో వివాదాలాడుతున్న వారిని గమనించి వివిధమతాల సామరస్యం సాధించడం కోసం ఎన్నో సంకీర్తనలు రచించాడు.

ఎక్కడి మతములింకనేమి సాధింతేము నేము
అన్ని మతములు సరియైతేను వాసిలేదా
వింత చదువుల వల్ల వేవేమతాలు కంటి
పెక్కు మతములు చూచి బెండు పడ్డవారులేరా
దైవముకడే మతము లేవేరీ
సరవి ప్రపంచపు సకల మతంబులు
పరుసనెంచు కొదువులు మఱి కలవా"

"ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు అంతరాంతరము లెంచి చూడ బిండంతే నిప్పటి యన్నట్లు కొలుతురు మేము వైష్ణవులు కూరిమితో విష్ణు(డిని పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మం బనుచు తల(తురు మిము శైవులు తగిన భక్తులను శివు(డనుచు అలరి పొగడుదురు కాపాలికులు ఆది భైరవు(డనుచు"అని పై సంకీర్తనలో అన్నమయ్య మతసామరస్యంను వివరించాడు. పై విధముగా అన్నమయ్య తన సంకీర్తనలో సమాజానికి ఉపయోగపడే అనేక అంశములు సాంఘిక దురాచారాలు, జంతుహింస, కులతత్వము, అసమానతలు, దౌర్జన్యాలు, ఇలాంటి ఎన్నో సామాజిక సమస్యలను రూపు మాపటానికి తన సంకీర్తనల ద్వారా సమైక్యత సాధించడానికి పూనుకున్న ఉద్యమ కారుడు అన్నమాచార్యులు. ఈ సంకీర్తనలు ఒక ప్రాంతానికి చెందినవైనా అందులోని భక్తి, సంగీతం, మానవతా ప్రభోదం ఒక్క తెలుగు ప్రజలకే కాక దేశ ప్రజలందరికి మానవజాతికంతటికి చెందినవి.

మానవులు కుల, మత, భాష, ప్రాంత దేశాలను బట్టి వేరు వేరైనా మానసిక స్థితిలో మాత్రం అందరూ ఒక్కటే. ఇదే భిన్నత్వంలో ఏకత్వం, కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాలనే అంతశ్శత్రువుల ప్రభావంతో మానవుడు వైజ్ఞానికంగా, సాంకేతికంగా ఎంత పురోగతి చెందిన ఈ అంతశ్శత్రువులను జయించలేకపోతే అంతా నశించి పోతుంది. అందుకే అన్నమయ్య లాంటి సంకీర్తనాచార్యులు తమ సంకీర్తనల ద్వారా ప్రజలలో సుఖశాంతులు, భక్తి ప్రపత్తులును, జాతీయసమైక్యతను కల్గించడానికి కృషి చేశారు. అంతేకాకుండా సార్వకాలికం, సార్వదేశికం, విశ్వశ్రేయం అయిన అన్నమయ్య సంకీర్తనల ద్వారా జాతీయసమైక్యతే కాకుండా విశ్వసమైక్యత కూడా సమకూరుతుందని అశించవచ్చు.

# TECHNOLOGY IMPACT ON LANGUAGE CHANGES AND THE CREATION OF NEW LANGUAGE FORM

G. Deva Kumar
Lecturer in English,
Andhra Christian College,
Guntur

The pinnacle of technological progress is not measurable by any analysis preconditions. It is clearly evident that the only difference can be noted in the user's age difference. Regarding the high level of information technology use in education, especially at the high education institutions.

The Impact of modern technology and development of online communication on current communication skills of students and possible deviation from the standard use of language. Rapid development of information and communication technology (ICT) and daily use of new forms of communication such as MSN, Skype, Facebook, a text message in different ways affect the change of language.

New communication technology provides excellent coverage of education in all areas of the world. To standardize the communication within a nation has been arranged a formal type of communication. However, by the development of new technologies, the formal communication – particularly in education and relationships among students – gets an informal note. Because of the technological progress, and human alienation caused by technology development there are created a new kinds of communication through some new media. An increasing number of social networks across the internet (Facebook, MySpace, Flickr, Twitter, ....) created some new forms of communication that are every day more and more accepted by users.

Today, the educational institutions, and students themselves have different views on social network. They use them in order to get additional information about their students, colleagues, and some news regarding the study. Social networking has resulted in a lack of information security, privacy, and ultimately created some new ones, now nonexisting linguistic forms.

Language is historically subject to changes. At the present time the principle of alteration postuled one hundred years ago by Ferdinand de Saussure, father of modern linguistics, is easily observed in new mass media such as those generated by computer sciences (chat, msn, forums, etc.) and the mobile phons (sms). Although this principle guarantees the continuity of languages, it is not taken into account when debating, when voices arise in favour and against the new codes of communication arise.

Croatian language is a Slavic language spoken by Croats in t heir communities. Any society that homogenizes, achieves it due to internal communication. For the purposes of these communications forms, a common language (koine) is created, which occurs spontaneously, appropriate to the needs and communications, space and / or time. Optimizes according to the principle of minimum cost, the economy in the language, such as lingua franca. The standard idiom has a function of understanding and creating the official, general and cultural activities in schools, universities, parliament, national television and radio, print, public signs, services and activities of clerks and political, entrepreneurial, scientific and professional public. It is one and unique to all members of diverse organic idiom to whom is possible and

desirable. The standard idiom (previously referred to as the literary language) is more valuable than the organic (dialect) speech.

Language is part of a particular culture and tradition, but in the new, information – time, with new media it has received a completely new interpretation. Regular expressing the meaning by language is directed toward multimedia expression meaning that multiplied by meaning and context of images and text. Experts say that we will in twenty years with our present knowledge be illiterate – obviously we are aware of the act that our knowledge is becoming obsolete and it must be amended by new one. Language takes on new aspects, new style. In addition to the existing functional styles of the standard written Croatian, such as scientific, administrative and business, journalistic and conversational style seems to be dangerously approaching the introduction of new internet style that may result from the latest, but goes beyond it by establishing their own new rules. Conversational style, as it is known, is the everyday style (mostly verbal) communication. In a written account appears in the records, letters and notes with its well known features : extempore, informality, ease and simplicity. More than other styles, it has conditioned with the specific way of thinking. Therefore, it is full with expressive and emotionally colured expressions. Has its own forms, which are reflected in the phonetics and in the grammar and in the vocabulary. Since it is spontaneous, it is much less susceptible to the norms of standard language. Natural and spontaneous. And there the similarities with the conversational style stop and star the ramification, reshuffling rearranging and erosion by internet – style grammar. The new style is telegraphic, such as the internet is and coded rule applies to no rules.

**References :**

M., Njavro, D.: "E-Learning Course Development – Quality standards" http://www.blackboard.com

Tudman Vukovic, N. (2008). Communication technologies and their influence on language:

# చిందు కళాప్రపూర్ణుడు, కవీశ్వరుడు – గడ్డం మచ్చయ్యదాసు

– డా. గడ్డం మోహన్ రా
లెక్చరర్, ఉమెన్స్ కాలేజ్, కో
ఫోన్ : 9000137

చిందు కళాకారులలో, సాహితీవేత్తలలో ప్రముఖుడు గడ్డం మచ్చయ్యదాసు. చిందు కళా ప్రపూర్ణుడిగా, కవీశ్వరుడిగా ఎంతోమంది విద్వాంసుల మన్ననలందుకున్న మచ్చయ్యదాసు పూర్వపు కరీంనగర్ జిల్లా, మానకొండూరు మండలం, జగ్గాయపల్లె లేదా అలివేలు మంగమ్మ పల్లి గ్రామ వాస్తవ్యులు. చిన్ననాటి నుంచే వైష్ణవ మతానుయాయుడిగా, భక్తి భావంతో దాస భక్తిని కనబరిచిన భక్తాగ్రేసరుడు గడ్డం మచ్చయ్యదాసు.

చిందు కళాకారుల జీవితాలు పూలపల్లకీలుకావు. మల్లెల తోరణాలు కావు. మకరంద బిందురసస్యందనాలు కావు. ఆర్తి ఆవేశాలతో ఎగిసిన అగ్నికీలలు. చారిత్రక సత్యాలతో మేళవించిన సాంస్కృతిక సౌరభాలను వెదజల్లిన గగన కుసుమాలు. ఆది జాంబవుడి ఆవేదనా పూరిత అశ్రువులతో జన జీవన స్రవంతిలో ఆనంద భాష్పాలను నింపిన కెరటాలు. అటువంటి వారిలో కళాకాంతి పుంజమై అలరారి, కొండగట్టు ఆంజనేయ స్వామికి భక్తుడై భజన కీర్తనలతో స్వామిని ఆనంద పారవశ్యంలో ముంచెత్తిన అర్చకోత్తముడు గడ్డం మచ్చయ్యదాసు.

1934 మే 10న గడ్డం లాల్, ఎల్లమాంబలకు ద్వితీయ పుత్రుడిగా జన్మించాడు. గడ్డం మచ్చయ్యదాసు పూర్వీకులంతా జగ్గాయపల్లెలోనే ఉండేవారు. గడ్డం మచ్చయ్యదాసుగారి అన్నా వదినలు – గడ్డం రామస్వామి, గౌరమ్మ. జగ్గయ్యపల్లిలో చిందు కళాకారుల కుటుంబాలు రెండే ఉండేవి, ఒక్కటే ఇల్లు. గడ్డం మచ్చయ్యదాసు మానకొండూరు పరిసర ప్రాంత ప్రజలకు చిందు కళాకారుడిగా, అర్చకుడిగా సుపరిచితుడు.

చిన్న బాలశిక్ష, పెద్ద బాలశిక్షలను అభ్యాసం చేసిన మచ్చయ్యదాసు నాలుగు లేదా ఐదో తరగతి వరకు పాఠశాల విద్యపూర్తిచేసి ఆర్థిక కారణాలవల్ల చదువు మధ్యలోనే ఆపేసి చిందు కళ వైపు మరలాడు. చిన్న చిన్న వేషాలతో మొదలైన మచ్చయ్యదాసు కళాప్రస్థానం ఆ తర్వాతి కాలంలో అనేకపాయలుగా ప్రవహించింది.

మద్దెల వాయించడంలోనూ, హార్మోనియం వాయించడంలోనూ గడ్డం మచ్చయ్యదాసుది అందెవేసిన చేయి. దీర్ఘ దేహుడు, దీర్ఘ బాహుడు కాకపోయినప్పటికీ తన పాండిత్యం, కళౌన్నత్యం బాహ్యరూపాన్ని మరుగునపడేసింది. తెల్లటి వస్త్రధారణ, త్రిపుండ్ర ధారణ మచ్చయ్యదాసు సొంతం.

'మచ్చయ్య' అనేది ఆయన పూర్వపు పేరు. 'చాత్తాద వైష్ణవం' ప్రభావం, ఆళ్వారు స్వాముల ఆశీర్వాదబలంతో 'సిరుసనగాండ్ల' శ్రీహరిపై అపరిమిత నమ్మకం ముప్పిరిగొని శ్రీ మహావిష్ణువుకు దాసుడై 'మచ్చయ్యదాసు'గా మారాడు. చాత్తాద వైష్ణవం హిందూమతంలోని అనేక మూఢ విశ్వాసాలపై తన నిరసనను వ్యక్తం చేయడమేగాక, హైందవ మత సంస్కరణకు పూనుకుంది. ఈ సంస్కరణల్లో భాగంగా దళితులను, నిమ్న వర్గాలను తమవైపు ఆకర్షితులను చేసుకోవడానికి అనేక రకాలుగా ప్రయత్నించి ఫలితాన్ని సాధించింది. ఇటు హైదరాబాద్‌లో భాగ్యరెడ్డి వర్మలాంటి వాళ్ళ పోరాటాలు దళితుల్లో, అస్పృశ్యతకు గురైన వాళ్ళలో ఆత్మవిశ్వాసాన్ని నింపడమేగాక తమను 'ఆది హిందువులు'గా గుర్తించడంపట్ల హర్షం నింపింది.

గడ్డం మచ్చయ్యదాసు చిందు భాగోతం ప్రదర్శనలలో భాగంగా గడ్డం దుర్గయ్య (తంగళ్ళపల్లి) గడ్డం పోషయ్య (కొహెడ), గడ్డం మల్లేషం (కొహెడ), గజవెల్లి యాదస్వామి (కట్కూరు), గడ్డం కొమురయ్య (గుండారం) గడ్డం కిష్టయ్య (తంగళ్ళపల్లి), వెంకట నర్సయ్య (సిద్ధిపేట), గడ్డం సారమ్మ (తంగళ్ళపల్లి), గడ్డం ప్రమీల (కొహెడ), గడ్డం సుజాత (కొహెడ), గడ్డం సుశీల (గుండారం), గడ్డం కనకమ్మ (చెర్ల అంకిరెడ్డిపల్లి) మొదలైన వాళ్ళతో మ్యాళ్ళంగట్టి ఆటలాడేవాళ్ళు.

చిందు భాగోతం ప్రదర్శనల్తో వివిధ ప్రాంతాలను చుట్టేస్తున్నపుడు కరీంనగర్ జిల్లా చొప్పదండి మండలం, కాట్నపల్లి నివాసులైన గజ్జెల కృష్ణదాసుతో ఏర్పడ్డ పరిచయం గడ్డం మచ్చయ్యదాసు కవిగా ఎదగడానికి తోడ్పడింది. కాట్నపల్లి కృష్ణదాసుగా ఊరిపేరునే ఇంటిపేరుగా మార్చుకున్న కృష్ణదాసు శిష్యరికంలో మచ్చయ్యదాసు ఆశుకవిగా అవతరించాడు. ఛందో నియమాలు, అలంకార శాస్త్రాలు, వ్యాకరణ నియమాలు ఒంటబట్టించుకున్నాడు. ఈ శిష్యరికం అనంతర కాలంలో మచ్చయ్యదాసుకు అమితంగా ఉపయోగపడ్డది. అనేక గ్రంథాలు రాయడానికి ఉపకరించింది.

...వను మించిన శిష్యుడిగా మచ్చయ్యదాసు పేరు ...కున్నాడు. చిందు కళా ప్రపూర్ణుడిగా, కవీశ్వరుడిగా ...మైలురాళ్ళను అదిగమించాడీ కళాకవి పండితుడు.

మచ్చయ్యదాసు 'భద్రాశయన'లో సుశీల, 'కీచక...'లో సుధేష్ణ, 'మాంధాత'లో విమలాంగి, 'మైరావణ'లో ...ండి తదితర పాత్రలతో అద్వితీయమైన కళాకౌశలాన్ని ప్రదర్శించేవాడు.

మచ్చయ్యదాసు భార్యపేరు శంకరమ్మ. వీరికి ఒక కుమారుడు జన్మించి అతి చిన్న ప్రాయంలోనే ప్రమాదవశాత్తు ...విలోపడి చనిపోయాడు. దాంతో మచ్చయ్యదాసు నిర్వేదంలో కూరుకుపోయాడు. ముద్దుముదిపాలు ...రకముందే ఆరేండ్ల వయస్సుల్లోనే అనంతలోకాలకు పయనమైపోయిన కొడుకును చూసి శోకసంద్రంలో మునిగిపోయాడు. కాల ప్రవాహాన్ని ఎవరూ ఆపలేరు కదా! అందుకే ఇరుగుపొరుగువాళ్ళ సూచనలతో – "కొండకుపో అంజన్నను సూడు" అన్న ఓదార్పు మాటలతో తన భార్య శంకరమ్మ సమేతంగా కొండగట్టుకు పయనమైపోయిండు. దట్టమైన కీకారణ్యంలో, రాళ్లు రప్పల మధ్యపడి నడుస్తూ తన ఆలోచనా దృక్పథాన్ని మార్చుకున్నాడు. ఆ అటవీ ప్రాంతంలోనే క్రూర మృగాల మధ్య, పురుగూ పుట్రల నడుమ కాలంగడుపుతూ కొండగట్టు ఆంజనేయస్వామికి భక్తుడయ్యాడు. అక్కడ జరిగే పూజలను, నిత్యధూపదీప నైవేద్యాలను, కైంకర్యాలను నిశితంగా గమనించాడు.

మచ్చయ్యదాసుకు తన చిన్ననాటి చిన్న బాలశిక్ష, పెద్ద బాలశిక్ష గ్రంథాల పరిచయం, గజ్జెల (కాట్నపల్లి) కృష్ణదాసు శిష్యరికం ఉత్తమమైన మంత్రోచ్చారణకు దోహదపడ్డాయి. భక్తిగీతాల ఆలాపనతో అక్కడివారిని మంత్రముగ్ధులను చేసిన మచ్చయ్య చరిత్రలో నిల్చిపోయే విధంగా పూజారిగా నియమించబడ్డాడు. ఆ తర్వాత తన కవితాధార అనర్గళంగా పెల్లుబికింది. మాల మాదిగలకు దేవాలయ ప్రవేశాన్ని నిరాకరిస్తూ, అస్పృశ్యుల ను వెలివేస్తున్న కాలంలో మచ్చయ్యదాసు అర్చకుడిగా నియమింపబడడం సువర్ణాక్షరాలతో లిఖించవలసిన సంఘటన.

కొండగట్టులో దాదాపు ఇరవై ఐదు సంవత్సరాలు పూజారిగా పనిచేసిన మచ్చయ్య, అర్చకత్వం నెరపుతున్న సమయంలోనే 'కొండగట్టు శ్రీ వీరాంజనేయస్వామి దండకములు – మంగళహారతులు భజన కీర్తనలు' అనే గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథాన్ని కొండగట్టు వంశపారంపర్య అర్చకులైన టి. నారాయణస్వామి, టి. మారుతి స్వామిగారలు అచ్చువేయించారు. 1987లో ప్రథమంగా 5,000 ప్రతులు జన జాగృతిలోకి వెళ్ళాయి.

కొండగట్టు ఆంజనేయస్వామికి మచ్చయ్యదాసు సేవకుడుగా మారడం ఒక యాదృచ్ఛికమైన అంశం. మానకొండూరు నుంచి కొండగట్టుకు పిల్లబాటల వెంబడి వరుంగులు తీస్తూ, అరణ్యాలు దాటుకుంటూ, కళావిహీనమైన దేవళాన్ని దర్శించుకోవడం, స్వామిని తనివితీరా చూడడంతో మచ్చయ్యదాసు ఆనందానికి అవధిలేకుండా పోయింది. అక్కడి పూజారుల పూజా విధానం, సమయపాలనాలేమి మచ్చయ్యదాసును ఆలోచింపజేశాయి. ఉదయం తొమ్మిది పదిగంటలకు రావడం పూజ ముగించి వెళ్ళిపోవడం నివ్వెరపరిచింది.

"అప్పుడెక్కడిది...? ఇగ అయ్యగార్లు అచ్చుడు, పూజ చేసుడు, ఎల్లుడేనాయె. అప్పుడు వెలుతురు లేదు ఏమీ లేదు. ప్రొద్దునస్తురు. ఆయింత తొమ్మిది పదిగంట్లకల్ల పూజ చేతురు, ఖతం విరమించుకొని పోదురు. ఇగ అటువంటి టైమ్లు ఈయన (గడ్డం మచ్చయ్యదాసు) పోయిండు గద ఈయనకేముందిగ భగవంతుడా నువ్వే దిక్కు నువ్వే సక్కి.. అనుకుంట ఉన్నడు. ఇగ అప్పుడు... మొత్తం పెద్ద పులులు, జంతువులు – ఇగ ఈయిన పోయిన తర్వాత ఆ చెట్లన్ని నరికిపిచ్చి, అడివంత సాపు చేపిచ్చి, మంచిగ జేసి... పోయి గవర్నమెంట్ల పడ్డడు. గవర్నమెంటొచ్చి, మళ్ళీ ఒప్పుకొని ఈయిన తోటి మాట్లాడి, మరి ఈయిన ఎట్లాంటోడో తెల్సుకోవాలెగద అని తెల్సుకొని, మచ్చయ్యదాసు పురాణాలు, కథలు, పద్యాలు మంచిగ చెప్పెటల్లకల్ల ఇగ ఆడికెల్లి మచ్చయ్యదాసుకు పూజారి కొలువయ్యింది"[6] అని గజ్జల లక్ష్మయ్య తెలిపిన వాస్తవాంశాలు నాటి సంఘటనలను కళ్ళకు కట్టినట్లు చూపుతున్నాయి. ఆంజనేయస్వామికి "ఊడిగపు సేవకుడై" అర్చించి, మంగళ హారతులు పాడాడు.

'నీదేకులమన్న ప్రశ్న వెలయించి చివాలున' లేచిపోయే వాళ్ళకు సమాధానంగా "ఎక్కువని మది పలుకబోకుమురా వోరి యెదవ పూర్వము యెక్కువెవ్వరో తెలియ బలుకుమురా..." అని తీవ్ర స్వరంతో హెచ్చరించాడు. అంతేకాదు దీటైన ఉత్తరకరవాలంతో కులరక్కసి ప్రశ్నల కుత్తుకలను ఖండించాలనుకున్నాడు. ప్రతిగా 'జాంబవపురాణం' రచించాడు. దీని రచనాకాలం 1987-1988. వేలయేండ్లుగా మౌఖికంగా ప్రసారమవుతున్న చిందు జాంబవపురాణాన్ని అక్షరీకరించిన వాడిగా మచ్చయ్యదాసు కనిపిస్తాడు. ఇది 2015 దాకా అముద్రితమే. నా సంపాదకత్వంలోనే చిందు పబ్లికేషన్స్ ద్వారా 2015లో అచ్చువేయించాను.

మచ్చయ్యదాసు కేవలం కొండగట్టులోనే కాకుండా వేములవాడ, తిరుపతిల్లోను కొంతకాలం అర్చకుడుగా పనిచేసినట్టు వారి కుటుంబీకులు చెప్పారు. అయితే మచ్చయ్యదాసు 'జాంబవపురాణం' రాయటం హైందవులకు మింగుడు పడకపోగా, ఆది హిందువులకు హర్షాతిరేకాలను కలిగించింది. తర్వాతి కాలంలో కులకళంక పంకిలం ఛాయలు పొడసూపడంతో మచ్చయ్యదాసు హృదయం కలిచివేయబడింది. తన అన్న రామస్వామిగారు చనిపోవడంతో కుటుంబ భారమంతా మచ్చయ్యదాసుపైనే పడింది. తాను ఎంతో ఆశతో తన సర్వస్వం ఆంజనేయుడే అనుకొని బయలుదేరిన మచ్చయ్యదాసు తిరిగి వెనుదిరగకతప్పలేదు. మందపల్లి నివాసి పిల్లిట్ల చంద్రమౌళి, తంగళ్ళపల్లి నివాసి గడ్డం కిష్టయ్య తదితరుల ఓదార్పు మాటలతో, జగ్గయ్యపల్లికి తిరుగు పయనమయ్యాడు మచ్చయ్యదాసు. చిందుకళలోనే ఆద్యంతం లీనమై చిందు కళాప్రపూర్ణుడిగా వాసికెక్కాడు. 'రేణుకా స్వయం వరం, భక్త భల్యాణ, గయోపాఖ్యానం, ఇంద్రార్జున వంటి అముద్రిత గ్రంథాలతో పాఠకుల మదిలో, ప్రేక్షకుల ఎదలో చెరగని ముద్రలు వేసిన మచ్చయ్యదాసు భార్యా వియోగంతో క్రుంగిపోయి 21 మార్చి 2005న ఈ లోకం విడిచివెళ్ళిపోయాడు. చిందు కళాప్రపూర్ణుడుగా, కవీశ్వరుడుగా అజరామరమైన ఖ్యాతిని సంపాదించుకొన్నాడు గడ్డం మచ్చయ్యదాసు.

## ఆధార గ్రంథాలు


1. మోహన్‌రావు, గడ్డం. **చిందు భాగవతం- వస్తువు, ప్రదర్శన రీతుల అధ్యయనం.** (అముద్రిత ఎమ్.ఫిల్ సిద్ధాంత గ్రంథం). హైదరాబాద్ విశ్వవిద్యాలయం, 2019.
2. మోహన్‌రావు, గడ్డం. **చిందుల ఎల్లమ్మ**. చిందు పబ్లికేషన్స్, హాజీపూర్. 2013
3. మోహన్‌రావు, గడ్డం. **చిందుల హంస**. చిందు పబ్లికేషన్స్, హాజీపూర్. 2013.
4. మోహన్‌రావు, గడ్డం. **చిందుల ఎల్లమ్మ**. చిందు పబ్లికేషన్స్, హాజీపూర్. 2013
5. మోహన్‌రావు, గడ్డం. (సం). **చిందు జాంబవ పురాణం**. చిందు పబ్లికేషన్స్, హాజీపూర్. 2015.
6. మోహన్‌రావు, గడ్డం. (సం). **మంగళ హారతులు భజన కీర్తనలు**. చిందు పబ్లికేషన్స్, హాజీపూర్. 2015.
7. మోహన్‌రావు, గడ్డం. (సం). **రేణుకా ఎల్లమ్మ కథ**. చిందు పబ్లికేషన్స్, హాజీపూర్. 2015.

# నవలా సాహిత్యం - మోదుగుపూలు

**రామారావు గంజికుంట్ల**

పరిశోధక విద్యార్థి

కాకతీయ విశ్వ విద్యాలయం, వరంగల్.

సెల్ : 9494320080

నవలాంతీతి నవలా... నవలా.. నూతనమైనదిగాను, లలితాత్మకమైనది దానినని నవల అంటారు. యదార్థ దృష్టితో అధ్యయనం చేసి గద్యం రూపంలో వ్యక్తం చేసేది నవల. నవలలో ఇతివృత్తం ప్రధానాంశం. తెలుగు నవలా చరిత్ర 1872లో ప్రారంభమైంది. ఇంగ్లీషు నవల 400 సంవత్సరాలలో ఎంతటి వికాసాన్ని పొందిందో నూరు సంవత్సరాలలో తెలుగు నవల అంతటి వైవిధ్యాన్ని పొందింది.

దాశరథి రంగాచార్య వ్రాసిన "చిల్లర దేవుళ్ళు", "మోదుగు పూలు"

<u>మోదుగు పూలు నవలలోని ఇతివృత్తం :</u>

హైదరాబాద్ రాజధానిగా విస్తీర్ణమైన సామ్రాజ్యాన్ని అసఫ్ జాహి వంశస్తులు ఏడు తరాల వారు అవిచ్ఛిన్నంగా నైజా రాజ్యాన్ని పరిపాలిస్తున్న రోజులలోని ఇతివృత్తమే ఈ నవల. నైజాం నవాబు పాలనలో మదోన్మతులైన అధికారుల పీడనలో దుర్భర జీవితం గడుపుతున్న తెలంగాణ ప్రజల జీవన చిత్రణ నిజాంల తదతనంతరం జరిగిన రైతాంగ పోరాటం, సామాజిక అంశాలు, సామాజిక పరిణామాల కోసం ఎలా స్పందించారో, తమ స్వేచ్ఛ కోసం తమ హక్కులను కాలరాస్తున్న వారి కోసం ఎలా నిరసనలు తెలిపారో రాజకీయ అస్థిత్వం కోసం, ఆందోళన తిరుగుబాటు చేసి, చివరకు భూమి కోసం, భాష కోసం వెట్టి చాకిరి, దౌర్జన్యం, నిజాముల పాలనను తుద ముట్టించడం కోసం ఎలా పోరాటం చేశారో, ఎలా ప్రతిఘటించారో వ్రాసి ఈ నాటి తరం వారికి కళ్ళముందు కదలాడేటట్లు రచనలు చేశారు దాశరథి రంగాచార్యులు, దౌర్జన్యానికి ఒక ఉదా॥ మహబూబ్ అలీఖాన్ పిల్లవాడిగా ఉన్నప్పుడే రాజయినాడట. దివాన్ ఒక పల్లెవాడ ఎనిమిది సొరకాయలు తీసుకొని అమ్ముకోవటానికి పట్నం వచ్చాట్ట. ఎనిమిది మంది కొత్వాళు ళ్ళ ఎనిమిది సొరకాయలు లాక్కున్నారు. తొమ్మిదో కొత్వాలుకు మిగలకుంటే ఒక తన్ను ఝాడించి తన్ని కంబళి లాగి చంకనబెట్టుకొని ఇట్లన్నాడు. అరే! లుచ్చా అందరికి వంతు సొరకాయ ఇచ్చి నా వంతు తప్పించినావా? ఆ ఓనమాలు రాని మా మాలీ పటేల్ నీకు ఎక్కువైనాడా! తే! నా వంత సొరకాయ, అదిచ్చి ఆ గొంగళి తీసుకుపో అని గుద్దెర చేసుకొని కంబళి తన చంకన పెట్టుకొని తన ఇంటికి పోయినాడు. పల్లెవాడు వెళ్ళిపోతూ రాజు భవనపు గోడల మీద ఇలా రాసిపోయినా

అంధేరీ నగరీ చౌపట్ రాజా

(ఆర్) హై కద్దూ నౌ హై కొత్వాల్

నవాబ్ బచ్చా దివాన్ బచ్చా

<u>సామాజిక స్పృహ :</u> తెలుగు నవలా సాహిత్య పాఠకులు బాగానే ఉన్నారని చెప్పవచ్చు. 19 శతాబ్ది చివరి వరకు నవలకు మంచి ఆదరణే ఉంది అని కూడా అనొచ్చు. ఎందుకంటే దూరదర్శన్ సెట్లు ప్రతి ఒక్కరు కొనుక్కోక ముందు నవలా పాఠకులు చాలా మంది ఉండేవారు. కాలక్షేపం కోసం చదువు వచ్చిన ప్రతి వారి చేతిలో నవలలు కనబడేవి. ఉదాహరణకు యండమూరి వీరేంద్రనాథ్ వ్రాసిన "వెన్నెలలో ఆడపిల్ల" నవలను ఎంత ఉత్సుకతతో పాఠకులు చదివారంటే "నువ్వంటే పడి పడి చస్తానే" అన్నట్లు ధారావాహికల కోసం, వార పత్రికల కొనుగోళ్ళలో నిమగ్నమై ఉండేవారు.

21వ శతాబ్దం ఆది నుండి ప్రతి ఒక్కరికి హస్త భూషణాలుగా సెల్లు, ల్యాప్ట్యాపులు దక్షిణ భారతీయ జీవన విధానంలో పెను మార్పులకు గురి చేసింది. చేస్తుంది, అదే కోణంలో ఆంగ్ల మాధ్యమాల పట్ల తల్లిదండ్రులు, సమాజం ఎనలేని ఆంగ్ల మోజులో పడిపోయి, తెలుగు వారిమే అనే మాట మరచిపోయి, పుట్ట గొడుగుల్లా పుట్టుకొస్తున్న ప్రైవేటు యాజమాన్యాల మోడల్, కార్పోరేట్, టెక్నో, పొండేషన్ అనే రంగుల పాఠశాలల్లో ఫారాల్లో కోళ్ళలా చేరిపోవడం, ఇరుకు గదులు, బట్టి పద్ధతులు, అయోగ్యులైన టీచర్లచే పాఠాలు చెప్పించడం, చందమామ కథలకు, గ్రంథాలయ చదువులకు పీరియడ్లు కేటాయించకపోవడం, తెలుగులో మాట్లాడితే ఫైన్ కట్టించడం మొదలగునవి చేయడం, చోద్యం చూస్తున్న ప్రభుత్వం, ఎటువంటి క్రమశిక్షణా చర్యలు లేకపోవటం. ఒక నవలా సాహిత్య పఠనకు చోటేది? ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులను చేర్పించక పోవడం వల్ల ప్రభుత్వ బడులు కూడా ఆంగ్ల మాధ్యమాల వెంటే ఉండడం వల్ల నవలలపై ఆదరణ కరువయింది. కథలోనూ, భాషలోనూ వ్యాపార దృష్టియే కాని

ప్రామాణిక దృష్టి లేదు. కొన్ని చౌకబారు నవలలు అసభ్యకరమైన శృంగారంతో వస్తున్నాయి. ఇవి పాఠకులకు మేలు చేయకపోగా హానికరంగా మారాయి.

పైన ఉదహరించిందంతా నాణానికి ఒక వైపు అయితే మరో వైపు పల్లెలే పట్టు కొమ్మలని నొక్కి వక్కాణించిన నానుడిలో భాగంగా గ్రంథాలయాలు ప్రతి గ్రామాల్లో ఉన్నట్లయితే మునుపుకంటే ఇప్పుడు అక్షరాస్యతా శాతం పెరిగిన ఈ రోజుల్లో తెలుగులో ప్రావీణ్యం ఉన్నవారు చాలా మందే ఉన్నారు. అలాంటివారు నవలా పాఠకులుగా మారే అవకాశం ఎక్కువే ఉండొచ్చు. కానీ గ్రంథాలయాలు విస్తరణకు నోచుకోలేదు. ప్రపంచీకరణ ప్రతి ఒక్కరిని డబ్బు కోసమో? ఉద్యోగం కోసమో? కూలినాలి కోసం పట్టణాలకు, నగరాలకు పయనమయ్యే ప్రజలు వారి వారి యాంత్రిక జీవన విధానాల్లో మాడి మసి అయిపోయే పరిస్థితులు కనిపిస్తున్నాయి. సమయం దొరికితే ఏదైనా మాదక ద్రవ్యాలకు అసాంఘిక కార్యకలాపాలకు పాటుపడుతున్నారు తప్ప సక్రమంగా ఎక్కడికైనా వెళ్ళి ఏదైనా పుస్తకాలు చదివే పరిస్థితి మాత్రం మృగ్యమైపోయింది. ఎందుకంటే అరచేతిలో అంజనంలా సెల్లుల్లో ప్రపంచాన్ని చుట్టి వస్తున్నారు. ఐమాక్సుల్లో కావలసిన సినిమాలు చూస్తున్నారు.

\- - -


**రామారావు గంజికుంట్ల**

పరిశోధక విద్యార్థి

కాకతీయ విశ్వ విద్యాలయం, వరంగల్.

సెల్ : 9494320080

# తెలుగు శతక సాహిత్యం - మానవ సంబంధాలు పరివర్తన

మానవ సంబంధాలు అపురూపమైనవి. అది లేనినాడు మనిషికీ, జంతువుకీ భేదం లేదు. సంఘంలో మనలేని మానవులు పశువైనా కావాలి. లేదా పరమాత్మయినా కావాలని అంటాడు అరిస్టాటిల్ మహాశయుడు పొరుగువాడికి తోడ్పడం మాట అటుంచి తన కుటుంబసభ్యులతోనే అనుబంధాలు కొనసాగించడం లేదు నేటితరం యువత. దీనికి ఏవైన కారణాలు కావచ్చు. ఆర్థికపరమైన అభిప్రాయపరమైన ఇబ్బందులు అయినా మనిషి సాటి మనిషిని ప్రేమించాలి. ఇది కుటుంబంతోనే ప్రారంభమవ్వాలి. పిల్లల భవిష్యత్తు బాగుండాలని అహర్నిశలు శ్రమించి, తమ వ్యక్తిగత ఇష్టాలను పక్కనబెట్టి బిడ్డల కోసం పాటుపడ్డ తల్లిదండ్రులను వృద్ధాప్యంలో ఎంతోమంది పిల్లలు వారిని నిరాదరణకు గురిచేస్తున్నారు. అందుకే వేమన "తల్లిదండ్రుల మీద దయలేని పుత్రుండు పుట్టనేమి వాడు గిట్టనేమి" అన్నాడు.

ప్రాచీనకాలంలో తల్లిదండ్రులను, గురువులను ప్రత్యక్షదైవాలుగా భావించి, మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ,, అతిథిదేవోభవ అని స్తుతించేవారు. అన్నదమ్ముల మధ్య, అక్కాచెల్లెళ్ళ మధ్య కూడా గాఢమైన ప్రేమానుబంధాలుండాలి. తన తల్లి కడుపులో పుట్టినవాడు సోదరుడు లేదా సహోదరుడు అవుతాడు, అట్టివాడు మరల దొరకడు. అందువలన సోదరీ సోదరుల చిన్న చిన్న విభేదాలను మరచిపోయి ఆప్యాయతను కొనసాగించాలి. ఇచ్చిపుచ్చుకోవడం నేర్చుకోవాలి. మనకు పరిచయమైన వారందరూ మంచి స్నేహితులు కాలేరు. మంచి స్నేహం దొరకడం ఒక ఎత్తైతే దానిని నిలుపుకోవడం మరో ఎత్తు. స్నేహంలో ఎక్కువ తక్కువలు ఉండకూడదు. స్వార్థపూరితమైన ఆలోచనలతో కూడిన స్నేహం ఎక్కువ కాలం నిలువదు.

భార్యాభర్తలమధ్య, అత్తాకోడళ్ళమధ్య, తల్లిదండ్రులు, పిల్లలమధ్య ఆర్థిక సూత్రాలు చోటుచేసుకుంటే ఇంక ఆ కుటుంబానికి మనశ్శాంతి ఉండదు. వ్యక్తిగతమైన శాంతి సమాజశాంతికి ఎంతో ఆవశ్యకం. భద్రభావం కుదురుకోవడానికి మానవ సంబంధాలు దోహదం చేస్తాయి. ఎలాంటి క్లిష్టపరిస్థితులు ఎదురైనా నిలబడగలిగే ఆత్మస్థైర్యం మనిషికి ఉండాలి. నీవు ఒంటరివి కావు, నీకు తోడుగా నిలబడే నీ సోదరుడు, స్నేహితుడు లేదా నీ బంధువు ఉన్నాడు అని చెప్పగలిగిననాడు హత్యలు, ఆత్మహత్యలు ఉండవు.

మనసుంటే మార్గం ఉంటుంది అనే ఆర్యోక్తిని గుర్తించుకొని, "స్వంత లాభం కొంత మానుకొని, పొరుగువాడికి తోడ్పడవలెననే" గురజాడ ఉపదేశాన్ని ఆచరణలో పెట్టాలి. అప్పుడు మనకు అందరు ఆప్తులుగానే కనిపిస్తారు. అనుబంధాలు ఏర్పరచుకోవాలి. ఉన్నత ఆత్మీయబంధాలను హృదయంలో భద్రపరుచుకోవాలి. సమాజంలో నెలకొన్న అశాంతికి మానవసంబంధాలు దెబ్బతినడం ఒక ప్రధానకారణం. అవతలివాడు నీలాంటివాడే అనే ఒక్క భావన చాలు హింసాప్రవృత్తి అంతం కావడానికి. ఎదుటిమనిషి నీకు ఏమి కాకపోయినా ఎవరికో ఒకరికి పుత్రుడు. మరొకరికి సోదరుడు. ఇంకొకరికి భర్త, వేరొకరికి తండ్రి అనిపిస్తే చాలు, హింసా పరాజిత మవుతుంది. ఇలాంటి భావం రావాలంటే ఆ సంబంధాల ధృడత్వం మీదనే ఏ జాతి అయినా నిర్మించబడుతుంది. మన గలుగుతుంది.

మనిషి సంఘజీవి, సమాజంలో తన కుటుంబంతోపాటు ఇతరులతో కూడ చక్కగా ప్రవర్తించినప్పుడే మనిషి 'మనీషి' గా మారగల్గుతాడు. స్వార్థైక పరాయణత్వం గల మనుషులు సమాజంలో చీడపురుగులాంటివారు. తాను బ్రతకడమే కాకుండా పదిమందికి బతికే అవకాశాన్నివ్వడం అనేది మనిషిగా పుట్టిన ప్రతివ్యక్తికి ఉండాల్సి కనీస ఆలోచన. వీటన్నింటికి మానవసంబంధాలే పునాదిరాళ్ళు. ఈ కోణంలో శతక కవులు తెల్పిన ఆలోచనల్ని, భావాల్ని ఇలా విశ్లేషించుకోవచ్చు.

డా॥ కపిలవాయి లింగమూర్తిగారు తన "తిరుమలేశ శతకం"లో కుటుంబములో అత్తాకోడండ్రు, తోడుకోడండ్రులలో ఈర్ష్య, అసూయ, ద్వేషాలు ఎప్పుడైతే లేకుండా ఉంటాయో ఆ ఇల్లు స్వర్గముతో సమానమని వివరిస్తున్నాడు.

సీ ॥ అత్తకోడండ్రకు పొత్తులు గుదిరిన  
ఆ యింటిలో శాంతి యవతరించు  
సవతి తల్లికి దయ సంతుపై గల్గిన  
స్వర్గమచ్చోటికి వలసవచ్చు  
ఏరాండ్ల లోపల నెపుడు సహనమున్న  
సుఖములా యింటిన చూడవచ్చు  
సవతికీర్ష్యలు లేక చాడీలు మానిన  
సంతసంబాయింట సంచరించు

తే.గీ ॥ ఇవ్విప్రతి వారెరింగన యింటి యందు  
చిత్రములు నిట్టు లేర్పడు భద్రముడిపి  
భక్తజన పోష తెలరాళ్ళ పల్లివాస  
దితిజవిద్వేష బుధతోష తిరుమలేశ

ప్రతి కుటుంబములో సాధారణంగా వచ్చే కలహాలు. అత్తాకోడండ్రు, సవతి తల్లి పెంపుడు కుమారులు. ఏరాండ్రు (తోడికోడళ్ళు) వీరి మధ్యలో ఎప్పుడు ఏదో రకంగా కలహాలు వస్తుంటాయి. కారణం వేరే కుటుంబం నుండి వచ్చినవారు ఒకే కుటుంబంలో ఇమడలేకపోవడం. ఎప్పుడైతే వీరి ఆలోచనలో మార్పు వచ్చి, అందరు కలసిమెలసి ఉన్నట్లైతే అంతకన్న స్వర్గం మరొకటి ఉండదంటున్నాడు.

కొంతమంది భార్యలు అన్నదమ్ములు ఆనందంతో కలిసియుంటే సహించరు. అటువంటి వారిని గూర్చి వేమన భార్యమాటలు విని వేరే కాపురం పెట్టడం కుక్క తోక పట్టుకొని గోదావరి ఈదడం లాంటిదంటున్నాడు.

"ఆలి మాటలు విని యున్నదమ్ములబాసి
వేరె పోవువాడు వెర్రివాడు
కుక్క తోకపట్టి గోదావరీదునా"

జీవితంలో అన్నదమ్ముల అవసరం ఎప్పుడైనా రావచ్చు. భార్యవలన అటువంటి అవసరం రాకపోవచ్చు అనేది వేమన నమ్మకం. అంతేకాదు తల్లిదండ్రుల తత్త్వమును తెలుసుకోనివాడు అసలు పుత్రుడేకాదంటున్నాడు. మాతృదేవోభవ, పితృదేవోభవ అను ఆర్యోక్తిని అనుసరించి తల్లిదండ్రిని దైవసమానంగా సేవించమంటున్నాడు.

"తల్లిదండ్రులనెడి తత్త్వంబు నెఱుగరు
యోనిలింగముల నటుద్భవించి
విష్ణువరయ తల్లి వెలయ శివుడు తండ్రి"

విష్ణువే తల్లి శివుడే తండ్రి అని, ఇటువంటి దేవుళ్ళను వదిలి ఎక్కడనోనున్న కనిపించని దేవుళ్ళను ఎందుకు ప్రార్థిస్తారోనని ఆవేదనను వ్యక్తం చేస్తున్నాడు. జీవన్మరణ సమస్యలను నెదుర్కొని తన శరీరాన్ని చీల్చి ప్రత్యక్షంగా కనిపించే ఈ శరీరాన్ని మనకు ప్రసాదించిన దైవస్వరూపిణి అమ్మ. సంతానంపై గల మక్కువలో మన భావి జీవితానికి మార్గదర్శకుడై మనల్ని ఉన్నత స్థానంలో చూడాలని ఆశిస్తూ, మనం చదువు సంస్కారాలు నేర్చుకొని చక్కని ప్రతిభ కనబర్చుటకు, ఉత్తమ విద్యార్థిగా తయారగుటకు, ఉత్తమ పౌరునిగా తీర్చిదిద్దబడుటకు మనకు కావలసిన నిత్యావసరాలకు కొదవరాకుండా ఎలాంటి శ్రమకైనా ఓర్చి నా పిల్లలు గొప్పవారై సమాజంలో మంచిపేరు తెచ్చుకొని అందరిలో గౌరవంగా మెలగాలనే ఆశతో అమ్మకు బ్రహ్మకు మధ్యన వారధిలా ఉంటాడు. నాన్న: అటువంటి అమ్మ నాన్నలను దైవంగా భావించమంటున్నాడు వేమన.

సుమతి శతకకారుడు బద్దెన కూడ తల్లిని కీర్తించని నోరును కుమ్మరివాడు కుండలు చేయడానికి మట్టి తీయ ఏర్పడిన గుంతవంటిదంటున్నాడు.

"అమ్మాయని పిలిచి యన్న మడుగని నోరున్
కుమ్మరి మన్ను ద్రవ్వినట్టి గుంటర సుమతీ"

మనిషి తానెంత గొప్పవాడైనను తన ఆలు బిడ్డలు తల్లిదండ్రులను గురువులను, పెద్దలను, మంచివార్ని ఆదరించాలి. ఆ విధంగా చేయనివాడు బ్రతికియుండి చనిపోయిన వానితో సమానం. అటువంటి వాళ్ళ స్మరించుకోవడం వ్యర్థం. దీనినే పక్కి వెంకటనర్సింహ కవి తన కుమారశతకంలో ఈ విధంగా వివరిస్తున్నాడు.

"తనుజలనుం గురువృద్ధుల
జననీ జనకులను సాధుజనులనెవడు దా
ఘనుడయ్యు బ్రోవడో యా
జనుడే జీవన్మృతుడు జగతి కుమార"

ఇల్లంటే మన భావోద్వేగాలన్నింటిని పంచుకునే అనుబంధాల వేదిక. సుఖసంతోషాల వాకిలి, ఆనందాల లోగిలి. ప్రేమానురాగాల పల్లకి. అన్న–తమ్ముడు, అక్కా–చెల్లె కలసియుండే అందాల ఆత్మీయ బంధం.

ఇంటిలో అన్నదమ్ముల యెడ పరస్పర ద్వేషము, అసూయ భావంతో ఉండకుండా సహాయసహకారములతో, తోడు నీడగా, భక్తి భావంతో ఎవరైతే కలిసిమెలసి ఉంటారో అటువంటి కుటుంబానికి కీర్తి ప్రతిష్టలు మిగులుతాయంటున్నాడు పక్కి వెంకట నర్సింహ కవి.

తమ్ములు తమయన్న యెడ భ
యమ్ముల భక్తియును గలిగి యారాధింపన్
దమ్ముల నన్నయు సమ్మో
దమ్మున బ్రేమింప గీర్తిదనరు కుమారా!

అమ్మ తరువాత అమ్మ అంతటిది అక్క. అమ్మ పనిలో నిమగ్నమయినప్పుడు మనల్ని ఎత్తుకొని లాలించి, ఆడించేది, అమ్మ ప్రేమను పంచేది అక్క. అటువంటి అక్కను అమ్మగా భావించమంటున్నాడు.

"అప్పందన తల్లిగ మే
లొప్పంగని జరుపవలయు నుర్వీస్థలి జి
న్నప్పుడు చన్నిడి మనిపిన
యప్పడతియు మాతృతుల్యయండ్రు కుమారా!"

నాల్గు ఆశ్రమ ధర్మాలలో గృహస్థాశ్రమధర్మం చాలా విశిష్టమైనది. నదీనదాలు సముద్రాన్ని ఆశ్రయించినట్లు ఇతర ఆశ్రమధర్మాలు గృహస్థునే ఆశ్రయిస్తాయి. రెండు వేర్వేరు కుటుంబాల నుండి అమ్మాయిని, అబ్బాయిని ఒక్కటిగా

ఇంతటి ఉన్నతమైన స్నేహాన్ని ఎవ్వరితో చేయాలో ఎవ్వరితో చేయరాదో డా॥ కరణ శ్రీ జంద్యాల పాపయ్య శాస్త్రి తన 'తెలుగుబాల శతకం'లోని మాటలను చూస్తే అర్థమవుతుంది. "నీతిలేని వాని నేస్తంబు రోత - మంచివాని చెలిమి మలయమారుత వీచి - లేమి వేళ మిత్రులే ప్రాణమిత్రులు - క్రూర జనుల మైత్రి కుష్టు రోగమ్మురా - కలుషమతుల పొందు కలహాలు కొని తెచ్చు - సాధుమైత్రి సకల సౌభాగ్యం సందాత్రి - అమలమైన మైత్రి కవరోధములు లేవు" పై పద్యపాదాల సారాంశం మొత్తం ఒక్కటే. దుష్టులతో స్నేహం చేయరాదని, సజ్జనులతో స్నేహం సకల సౌభాగ్యాన్నిస్తుందని.

ఆధునిక యుగంలో మానవుడు శాస్త్ర సాంకేతిక రంగాలలో అద్భుతమైన ప్రగతిని సాధించాడు. గ్రహాంతరాలలోకి తొంగి చూస్తున్నాడు. ఆకాశంలో ప్రయాణం చేస్తున్నాడు. సముద్రగర్భంలోకి వెళ్ళి చూస్తున్నాడు. సుఖమయమైన జీవితానికి కావలసిన వనరులనెన్నిటినో సమకూర్చుకున్నాడు. యంత్రాల సహాయంతో ఎంతో కష్టమైన పనులను సులభంగా చేయగల్గుతున్నాడు. ప్రగతి పథంలో సాగిపోతున్న మానవతా నాగరికతా ప్రస్థానంలో ఇప్పుడొక సందర్భం ఎదురైంది. యాంత్రిక జీవితానికి అలవాటుపడుతున్న క్రమంలో మనిషి మనిషిగా ఉండడం మర్చిపోయి యంత్రంలాగా మారిపోతున్నాడా అనిపిస్తుంది. తోటి మనిషికి దూరమై అనుభవాలను మర్చిపోయి ఒంటరితనానికి అలవాటుపడుతున్నాడు.

నేటి యువత మానవ విలువలంటే ఏమిటో అర్థం కాకుండా ఉంది. కేవలం శారీరక సుఖాలకే ప్రాముఖ్యం ఇస్తున్నారు. అవి లభించనప్పుడు నిరాశతో క్రుంగిపోయి తమ జీవితాలను దుఃఖమయం చేసుకుంటున్నారు. సినిమాలు, కంప్యూటర్లు, సెల్‌ఫోన్లు మానసికంగా వికాసం చెందని యువతీ యువకులను రెచ్చగొడుతూ వారిని చాలావరకు ప్రభావితం చేస్తున్నాయి. తల్లిదండ్రులు కూడా పిల్లల మనస్తత్వాలను గుర్తించకుండా బాధ్యతారహితంగా ప్రవర్తించడం వలన మానవ సంబంధాలను గుర్తించడం లేదు.

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అన్నది మన సంప్రదాయం. మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులపట్ల, మనకు జ్ఞాన భిక్షపెట్టిన గురువుల పట్ల గౌరవ భావాన్ని కల్గి ఉండడం మన విద్యుక్తధర్మం. కాని ఈ ధర్మాన్ని విస్మరించిన నేటి బాలబాలికలు పెద్దలపట్ల, గురువులపట్ల చులకన భావం కనపరచడం మనం చూస్తునే వున్నాం. తమ స్థితికి కారకులైన తల్లిదండ్రులు అనుభవజ్ఞులు అన్న విషయం గుర్తించలేక వారి మాటలు పెడచెవిని పెట్టి చెడు మార్గం పడుతున్నారు. వారు లేనిదే తమకు ఉనికి లేదు అన్న గుర్తింపు వారిలో కొంతైన కలిగితే మానవ సంబంధాలు గుర్తించి ఆలోచిస్తారు.

సహోదరులు అనగా ఒక తల్లి గర్భం నుండి పుట్టినవారని అర్థం. భార్య, స్నేహితులు, బంధువులు సమాజంలో ఎప్పుడైన దొరుకుతారుగాని సహోదరులు లభించరు. అంతటి విలువైనది సోదరప్రేమ, అన్నదమ్ముల మధ్య ఉన్న చిన్న చిన్న విభేదాలు మరిచిపోయి ఆప్యాయతను కొనసాగించాలి.

వివాహబంధం ఎంతో పవిత్రమైనది. భార్యాభర్తల అనుబంధం ఎంతో గాఢమైనది. నాగరికమైన మానవజాతి ఎన్నో పరిణామదశలు దాటి ఏర్పరుచుకున్న సువ్యవస్థ వివాహవ్యవస్థ. భార్యాభర్తలు కాడికి గట్టిన రెండు ఎద్దులవలె సంసార బండిని లాగుతారు. ఎక్కువ తక్కువలు చూసినట్లైతే ఆ బండి అక్కడే ఆగుతుంది.

తెలుగువారి కుటుంబ జీవనంలో అత్తాకోడళ్ళ పాత్ర ప్రధానంగా చెప్పవచ్చు. అత్తకోడలును చూస్తే ఓర్వలేదని, కోడలు అత్తను చూస్తే ఓర్వలేదనడం మనం చూస్తున్నాము కాని, నేటి అత్తాకోడళ్ళు తల్లి బిడ్డలవలే కలిసిమెలసి ఉంటున్నారు.

బంగారు కాలం కోసం ఆనందమయ సమాజం కోసం మానవ సంబంధాలను పదికాలాలపాటు పదిలంగా దాచుకుందాం. మనకున్న అనేకానేక సమస్యలను అధిగమించడానికి కలిసికట్టుగా కృషిచేద్దాం.

మనుష్యుల మధ్య వస్తు ప్రపంచం చోటు చేసుకొంటున్న నేపథ్యంలో హృదయ సంబంధమైన అనుభూతులు పెంపొందాలని ఆశిద్దాం. బంధుమిత్రులు వచ్చినా ఆప్యాయంగా పలకరించకుండా టి.వి. చూడడం, కంప్యూటర్ చూడడం, ఫోన్లో మాట్లాడడంలో మునిగిపోతున్న సంస్కృతిని నేటితో ఆపేద్దాం. డబ్బుతో ప్రేమానురాగాలను కొనలేరన్న సత్యాన్ని గ్రహిద్దాం. ప్రేమ సర్వాన్ని జయిస్తుంది. ప్రేమ గల మానవ సంబంధం అమరం అవుతుంది. కావాలని ఆశిద్దాం.

వ్యాసకర్త : డా॥ గుడేలి శీనయ్య
తెలుగు భాషోపాధ్యాయులు
కొల్లాపూర్
నాగర్ కర్నూల్ జిల్లా
సెల్ : 9959954848